ఓం

# శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి

## ఏడవ సంపుటము

## బాలయోగిని

ప్రకాశకులు

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము

**శ్రీ వ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘ ప్రచురణ - ౨౦౦౧ సం
ప్రతులు ౧౦౦౦

వెల -

ప్రతులకు
మేనేజర్, శ్రీవ్యాసాశ్రమం
వ్యాసాశ్రమం పోస్టు, ఏర్పేడు మార్గం
చిత్తూరు జిల్లా - ఆంధ్రప్రదేశ్ - ౫౧౭౬౨౧

ముద్రణ
**శ్రీపారాశర్య ముద్రణాలయము**
శ్రీ వ్యాసాశ్రమం, చిత్తూరుజిల్లా

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు పారకలోకానికి సుపరిచితాలే ఈ గ్రంధాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంధాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంధాలుగా ముద్రింపబడివున్నాయి వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంధ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంధావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది ఇంచుమించు ఆగ్రంధాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా లుంటాయి ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ

శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంధ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము

శ్రీ వ్యాసాశ్రమం
1-3-2000 ప్రకాశకులు

# ధర్మపథము



1 నడచునపుడు ప్రాణులకు బాధ గలుగనీయక నడవ వలయును. అట్లు జాగ్రత లేక మదాంధులై నడచి ప్రాణికోట్లకు బాధగలుగ జేయువారే గ్రుడ్డివారలై జన్మింతురు.

2. ఎంతటి గొప్ప స్థితిలోనుండు వారైనను మిక్కిలి తక్కువ స్థితియందున్నవారు చెప్పెడు వాక్యములను గూడ సావధానముగా విని వారికి తగిన సమాధానము జెప్పవలయును. అట్లుగాక గర్వితులై ప్రవర్తించువారే బధిరులై జన్మింతురు

3 భక్తులు, భగవద్ధ్యాన స్మరణలు చేయునపుడు వారితో గలసి భగవత్స్మరణ, ధ్యానాదుల జేయక అహంకారవరులై నిర్లక్ష్యముగా కూర్చుండుటగాని, యితర విషయములను మాటలాడుటగాని చేయు వారే మూగవారలై జన్మమెత్తెదరు.

4. మతిమంతులు చెప్పువాక్యము నాలకింపకయు, తగిన విధముగ నడువకయు మదోన్మత్తులై విహరించువారే మతిహీనులై (పిచ్చివారలై) జన్మ మెత్తుదురు

ఓమ్

**ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా ।**
**సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే ॥**

పదుగురుపాధ్యాయులకంటె నొక యాచార్యుడధికుడు నూఱుగు రాచార్యుల కంటె నొకతండ్రి యధికుడు. వేయిమంది తండ్రులకంటె నొక తల్లి గౌరవమున నెక్కువ యనియు చెప్పబడినది

**ఉత్పాదక బ్రహ్మదాత్రోర్గరీయాన్ బ్రహ్మదః పితా ।**
**బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్యచేహ చ శాశ్వతమ్ ॥**

పుత్రునికి వేద గ్రహణార్థమై జ్ఞానరూపమైన రెండవ జన్మ నొసంగు ఆచార్యుడు తండ్రికంటె శ్రేష్ఠుడు బ్రహ్మగ్రహణార్థ మైన జన్మము బ్రహ్మప్రాప్తి ఫలకమైనందున నిహపరముల రెండింటి యందును నిత్యమైనది దేహమును జనింపజేయుటలో తండ్రి కారకుడు దేహములోనుండు దేహియగునాత్మను జనింపజేయుటలో (ఆత్మజ్ఞానమును గలిగించుటలో) ఆచార్యుడు కారకుడు అట్టి యాత్మజ్ఞాన మిహమందును, పరమందును సుఖమును గలుగ జేయును సర్వజంతువులున్ను జన్మించుటలో సమానములు ఇది మొదటిజన్మ మనబడును అట్టి జన్మములో నుండి యాత్మ జ్ఞానమును జనింప జేయుటలో గురుడు కారణుడు అట్టి రెండవ జన్మము గలవాడే ''ద్విజు'' డనబడును ద్విజుడనగా రెండవ జన్మము గలవాడని యర్థము ఇట్టి రెండవ జన్మము గలవాడు ద్విజులలో జన్మింపక పోయినను ద్విజుడే అట్టి రెండవ జన్మము పొందనివాడు ద్విజులలో జన్మించినను ద్విజుడు కాజాలడు

(మనుస్మృతి)

ఓమ్

మఱియొక ముద్రణమున నట్టి దోషములు లేకుండులాగున సవరణజేసి యచ్చొత్తించుటకు యత్నము గలవాడను విజ్ఞులెల్లపుడును క్షీర, నీర న్యాయము ననుసరించిన స్వభావమును గలిగి యుందురను నార్యోక్తియందు నమ్మకము గలిగి యుండువాడను ముముక్షువులైన వారె ట్లాచరింపవలయునో, ఆ విషయమై యొక శ్లోకమును క్రింద నిరూపింప దలంచుచున్నాను

**ప్రథమం గురుకార్యం చ దైవకార్యం ద్వితీయకమ్ ।**
**తృతీయమపి చాతిథ్యం స్వాత్మకార్యం చతుర్థకమ్ ॥**

ప్రతిరోజును జేయవలసిన కార్యక్రమ మీ శ్లోకములో జెప్పినరీతిగా నుండవలయును ప్రథమమున గురుకార్యమును అనగా గురువుయొక్క యాజ్ఞను నిర్వహింప వలయును తరువాత దైవకార్యమును జేయవలయును పిమ్మట అతిథి, అభ్యాగతుల నాదరింపవలయును తరువాత మాత్రమే తనయొక్క స్వంత కార్యమును జూడవలయును ఇది ముఖ్యముగా గురుకులవాసము జేయు వటువుయొక్క ధర్మమని మరువకూడదు మఱియు చతుర్విధాశ్రమస్థులలో నుండువారి ధర్మము లన్నిటిలోను, ముఖ్యమైన ధర్మమును బోధించెడు ఒక శ్లోకమును నిరూపించి విరమించెద

**యతీనాం ప్రశమో ధర్మో నియమో వనవాసినామ్ ।**
**దానమేవ గృహస్థానాం శుశ్రూషా బ్రహ్మచారిణామ్ ॥**

సన్న్యాసులకు ప్రశాంతమే మిక్కిలి శ్రేష్ఠమైన ధర్మము వానప్రస్థులకు నియమాచరణయే శ్రేష్ఠతమమగు ధర్మము గృహస్థాశ్రమస్థులకు దానమే శ్రేష్ఠతమమగు ధర్మము బ్రహ్మచారులకు గురువరుని యాజ్ఞాపాలనమే సర్వోత్కృష్టమగు ధర్మము దీనియం దేదైన పొరబాటు గలిగిన విజ్ఞులు మన్నింతురుగాక! సారమును మాత్రము గ్రహింతురుగాక!

ఇట్లు తమ చరాచర సుఖాభిలాషి

శ్రీ మలయాళస్వామి

**ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు**

**ఓం తత్ సత్.**

# వి ష య సూ చి క

## ప్రథమ సర్గము



## ద్వితీయ సర్గము



## తృతీయ సర్గము



## చతుర్థ సర్గము

ఓం తత్ సత్

# బాలయోగిని

## ప్రథమ సర్గము

## జనన ఘట్టము

*ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే ।*
*పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥*

పదవిభాగము - పూర్ణం - అదః - పూర్ణం - ఇదం - పూర్ణాత్ - పూర్ణం- ఉదచ్యతే -పూర్ణస్య - పూర్ణం - ఆదాయ - పూర్ణం - ఏవ - అవశిష్యతే

టీక॥ అదః = ఈ పరోక్షముగా నున్నదియు, పూర్ణం = బ్రహ్మముచే పూర్ణమైనది, ఇదం= ఈ ప్రత్యక్ష విశ్వము, పూర్ణం = బ్రహ్మముచే పూర్ణమైనది, పూర్ణాత్ = పూర్ణమునుండి, పూర్ణం = పరిపూర్ణమైన బ్రహ్మము, ఉదచ్యతే = ఉదయించుచున్నది, పూర్ణస్య = పూర్ణమైన బ్రహ్మముయొక్క, పూర్ణం = పూర్ణమును, ఆదాయ = గ్రహించి, పూర్ణమేవ = పూర్ణబ్రహ్మమే, అవశిష్యతే = శేషించు చున్నది

తాత్పర్యము - అది (బ్రహ్మము) పూర్ణము (ఆకాశమువలె సర్వత్ర వ్యాపించినది )ఇదియు (ఉపాధులతోగూడినదియు వ్యవహారములకు లోబడినదియును, కార్యాత్మకమై యుండునదియును అగు జీవాత్మయు) పూర్ణము ఆ పూర్ణ వస్తువు నుండి యీ పూర్ణవస్తువు గలిగినది ఈ పూర్ణవస్తువు (జీవుడు) విద్యచేత పూర్ణత్వ మును గ్రహించిన యెడల పూర్ణమే పరమాత్మగా శేషించును అనగా పరమార్థ రూప వస్తువునుండి వేరగు వస్తువువలె కనబడు

జీవుని ఆ పూర్ణమైన పరబ్రహ్మమని తెలిసికొని అవిద్యచే గలిగిన నామరూపాదుల నివర్తిజేసి ఆత్మయే బ్రహ్మమని తెలిసి కొనినచో అపుడు తానే బ్రహ్మమగు చున్నాడు జీవాత్మ పరమాత్మలు రెండును పరబ్రహ్మస్వరూప ములగుటచేతనే మొదట 'ఓమ్' అని శాన్తిమంత్రము ప్రారంభించుటకు కారణమైనది గాయత్ర్యాదిమంత్రములన్నిటికిని మొదట ఓంకారముండుట కియ్యదియే కారణము కావుననే 'ఓం తద్బ్రహ్మ' అని శ్రుతి యుపదేశించుటకు హేతువైనది ఉందువల్లనే యాస్తికులందరు అక్షరాభ్యాసము జేయునపుడు ప్రప్రధమ మున 'ఓమ్' అని ప్రారంభింతురు

పరమపావన మహర్షుల పాదధూళిచే పవిత్రీకృతమగు శ్రీ భారత పుణ్యభూమి యందు కేరళ దేశమున దక్షిణ మలయాళములో పొన్నాని తాలుకా రాయిరి మంగళం గ్రామమున, కళ్ళింజల్ తల్లశ్శేరి అను యింటిపేరుగల విఖ్యాత కుటుంబ మున హేవిళంబినామ సంవత్సరమున అషాఢమాసమున ఉత్తరాషాఢ నక్షత్ర శుభ ముహూర్తమున, భరద్వాజ గోత్రస్థులగు సూర్యవంశ క్షత్రియకులమున, శ్రీమతి రామేశ్వరమ్మ, రామచంద్రనరేన్ద్రరాజులకు భారతీదేవి యను నామధేయమును గలిగి, క్షీరసాగర మధనమం దుద్భవిల్లిన శ్రీలక్ష్మీదేవియో యని తోచునట్టి కన్నిక యొకతె జాతమయ్యె తల్లిదండ్రులు పుణ్యశీలురగుటచేతను, ఈశ్వరధ్యాన నిరతులునై, బ్రహ్మవిద్యావిచారణ నిష్ఠాగరిష్ఠులునై అగుటచేతను, చిన్నతనమునుండి తమ పుత్రికకు నుగ్గుపాలతోగూడ భక్తివైరాగ్యముల నలవరచుచుండిరి దినదినము శుక్ల పక్షచంద్రుని పగిది శిశువు వృద్ధి నొందుచుండెను భరద్వాజ వంశక్రమము నను సరించి బాల్యకాలములోనే, నియమితాహారమును నియమముగా, నియమిత కాలములో మాత్రము పెట్టి బిడ్డను పోషించుచుండిరి మాతాపితరులు ఆ మనుజ జన్మము లో యోగము పూర్తికానివారు ముక్తినొందజాలక, దేహము వీడిన పిమ్మట పుణ్యజీవు లును శ్రేష్ఠులునునగు యోగుల కులమందు మఱల జన్మమెత్తెదర''ను గీతావాక్యమీ యమ్మ యందు సార్థకమయ్యెనని తలచి సంతసించిరి

*ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః ।*
*శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥* గీత అ 6

యోగాభ్యాసమును జేయుచు సిద్ధిని బొందక మునుపు మృతిబొందిన వాడు (ధ్యానాభ్యాసి) అశ్వమేధాదియాగములఁ జేసినవారు బొందెడు పుణ్యలోకములను బొంది, చిరకాలమచట సుఖముల ననుభవించుచుండి పిమ్మట సదాచార సంపన్నులును, శ్రీమంతులునునగు వారియింట బుట్టును పంచమవర్షమునందు విద్యాభ్యాసము చేయవలయునని శాస్త్రము చెప్పినట్లు మాతపితరు లామెకు వేదవిద్యతో సహా బ్రహ్మవిద్యను గూడ నభ్యసించిన యొక సంయమీంద్రుడగు నాచార్యుని వల్ల నక్షరాభ్యాసమును జేయించి ఆర్యభాషయగు సంస్కృత విద్యను ముదముతో నభ్యసింప జేయదొడంగిరి శాస్త్రసారమెరింగిన పండితుడగుటచే గురువర్యుడు అక్షరాభ్యాసము యొక్క అంతరార్థము నాశరహితమగు బ్రహ్మవిద్యాభ్యాసమనియు, విద్య యనను శబ్దమునకు యధార్థమగు నవిద్య లేని జ్ఞానమనియు నిజార్థము నుపదేశించెను జననీజనకులు విధిగా ప్రాతఃస్నానము, ధ్యానము నభ్యసించెడు వారగుట జేసి తమ తనయను గూడ నదే రీతిగా జేయించుచుండిరి క్రమముగ సాయం ప్రాతః రెండు సంధ్యలలోను, దైవ ధ్యానము తప్పక నిర్వర్తించు లాగున జేయుచుండిరి దేహమునకెన్నిసారు లాహార మవసరమో యన్నిసారు లాత్మకు విజ్ఞానాభివృద్ధి కొరకు దైవధ్యానము గూడ నవసరమని యార్యులు వచించినట్లు శీలింప జేయుచుండిరి ఒకసారి భుజించువారు యోగులనియు, రెండుమారులు తినెడి వారు గృహస్థులనియు (భోగులు), మూడు మారులు భుజించువారు రోగులనియు, నాలుగుసారులు కడుపు నింపువారు పశువులనియు, దీనిని గూడ నతిక్రమించి ప్రవర్తించువారు జీవచ్ఛవము లనియు జెప్పెడి శాస్త్రసారం బెరింగి యుండువారగుటచే తల్లిదండ్రులామెకు రెండుసారులు మాత్రమే భోజనమలవరచి బిడ్డను జాగరూకతతో బెంచుచుండిరి లేతదనమున వంకర బోయిన వెదురు రీతిగాను, చిన్నకాలమున ముల్లునందగిలిన గుమ్మడి తీగవలెను, బాల్యమున ఋజువర్తనము లేనిబిడ్డ ఋషిసంతతివలె జీవితమును పవిత్రముగా గడుపజాలదు

క్రమముగ నాబాలిక కావ్య, వ్యాకరణ, నిరుక్త, వేదాంతశాస్త్రముల నభ్యసించుచున్నదై, వర్ష ఋతువునందు నదులు పొంగి ప్రవహించునట్లు జ్ఞానవిజ్ఞానములచే వృద్ధినొందుచు యౌవన కాలారంభమగు ద్వాదశాబ్దము చేరజొచ్చెను పుణ్యజీవులకు పూర్వజన్మ సంస్కారము ననుసరించి పుణ్యకులమునందు జన్మము గలుగునను శాస్త్రము సత్యమని భారతీదేవిని జూచిన వారందఱును జెప్పుకొనుచుండిరి వికసించిన తెల్లని తామర పుష్పము వోలె భాసిల్లు ముఖము, విశాల హృదయముగల భారతీ దేవిని గుఱించి జననీ జనకుల యాత్మలో కొంతభయమున్నూ, విచారమున్నూ పొడమదొడగె ఏలయన, మన్మధుడు కన్నులు గలవారిని అంధులనుగాను, చెవులు గలవారిని చెవిటివారినిగను, మంచి మతిగలవారిని దుర్మతులనుగాను జేయును కావున మనకుమార్తె నేమి జేయునో యని వీరిహృదయమున గలిగిన భీతి మ్రాను తొఱ్ఱలోనుండు అగ్నిగాలిచే అధికముగ రాచుకొనునటుల యౌవనారంభముచే మరింతవృద్ధి నొందసాగెను ఇవ్విధంబున దినదినము వసంతకాలమున లతలు వృద్ధి నొందునట్లు శోభాయమానయై పెంపొందుచుండు పుత్రికను జూచి జననీజనకు లీరీతిగ నాలోచింప సమకట్టిరి బిడ్డలకు విషయబుద్ధి గలిగినను విషయముచే గలిగెడు విషమస్థితిని బోధించి తామనుభవించెడు సంసార దుఃఖములను దెలుపుచు వారి మనస్సును ఈశ్వరోన్ముఖముగా జేయు మాతాపితరులు దైవసదృశులనియు, వారి వారి సంస్కారము ననుసరించి విషయ మార్గములోగాని, విరక్తి మార్గములోగాని, వారి యిష్టానుసారముగా జేయువారుత్తమ మానవులనియు, పుణ్య సంస్కారముచే పిల్లలకు బ్రహ్మచర్యము, దైవబుద్ధి, నిర్విషయ స్వభావముండినను, నానా విధములగు బాధల బెట్టుచు నేర్పుచు, పెద్దలచే ప్రేరణ జేయించుచు వారిని సంసార బంధములో బంధించు వారసురస్వభావము గలవారనియు గదా చెప్పుదురు! కాబట్టి మనమిప్పు డు చేయవలసిన కార్యమేమని తలపోయుచుండిరి మఱియు బంధనము యొక్క చిహ్నమే వివాహకాలమున కాలివ్రేళ్ళ కుంగరము పెట్టెడు రహస్యము వీరి పాదములు సంసారశృంఖలములచే బంధింపబడినవని గ్రహించుట కొఱకాలాగున జేయడ మైనది యోగవాసిష్ఠమున వసిష్ఠు లీవిధమున నుడివిరి అదేమన,

తనగర్భములో బుట్టిన బిడ్డలు జ్ఞాన నిష్ఠాగరిష్ఠులు కాని వారైనచో వారు మాతృగర్భమునుండి మలముతో గూడ నేతెంచు ఏలిక పాములతో సదృశులనియు, పుత్రికలైనను, పుత్రులైనను బ్రహ్మనిష్ఠాపరులైన మాత్రమున తలిదండ్రులనుద్ధరింప గలరనియు, వీరు నివసించెడు భూమి గూడ పవిత్ర మగుననియు గలదు గదా।

*ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులోద్భవః ।*
*ధన్యా చ వసుధా దేవీ యత్రస్యాద్గురుభక్తతా ॥*

ఒకవేళ మనమిప్పటినుండియే దైవముఖముగా బిడ్డయొక్క మనస్సును త్రిప్ప చూచినను ఆ బాలికయొక్క సంస్కారమెట్లుండునో, తరువాత ఏమి తటస్థించునో యనియు దీర్ఘముగా నాలోచించవలసియుండును కావున మనమున్నా యిప్పట కొంతకాలము బిడ్డయొక్క స్వభావమును జూచెదము బిడ్డయొక్క సంస్కారము మంచిదైనచో దైవనిష్ఠయందును, వెడ్డదైనచో సంసారకూపములోను బడుటకన్న వేరు గతి లేదు కన్నబిడ్డలను కాలుచేతులు బిగియగట్టి యగాధకూపములో త్రోయుట కన్నను, సంసారకూపమున ద్రోయుట మరింత ఘోరము ఏమి జేయగలము, 'నాస్యాబ్రహ్మవిత్కులే భవతి' అనెడి మాండూక్య శ్రుతియందు బ్రహ్మవేత్తల కుల మందు బ్రహ్మవేత్తలు కానివారు బుట్టరని, ఇదివరలో మనము చదివినప్పుడు వినియు న్నాముగదా! అయినను మనము చేయవలసిన పనిని జేయకపోయినచో పోషణ లేని కృషి వలె సంస్కారము గూడ నేమియు జేయజాలదు

కావున నీ బిడ్డయొక్క స్వభావమును కొంత జాగరూకతతో చూడవలయును వృక్షముయొక్క స్వభావము పుష్పించినప్పటికైనను తెలియకపోదుగదా! కాబట్టి ఋతుమతియగు పర్యంతము నిరీక్షించెదము కాకిపిల్లలును, కోయిలపిల్లలును బాల్యములో నొకేవిధముగా నుండినను, శబ్దము వచ్చినపుడెట్లు వేఱుగ దెలియందగునో యట్లును, రాజహంసయును, తెల్లకొంగయును చిన్నకాలములో నేకరూపము గా నుండినను, క్షీర నీరములు కలిసిన హంస మేలాగున నీరమును ద్యజించి క్షీరమును గ్రహించునో, బక

మెవ్విధమున క్షీరనీరముల వేఱుపఱచుశక్తి లేనిదై రెండింటిని త్రాగునో, ఆలాగునను నీ జీవియొక్క స్వభావమునున్ను సమయ మాసన్న మగుతరి దిలకింపవలయును

*హంసః శుక్లో బక శుక్లః కో భేదో బక హంసయోః ।*
*నీర క్షీర విభాగేతు హంసో హంసో బకో బకః॥*

అదే రీతిగా జన్మాంతర పుణ్యజీవియైనచో సంసారమును నిస్సారముగా త్యజించి జ్ఞానమును గ్రహింప గలుగును

మనుజులంద రొకేవిధముగా నుండినను, కాలమాసన్నమైనప్పుడు ముక్తాత్ము డైనవాడు దైవవాక్యమునే పలుకును

*కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః ।*
*వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః॥*

దీని యర్థము పైన నుదాహరింపబడినది అదేవిధముగ కోడిగ్రుడ్లను బాతు గ్రుడ్లను నొకేచోట నుంచినను పుట్టునప్పుడు బాతుపిల్లలు నీటిలో దుమికి యీదు చుండును కోడి పిల్లయో భూమిపైన దిరుగాడును ఆలాగున జన్మాంతర సంస్కా రజీవి యైనచో సంసార సాగరము నీది ముక్తియను దరిని జేరగలుగును అట్లు సంస్కారజీవి కాని యెడల నీటిలో బడిన కోడివలె రెక్కలు తడిసి యీదజాలక మునిగిపోవునట్లు, సంసారజలనిధిని తరింపజాలక విషయములబడి మునిగి పోవును రెక్కలు వచ్చి యెగురు శక్తి గలుగువఱకు పిల్లలను పక్షులు సదా నిరీక్షించు చుండు రీతి జననీజనకులమగు మన మీ బాలిక యొక్క యున్నతి నెల్లప్పుడును జూచుచుండ వలయును అని దలచుచుండిరి కాలమాసన్నమైనప్పుడు వృక్షము పుష్పించునట్లు పదునాలుగవ వయస్సు సమీపించినప్పు డాభారతీదేవియును పుష్పవతి యయ్యె స్వకులానుసార ధర్మ శాస్త్రరీతిగ పెద్దలను, పురోహితులను విచారించి దానికి దగిన కర్మకాండ క్రియలన్నియు విధినసుసరించి తల్లిదండ్రులు నిర్వర్తించిరి అట్టి వేదవిహిత కర్మలవల్ల ఆయుర్వృద్ధి యు, నరిష్టనివృత్తియు, నాత్మశుద్ధియు నగు ననియు,

స్ఫుటము జేసిన సువర్ణము శుద్ధి నొందునట్లు ఇట్టి సంస్కారమువల్ల మన బిడ్డయును నిర్మలహృదయము గలది యగుననియు దలంచి బహుళముగ నా కర్మల జేసిరి బీదలకును సాధువులకును విశేషముగ నన్నదానము న్ను, వస్త్రదానమును జేసిరి సర్వజాతులలోగల బీద బాలికలకు పేరెలు, రవికెలు, పసుపు, కుంకుమల ననేకముగా తల్లియొక్క స్వంతఖర్చుతో జేసిరి ఇక మన భారతీదేవి నేమి చేయవలయునని మాతాపితరు లాలోచించిరి బాలికకు శాస్త్రపంచయము బాగుగా కలిగినది ఇక నాత్మశుద్ధి కొఱకును, విషయ విరక్తికొఱకును, తగిన సద్గురువుచే దివ్యమంత్రోపదేశమున్ను ఇంద్రియ నిగ్రహముకొఱకు చిత్తైకాగ్రత కొఱకును యోగసాధనయున్ను, దైవప్రీతి నిమిత్తము మంచి వ్రత నిష్ఠయు నుపదేశించిన బాగుండు నని తలంచి మంత్రదీక్షాదుల కులగురువుచే జేయించిరి అప్పటినుండి యపర విద్యయగు శాస్త్ర పాఠమును నిలుపుదలవేసి ఒకానొకనాడు విద్యాగురుని కడకు వెళ్ళి వారికి దగిన దక్షిణల నిప్పించి తృప్తిపఱచి, గురువునకు ప్రణామము చేయించిరి వారివల్ల ఆశీర్వాదము జేయించిరి అప్పుడు 'ఇట్టి పుణ్యవతియు, నిర్మల దినచర్యగలదియు, బ్రహ్మచారిణియు నగు నీ భారతీ దేవికి విద్య చెప్పగల ,బాగ్యము నాకు గలిగినందులకు నాజన్మమెంతయో పవిత్రమైనదని తలంచుచున్నానని వచించి గురువు లాశీర్వదించిరి అయితే బిడ్డకింకను నిద్య నుపదేశంపవలయునని యున్నది నా మనస్సు ఇంతటితో తృప్తి పొందలేదు అయినను తల్లిదండ్రులగు మీ యందఱి యభీష్టి మేలాగునుండిన నల్లే నేను సంతృప్తి బొందగలననెడు విద్యా గురుని వాక్యములను విని మాతాపితరులు మిక్కిలి సంతోషాంతరంగులై 'అయ్యా! మా బిడ్డకు యౌవనకాలము వచ్చినది ఈ తరుణ మనేకానర్థములకు కారణమను విషయము తమకు దెలిసి యేయుండును అంతియెగాక మా కుల ధర్మముల ననుసరించి రజస్వలానంతరము పురుషులవద్ద చదువుట యంత మంచిదిగా కుల జులు దలంచరు ఒకవేళ స్వగృహములో చదువు చెప్పింప దలచినను అదిన్నీ కులజుల కిష్టముండదు

కావున రజస్వలా కర్మలు విధిప్రకారము జేసిన పిమ్మట మా కులగురువు

లున్నూ, యోగనిష్ఠాపరులునగు స్వాములవారిచే నీ బిడ్డకు మంత్రోపదేశము జేయించినాము అని నుడివిరి అంతట గురువర్యులు లట్లయినచో మంచిదని చెప్పి 'బ్రహ్మజ్ఞానవము బడసి స్వకులమును, స్వదేశమును ఉద్ధరించిన దానవగుదువు గాక' యని ధ్యానపూర్వకముగ ననుగ్రహించి, ''భారతీదేవీ, అమ్మా! నీవు సాక్షాద్భారతి (సరస్వతి) వలె నగుదువు గాక'', యని దీవించి పంపిరి

స్వగృహమున కేతెంచిన పిమ్మట జననీజనకులు ఋషి కన్యవలె నుండు బిడ్డను జూచి యిక నీయభీష్ట మెయ్యది యని ప్రశ్నింపగా, నంతటనా బ్రహ్మచారిణి 'జననీ జనకులారా, నాకు కుమార సంభవము చదివిన కాలంబున నీశ్వరునిగూర్చి పార్వతి తపం బొనర్చిన పగిది నుండ వలయునని సంకల్పము గలిగినది అట్లుండుటకు నాకు మీరనుకూల మొన ర్పవలయును, ఈ యొక సంకల్పము తప్ప వేఱొండేదియు లేద' ని వాక్రుచ్చెను అంతేగాక కులగురువుచే నుపదేశింప జేయబడిన మంత్రమును దీక్షాపరముగ పున శ్చరణ చేసి యాత్మశుద్ధి గలుగుట కొఱకు జప మాచరింపవలయునుగదా! అట్లుకాని మంత్రోపదేశము విత్తనము తెచ్చి పెట్టెలో నుంచినట్లు వ్యర్థమగును, మఱియు నా మంత్రము పునశ్చరణ చేసినచో సుక్షేత్రములో నాటిన విత్తనమువోలె ఫలసిద్ధిని గలుగ జేయును గదా! అదియునుగాక గురువర్యుడుపదేశించిన యష్టాంగ యోగ విద్యలను గూడ నభ్యసించవలసి యుండును యోగ నిష్ఠ లేనిచో నింద్రియ నిగ్రహము చిత్తై కాగ్రత గలుగదని పాతంజలయోగ దర్శనమందు గలదు కావున నా యీ తపశ్చర్య కొఱకై నిశ్శబ్దమై విశాలమగు ప్రహరీగల మన గృహావరణమందలి తోటలో నొక కుటీరము నేర్పరుపవలయును కృష్ణాజిన వ్యాఘ్రాజినాదులు సంపూర్ణా హింసా ధర్మయుతములు కావు సర్వాసనములలో గల సిద్ధులన్నియు నొక దర్భాసనము నందే కలవని గురు గీత యందు పరమ శివుడు పార్వతీ దేవి కుపదేశించియున్నాడు కావున నాకొక దర్భాసనమును, సన్నని ఒక రుద్రాక్షమాలయు, రెండు నారవస్త్ర ములనున్ను, మంచి గోమయముచే చేయబడిన విభూతియున్ను, పాతంజలి యోగ దర్శనము, యోగకుండల్యుపనిషత్తును, యోగచూడా మణ్యుపనిషత్తు, కఠోపని షత్తును, శ్రీభగవద్గీత మొదలగు సద్గ్రంథములనున్ను ఈయవలయును

ఈ వరమును మాత్రము మీ రిచ్చిన చాలునని ప్రార్థింపగా స్త్రీలస్వభావము ననుసరించి తల్లియొక్క రెండు నేత్రములనుండి ధారధారలుగా జలము ప్రవహింప సాగెను భర్తవలననైన భయముతో నెంతేని మనస్సును నిగ్రహింప జూచినను సాధ్యముగాక గద్గద స్వరముతో నొకటి రెండు మారులు బిగ్గరగా నతిదుఃఖముతో నేడ్చెను అపుడా బిడ్డ, 'తల్లీ యీ పవిత్రాశ్రమ స్వీకరణ కాలమున నేల దుఃఖించు మన్నావు అని పలికెను అంతట నా తల్లి 'అమ్మా! మంచి యాభరణముల ధరించి పుష్పముల నలంకరించుకొని శ్రేష్ఠములగు పీతాంబరముల ధరించి సుగంధవస్తువుల బూసికొని, కుంకుమ బొట్టు దాల్చి చెలికత్తెలతో, వీణా నినాదము లతో వినోదించు నిత్తరి మహర్షుల కన్యక లాగున తాపసవేషము ధరించు టెట్లు జూడగలను?' అని చెప్పెను అంతట భారతీ దేని 'అమ్మా! కుమార సంభవమున తపశ్చర్య నొనర్చుచున్న పార్వతిని బ్రహ్మచారి వేషధారి యగు నీశ్వరుడు నివారించి నటుల నివారించుచున్నావే, ఎట్లన?

1 అనేన ధర్మస్సవిశేష మద్య మే త్రివర్గసారః ప్రతిభాతి భామిని ।
త్వయా మనోనిర్విషయార్థ కామయా యదేక ఏవ ప్రతిగృహ్య సేవ్యతే ॥

2 కిమిత్యపాస్యా భరణాని యౌవనే ధృతం త్వయా వార్ధకశోభి వల్కలమ్ ।
వద ప్రదోషే స్ఫుటచంద్రతారకా విభావరీ యద్యరుణాయ కల్పతే ॥

3 దివం యది ప్రార్థయసే వృథా శ్రమః పితుః ప్రదేశాస్తవ దేవభూమయః।
అథోపయన్తార మలం సమాధినా న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్ ॥

4 మునివ్రతైస్త్వామతి మాత్రకర్శితాం దివాకరాప్లుష్ట విభూషణాస్పదామ్ ।
శశాంక లేఖామివ పశ్యతో దివా సచేతనః కస్య మనో న దూయతే? ॥

మంచి యభిప్రాయములు గలదానా! ధర్మార్థకామములను త్రివర్గములో నేకారణముచే మిగిలిన రెండింటిని మనస్సులో దలంచక ధర్మమును మాత్రము స్వీకరించితివో, యక్కారణము వలన త్రివర్గములో ధర్మమే శ్రేష్ఠమైనదని స్వీక రించబడినది ఓ గౌరీ! ఎందు కీవయస్సులో నగలు తీసి ముసలివాండ్ర కర్హమగు నారచీరను ధరించితివి? చంద్రనక్షత్రములతో శోభిల్లు సంధ్యా సమయ

మనూరుని తో కూడుట కష్టము గాదుకదా? నీవు తపస్సును స్వర్గవాంఛచే జేయనక్కర లేదు ఏలన, దేవతా నివాసములు నీ తండ్రియొక్క ప్రదేశములు వరుని గూర్చి తపంబొనర్చె దవా- అదియు నసంభవమే మాణిక్యము నన్వెవరు ధరింతురని పోయి యడుగదు మఱేమన ధరించువారిచే మణి యెక్కడున్నదని వెదక బడును కాన దానికైయైనను తపంబు చాలించుము- సూర్యకిరణములచే నగలుంచుకొను తావులు కళలు తప్పి యుండగా చాంద్రాయణాది వ్రతములచే నెండిన నీ శరీరమును పగటియందు కళ తగ్గిన చంద్రరేఖమాడ్కినున్న నిన్ను చూచిన చైతన్యము గల యే మనుజుని మనము వ్యాకులము కాదు? (అగు నుట) ఇది కుమారసంభవములోని శ్లోకముల జదివి వినిపించెను

పిమ్మట భారతీదేవిగారి తాపసవేషమును జూచి తల్లి సంతాపవ్యాకుల చేతస్కురాలై ఇట్లు చెప్పెను 'మా పుట్టింటివారిచ్చిన ధనమును, భూమియును ఇప్పి పెండ్లికి వెచ్చపెట్టదలంచియు, కల్యాణమున కగు ఖర్చంతయు నేనే స్వంతముగా పెట్టుకొనులాగున నిశ్చయించుకొని యుంటి 'ననెను ఈ మాటలను విని భారతి అమ్మా! నాకిచ్చేలాగున నిశ్చయించినవో మీరు తలంచిన దానికన్న గొప్ప ఫలము గలుగు మఱియొక కార్యము జెప్పెద ఆ ధనమంతయు బ్రహ్మచారులకు, సాధు సజ్జనులకును, తీర్థయాత్రా పరులకును, స్వజనసంరక్షణకొఱకును, బాలికల సంస్కృత పాఠశాలకును వినియోగ పఱచెదను దానివల్ల మీకెంతో పుణ్యము గలుగును ఒక మానవ మాత్రునకిచ్చిన గౌరవమని జనులు చెప్పుదురే కాని కామ్య కర్మమునకు నేదేని పుణ్యము గలదా? కావున మనసునకు తలంచినట్లు ఆధనము నివ్వవలయునని చెప్పగా తల్లిగారు 'ఓహో! పెండ్లి వేసికొనినవో మాత్రమే అంతయు మీకే యిచ్చెద'ననిరి ఆ వాక్యమును విని భారతీదేవి ''అయ్యయో! ఎంతటి మాటలాడితిరి'' అట్లయినవో మీరే యుంచుకొని యాధనమును జూచుచు నానందించుడు బ్రహ్మదృష్టితో జూచిన-

*రసం బ్రహ్మ పిబేద్యశ్చ తృప్తో యః పరమాత్మని ।*
*ఇంద్రం వ మన్యతే రంకం నృపాణాం తత్ర కా కథా?॥*

ఎవడు బ్రహ్మానందరసముననుభవించి, పరమాత్మధ్యానమందు తృప్తుడగు మన్నాడో, ఆ మహాత్ముడు దేవేంద్రునికూడ పేదవాడైన భృత్యునివలె జూచును అట్లున్నప్పుడు సార్వభౌములయొక్క స్థితిని గురించి యేమని చెప్పవలయును?

*న చేంద్రస్య సుఖం కిఞ్చిన్న సుఖం చక్రవర్తినామ్ ।*
*సుఖ మస్తి విరక్తస్య మునేరేకాంత వాసినః ॥*

దేవేంద్రునికైనను నిజమైన సుఖము కొంచమైనను లేదు అట్లే చక్రవర్తులకైనను యథార్థమగు సౌఖ్యము స్వల్పమైనను లేదు నిజమైన సుఖము విషయ విరక్తుడై ఏకాంతమందుండి బ్రహ్మచింతనము చేయు మునికి గలదు

*శరీరం సురూపం తథా వా కళత్రం యశశ్చారుచిత్రం ధనం మేరు తుల్యమ్ ।*
*మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥*

మనస్సు గురు పాదపద్మమందు లయము పొందని వారికి సుందరమగు శరీరమును, సుశీలయగు భార్యయును, ( లేక స్త్రీయైన సుందరుడగు పురుషుడును) ప్రపంచమున వ్యాపించియుండు యశస్సును, మహామేరు సమానముగా నుండు ధనమును, గలిగియుండినను వాటిచే పరమున కేమి ప్రయోజనము? ఏమి యుపయోగము? ఏమి ఫలము? ఏమి సహాయపడును?

మఱియు భారతీదేవి 'అమ్మా! ఏల వలించెదవు? ఋషులయొక్కయు, ఋషి కన్యకలయొక్కయు నామధేయము లెంత పావనములైనవి వారు రాజాధిరాజులచేతను మహారాణులచేతను గూడ పూజ్యులు కారా? రఘువంశము జదువున ప్పుడు దిలీప మహారాజు తన ధర్మ పత్ని గారగు సుదక్షిణయు శ్రీవసిష్ఠమునీంద్రుని యాశ్రమమున ప్రవేశించునపుడు గల వర్ణనము శ్రీ కాళిదాసమహాకవి వర్ణించినది వినినప్పటినుండి నా మనస్సు ఆలాగున మునికన్యకలవలె జీవింపవలయునని సంకల్పము గలిగియుండెను అది యిప్పుడు సర్వేశ్వరుడనుగ్రహించెను ' అని వసిష్ఠాశ్రమ వృత్తాంతముగల రఘువంశ శ్లోకములను జెప్పి తల్లిని ఓదార్చెను ఎట్లన -

*ఆతపాత్యయసంక్షిప్త నీవారాసు నిషాదిభిః ।*
*మృగై ర్వర్తితరోమంథముటజాంగణభూమిషు ॥* 1

*అభ్యుత్థితాగ్ని పిశునై రతిథీనాశ్రమోన్ముఖాన్ ।*
*పునానం పవనోద్ధూతై ర్ధూమైరాహుతిగంధిభిః ॥* 2

ఆ వసిష్ఠాశ్రమము ఎండతగ్గినప్పుడు రాశిగా చేయబడిన తృణధాన్యములు గల పర్ణశాలల ముంగిళ్ళలో నెమరు వేయుచున్న జింకలు గలదియు, ప్రజ్వలింపబడిన త్రేతాగ్నులకు సూచకములైనట్టియు, గాలిచే బైకి లేపబడిన యాహుతుల వాసనలు గల పొగలచే నాశ్రమమునకు పోవువారిని పవిత్రుల జేయుచున్నదియు నైయున్నది పుణ్యవతియగు నో జననీ! ఆశ్రమవాస మెంత పవిత్రమైనదో చూడుము మఱియు, మన కులదైవమునన్న, శ్రీమన్నారాయణుని యవతారమునగు శ్రీరామచంద్రుని వైరాగ్యమును, యోగవాసిష్ఠమున జూచినచో మన విభవమేమి? మన జన్మమేమి? కడుంగడు స్వల్పము శ్రీరామచంద్రుడు వసిష్ఠమునీంద్రునితో విన్నవించిన వాక్య ములు శ్రీయోగవాసిష్ఠమున గలవు కొంచెము చెప్పెద వినుము బ్రహ్మవేత్తల కులమున జన్మించి జననీ జనకులగు మీ రిరువురును బ్రహ్మవిచారము జేసినవారై యుండియు నేల పామరులవోలె నశ్వరవస్తువులం బరికించి శాశ్వతవస్తువులనుగా దలంచి భ్రమనొందుచున్నారు

శ్రీరామ ఉవాచ -

*అహం తావదయం జాతో నిజేఽస్మిన్ పితృసద్మని ।*
*క్రమేణ వృద్ధిం సంప్రాప్తః ప్రాప్తవిద్యశ్చ సంస్థితః ॥*

నేనీ పితృగృహమునబుట్టి పెఱిగి, విద్య నార్జించి యుంటిని

*తతః సదాచారపరో భూత్వాఽహం మునినాయక ।*
*విహృతస్తీర్థయాత్రార్థ ముర్వీ మంబుధిమేఖలామ్ ॥*

మునీశ్వరా! పిదప సదాచార పరాయణుండనై, తీర్థయాత్రలకొఱకు సముద్ర వలయిత మగు భూమండలమునందంతటను విహరించితిని

*ఏతావతాథ కాలేన సంసారాస్థామిమాం హరన్।*
*సముదాద్భూతో మనసి మే విచారః సోఽయమీదృశః ॥*
*వివేకేన పరీతాత్మా తేనాహం తదను స్వయమ్।*
*భోగనీరసయా బుద్ధ్యా ప్రవిచారితవానిదమ్ ॥*

ఇపుడు నాకు సంసారమనిన యాసక్తి నశించినది వివేకయుక్తుడనై భోగేచ్ఛను బరిత్యజించి యిట్లు విచారించితిని

*కిం నామేదం బత సుఖం యేయం సంసారసంతతిః।*
*జాయతే మృతయే లోకో మ్రియతే జననాయ చ ॥*

ఈ సంసారచక్రమున సుఖమేమున్నది? చచ్చుటకై పుట్టుచున్నారు మఱల జన్మించుటకై చచ్చుచున్నారు

*అస్థైవ వయం కష్టం వికృష్టా మూఢబుద్ధయః।*
*మృగతృష్ణాంభసా దూరే వనే ముగ్ధమృగా ఇవ ॥*

ఎండమావుల నీళ్లద్రావ బరుగిడు లేళ్ళవలె మూఢులమగు మేము సుఖము నొసగ లేని యలీకవస్తువుల వెంట బడుచున్నాము

*కిమేతేషు ప్రపంచేషు భోగా నామ సుదుర్భగాః।*
*ముధైవహి వయం మోహాత్ సంస్థితా బద్ధభావనాః ॥*

ఈ ప్రపంచమున విషయములననేమి? - ( దుష్టములును, నష్టస్వభావములును, దుఖబీజములు నగుటవలన) దౌర్భాగ్య స్వరూపములు-మోహవశమున వాంఛలవలన గట్టబడితిమి

*ఆ జ్ఞాతం బహుకాలేన వ్యర్థమేవ వయం వనే।*
*మోహే నిపతితా ముగ్ధా! శ్వభ్రే ముగ్ధా మృగా ఇవ ॥*

మృగములు వనమధ్యమున గోతిలో గూలునట్లు మేమును మోహమున బడియున్నారమని యిప్పటికి దెలిసికొంటిమి

*కిం మే రాజ్యేన కిం భోగైః కోఽహం కిమిదమాగతమ్।*
*యన్మిథ్యైవాస్తు తన్మిథ్యా కస్య నామ కిమాగతమ్ ॥*

*ఆతపాత్యయసంక్షిప్త నీవారాసు నిషాదిభిః ।*
*మృగై ర్వర్తితరోమంథముటజాంగణభూమిషు ॥* 1

*అభ్యుత్థితాగ్ని పిశునై రతిథీనాశ్రమోన్ముఖాన్ ।*
*పునానం పవనోద్ధూతై ర్ధూమైరాహుతిగంధిభిః ॥* 2

ఆ వసిష్ఠాశ్రమము ఎండతగ్గినప్పుడు రాశిగా చేయబడిన తృణధాన్యములు గల పర్ణశాలల ముంగిళ్ళలో నెమరు వేయుచున్న జింకలు గలదియు, ప్రజ్వలింపబడిన త్రేతాగ్నులకు సూచకములైనట్టియు, గాలిచే బైకి లేపబడిన యాహుతుల వాసనలు గల పొగలచే నాశ్రమమునకు పోవువారిని పవిత్రుల జేయుచున్నదియు నైయున్నది పుణ్యవతియగు నో జననీ! ఆశ్రమవాస మెంత పవిత్రమైనదో చూడుము. మఱియు, మన కులదైవమున్న, శ్రీమన్నారాయణుని యవతారమునగు శ్రీరామచంద్రుని వైరాగ్యమును, యోగవాసిష్ఠమున జూచినచో మన విభవమేమి? మన జన్మమేమి? కడుంగడు స్వల్పము శ్రీరామచంద్రుడు వసిష్ఠమునీంద్రునితో విన్నవించిన వాక్య ములు శ్రీయోగవాసిష్ఠమున గలవు కొంచెము చెప్పెద వినుము బ్రహ్మవేత్తల కులమున జన్మించి జననీ జనకులగు మీ రిరువురును బ్రహ్మవిచారము జేసినవారై యుండియు నేల పామరులవోలె నశ్వరవస్తువులం బరికించి శాశ్వతవస్తువులనుగా దలంచి భ్రమనొందుచున్నారు

శ్రీరామ ఉవాచ -

*అహం తావదయం జాతో నిజేఽస్మిన్ పితృసద్మని ।*
*క్రమేణ వృద్ధిం సంప్రాప్తః ప్రాప్తవిద్యశ్చ సంస్థితః ॥*

నేనీ పితృగృహమునబుట్టి పెఱిగి, విద్య నార్జించి యుంటిని

*తతః సదాచారపరో భూత్వాఽహం మునినాయక ।*
*విహృతస్తీర్థయాత్రార్థ ముర్వీ మంబుధిమేఖలామ్ ॥*

మునీశ్వరా! పిదప సదాచార పరాయణుండనై, తీర్థయాత్రలకొఱకు సముద్ర వలయిత మగు భూమండలమునందంతటను విహరించితిని

స్వయముగా వచ్చి వేరునట్లు దినదినము భారతీ దేవి దర్శనమునకు, భక్తి వైరాగ్య పరములగు బోధలే వినుటకును, మానినీమణు లనేకులు వచ్చుచుండిరి లయినను తల్లిదండ్రు లాగర్భ శ్రీమంతులగుటచేతను, వేఱుగ బిడ్డలు లేనందువేతను, వచ్చినవారిని యాదరించెడు భారమును వారే మోచుచుండిరి లందువల్ల శ్రీ భారతీదేవికి నేలాటి ప్రతిబంధము గలుగ లేదు బ్రహ్మముహూర్తమునకు గొంత ముందుగానే లేచి దైనిక కృత్యముల నిర్వర్తించి, స్నానమాచరించి, నిష్ఠలో బ్రవేశించువారు కనీసము 12000 లు గురూపదిష్టమంత్రమును దైవభావనా పూర్వకముగ జపమాచరించి కొంత ప్రాణాయామము గూడ జేసి పదునొకండు ఘంటల సమయమున ధ్యానమునుండి లేచెడు నియమము నాచరణయందుంచిరి భావనా యుక్తముగాని మంత్రజపము, లోపల గింజలేని పొట్టు వంటిదని గ్రహించి యుండుటచే నట్లాచరించుచుండెను తరువాత అర్ధఘంట సమయము గీతయు, అర్ధఘంట యుపనిషత్తులను తప్పక పఠనము చేయు స్వభావము గలిగియుండిరి పిదప దర్శనాసక్తులై, భక్తిపరవశులై, సూర్యోదయమునుండి నిరీక్షించుచుండు నారీ రత్నములకు దర్శన మొసంగి, కొన్ని ధర్మ వాక్యముల వారికి బోధించిన తర్వాత దైవ ధ్యానముతో భోజనమారగించు చుండిరి భోజనానన్తరము ఒక ఘంట విశ్రమించి అప్పుడు వచ్చి యుండు నారీమణులకు దైవప్రభావమును బోధించుటయు, సత్కృష్ట గ్రంధముల నెవరిచేతనైన చది వించుటయు, ముఖ్యవిషయములకు మాత్రము మిక్కిలి మితభాషణతోను, చిన్నని స్వరముతోను తాత్పర్యము వచించుటయు, తరువాత నొక ఘంట సమయము వస్త్రధారణ కొఱకు రాట్నముపై దారము తీయుటయు, మఱల నొక ఘంట సమయము పరమాత్మను గుఱించి అతి భక్తితో భజన చేయుటయు మొదలగు కార్యముల దినచర్యగా నేర్పఱచుకొనియుండిరి అప్పటికి సంధ్యాకాలమగు టచే ధ్యాన నిష్ఠాదులకొఱకు వచ్చియుండువారి నందఱిని, స్వగృహము లకును, దూర ప్రదేశముల నుండి వచ్చిన వారిని తన మాతృగేహమునకును బంపి, ఆశ్రమసంరక్షణ కొఱకుండు శ్రీరత్నమాంబగారిని మాత్రమచటనే యుండులాగున యేర్పఱచు చుండిరి ధ్యానాదులు పూర్తి యగునప్పటికి రాత్రి యొక్క మొదటి యామము

గడచుచుండును తరువాత మంచినీరు మాత్రము పానము చేసి తన తోడ వసించు సోదరీమణికి ధ్యానముయొక్కయు, భక్తియొక్కయు, వైరాగ్యముయొక్కయు మహిమల గఱించి కొంత తడవు బోధించుచు నొకానొక సమయమున రాత్రియందు మౌనవ్రతమునుగూడ బూనుచుండిరి

ఇవ్విధంబున యనుష్ఠానము ప్రబలి రాగా రాగా దూరదూర ప్రదేశములందున్ను భారతీదేవియొక్క ప్రభావము వ్యాపింప దొడగెను అపుడు గొప్ప గొప్ప రాజ కుటుంబములలో నుండు భామినీమణులుగూడ రాసాగిరి వచ్చెడివారు శ్రేష్ఠమగు ఫలపుష్పాదులను తెచ్చుటయు, మహారాణులుసహా ఏతెంచుట జూచినపుడు భారతీ దేవి తల్లిగారియొక్క శోకము చాలవఱ కుపశమించెను కుమార్తె గృహస్థాశ్రమమును ద్యజించెనని పూర్వమునుండిగల దుఃఖము లన్నియు దొలగి చంద్రోదయ కాలమున చకోరపక్షి హృదయమున ఆనందముద్భవించునట్లు వీరి హృదయమున గూడ నానందము పూర్ణముగా నుప్పొంగసాగెను అంతేగాదు, తల్లిగారిని చూచిన వారందఱును 'అమ్మా! మీ రెంతటి పుణ్యాజీవులో! పూర్వజన్మమునం దేయే నోముల నోచితిరో, లేనిచో క్షీరసాగరమునుండి శ్రీలక్ష్మీదేవి యావిర్భవించి నట్లు ఇట్టి బిడ్డ మీ గర్భములో బుట్టునా?' అని పలుకుచుండిరి ఇట్లు మానినీమణులు పలుమారు చెప్పెడు వాక్యముల వినునపుడు చంద్రోదయకాలమున సముద్రముప్పొంగు నట్లు తల్లి హృదయముగూడ సంతోషభరితమై యుప్పొంగుచుండెను మఱియు వివాహము జేసినచో ఒకటి రెండు రోజులు మాత్రమే గృహములో బంధుజనులు సమకూడెదరు ఇపుడన్ననో ప్రతిదినము భారతీ దేవి దర్శనమున కేతెంచు బంధువులచేతను, గొప్ప యంతఃపుర నివాసినులగు రాజస్త్రీలచేతను గృహము నిండుచున్నది వివాహము నకు వచ్చెడి స్వబంధుజనులును కామ్యకర్మలై యుందురు ఇపుడన్ననో భగవద్భక్తు రాండ్రగు స్త్రీలు నిరంతర భగవచ్చింతనా తత్పరులై యుండిరి నిరంతర మాగృహము భగవత్కీర్తనలచేతను సమారాధనలచేతను నిత్యకల్యాణయుతమై వెలయుచుండెను భారతీదేవి రాజకులములో జన్మించినందున స్త్రీలకు మాత్రమే దర్శన సంభాషణా దుల కవకాశము గలిగి యుండెను దర్శించి వెళ్ళెడు రాణులు తమ భర్తలతోను,

తండ్రులతోను, పుత్రులతోను, సన్నదమ్ములతోను, భారతీ దేవియొక్క వైరాగ్యము, దైవభక్తి, జ్ఞానబోధలను మిక్కుటముగా వర్ణించి చెప్పుటచే రాజులకు గూడ భారతీ దేవి దర్శనమొనరింపవలయునను ప్రీతి యనుదినము వర్ధిల్లుచుండెను కాని యేమి చేయగలరు? క్షత్రియ ధర్మముంబట్టి స్త్రీలకు ఘోషాపద్ధతి యుండుటచే నేమియు దోచినది కాదు కాని భారతీదేవి వైరాగ్యసంపన్నురాలగుటచేతను, నివృత్తి మార్గములో నున్నతాదర్శము గలదగుటచేతను, తల్లిదండ్రులు వేదాంత విచారణ గలవార గుటచేతను, బ్రహ్మవిచారణ తత్పరులగు రాజన్యులున్ను, వీరేగాక బ్రాహ్మణులగు నితర బ్రహ్మనిష్ఠులును, సంక్షోభపడి భారతీ దేవిగారి జనకుడగు రామచంద్ర నరేంద్రుని గృహమున కేతెంచి తమ నిర్మలాశయమును తెలియ జేసిరి ఆ వాక్యము నాకర్ణించినతోడనే రామచంద్ర నరేంద్రుడు నేమియు దోచక కొంతసేపు చేష్టలుడిగిన యోగివలె నిశ్చేష్టుడైయుండి వచ్చియుండు మహనీయు లందఱికిని నమస్కరించి యీ క్రింది విధముగ మనవి జేసెను, 'బ్రాహ్మణోత్తములారా! రాజ వరేణ్యులారా! క్షత్రియ ధర్మమగు ఘోషాపద్ధతి మీ రెఱుంగనిది కాదు నేను గూడ నా బిడ్డ యేకాంతమున తపస్సు ప్రారంభించినప్పటినుండియు ననేక రాజకుటుంబములలో గల యోషిన్మణులు వచ్చుచుండుటం బట్టి బిడ్డను దర్శింపుటగూడ చాల యరుదు మాయాడువారెల్ల సంగతుల జెప్పుచుండ విని యానందముతో ధ్యానము జేయు చుండువాడననియెను ఇట్లు వచింప కొంతసేపెల్లరున్ను భిత్తియందు చిత్రించిన చిత్తరువులై యుండిరి వారిలో ముఖ్యులగు కొందఱు 'మహానుభావా! మీరు సెల విచ్చిన విషయము మేము చాలారోజులనుండి యాలోచించుకొని యుంటిమి అయినను నయ్యది ప్రవృత్తి మార్గములోనుండు పామరులకు జెల్లునని యూహించి యిపుడు సాహసించి మేమిట కేతెంచితిమి మేమాపుణ్య జీవియగు పరమభక్తురాలి దర్శనము జేసి వెంటనే వెళ్లి పోయెదము ఏమియునడుగ దలచి యుండ లేదు కాబట్టి గొప్ప మనస్సుతో మేము వచ్చియుండు సంగతి శ్రీ భారతీదేవిగారి కెఱింగించిన వారెట్లానతి నొసంగెదరో ఆలాగున చేయగలమని దెలిపిరి ఆ నరేంద్రులు తన నెఱింగిన వారగుటచేతను, విఖ్యాతి గాంచిన వారగుట చేతను, బ్రహ్మవిచారణ

చేయువారగుట చేతను రామచంద్రనరేంద్రుడు నూరుమాటా డక తన ధర్మపత్ని యగు రామేశ్వరమ్మ కడకేగి యామెతో భారతిదేవి సమీపమునకు వెళ్ళి నీజనకు డత్యవసరముగా నొకమాట నుడువ నవకాశము గలుగ జేయ వలయు నని ప్రార్థించుమనట్లు ఆజ్ఞాపించెను ఆమె వెంటనే వెళ్ళి ఆ వాక్యమును కుమార్తెకు దెలిపెను అపుడెన్నడును సామాన్యముగా తన దగ్గఱకు రానటువంటి తండ్రి యీ విధముగ జెప్పుటలో ముఖ్యవిషయమేదైన నుండునని తలంచి భారతి యచట జేరి యుండు నారీమణులందఱితోను 'మీరిక దొలగవలయును నా పూజ్యపాదులగు జనకుడి చటికి రావలయునని తల్లిగారిద్వారా సందేశము నంపిరి దీనియందేదో ముఖ్యకారణముండునని' పలికెను అద్దానిని విని అచట సభ చేరి యుండు నారీ మణులందఱును సమ్మతించి యాలాగుననే యని చెప్పి వెళ్ళిరి

పిమ్మట తండ్రిగారు రావచ్చునని భారతి తల్లితో జెప్పి పంపగా నామె వెంటనే వెళ్ళి జనకునకు దెలిపెను తోడనే జనకుడు మిక్కిలి భక్తితో వచ్చి విషయమును భారతీదేవిగారికి నెమ్మదిగా దెలిపెను ఇట్లు వచింప నా భారతీదేవి 'పురుషులు వచ్చుట కిది మొదటసారి ఎల్లప్పుడును నీలాగున నేర్పడిన మఱల రాజుల కట్టు దిట్టములకు కీడు గలుగును అంతియగాక యనవసరముగ పురుషులు రాగలరని యు, వచ్చినవారితో వినయంబున సెలవిచ్చి తమతో వారిని దీసికొని రావచ్చునని' వచించి తండ్రిని బంపివేసెను వెంటనే యానంద భరితుడై మఱలి, నరేంద్రుడా వాక్యములను దర్శనాసక్తులై వచ్చియుండు రాజన్యులకు సవినయముగా దెలిపెను ఈ వాక్యమును వినిన వెంటనే గొప్ప గాలి వచ్చినపుడలలచే హంస పక్షులగుంపు పైకెగురునట్లు బ్రాహ్మణులు, రాజన్యులు, ఆనందపరవశులై లేచి రామచంద్రనరేంద్రుని ముందిడుకొని భారతీదేవిగారి యాశ్రమమునకు వచ్చుచుండిరి దానింగాంచి కొంత దూరముగా నున్నపుడే బిల్వ వృక్షమూలమున దర్భాసనములో నుండెడు భారతి లేచి నిలిచి రెండు చేతులను ముకుళింప జేసి భిత్తిచిత్రిత చిత్రమువలె చలించని కరచరణనేత్రాదుల గలిగియుండెను అట్టి నిశ్చల మూర్తియగు భారతిని బరికించి దగ్గరకు వచ్చిన యా పురుషులందఱు సింహమును గాంచిన యేనుగులవలె నణగిన యింద్రియములు గలవారై సాష్టాంగ

నమస్కారంబు చేయబూనిన వెంటనే ఆ తపస్వినియగు భారతి వారిని హస్త సంజ్ఞచే నివారించినను, భక్తి పరవశులై యుండు వారందఱును నమస్కరించి నిలచిరి

ఆసమయమున భారతీదేవియు, 'తండ్రులారా! మీ బిడ్డనగు నన్ను నిర్విఘ్న తపస్సిద్ధి కొఱకై యాశీర్వదింపుడు' ఇట్లని చెప్పుచు నానంద బాష్పాకుల నేత్రయై, యందరికిని నొకే తూరి విధిప్రకారము నమస్కార మొనర్చి నిలిచి యుండెను. ఇపుడా భారతి నుద్దేశించి కొందఱు రాజులు, 'మా వంశములో పూర్వము సులభా యోగిని యను పేరుగల యొక రాజకన్య బ్రహ్మచారిణియై తపస్వినియై యుండినట్లు భారతమందు విని యున్నాము. ఇప్పుడు కన్నులార మిమ్ములను దర్శించిన మా నేత్రములు సాఫల్యము నొందినవి' అని చెప్పిరి. మఱియు వారిలో బ్రహ్మ విచార పరుడగు నొకరు రామచంద్ర నరేంద్రునితో నిట్లని విన్నవించెను ''మీ దయవల్ల మేమందఱము ధన్యులమైతిమి బహుకాలమునుండి గలిగిన పుణ్యసంకల్ప మీ దినమున సిద్ధించినది మాకేదైన యొక వాక్యమును శెలవిప్పింపవలయును. భారతీదేవి గారి వాక్యమును వేదవాక్యమువలె శిరసావహింపగలము' ఈ విధమున తండ్రితో జెప్పెడు వాక్యము నాకర్ణించి భారతీదేవి యందఱిని కూర్చుండునట్లు హస్త సంజ్ఞ జూపిన తోడనే వారందఱును నిశ్శబ్దముగ, నిశ్చేష్టులై కూర్చుండిరి. వారందఱును భారతీదేవిగారిని కూర్చుండ కోరినను నంగీకరింపక నిలచియే, ఒక క్షణకాలము కన్నుల మూసి ధ్యానించి తర్వాత నేత్రముల తెఱచి, గంభీర భావముతో మృదుస్వర ముతో నీరీతిగ వచించెను. 'తీర్థపాదులగు భూసురులారా! ఋషి సంతతిలో జన్మించిన యార్యులగు నో రాజన్యులారా! మీ రెఱుంగని విషయముల నేనేమి వచింప గలను? అయినను మహనీయుల వాక్యములను వ్యర్థము చేయగూడదని యొక వాక్యమును వక్కాణింపనెంచితిని. మన్నింపవలయును పూర్వకాలమున ద్విజుల గృహములలో హోమగుండమందగ్ని హోత్రము ప్రజ్వలించుచుండెను. ఇపుడు సమిదాధాన మొనర్చువారు లేమింజేసి అగ్ని బూడిదలో గ్రమ్మి ప్రకాశింప కున్నది. అట్లే అందఱి హృదయమున యాత్మ

ఎంతయును సముచ్ఛ్వాసము తగ్గిపోయి నందుచే నివురు గప్పిన నిప్పు పగిది జ్ఞానము ప్రజ్వరిల్లు చున్నది ఊదిన దొలగించి పలుల సమిధలచే హోమాగ్నిని ప్రజ్వరింప జేయునట్లు లనాత్మ భావమును దొలగించి యాత్మవిచారణ చేతను, పరిమిత ధ్యానానుష్ఠానముల చేతను, మీరందఱు మీగోత్రస్థు లగు పూర్వీక ఋషులవలె బ్రహ్మజ్ఞానాగ్నిని బ్రజ్వలింప జేయువారలై యుండుడు ఇంతే, నమస్కారమని వచించి మౌనముగా నిలచి యుండెను వచ్చిన వారందఱును లగాధార్ధముగు నీ వాక్యము నాలకించి నిశ్చేష్టులై యుండగా భారతి హస్తముతో ప్రయాణ సంజ్ఞను జూపుట గనుగొని, ఇంద్రసభ పూర్తియైన తర్వాత దేవతలు వెడలునట్లు శుద్ధవస్త్రధారులగు భూసురు లును, భూపాలకులును ప్రయాణమై వెళ్ళునపుడు రామచంద్రనరేంద్రుడు వారందఱిని స్వగృమునకు దీసి కొనివెళ్ళి ఫలపుష్ప తాంబూలాదుల నొసంగి నమస్కరించి పంపెను వారున్ను నరేంద్రునికి నమస్కారంబిడి వారి యనుమతిని బడిసి స్వగృహములకు వెళ్ళుచు మార్గములో భారతీదేవి నుడివిన గంభీర వాక్యములను గుఱించి యొకరితో నొకరు మాట్లాడు కొనుచు, నందరును స్వగృహముల జేరి భారతీదేవిగారు నుడివిన యమోఘ వచన ముల నెల్లరతోను వచించిరి

ఇది వఱలో భారతి తల్లిగారికి బిడ్డపై భక్తి యధికరించి యున్నట్లు ఇపుడు తండ్రికి గూడ చిన్నగా నుండుచుండెడు యగ్ని వాయువువల్ల మఱింత ప్రజ్వరిల్లునట్లు దైవమునందును, బ్రహ్మనిష్ఠులపైనను, తన బిడ్డపైనను గల భక్తి యినుమడించెను అప్పటినుండి శరత్కాల చంద్రుని వంద్రిక లోకమందంతటను ప్రకాశమును, ప్రసన్న తను, శీతలతను విస్తరింపజేయు నట్లు భారతీదేవియొక్క శాంతము, కరుణ, భక్తి లోకమున వ్యాపించెను పైన జెప్పిన రాజన్యులు దర్శించిన పిమ్మట క్షత్రియ వధూమ ణులే గాక, చాతుర్వర్ణ్య స్త్రీలును గాక, హరిజన వర్గములో జేరిన యువతులు గూడ భారతీదేవి దర్శనార్థము వచ్చుచుండిరి వీరిలో ముఖ్యముగా రాజకన్యలంద ఱును శ్రీభగవద్గీతాపారాయణమునుగూడ నుండిన బాగుండునని, భారతీదేవి గారిని కోరి యిట్లు బలికిరి ''దేవీ! కలియుగ వేదమనంబడు గీత సంసార సాగరమును తరించుటకు గొప్ప యోడ యగును

*సంసార సాగరం ఘోరం తర్తు మిచ్ఛతి యో నరః ।*
*గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥*

ఇంతియెగాక సర్వజనులకును, స్త్రీపురుషు లందరికిన్నీ శ్రీకృష్ణభగ వానుడు గీతా పఠనమున కర్హత నొసంగియున్నాడు అదియుగాక 'విభూతి' యోగములో భగవద్గుణమును యోగులకు, పురుషులకు, భక్తులకు నొక్కొక్కటిగ మాత్ర ముపదేశించి స్త్రీలవంతు వచ్చిన ప్పుడు సప్తవిధ పుణ్యములతో భగవంతుడు స్త్రీలయందున్నాడని వర్ణించిరి ఎట్లన,

*కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా।*

1 కీర్తిః = ధర్మగుణమునుబట్టి గలుగు ఖ్యాతియును, 2 శ్రీః = ప్రశాం తము చేకూరెడు లక్ష్మియును, 3 వాక్చ = మధుర వాక్కున్ను, 4 స్మృతిః = స్మరణశక్తియును, 5 మేధా = జ్ఞానధారణ శక్తియును, 6 ధృతిః = కార్యనిర్వహణ ధైర్యమును 7 క్షమా = ఓర్పును, ఈ ఏడును స్త్రీలకుండు భగవద్గుణములు కావున మాకు గీతా పఠనము జేయ గరుణింపవలయు'' నని రాచకన్యకలందరును భక్తిశ్రద్ధలతో దెలిపిరి వీరి యొక్క నిర్మల భావమును గాంచి భారతి యాలాగున యాదరింపవచ్చునని మృదువాక్యముతో బలికెను 'తల్లులారా! పుణ్యజీవులగు నృప కన్యకలారా! మీయొక్క నిర్మలాశయమును జూచి నేను కాదన జాలను అయితే నాకు సమయము చాలదు గీతాపారాయణము మధ్యాహ్నము లోపల జరుగవల యును నా ధ్యానము పూర్తి యగుటకు పదునొకండు ఘంటలగుచున్నది కాని యపరాహ్ణ కాలములో జేయు భగవద్భజనను నిలిపి మధ్యాహ్నకాలమున గీతాపఠన మొనర్పదగును అట్లయిన కలియుగమున భక్తియే ముక్తికి ముఖ్య సాధనమని యుండుటచేత జదివిన వారికిని జదువనివారికిని, భజనలో పాల్గొనుట కవకాశము గలుగును 'కలౌ భక్తిః కలౌ భక్తిర్భక్త్యా కృష్ణః పురస్థితః' అని కలదు కావున భజనను నిలుపరాదు కలియుగ కాలసర్పముయొక్క ఘోరవిషమునకు భగవద్భక్తియే దివ్యౌషధమని ఋషులు

వచించియున్నారు

*కలికాలోరగాద్దంశాత్కిల్బిషాత్కాలకూటతః ।*
*హరిభక్తిసుధాం పీత్వా ఉల్లంఘ్యో భవతి ద్విజః ॥*

కాని- వారమున కొక రోజున్ను, ఏకాదశి రోజునను భజనను ఏర్పఱచి మధ్యాహ్నము లోపల గీతాపారాయణము జేయువచ్చును అయితే నేను నిష్ఠలోనుండి వచ్చినను రాకున్నను మీలో చాలామంది సంస్కృతము నెఱింగిన వారుండుటచే మీరే చేసికొనవచ్చును లేనిచో నానిష్ఠకు భంగము గలుగును నిష్ఠలో నేలాటి సంకల్పము గలుగకూడదు ధ్యానమున మేరు శిఖరపర్యంతమున్నత దశకు వెళ్ళిన వారైన సంకల్పము గలిగిన బాతాళలోకములో బడినట్లగుదురు అంతేగాక గాలిచే వీచబడిన దీపము చలించునట్లును, వాయువువల్ల నిర్మలజలాశయము పంకిల మగునట్లును, ధ్యానకాలములో కొంచమైనను సంకల్పము గలిగినచో ధ్యేయము నుండి దృశ్యములోనికి జారి పోవును '' ఇట్లు చెప్పి ఆశ్రమకార్యములలో నుండు బాలవితంతువగు శ్రీరత్నమాంబ గారిని ఈ కార్యములో నియమించెను ''వారును సంస్కృతము జదివి చాలవఱకు నావలెనే ధ్యాననిష్ఠాదులు చేయువారు మరియు గీతాపారాయణ చేయుట మాత్రము కాదు మీరందఱు నిచటికి వచ్చుటచేతగాని, మీ పూజా జపాదులచేతగాని, మీరు నిర్వహించెడు కుటుంబకార్యముల కేలాటి భంగము కలుగ కూడదు ఉద్యోగము, వ్యాపారము, వ్యవసాయము మొదలగు పనులకు వెళ్లువారికిని పాఠశాలకు వెళ్లువారికిని ఏలాటి నిరోధము మీవల్ల గలుగగూడదు దానియందే మీరు మేధాశక్తిని గలిగియుండవలయును అట్లుగాక వారి పనుల కాలమున మీరు జపములోగాని, పూజలోగాని, పారాయణములోగాని కూర్చుండిన కలహము సంభవించును మీరు నటువంటి పనులు గలవారగుటచే నిస్సంకల్పముగ ధ్యానింపలేరు ఇప్పటికే ఆవిషయమై రెండు మూడుత్తరములు వచ్చినవి ఈ కార్యములలో మీరు జాగ్రత్తగ లేనిచో మీ గురువులను గూడ వారు దూషింతురు కావున మీ పనులన్నియు పూర్తియైన పిమ్మట మీరు జప ధ్యానాదులు మాత్రము పూర్తిచేయక భుజింపరాదు దీనికి మీరందరును

నంగీకరించినచో గీతాపఠన మారంభింపవచ్చును మీలో చాలా మందికి ముఖ్యముగా స్నపకన్య కలకును, పై జెప్పిన ప్రతిబంధము లేదని నాకు దెలియును అయినను బీదవారలగు నారీమణు లనేకులుండుటచే నీ విషయము జెప్పవలసివచ్చినది మఱియు గీతా పారాయణము చేయువారును అర్థమును చెప్పెడివారును ననేకులు గలరు మీ రేదియో విలాసము కొరకని తలపోయక ప్రతివాక్యము శ్రీకృష్ణభగవానుడు మన దగ్గర నుండి మనకు జెప్పుచున్నట్లు భావన జేయవలయును అట్లులైనచో శ్రీకృష్ణ భగవానుని ముఖారవిందము నుండి వినినట్లమృతత్వము మీకు గలుగును మఱియు ప్రతిపదమును స్పష్టముగా నుచ్చరించవలయును పదములు మాత్రము శుద్ధముగా నుచ్చరించిన జాలదు భగవద్భావముగూడ గలిగి యుండవలయును అప్పుడు మాత్రమే గుండు వేసి కాల్చిన ఫిరంగి శత్రుకోటల ధ్వంసమొనర్చునట్లు మీ యవిద్యా వరణమును దొలగించును లేనిచో మందుమాత్రము వేసిగుండు లేని మర ఫిరంగి శబ్దమువలె మీ శబ్దమున్ను వ్యర్థమే యగును ఇది పారాయణకు మాత్రమే కాదు మంత్ర, జప, పూజాపారాయణాదులన్నిటిలోను భగవద్భావము గలిగి యుండవలయును మఱియు లోపల గింజ లేని విత్తనముల విత్తినచో నెట్లు చెట్లు గాజాలవో, అదేరీతిగా నంతర్భావన లేని మంత్రాది జపములు వ్యర్థములు ఈలాగున వేయని కారణముచే పూర్వీక ఋషులాచరించెడు మంత్రధ్యానాదుల నిపుడుండువారు జపించినను నా సిద్ధపురుషులవలె ఫలము నొందకపోవుచున్నారు గీతాపారాయణ చేసిన మాత్రము చాలదు గీతాసారమును పానము జేయ వలయును అనగా నాచారము గలిగి యుండవలయును లేనిచో నౌషధనామముల మాత్రము జెప్పుచుండిన వ్యాధి యేలాగున కుదురదో నాలాగుననే యుండును మఱియు నూషర క్షేత్రమున విత్తబడిన మంచి విత్తనమైనను ఏలాగున ఫలము నివ్వజాలదో నదేవిధముగ హృదయ క్షేత్రము దోషయుక్తమైన యెడల ఫలముండదు హృదయము కల్మషరహితమై యుండవలయును సస్యములకు జలమెటువంటిదో, ఆత్మకు జీవరాసుల యందలి కరుణయు నటువంటిదే మఱియు గీత విలాసమునకు మాత్రము పారాయణ జేయ దలంపక దానిలోనుపదేశింపబడినట్లాచరింప వలయునను తలంపుతో జేయవలయును

కాని పారాయణానంతరమై పూజ్యపాదులగు తండ్రిగారికి మనవి చేసెదను''
అని చెప్పి వెంటనే తన్మిత్రుని ద్వార జనకునికి తెలియబడినప్పుడు తండ్రియొక్క
సంతోషము చెప్పనలవిగాక పొంగి పొరలెను మరియు నీలాగున జనకుడు చెప్పి
నాడు 'మా వంశము పావనమైనది మా జన్మము ధన్యమైనది పుత్రిక
మాత్రము కలిగినను పుత్తర సంతానము లేదని యొక కొఱత గలిగి యుండెను
అది యీ దినముతో పూర్తియైనది పుత్రులు లేరను యొక్క కొఱత పామరు
లనే బాధించును తన యాత్మలో గలిగెడు జ్ఞానబోధయే నిజమైన పుత్రుడగును
'బోధ జ్ఞానమయం స్మృతం' బోధయే జ్ఞానమయుడగు నొక పుత్రుడని
వాసిష్ఠమున గలదు పుత్రులు లేక పోయినను సప్తసంతానముల శాస్త్రము
విధించుచున్నది గదా!

*తటాకం ధన నిక్షేపం బ్రహ్మస్థాప్యం సురాలయంమ్।*
*ఆరామకృతి (కూపాని) సత్రాణి సప్త సంతాన సంజ్ఞికాః ॥*

(1) తటాకము త్రవ్వించుట, (2) ధర్మముకొఱకు ధనమును (ఫండుసేర్పర మట) స్థాపించుట (3) బ్రహ్మనిష్ఠులకు స్థలమేర్పరచుట, (4) దేవాలయమును కట్టించుట, (5) పరోపకారముకొఱకు ఫలపుష్పాదుల వనమును వేయించుట, (6) ఉత్తమ గ్రంథముల నచ్చొత్తించుట, (7) అన్నసత్రములను కట్టించుట- ఇవియే సప్తసంతానము లనబడును వీటిలో నేదైన నొకటి యుండిన ఉత్తమ సంతానముచే గలిగెడు పుణ్యము గలుగునని శాస్త్రము విధించుచున్నది

*కోటరాంతర్భవో వహ్నిస్తరుమేకం దహిష్యతి ।*
*కుపుత్రస్తు కులే జాతః స్వకులం నాశయేత్పరమ్ ॥*

వృక్షపు తొఱ్ఱయందుద్భవిల్లిన వహ్ని యా వృక్షమును మాత్రమే దహించును ఏ వంశమందు దుష్టపుత్రుడు పుట్టునో యా దోషముచే కులమంతయు నశించును అని గలదు కాన సర్వేశ్వరానుగ్రహముచే గలిగిన బ్రహ్మనిష్ఠురాలగు మా భారతివల్లనే మా వంశమంతయు పావనమైనది మఱియు

గీతామాహత్మ్యములో గీతాపారాయణ చేయుస్థలములో సమస్త దేవతలును, ఋషులును, సకల తీర్థములును గలవని విని యున్నాము

*గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।*
*తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై ॥*

*సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే ।*
*గోపాలా గోపికా వాఽపి నారదోద్ధవపార్షదైః ॥*

అని స్మరించి, కావున ఇపుడే గీతాపరనాలయమును స్థాపించుటకు ప్రయత్నించుచున్నానని బిడ్డతోను, అచటనుండు భూపాల కన్యకలతోను తెలుపుమని ధర్మపత్నితో జెప్పి పంపెను పిమ్మట వెంటనే తన కార్యదర్శిని బిలిచి మూడు రోజులలోపల నొకగొప్ప కొటాయిని తయారు చేయింపవలయునని యాజ్ఞాపించెను అతడు వెంటనే వందలకొలది పనివాండ్రను బిలిపించి, విశాలముగ నొకపాకను వేయిమంది జనులకు నుపకరించునటుల మూడు రోజులలో పూర్తి జేయించెను చుట్టుప్రక్కల ననేక విధములగు పూలచెట్లను, తులసీ వనములను గూడ నిర్మించిరి తోటయొక్క సంరక్షణ కొరకు నౌకరులనుగా నారీమణుల నేర్పఱచిరి మఱియు కూర్చుండుటకు కంబళ్ళు, పట్టాలు, జమకాణములు, కావలసినన్ని క్రొత్తవాటిని దెప్పించిరి మఱియు (1000) వేయి భగవద్గీతా మూలపుస్తకములను, తాత్పర్యము, టీకయు, పదవిభాగము, విశేషార్థములతో గూడిన వాటిని గూడ తెప్పించి పెద్ద బీరువలో నుంచిరి

ఆ కాలము పుణ్యతమమగు కార్తికమాసము ఆ నెలలోనే శుక్ల పక్ష ఏకాదశి దినమున గీతాపారాయణను ప్రారంభించిరి మొదట వేద బీజమంత్రమగు ప్రణవము నుచ్చరించి తరువాత శ్రీకృష్ణభగవానుని, శ్రీవేదవ్యాస మునీంద్రుని, శ్రీవిఘ్నేశ్వరుని ధ్యానించి ప్రథమమున భక్తియోగమగు ద్వాదశాధ్యాయమునుండి ప్రారంభించిరి ప్రథమాధ్యాయము యుద్ధమును గురించిన దగుటచే మంచిది కాదనియు, అది విషాద యోగమగుటచే నిర్విఘ్నముగా జరుగుట ప్రయాసమనియు పెద్దలందురు కాబట్టి భక్తియోగ మగు పండ్రెండవ

అధ్యాయమును ప్రారంభించుటకు కారణము గీతాపారాయణ, కార్తీక శుక్ల ఏకాదశి నందువారి ... లో పఠన జరుగునున్నదని విని సర్వజాతులలో గల యోషిన్మణులు విచ్చేయుచుండిరి వారిలో నాదియాంధ్ర వనితామణులుగూడ నేతెంచి ప్రాతఃస్నానము నొనరించి దూరముగ జేతులు మోడ్చి భక్తితో నిలచియుండిరి వారును స్నానమాచరించి శుభ్ర వస్త్రములు ధరించి వచ్చియున్నారు వీరిని జూచి రాజకన్యకలు భారతీ దేవి గారితో నాలోచించిరి అప్పుడు భారతీ దేవిగారు' సర్వభూతములయందు నేను సమానముగా నుంటున్నాననియు, పంచమహా పాతకములుగలవారు గూడ గీతా పఠనముచే పావనులగుదు రనియు, గీతయందే గలదని చెప్పి వారిని గూడ దగ్గఱకు పిలిపించి సమీపమున గూర్చుండబెట్టిరి మఱియు నిటుల జెప్పిరి

*సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।*
*యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥*

ఓ యర్జునా! నేను సకల ప్రాణులయందును సమానుడను నాకు శత్రువు గాని, మిత్రుడు గాని లేడు ఎవరు నన్ను భక్తిచేత భజించుచున్నారో యట్టివారు నాయందున్న వారగుదురు నేనును వారియందుంటున్నానని తాత్పర్యము

*మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।*
*క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా ॥*

పంచమహా పాపముల జేసిన వారైనను గీతాధ్యానమును జేయువారిని కమల పత్రమునకు నీరంటని వందంబున పాపములంటవు అని శ్రీకృష్ణభగవానుడు దెలిపి యుండుటచే సంశయింప నక్కఱ లేదు మఱియు నవమాధ్యాయ మున,

*అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।*
*సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥*

ఓ యర్జునా! మిక్కిలి దురాచారముగల వాడైనను భక్తితో నన్ను భజించిన యెడల నట్టినిశ్చల బుద్ధిగలవాడగుటచే నతడు సదాచారము గలవాడే యని తలంప వలయును

*క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।*
*కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥*

అట్టి యనన్యభక్తిగలవాడు శీఘ్రముగా ధర్మాత్ముడగుచున్నాడు త్వరలోనే పరమశాంతిని బొందుచున్నాడు అనగా పాపరహితుడగుచున్నాడు ఓ యర్జునా! భగవద్భక్తుడు శుద్ధాత్ముడగును అతనికి నాశము లేదని కుతర్కవాదుల సభయందు రెండు చేతులు పైకెత్తి ప్రతిజ్ఞ జేసి చెప్పుమని తాత్పర్యము

*మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।*
*స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥*

ఓ యర్జునా! పాపయోని సంభూతు లెవరు గలరో యట్టి వారును, స్త్రీలును, వైశ్యులును, శూద్రులును నన్నాశ్రయించి సర్వోత్తమమైన గతిని (మోక్షమును) బొందుచున్నారు అని యున్నది

కనుక వారు దగ్గఱ గూర్చుండుటలో మనవారెవరును సందేహింప నవసరము లేదని చెప్పిరి మఱియు వేయి భగవద్గీతలను గీతాపరనాలయమునకు జనకుడొసగి యున్నాడు కావలసినవారు తీసికొని పారాయణ చేసిన పిమ్మట మఱల బీరువలో పెట్టుచుండవచ్చు''నని శ్రీభారతీదేవిగారు సభలో లేచి చెప్పిరి

మఱియు ''అమ్మ లారా! శ్రీరామచంద్ర భగవానుడు శబరియొక్క యుచ్ఛిష్ట ఫలముల భుజించినాడు రాక్షస కులములో జన్మించిన విభీషణుని పరమభక్తునిగా స్వీకరించినాడు కావున భగవద్భక్తిగల వారెవరైనను భగవంతునికి ప్రీతికరులే యైనను కొందఱికి వారితో గలిసి యుండి, సమీపమున గూర్చుండు అలవాటు లేదు కలసిమెలసి యుండు లాగున మన మిపుడు ప్రారంభించినచో కుతర్కులు మనల ననేక ప్రశ్నలకు బాల్పర చెదరు ఇపుడింతవఱకు చాలును కాలక్రమమున గుణమునకే యాధిక్యము వచ్చును ఆ కార్యము సంఘ సంస్కర్తలును, స్వరాజ్యపక్షమువారును నిర్వహింపగలరు మనము వారి కనుకూలురముగా నుండిన చాలును ప్రతికూలురముగా మాత్రము ఉండరాదు అపుడు భారత దేశమంతయు వారి దారి ననుసరించును మనకు

స్వారా జ్యమును సంపాదించెడు పను లనేకములు గలవని చెప్పి, ప్రప్రథమమున భారతీ దేవి యొక్కొక్క శ్లోకమును జెప్పుచు దాని ననుసరించి తక్కిన వారందఱును పారాయణజేయులాగున నేర్పఱచి ప్రారంభించిరి అపుడా స్థలమంతయు వర్ష ఋతువున తామర పుష్పములతో నిండిన సరోవరము వలె, తెల్లని వస్త్రముల ధరించియుండు నారీమణులతో శోభించుచుండెను ఆవరణపు గోడల ప్రక్కనుండి యనేక విప్రులు ను, భూభర్తలును నిశ్శబ్దముగా వినుచుండిరి మధ్య మధ్య భారతీదేవి ముఖ్యములగు శ్లోకములకు నిగూఢమగు నంతరార్థమును జెప్పు చుండిరి 'యోషిన్మణులారా! మీరు శబ్దముల శుద్ధముగా నుచ్చరింపవలయును కాని, భాషలో మనస్సునుంచి దైవభావమునుండి వైదొలగిన గొప్ప ప్రయోజనము గలుగదు కావున భాషలోను, భావములోను నేకకాలమున మనస్సును నిలుపులాగున నభ్యసింపవలయును ధ్యానములో మనసును నిలిపినచో నందఱితో ను శబ్దము నైక్యపరచుట ప్రయాస యగును అందఱి శబ్దముతో నైక్యపరచేలాగున చూచినచో దైవభావన దొలగిపోవును ఇది మొట్టమొదట కొంచము ప్రయాసగ దోచినను ప్రజ్ఞాబలముచేతను, నభ్యాస పాటవముచేతను త్వరలోనే సాధ్యమగును మీరు వీణవాయించ ప్రారంభించినపుడు స్వరములోను, తాళములోను మనస్సునుంచిన దైవభావము గలుగదు దైవభా వములో చిత్తము పదిలపఱచిన స్వరమును, తాళమును, చక్కగా కుదురదు కాని కొంతకాలమున కీ రెంటిని నైక్యము జేయగలుగుదురు పరమభక్తులగు హరి దాసులు, కీర్తనలను పాడుచు, వీణను మీటుచు, నర్తనము జేయుచు, నేత్రములను మూసికొని శ్రీహరిని హృదయమున ధ్యానించుట మీరెఱింగియే యుందురు ఇదే పారాయణ, జప, పూజాదులలో గ్రహింపవలసిన నిగూఢ తత్త్వము

మఱియు నిలువుగ నాటిన గడలపైనుండు తంతులమీద దొమ్మరులు శిరమున నొక జలకుంభము నుంచుకొని పాటలు పాడుచు, నటనము జేయుచుండినను నాకలశము నుమాత్రము క్రింద పడనీయక చూచుచుందురుగదా! అదియు అభ్యాసమువల్లనే వారి కలవడినది కావున భాషాశుద్ధియు, భావశుద్ధియు గలిగియుండునట్లు గమనింపవలయును

గీతాపారాయణానంతరము గీతామాహాత్మ్యమును జదువవలయును అటులయిన పదునెనిమిది యధ్యాయములు పూర్తియగు సరికి మాహాత్మ్య శ్లోకములును పూర్తి గావలయును కావున దినమునకు మాహాత్మ్యము రెండు శ్లోకములు చదివిన చాలును గీతయు దినమున కొక యధ్యాయము చొప్పున పఠించిన చాలును తరువాత దైవ ప్రార్థన ధ్యానాదుల సలిపి సమాప్తి చేయవచ్చును ఈలాగున మీరందఱును పారాయణానంతరము వారి వారి స్వగృహమునకు వెళ్ళవచ్చును కాని ఈదినము మాత్రము మొదటి రోజగుటచే మా మాతాపితరులన్ని వర్ణములవారికిని వారి వారి వర్ణాశ్రమ ధర్మానుసారముగ, ఏకాదశివ్రతముగలవారికి, లేని వారికిన్ని సమారాధన నేర్పఱచి యున్నారు కావున మీరందఱును నీదిన మిచ్చటనే భోజన ఫలాహారాదులారగించి వెళ్ళవచ్చునని తెలిపి భారతీదేవి పారాయణానంతరము తాను ధ్యానము జేసికొను గదిలోనికి వెళ్ళిరి అందఱును మిక్కిలి భక్తిగలవారలై ఆనాడచటనే భుజించి ప్రసన్న హృదయులై వెళ్ళ వలసినవారు స్వగృహములకు వెళ్ళిరి

మరుదినము గీతాపారాయణ సమయములో ప్రథమమున భారతీదేవి చదువుచు, తదితరులచేత చదివించుచు ముఖ్యశ్లోకముల కర్థమును జెప్పుచుండిరి 'తల్లులారా! మీరేదైనయొక వస్తువును భుజించినప్పుడు బాగుగా నమలి తినిన మాత్రముననే లెస్సగా రుచి గలుగును అట్టిది మాత్రమే త్వరలో జీర్ణించి, సారము రక్తములో గలియును అందువలన మీ శరీరములోని రక్తము పుష్టి నిచ్చును అదే రీతిగా పారాయణము శాంతముతో దైవ భావనగలిగి చేయవలయును అటులయిన మాత్రముననే మీ యాత్మ పవిత్రమగును విజ్ఞానము మీకు వృద్ధి యగును మఱియు నౌషధమును భుజించునపుడు మందు లెస్సగా జీర్ణమై రక్తమందు కలసిన మాత్రముననే, వ్యాధి యుపశమించి సంపూర్ణారోగ్యము గలుగును అట్లుగాక వమనమైపోయిన రోగ శాంతి కాజాలదు ఆలాగున గీతలో జెప్పిన యనుష్ఠానము చక్కగ గలిగి యుండిన మాత్రముననే భవరోగము నశించును నారీమణులారా! రేపటినుండి మీరు మామూలుగా పారాయణ చేయుచుండవలయును సాధ్యమైనచో నేను వచ్చెద లేనిచో మీరే పారాయణ ప్రార్థనధ్యానాదుల జేసికొనవచ్చును నన్నేవిధముగను తొందర

పెట్టరాదు నేను వేయవలసిన ధ్యానక్రమము లింక ననేకములు గలవు నేనింకను దైవసన్నిధినుండి యెంతో దూరముగా నున్నాను అచ్చోటు చేరువలకు సాధకులేకార్యములోను ప్రవర్తిల్లరాదు కేవలము సంసారములోనుండి దైవకార్యము జేయనొల్లని వారికిని, పుణ్య కర్మలనాచరింపని వారికిని, ఈ ప్రార్థన, గీతాపారాయణ, పూజాదులు విధింపబడినవని చెప్పుచు రాజకన్యకలంగాంచి 'ఆత్మ సోదరీమణులారా! మీరు బాల్యావస్థ నతిక్రమించి తరుణావస్థం బొంది యున్నారు మీ బోటివారివల్లనే యీ నారీ లోకముద్ధరింపబడ వలసియుండును కావున భోగపరత్వమును గొంత తగ్గించి యోగపరత్వము నవలంబింపవలయును దైవభక్తి ప్రాణము వంటిదని మరువ గూడదు తైల మేలాగున జ్యోతియై మారుచుండునో, యట్లే శుద్ధమగు దైవభక్తియే, దైవజ్ఞానమై మారుచుండును ఈ యాది యాంధ్ర మహిళా మణులను గూడ కరుణతో జూడవలయును ఎంతటి పాపులైనను భగవద్భక్తి గలిగిన మురికిగల వస్త్రమును చపుడులో నుడకబెట్టి యుతికినచో నెట్లు మాలిన్యము బోయి శుభ్ర పడునో, ఆలాగున పవిత్రులగుదురని ప్రతిజ్ఞాపూర్వకముగా శ్రీకృష్ణభగవానుడు నవమాధ్యాయమున బోధించిన విషయమును మరువరాదు రోగులకొఱకే యౌషధమును, వైద్యులు, నేర్పడిరే కాని రోగములేని వారికి కాదను తత్త్వమును మన దేశములోగల విద్యావంతులు మరచిపోయిరి అందువలననే యాత్మసంస్కరణ సంఘము మన దేశ ములో లేకపోయెను ఆ కారణమువల్ల ఈజీవకోట్లున్నతస్థితికి రాకపోయిరి' లని భారతీదేవి యుచ్చస్వరముతో జెప్పిన వాక్యముల విని భూపాల కన్యకలందఱు నా నందబాష్పముల రాల్చుచు ఆ లాగున చేసెదమని యొప్పు కొనిరి అయితే సాధ్యమైన రోజున, మాకు గీతాపారాయణ కాలమునందు దర్శనమైన నీయవలయును లేనిచో మేమప్పుడే జన్మించిన బిడ్డలకు తల్లిలేని దుఃస్థితిని బొందగలమని మహిళామండలి వారు చెప్పిన మాటలను విని భారతీదేవి గూడ వారి యొక్క భక్తి భావమును దిలకించి యానంద బాష్పములు ధారధారలుగా కారుచుండుటచే నేమియు బలుక జాలక ధ్యానమందిరము లోనికి వెళ్ళిపోయెను తరువాత పూబోండ్లందఱును ఆశ్రమ సంరక్షకురాలగు శ్రీ రత్నమాంబగారితో ''అమ్మా! మీరు సమయము జూచి

ఈ లాగున భారతీదేవిగారితో జెప్పవలయును 'మాలో కొందఱము దేవిగారివల్ల మంత్రోపదేశమును బొందదలచి యున్నార మనియు, కొందఱీ స్థలములోనే కుటీరమును నిర్మించుకొని తపస్సు చేయ దలంపు గలిగియున్నారనియు, మా బాధ్యతలన్నియు మేమే భరింపగల మనియు మీ కేవిధమైన ప్రతిరోధము గలుగనీయక జాగ్రత గలిగి వర్తింపగలమనియు దెలిపి, దానికి భారతీదేవిగారేమి సెలవిచ్చెదరో యద్దానిని రేపు మాకు రహస్యముగా దెలుపవలయును నేరుగా జెప్పుటకు మాకు భీతి గలుగుచున్న''దని చెప్పి యందఱును భక్తి పరవశులై స్వగృహములకు వెళ్ళి పోయిరి

దీనిని విన్నప్పుడు రత్నమాంబగారికి నపరిమితానందమొదవెను ఏలయనగా! తనకెక్కువ తడవు నిష్ఠలో నుండుట కలవి గాదు ఒంటరిగా కూర్చున్నచో విసుగుదల గలుగుచుండును కొందఱుండినచో తనకు సహాయముగా నుండు ననియు, ఏదో యొకటి యొక్కొక్కరితో పలుకుచుండవచ్చుననియు నాలోచించు చుండిరి దానికిది మంచి తరుణమని తలంచి, యెపుడు చెప్పుద మాయని యువ్విళ్ళూరుచుండిరి పగలా విషయమై భారతీదేవిగారితో జెప్పుటకు సమయము దొరకనందుచే రాత్రి నిష్ఠపూర్తియైన పిదప మామూలుగా బయట మారేడు మ్రాను క్రింద దర్భాసనమందు కూర్చుండునపుడు భూపాలకన్యకలు దెలిపియుండు వృత్తాంతమును ముదంబున దెలిపిరి వాటినన్నిటిని ప్రశాంతముగా వినుచు కొంతతడవు మౌనముగానుండి భారతి, ''నా యాత్మ సమాను రాలవగు అమ్మా! ఇవియన్నియు మనకు బంధన కారణములు బ్రహ్మనిష్ఠకాటంకములు ఇపుడు మన మొకరి కుపదేశించుటకు గాని, జనులను జేర్చుటకుగాని, యర్హత గలిగి యుండ లేదు మన మభ్యాసకులమేగాని యారూఢులము గాము ఆరూఢస్థితి గలుగు వఱకు నుపదేశించుటకు శాస్త్రమంగీకరింపదు అంతేగాక తీక్ష్ణబుద్ధితో జదువుచుండు విద్యార్థిదశలో స్వయముగా పాఠశాలను స్థాపించి జనులను జదివింప ప్రారంభించి నచో నతని విద్యాభ్యాసము పరిపూర్తి యెట్లగును? మరియు, నొకడు పాఠశాలలో లెక్కలు వ్రాయుటకు తగినంత స్వల్పమగు చదువు చదువగానే యుద్యోగమునకు

సామాన్య గుమస్తా పనికైనను సమర్థత లేకుండుటచే వానికెంత జీతము దొరకును? గొప్ప పరీక్షయందుత్తీర్ణుడైన జిల్లాకలెక్టరుయొక్క నధికారమును బొంది వేలకొలది జీతమును సంపాదింపవచ్చును గదా! జిల్లాయంతటికిని నధికారి గానవచ్చును తన ఖర్చు పోను మిగిలిన దానిచే పరోపకారమెంతేని జేయవచ్చును గదా! గుమస్తా పనివల్ల లభించిన జీతము లతని కుటుంబఖర్చులకు గాని చాలదు లక్ష్మియెడ నతడేమి వానికి దానము జేయ గలుగును? మఱియు వైద్యవిద్య నభ్యసించు వాడపుడే వైద్యమునకు ప్రారంభించినచో నతడాయుర్వేదములో నెంత గొప్పవాడగును? గొప్ప పరీక్షలో నుత్తీర్ణుడైనచో నధిక జీతము లభించునదేగాక, లనేకుల కుచితముగా గూడ చికిత్స జేయ వచ్చును అపుడు గొప్ప గొప్ప రాజులును, శ్రీమంతులును చికిత్స బొందుదురు వారికి ఆరోగ్యము గలిగిన నెన్నెన్నో వైద్యాలయముల కట్టించ వచ్చును మఱియు నిపుడే జనులు చేరినచో నొక్కొక్కరి మనస్సు వేఱువేఱు విధముగా నుండును లుల్లుకాగా, నైకమత్యము లేక నిపుడు మనకు గలిగియుండు శాంతి శూన్యమై పోవును మఱియు మంత్రోపదేశము సామాన్యమైనది కాదు మొట్ట మొదట, నుపదేశింపబడు వారియొక్క హృదయ సంస్కారము గనుగొనుశక్తి గలిగి యుండవలయును మఱియు నుపదేశింపబడువారి పాపమును హరింపజేయు దివ్యమహిమయైన నుండవలయును లేనిచో నాపాప ముపదేష్ట నావహించును అంతే గాక నుపదేశించు నపుడు కొంత దివ్యశక్తి తగ్గిపోవును అట్టి స్థితినుండి తగ్గిపోనటు వంటి యారూఢ జ్ఞానులే యుపదేశింప నర్హులు అట్లు కానిచో నుపదేశము నొందిన వారు గురువులపై విరోధులై యుందురు వారు గురు నిందాపరులగుదురు సముద్ర ముపై పొంగెడు నలలచే చలింపని సముద్రము యొక్క యడుగున నుండు పెద్ద గుండురాయివలె, దృశ్యవృత్తులచేతను, దృశ్యములగు ద్వంద్వములచేతను, చలింపని యగాధ జ్ఞాననిష్ఠ గలవారే బోధకులగుదురు ఈ కార్యములన్నియు యోచింపనిచో కొందఱు గురువులును, శిష్యులును యుండు మఠములలోను, కలహములు జరుగుట జూచుట లేదా! మంత్రసిద్ధియు జ్ఞానసిద్ధియు గలిగిన తరువాతనే యటువంటి యుపదేశకార్యములలో ప్రవేశింపవలయును అపుడే బోధకులు గావల యును

మఱియు నేదో అప్పటికపుడు గలిగిన భక్తిచేతను, వైరాగ్యము చేతను కొందఱుపదేశమును బొందెదరు అయ్యది స్వభావ వైరాగ్యమా? లేక అభావ వైరాగ్యమా? యని దానిని గూడ యోచింపవలయును లేనిచో నూషరక్షేత్రములో విత్తిన విత్తనము పగిది ఉపదేశము వ్యర్థమగును

ఊషరే వాపితం బీజం భిన్న భాండే చ గోదుహమ్ ।
భస్మనీవ హుతం హవ్యం మూర్ఖే దాన మశాశ్వతమ్ ॥

చవిటిభూమిలో పెట్టిన విత్తనమును, పగిలిన కుండలో పిండిన పాలును, బూడిదయందు హోమము వేసిన హవ్యమున్ను, ఎట్లు వ్యర్థములో ఆలాగున మూర్ఖులకు జేసెడు మంత్రోపదేశమున్ను వ్యర్థమైపోవును తల్లీ! అనేకులకు శిష్యులుగా నుండవచ్చునే గాని యొకరికైన గురువుగా నుండుట బహు భారమైన కార్యము అంతేగాక, మనము పొందవలసిన పదవి యింకను చాలా దూరములో నున్నది ఈ విషయమై శ్రీ గౌతమబుద్ధదేవుని చరిత్ర యొకటి గలదు వినుము బుద్ధుడాకాలమున నుండిన, కాశ్యపుడు మొదలగు మహాఘోరతపోనిధులతో, ధర్మమూలమును గుఱించి సంభాషించునపుడు, వారి ఘోరానుష్ఠానముల నన్నిటిని పూర్వపక్షము జేసి, పరమ నిర్వాణమొకటియే జనన మరణ దుఃఖమును శాంతింప జేసి నిరతిశయానంద బ్రహ్మ సుఖమును గలుగ జేయునదని బోధించగా, నాకాశ్యపాది తపస్వులందరట్టి పరమతత్త్వము నుపదేశింప వలయునని బుద్ధదేవుని కోరగా, తానింకను ఆ నిర్వాణపదవిని బొందలేదనియు, దానిని బొందిన పిదప, కాల ముండిన మీ కుపదేశించెదననియు నంతవఱకు ఘోరమగు తపశ్చర్యను మాని, దయాపరులై యింద్రియ నిగ్రహము గలవారై ధ్యానము జేయుచుండుడని యుప దేశించి వెళ్ళినట్లు గలదు ఇట్లని తెలిపి మఱియు రేపటినుండి కొన్ని కఠిన సాధనల నాచరింప దలచితి ఈ సాధనలలవడినచో మనము సత్త్వగుణముచేతను బద్ధులము గాము

సత్త్వగుణముగూడ బంధనమనియే గీతలో గుణత్రయ విభాగ యోగమున నుపదేశింపబడినది అది బంగారు గొలుసుతో కట్టినట్లుండును బంధనమునకు

రాగిగొలుసైనను, ఇనుపగొలుసైనను సమానమే అనగా రజస్తమోగుణములవలె సత్త్వగుణముగూడ బంధనమే అది సుకుమారముగ దృశ్యసుఖములచే బంధించు నని గీతాచార్యు లుపదేశించిరి

*సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।*
*నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్॥ గీత అ 14 శ్లో 5*

అర్జునా! భగవన్మాయవలన గలిగిన సత్త్వము, రజస్సు, తమస్సనెడి త్రిగుణములు నాశరహితమగు జీవాత్మను నశ్వరమగు దేహమునందు వికారములగు సుఖదుఃఖాదులచే బంధింపుచున్నవి వాటిలో సత్త్వగుణ మేలాగున బంధించునో అయ్యది క్రింది శ్లోకములో విశదమగును

*తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్ ।*
*సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥ గీ - అ - 14 - శ్లో 6*

ఓ యర్జునా! ఆసత్త్వరజస్తమములగు మూటిలో నిర్మలమగుటచే ప్రకాశింప జేయునదియు, ఉపద్రవ రహితమును నయిన సత్త్వ గుణము సుకుమారముగ నమానిత్వాది జ్ఞానానుష్ఠానముచేత ఆత్మను ప్రకృతియందు బంధించును అనగా సుకుమారము, సుందరము, సుశోభనము మొదలగు బాహ్యసుఖములచేతను, అమానిత్వా ద్యనుష్ఠానములచేతను, ధన్యత్వమును బొందినట్లుగ జేయును కాని జ్ఞేయమును (గుణత్రయాతీతమును) బొందింపజేయదు ఒక దీపమునకు తెలుపు, ఎరుపు, నలుపు, రంగులు గల చిమ్నిచే నావరణమేర్పడిన, ఆ యెరుపు, నలుపైన గ్లాసులు దీపముయొక్క స్వచ్ఛమగు ప్రకాశమును కనుపరచక చిమ్ని రూపమునే ప్రకాశముగూడ నున్నట్లు తోపింప జేయును రజస్తమోగుణములు గల వారు వారి యంతఃకరణము ననుసరించి నిజమైన సత్యమును దెలిసికొనజాలక వారెఱింగి నదే సత్యమని తలంతురు సత్త్వగుణమట్లు కాదు స్వప్రకాశమై నిర్మలమై యుండును కాని చిమ్ని యొకటి యావరణముగా నుండుటచే దానిపై దేనిని వేసినను దహింపజాలదు చిమ్ని గూడ లేనిచో నేది వేసినను అది భస్మమై పోవును

లదేరీతిగా గుణత్రయాతీత జ్ఞేయరూపమగు జ్ఞానజ్యోతియే సంచిత, ఆగామి, ప్రారబ్ధకర్మములను కట్టెలను గాల్చి వేయును ప్రపంచములో గల అనేకసాధకులు రాజస, తామస, గుణములను రహితమొనర్చ యత్నింతురే గాని సత్త్వగుణమగు సుకుమారమును, సుందరమును, ప్రశాంతమును దాట ప్రయత్నింపరు ఇప్పటికి మన మీ యాశ్రమములో చేరి మూడు సంవత్సరములైనది మూడు మూడేసి సంవత్సరములలో నొక్కొక్క మార్పు గలుగవలయును అట్లు నాలుగు మూడులు చేరగా ద్వాదశాబ్దములు పూర్తి యగును అద్దానినొక పట్టమని పెద్దలు వచింతురు

*ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।*
*తైరేవ తు వినిర్ముక్తః పరమాత్మే త్యుదాహృతః ॥*

ఆత్మ క్షేత్రజ్ఞుడని ప్రకృతి గుణములచేగలిసి యున్నపుడు పిలువబడును ఆ సత్త్వరజస్తమో గుణములనెడు ప్రకృతి నుండి విముక్తి నొందినపుడు పరమాత్మ యని పిలువబడును అని రత్నమాంబగారితో వచించి రాత్రి యుభయులును పరుండిరి అట్టి సమయమున భారతీదేవికొక విషయము జ్ఞప్తికి వచ్చి రత్నమాంబ గారిని లేపి యిట్లు బలికెను

''తల్లీ! రత్నమాంబగారు! భాగవతము నందేకాదశస్కంధమున అవధూతుడు అతీత బ్రహ్మనిష్ఠ డుండవలసిన విషయము నొకకన్యకనుండి గ్రహించిన ధర్మసారము నీక్రింది విధమున వర్ణించి యున్నారు మాడుడు దీనిని గ్రహించినచో నెక్కువ జనులను జేర్పవలయు ననెడి మీ సంకల్పము మఱల గలుగదు

*క్వచిత్కుమారీ త్వాత్మానం వృణానాన్గృహమాగతాన్ ।*
*స్వయం తానర్హయామాస క్వాపి యాతేషు బంధుషు ॥*
*తేషామభ్యవహారార్థం శాలీన్రహసి పార్థివ ।*
*అవఘ్నన్త్యాః ప్రకోష్ఠస్థాశ్చక్రుశ్శంఖాస్స్వనం మహత్ ॥*
*సా తజ్జుగుప్సితం మత్వా మహతీ వ్రీడితా తతః ।*

బభంజ్జైకైకశశ్శంఖాన్ ద్వౌ ద్వౌ పాణ్యోరశేషయత్ ॥
ఉభయోరప్యభూద్ఘోషో హ్యవఘ్నన్త్యా స్స్మ శంఖయోః ।
తత్రాప్యేకం నిరభిద దేకస్మా న్నాభవ ద్ధ్వనిః ॥
అవ్వాశిక్షమిమం తస్యా ఉపదేశ మర్దినమ! ।
లోకా ననుచరన్నేతాంల్లోకతత్త్వవివిత్సయా ॥
వాసే బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి ।
ఏక ఏవ చరేత్తస్మా త్కుమార్యా ఇవకంకణః ॥

ఓ రాజా! ఒక గ్రామము నందొక బ్రాహ్మణగృహమున, తన మాతాపిత్రాది బంధుజనను గ్రామాంతరము వెళ్ళినందున కుమారి మాత్రము ఒంటరిగా నుండెను అట్టి సమయమున కన్యకయొక్క వివాహనిర్ణేతలగు పెద్దలరుదెంచిరి ఇంట తల్లిదండ్రులు లేనందుచే స్వయముగనే అర్ఘ్యపాద్యాదులచే వారిని సత్కరించెను వారు వచ్చుసరికి ఇంటియందు బియ్యము లేకుండెను అపుడా కుమారి, తన మాతా పితరులరుదెంచి ధాన్యమును దంచి బంధుజనమునకు వంట చేయుట కాలస్యమగునని యెంచి, తానే రహస్యముగ ధాన్యమును దంపనారంభించెను అపుడు తన చేతుల యందున్న గాజు లొకటొకటి కొట్టుకొని, పెద్దగ శబ్దించెను ఆ శబ్దమును బంధుజనులు విన్నచో వీరింత దరిద్రులు, ఆపూట కాపూట దంచుకొని తిని జీవించునట్టి బీదలుగ తలతురేమోనని చాల యసహ్యించుకొని లజ్జావనత వదనయై చేతులకున్న గాజులన్నిటిని దీసివైచి ఒక్కొక్క చేతికి రెండేసి కంకణములు మాత్రము మిగిల్చెను మఱల దంపసాగెను ఆ రెండును బరస్పరము గొట్టుకొని మఱల ధ్వనించెను అపుడా రెండింటిలో నొక్క దానిని దీసివైచెను పిమ్మట యేలాటి శబ్దము గలుగ లేదు

కామక్రోధాది శత్రు సంహారకుడవగు నో రాజా! లోకతత్త్వము యొక్క జిజ్ఞాసచే సంచరించుచున్న నేనీ కుమారినుండి, కుమారియొక్క కంకణమువలె ననేకులొకచోట నున్నయెడల కలహములు సంభవించు ననియు, ఇద్దరున్నను వ్యర్థసంభాషణాదులు గలుగవచ్చుననియు, గానన్నొంటరిగనే సంచరింపవలయు ననెడి యుపదేశమును గ్రహించితిని కాన యీామె నున్ను, గురువుగ జేసికొంటిని

అని అవధూత జెప్పిరి కాన మనము పరులను జేర్చుటవలన మన సాధనానుష్ఠానములకు భంగమగు''నని బోధించిరి

ప్రథమసర్గము సంపూర్ణము
లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు,
ఓం తత్ సత్

ఓం తత్ సత్

# శ్రీ బాలయోగిని

## ద్వితీయ సర్గము

## సాధనఘట్టము

తపసో న పరం కించిత్తపో హి మహతాం ధనమ్ ।
తపసా ప్రాప్యతే సర్వం తపోయోగ్యోఽసి పుత్రక ॥

అని శ్రీ వేదవ్యాసులు శుకబ్రహ్మర్షికి జెప్పిరి తపస్సునకన్న శ్రేష్ఠమైనది ముల్లోకములందును మఱొకటి లేదు ఈలోకములో మహాత్ములయొక్క ధనము తపస్సే తపస్సువల్ల సర్వవిధ ధనము పొందబడును కావున నో కుమారుడా! నీవు తపమొనర్చుటకు దగియున్నావు అను శ్రీ వ్యాసవాక్యమును భారతీదేవిగారు వచించి మరురోజునుండి ఒకటిన్నరరోజున కొకపూట మాత్రము భోజనము జేయ సాగెను మఱికొన్ని రోజులు గడువగా రెండురోజుల కొకసారి యాహారముగైకొనన భ్యసించెను ఈలాగున కొన్నిదినములు గడచిన పిదప మూడురోజుల కొకతూరి యాహారము స్వీకరింప నలవడిరి ఇట్లుండ తలిదండ్రులును, భర్తృరాం డ్రగు సీమంతినులును దినమున కొకమారు భుజించు విధమున నెంతయో వేడు కొనినను తన యొక్క తీక్ష్ణవ్రతమును నిలుపలేదు శరీరముమాత్రము కొంత కృశించినను దేహము తేజోవంతమై యుండెను అయినను ప్రతిదిన మాచరించు అనుష్ఠాన మందే కొంచెమైనను కొఱత లేకయే అనుష్ఠించుచుండిరి అట్లు కాని వ్రతము రోగికిన్నీ యోగికిన్ని సమానమే యగును రోగికూడ కొన్నిరోజు లాహారము లేక యూరక పడియుండును, ఆలాగున యోగి యుండరాదు అదే నీరుభయులకు గల తారతమ్యము ఏ యే వ్రతములు గాని, తపస్సులు గాని యాచరించినను తన బ్రహ్మనిష్ఠకు భంగము కలుగక యుండవలయును ఆరుమాసము లీ విధంబున యాచరించిన పిదప మామూలు ప్రకారము దినమునకొక మా రాహారము దీసికొన ప్రారంభించిరి ఈలాగున చేయుటకు గారణమును తల్లియు, నితర మానినీ మణు లును నడిగి

నపుడు 'ఈసాధన కారణముల నిపుడు చెప్పలేను కొంత కాలమునకు మీకే దెలియు'నని ప్రసన్నవదనయై ప్రశాంత గంభీరభావముతో భారతీదేవిగారు సమాధాన మిచ్చిరి మరురోజునుండి ఒకదినమున తమిద సంకటియు ఇంకొక రోజున జొన్నన్న మును, మఱొక రోజున మొక్కజొన్నన్నమును వేఱొకరోజు సజ్జ (కంబు)న్నమును, మరియొ రోజున గోధుమ రొట్టెయును, మఱియొక దినమున పై జెప్పబడిన ధాన్యాదులచే జేయబడిన రొట్టెయును, ఒక్కొక్కపు డొకవారము వఱకన్నమును, ఒక్కొక్కవారము వఱకు, పైన జెప్పిన ధాన్యపురొట్టెను భుజించి కాలము గడపు చుండిరి ఆలాగున కొన్ని రోజులయిన పిమ్మట, కొన్నిదిన ములప్పుడు బియ్యపన్నమును, కొన్నిరోజులు పచ్చిబియ్యపన్నమును, కొన్నిరోజులు సక్తును, (ఉత్తర దేశములో గోధుమ, వరి, జొన్న, శనగలు మొదలగుననేక ధాన్య ముల వేయించి పిండిజేసి నీటితోగాని, మజ్జిగతోగాని కలిపి భుజించెదరు దానికి సక్తుయని పేరు) కొన్నిరోజు లపక్వాహారమును, కొన్ని రోజులు (కందములు) గడ్డల గాల్చి తినుటయు, మఱికొన్ని రోజులు కేవలము మజ్జిగ మాత్ర మును, కొన్ని రోజులు గో క్షీరమును, కొన్నిరోజులు మేకపాలును, కొన్నిరోజు లేమియు స్వీకరింపక కేవల జలపానమును చేయుచు నభ్యసించుచుండిరి ఈ లాగున చాల దినములు గడచిన తరువాత నొక రోజున ఎండలోను, మఱియొక రోజున వానలోను, మఱొకరోజున సంపూర్ణముగ మంచులోను, ఒక్కొక్కపుడు వట్టినేలలోను, శయనించుచుండిరి మఱియు నొక్కొక్కరోజున స్నానము చేయకయు నొక్కప్పుడు రెండుమూడురోజుల కొకసారి స్నానము చేయు చుండిరి పై జెప్పిన విధులనొకపుడు వారము రోజులుకూడ నలవరచుచుండిరి దీని నంతయు గాంచి కొందఱు ''ఓ భారతీ! ఎందుకొఱకిట్లు చేయుచున్నావు''! అని యడుగుచుండిరి తీవ్రనిష్ఠచేత మతికే దైన భ్రమకలిగెనా యని మరికొందఱికి సందేహము గలిగెను కాని ప్రతిదినము చేయునిష్ఠ నొకరోజైనను తగ్గించలేదు శరీరము మాత్రము కొంచెము తగ్గనేకాని కాంతి మాత్ర మధికరించుచునే యుండెను ప్రజ్ఞ యే మాత్రమును తగ్గక స్ఫుటము చేసిన బంగారువలె నధికముగా ప్రకాశించు చుండెను ఈలాగున కొన్ని దినములు గడిచినను పూర్వాధికముగ

భారతీదేవి యొక్క యెసిషావిశేషము వర్ధిల్లుట గాంచి జనులందఱు సంతోషభరితులై యుండిరి భారతీ దేవి అంతరంగ భక్తిగల వారితో మాత్రము దీని యొక్క రహస్యమిట్లు చెప్పు మండెను

''మనమేమ సుకుమార దశలో బడి యుండరాదు తపస్సు చేయువారి యుదరము జాడీవలె నుండవలెను శిరస్సు ప్రమిదవలె నుండవలయును జాడీయందే పదార్థము వేసినను వెడదు దీపపుబుడ్డిలో ఏ నూనె పోసినను వెలుగుచుండును అదే రీతిగ నుదరమును, శిరస్సును నుండవలయును లేనిచో హిమాలయ ప్రాంత ములలో గాని, కారడవియందుగాని, నిర్జన ప్రదేశమందు గాని మన ముండి తపస్సు చేయజాలము దేహేంద్రియాదుల నీలాటిసాధనలవల్ల స్వాధీన పఱచుచుండవలయును అట్లు చేయనందుచే కొందఱు పురాణ వైరాగ్యముచేగాని, లేక శ్మశాన వైరాగ్యముచేగాని, అభావవైరాగ్యముచేగాని, గృహచ్ఛిద్రములచేగాని, లేక తాపసుల జూచి యాలాగున నుండవలయునని గలిగెడు ఉద్రేక పూర్వక వైరా గ్యము చేతగాని, యిల్లు విడచి బయటకు పోయిన మండలము రోజులయినను పూర్తియగుటకు ముందుగానే జ్వరము చేతనో, బంక విరేచనములచేతనో, నెత్తురు విరేచనములచేతనో, అజీర్ణముచేతనో, కేవలము బేదులచేతనో, కడుపులోబల్ల పెరిగి నందుచేతనో తిరిగి యింటికిరావలసి వచ్చుచున్నది మనము మలయాళ దేశమునకు యాత్రగా వెళ్ళిన, అచ్చట ఉప్పుడు బియ్యపన్నము ముఖ్యముగా దొరకును కర్ణాట కదేశమున రాగిసంకటియు, మహారాష్ట్రదేశమున జొన్న రొట్టెయు, సజ్జరొట్టెయు, ఉత్తర హిందూస్థానమున గోధుమ రొట్టెయు దొరకును కనుక నిప్పులో కాలిన వానిని ఎంత తీవ్రమైన యెండైనను నేమియు జేయజాలనటుల ఇచటనే ఈలాగున సాధనలన్నిటి జేసినచో మనకు మఱెచటను బాధకలుగదు''ని చెప్పుచుండిరి భారతీదేవి మామూలుగా దినమున కొకమారు మాత్రము భోజనము జేయుచుండిరి మఱియు 'శరీరము వాతపిత్త శ్లేష్మాదులచె గూడియుండును ఇని తామస, రాజస, సాత్త్విక గుణముల ధర్మములు, వాతము శీతల ప్రదేశము నోర్వదు పైత్యము వేడి యాహార మును ఉష్ణప్రదేశమును సహింపజాలదు

సాత్త్వికమన్నిటిని సహించును ఇది సత్త్వగుణ లక్షణము జ్ఞానుల కిట్టి సత్త్వగుణమే యుండవలయును కొందఱికి మిశ్రతత్త్వము గూడ నుండును వీరన్నిటిని కొంతవఱకు సహింపగలరు బ్రహ్మచర్యముచేతను, తపస్సుచేతను కొంతయోగ సాధనచేతను, దేహేంద్రియ శుద్ధి గలవారన్నిటిని నిగ్రహింపగలరు కొంతప్రాణాయామ ముండిన ఏ వ్యాధియును దగ్గరకు రాజాలదు కొండగుహల యందుగాని, సెలయేటి తీరమునగాని, యిసుక తిన్నెల యందుగాని, తపమొనర్పవలసియుండినచో నిట్టి నిగ్రహము గలిగి యుండ వలయును తీవ్ర వైరాగ్య సాధన గలవా రెంత చలికాలమైనను నేకవస్త్రమును మాత్రము ధరించియో లేక కౌపీనధారులయియో వట్టి నేలపైగాని, కృష్ణాజినాదుల యందుగాని, యేదైన చాప మీఁదగాని, వస్త్రమును పఱచిగాని పరుండెదరు వైరాగ్యము పరిపక్వమునకు రాని వారే మంచి కాలములో పండుకొను గది యొక్క కిటికీలనైన తెరువక వెచ్చని పడకయు, మంచి విలువగల శాలువల కప్పుకొని నిద్రింతురు వీరు బ్రహ్మముహూర్త మున లేచి స్నానము జేయజాలరు సామాన్యబట్టలను మాత్రము కట్టుకొనువారికి మొదట కొంచెము చలిగానుండినను ప్రాతఃకాలమున లేచి స్నానము జేయుట సులభముగా నుండును మఱియు నిద్రాసుఖముకొఱకే క్రింద వేడిగల కంబళ్లను, పైన విలువగల శాలువలును కావలసి వచ్చినవి వీరు నిద్రాసుఖమునే గొప్పగా కోరిరి గాని బ్రహ్మసుఖమును గోరియుండ లేదు కావుననే యల్పాహారమును స్వల్పనిద్రయును యోగులు గలిగి యుండవలయునని శాస్త్రము వచించెడు రహస్యము ఎక్కువ యాహారముండిన, నిద్రయు నధికముగ నుండును కావుననే యోగులు రాత్రులలో ఆహారము మానుదురు గారణము ఎక్కువ ప్రాణాయామము, శాస్త్ర పఠనముగాని, విశేషముగా సంభాషణగాని యుండువారికి మాత్రమే రాత్రి యేదైన కొంచె మాహారము పండ్లుగాని, పాలుగాని గావలయును అట్టి పని లేనివారికి ఏక భుక్తమే మంచిది కనుకనే పరమభక్తుల లక్షణము గీతలో ద్వాదశాధ్యాయమున నిట్లు వచించుటకు గారణమైనది

*తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।*
*అనికేతస్స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః ॥ గీత అ 12 శ్లో 19*

నిందయందును, స్తుతియందును సమానుడును మౌనము గలవాడును (మితభాషణ గలవాడు) శరీరము నిలుమటకు దగిన యే యాహారపదార్థము యే సమయమున నెవట దొరికినను దానితో సంతోషించువాడును, నియతమైన నివాసము లేక ననేక ప్రదేశములలో నివసించువాడును, పరమార్ధ వస్తువిషయమై నిశ్చయ బుద్ధిగలవాడును నగు భక్తుడు నాకు మిక్కిలి ప్రియుడు మఱియు,

*అశనే వసనే చైవ శయనే యో మతిం త్యజేత్ ।*
*స్వాత్మభావే సదానిష్ఠో యోగినాం పరమో మతః ॥*

భోజనమందును, వస్త్రమందును, శయనమందును, ఎవడైతే మనస్సు నుంచక యాత్మ భావనయందు సదా యాసక్తుడై యుండునో అతడు యోగులలో మిక్కిలి శ్రేష్ఠుడని వేద సమ్మతము ఇక ఈ విషయమై భారతమున నుపదేశించినది చూడుడు

యేన కే న చిదాచ్ఛన్నో యేన కేనచి దాశ్రితః ।
యత్ర క్వచన శాయీ స్యాత్తం దేవా బ్రాహ్మణం విదుః ॥

వస్త్రమో, లేడితోలో, ఆకో, అప్పటికి దటస్థించిన దానిచే దేనివేతనైనను శరీరము నాచ్ఛాదన మొనర్చుకొనుచున్నవాడై, అన్నమో పక్వ ఫలమో, కాయయో, ఆకో, ఆకలివేళలకు దటస్థించిన యే పదార్థమునైన నాహారముగా స్వీకరించినవాడై చెట్టుక్రింద నైన, రాళ్ళమీదనైనను లేక నిద్రాసమయమునకు ఏ స్థలము తటస్థమగునో యచ్చట నిద్రించుచున్నవాడై యుండువాడే బ్రహ్మనిష్ఠుడని జెప్పుదురు

*న కుణ్డ్యాం నోదకే సంగో న చైలే న త్రిపుష్కరే ।*
*నాసనే వసనే నాన్నే యస్యవై మోక్షవిత్తు సః ॥*

కేవల బ్రహ్మనిష్ఠుడు కమండలువునందు గాని, యందున్న యుదకమునందుగాని, కృష్ణాజినాద్యాస్తరణములందుగాని, కాషాయమునందు గాని, భోజన పదార్థములందుగాని యపేక్షయు, నభిమానము లేనివాడగునో, అతడే మోక్షవిత్తగును

*కంథాకౌపీనవాసాస్తు దండధృగ్ధ్యానతత్పరః ।*
*ఏకాకీ రమతే నిత్యం తం దేవా బ్రాహ్మణం విదుః ॥*

శీతమును నివారించుకొను బొంతయును, కౌపీనమును, ఒక వస్త్రమును, దండమును ధరించువాడై, బ్రహ్మధ్యానమందు నిరంతరాసక్తి గలవాడై, ఇతర మనుష్యులతో సంబంధము లేక, ఒంటరిగా దిరుగు వానిని బ్రహ్మనిష్ఠుడని దేవతలు చెప్పుదురు

*బ్రహ్మవిజ్ఞాన లాభాయ పరహంస సమాహ్వయః ।*
*శాంతిదాంత్యాదిభిః సర్వైస్సాధనై స్సహితో భవేత్ ॥*

బ్రహ్మజ్ఞానియగు పురుషుడు హంసకు పరమగు పరమాత్మను బొందుట కొఱకు శాంతి, దాంతి, మొదలగు సద్గుణములు గలవాడై యుండవలయునని స్మృతి వచనముయొక్క తాత్పర్యము ఆత్మలో సదా రమించువారు జ్ఞానులనియు, అనాత్మవస్తువు లగు నింద్రియార్థములయందు రమించు వారజ్ఞానులనియు గ్రహింప వలయును అయితే మిక్కిలి శీతల ప్రదేశములగు హిమాలయాదులలో వలి నివారణకొఱకేదైన యుండ వలయును అవి యట్టి స్థలములలో నుండువారికి మాత్రమే గావలయును'' అని ఇట్టి యమోఘములగు బోధనల బోధించుచుండిరి

## అంతరంగ సాధనఘట్టము

ఒక సంవత్సరకాలము పైజెప్పినవిధముగా గడపినపిమ్మట రెండవ సంవత్సరారంభమున నంతరంగసాధనలో ప్రవేశించిరి ముందు చెప్పిన దానిని దమమనియు, నిపుడారంభింపబోవునది శమ మనియు శాస్త్రము దెలుపుచున్నది సూర్యుడంతట బ్రకాశించుచుండినను ఏ పాత్ర చలింపదో దానిలో గల జలమున్ను శుద్ధముగానుండునో, దానియందు మాత్రమే సూర్య ప్రతిబింబము లెస్సగా నగప డును ఆలాగున బాహ్యేంద్రియనిగ్రహము పాత్రమువంటిదనియు, అంతరింద్రియ నిగ్రహము నిర్మలముగానుండు జలమువంటిదనియు, సర్వాంత ర్యామియగునీశ్వ రుడు సూర్యుని

వంటివాడనియు గ్రహించుకొనవలయును పాత్ర సువర్ణము మొదలు మట్టిపఱకుగల ఏ లోహముచే తయారైనదైనను, జలము గంగాతీర్థము మొదలు స్వగృహావరణమందలి నూతిలో నుండిన దైనను విరోధము లేదు నిశ్చలము గాను నిర్మలముగానునుండిన వారును అట్లున్నత జాతినుండి నిమ్నజాతివఱకు గలవారెవరైనను, లేక బ్రహ్మచర్యాది నాలుగా శ్రమములలో నుండువారైనను, లేకస్త్రీ పురుష నపుంసకులైనను విరోధము లేదు శమదమములు గలిగిన వారెవరైనను తనలోనుండు పరమాత్మను దర్శింపగలరు నీటి నన్నిటిని నాత్మలో దలంచి భారతీ దేవి యష్టాంగయోగ ముల నభ్యసింప బూనెను క్రమముగ నహింస మొద లగు పదిగుణములు గలిగిన యమమును, రెండవదియగు తపము మొదలగు పది గుణములుగల నియమమును, బాగుగా నభ్యసించిరి ఇవి యన్నియు నిదివరలోనే యలవడి యుండుటచే త్వరలోనే లభ్యమయ్యెను ఇవి రెండును రెండుపాదముల వంటివి వీటిలో ననుష్ఠానము లేనిచో పాదములు విఱిగిన మనుజునివలె వారాధ్యాత్మిక లోకములో సత్వరయాత్రలను జేయ జాలరు అవి యెవ్వియనగా -

*అహింసా సత్యమస్తేయం, బ్రహ్మచర్యం దయా ఋఋర్జవమ్ ।*
*క్షమా ధృతిర్మితాహార శ్శౌచం చేతి యమా దశ ॥*

1 అహింస, 2 సత్యము, 3 అస్తేయము, (దొంగిలింపకుండుట) 4 బ్రహ్మచర్యము, 5 దయ, 6 ఋజు ప్రవర్తన, (త్రికరణముల ఏకత్వప్రవృత్తి) 7 క్షమ, (ఓరిమి) 8 ధైర్యము, 9 మితాహారము, 10 శౌచము, (బాహ్యాభ్యంతర శుద్ధి) వీటికి యమమని పేరు

*తపస్సంతోష మాస్తిక్యం దాన మీశ్వర పూజనమ్ ।*
*సిద్ధాంతవాక్య శ్రవణం హ్రీర్మతిశ్చ జపో వ్రతమ్ ॥*

1 తపస్సు, 2 సంతోషము, 3 ఆస్తిక్యము, (గురు, వేద, దైవములందలి విశ్వాసము) 4 దానము, 5 ఈశ్వరపూజ, 6 సిద్ధాంత వాక్యశ్రవణము, (వేదాంత విచారణ) 7 హ్రీ, (అధర్మ మార్గమున ప్రవేశింప లజ్జ గలిగి

యుండుట) 8 మతి, (నిర్మలమగు బుద్ధి) 9 జపము, (ప్రణవాది మంత్ర పురశ్చరణము) 10 వ్రతము, (తన బ్రహ్మచర్యాది వ్రతమును ప్రాణాంతమువఱకు సంరక్షించుట) ఇని యన్నియు చేరి నియమ మనంబడును ఇవి రెండును రెండు నేత్రములవంటివి

వీటిని బాగుగ నభ్యసించిన తరువాత మూడవదియగు నాసనములో 1 సిద్ధాసనము, 2 పద్మాసనము, 3 బద్ధపద్మాసనము 4 సర్వాంగాసనము, 5 పశ్చిమోత్తనాసనము, 6 కపాలాసనము, మొదలగువాటిని గూడ నభ్యసించెను ఉపవాసవ్రతములచేతను, ఇదివరలోనే కొంత ప్రాణాయామము నభ్యసించి యుండుటచేతను, ఈ ఆసనము లన్నియు కష్టము లేకనే సిద్ధించెను వీటివలన నరములకును, దేహమునకును మంచి దృఢత్వమేర్పడును ముఖ్యముగా పురుషులకు బ్రహ్మచర్య శుద్ధియు, స్త్రీలకు రక్త నిర్మలత్వమును గలుగును వీటి నభ్యసింపనిచో ప్రాణాయామము ననుష్ఠింప శక్తి యుండదు బాయిలరు దృఢముగా నుండనిచో నావిరి యెక్కిన ఏ విధము గానది శిథిలమగునో, ఆ విధముగ యోగికి ఆసనాద్యభ్యాసములచే శరీరదార్ఢ్యము లేనిచో రోగములు గలిగి యోగ విఘ్నములు తటస్థించును కనుక దీనిని లెస్సగ నలవరచుకొనెను

నాల్గవది ప్రాణాయామము దీనిని కూడ పూర్వము కొంత యభ్యసించి యుండుట బట్టి కష్టమేమియు నుండ లేదు ఇది మొదట నాలుగు మాత్రల కాలము పూరించి, 16 మాత్రల కాలము కుంభించి, ఎనిమిది మాత్రలకా లము యోగశాస్త్ర ప్రకారము రేచించుచు నభ్యసించిరి ఈ మూడింటిలోను ప్రణవ మును పరబ్రహ్మబావముతో భావన జేసి తరువాత ప్రాణమును, ప్రణవమును, మనస్సును, నేకముచేసి కేవల కుంభకమందు చాలసేపుండెడివారు ఈలాగున క్రమక్రమముగ నభ్యాసమును బెంపొందించుచు 16 మాత్రల కాలము మాత్రము పూరించి 64 మాత్రల కాలము కుంభించి 32 మాత్రలకాలము రేచింప శక్తి గలవారైరి పాషాణాది విషవస్తువులు స్ఫుటము వల్లశుద్ధియగునట్లు ప్రాణాయామముచే మనస్సుయొక్కయు, నింద్రియముల యొక్కయు, దేహము యొక్కయు విషయ దోషము లన్నియు నశించును

*దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః ।*
*తథేంద్రియాణాం దహ్యంతే దోషాః ప్రాణస్య నిగ్రహాత్ ॥*

ప్రాణయామానంతరమొకించుక శవాసనములో నుండుటయు, శరీరమునకు వేడి కనుపించునపు డంతయు శీతల ముద్రాభ్యాసమును వేయుచుండిరి ప్రాణా యామాభ్యాసము కొంత లేనిచో మనస్సు ఎక్కువ కాలము ధ్యానములో నిలువశక్తి గలిగి యుండదు గాలి క్షయించిన గ్యాసులైటువలె, ధ్యానమందు నిరూఢత్వము లేనిచో, జ్ఞేయజ్యోతి ఆరిపోవును ఇట్టి యభ్యాస మొక సంవత్సరము జరుగునప్పటికి భారతీదేవిగారి శరీరము చాల సన్నగిల్లెను కాని యుత్సాహము, తీక్ష్ణమైన బుద్ధి, శక్తి, శుద్ధప్రజ్ఞ, మఱింత ప్రకాశము నొందెనే కాని యేమియు తగ్గి పోలేదు ఈ శరీరకృశత్వమును జూచి తల్లిగారు, మహిళా గీతా పఠన సంఘము వారును, చాల దుఃఖించినవారై యికమీద రాత్రులలో కొంచెము గోక్షీరము నుపయోగించునట్లు ప్రార్థింపగా భారతీదేవి వారికిట్లు వచించెను

''యోగనిష్ఠగలవారికి పాలు ద్రాగుట మంచిదైనను, నదియు పరాధీనమే అంతేగాక గోవు బాగుగా నుండవలయును దూడకు కావలసిన పాలు నీయవలయును లేనిచో నట్టి పాలు ద్రాగుట మంచిది కానేరదు పాలొకటి మాత్రమే కాదు ఆహారము గూడ శుద్ధముగాను, ధర్మవిరుద్ధము కానిది గాను నుండవలయును అధర్మమునకు ఫలము దుఃఖము ధర్మముయొక్క ఫలము సుఖస్వరూపము కావున ఆరోగ్యమని తలంచి కొందఱు ధర్మము నాలోచింపక కొన్ని వస్తువుల బ్రత్యేకముగా భుజింతురు వారికి రోగమును, విషయదోషమును వర్ధిల్లును మనోనిర్మలతయు, ఆరోగ్యమును గలుగదు'' అని పలికిరి ఈ మాటలవినిన తోడనే తల్లియగు రామేశ్వరమ్మగారు కంట నీరిడి బిడ్డను జూచి, ''తల్లీ! మనకేమి కొఱతగలదు? సర్వేశ్వరుని కృపచే నెన్నియో యావులు పాలిచ్చు చున్నవి ఎందరో తల్లులు లేని పిల్లలకును, తల్లులుండియు పాలులేనివారి బిడ్డలకును, మీ తండ్రిగారు పాలుచితముగా నొసంగు లాగున ఏర్పాటు జేసియున్నారు ఈ విషయమై నీ కటువంటి సందేహ ముండిన నీ పాలకొఱ

కుపయోగపరచెడు ఆవును, దూడను ప్రతిరోజు నీకు దెచ్చి చూపునట్లే ర్పాటు చేసెదము దానిని చక్కగా పోషించుటకును, శుభ్రముగా స్నానము చేయించుటకు నొక పనివానిని బ్రత్యేకముగా నుంచెదము నీ యొక్క కృశించిన దేహమును మే మెట్లు చూడగలము?' అని తల్లి చెప్పినటినుండి రాత్రి కొంచము క్షీరమును స్వీకరించుచుండిరి ఈ ప్రాణాయామముతో సహ, యమాది నాల్గంగ ములును, యోగమునకు బహిరంగములు

ఇక అంతరంగమగు ప్రత్యాహారములో ప్రవేశింప భారతీదేవిగారికి ప్రీతి గలిగెను దీనికే యుపరతి యని గూడ బేరు గలదు 12 ప్రాణా యామముల కాలము ఒక ప్రత్యాహారమనియు, 12 ప్రత్యాహారముల కాలము ఒక ధారణ యనియు, 12 ధారణల కాలము ఒక ధ్యానమనియు, 12 ధ్యానముల కాలము ఒక సమాధి యనియు దెలిసిన వారగుటచే మఱల ధారణా ధ్యానములలో నెక్కువ కాలము గడుపనెంచిరి కొలిమిలో నుంచి తిత్తిచే నూదబడు లోహ మేరీతిగ కరిగి తుప్పు లేక పోవునో, ఆ రీతిగ బ్రహ్మభావనతో జేసెడు ప్రాణా యామముచే భారతీదేవియొక్క యంతరింద్రియము లన్నియు, జన్మాంతర సంస్కార ములన్నియు మనస్సున్ను కరిగి మాలిన్యరహితములై శుద్ధములైనవి ప్రత్యాహారము సిద్ధించిన దృశ్యవిషయములనుండి మనస్సెల్లపుడు నంతర్ముఖముగానే యుండును ఇంద్రియములన్నియు వశములై యుండును విషయదోషములు లేకుండును ధారణయందు పర్వతము వాయువు వల్ల చలించనట్లు మనస్సు చలన రహితమై పోవును తరువాత, ధ్యానమం దెడతెగని తైల ధారవలె శివజీవైక్య సంధానము త్రెంపు లేక నెల్లపుడును గలిగియుండును అంతేగాక యర్చకుని ముందట నుండు విగ్రహమువలె నడ్డులేక దైవభావము గలిగియుండును మఱియును మేఘావరణ శూన్యుడగు సూర్యునివలె తనయొక్క స్వరూపమగు నాత్మ, హృదయాకాశమున ప్రకాశించుచుండును ఇంటిలోగల మనుజుడింటికి విలక్షణుడై యుండునట్లు దేహేంద్రి యములకు తాను సాక్షిగా నుంటున్నట్లు బోధ గలుగును నిర్మలమగు బల్బులోపల వెలుగుచుండెడు విద్యుద్దీపమువలె నాత్మ స్వచ్ఛమై దేహత్రయ విలక్షణముగా నున్నట్టి యనుభవము గలుగును సమాధి యను సౌధమునకు, యమాది

ప్రాణాయామ పర్యంతముగల నాలుగంగములును చేరి యొక స్తంభమగును ప్రత్యాహారము మొదలు ధ్యానమువఱకుగల మూడంగములును మూడు స్తంభములగును ఏ స్తంభము సరిగా లేకుండినను సౌధమేవిధముగ నిలువజాలదో, పై జెప్పిన నాలుగును లేనివారి సమాధియును, సుస్థిరత్వము నొందజాలదు

ఈ యోగసాధనలో మూడు సంవత్సరములు గడచెను ఇప్పటి కాశ్రమము బ్రవేశించి 6 సంవత్సరము లైనవి భారతి ధ్యానమునకు కేలాటి ప్రతిబంధములుగాని, ప్రయాసగాని లేకయే రాగలిగెను కాని పరమాత్మైక్యమగు సమాధిలోని కెంత ప్రయత్నించినను నెళ్లజాలకపోయిరి దూరమునుండి యతివేగముగ ప్రవహించుచు వచ్చెడు నది, సముద్రము లోనికి వెళ్ళునపుడు ముఖద్వారమున నడ్డగింపబడినట్లు తన ప్రయత్నము నెంత తీవ్రముగ జేసినను నైక్యము గలుగక యుత్థానదశ యందాత్మ బహిర్ముఖముగానే వచ్చుచుండెను ధ్యానములో నెంతకాలముండినను వృత్తులుగాని, సంకల్పములు గాని యేమాత్ర ముండలేదు గాలిలేని స్థలములో నుండు దీపమువలె ధ్యానమున దైవములోగాని, యాత్మభావములోగాని, నుండుటకేమాత్రము ప్రయాసయుండ లేదు ధ్యాన మందుండునపుడును, ధ్యానములేనపుడు నొకేవిధముగానే తురీయ పదములోను, నిరతిశయానంద పరమసుఖములోను పరమశాంతిలోను మనస్సు నిలిచి యుండెను ఇంద్రియములన్నియు నిప్పులో వేసిన విత్తనములవలె విషయాంకురములు లేనివియై యుండెను శరత్కాలపూర్ణిమ నాటి చంద్రునివలె హృదయాకాశమున ప్రశాంతాత్మ ప్రసన్నముగ నెల్లపుడు బ్రకాశించుచుండెను వ్యష్టి శరీరమునకు సాక్షిత్వము సిద్ధించెను అనగా నండపిండముల భేదము గలిగెను బ్రహ్మాండభేదము గలిగి యుండలేదు అనగా చరాచర వస్తువులలో వెలుగుచుండు పరమాత్మ తనలో గూడ వ్యాపించి యున్నట్లు గూడ ఒక్కొక్కపుడు గాఢధ్యానములో గోచరించుచుండెను కాని యదెల్లప్పుడు నిలువకుండెను అయ్యది ధ్యానములో నుండినను యుత్థాన దశలో సదా సంపూర్ణముగా నుండుట లేదు ధ్యానములో పంచకోశ విలక్షణమై తానున్నట్లును, ఈశ్వరుడు చరాచరవస్తువులలో వ్యాపించియున్నట్లును, దర్శనమగుటయే సమాధియని

కొందఱు పెద్దలను విచారింపగా వారు చెప్పినను భారతీ దేవిగారి కది సమ్మతముగా లేదు. ఏలయన, సముద్రములో చేరిన నదులన్నియు నొక సముద్ర జలముగానే యుండునుగాని వేఱు వేఱు నదులుగా నెట్లు గోచరించును? నీటిలో గరగిన యుప్పురీతిగా జలమయముగా గనుపించునో, యుప్పుకల్లుగా నేలాగున వేఱుగా నుండదో, లవణఖండముండిన యది బాగుగా కరగ లేదని యెట్లు తెలిసికొన వచ్చునో, యారీతిగా నైక్యము గలిగిన యెడల నీశ్వరుడు వేఱు, జీవుడు వేఱని యుండకూడదని భారతీదేవి గారికి సందేహము గలిగెను.

ఒక రోజున అగాధ ధ్యానములో నుండగా యోగశాస్త్ర మీశ్వరుని, ప్రకృతిని, జీవుని, వేఱు వేఱుగా జెప్పునట్లును, ప్రకృతి బంధనమునుండియు, ప్రకృతిసంబంధమగు త్రిగుణములనుండియు, విడుదలబొందుటయు, నిరతిశయా నందము గలుగుటయు మోక్షమని యోగులును, శైవులును, వైష్ణవాది ఉపాసకులగు పరమభక్తులును చెప్పుదురని బోధ గలిగెను. ''ఈ స్థితియంతయు నాకిప్పటికి గలిగెను. కానియద్వైత శాస్త్రమగు వేదాన్తమనబడు ఉపనిషత్తులలో బ్రహ్మానందైక్యమును, దృశ్యము గూడ దృక్కగు నాత్మకు నన్యముగాదనియు, దృగ్దృశ్య దర్శనముల యేకత్వమే ముక్తియని దెలియబడుచున్నది. ఆ రీతిగ ధ్యాతయు, ధ్యానమును, ధ్యేయమును, నేకత్వము నొందుటయే త్రిపుటిరహితమ నియు దెలుపుమండగా, నిపుడు గలిగియుండు యనుభవము వలననెట్లు తృప్తి నొందగలను? సూర్యోద యమున తన నీడ గొప్పదిగా గనుపించినను సూర్యుడు పైకెక్కి రాగారాగా నీడయు తగ్గుచు మధ్యాహ్నమున లేకయే పోవును గదా! అట్లు ధ్యానముచే ధ్యేయాకారస్థితి గలుగునపుడు దృశ్యముండకూడదు గదా! కొలిమిలో ననేక లోహఖండముల బెట్టి యూదిన నన్నియు నొకే యగ్నిమయమై కానుపించును, కాని వేరు వేరుగ కనబడవు గదా! ఈశ్వరకృపవల్లను నిదివఱలోగల గురుకరుణవల్లను ఇంతవఱకు నేవిఘ్నములు గాని, సందేహములుగాని గలుగక ధ్యానము వఱకు సంతోషముగ వచ్చితిని. యోగశాస్త్రములో జెప్పిన సమాధి యును, ఉపాసనామార్గములో దెలిపిన జీవ న్ముక్తియు లభించినది. ఏలాటి సందేహ మును లేదు. అట్టి శాస్త్రములు గూడ నదే విధముగ దెలుపుచున్నవి

శ్రీ పాతంజలి యోగశాస్త్రముగూడ నిరావరణమై యుండు శుద్ధాత్మయే తాననియు, త్రిగుణము లనుండి విడుదల బొందుటయే మోక్షమనియు దెలుపుచున్నది కాని నాకు మంత్ర మును, యోగవిధులనునుపదే శించిన యాచార్యుడీవిషయమై యేమియు దెలిపి యుండలేదు నేనును తరువాత వారికికనుపించి యావిషయము నడిగియుండలేదు మఱియు సహంగిరోపాసన ప్రకారమును, సోహంభావన ప్రకార మును, హంసభావన యును ననుష్ఠానములో నాకు గలిగినది ఎల్లప్పుడు సోహం'హంసోఽహం', 'శివోఽ హం ' అను భావనయు లభించినది పామరులు దేహమే తానని దృఢముగా దలచి యుండునట్లు 'సోఽహ' మను భావనయే నేనను భావము దృఢముగా కలిగెను

అయితే దేహేంద్రియాదులకును, దృశ్యమునకును, సాక్షిగా నాత్మ యున్న దని యనుభవము గలుగుచున్నది కాని దేహేంద్రియ దృశ్యములు గూడ నేకమగు బ్రహ్మమను జ్ఞానము గలుగలేదు తన కనుభవములేని మహిమను జెప్ప బూనిన గలిగియుండు మహిమగూడ బోవునదేగాక గలుగబోవు మహిమయు గలుగకనే పోవును దృశ్యమునకు సాక్షియను జ్ఞానముతో తృప్తినొందుటయే ఇంద్రియవృత్తు లతో, నాత్మకు సంబంధము లేదను శుష్కవేదాంతము బయలు దేరుటకు కారణము ఈ భావము ముముక్షువులను చాల అధోగతికి దీసికొని వెళ్ళి విషయకూపములో బడ వేయును అంతేగా దట్టివారు విషయనివృత్తి గలుగు టకు గూడ ప్రయత్నింపరు ఇది సంసారరూప దుఃఖ సాగరము లోనికి దారి తీయునేగాని, సంసార సాగరమును దాటింప జాలదు మందబుద్ధియైనచో నింద్రియ విషయముల నన్నిటిలోను ప్రవర్తించుటకుగూడ సందేహింపడు ఇది యెంత యపాయకరమో యని యాలోచింప నాలోచింప నత్యంత భయము గలుగుచున్నది ఈభావముండిన శత్రు సమీపమున నివసించినట్లుండును దీనివల్లనెల్లప్పుడును భయమే గలుగుచుండును రాజునకైనను, రాజాధిరాజునకైనను కడకు చక్ర వర్తికైనను, దగ్గఱ శత్రురాజులుండిన నిర్భయత్వము గలుగని రీతిగ, యోగికై నను, మహాయోగికైనను యోగీశ్వరునకైనను లేక రాజయోగికైనను దృశ్యము లుండువఱకు భయము తప్పక గలుగును అపాయమున్ను, పతనమున్ను సిద్ధము భయముండువఱకు

మాయ వెంటనే యుండును కనుకనే విషయము జ్ఞాన విజ్ఞాననాశకమని గీతలో జెప్పబడినది

*తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।*
*పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥*

ఓ యర్జునుడా! ఏకారణమువలన కామము మోహపెట్టుచున్నదో ఆ కారణమువలన నీవు మొదట నింద్రియములను నిగ్రహించి, యాత్మజ్ఞానము అనుభవ జన్యజ్ఞానమును నశింపజేయునదియు నగు నీకామమును లెస్సగా విడువుము

యోగులుకాని, జ్ఞానులుకాని, పరమభక్తులుకాని చెడియుండినచో దానికి దృశ్యము నశింపకుండుటయే కారణమైయుండును అటువంటి బోధ అపాయకరము కాబట్టి నేనింక ఏమిచేయవలయును? ఎంతో తీవ్ర ప్రయత్నముతో దృశ్యమును లయమొనరించెడు ధ్యానము జేసినను నా ప్రయత్నమంతయు రాతి కొండకు దగిలిన బాణమువలె ధ్యేయములోనికి జొరపడక, క్రిందకువిరిగి పడిపోవుచున్నది మఱియు రబ్బరు బంతిచే రాతి గోడను బలముగా కొట్టినచో వెనుకకు మఱలి పడిపోవునట్లు, ఎంత గాఢమైన ధ్యానము జేసినను ధ్యేయములో నైక్యము జెందక, ధ్యానము వెనుకకే మరలుచున్నది నదిలోని కతివేగముగా ప్రవహించెడు పెద్దకాలువల జలము, నదీముఖమున కట్టయుండిననెట్లు వెనుకకు మరలు చుండునో, అదేరీతిగ నా ధ్యానమంతయు, యోగమంతయు, భావనా శక్తి యంతయు నడ్డుదగిలి దృశ్యములోనికివచ్చి నిలచి పోవుచున్నది దిన దిన మీరీతిగ ధ్యానము పూర్తియయిన తరువాత నీ విషయమై విచారణలో నుండగా నిదివఱలో జదివియుండు సప్తవిధ గురువుల లక్షణము జ్ఞాపకమునకువచ్చి ఆ గురువుల లక్షణముల శోధించిన మన కుపదేశించిన యాచార్యుడు దేనిలో జేరినవారైనది దెలిసికొనవచ్చునని గురుగీతను జూడదొడంగిరి

*సూచకాది ప్రభేదేన గురవో బహుధా స్మృతాః ।*
*స్వయం సమ్యక్పరీక్ష్యాథ తత్త్వనిష్ఠం భజేత్సుధీః ॥*

సూచకుడు మొదలుగాగల భేదములచే గురువులు పలుతరగతులు గలరు

వానిని స్వయముగ తెన్నుగ పరిశోధించి, బుద్ధిమంతుడు యోగ్యతగల తత్త్వ నిష్ఠుడగు గురువును బొందవలయును

*వర్ణజాల మిదం తద్వద్బాహ్య శాస్త్రం తు లౌకికమ్ ।*
*యస్మిన్దేవి! సమభ్యస్తం స గురుః సూచకః స్మృతః ॥*

ఓ దేవీ! ఎవనివల్ల వర్ణసముదాయములు అనగా అక్షరసంఖ్యను నేర్చు కొందుమో, అలాగున లౌకికమైన బాహ్యశాస్త్రములను చక్కగా నభ్యసించుదుమో అట్టి గురువు సూచకగురువనంబడును

*వర్ణాశ్రమోచితాం విద్యాం ధర్మాధర్మ విధాయినీమ్ ।*
*ప్రవక్తారం గురుం విద్ధి వాచకం త్వితి పార్వతి! ॥*

ఓ పార్వతీ! వర్ణాశ్రమమునకు సంబంధించినవియు, ధర్మాధర్మములను వివేచనము జేయునవియు నగు విద్యలను నేర్పెడి గురువు వాచకగురువనంబడును

*పంచాక్షర్యాది మంత్రాణా ముపదేష్టా తు పార్వతి! ।*
*స గురుర్బోధకో భూయా దుభయోరయ ముత్తమః ॥*

ఓ పార్వతీ! పంచాక్షరము, షడక్షరము, అష్టాక్షరము, ద్వాదశాక్షరము, షోడశాక్షరము, మొదలగు మంత్రములను మాత్రముపదేశించెడు గురువు బోధకు డనంబడును పైజెప్పిన యుభయులకన్న నీరు శ్రేష్ఠులు యోగానుష్ఠానము దీనియం దంతర్భూతము

**మోహమారణ వశ్యాది తుచ్ఛ మంత్రోపదేశినమ్ ।**
**నిషిద్ధ గురు రిత్యాహుః పండితా స్తత్త్వదర్శినః ॥**

ఓ దేవీ! మోహము, మారణము, వశ్యము మొదలైన తుచ్ఛములగు క్షుద్ర మంత్రముల నుపదేశించెడుగురువును నిషిద్ధ గురువని తత్త్వజ్ఞానులైన పండితులు దలంతురు

*అనిత్య మితి నిర్దేశ్య సంసారం సంకటాలయమ్ ।*
*వైరాగ్య పదదర్శీ యః స గురుర్విహితః ప్రియే ॥*

ప్రియమ్మైన దేవీ! సంకటము లన్నిటికిని స్థానమ్మైన సంసారమనిత్యమని శ్రుతి యుక్త్యనుభవములచే నిరూపించి వైరాగ్య పదవిని బోధించెడు గురుడు విహిత గురువనబడును

*తత్త్వమస్యాదివాక్యానా ముపదేష్టా తు పార్వతి ।*
*కారణాఖ్యో గురుః ప్రోక్తో భవరోగనివారకః ॥*

ఓ పార్వతీ! 'తత్త్వమసి' మొదలైన వాక్యముల నుపదేశించువారును, భవరోగమును దొలగించువారునునగు గురువు కారణగురువని చెప్పబడును

*సర్వసందేహ సందోహ నిర్మూలన విచక్షణః ।*
*జన్మమృత్యు భయఘ్నో యః స గురుః పరమో మతః ॥*

ఓ పార్వతీ! సంశయము లన్నిటిని సమూలముగ నివృత్తి చేయుటలో సమర్థులును, జనన మరణ భయమును దొలగించువారునునగు గురువే పరమ గురువని ఋషులు దలంతురు

ఇచట గురువుల పేర్లు దెలిసికొనుటకు ప్రత్యేకముగ దెలిపెద

1 సూచకగురువు, 2 వాచకగురువు, 3 బోధకగురువు, 4 నిషిద్ధగురువు, 5 విహితగురువు, 6 కారణగురువు, 7 పరమగురువు, మూడవమెట్టులోనుండు బోధకుడగు గురువు తన యాచార్యునిగా దలంచి మూడవమెట్టునే తన కుప దేశించె నని నిశ్చయించుకొనెను ఇక 6,7 తరగతులలోగల కారణగురువు యొక్కయు, పరమగురువుయొక్కయు నుపదేశము తనకు గలుగలేదు అయినను నిదివఱలో నుపదేశించిన గురువరుని కృపవల్లనే యిట్టి యున్నతస్థితికి రాగలిగితిని వారిని దర్శించి చాలాకాలమ్మైనది అయినను నాకు గలిగియుండు ఈ సందేహము రెండవ వారి కెవరికిని దెలుపకూడదని నిశ్చయించుకొని యోగశాస్త్రముయొక్క తత్త్వ మును మఱియొకసారి తెలియ దలంచి పాతంజలి యోగదర్శనమును జూడ నిశ్చ యించుకొనిరి పాతంజల యోగశాస్త్రము

'స్వవిషయాసంప్రయోగే చిత్త స్వరూపానుకార ఇవేన్ద్రియాణాం ప్రత్యాహారః'

ఇంద్రియములను తమ తమ విషయములందు బోనీక, నిర్మలమగు నాత్మ ధ్యానమునందు (శ్రవణ జనిత స్వరూపజ్ఞానమందుగాని, లేక ఈశ్వరుని యందు గాని) నిలుపుటయు, లేక ఇంద్రియములను తమ తమ స్థానమున నిల్పుటయే ప్రత్యాహారము

'దేశబన్ధ శ్చిత్తస్య ధారణా'

భ్రూమధ్యాది చక్రములందుగాని, యీశ్వరునియందుగాని, ఆత్మయందు గాని చిత్తమును స్థిరముగ చలింపక నిలుపుటయే ధారణ యనబడును

'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్'

ధారణ స్థలమునందు జ్ఞానముయొక్క ధ్యానేతర వస్తువులను చిత్తము నందు రానీయక చేయుటయే ధ్యానమనబడుచున్నది

'తదేవాత్మ మాత్రనిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః'

ముందు చెప్పిన ధ్యానము ధ్యానించు వస్తువులయొక్క స్వరూపమై ఆ ధ్యానము లేకుండుటయే సమాధి యనబడును అనగా ధ్యానము ధ్యానించు వస్తువులయొక్క స్వరూపములుగా పరిణమించి, నేను ధ్యానించుచున్నానను భావముగూడ లేకుండుటయే సమాధి

పరమేశ్వరుని కరుణవల్ల నిట్టి స్థితియు నాకు గలిగినది బీజము వృక్షాకారము బొందునపుడు బీజరూపము శూన్యమైనట్లును, కీటకము భ్రమరమును ధ్యానించి ధ్యానించి భ్రమరమగునట్లును, కర్పూర మగ్నిలో జ్యోతియై మారునట్లును, స్వరూప స్థితి మాత్రము గలిగియుండుటయే జ్ఞేయమనియు, యోగశాస్త్ర ప్రకారము సమాధి యనియు నిపుడు

తెలిసినది నాకు గలిగిన సందేహమిది కాదు

దృశ్య విలయము గలుగక పోవుటయే నాకు గలిగిన సందేహము ఇక నీ విషయమై మఱియు కొన్ని యోగశాస్త్రముల బరికించెద

*బ్రహ్మాకార మనోవృత్తి ప్రవాహోఽహంకృతిం వినా ।*
*సంప్రజ్ఞాత సమాధిస్స్యాద్ధ్యానాభ్యాస ప్రకర్షతః ॥*

అహంకారము లేక నిరంతరమును శ్రేష్ఠమైన ధ్యానాభ్యాసముచేత, బ్రహ్మాకారము నొందిన మనోవృత్తి ప్రవాహమేదియో, అదియే సంప్రజ్ఞాత సమాధి యగు చున్నది

*ప్రశాంతవృత్తికం చిత్తం పరమానంద దీపకమ్ ।*
*అసంప్రజ్ఞాతనామాఽయం సమాధి ర్యోగినాం ప్రియః ॥*

ఎవని మనస్సు వృత్తిరహితమై బ్రహ్మానందమును బ్రకాశింపజేయునది యగుచున్నదో, యపుడా సమాధి యోగనిష్ఠులకు ప్రియమైన యసంప్రజ్ఞాత సమాధి యగుచున్నది

*ధ్యాతృధ్యానే పరిత్యజ్య నివాతస్థిత దీపవత్ ।*
*ధ్యేయైక గోచరం చిత్తం సమాధిరభిధీయతే ॥*

ధ్యానము ధ్యాత యను వృత్తిలేక ధ్యేయమైన బ్రహ్మస్వరూప మొందిన చిత్తమే సమాధి భ్రమర కీటక న్యాయమున ధ్యానింపగా, ధ్యాతయే ధ్యేయాకారమగు బ్రహ్మాకారమొందును అదియే సమాధి యనబడును

*సరూపోఽసౌ మనోనాశో జీవన్ముక్తస్య విద్యతే ।*
*నిదాఘారూపనాశస్తు వర్తతే దేహముక్తికే ॥*

సరూప నాశమనియు, అరూప నాశమనియు, మనోనాశము రెండువిధములు మొదటిది జీవన్ముక్తునకుండును రెడవది విదేహముక్తి యందుండును వేయించబడిన విత్తనము రూపముతోనున్నను వృక్షమునకు కారణముగా నట్లు

మనస్సున్నను వృత్తిలేనందున సంసారమునకు హేతువు గాకుండుటచే సరూప నాశ మనబడును కర్పూర దీప నాశనమువలె వృత్తియును, రూపమును నశించుటచే అరూప నాశమగును

*నైతజ్జాగ్రన్నవ స్వప్నం సంకల్పానామభావనాత్ ।*
*సుషుప్తి భావో నాప్యేత దభావాజ్జడతాస్థితేః ॥*

సమాధియందు దృశ్యము స్ఫురింపనందున నిది జాగ్రదవస్థ కాదు బ్రహ్మాకారముగా మనస్సు పరిణమించుటచే నితర సంకల్పములు లేనందున సమాధి స్వప్నావస్థయు కాదు జడత్వము లేనందుచేత సుషుప్త్యవస్థయు గాదు ఇది కేవల తురీ యమైన జాగ్రత్స్వప్న సుషుప్తి మూర్ఛాద్యవస్థలకు విలక్షణమై యున్నది

*సత్త్వావబోధ ఏవాసౌ వాసనాతృణపావకః ।*
*ప్రోక్తస్సమాధి శబ్దేన న తు తూష్ణీమవస్థితిః ॥*

అసత్యములైన జగజ్జీవేశ్వరాది భేదములను నిరసించి సత్యమైన బ్రహ్మ జ్ఞానము నెఱుగుట సత్త్వావభోధము సత్త్వమనగా సద్ధర్మము తానే బ్రహ్మమని యితర మెద్దియు లేదని యెఱుగుట యనెడు నీసత్త్వావబోధము సమాధి యగును ఇది సమస్త వాసనలనెడు తృణములకు బ్రజ్వలితమైన అగ్నివంటిదగుటచేత, వాసనలను శుష్క తృణములను నశింపజేయును ఆలస్యము మూర్ఛ మొదలైన వాటివలన నూరకయుండుట సమాధి కాదు శరీరమును మఱచుట సమాధి కాదు కర్తృత్వాభి మానములేక తానే బ్రహ్మమని నిశ్చయించుట సమాధి యగును

*నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః ।*
*వృత్తివిస్మరణం సమ్య క్సమాధి రభిధీయతే ॥*

చిత్తమును బ్రహ్మధ్యానమున బ్రహ్మాకారముగను నిర్వికారముగను జేసి మఱల చిత్తవృత్తులను గలుగనీయకుండుట సమాధి యని చెప్పబడును

ఇపుడు వివరించిన యోగము చాల పావనమైనది అట్టి బ్రహ్మాత్మైక్యత్వబోధ యింకను పూర్తిగ గలుగలేదు కాన ఈ సందేహము మంత్రోపదేష్టయగు గురుని వలన నివృత్తి యగుననని దలచి తండ్రిగారిని బిలిపించి ''మంత్రోపదేశము జేసినగురు వర్యుని దర్శనము జేయవలయును ఉపదేశమైన తర్వాత వారిని దర్శింప లేదు వారిని తగిన వాహనములో భజన, మంగళమేళములతో దీసికొని రావలయును గురుభక్తి లేనివారి మోక్షమార్గగమనము, చుక్కానిలేని పడవయందలి ప్రయాణ చందమ్ముగ నుండును అదియు మా గీతాపారాయణకాలములోనే దీసికొని రావలయును వారు మహాత్ములగుటచే మన ఘోషాసాంప్రదాయము వారికి నవసరము లేదు గీతాపారాయణ చేయు విమలమతులగు నారీమణు లుండవచ్చునని భారతీదేవి దెలిపెను

అంతట తండ్రి గారికి మహాసంతోషము గలిగి తనకు ముఖ్యులగు నిద్దరు పార్థివవరులతో తన పుత్రికదెలిపిన వాక్యములను జెప్పి 'గురువుగారెప్పుడు దయ చేయుటకు సమయముండునో దెలిసి కొనిరం' డని యాచార్య మందిరమునకు బంపెను వెంటనే యాక్షితీశులిరువురును గురువుగారి సదనమునకేగి నమస్కరించి రామచంద్ర నరేంద్రుడు చెప్పిన వాక్యములను సవినయముగా నాచార్య సన్నిధిలో విన్నవించిరి దానిని విని వంశాచార్యులు చాల ముదంబంది రేపటి దినము శుక్లపక్ష పంచమి సోమవారముగా నున్నది కావున రేపే ప్రయాణమొనర్పదగునని చెప్పి పంపిరి పిమ్మట నా వాక్యములను క్షితీశులు నరేంద్రునకు దెలుపగా రామచ్రంద్రనరేంద్రగారు విఖ్యాతులగు నలుగుర మహీపాలకుల నాహ్వానించి, రేపటి ఆచార్యుల ఆహ్వాన విషయము చెప్పగా వారును మిక్కిలి సంతసించిరి మఱియు భజన సంఘమువారిని, మంగళమేళము వారిని, పల్లకీ వాహకులను నుదయముననే వచ్చులాగున నేర్పాటు గావించుమని, తమ గుమాస్తాలలో ముఖ్యుని కొకని కాజ్ఞాపించిరి కావలసిన ఫలపుష్పముల గూడ సేకరించులాగున ఆజ్ఞాపించిరి అదే రీతిగ గుమాస్తా యంద ఱికిని దెలుపగా భజనసంఘమువారు ప్రాతఃకాలముననే స్నానమొనర్చి తిలకమును ధరించి వచ్చిరి మేళము వారును, పల్లకీవాహకులును జెప్పిన సమయమునకన్న కొంతముందుగానే

వచ్చిరి రామ చంద్రనరేంద్రుడును ముఖ్యులగు ముప్పురు రాజన్యులును భజనమేళములతోను, పల్లకీ వాహకులతో గలసి పాదచారులై కుల గురువులయొక్క యాశ్రమమునకు వెళ్ళి యాచార్యుని పాదసన్నిధిని భక్తితో ముందుగ రామచంద్రనరేంద్రుడు పుష్పమాలను సమర్పించి సాష్టాంగముగ నమస్కరించెను తరువాత ఫలముల దీసికొని తమతో గూడ వచ్చియుండు భూభృత్తులును, భజన సంఘమువారును నందఱును ప్రణామ మొనర్చిరి అంతట నాచార్యులు ముందుగా రామచంద్రనరేంద్రునితో కుశలప్రశ్నల జేసి కూర్చుండపలికిరి అట్టి సమయమున శ్రీ వసిష్ఠ మునీంద్రుని దశరథ రాజధాని లోనికి నాహ్వానించుటకు వెళ్ళియుండిన రాజులును, పరివారమును వసిష్ఠుని ముందు శోభిల్లినట్లు చూపరులకు దోచెను

దేశికేంద్రు డందఱి నాశీర్వదించి గౌరవముగా సత్కారమొనర్చి ప్రయాణము నకు సిద్ధమై వాహనారూఢులైరి అపుడు మంగళవాద్యము లుద్ఘోషించినవి జయధ్వనులు మారుమ్రోగినవి రామచంద్ర నరేంద్రుడు మొదలైన వారెల్లరు భజన మేళము లతో గూడ కాలినడకతో నేతెంచుచుండిరి ఆ సమయమున భారతీదేవి, గురువు గారు వచ్చుచున్నారని విని శరదృతువులో మానససరోవరమున రాజహంసలు గుంపులు గుంపులుగా జేరి మృదుమధురముగ శబ్దించునట్లు, గీతాపరనశాలయం దంతటను రాజకన్యకలు, ఇతర నారీమణులు క్రిక్కిరిసి యుండి మృదుస్వరములతో దైవవిషయమై మాట్లాడుచుండిరి

అత్తరి యాచార్యాగమన సూచకములగు భజనమేళములు వినవచ్చినవి భారతీదేవిగారి యాశ్రమావరణద్వారములో పల్లకిని దింపిరి తరువాత నాచార్యుడు రాజవంశ ధర్మమెఱిగినవారగుటచే తమతో గూడనుండునొక బాలబ్రహ్మచారితో లోపల కరుదెంచిరి ఆచార్యు లరుదెంచుట గాంచి, స్త్రీలందరును, ముఖ్యముగా భారతీదేవియు లేచి యభిముఖులై గురుపాదసన్నిధికివెళ్ళి, ప్రథమమున భారతీ దేవి గురుపాదపద్మములపై బడి నమస్కరించి, యర్ఘ్యపాద్యాదులచే బూజించి, ముందుగా నమర్చియుండు ఉన్నతాసనముపై యాసీనుల నొనర్చెను పిదప నారీమణులందఱును,

విధిప్రకారముగ నమస్కరించిరి అత్తరి మహిళామండలిని శ్రీ బుద్ధదేవుడు ఆశీర్వదించినట్లు గురుదేవుడు గూడ నందరిని ననుగ్రహించి కూర్చుండుడని యాజ్ఞాపించెను లలనామణులందఱితోను గీతాపారాయణము చేయులాగున భారతీదేవి సంజ్ఞ జూపి చేతులు ముకుళించి గురుసన్నిధిలో నిలచెను దానిం గాంచిన పూర్వము దండకారణ్యమున గౌతమాశ్రమములో శ్రీరామ చంద్రుని పాదసన్నిధిని నిశ్చేష్టయై నిలిచిన శబరివలె నుండెను

భారతీదేవిగారి భక్తియును, తపస్సుచే గృశించిన శరీరమును జూచి గురువుగారు 'అమ్మాయీ! నీయొక్క మహిమ ననేకులద్వారా వినుచుంటిని ఇట్టి పుణ్యజీవి మా మఠమునకు శిష్యురాలుగా నుండుటయు గూడ మహాభాగ్యమని పలిచించి, గీతాపారాయణ ముపక్రమించులాగున' ఆజ్ఞాపించిరి ప్రప్రథమమున మూడు మారులు దీర్ఘముగ స్వరయుక్తముగ పరమాత్మభావముతో, ప్రణవము నుచ్చరించి, ధ్యాన శ్లోకముల జదివి, అంగన్యాస కరన్యాసముల నొనర్చి శ్రీరత్నమాంబగారు తొలుత గీత జెప్ప నారంభించిరి తక్కిన వేలకొలది సీమంతినులేకస్వరముతో జదువుచుండిరి దీనినంతయు నవలోకించి యాచార్యుడు విస్మయంబంది మొదట పఠించెడు వనితామణి యెవతె యని యడుగగా, భారతీదేవి యిచట ఆశ్రమములో నుండి ధ్యాన తపస్సుల ననుష్ఠించువారని మనవి చేసెను అపుడు దేశికుడు మా బ్రాహ్మణులలో గూడ నీలాగున స్పష్టముగ స్వరము నుచ్చరించు వారుండిన నింత ప్రశాంతత, భక్తియు గలవార రరుదని వచించెను పిమ్మట గురువర్యులు పారాయణ కాలములో నచ్చటచ్చట ముఖ్యశ్లోకములకు తాత్పర్యము చెప్పుచుండిరి మహిళామణులారా! గీత వేదముయొక్క సారము సృష్ట్యారంభమునందు శ్రీమన్నారాయణ మూర్తి సూర్యభగవానున కుపదేశించెను సూర్యుడు తన పుత్రుడగు మనుమహర్షి కిని, మనువు ఇక్ష్వాకు మొదలగు రారాజులకు నుపదేశించెను

*ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్ ।*
*వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ గీత అ 4 శ్లో - 1*

దీని యర్థము పైన జెప్పబడినది

*ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః ।*
*స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥ గీత అ 4 శ్లో - 2*

అర్జునా! రాజశ్రేష్ఠులగు నిమి చక్రవర్తి మొదలగువా రీవిధమున బరంపరగా బొందబడిన యీ యోగము నెఱుగుదురు అటువంటి యోగము దీర్ఘకాల మగుటచే నిపుడు నశించినది మఱలనిపుడు పునరుద్ధరణ యోగ్యమగు పుణ్యకాలము వచ్చినదని మీ యందఱి గీతాపారాయణను జూచి దలంచుచున్నాను ఇది క్షత్రియుల దివ్యధనమనియే దలంపవలయును మఱియు శ్రీ వైకుంఠమునందు శ్రీ భూదేవి ప్రారబ్ధ కర్మలచే తపించు జీవులకు తరణోపాయమేమని శ్రీ భగవంతుని ప్రశ్నింపగా నీ గీతాపారాయణయే పరమగతియని యుపదేశించిరి మఱియు నిదంతయు మీకెవరు నేర్పిరని' నారీమణుల నడుగగా ' భారతీదేవిగారు' మాకు నేర్పిరని వారు సవినయముగ మనవి చేసిరి అద్దానిని విని యాచార్యుడు కొంచెము సేపు మౌనముగ నుండి మఱల నిటు లుపదేశింప బ్రారంభించిరి

*ధరోవాచ - భగవన్పరమేశాన భక్తి రవ్యభిచారిణీ ।*
*ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే! ప్రభో! ॥*

ఓ భగవంతుడా! అంతర్యామీ! ప్రభువా! ప్రారబ్ధము ననుభవించువానికి పరమేశ్వరునియం దఖండమైనభక్తి గలుగు టెట్లు?

*శ్రీవిష్ణురువాచ- ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।*
*స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥*

ఎవడు గీతాభ్యాసమునందు నిరతుడై యుండునో అతడు ప్రారబ్ధము ననుభవించుచుండినను 'కర్మలిప్తుడు' గానేరడు లోకమునం దతడే ముక్తుడు సుఖియు నతడే

*మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।*
*క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా ॥*

ఎవరైతే గీతాధ్యానమును జేయుదురో వారిని కమలపత్రమును నీరంటని

చందంబున మహాపాపాది పాపములు కొంచమైనను నంటవు

ఈలాగున జూచినను గీత ముఖ్యముగా స్త్రీరూపిణియగు భూదేవికి నుపదేశించినదగును వేదములన్నియు నే భగవంతుని గూర్చి వచించుచున్నవో యట్టి పురాణపురుషుడగు భగవంతుడే ఈ గీతనుపదేశించెను శ్రీ ఆదిశంకర భగవత్పాదులు గూడ నీ భగవద్గీతను ప్రస్థానత్రయమున నొకదానినిగా దీసికొని యున్నారు భారతీదేవీ! నీవు యధార్థముగ శ్రీ భారతి (సరస్వతి) వనియే చెప్పదగును- అని బోధించిరి తరువాత నీ యంగనామణు లందరెవరని యడుగగా, భారతి, యెక్కువగ క్షత్రియు లనియు, వీరిలో బ్రహ్మచారిణులు గూడ గలరనియు, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు గూడ చాలామంది గలరనియు జెప్పగా, వీరితో గలియక దగ్గఱ గూర్చొని యుండు వారెవరని ప్రశ్నింపగా, వా రాదియాంధ్ర వధూమణులని కొంచెము భయముతో భారతీదేవి దెలిపెను అపుడాచార్యుడు 'వీరు గూడ గీతా పారాయణ సలుపు దురా' యని యడుగ భారతీదేవి వీరిలో చాలమంది చదివిన వారు గలరు వీరిలోను కొందఱు బ్రహ్మచారిణులుగానే యున్నారు వీరందఱు అహింసా వ్రతము గలవారు శాకాహారులని చెప్పగా విని కొంతతడవు నిశ్చేష్టులై మౌనముగానుండి, యేదియో ఆలోచించి యిట్లు వచించిరి భగవద్దృష్టిలో కులము, గోత్రము గొప్పది కాదు గుణమే గొప్పది నవమాధ్యాయమున పాపయోనిలో జన్మించిన వారు గూడ గీతా పారాయణ చేసి పవిత్రులై ముక్తి నొందుచున్నారని శ్రీకృష్ణభగవాను డానతిచ్చిరని పలికిరి కాలము ననుసరించి యీపద్ధతికి గురువరుడు గూడ నానందించి నట్లందఱికిని దోచెను అంతవఱకు భారతీదేవికేగాక యందరికిని ఆచార్యుడేమి చెప్పునో యని భయముగ నుండెను కాని గురువుగారి విశాల భావగర్భిత వాక్యముల విని యందఱును శాంతినొంది సంతసించిరి మఱియు

*మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః ।*
*స్త్రియో వైశ్యాస్తథాశూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥గీత॥ అ 9 శ్లో-32*

ఓ యర్జునా! పాపయోని సంభూతులైన వారెవరు గలరో వారును, స్త్రీలును, వైశ్యులును, శూద్రులును నన్నాశ్రయించి సర్వోత్తమమగు గతిని (మోక్షమును)

పొందుచున్నారు అని గురువుగారు చెప్పుచుండు నప్పటికి భోజనకాలము సమీపించి నందుచే శాంతిపాఠము బఠించి, ఓంకార ధ్యానముతో పారాయణను పూర్తి జేసిరి అటు పిమ్మట నందఱును దెచ్చియుండు ఫలపుష్పాదులను గురుపాదములకు సమ ర్పింప బూనగా, శ్రీరత్నమాంబగా రాచార్యుని సన్నిధిలో నిలచి మానినీ మణులతో ''నమ్మలారా, తొందరపడక యొక్కొకరు నాలస్యము చేయక సమర్పించి సర్దుకొను డని చెప్పనాప్రకారమే మహిళామణు లందఱేలాటి తొందరలేకయు, కాలవిలంబనము జేయకయు ఫలపుష్పముల సమర్పించి వారి వారి స్థానములలో గూర్చుండిరి ఆచా ర్యుడు సమీపమునందుండు బ్రహ్మచారికి ఫలముల గొన్నిటిని మాత్రము దీసి పెట్టి తక్కినవన్నియు నందరికిని బంచిపెట్టులాగున ఆనతిచ్చెను బయటనుండు పురుషులకు గూడ ప్రసాదమిప్పించిరి అపుడు మఱియొకసారి ప్రణవోచ్చారణమొన ర్చుచు నందఱును పరమాత్మభావముతో ధ్యానము చేయుచు, చేష్టావివర్జితులై నిమీలిత నేత్రలై, నిరుద్ధచిత్తము గలవారై యుండుటజూచి 'వేదమూలమగు ప్రణవ ధ్యాన మీ యాదియాంధ్రవనితలు గూడ జేయుదురా' యని యాచార్యుండుగా నందఱితో పాటు వారును ధ్యానములో పాల్గొందురని రత్నమాంబగారు మనవి చేసిరి అప్పుడు దేశికుడు గీతాపారాయణ మాత్రము జేసి దానియందుగల యనుష్ఠానము జేయనిచో ఫలము గలుగదు అంత్యకాలమున ప్రణవ ధ్యానముతో పరమాత్మ ధ్యానము గలిగి యుండవలయునని భగవంతుడుపదేశించెను ఆలాగున ఇప్పటి నుండియే యట్టియభ్యాసము జేసికొనుట మంచిదని నిండుప్రేమతో నుపదేశించెను ఆ సమయమున రత్నమాంబగా రందఱును విను నట్టిట్లు జెప్పిరి 'ఈ దినము స్త్రీలందఱికిని మాత్రమేగాక, పురుషులందఱికిని నీ వనమందే భోజనము జరుగును ఈ దినము సమారాధన ఖర్చంతయు గీతా పారాయణము చేయు మహిళామండలి వారిదని చెప్పుచు,గురుప్రసాదము వారి వారి కులానుసారముగ నేర్పాటు చేయబడియున్నద'ని చెప్పి విరమించిరి అంతట నాచార్యుడు లేచి నిలిచి యందఱిని ఆశీర్వదించిరి పిమ్మట 'భోజనానంతర మెవరును ఆశ్రమావరణము లోపల నుండ రాదని' రత్నమాంబగారు చెప్పగా, తాముకూడ

సీ దినము లోపలికి రాకూడదని, భారతీదేవి గారు చెప్పిన వాక్యప్రకారము మహిళామండలి వారాలాగుననే చేసెదమని చెప్పిరి తదనంతరము దేశికుడు మధ్యాహ్ననంతరము 'ఏదైన ప్రత్యేకముగా మాట్లాడ వలసి యుండునా' యని భారతీదేవిగారిని బ్రహ్మచారిచే నడిగించిరి అప్పుడాభారతీ దేవిగారు మాట్లాడవలసినది గలదనియు ముఖ్యముగా దానికొరకే వారిని పిలిపించ డమైనదనియు, అత్తరి అందఱిని బయటకు బంపివేసెదమనియు, నా సంభాష ణ నెవరును వినరాదనియు' బ్రహ్మచారిద్వారా నాచార్యునికి మనవి చేసిరి

అప్పటికి సూర్యుడు గగనమధ్యము నధిష్ఠించెను అపుడు దేశికుడు బ్రహ్మచారితో సహస్నాన మునకు విజయము చేసె స్నానానంతర మా బాలవిప్రవటువుతో గూడి భక్ష్యభోజ్య పాయసాన్నాదులతో సిద్ధపరుపబడిన వారి కేర్పరచియుండు స్థలములకు వెళ్ళి, గీత పంచదశాధ్యాయ మును బఠించి విందారగించిరి తక్కినవారందఱును వారి వారి కేర్పరచియుండు స్థలముల యందు తృప్తిగ భుజించిరి

భోజనానంతరము విశ్రమించి యపరాహ్ణమున గురువరుండు భారతీదేవి యాశ్రమమునకు వచ్చి బ్రహ్మ చారిని కొంచెము దూరముగా గూర్చుండ నాజ్ఞాపించెను అపుడు భారతీదేవి గురు వరుని పాద కమలములకు నమస్కరించి తన యనుష్ఠానముల నన్నిటిని మొదటి నుండి కడపటివఱకు జెప్పి, ధారణాధ్యానముల వఱకే యనుభవము గలిగినదనియు, సమాధి యెంత ప్రయత్నించినను లభ్యముగా లేదనియు వ్యష్టికి సాక్షిత్వమును, త్రిగుణములకు విలక్షణత్వమును, గలిగెనని దెలుపుచు శివజీవైక్యమును, ధ్యాతృ, ధ్యాన, ధ్యేయముల యేకత్వమగు' త్రిపుటి రాహిత్యమున్ను, శివ, జీవ, జగత్తుల యైక్యమున్ను లభించుట లేదనియును దెలిపెను మఱియు ఉపనిషత్తుల యందిట్టి త్రిపుటి రహితావస్థ గలుగనిచో సాధన పూర్తిగా లేదనియు, నందువల్ల జనన మరణములతో గూడిన సంసార దుఃఖము నశింపదనియు, మఱియు నది పునర్జన్మ మును గలుగజేయునదియు నగునని కనుపించుచున్నది దీనియొక్క రహస్యమును దెలిపి నీ బిడ్డను నిస్సందేహురాలును గాను,

పూర్ణత్వము నొందులాగున ననుగ్రహింపవలయునని వేడుకొనెను ఈయొక్క కొఱత తప్ప మఱియే కొఱతగాని, సందేహముగాని, మీ పాదముల నాశ్రయించిన యీ బిడ్డకులేదని దెలిపెను

ఈ వాక్యమును విని దేశికుండు విస్మయచేతస్కుడై నిశ్చేష్టుడై కొంతసేపు యోచించి 'బిడ్డా! నీయొక్క యనుభవమునకును, ననుష్ఠానమునకును, నతీత వైరాగ్యమునకును, నాకాశ్చర్యము గలుగుచున్నది నేను బ్రహ్మచర్యవ్రతముతో దీక్ష నలుపుచు నుప్పది సంవత్సరములు తీవ్ర నిష్ఠవలననే, ఇట్టిస్థితిని బొందగలిగితిని నీకు ఆరు సంవత్సరములలో నిట్టి సిద్ధి గలుగుట జూడ నాకాశ్చర్యము గలుగుచున్నది దీనిజూడ నిది జన్మాంతర పుణ్య విశేషమనియే దలంప వలయును ఏదో కొంచెము కొఱత జన్మాంతరములో గలిగియో, లేక పూర్ణసిద్ధిగలిగి స్త్రీలోకమును ద్ధరించుటకొఱకు పరమేశ్వరాజ్ఞచే జన్మించిన పరమయోగినిగానో ఉండవలయునని తలంచుచున్నాను' అని పరమా నందముతో వచించి యింకను ధ్యానము పరిపక్వస్థితికి రాగారాగా సమాధియు, నాత్మపరమాత్మల యైక్యమును, శివ, జీవ, జగత్తుల యేకత్వమును గలుగునని వచించిరి కాని దాని బొందుట కేయుపాయముగాని చెప్పలేదు పిందె కాయగా మారి, దోరగాయయై పండగునట్లు, ఉపరతి స్థితి గలిగిన నదే క్రమాభ్యాసమువల్ల ధారణయు, ధ్యానము, సమాధియుగా మారు ననియు నాచార్యుడు వచించెను కావున ననుష్ఠానములో కొఱత గలుగక ఆచరించుచు వచ్చుచుండినచో, నది సముద్రములోనికి వెళ్ళి ఏకత్వమును బొందునట్లు బ్రహ్మాత్మైక్య సమాధి గలుగునని వచించి యూరకుండిరి అట్టి భావమును గ్రహించి వీరును జీవన్ముక్తి స్థితిలోనే యుంటున్నారనియు, విదేహముక్తి పొందలేదనియు, ఆత్మలో దలంచి, పరమభక్తితో నానంద భరితయై యున్నదని యందఱికిని తో మన ల్లాచార్యుని పాదపద్మములకు నమస్కరించి, 'నారీమణులందఱును తమ బోధామృత పానము చేసి, వారి సంసార విషయ విషదోషములను రహిత మొనర్చుకొన వేచియున్నారని తెలుపగా 'నట్లే' యని గురువరు డాజ్ఞాపించెను

అంతట మహిళా మణులందఱిని రప్పించి నిశ్చలము గాను, నిశ్శబ్దముగాను, సూర్పుండులాగున, భారతి యందఱికి నాన తిచ్చెను అపుడు కులగురువరుడు 'మీ రందఱు శ్రీభగవద్గీతను బాగుగా చదువ వలయును ప్రతిరోజును జప, పూజా, ధ్యానాదుల తప్పక అనుష్ఠింపవలయును అనుకూల ముండు వారందఱును సంస్కృతము గూడ నభ్య సించవలయును వ్రతముల నాచరించ వలయును భర్తలుగల పుణ్య స్త్రీలు పతిసేవ దైవసేవవలె నా చరించవలయును ఉత్తమ గ్రంథముల జదువవలయును సాధువులపై సద్బ్రాహ్మణులపై విశ్వాసము గలిగి యుండవలయును ఇపుడే సన్న్యాసులపై బ్రాహ్మణులపై జనులకు భక్తి చాలవఱకు తగ్గి పోయినది అది జనుల దోషము కాదు యతులును, విప్రులును పూర్వమువలె ననుష్ఠానము లేనివారైరి అయినను నందఱు నా విధముగానే యున్నారని తలంపవలదు. బ్రహ్మచారులను, విరక్తులను నాదరింపవలయును యతికిని బ్రహ్మచారికిని భిక్ష నొసంగక గృహస్థులు భుజింప రాదు స్మృతులనేకము లీ విషయము నుద్ఘోషించుచున్నవి గీతయందు గూడ శ్రీకృష్ణుడు మూడు నాలుగధ్యాయములలో నీ విషయమును బోధించి యున్నారు విరక్తులై బ్రహ్మనిష్ఠను జేయు వారిని, బ్రహ్మచారులను, పోషింపనిచో భావికాలమున జను లున్నతస్థితికి రాజాలరు వారే భవిష్య ల్లోకమును రక్షించువారుగా నుందురు

**యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।**
**తే త్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥**

అతిథి యజ్ఞములందు భగవదారాధనలందు, సమర్పింపగా మిగిలినవి యును, అమృత మనదగినవియును, అయిన యన్నాదుల భుజించునట్టి సత్పురు షులు సర్వపాపములనుండి విముక్తులగుచున్నారు మఱియును నెవరు తమ యుదర పూరణ మాత్రము కొఱకే పచనము చేయుచున్నారో యట్టి వారు పాపము ననుభ వించుచున్న వారగుదురని తాత్పర్యము

***యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।***
***నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥***

ఇట్టి యతిథి, యజ్ఞ, దైవారాధన, దివ్యమంత్రజపాదులనెడు పంచయజ్ఞము లను జేయగా మిగిలిన యన్నము అమృతము వంటిది అట్టి దానిని భుజించువారు మోక్షమును బొందుదున్నారు అట్లు చేయనివారికి స్వల్పసుఖము లకు స్థానమైన యీ లోకమే లేకపోవుచుండగా సర్వదా సుఖకరమగు పుణ్యలోక మెట్లు గలుగును

*సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ।*

ఈ పంచయజ్ఞములనుగాని, లేక నీ నాల్గవ అధ్యాయములో విధించిన 14 విధములగు నాత్మయజ్ఞములలో నేదైనయొక దానిని గాని చేసినవాడు యజ్ఞములచేత నశింజేయబడిన పాపము గలవాడగును అనగా నటువంటివానికి పాపము గలుగదు

ముఖ్యముగా నిచట నుండువారిలో నధికముగా క్షత్రియ స్త్రీలుండుటవే ప్రత్యేక ముగా వారును, వేదాన్త విచారణ జేయనర్హులాంధ్రు భారతమున జనక సులభా సంవాదమను నొక గాధ గలదు సులభ గొప్పయోగిని, బ్రహ్మచారిణి రాజ కన్యక ఆలాగున యోగవాసిష్ఠమున శిఖధ్వజ చూడాలాసంవాద రూపమగు కథ యొండు గలదు వీరు గృహస్థాశ్రమ మందుండియే జీవన్ముక్తి పదవి నొందిరి చూడాల నారీలోకములో పూజ్యత గలదైనది మఱియు నీ కలియుగమున బృందావనమందు శ్రీమీరాబాయి యను పేరుగల క్షత్రియ వంశములో జన్మించిన వధూమణియొక్క చరిత్రమును మీరు వినియే యున్నారు జ్యోతిపూర్ మహా రాజ కుటుంబములో నీ లలనామణి జన్మించెను బ్రహ్మచారిణియై శ్రీకృష్ణ పాదారవిందముల ధ్యానించి శ్రీబాలగోపాలుని యందైక్యము నొందెను సత్యదయాదులతో గూడి సాత్త్విక గుణము గలిగి ఆత్మజ్ఞానము గలిగి యుండుటయే కృతయుగ మనంబడును తపో యోగాదులతో గూడి, కొంత రజోగుణమును గలిగి యుండు నది త్రేతాయుగ మనంబడును జప పూజాదులతో గూడి యజ్ఞాదిక్రతువు లొనర్చుచూ త్రిగుణములు మిశ్రమములై యుండుటయే ద్వాపర మనంబడును దాన ధర్మ పరోపకారాదులు కొంతవఱకు గలిగి యుండి, విషయానందపరులై ప్రవర్తించుట

కలియుగమున నుత్తమ గుణంబనబడును కేవలము తమోగుణము గలిగి హింసాది క్రూరకర్మల జేసి, సదా పరహింసాపరులై యుండుటయే పూర్ణకలి యుగ ధర్మమ నంబడును యధార్థముగ విచారించినచో యుగములను గుఱించి శాస్త్రములలో నీరహస్యమే గనబడుచున్నది ఆలాగున సత్త్వగుణము గలవారు దేవతలనియు, రజోగుణముగలవారు మనుజులనియు, తమోగుణముతో గూడిన వారు రాక్షసులనియు, మూడు గుణముల నతిక్రమించి యుండువారు సాక్షాద్దైవస్వరూపుల నియు శాస్త్రమందు గలదు ఆలాగున సత్త్వగుణము గలవారు బ్రాహ్మణుల నియు, రజోగుణము గలవారు క్షత్రియులనియు, త్రిగుణముల మిశ్రస్వభావముగల వారు వైశ్యులనియు, తమోగుణము గలవారు శూద్రులనియు, మూడు గుణములను రహితమొనర్చినవారు ఋషులనియు ''శాస్త్రసమ్మతము'' అని పలికెను

విద్యావైశద్య ముతోను, ధ్యానబలముతోను, అగాధభావములతోను గూడిన గురువరుని యీ బోధను విని, నారీమణులందఱును మిక్కిలి యానందించిరి మఱియు గురువరుడు 'ఈ రహస్యము శాస్త్రములో నిగూఢముగా నున్నదనియు, కర్మకాండులగు బ్రాహ్మణులీ శాస్త్ర రహస్యమును కప్పిపుచ్చిరనియు, బ్రాహ్మణులలో జన్మించినను నీపై జెప్పిన గుణములు లేనివారు బ్రాహ్మణులు కారనియు, బ్రాహ్మణేతరకులములో జన్మించినను ఈ పై జెప్పిన గుణము గలవారు బ్రాహ్మణులగుదురనియు, సత్యమిట్లుండినను ప్రపంచములో నది మరుగుపడి, యిపుడు లోకాచారముగ కల్పించ బడినదే వర్ణాశ్రమధర్మములై వ్యాపించెను' అని వ్యక్తపరచి చెప్పి గురువరుండు మౌనముగా నుండెను దాని జూచి యుపన్యాసము సమాప్తిజేసినట్లు మహిళా సంఘము వారు దెలిసికొని శాస్త్రములోగల నీరహస్యము నిదివఱలో వినియుండలేదని చెప్పుచు, నందఱు నొకేసారి నమస్కరించిరి ఆచార్యుడును వారందఱిని యాశీర్వదించెను అంతవఱ కీవాక్యము వినుటకొఱకు సూర్యభగవానుడు నిరీక్షించి యుండెనో లేక అబలలగు నారీమణు లీగురువులవారి బోధను సంపూర్ణముగా వినవలయునని వారిపై దయ గలిగియుండెనో యని తోచునట్లు సూర్యుడు వెంటనే యస్తమించెను తరువాత స్నానములకొఱకు, ధ్యానానుష్ఠానముల కొఱకును

వెళ్ళునపు డదివఱలో తోటలో కనిపెట్టుకొని యుండు పురుషు లందఱినిజూచి యీలాగున పవించిరి (ఆ దినము, భారతీదేవిగారి దేశికేంద్రుడు వచ్చుచున్నాడని విని పండితులగు బ్రాహ్మణులును, రాజులును ఇతరులగు చాలా మంది జనులు వచ్చియుండిరి ) వారినందఱిని సంబోధించి 'మహిళామండలి వారి గీతాపారాయణము గుఱించియు, ప్రణవధ్యానమును గుఱించి యు, తన కపరిమి తానందము గలిగెననియు ముఖ్యముగ నోంకారధ్యాన మీలాగున తన జన్మములో నెవటను జూచి యుండలేదనియు, విని యుండలేదనియు అకార, ఉకార, మకారముల నొక్కొక్క దానిలో నైక్యపఱచి, నామూ డింటిని నర్ధమాత్రలో లయ పఱమటయు, విశ్వ, తైజస, ప్రాజ్ఞుల నొకనిలో నొకని విలయపఱచుచు, క్రమముగ ప్రత్యగాత్మయందు పరమాత్మభావముతో నిలుచుటయు, నదేరీతిగ స్థూల, సూక్ష్మ, కారణ దేహములను నొకదానిలోమఱొక దానిని లీన మొనర్చుచూ మహాకారణములలో నిలుపుటయు చూచిన గొప్ప యోగులకు గూడ సాధ్యము కానట్లుండు ననియు జెప్పి దీనికన్న గొప్పదియగు మఱియొక విషయము గూడ జూచితిని అదేమన విశ్వుని విరాట్టునందును, తైజసుని హిరణయగర్భుని యందును,ప్రాజ్ఞుని నంతర్యామియందును, ప్రత్యగాత్మను పరమాత్మ యందును విలీన మొనర్చెడు ధ్యానములను జూచి విస్మయ మొందితిన'నియె ఈ నాల్గింటి యొక్క యైక్యమును దెలిసినవారే బ్రాహ్మణులనియు దెలిపెడు యుపనిష ద్వాక్యమును జెప్పి యర్థమును వివరించిరి

*అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్ ।*
*ఓంకారం యో విజానాతి బ్రాహ్మణో న స బ్రాహ్మణః ॥*

మఱియు నిదంతయు జూచిన పురుషులు స్త్రీల కవకాశము గలుగ జేయ నందుచేతనే నారీలోకములో జ్ఞానవిజ్ఞానములు వృద్ధినొందక పోయినవని తోచినది వారు ధ్యానములో నుండునపుడు పరికించిన గొప్ప మండపము యొక్కగోడలో చిత్రించిన చిత్రములవలె నిశ్చలులై యుండిరి నేనును అఖిల, భారతదేశ మహిళా సంఘమును జూ చితిని ఆ సభలో స్త్రీలు మాత్రము

నీరికన్న నెంతో నధికగవుగ విద్యావిషయమున ప్రసంగించినను, స్త్రీ స్వాతంత్ర్యోపన్యాసము లిచ్చినను వారి యందింత దైవభక్తియు, ధ్యానమందు నిశ్చలత్వమును కనుపించ లేదని చెప్పిరి మఱియు నేను ఆసేతు హిమాలయపర్యంతము తీర్థయాత్ర జేసినపుడు గూడ స్త్రీలయొక్క యనేకా శ్రమములను, మఠములను, వార్షికోత్సవములను, సభలను గూడ జూచియున్నాను ఇంత ప్రసన్నతయు ప్రశాంతతయు దైవభావమందు లగ్నమగు ధ్యానమును నెచ్చటను జూడలేదు మీకింకొక వాక్యమును గూడ జెప్పెద ఇది చాల నూతన విషయము పామరులకు దీనిం దిష్టము లేకపోయినను పుణ్యాత్ములకు చాల ప్రీతి గలుగును అదేమనగా! ఆదిమనివాసినులగువారి స్త్రీలుగూడ ధ్యానములోను, గీతాపారాయణములోను పాల్గొనియుండిరి కాని యందఱును కలిసిమెలసి యుండలేదు దగ్గఱగానే కూర్చొనియుండిరి ఈ విషయమై భారతీ దేవిగారి నడుగగా ''అశన, శయన, భోజనాదులలో మాత్రము కలిసియుండుట లేదనియు, దైవధ్యానములోను, గీతా పారాయణలోను నందరితో సమానముగా వారు గూడ దగ్గఱగా గూర్చుండునట్లేర్పాటు గలదనియు, భోజన సమయమున కాలభేదము లేదనియు, స్థలభేదము మాత్రము కొంచెము గలద'' నియు, వచించిరని పలికి దానికి గీత విభూతియోగమున గల శ్లోకమును జదివి జెప్పిరి

*యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।*
*తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్ ॥*

అర్జునా! ఈశ్వరునికి సంబంధించినదియు, లక్ష్మీకరమైనదియును, దృఢమైన శ్రద్ధతో కూడినదియునగు నేదేది గలదో నదియంతయు నాయొక్క యీశ్వరాంశము వలన పుట్టిన దానినిగా దెలిసికొనుము అట్టి గుణము గలవారలలో పైజెప్పిన స్వభావమంతయు నాయొక్క యంశమని గ్రహించుకొనుము నన్నువలె నట్టిగుణము గలవారినిగూడ బొందుము మరియు త్రయోదశాధ్యాయమునగల యేశ్లోకమును జదివి స్పష్టముగ నర్థమును జెప్పిరి

*సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।*

*వినశ్యత్స్వ వినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥*

సకలములయిన ప్రాణులందు సమముగా నుండునట్టి పరమేశ్వరుని, బ్రహ్మాది స్తంబ పర్యంతములగు సకల ప్రాణుల యుపాధులు నశించినవగు చుండగా, నశింపనివానినిగా నెవ్వడు చూచుచున్నాడో, వాడే చూచినవాడు వాడే నేత్రములు గలవాడు తక్కినవారు కన్నులు గలవారైనప్పటికిని గ్రుడ్డివారితో సమానులు మరియు వస్తుదృష్టియనియు, గుణదృష్టియనియు, ఆత్మదృష్టియనియు దృష్టిని మూడువిధములుగా తత్త్వవేత్తలు వచించిరి దేహమును మాత్రము చూచుట వస్తుదృష్టియనియు, దేహము జడముకాన లట్టి దృష్టిగలవారు జడదృష్టిగల వారనియు, గుణమును జూచుట చిదాభాసదృష్టియనియు, నిది చైతన్య సంయుక్తము గుటచే రజోగుణ దృష్టియనియు, శుద్ధాత్మ నీశ్వరభావముతో జూచుట జ్ఞానదృష్టి యనియు నయ్యది సాత్త్వికగుణముతో గూడినదనియు, నతిరహస్యమైన ఈ తత్త్వ మును వచించిరి ఈ తత్త్వము దివ్యదృష్టిగలవారికి గోచరించునేగాని, తదితరులకు దెలియ నలవిగాదని యతివరుడు పురుషులందరికిని జెప్పగా నచట జేరియుండు సనాతనులగు పండితు లేమియు మారుపలుకక, మౌనముగా నుండిరి దానిజూచి యితరులు బోధించిన గురువరుడు మఠాధిపతియు, కులగురువునను, నపారశాస్త్ర పాండిత్యము గలవారు నగుటచే పండితులాలాగున మౌనము దాల్చియుందురని తలంచిరి

తరువాత రామచంద్ర నరేంద్రునుద్దేశించి 'పరి శుద్ధాత్మా! శ్రీభారతీదేవి మీ కుటుంబములో బుట్టుటచే, మీ వంశమంతయు పావనమైనది భారతీదేవిగారు మా పీఠమునకు జెందిన వారగుటచే మామఠమునకును చాల యశస్సు గలిగినది, ఇట్లని యాచార్యుడు వచించి, మఱియు భారతీదేవిగారిని గుఱించియు, వారి భక్తివైరాగ్యములను గుఱించియు నిదివరలో ననేకులు నాతో జెప్పి యున్నారు అయితే పగలెన్ని ఘంటలో రాత్రి అన్నిఘంటలు సమయముండుట ప్రకృతి యొక్క నైజము అదేరీతిగ నెన్ని మధుర ఫలవృక్షములుగలవో, పులుపు, చేదుగల వృక్ష ములు వాటికన్న నధికముగ

నుండును ఎన్నిరోజులు శుక్లపక్షమో యన్నిరోజులు గూడ కృష్ణపక్షముంటున్నది ఎన్ని నెలలు వర్షాకాలమో, యన్ని మాసము లెండ కాలముగూడ గలదు ఎందఱు దేవతలో నందఱు రాక్షసులు గూడను, అట్లే భూషించువారెందరో అందరు దూషించువారు నుందురు 'భారతీదేవి వర్ణాశ్రమములను పాటించుట లేదనియు, అంతిమజాతులను గూడ నగ్రజాతులతో కలుపు చున్నారనియు, గృహస్థాశ్రమములోనుండు స్త్రీలతో గృహస్థధర్మము ననుష్ఠింప బనిలేదనియు, బ్రహ్మచర్యము గలిగియుండ వలయుననియు, చరాచర జగత్తును భరించువాడే భర్తయనియు, ఆభర్తను బొందువారు నిత్యసుమంగళు లనియు, వారికి వైధవ్యము గలుగదనియు, ఈ భర్తలందఱు స్వప్నములో వివాహముచే గలిగెడు భర్తలవంటివారనియు, సంసారమును నిస్సారముగా జూడవలయుననియు, జాగ్రదవస్థలో గనుపించునది స్వప్నావస్థలో గనబడుట లేదనియు, స్వప్నములో గనుపించునది జాగ్రదవస్థలో నెట్లసత్యమో, ఆలాగున నజ్ఞానదశలో నీ మాయా సంసారము సత్యముగ దోచినను జ్ఞానదశలో నివియన్నియు నసత్యములని చెప్పుచున్నారనియు, నంతేగాక మిక్కిలి ప్రమాదమగు మరియొక కార్యమును చేయుచున్నారనియు, నదేమన, రాజకన్యలందఱితోను, నితరబాలికలతోను, బ్రహ్మచారిణులుగా నుండవలయుననియు, నాత్మారామునితో రమింప వలయుననియు, నట్టివారికి నిరతిశయ మోక్షసుఖము గలుగుననియు, ఈ తుచ్ఛ సంసారము, దుఃఖసాగరమనియు, వైరాగ్యము లేనిచో బ్రహ్మ సుఖము బొందజాల రనియు నందఱితో చెప్పుచున్నారని' వారలు దెలిపిరి అంతేగాక యతిపవిత్రమై వేదసారమగు నోంకారమును నంత్యజాతులు గూడ ధ్యానకాలములో నుచ్చరించు లాగున చేయుచున్నారనియు, గీతా పారాయణము, ఉపనిషత్పఠనము సర్వజాతి స్త్రీలు గలసి జేయుచున్నారని, దూషణవాక్యములను పలుకువారు గూడగలరు ఇట్లు చెప్పు టోర్పులేని తనమని నేను నిశ్చయించుకొన్నాను మహిళా మండలివారి గీతా పారాయణమున, నాదిమనివాసినులగు స్త్రీలున్నారు కాని తక్కిన వారితో కలియుక చాల దగ్గఱగానే కూర్చొనియున్నారు వారియొక్క భక్తియు, శుచిత్వమును జూచి నామనసు గూడ కరగి పోయెను జ్వరాది రోగములచే జిహ్వాదోషము గలవారికి మంచివస్తువులు గూడ నేలాగున రుచింపవో, ఆలాగున

కేవలము కర్మకాండులకే దైవజ్ఞానము రుచింపదు. మెండియు రాత్రులలో దీపమేలాగున సర్వులకు ప్రకాశమిచ్చు చున్నను, కన్నులు గలిగి నేత్రరోగము గల వారికా ప్రకాశ మేలాగున బాధకరముగానుండునో, యీజ్ఞానముయొక్క స్థితియున్నట్లుండును. మఱియు ప్రపంచమును ప్రకాశింపజేయు సూర్యుడుదయించునపుడు, గుడ్లగూబలకు చీకటిగానేర్పడునట్లు, జ్ఞానభాస్కరుడును, కర్మిష్ఠులకు దోషయుక్తుడుగానే తోచును. త్రాచుయొక్క విషముగలవానికి, చేదైన వేపాకు తీపిగానున్నట్లు నజ్ఞాన సర్పముయొక్క విషమెక్కినవారికి పాపము పుణ్యముగానే దోచును. వారు చేయు ధ్యానపారాయణాదులలో హరిజన నారీ మణులు గలరు. వారి శాంతియు, స్వచ్ఛతయు, భక్తియు జూచి నేనేమియు జెప్పజాలకపోతిని. అట్టి నిర్మలజీవులను దూరీకరింతురా? భగవదపచారమగును. శ్రీరామానుజాచార్యులన్ని జాతులవారిని సంస్కరించి ప్రణవముతో గూడిన శ్రీనారాయణాష్టాక్షరీ మంత్రము నుపదేశించి యున్నారు. అట్లే శ్రీకృష్ణచైతన్యుల వారును, సర్వ స్త్రీ పురుషులకును, శ్రీ కృష్ణ మంత్రమును బోధించియున్నారు. కావున పరమభక్తుల కీ కర్మశాస్త్రము సంబంధించదు. అదియంతయు మాయలో గలవారికే యేర్పడినది' ని చెప్పుచు స్నానాద్యనుష్ఠానములకు వెళ్ళిరి. జనులందఱును చాల యానంద భరితులై వారి వారి స్వస్థానములకు వెళ్ళిరి. భారతీదేవి ధ్యానాద్యనుష్ఠానముల పూర్తి జేసి క్షీరపాన మొనర్చిన పిదప తీర్థపాదులగు శ్రీతండ్రిని రప్పించి 'రేపటిదిన ముదయమున నాచార్యస్వాముల వారిని పంపించవలసి యుండును. ఆ విషయమై యేమి యేర్పాటు చేసియున్నారని యడుగగా, నరేంద్రు డింతవఱ కేమియు నిశ్చయింపలేదు. ఈ రోజంతయు మహాసమారాధన కాబట్టి వచ్చినవారిని విచారించుటలోనే కాలము గడచెనని, భక్తితో జెప్పుచు, అమ్మా! నీవేలాగున చెప్పిన నాప్రకారము చేసెదమని జనకుడు దయాపురస్సరముగా వచించెను. ఆ వాక్కును విని భారతీదేవి యిట్లు చెప్పెను. 'పూజ్యపాదు లగు తండ్రీ! మన విభవమునకు దగినట్లు సత్కరించి పంపవలయును. స్వాములవారి మఠములో కొందఱు బ్రహ్మనిష్ఠులున్నారు. సంస్కృతమును, వేదములను, శాస్త్రములను నధ్యయనము జేయు

బ్రహ్మచారులును గలరుగదా! అంతేగాక తీర్థయాత్రాపరులగు సాధువులు సన్న్యాసులింకను యతిధియభ్యాగతులు గూడ వచ్చిపోవుచుందురు అట్టివారియాదరణ గృహస్థుల సహాయము లేనిచో నెట్లు జరుగును? సత్పాత్రదానముచేతనే గృహస్థులు తరింపవలసి యుందురు 'దానమేకం కలౌ యుగే' యని స్మృతులు చెప్పుచున్నవి మఱియు నాకు మంత్రోపదేశమైన తర్వాత నిదివఱకేమియు గురుదక్షిణ నిచ్చి యుండలేదు దైవముతో సమానులగు మీకు నాయభీష్టము దెలుపు చున్నాను తరువాత తమ యిష్టానుసారము చేసికొనవచ్చునని చెప్పిరి మఱియు నీదినము సమారాధన చేసిన గీతాపారాయణ చేయు మహిళామండలి వారు 116 రూపాయలును నాలుగు జతల వస్త్రముల నివ్వనట్లేర్పాటు జేసి కొనియున్నారు అదేరీతిగ 116 రూపాయలును రెండుజతల వస్త్రములు నేనును, 116 రూపాయలును రెండు బెనారెస్ శాలువలను తమరు గూడ నీయవలయును ఇదియే నా సంకల్పము ' ఈ వాక్యమును వినిన వెంటనే రామచంద్ర నరేంద్రుడిది మనకేలాటి ప్రయాసయును గాదు ఇంతే చాలునా? 1116 (వేయి నూటపదహారుల) నీయదలంచి దానికి తగిన యేర్పాటులతో శాలువల నిదివఱలోనే దెప్పించి యున్నానని వాక్రుచ్చెను జనకుని యీ ప్రియ మైన వాక్యమును విని మిక్కిలి సంతోషముతో గూడిన హృదయము గలదై యంత యవసరములేదు ముందు నేనింతే సంకల్పించి యున్నానని చెప్పగా, రామచంద్రనరేంద్రు డిట్లనెను ''అమ్మా! నీతో నొక వాక్యము నుడువ తలంపు గలదు నీకేదైన అప్రీతి గలుగునని తలంచి ఇదివఱలో జెప్ప లేదు ఈ దినము మహాసమారాధన గీతాపఠన మొనర్చు మహిళా మండలివారిదిగా నేల చేయింప వలయును? మన కేమి కొఱత గలదు? ఇట్లని చెప్పుచు రెండు నేత్రములనుండి ధార ధారలుగా నీరు గార్చుచు ''మేమికనెవరికి పెండ్లిగాని బంధు సత్కారముగాని జేయగలము? కావున నిక ఎపుడైనను అన్నదానపు ఖర్చు మనదిగానే ఉండవలయును'' అని చెప్పి, ఈశ్వరుడంతయు నీతో గూడ పూర్తి చేసినాడని చెప్పెను

పితృవాక్యమును భారతీదేవి విని, తండ్రీ! గీతాపఠన మొనర్చు మహిళామండలి వారనేక దినములనుండి ఒక ముఖ్యమైన రోజున నందఱికిని

భోజన మిడనేయుననియు, నెన్నియోరోజుల నుండి యిచటనే భోజనము చేయుచు నున్నట్టియు చెప్పుమందని దనిచెను నేనిలాగున చేయుట మైనదని చెప్పి తిరిగి మెల్లగను మహాదార్యుం జనకుడెదిరి 'యీ పుణ్యదినమునేక బ్రాహ్మణులు, రాజులు వచ్చియుండగా వారికి భోజనమిడు భాగ్యము లేక పోయినదని మనస్సులో చాల కష్టముగా నుండెననియు, బ్రహ్మనిష్ఠ దగు మునివరేణ్య దేవెంచియుండగా, నితరులచే సమారాధన చేయించుటచేత, మీ తల్లిగారి మనస్సునకును చాలక్లేశమును గలిగించినావు లయినను సామగ్రులన్నియు సమకూర్చిన తర్వాత మాకు దెలిసినందుచే నేమియు జెప్పజాలక యూరకుంటిమి 'అని బలికెను తరువాత మహిళామండలి వారును సంతటి పుణ్యమును సంపాదింతురుగాక! యని భారతి జనకునితో జెప్పి ప్రాతఃకాలమున ప్రయాణ విషయమై యేర్పాటు చేయ పంపిరి వెంటనే ముఖ్యమైన గుమస్తాను పిలిపించి యీ దినమేలాగున స్వాములవారిని యాహ్వానించి తీసికొనివచ్చితివో యట్లే, భజన మేళములు, పల్లకీ వారందఱితోను రేపుదయమున సిద్ధముగా నుండునట్లేర్పాటు చేయవలసినదని భారతీదేవి తండ్రి వచింపగా, నదేప్రకారము గుమస్తాయు నందఱితో జెప్పి యేర్పాటుచేసెను

మఱునాడు సూర్యోదయమునకు ముందుగా నాచార్యుడు స్నానాద్యను ష్ఠానముల దీర్చుకొని, భారతీదేవిగారి యాశ్రమమునకు నరేంద్రునితోగూడ విజయము చేసెను అత్తఱి దేవిగారు గురువరచరణ సరోజము లందు బడి, నమస్కరించి యుచితాసనాసీనునిగా జేసిరి పిమ్మట గీతాపఠన సంఘము తరపున శ్రీరత్నమాంబ గారు పుష్పమాల సమర్పించి 116 రూపాయలును, 4 జతల వస్త్రములును నెక్కువగా పండ్లను సమర్పించిరి దానిజూచి 116 రూపాయలును రెండు జతల వస్త్రములును కొన్నిఫలములును, నరేంద్రుడగు తండ్రిగారు భారతీదేవి హస్తములో నుంచి గురుపాదములకు సమర్పింప చేసిరి రామచంద్రనరేంద్రుడును 116 రూపాయలును రెండు బెనారస్ శాలువలను గురుపాదములకు సమర్పించి సాష్టాంగముగ నమస్కరించిరి ఒక జతవస్త్రములను, 5 రూపాయలును కొన్ని ఫలములును గురువుతో గూడ

వచ్చియుండు బ్రహ్మచారికి భారతీదేవి సమర్పించెను కొన్నిగెలలరటి పండ్లను, పనస, మామిడి ఫలములను మఠమునకు సమర్పించిరి ఎండ యెక్కువగునని దలంచి వెంటనే ప్రయాణము సాగించిరి అందఱిని ఆశీర్వదించి మహానందముతో గురువరుడు పల్లకి నెక్కినతోడనే, భజన ప్రారంభింపబడెను నానావిధ వాద్యములు ఘోషించినవి భజన మేళవములతో ప్రయాణము సాగుచుండగా భూసురులును, భూపాలురును కొందఱు వారితోగూడ వెళ్ళిరి తదితరులందరును గురువును సాగనంపి స్వగృహమునకు మరలిరి పూర్వాహ్ణము పూర్తియయి మధ్యాహ్నమగు లోపలనే గురువుగారి మఠము నందఱుచేరిరి స్వామిగారిని మఠములో విడిచి యందఱును ప్రయాణమగుచుండగా నా సంగతి దెలిసి స్వాములవారందరితో నిచటనే భోజన మారగించి పోవలయునని మిక్కిలి దయ తోను, ప్రేమతోను సెలవీయగా నట్లే యని యందఱు నంగీకరించిరి తగిన రీతిగనెవరెవరి కెట్లుసత్కారము జేయవలయునో ఆలాగున వారిని మంచి భోజనాదులచే సత్కరించిరి మరియు వారు వెళ్ళుటకు యాజ్ఞదీసి కొని నమస్కరించు నపుడు మన మందఱము కుశలముగా మఠము జేరినట్లు రాజుగారితోను, తపస్వినియగు భారతీదేవిగారితోను నారాయణ స్మరణ పూర్వకముగా దెలియజేయులాగున చెప్పి పంపిరి వారును నదేప్రకారమని వచించి స్వామి వారి యాజ్ఞ బడసివచ్చి, రామచంద్ర నరేంద్రగారితో నాచార్యుండు వచించిన వాక్యములం దెలిపి, భారతీ దేవిగారికిని దెలియపరచునట్లు వచించి వారి వారి స్వగృహములకు వెళ్ళిరి

ద్వితీయ సర్గము సమాప్తము. ఓమ్.

# శ్రీబాలయోగిని

## తృతీయ సర్గము

## తీర్థయాత్రా ఘట్టము

*ఆదిమధ్యాంతరహితాయ వేదవేదాంతవేదినే।*
*నాదబిందుకళాతీత! నారాయణ! నమోఽస్తు తే ॥*

శ్రీకృష్ణ యతీంద్రులగు నాచార్యుండు చెప్పి పంపిన యాశీర్వచనము వినిన తరువాత భారతీదేవి తన సంశయములు దొలగకపోవుటచేత సందేహము గలవారు సద్గతిని బొందరనుకొని

**అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
**నాయంలోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః**

తత్త్వబోధము లేనివారు శ్రద్ధలేనివారు, సందేహము గలవారు నశింతురు సందేహము గలవానికి నిహలోకసుఖము, పరలోకసుఖమును లేదు శాశ్వతసుఖమగు మోక్షమును లేదు అనెడి గీతావాక్యమును గూడ నాలోచించి తీర్థయాత్ర చేసిన యపు డెచ్చటెచ్చట మహనీయులుందురో వారివలననైన నీ దృగ్దృశ్యదర్శనముల యేకత్వము దెలిసికొనవచ్చునని నిశ్చయించిరి అయినను యోగవాసిష్ఠమునగల సప్తజ్ఞాన భూమికల పరిశోధించెదమని ఆగ్రంథము జూడగా శుభేచ్ఛాది ఏడు భూమికలను, సప్తజ్ఞాన భూమికల కావలనుండు అతీత మార్గమును తెలిసికొనిరి

## సప్తజ్ఞాన భూమికలు

*జ్ఞానభూమి శ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా ।*
*విచారణా ద్వితీయా తు తృతీయా తనుమానసా ॥* 1

*సత్త్వాపత్తి శ్చతుర్థీ స్యాత్తతోఽసంసక్తినామికా ।*
*పదార్థాభావనీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా ।* 2

*ఆసామంతే స్థితా ముక్తిస్తస్యాం భూయో న శోచ్యతే ।*
*ఏతాసాం భూమికానాం త్వమిదం నిర్వచనం శృణు ॥* 3

ఓ రామచంద్రా! జ్ఞానభూమిక లేడింటిలో శుభేచ్ఛ మొదటిది, విచారణ రెండవది, తనుమానస మూడవది, సత్త్వాపత్తి నాల్గవది, అసంసక్తి ఐదవది, పదార్థాభావన ఆరవది, తుర్యగ ఏడవది యగును ఈ ఏడింటికి నంత్యమున ముక్తిగలదు దీని యందు జొచ్చినవాడు మఱల దుఃఖమునొందడు ఇక నీజ్ఞాన భూమికలయొక్క లక్షణములు చెప్పబడుచున్నవి వినుము

*కిం మూఢ ఇవ తిష్ఠామి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః ।*
*వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః ॥* 4

నేను మూఢునివలె నేలనుంటిని! శాస్త్ర అభ్యాసముచేతను, సత్పురుషసాంగత్యము చేతను నాత్మస్వరూపమును దెలిసి కొందునుగాక! అని యిట్లు వైరాగ్య పూర్వకము గా గలుగునట్టి యిచ్ఛ శుభేచ్ఛ యని చెప్పబడును ఇది ప్రథమభూమిక ఈ శుభేచ్ఛ గలుగుట ప్రయాసము ఈ జిజ్ఞాస గలవాడు త్వరలో మోక్షము నొందగలడు ఇది పాపము శమింపనివారికిగలుగదు ఒకడు జ్వరముచే బీడితు డైయుండగా, నెట్టి రుచికరమైన పదార్థము గూడ నతనికి చేదుగా గనుపించును ఎప్పుడాహారమును దినుటకు రుచిగల్గునో, యపుడు రోగ ముపశమించి నట్లెంచవలయును ఆలాగుననే అజ్ఞాన రోగపీడితులకు దైవికములగు పవిత్రకార్యములన్నియు దోషములుగా దోచును ఎవరికి దైవిక

విషయములో నాసక్తి గలుగునో, వారి పాపము శమించినదని గ్రహింపవలయును

*శాస్త్రసజ్జన సంపర్క వైరాగ్యాభ్యాస పూర్వకమ్ ।*
*సదాచార ప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా ॥* 5

వేదాంతశాస్త్రవిచారంబును, బ్రహ్మవిదులయొక్క శుశ్రూషయు, సంసారమునందు విరక్తి గలుగుటకై, సంసారబంధములగు దోషముల గనిపెట్టుటయు, సత్పురుషులయొక్క నడతయందు ప్రవృత్తియు, నివి వేరి విచారణ యను రెండవ భూమిక యని చెప్పబడును ఇది రెండవ మెట్టు

*విచారణా శుభేచ్ఛాభ్యా మింద్రియార్థేష్వసక్తతా ।*
*యత్ర సా తనుతాభావాత్ ప్రోచ్యతే తనుమానసా ॥* 6

విచారణచేతను, శుభేచ్ఛచేతను, విషయములందు విరక్తిగలిగి మనస్సు పెంపొందుటకు కారణమగు రాగము నశించి, మనస్సు సూక్ష్మరూపము నొందునట్టి దశ తనుమానస యని చెప్పబడును ఇది మూడవ మెట్టు

*భూమికా త్రితయాభ్యాసా చ్చిత్తేఽర్థే విరతేర్వశాత్ ।*
*సత్త్వాత్మని స్థితి శ్శుద్ధే సత్త్వాపత్తి రుదాహృతా ॥* 7

శుభేచ్ఛ, విచారణ, తనుమానస యను మూడింటి నభ్యసించినందువలన సంస్కారము నశించి మనస్సునందు విషయవాసన లుడుగుటవలన, నిర్మలమగు నాత్మరూపమునందు నిర్వికల్ప సమాధిచే, నిలకడనొంది యుండుట సత్త్వాపత్తి యనబడును ఈ దశయందున్నవాడు బ్రహ్మవిదుడని వ్యవహరింపబడును ఇదినాల్గవ భూమిక

*దశాచతుష్టయాభ్యాసాదసంసర్గఫలేన చ ।*
*రూఢసత్త్వచమత్కారా ప్రోక్తాఽసంసక్తినామికా ॥* 8

ఇదివఱకు జెప్పబడిన నాల్గు భూమికల నభ్యసించి యుండుటచేతను, విషయవాసనా సంసర్గమును పోగొట్టునట్టి సమాధియొక్క పరిపక్వస్థితి నొందుట చేతను, మనస్సునందు దృఢమైన బ్రహ్మసాక్షాత్కారముగల వ్యవస్థ, అవిద్యయొక్క

గాని, అవిద్యాకార్యముయొక్క గాని, సంసక్తి (సంబంధము) లేనందున నసంసక్తి యనబడును ఈ దశయందున్నవాడు బ్రహ్మవిద్వరుడని జెప్పుబడును ఇది ఐదవభూమిక

*భూమికా పంచకాభ్యాసా త్స్వాత్మారామతయా దృఢమ్।*
*ఆభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్ ॥* 9

*పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనమ్ ।*
*పదార్థాభావనీ నామ షష్ఠీ సంజాయతే గతిః ॥* 10

ఇదివఱకు జెప్పబడినయైదవస్థల నభ్యసించుటచే దృఢముగా నాత్మ నిష్ఠ గలవాడై యాభ్యంతర బాహ్యములగు పదార్థముల భావింపక పరులయొక్క ప్రయత్నముచే దేహకృత్యముల నిర్వర్తించు కొనుచుండుట పదార్థాభావన యను నాఱవ భూమిక యగును ఈ దశయం దున్నవాడు బ్రహ్మవిద్వర్యు డనబడును ఇది యాఱవ సోపానము

*భూమిషట్క చిరాభ్యాసా ద్భేదస్యాఽనుపలంభతః ।*
*యత్స్వభావైక నిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః ॥* 11

పైన చెప్పబడిన యాఱవస్థలనభ్యసించుచుండుటచే పరప్రయత్నము చేతనైనను, భేద వ్యవహారము గలుగక, సచ్చిదానంద లక్షణమగు నాత్మయందే యునికి గలిగి యుండుట తుర్యగయను నేడవ యవస్థ యగును ఈ యవస్థయందున్నవాడు బ్రహ్మవిద్వరిష్ఠుడగును ఇదే సాక్షాత్ మహాత్ముల యొక్క జీవన్ముక్తి పదవి వీనిలోగల యసంసక్తిస్థితి నాకు గలిగినది కాని పదార్థము లయభావనయగు నారవ భూమిక యును గలిగినదనియే చెప్పవచ్చును అయితే దీనికి రెండర్థములు గలవు తన యాత్మ యందు దృశ్యపదార్థము గాని వాటి యొక్క వాసనలు గాని, వాటి సంస్కారములు గాని నాయందు లేవు కాని దృశ్యము లయ మెటులగునను నర్థము నాకు బోధపడలేదు తుర్యగయను నేడవభూమిక విషయమై గూడ సందేహము గలుగుచున్నది దీనియందు సమాధిలోనుండి పరులెంత ప్రయత్నముతో లేప చూచినను వృత్తులు నశించినందుచే యుత్థానదశ

లోనికి రాకుండుటను నట్టి యొక యర్థము గలదు రెండవ యర్థ మేమన, నితరు లెంతప్రయత్నించినను నాత్మకు భిన్నముగా దృశ్యము గలదను భావముండదని తాత్పర్యము గూడ గలదు సప్తభూమికల కతీతమగు తురీయమే విదేహ కైవల్యమనియు, నట్టి స్థితి యందుండువాడే సాక్షా ద్బ్రహ్మస్వరూపుడనియు, వసిష్ఠులు దెలిపియున్నారు అట్టివారు మాత్రము పరుల ప్రేరణచే పరోపకారమును జేయుదురనియు, ధర్మోపదేశముల నొనర్తురనియు, తాముగూడ ననుష్ఠానపరులై యుందురనియు, నొకవేళ యివన్నియు లేకనే సదా సమాధిస్థితిలోగాని, నవధూతవృత్తిలోగాని యుందురనియు జెప్పుటచేత నిదియే సరియైన పద్ధతి యని దెలియవచ్చినది

అట్లు గానిచో శ్రీదత్తాత్రేయ, శుక, సనక, సనందన, సనత్కుమారాదు లగు సాక్షా ద్బ్రహ్మజ్ఞాన స్వరూపు లేలాగున జనులకు ధర్మబోధ జేయుచు నత్యుత్తమ గ్రంథముల రచింపగలరు? అంతేగాక పరమనిర్వాణమును బొందిన శ్రీ గౌతమ బుద్ధుడును, పరమేశ్వరావతారమని సర్వజనులచే స్తుతింపబడు శ్రీశంకరాచార్యులవారును, నద్వైతజ్ఞానము నెటులుపదేశింప గలరు? అమోఘములగు ననేక దివ్య గ్రంథముల నెటుల వ్రాయగలరు? కావున నీ విషయమున సందేహము లేదు కాని దృశ్యవిలయ మెట్లు గలుగునను విషయములో సంశయము మాత్రమే గాక, మనోవేదనగూడ గలుగుచున్నది పూర్ణమైన జ్ఞానము గలుగక జీవించుటకన్న పశువై జన్మించుట శ్రేష్ఠమని యోగవాసిష్ఠమునగలదు ఏలననగా పశువులకు ప్రత్యవాయదోషము లేదు అనగా తాను చేయవలసిన కార్యము చేయలేదను నాక్షేపము గలుగదు మఱియు జ్ఞానము పూర్తిగ గలుగకపోయిన పుణ్యలోక ప్రాప్తి గలిగి మఱల జన్మము వచ్చునని గీత గూడ నుపదేశించుచున్నది అపుడు తప్పక సంసారదుఃఖముల ననుభవింప వలసియుండును గర్భమందు కుంభీపాకనరకము నెట్టి మహాత్ముడైనను తప్పక అనుభవించి తీరవలయును ఉడుకునీటిలో నూపిరియాడకుండ తలక్రిందుగా పెట్టి యుంచినచో నెంత కష్టమో గర్భాశయమున నుండునపుడు గలుగు వేదనగూడ నటువంటిదే కుప్పలో పడియుండు మట్టిపెంకును దీసికొని అంత్య జాతులలో

భిక్షమెత్తియైన జీవింపవచ్చునుగాని, జ్ఞానవిహీనులై జన్మించుట దానికన్న నికృష్టమనియే శ్రీవసిష్ఠులు శ్రీరామచంద్రున కుపదేశించి యున్నారు'' ఈ భావ ముల నన్నిటిని రాత్రియందు హృదయమున దలపోయుచుండుటచే పూర్వమున్న టువంటి ముఖవికాస మొకించుక తగ్గనారంభించెను అంతేగాదు, పూర్వవము ఆనందవము పొంగి పొరలుచు పూబోండ్లకు ధర్మబోధనొనర్చుచుండినట్లిపు డుపదేశింపక పోవుటచే, కొందరికి సందేహము గూడ పొడమెను

కోటరాంతరమందు నిప్పు రగుల్కొనుచుండగా వృక్షముయొక్క పుష్ప ములు, ఫలములు, చిగురుటాకు లెట్లు వాడిపోవుచుండునో అట్లే భారతీదేవి హృద యము నందలి వేదనాగ్నిచే ముఖనేత్రాదులు కాంతి విహీనములాయెను శరత్కాలమున సరోవరములో నీరింకి పోవునట్లు శరీరము గూడ శుష్కింప దొడంగెను హేమంతమున హిమాలయ శిఖరములోగల సుందరమగు సంధ్యారాగము సూర్యుడస్తమించునపుడు క్రమముగా నశించునట్లు, శరీరకాంతియు క్షయము నొందసాగెను శరత్కాల పూర్ణిమనాటి చంద్రకాంతి యరుణోదయము కాగా క్షీణించునటుల భారతీదేవి యొక్క ముఖకాంతి క్షీణించుచున్న ట్లందఱికిని గనుపించెను శ్రీ విష్ణుభగవానుని విగ్రహమునకు నుదయమున నలంకరించిన సుందరములగు పుష్పమాలిక లన్నియు గ్రీష్మఋతువులో సాయంకాలమున కేలాగున ప్రకాశశూన్యములై పోవునో ఆలాగున నేదో గొప్ప విచారముచే భారతీదేవియు కాంతివిహీనయై ప్రసన్నతా శూన్య యయ్యెను అంతేగాక తీవ్రజ్వరాది వ్యాధులచే యాహారమందరుచి గలుగు నట్లు భోజనాదులలోగూడ నిష్టము లేకపోయెను మిక్కిలి మక్కువగల వనితామణు లిట్టి స్థితికి కారణమేమని యడిగినను, నొకప్పు డొక్కొకమాట సమాధానము జెప్పియు, నొకప్పుడేదియు పలుకక మౌనము వహించు చుండెను పుష్పమాలల నెండలో పడవేసినచో నెట్లు మాడిపడి యుండునో అట్లు భారతీదేవియు నెండ, నీడ యన ఏమియు లక్ష్యము చేయక క్షీణకాంతి గలదాయెను సకాలమున స్నానముగాని, భోజనముగాని, ధ్యానముగాని యేమియు జేయకుండెను

ఈమార్పును మాచి యంతరంగభక్తురాండ్రగు మానినీమణు లెంత యడిగినను నొకప్పుడేమియు పలుకక నేత్రములనుండి గొప్పవర్షబిందువులవలె బాష్పముల రాల్చుచుండెను వెయ్యేల? జనకరాజధానిలో సర్వకళా సమన్వితయై ప్రకాశించు చుండిన సీతాదేవి యశోక వనములో నెట్లు దీనవదనయై యుండెనో, లట్లే మన భారతీదేవి స్థితియు మారెను శ్రీరామచంద్రుడు తీర్థయాత్ర జేసివచ్చిన తరువాత వైరాగ్యము గలిగి దశరథమహారాజు యొక్క అంతఃపురంబున పూర్ణజ్ఞానమును బొందు విషయమై దీనభావమును, ఖేదమును బొంది స్నాన భోజనాదుల వర్జించి రోదనము జేయుచుండె నను విషయమును శ్రీ వసిష్ఠుడు యోగవాసిష్ఠమున వైరాగ్యప్రకరణమున నెట్లు దెలిపి యున్నారో, భారతీదేవిగారిస్థితి దానికన్నను తక్కువై నది కాదు అందఱు నిట్టి యనల్ప కష్టస్థితి గలుగుట కేదో గొప్ప కారణముండ వలయుననియు, గురువుగారు వచ్చిపోయిన తర్వాతనే యీ మార్పు గలిగినద నియు, వారు భయుల సంభాషణయం దేమి గలిగినదో మనకు దెలిసినది కాదనుకొనుచుండిరి మఱికొందఱంగనామణు లేదైన దృష్టిదోషము గలిగెనా యనియు, మఱికొందఱు భామిను లోర్వలేక నెవరైన విషమే పెట్టియుందురా యనియు, ఇంక కొందఱు పొలతులు సహింపజాలక యెవరైన భూతవైద్యప్రయోగము జేసిరాయనియు లేక నేదైన గ్రహావేశము గలిగెనా యనియు శంకించుచుండిరి 'అయ్యో! మనపై దయ గలిగి మనము తరించుటకు సర్వేశ్వరుండు శ్రీపార్వతీదేవిని బంపినట్లు తలంచి యుంటిమి అయ్యయో! అకటా! భగవంతుడు మనపై చిన్నచూపు జూచెను గదా యని చెప్పుచు మఱికొందఱు లలనామణు లేడ్చుచుండిరి మఱికొందఱు పడతులు తీవ్రయోగసాధనచే మతి యేమైన చెడినదా యనియు, యోగములో నతితీవ్రముగా వెళ్ళువారి కీలాగున సంభవించుట గలదనియు, నెవఱినైన పెద్దల నడిగిన బాగుండు ననియు జెప్పుచుండిరి

ఇవి యన్నియు విని భారతి సూర్యోదయమున వికసించెడు పద్మమువలె వికసితముఖియై ఇటుల జెప్పెను 'పూర్వమువలె నుండకపోవుటకు మీ రెవరును నేమియు సంకటపడ నవసరము లేదు మీరును, లోకులును చెప్పెడి దోషమే

దియును నాకు గలుగలేదు నాకు గొప్పదగు నొకసందేహము సమాధి విషయమై శివజీవైక్యవిషయమై గలగినది దానివలననే ఈ మార్పులన్నియు గలిగినవేగాని మంఱేమియు కాదు నాకు మతి చెడుటగాని, యోగవములో విప్లవము గలుగుటగాని, జ్ఞాపకశక్తి లేకపోవుటగాని గలుగలేదు ఈ నా సందేహము జెప్పినచో మీకిపు డర్థము గాదు గొప్పఋుషులు మాత్రమే దాని నెఱుంగ గలరు ఇదియు నిపుడు గలిగినది గాదు సందేహము గలిగి కొన్ని రోజులాయెను అయినను మనస్సులో దాని నాపి యుంచితిని గురువరుండు వచ్చినచో ఇది తీరిపోవునని దలంచియుంటిని వారును నేనడిగిదానికి కొలది సమాధానము జెప్పినను, సందేహమును పూర్తిగ నిర్మూలింప జేయజాలక పోయిరి 'స్త్రీలకిట్టి హెచ్చైన బ్రహ్మనిష్ఠ కర్హత లేదని తలంచిరో లేక నిది కొంతకాలము వేదాంతవిచారణచేత తీరవలసినదే కాని యోగము మంత్రము, వ్రతమువలె నొకమాటలో జెప్పిన యర్థము గాదని తలంచి విడిచి పెట్టిరో లేక యౌవ నావస్థలో నుండు నాబోటివారితో యంతం లెక్కువగా సంభాషించుట సరిగాదని తలంచి యుపేక్షించిరో తెలియ జాలకున్నాను సర్వేశ్వరుని కరుణచే నింతవఱకే కొఱతయు గలుగ లేదు మీరందఱు మామూలు ప్రకారము గీతాపారాయణ, రాట్నము పై దారము తీయుట, శనివారమునను, ఏకాదశిరోజునను దైవభజనయు, నితర రోజులలో వేదాంతవిచారణయు జేయుచుండవలయును రేపటి దినము నుండి మీలో నొకరు మొట్టమొదట గీత జదువుటను నేర్చుకొనవలయును శ్రీరత్నమాంబగారికమీదట గీతాపారాయణలో నుండెదరని చెప్పజాలను దీనికికారణ మంతయు రేపటి దినము వారే తెలిపెదరు తీక్ష్ణమైన బాణము గాఢముగ తగిలిన లేడివలె నాకు గలిగిన సందేహము నా హృదయమును బాధించుచున్నది ఈ సంశయ నిశితశరము నేమహాత్ముడు దీసివేసి యాత్మశాంతిని గలుగ జేయునో, నేనట్టి వారికొరకు నిరీక్షించుచున్నా'నని పలికెను ఇట్టి భావము లోపల గలిగియుండినను, మనోనిశ్చయము జేసికొని, యెక్కువక్లేశమునుగాని, యెక్కువ ప్రసన్నతనుగాని పొందక కొంతకాలముండి, మామూలుగా తనయొక్క ధ్యానాదులను, మహిళా మండలి వారితో గూడి గీతాపారాయణను జేయుచు కాలము గడుపుచుండిరి

ఇంతలో వర్షాకాలమున జలపక్షులు సరోవరమునకు స్వయముగా వచ్చి చేరునట్లు కొన్ని సిద్ధులు గలుగనారంభించెను అవి యెటువంటివనగా ఎవరు వచ్చి ననుసరే, వారియొక్క మనస్సులోగల సంకల్పమును దెలిసికొను శక్తియు, ఎవరైన నేదైన కోరికతో వచ్చినచో మీకీసంకల్పము కలదుగదా! దానికీలాగున చేయుడని చెప్పుటకు స్వయంవముగా దోచుంటయు, చెప్పినట్లు వారికి ఫలింపుటయు, రోగులు వచ్చినచో 'దీనిని భుజింపుడు' అని చెప్పినచో నానిధముగ వ్యాధి నయమగుటయు, గ్రహములు భూతములు పట్టిన వారు వచ్చిన 'ఓ తల్లీ! అమ్మా! మీ హస్తముతో కొంచెము తీర్థమిచ్చినను లేక కొంచెము విభూతినిచ్చినను వెళ్ళిపోయెదను మీ సన్నిధిలో నుండజాలను, నిప్పులో పడి తపించునటుల మీ దివ్యతేజస్సుచే తపించు చున్నాను ఇక నాకు శాపవిమోచనము గలుగుచున్నది' అని చెప్పుచు బహుకాలము నుండి బాధించెడు మహాభూతములు గూడ పారిపోవుచుండెను అదేరీతిగ సంతాన రహితులేతెంచి యేదేని భారతీదేవిగారిచేతితో నీయబడిన ప్రసాదము భుజించినచో సంతానము గలుగుటయు, మఱియు కొన్ని గృహములలోగల పీడలు, గృహబాధలు భారతీదేవిగారి పేరుపెట్టి 'ఉండి' యేర్పఱచినచో నాలాటి దోషములు దొలగుటయు, కొంతదూర ప్రదేశములలో పిశాచములు పట్టియుండు వారు ఫలానా భారతీదేవి తపఃస్థమునకు పోయిన మాకు మోక్షము గలుగును అచ్చటికిగొని పోయినచో నేను వెళ్ళిపోయెద' నని చెప్పు చుండుటయు మొదలగు సిద్ధులు స్వయముగానే గలిగెను

ఇదియును గాక గొప్ప గొప్ప మాంత్రికుల చేతను గూడ తొలగనివియు, బహుకాలవము నుండి యనేక విధములుగా బాధలు పెట్టుచుండెడు భూతములుగూడ భారతీదేవిగారి యాశ్రమమునకు వచ్చినతోడనే వదలి పోవుచుండెను ఇంక నెవరెవరే యే కోరికలతో వచ్చినను, భారతీదేవిగారిని ప్రార్థింపగానే యవి గలుగు చుండెను నిరుద్యోగు లుద్యోగులగుటయు, నిరుపేదలు ధనవంతులగుటయు విద్యా విహీనులు విద్వాంసులగుటయు, గృహచ్ఛిద్రములు గలవారి దోషములు పోయి యైక్యత గలుగుటయు, దంపతు

లిరువురిలో నొకరి కొకరియందుగల వైషమ్యము పెరిగి, సంసారము విచ్ఛిన్నమయినవారికి, మఱల నైకమత్యము గలిగి మామూలు ప్రకారము సంసారము జరుపుటయు నీలాటి సిద్ధులన్నియు బహుళముగా గలిగెను ఇవి యన్నియు స్వయముగా గలిగినవేగాని, వీటి కేమాత్రమైన ప్రయత్నము జేసియుండలేదు

ఇట్లుండగా, ప్రపంచమునందలి జనులు విశేషముగా వచ్చుటయు, నన్న దానము లపారముగ జేయుటయు జరుగుచుండెను కాని దానివలన నాధ్యాత్మిక ప్రబోధము క్షీణింపదొడగెను గీతాపారాయణకును సమయము చాలక వచ్చెను అంతేగాక దేవిగారాత్మలో నేమి సంకల్పించినను నదియట్లే జరుగుచుండెను ఇట్టి స్థితిలో విరక్తులై బ్రహ్మవిచారము జేయువారి కేకాంతము తగ్గిపోవుటచే వారాశ్రమమునకు రాకనేపోయిరి అట్టి తరుణమున ననేకులు గొప్ప యాశ్రమ మును నిర్మించుటకును, నయ్యది స్థిరముగ జరుగుటకు తగిన భూమి మొదలగు పరికరములను కూర్చుటకును, ననుమతి నీయవలయునని దేవిగారిని ప్రార్థించు చుండిరి అత్తరి కఠోపనిషత్తునందుగల ఈ వాక్యము భారతీదేవిగారికి జ్ఞాపకమునకు వచ్చెను

*శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।*
*శ్రేయోహి ధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయో మన్దో యోగక్షేమాద్వృణీతే ॥*

బ్రహ్మనిష్ఠలో తీవ్రముగ ప్రవర్తించెడు మనుజుని శ్రేయస్సు, ప్రేయస్సును పొందుచున్నవి శ్రేయస్సనగా మోక్షము ప్రేయస్సనగా ప్రపంచ సుఖము అపుడు నిర్మల బుద్ధిశాలి యట్టి శ్రేయఃప్రేయస్సులను బాగుగా నాలోచించి, ప్రేయస్సుకంటె శ్రేయస్సే శ్రేష్ఠమని నిశ్చయించుకొనుచున్నాడు అల్పబుద్ధిగలవాడు ప్రపంచసౌఖ్యమే గొప్పదని దలంచి ప్రేయస్సును వరించుచున్నాడు భారతి ఈ యర్థము బాగుగా చింతనచేసి యిపుడు గలిగిన యీ సిద్ధి సమూహముగూడ మోక్షమున కవరోధమని తలంచెను పామర జనులు నిండిన, ఆత్మనిష్ఠులకు భంగము గలుగును అంతేకాక అట్టి జనులుండిన యీ స్థలమున కిపుడు గలిగియుండు పవిత్రతయు, శాంతియు, దివ్యశక్తియు

తప్పక తగ్గి పోవునని నిశ్చయించుకొని యోగశాస్త్రమును జూడ ప్రారంభించెను అప్పుడు ఈ యోగవిఘ్నములు గనుపించెను

*ఉపసర్గాః ప్రవర్తన్తే దృష్టే హ్యాత్మని యోగినః ।*
*ఏతాంస్తే సంప్రవక్ష్యామి సమాసేన నిబోధ మే ॥*

*కామ్యాః క్రియా స్తథా కామాన్ మనుష్యో యోఽభివాఞ్ఛతి ।*
*స్త్రియో దాన ఫలం విద్యాం మాయాం కుప్యం ధనం దివమ్ ॥*

*దేవత్వ మమరేశత్వం రసాయనం వయః క్రియామ్ ।*
*మరు త్ప్రపదనం యజ్ఞం జలాగ్న్యావేశనం తథా ॥*

*శ్రాద్ధానాం సర్వదానానాం ఫలాని నియమాం స్తథా ।*
*తథోపవాసా త్పూర్తాచ్చ దేవతాభ్యర్చనాదపి ॥*

*అతిథిభ్యశ్చ కర్మభ్య ఉప స్పృష్టోఽభివాఞ్ఛతి ।*
*విఘ్నమిత్థం ప్రవర్తేత యత్నాద్యోగీ నివర్తయేత్,*
*బ్రహ్మసంగిమనః కుర్వ న్నుపసర్గైః ప్రముచ్యతే ॥*

యోగుల కాత్మను దర్శించునపు డేవిఘ్నములు ప్రవర్తించుచున్నవో వాటిని నీకు సంగ్రహముగా జెప్పెదను వినుము కామ్యక్రియలును నట్లే యనేక కోరికలును, స్త్రీలును (స్త్రీలకు పురుషులు) దానఫలమును, విద్యయు, వంచనమును, బంగారు,వెండి మొదలు గాగల లోహములును, ధనమును, స్వర్గమును, దేవత్వమును, ఇంద్రత్వమును, రసాయనమును, దీర్ఘ కాలజీవితమును (లేక యెల్లప్పుడు యౌవనముగా నుండుటయు) శిల్పము ను, యజ్ఞమును, జలస్తంభనమును, నగ్ని స్తంభమును, వాయుస్తంభమును (ఆకాశగమ నము) నాలాగున శ్రాద్ధఫలమును, సకల దానఫలమును, దేశకాల సమయమును ననుసరింపక హరమగు భోజన నియమమును నదేరీతిగా శుష్కోపవాసమును, నిష్టాపూర్త కర్మములును (దొరువులు, బావులు తటాకములు త్రవ్వించుట, వనములనిర్మించుట) దేవతాదర్శన సిద్ధియు, యతిథులచేతను, ఇతర కామ్యకర్మ ప్రవర్తనచేతను గలుగు విఘ్నములు నుపసర్గము

లనబడును ఎవడియ్యవి యాత్మ సాక్షాత్కారమునకు విఘ్నము లని తెలిసికొనకున్నాడో అట్టివాడు పతితుడగును కావున పై నుదాహరించినవాటిలో మనస్సును పోనీయక యత్నపూర్వకముగా నుంచుకొనవలయును అట్టివాడు యోగమునకు గలిగెడు విఘ్నములనుండి విముక్తుడగుచున్నాడు కావున బ్రహ్మధ్యానమందు మనస్సును నిల్పినవాడై యుండువాడుమాత్రమే పై జెప్పిన యవరోధముల నుండి ముక్తుడగును

*సాత్త్వికీం ధృతిమాలమ్బ్య యోగసత్త్వేన సుస్థిరః ।*
*నిర్గుణం మనసా ధ్యాయన్నుపసర్గైః ప్రముచ్యతే ॥*

*ఏవం యోగముపాసీత శక్రాదిపదనిస్పృహః ।*
*సిద్ధ్యాదివాసనాత్యాగీ జీవన్ముక్తో భవేన్మునిః ॥*

*విస్తరస్య భియా నోక్తాః సన్తి విఘ్నాహ్యనేకశః ।*
*ధ్యానేన విష్ణు హరయోర్వారణీయా హి యోగినా ॥*

యోగి సాత్త్వికమైన బుద్ధితో గూడినవాడై సాత్త్వికమైన ధైర్యమును వహించి త్రిగుణాతీతమగు బ్రహ్మమును మనస్సుతో ధ్యానించుటవలన విఘ్నములనుండి విడువబడుచున్నాడు ఇట్లు యోగము నభ్యసించు చున్నవాడై యింద్రాది పదములను గూడ తృణీకరించి యణిమాది సిద్ధులయందలి వాసనలను విడిచినవాడైన మనన శీలుడు జీవన్ముక్తుడగు చున్నాడు పై జెప్పిన విఘ్నములు భక్తితో గూడిన విష్ణు శివ ధ్యానముచే దొలగింపదగినవి లోకాడంబరమును, మహిమలను కోరువాడు పై జెప్పిన విఘ్నములచే నవరోధింపబడినవాడగును

మరియు నిట్లాలోచించిరి ఎట్టి దోషదూషిత హృదయులు గూడ నీస్థలము నకు వచ్చునప్పటికి పరమసాధువులగుచున్నారు కఠినమనస్సుగలవారు సయితము కారుణికు లగుచున్నారు పాపబుద్ధిగల కఠినాత్ములు కూడ పుణ్యాత్ములగుచున్నారు దాన ధర్మములను జేయనివారు గూడ మంచి ధర్మపరులును, దానశీలురును నగుచున్నారు దైవభక్తి లేని పరమ నాస్తికులు గూడ మహా ఆస్తికులుగాను భక్తులుగాను మారుచున్నారు దుష్టబుద్ధితో నాశ్రమమును

జూడ నేతెంచువారు స్వల్పసమయము లోనే సద్బుద్ధిగలవారగు చున్నారు విషయదృష్టిగలవారుగూడ నాశ్రమ దర్శనమువల్ల నిర్విషయు లగుచున్నారు మహాగర్వులు, రజోగుణము గలవారుగూడ వినీతులై సాత్వికులుగా మారుచున్నారు ఇది యీ స్థలములో జరుగుచుండెడు గీతాపారాయణ చేతను, తపో, ధ్యాన, నిష్ఠాదులజేయువారి యాత్మ పవిత్రతవలనను గలిగెడు మహిమయే ఇయ్యది స్థలవిశేషమహిమగాని మఱొకటిగాదు భగవత్కీర్తన, ప్రార్థన, భక్త్యాదుల ప్రభావము ఈ దివ్యత్వము గలుగుటకు కారణమని నిశ్చయించుకొనిరి

మఱియు నిట్లూహించిరి 'సుగంధవస్తువులుండు ప్రదేశమున దుర్గంధ వస్తువులు పడినచో, ఏలాగున సుగంధము నశించునో, గోవులు మేయు స్థలమున పెద్దపులి ప్రవేశించినచో ఆవులెట్లు పారిపోవునో, హేమంతము ప్రవేశించిన తామర పూవులెట్లు నశించునో ఆలాగున దుష్టగుణములు గలవారు, విషయ బుద్ధిగల వారెక్కువగ జేరుచున్నందున నచట మామూలుగ జరుగుచుండు ధ్యాన పారాయణాదులు తగ్గుటచే నా ప్రదేశమునందుండు పవిత్రతయు క్రమముగ కృష్ణపక్షచంద్రునివలె క్షయించును కావుననే గొప్ప బ్రహ్మవేత్త లణిమాద్యష్టసిద్ధులను గూడ మోక్షావరోధములనుగా దలంచి, నీచములని దగ్గఱకు జేరనీయకుండిరి ప్రాపంచిక ధనమున్ను, ఉన్నతోద్యోగమున్ను, లోకములోనుండువారి కెంతో గొప్పవిగా దోచినను, వాటి నాత్మధ్యానసుఖము గలిగినవారు హీనములనుగా జూచెదరు ఏ కారణమువలన రంభాది స్త్రీలను గూడ, శుకాది మహర్షులు దుర్గంధ భూయిష్ఠశవములని తలంచిరో, మఱియు మీరాబాయి మొదలగు మహారాజకుమార్తెలు రాజవైభవమును గూడ తిరస్కరించి భూపాలురను భర్తలుగా వివాహము చేసికొననొల్లక శ్రీ కృష్ణ ధ్యానపరవశురాండ్రై బృందావనమునకు పరుగిడిరో, ఆ కారణముచే నీ సిద్ధు లాత్మావరోధకము లని తలంపవలయును కావున నీదినము నుండియు నెవరితోను ఆలాటి విషయము జెప్పకుండుటయేగాక వచ్చినవారి కిక మీద నిచట నేమియు బాగుపడకూడదని దృఢముగ సంకల్పించెను సంకల్పసిద్ధి గలిగినచో కాకూడదని సంకల్పించిన, నది గూడ నటులనే జరుగవలయును గదా? ఏలన,

రక్షణాధికారము గలవానికి శిక్షణాధికారముగూడ నుండును రైలుబండి నడుపశక్తిగలవానికి దానిని నిలుపుటకును, వెనుకకు మఱలించుటకును గూడ సామర్థ్యముండును సృష్టిచేయు శక్తిగల ఈశ్వరునకు దానిని తనలో లయమొనర్చుకొనుటకు గూడ శక్తి యేల లేకపోవునని నిశ్చయించుకొనెను

ఆదినమునుండి యెవరికిగాని తనచేతితో నేదియ నీయక 'ఎవరికిని బాగుపడ కూడద'ని సంకల్పించినప్పటినుండి గుంపులు గుంపులుగా వచ్చెడువారి బాధలు నివృత్తిగాకుండెను అందువల్లనటువంటి వ్యాధిపీడితులగు జనుల రాకయు, క్రమముగ శరత్కాలమున మేఘపటల మాకాశమునుండి తొలగునట్లు తొలగిపోయెను అప్పటినుండి యట్టి కార్యములకొఱకు వచ్చెడివారే లేకపోయిరి అప్పుడు వర్షజలము చెరువులోనికి వచ్చునపుడు నీటికోళ్ళు గుంపులు గుంపులుగా వచ్చినేరునట్లు, పూర్వము రాకుండ నిలిచి పోయినవారును, క్రొత్తగా భక్తులును ముముక్షువులును రాదొడంగిరి అప్పటినుండి భక్తుల హృదయమంతయు నాత్మోన్ముఖమై దైవచింతన యధికరించెను అత్తరి భారతీదేవి యాశ్రమము పార్వతీ దేవియొక్క తపోవనము దేవతాస్త్రీలచేత వలె, పరమశివభక్తిగల జీవన్ముక్తురాండ్రగు తపస్వినులవలనను, నాత్మ తత్త్వజ్ఞానముగల మానినీమణులచేతను మిక్కిలి ప్రకాశించుచుండెను ఈలాగున కొంతకాలము గడచిన పిమ్మట తన కిదివఱలో గలిగియుండిన విచారము, పొగతో గూడిన కట్టెలు వాయుదేవునిచే ప్రజ్వలింపజేయబడినట్లు తీవ్రరూపమును దాల్చెను అపుడు కొలదిరోజులలోనే తీర్థయాత్ర నెపమున తాపసులు వసించెడు హిమాలయ ప్రదేశమునకు వెళ్ళవలయునని తలంచి, యొకనాటిరాత్రి రత్నమాంబగారు నివసించెడు కుటీరమునకు వెళ్ళి లోపలజూడగా వారు బాగుగా నిద్రపోవుచుండిరి మంచి వెచ్చని శాలువను కప్పుకొనియుండిరి ఒకటి రెండుసారులు పిలిచినను మేల్కొంచలేదు మఱల కరముతో స్పృశించి కదలించినపుడు జాగ్రదవస్థను బొందిరి అపుడామె భారతీదేవిగారిని జూచి భయముతో నమస్కరింపగా 'భయ పడకుము' అని మిక్కిలి ప్రశాంతముతో జెప్పి యెల్లప్పుడు భారతీదేవి ధ్యానము జేసెడు బిల్వ వృక్షమూలమున

కిరువురును వెళ్ళి కూర్చుండిరి

తరువాత రత్నమాంబగారితో భారతీదేవి యీలాగున జెప్పదొడగెను 'రత్న మాంబ గారూ! ఒకముఖ్యవిషయ విచారణ కొరకిప్పుడు మిమ్ములను లేపితిని దీనిని రహస్యముగా నుంచవలయును లేనిచో మనము భావికాలమున జేయదలచిన కార్యములకు భంగము గలుగును నాకు గలిగియుండు సందేహము దినదినము అతిశయించుచున్నది వ్రణముగల ముసలి ఆవును కాకులు పొడుచుచుండిన యెంత సంకటముగా నుండునో, ఆలాగున నామనః పరిస్థితి గూడ నున్నది వ్రణము గలుగుటయే వేదనాకరము, దానియందు పురుగులుగూడ పడి కరచుచుండిన నెంత బాధగానుండునో ఆలాగున నా సందేహవ్రణము లోపల భావికాలమున జరుగవలసిన చింతలనెడు క్రిములబాధయు మిక్కిలి కష్టతరముగా నున్నది మఱియు తీర్థయాత్రగూడ నొకసారి చేయవలయునను తలంపు బాల్యకాలములో నుండెను కావున మీరీ యాశ్రమ కార్యముల నిర్వహించుచు మహిళామణులతో గీతాపారాయణజేసి కొనుచు నిచటనే నుండవలయును' ని వచించెను

అంతట శ్రీరత్నమాంబగారు పిడుగుపడిన మనుజునివలె నిశ్చేష్టురాలై "తల్లీ! భారతీ ఈ మాటలు వినిన మీ తల్లిదండ్రులు మరల జీవించి యుందురా! ఒకవేళ పురుషుడైనందు వలన జనకు డోర్చుకొనినను జనని మరల ప్రాణములతో నుండు నా"? అని దుఃఖముతో నుడివిరి దానిని విని భారతి, "జననీ జనకుల విషయ మట్లుండుగాక మీ కార్యమును జూచుకొను" డనెను అపు డారత్నమాంబగారు 'అట్లయిన నేనును మీ వెంట వచ్చెదను మీరు లేనిది నేనుండజాలన' ని చెప్పిరి ఆ వచనమును విని భారతి "తీర్థయాత్ర జేయవలయుననియు, ననుకూలమైనచో ఎచటైన నేకాంతముననుండి నన్ను బాధించెడు సందేహమును నివృత్తి చేసికొనవలయునను తలంపుతో నేనీ యాహారాది నియమముల యేర్పాటు చేసికొంటిని మీకట్టి యింద్రియ నిగ్రహస్థితి యింకను గలుగలేదు ఇంద్రియములు శుద్ధములై స్వాధీనములై యుండువారియొక్క స్థితిని నిద్రలో తెలిసికొనవచ్చును కాబట్టియే మిమ్మ

లను నిం(ద్రించునపుడు పిలుచుటకు కారణము ఇం(ద్రియజయము గలవారిని ని(ద్రలో చిన్న శబ్దముతో బిలిచినను జా(గ్రదవస్థలో పరుండినవారు లేచునట్లు లేవ గలరు అట్టివారు విశుద్ధసత్త్వగుణములో నుండువారు సత్త్వగుణము గలవారైనచో ఒకసారిగాని లేక రెండుసార్లుగాని పిలచినచో వారును ని(ద్రావికారములేమియు లేకనే లేచెదరు రజోగుణము గలవారును, ఏలాటి సాధనయు జేయనివారైనచో కొలది బిగ్గరగ పిలిచిన చాలును అపుడు వారును లేవగలరు మి(శ్రగుణము గలవారై నచో పిలుచుట మా(త్రము చాలదు కొంచము శరీరమును కదిలింపవలయును లేచినను ని(ద్రామాంద్యము గలిగియుందురు తరువాత చల్లని నీటితో ముఖము కడుగుకొనిన జా(గ్రదవస్థకు వచ్చెదరు ఇక తమోగుణము గలవారి లక్షణము వినుడు ని(ద్రలో నున్నపు డెంతయో కదలించిన యెంతోసేపో యరచిన లేచి కూర్చొని, పిలచినవారు పోగా మఱల ని(ద్రపోవుచుందురు పిలిచెడివారు మౌనముతో దగ్గఱనుండినపుడీస్థితిని గాంచుదురు ఇంకను లేపచూచినచో మూల్గుచు నచ్చటనే పడియుందురు ఇంకను బాగుగా దొర్లించినచో లేచి కూర్చుండి కండ్లు తుడుచుకొనుచు నొకఘుంట సమయమునకు పైకిలేచి నిలిచెదరు కనుక మిమ్ముల నొకసారి పిలువగా లేవలేదు రెండుసారులు పిలిచినను లేవకపోతిరి శరీరమును తాకిన పిమ్మటనే లేచితిరి దీనివలన మీరు కొంత సత్త్వగుణమును, కొంత రజోగుణమును గలిగియున్నట్లు గోచరమగుచున్నది అంతేగాక మంచి శాలువలు కప్పుకొని ని(ద్రించుచుంటిరి దీనవలననే యింత గాఢని(ద్ర పట్టుటకు కారణము మిక్కిలి చలియుండినచో ఏదైన కప్పుకొనవలయును లేనిచో కట్టుబట్టతో పరుండుట మేలు అట్లయినచో ఎంతమా(త్రము ని(ద్ర కావలయునో, అంత ని(ద్రయే వచ్చును కావుననే, యోగు లల్పాహారమును స్వల్పని(ద్రయును గలిగియుండుటకు కారణము

భోజనములో ఒక కూరయు, పలుచని పప్పుచారును చాలును లేక యొక పచ్చడిగాని యుండవచ్చును అంతేగాని నూనెలో వేసిన యావకాయలు, ఊర గాయలు మంచివి గావు మఱియు నింగువగాని, యావాలు పిండిగాని వేసినదైనచో పురుషులకు (బహ్మచర్యమును దప్పక నష్టపఱచును స్త్రీలకైనను రక్తము

నుద్రేకపరచి విషయస్మృతిని గలుగజేయును మఱియు రకరకములగు వడియాలుగాని, మసాలతో గూడిన కూరలుగాని మంచివి గావు ప్రాపంచిక భోగములు గలిగినను యోగమునకు విఘ్నములు భోగమును గొప్పదని తలంచువారు రోగములకు పాత్రు లగుటయేగాక జీవితమునగల యమూల్యకాలమును గూడ చాలవరకు నష్టపఱచుకొనినవా రగుదురు భోగమునకు ధన మధికముగ కావలయును ధనము నెక్కువ కాలము పనిజేసి సంపాదింపవలయును ఈ కారణమువలన నాత్మవిషయములో నెక్కువ ప్రయత్నించుటకు కాలము చాలదు అంతేగాక ధన లాభముకొఱకు కొంత పాపకార్యముగూడ జేయవలసియుండును

భోగపరులకు నిద్ర యధికము కావున రెండు విధముల జూచినను నష్టమే కనబడుచున్నది ధనార్జనకై కాలమధికముగా వ్యయమగుటయు, నధికముగా భుజించుటచే నిద్ర యెక్కువగుటయు సంభవించును మఱియొక రహస్యము గూడ గలదు ఆహారమధికమైనచో వీర్యము గూడ యధికరించును అపుడు బ్రహ్మచర్యము నిలుచుట కష్టసాధ్యము గృహస్థాశ్రమియైన గృహస్థ బ్రహ్మచర్యమయిన ననుష్ఠింపజాలడు కాబట్టి మీకు నిద్ర యధికముగా నుండుటవల్ల నాతోగూడ నేతెంచుట కనుకూలముండదు వారివారి గుణముననుసరించిన వారి సహవాసముండినచో ఉభయులకును సరిపోవును లేనిచో ఒక బండికి ఒక గుఱ్ఱమును, ఒక యెద్దును కట్టినట్లు వారి ప్రయాణ ముభయులకును సౌఖ్యము గలుగ జేయదు అంతేగాక ఆత్మవేత్త లొంటరిగా సంచరింపవలయుననియే శాస్త్రము చెప్పుచున్నది ఎట్లన

*యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ।*
*ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ - గీత*

ధ్యానయోగపరు డొంటరిగాను, ఇంద్రియములను, మనస్సును స్వాధీనము నందుంచుకొనువాడుగను, దేనియందును ఆశలేనివాడుగను, దానాదిపరి గ్రహములను గ్రహింపకుండుట జేసి యపరిగ్రహవ్రతము గలవాడుగను, ఏకాంత మందుండువాడుగాను, ఎల్లప్పుడు నాత్మను ధ్యానమందు

లయపఱచువాడుగాను నుండవలయును పరిగ్రహముచే గలిగెడు దోషమును మను మహర్షి యుపదేశించి నది మాడుడు

*ప్రతిగ్రహసమర్థోఽపి ప్రసంగం తత్ర వర్జయేత్ ।*
*ప్రతిగ్రహేణ హ్యస్యాశు బ్రాహ్మం తేజః ప్రశామ్యతి ॥*

బ్రహ్మనిష్ఠుడు విద్యా తపోవృత్తములతో గూడుకొనినను, ప్రతిగ్రహమందు సమర్థుడై యుండినను, ప్రయత్నపూర్వకముగా నట్టి వృత్తిని విడువవలయును ప్రతిగ్రహముచేత శీఘ్రముగా వానియొక్క బ్రహ్మ తేజస్సును, తపస్సును, క్షయించును పరవస్తువును గ్రహించుటచే వీరి పుణ్యము వారికిచ్చి వారి పాపమును తాము దీసికొనుచున్నట్లు తలంపవలయును తీవ్ర బ్రహ్మనిష్ఠ గాని, లేక పరోపకారము గాని చేయువాడైనను తనయొక్క యన్నవస్త్రాదులెంత తగ్గించిన నంత మంచిది

*ఏక కాలం చరేద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే ।*
*భైక్షే ప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి ॥*

బ్రహ్మనిష్ఠుడు దినమున కొకపూట మాత్రమే భోజనము జేయవలయును ఆ భోజనమున్ను సౌఖ్యముకొఱకుగా నుండరాదు అంతేగాక భోజనమం దెక్కువ కోరికయు నుండరాదు భోజనమందు ప్రీతిగలవారికి ధాతువు వృద్ధినొందుటవలన నింద్రియ విషయములందు ప్రవృత్తి గలుగును

*అలాభే న విషాదీ స్యాల్లాభే చైవ న హర్షయేత్ ।*
*ప్రాణయాత్రిక మాత్రస్స్యాత్ మాత్రాసంగాద్వినిర్గతః ॥*

భోజనాదులు సమృద్ధిగా దొరకనప్పుడు విచారపడరాదు కావలసినంత మంచి పదార్థములు దొరికినప్పుడుప్పొంగరాదు ప్రాణసంరక్షణకు కావలసినంత మాత్రమే భోజనము జేయవలయును శబ్దాది విషయముల యందేమాత్ర మభిలాష నుంచరాదు

*అభిపూజిత లాభాంస్తు జుగుప్సేతైవ సర్వశః ।*
*అభిపూజిత లాభైశ్చ యతిర్ముక్తోఽపి బధ్యతే ॥*

గృహస్థుడగు నొకడు తన్ను గౌరవించి యిచ్చిన భోజనాదులను నెల్లపుడు గైకొనరాదు అట్టి భోజనాదులు గ్రహించుటవే భోజన మిడినవారి యందలి వాత్సల్యమువలన ముక్తిమార్గము నొందదగినవాడు కూడ జన్మపాశమున జిక్కుకొను మన్నాడు

*అల్పాన్నాభ్యవహారేణ రహఃస్థానాసనేన చ ।*
*ప్రీయమాణాని విషయై రింద్రియాణి నివర్తయేత్ ॥*

అల్పాహారమును భక్షించియు, నేకాంతములందుండియు విషయముల లోనికి జొచ్చునట్టి యింద్రియములను వానినుండి మఱలింపవలయును

*ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేష క్షయేన చ ।*
*అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే ॥*

ఇంద్రియముల నిగ్రహించియు, మిత్రులయందు స్నేహమును, శత్రువుల యందు ద్వేషమును లేకుండియు, జీవులను హింసింపనట్టియు బ్రహ్మనిష్ఠుడు మోక్షము నొందును

*యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।*
*శాంతిం నిర్వాణ పరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ గీత*

నియమింపబడిన మనస్సుగల ధ్యానయోగ పరుడెల్లప్పుడు నీ ప్రకారముగా మనస్సును ధ్యానమందు నిలిపినవాడై, మోక్షమే సర్వోత్తమముగా గలిగినదియు, నా యధీనమైనదియును నగు సంసారోపరతిని (పరమశాంతిని) పొందుచున్నాడు

*నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంత మనశ్నతః ।*
*నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥*

అర్జునా! అధికముగా భుజించువానికి ధ్యానయోగము సిద్ధింపదు కొంచము గానైనను భుజింపని వానికిని యోగసిద్ధి గలుగదు అధికముగా నిద్రించువానికిని ధ్యానయోగసిద్ధి లేదు నిద్రలేనివానికిని ధ్యానయోగప్రాప్తి గలుగదు కావున వీటన్నిటిలోను బ్రహ్మనిష్ఠ కనుకూలముగ ముముక్షువులు

ప్రజ్ఞతో జూచుచుండ వలయును

*ద్వౌ భాగౌ పూరయేదన్నైః తోయేనైకం ప్రపూరయేత్ ।*
*వాయోస్సంచరణార్థాయ చతుర్థమవశేషయేత్ ॥*

ఉదరము రెండు భాగము లన్నముచేతను, నొకభాగము జలముచేతను పూరించి నాల్గవ భాగమును వాయు సంచారమునకై విడువవలయును అట్టి వాడెల్లప్పుడును మెలకువ గలిగియుండును సోమరితనము, బుద్ధిమాంద్యము లతని దగ్గఱకైనను జేరవు

*అత్యాహారః ప్రయాసశ్చ ప్రజల్పో నియమగ్రహః ।*
*జనసఙ్గశ్చ లౌల్యం చ షడ్భిర్యోగో వినశ్యతి ॥*

అధికమైన భోజనము, శ్రమను గలుగ జేయు పని, అధికముగా మాట్లాడుట, నియమమును గైకొనుట, ప్రాపంచిక జనుల మధ్యయం దెల్లపుడుండుట, విషయ లోలత్వమను నీ యారింటివలన యోగము నశించును ఇచట నియమమనగా ఆవు పాలు, గోధుమరొట్టె, పూరి, పచ్చిబియ్యపు అన్నము ఇటువంటివి కావలయునని హఠము గలిగియుండుట యనునది మంచిది కాదు ఏ సమయమున నెచట నేది దొఱకునో దానిని ప్రీతితో భుజించు స్వభావము గలిగియుండ వలయును ఒక్కొక్క స్థలములో నొక్కొకటి దొరకదు కనుక నట్టి నియమమును పెట్టుకొనరాదు బ్రహ్మనిష్ఠుడు ఆహారాదులచే నితరులకు బాధ కలిగించరాదు, తన నిష్ఠకు హాని కల్గించుకొనరాదు

*ఉత్సాహాత్సాహసాద్ధైర్యాత్తత్త్వజ్ఞానాచ్చ నిశ్చయాత్ ।*
*జనసఙ్గ పరిత్యాగాత్ షడ్భిర్యోగః ప్రసిద్ధ్యతి ॥*

ఉత్సాహము, కార్యదీక్ష, ధైర్యము, తత్త్వజ్ఞానము, దృఢనిశ్చయము, ప్రాకృతజన సఙ్గ పరిత్యాగమను నీ యారింటివలన ధ్యానయోగము సిద్ధించుచున్నది

*దృష్టే తథానుశ్రవికే విరక్తం విషయే మనః ।*

*యస్య తస్యాధికారోఽస్మిన్ యోగే నాన్యస్య కస్యచిత్ ॥*

ఇహ పరలోక విషయములందు విరక్తిగల చిత్తము గలవానికే ఈ ధ్యాన యోగమం దధికారముగలదు తదితరులకు లేదు

*ఇహాముత్ర విరక్తస్య సంసారం ప్రజహాసతః ।*
*జిజ్ఞాసోరేవ కస్యాపి యోగేఽస్మిన్నధికారితా ॥*

ఇహలోక పరలోక సుఖములందు వైరాగ్యము గలవాడును, సంసార బంధనమును వదలించుకొనవలయునను తలంపు గలవాడును, జిజ్ఞాసువు నగు వానికి మాత్రమే యీ ధ్యానయోగమం దధికారము గలదు

ఇకనేకాకియై బ్రహ్మనిష్ఠ డుండవలయునను విషయమై చెప్పినది చూడగా,

*ఏక ఏవ చరే న్నిత్యం సిద్ధ్యర్థ మసహాయవాన్ ।*
*సిద్ధిమేకస్య సంపశ్య న్న జహాతి న హీయతే ॥*

ఒంటరియై మఱియొకరి తోడులేక మోక్షసిద్ధి కొఱకు సంచరింప వలయును మోక్షప్రాప్తి యొంటరిగా నుండువారికే గలుగునని తెలిసి, యటుల సంచరించెనేని దేనివలనను దుఃఖము గలదు

*ఆధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరామిషః ।*
*ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ ॥*

ఎల్లపుడు పరబ్రహ్మధ్యానమునం దాసక్తుడై, సిద్ధాసనమం దుండువాడై, దేనియందు నపేక్షలేనివాడై, యింద్రియాది విషయములం దాశను మాని, మోక్ష సుఖముకొఱకై ప్రపంచమునందు సంచరింపవలయును మఱియొకని ఆశ్ర యించి నచో దైవభావమునందు దృఢ సంకల్పము తగ్గిపోవును

*బ్రహ్మవిజ్ఞాన లాభాయ పరహంస సమాహ్వయః ।*
*శాంతి దాంత్యాదిభిస్సర్వై స్సాధనై స్సహితో భవేత్ ॥*

బ్రహ్మ విజ్ఞానమును గోరిన పురుషుడు, హంసకు పరమగు పరమాత్మను

ధ్యానమందు గ్రహించి, శాంతి, దాంతి మొదలగు సద్గుణములు గలవాడై యుండ వలయును అట్టి వానికి మాత్రమే ఈ జన్మమునందు మోక్షము గలుగును''

అని భారతీదేవి చెప్పిన యమోఘ బోధలవిని శ్రీరత్నమాంబగారు తన యొక్క మాంద్యగుణమును దలంచి, ఏమియు జెప్పజాలక కన్నీరు గార్చుచు మౌనముగా కూర్చుండిరి దాని జూచి శ్రీ దత్తాత్రేయముని ఉపదేశించిన యీ వాక్యమును గూడ భారతీదేవి చదివి వినిపించిరి

*వాసో బహూనాం కలహో భవేద్వార్తాద్వయోరపి ।*
*ఏక ఏవ చరేత్తస్మాత్కుమార్యా ఇవ కంకణః ॥*

దీని యర్థము దీనియం దిదివఱలో వ్రాయబడియున్నది ॡ. ३७

ఇటుల చెప్పునప్పటికి భాస్కరుండుదయ పర్వతము నధిష్ఠించినందుచే, వారి వారి దినకృత్యము లనుష్ఠించుకొని, బ్రహ్మనిష్ఠలో ప్రవేశించిరి తరువాత ఆదినము మామూలు ప్రకారము వనితామణులు గీతా పారాయణమునకు, నుత్సవము జూచుటకు జనులు వచ్చి చేరునట్లు మిక్కుటముగా వచ్చి చేరిరి ఆ దినమంతయు గడచినను రత్నమాంబగా రుపవాసముగానే యుండిరి రాత్రి ధ్యాననిష్ఠాదులు జరిగిన పిమ్మట భారతీదేవిగారి సమీపమునకు రోదనము జేయుచు వచ్చి యిట్లు జెప్పిరి 'నేను తల్లి దండ్రులను, తోడబుట్టువు మొదలగువారి నందఱిని విడచి, మీరే తల్లియు, దండ్రియు, దైవము, గురువనియు నమ్మి వచ్చి మీ యనుష్ఠానమున కేలాటి ప్రతిబంధము గలుగజేయక, యింతవఱకెంతో ఆనందముతోను, భక్తితోను కాలముగడపితిని మీ సన్నిధిలోనే నా జీవితమును పూర్తి చేయవలయునని సంకల్పించియున్నా'నని చెప్పుచు, భారతీదేవి పాదములపై బడి రెండుకాళ్ళను గట్టిగ పట్టుకొనుచు నా కభయమివ్వనిదే లేవనని చెప్పుచు రోదనము జేయుచుండిరి

అప్పుడు భారతీదేవిగారికి, వేడి తగిలిన వెన్న కరుగునట్లు, మనస్సు కరిగి రెండు చేతులతోను రత్నమాంబగారిని పైకెత్తి తానును కన్నీరు కార్చుచు, ''తల్లీ! నేను చెప్పెడు వాక్యములను వినుడు మిమ్ములను సామాన్య గురువులవలె నిచటపని

వేయుట కేర్పరచి యుండలేదు మన సిరువురమును నొక తల్లియొక్క యమడ బిడ్డలవలె నుంటున్నామనియే నా నమ్మకము నీకును ధ్యాన నిష్ఠాదులకు కావలసిన సమయము గలదు భోజనము నా తల్లిగారే పంపుచున్నారు ఈ ప్రదేశమును శుద్ధి వేయుటకొఱకును, పుష్పవృక్షాదులకు నీరు పోయుటకును, జనకుడు జీతమిచ్చి స్త్రీల నేర్పాటు జేసియున్నాడు ఎవరైన నారీమణులు వచ్చినచో వారినాదరించు కార్యము తప్ప మఱియే పనియు లేదు గదా! ఉట్లుండగా మీరేల యెక్కువ సమయము నిష్ఠ చేయురాదు? ఏల యింత యధిక నిద్రగలిగి యున్నారు? కావుననే మనకు యాత్రలో సరిపడకపోవచ్చు'నని భారతి దయార్ద్రహృదయయై వచించెను ఆ వాక్యములను విని రత్నమాంబగారిట్లు చెప్పదొడగిరి 'అమ్మా! నాకెక్కువ సమయము మనసు నిష్ఠలో నిలుమట లేదు ఇంటిలో నున్నపుడెన్నియో రకములగు ఫలాహారములు నెన్నియో కూరలు, పచ్చళ్ళు, ఊరగాయలుగూడ గాక, గట్టి పెరుగును వేసికొని భోజనము జేసెడి యలవాటుండెను రాత్రులలో కొంచెము చలి గలదని తోచినచో క్రిందను పైనను మంచి వెచ్చని కంబళ్ళు వేసి, గాలి తగులని స్థలమున పండుకొనెడి స్వభావము గలదానను సూర్యుడెపు డస్తమించునా! ఎపుడు పండుకొనెదమా యని చింతగలిగి యుండెడిది సూర్యు డుదయించినను మేల్కొనను దానను కాను ఇపు డదంతయు మాని వేసినాను ' అని చెప్పెను ఈలాటి దీనవాక్యములు విని, భారతీదేవి యిట్లు వచించెను 'అమ్మా! మీరు చెప్పినది నిజము అది సంసారమార్గము మనది సన్న్యాసమార్గము ఇవి రెండును దక్షిణోత్తర మార్గముల వంటివి మఱియు దక్షిణ ధ్రువమునకును, నుత్తర ధ్రువమునకు నెంత దూరము గలదో సంసారమార్గమునకును జ్ఞానమార్గమునకును నంతదూరము గలదు కావున మిమ్ములను యాత్రకు తీసికొని వెళ్ళవలసి యుండినచో, ఒకపూట శుద్ధాహారమును భుజించుము, నిపుడు రాత్రులలో భుజించు ఫలహారమునుగూడ నిలిపి, కట్టుబట్టతో వట్టి భూమిపైగాని లేక చాపయందుగాని పరుండెడు యభ్యాసము నేర్చుకొనవలయును'నిజెప్పిరి అపుడు రత్నమాంబగారు అదియే పదివేలని చెప్పి యొప్పుకొనిరి మఱియు భారతీదేవిగారిట్లు బోధించిరి 'నిద్రకొఱకు పరుండెడువారు సంసారులు

నిద్ర వచ్చిన తర్వాత శయనించువారు సన్న్యాసులు ఆలాగుననే తినుటకొఱకు జీవించువారు సంసారులు జీవించుటకొఱకు తినువారు సన్న్యాసులు ఆకలి గలిగినపుడు మాత్రము భోజనమును వెదుకువారు సన్న్యాసులు ఆకలి గలుగుటకు ముందుగా భోజనమును సిద్ధపరచువారు సంసారులు నిద్రాహారములనెడి ఇద్దరు చోరులు మానవ జీవితములను హరించు చున్నారు వీరి నిద్దరిని జయింపనిచో సంసారమందుండినను, లేక సన్న్యసించినను జీవితధనమును నిలుప జాలరు నిష్కాలమగు పూర్వాహ్ణమున నాష్ట (ఉపాహారము) నెపుడు ప్రారంభించిరో అప్పటినుండియే సాధువులు భ్రష్టులగుట కారంభమయిరి మరియు నాహార విషయము సామాన్యమైనది కాదు మనము దేనిని భుజింతుమో యది జఠరాగ్నివల్ల జీర్ణమై స్థూలభాగము మలమూత్రములు గాను, మధ్యమభాగము రసమై, రక్తమై, మాంసమై, సప్తధాతువులుగాను, కనిష్ఠ భాగములో గల పృధివ్యంశ మహంకారము గాను, జలాంశము చిత్తముగాను, అగ్న్యంశము బుద్ధిగాను, వాయ్వంశము మనస్సు గాను, ఆకాశాంశమంతఃకరణము గాను మారుచుండును కావున మనస్సును మార్పు చేయవలసియుండినచో నాహారమును ముందుగా మార్పుచేసికొనవల యును ఈ తత్త్వము దెలియకనే యేది తినినను, నేదిచేసినను మనస్సే ప్రధానమని చెప్పెడు శుష్క వేదాంతము బయలుదేరుటకు కారణమైనది మనస్సు ఒకటి మాత్రము ప్రధానమగునపుడే యింతమహిమ గలుగు చుండగా, నిక వాక్కును, క్రియయును, ప్రధానములై యుండినచో నపుడు గలిగెడు మహిమాతిశయమేమని చెప్పవచ్చును! త్రికరణశుద్ధి గలిగి యుండవలయుననియే శాస్త్రముపదేశించు చున్నది '

ఈలాగున తీర్థయాత్రా విచారముతో వారు కాలము గడుపుచుండిరి ఏ విధము గనో 'యీ విషయము జనులయందు గూడ వ్యాపించినది జననీజనకుల కర్ణరంధ్రములో గూడ నీవార్త వినబడినది ఇట్లుండగా నొకరోజున నెవరును లేని సమయము జూచి, భారతీదేవి మాతాపితరులను పిలిపించి దగ్గరకూర్చుండ బలికి, వికసిత నేత్రయై, ప్రసన్న ముఖియై యిట్లు వచించెను ''మిక్కిలి పుణ్యాత్ములగు తల్లిదండ్రులారా? మీయొక్క పవిత్రగర్భములో జన్మించినందు

చేతనే, నాకిట్టి జ్ఞానము కలిగినది ఇదివరలో మిమ్ములనొక వరము కోరియుంటిని దానిని మీరు వెంటనే నెరవేర్చితిరి అదేమనగా విజనప్రదేశమున తప మొనర్చుట కొక పర్ణశాలను నిర్మించుటయే అదే యీ కుటీరము ఇక రెండవది యగు మఱియొక వరము ననుగ్రహింపవలయునని ప్రార్థించుచున్నాను ఇదియును మొదటివరమువలె నేలాటి ప్రతిబంధములను గలుగనీయక యంగీకరింతురని నమ్మకముండినందుచేత మిమ్ము లను ప్రార్థించుచు న్నాను లేనిచో మీకెవ్వరికిని దెలుపకనే నా కార్యము జేసి యుండెడిదానను'' అని చెప్పెను ఈ వాక్యమును విన్నతోడనే యిదివఱలో తీర్థ యాత్రావిషయమై సంకల్పించియుండు సంగతి తండ్రిగారికి జ్ఞాపకమువచ్చి, యీ వరప్రార్థన దానికొఱకయ్యే యుండవచ్చునని మనంబున దలచి యేమియు బలుకక నిశ్చేష్టుడై జలాంతర్భాగమున నిద్రించెడు మీనమువలె నరేంద్రరాజు ఊరకుండెను

కొంతసేపైన వెనుక భారతీదేవి ' పూజ్యుడవగునో తండ్రీ? ఏమి మౌనముగా నున్నారు? కర్తవ్యము వచ్చినపుడు ధీమంతులూరకుందురా! నేను కోరిన వరము మీ వంశమున కాచంద్రతారార్కము కీర్తి నిచ్చునదేగాక, పుణ్యాత్ములగు మీ గర్భములో నుదయించిన నేనిక మఱియే యితర మాయాజీవుల యుదరమున జన్మమెత్తి సంకట పడవలసియుండదు ' ఈ వచనమును వినియు, కొంత సమ యము మౌనము వహించి గద్గద స్వరముతో కన్నీరు గార్చుచు, విశ్వామిత్ర మునివరునితో శ్రీరామచంద్రుని పంపెడు విషయమును విని, దశరథరాజవర్యుడు బాష్పములతో తడిపిన దేహముగలవాడై, యస్పష్ట స్వరముతో బలికినట్లు, రామచంద్రనరేంద్రుడును కుమార్తెతో నేమి వరము కోరుచున్నావని ప్రశ్నించెను ఈ స్థితినంతయు జూచుచు కూర్చొనియుండు తల్లిగారికీ విషయ మేమియు దెలియనందుచే, శ్రీ వసిష్ఠముని పత్నియగు నరుంధతీదేవి, సమాధి నిష్ఠలో నిశ్చేష్టురాలై యుండిన చందమున రామేశ్వరమ్మ గారును ధ్యానమందుండిరి

అపుడు భారతీదేవి 'మనవంశ మతిపవిత్రమైనది ఇక్ష్వాకువు, దిలీపుడు, అశ్వపతి, హరిశ్చంద్రుడు మొదలగువా రిప్పటికిని యశఃకాయులై సజీవులుగా

నున్న ట్లుండెడు వంశము మనది వారాడిన మాట తప్పెడివారు కారు కావున నేను కోరిన వరము నిచ్చెదమని చెప్పినచో, మీ సన్నిధిలో వా(క్రుచ్చెద లేనిచో జెప్పకనే యాకార్యము జేయ దృఢసంకల్పము గలిగియున్నాను'' అని చెప్పెను ఆ వాక్యమును విని యీ బిడ్డ శైశవావస్థనుండియు పట్టినపట్టు విడుచునది కాదని, తండ్రిమదిలో తలంచి నీ యిష్టమేదియో దెలిపిన నట్లే చేసెదమ' ని సెప్పగా, భారతీదేవి 'నేను తీర్థయాత్రజేయ నిశ్చయించుకొన్నాను దానికనుమతి నొసగి యాశీర్వదించి బంపవలయును' అని నిజమనో రథమును వెలిబుచ్చెను తండ్రి యెపుడును బిడ్డకడ్డు చెప్పని వాడగుటచే, ముందు చెప్పిన వాక్యములను దీర్ఘముగా నాలోచన చేసి ఆలాగున యిష్టముండిన పోవచ్చును నేనును మీ తల్లియు గూడ నీతో నరుదెంచి యన్ని తీర్థయాత్రలం జేయించెదము రైలులో వెళ్ళవచ్చును మంచి శుభముహూర్తమును పురోహితులచే నేర్పాటు చేసికొందమని' చెప్పగా భారతి ''రైలుబండిలో పోయినచో నేమి తెలియును? పక్షిని పంజరములో పెట్టి కాశికి దీసికొని వెళ్ళివచ్చినచో దానికెంత లోకజ్ఞానము గలుగునో, అంతే గలుగును కావున నది మంచిదికాదు అదియును గాక మీతో నాకు జతకుదర'' దనెను ఈ వాక్యమును విని నరేంద్రుడట్లయినచో కావలసిన ధనమును తీసికొని మీకు దగిన సాధువులతోనైనను వెళ్ళవచ్చునని చెప్పగా విని, భారతి యెంతటి సాధువులైనను, పురుషులతో నేనొంటరిగాబోవుట బాగుండ దనెను అప్పుడు నరేంద్రుడు యాత్రల జేసి యనుభవము గల నారీమణులతో గూడవెళ్ళవచ్చును ఒకవేళ నట్టి స్త్రీలు దొరకనిచో, రత్నమాంబగారును, మరెవ్వరైన స్త్రీలును జేరి తగిన పురుషులతోగూడ వెళ్ళవచ్చును వారి కందఱికెంత డబ్బు కావలసియుండునో, నంతయు నేనిచ్చెదన' ని పలికిన వాక్యమును వినగానే భారతి ''నాకు యాత్ర ముఖ్యము గాదు గొప్ప మునులు సమాధినిష్ఠలో నెచట నుందురో, నెచటెచట తాపసోత్తములు నివసించుచుందురో, నచ్చోటులకెల్ల వెళ్ళవలసి యుండును అంతేగాదు, నాకిష్టము వచ్చిన కాలమంతయు నటువంటి స్థలములలో తపోధ్యాన శ్రవణాదులగూడ జేసికొనవలసి యుండును కావున నితరుల సహాయము నాకు దగ'' దనెను

అప్పుడు నరేంద్రుడు 'శ్రీరత్నమాంబగారును మీరును వెళ్ళవమ్మను ఎంత ఖర్చుకు కావలసినను డబ్బు నిచ్చెదను మఱలల కొఱత గలిగినచో తపాలుద్వారా పంపెదవు'ని చెప్పెడు వాక్యమును విని, భారతి యిటుల వచించెను 'ధనము తీసి కొని పొగబండిలో పోయినచో ప్రపంచము యొక్క స్థితి గతులనేమి దెలిసికొనగలను? పూర్వకాలమున మహర్షులు రైలు మీద ప్రయాణము చేసినారా? వారు ధనమును గూడ దీసికొని వెళ్ళినారా? మిక్కిలి పవిత్రమగు కౌశిక వంశములో జన్మించిన నేనా విశ్వామిత్ర మహర్షివలె నొక పైసానైనను గ్రహింపకపాదచారిణినై యాత్ర చేయవలయును 'తపో హి మహతాం ధనమ్' మహాత్ములకు తపస్సే యక్షయమగు ధనము అని నుడువ నద్దానిని విని జనకుడు ఈ యౌవనారంభ కాలములో నేల యొంటరిగా యాత్రచేయ దలపెట్టితివి? ఇయ్యది మనకు దగునా? ఈ కర్ణ కఠోర వాక్యమును విని నేనెట్లు సహింతును? ఈ నీ యాశయము మన క్షత్రియజాతికి తగునా? పోనిమ్ము డబ్బు దీసికొని వెళ్ళినచోగదా మీకు కష్టము ఎప్పుడెప్పుడు తెలిపిన నపుడపుడు తంతి మార్గమున డబ్బు పంపెద'' మని వచింపగా భారతి 'నాయనా మీరు వేదాంతశ్రవణ మొనర్చియుండియు గృహస్థాశ్రమమునం దుండుటచే తదనుగుణమగు స్వభావమే గలిగియున్నారు పాశముతో కట్టబడి యుండు గోవెంత మంచిదైనను స్వేచ్ఛగా నెంత దూరము సంచరింప గలుగును? అదేవిధముగా మీబుద్ధియంతయు హద్దుకు లోబడి యుండునేకాని యాహద్దును దాటి పోజాలదు అంతేకాదు భగవంతు డనాథరక్షకుడు మరియొకడు రక్షకు గలడని తలంచువారికి సర్వమును భగవదర్పిత మొనర్చు శక్తి గలిగియుండదు పరపురుషాసక్తిగల స్త్రీకి పతియందు దైవబుద్ధిగాని, పతి సేవయందు జీవితము నంతయు సమర్పించెడి బుద్ధియు నెట్లుండును? అట్టి స్త్రీకి యనన్యభక్తి పతియందెట్లు గలుగును? ఇట్టి స్వభావముగల వనితకు పతికొఱకు తన ప్రాణమునొడ్డి జీవితాంతమువఱకు నతనిని సంరక్షింప వలయునను బుద్ధి యెటుల గలుగును? కావున నొక దైవసహాయముకన్న మించిన మఱియొక సహాయము గలదని తలంపు గలిగిన యనన్యభక్తి గలుగదు కావున మీ సహాయముగాని, ధనముగాని యవసరము లేదు

*అనన్యాశ్చింతయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।*
*తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥*

ఏ జను లన్యాపేక్ష లేనివారై నన్ను స్మరించుచు సేవించుచున్నారో, సర్వకాలములయందును సమాహితచిత్తులైనవారియొక్క యోగక్షేమమును ( లేనిదానిని కలిగించుట యోగము, కలిగినదానిని కాపాడుట క్షేమము) నేను వహించుచున్నాను అను భవగద్వాక్యమున మీ కేల నమ్మకము లేదని, తండ్రిని ప్రశ్నించెను ఈ కఠిన వాక్యములను వినిన వెంటనే జననీ జనకులు నిశ్చలముగా వృక్షశాఖలో గూర్చుండు చాతక పక్షి మిధునము, క్రూర కిరాతుని తీక్ష్ణశరముచే గొట్టబడి మూర్ఛితమైనట్లు భూమిపై బడి మూర్ఛితులైరి

కొంతసేపటికి భారతీదేవియు మాతాపితరుల భక్తివాత్సల్యమును జూచి రెండు నేత్రములనుండి బొట బొట కన్నీరు గార్చుచు నిశ్చేష్టురాలై యుండెను అయినను సమయము వచ్చినప్పుడు మనస్సునకు వశపడకూడదని తలంచి మనస్సును సమాధానపఱచి శీతల జలోపచారములచే జననీ జనకుల నోదార్చి చిత్తశాంతి గలుగు లాగున సౌమ్యవాక్యముల జెప్పనారంభించెను ''తల్లిదండ్రులారా! జననీజనకుల యాశీర్వచనము లమోఘములు మాతాపితరులను తృప్తి పఱచుటకన్న మిన్నయైనది బిడ్డలకు మఱియొక తపస్సు లేదని వినియుండుటచే నాయాత్రను మీకు తెలిపి మీ యాశీస్సును బొంది పోవలయునని నిశ్చయించడమైనది మీ రీలాగున దుఃఖసాగరములో పడిపోయెదరని తెలియును అయినను మీరు సాధారణజనులవలె పామరులు కారు సర్వశోకరహితమును నిరతిశయానంద సుఖప్రదమునగు వేదాంత శ్రవణము జేసినవారు అయితే శ్రవణములోనే కాలమును గడపితిరిగాని యే కాంత మున చేరి ధ్యాన మనన నిదిధ్యాసనాదులజేసి దృశ్యభ్రాన్తి రహితమొనర్చి, నిరతిశయానంద బ్రహ్మసాక్షాత్కారము దృఢముగ గలిగేలాగున చేసికొన లేదు అటులుండినచో జనక భూపాలుని బ్రహ్మవేత్తల సభలో వసిష్ఠమునీంద్రుడు బోధ చేయునపుడు వసిష్ఠుని యోగమహిమవల్ల నేర్పడిన యగ్ని రాజధానిని భస్మమొనర్చుచు సభా మధ్యములోనికి వచ్చినపుడు శ్రోతలందఱు లేచి వెళ్ళినను,

జనకభూపాలుడేలాగున నిశ్చలముగా నుండెనో, అలాగున మీరును నుండవలసిన వారే అయినను లోకాతీత వైరాగ్యము గలిగి శుకమహర్షి వెళ్లిపోవునపుడు శ్రీ వేదవ్యాస మహాముని గూడ పుత్రశోకమును విడువ లేక కొంతదూరము వెళ్ళునపుడు దేవతా స్త్రీలవాక్యములను విని, మనస్సును శాంతపఱచుకొని తన యాశ్రమమునకు తిరిగివచ్చిరి అట్లుండగా మీకు గూడా నిట్టిశోకము గలుగుట సహజమేయని చెప్పుచు నేను తీర్థయాత్రా విష యమ్మై నిశ్చయించుకొన్నాను ఏ విధముగానైనను దీనిని మార్చుటకు వీలు లేదు మీరు నాయందు కరుణ గలిగి యుత్తరు వీయవలయున' ని ప్రార్థించెను

అపుడేమియు తోచక 'అట్లయినచో శ్రీరత్నమాంబగారినిగూడ దీసికొని వెళ్ళ వలసినది అపుడపుడు జాబులు మాత్రము వ్రాయుచుండవలయునని, తెలిపిన జనకుని యాశీర్వాదమును విని'' భారతి ''నాయనా! మీరు చెప్పేలాగున సరియని యంగీకరించి, అట్లు చేయనిచో నే నసత్య వాక్యములను జెప్పినట్లగును అసత్యమున కన్న మఱి పాపమేమి గలదు? ''నానృతాత్పాతకం పరమ్'' అను వేదవాక్యమువలన భయము కలిగినందుచేత మిమ్ముల నింతప్రార్థన జేయవలసి వచ్చినది లేనిచో నెవరికిని దెలియకనే వెళ్ళియుందును ప్రస్తుతము మిమ్ముల సంతోషపరుపవలయునని తలంచి మీరు చెప్పినదంతయు నిపుడు సరి, సరి యని యంగీకరించి తరువాత ఆలాగున చేయకపోయినచో ననృత దోషము సంభవించును మఱియు తరువాత మీరు గొప్పదుఃఖము ననుభవించెదరని తలంచి, యున్నదు న్నట్లిపుడే చెప్పడమైనది అదియునుగాక నుత్తరము వ్రాయనిచో మేమేమైపోతిమో యని మీకు నపారమగు దుఃఖమును గలుగ జేసిన వార మగుదుము కావున నట్లు ముఖప్రీతికొరకు సరి సరి అని చెప్పగూడదు ఈ దినమునుండి నేను మీ బిడ్డనను సంగతి మఱచి పోవలసిన ద'' ని పలికెను కుమార్తెయొక్క వాక్యమును విని తండ్రి ''ఇదివఱలో నీ మాటలు వినునప్పుడెంతో కర్ణానందముగా నుండెను అమృత పానముకన్న నెక్కువ సంతోషకరముగా నుండెను ఇప్పుడు వచించెడు వాక్యము సీసము కఱగించి చెవిలో పోసినట్లున్నది విషము ద్రాగినంత కష్టము గలుగుచున్నదే ఇంతకాలము

తపస్సును, వేదాంతార్థ చింతనయును, దైవభక్తియు నొనర్చిన మీ హృదయ మేల కఠినశిలకన్న కాఠిన్యము వహించెనమ్మా!'' యనగా నపుడు భారతీదేవి 'తండ్రీ! శ్రేష్ఠమైన క్షత్రియవంశమున జన్మించి శూరుడును, ధనుర్విద్యా పారంగతుడు నగు పార్థివవరుడు శత్రువు తనకోటను ముట్టడించి గోపురద్వారమున రణభేరి మ్రోయించుచు యుద్ధమునకు ప్రేరణ చేయునపుడు తాను పుత్ర పుత్రిక లందుగాని, వృద్ధులగు మాతాపితరులందుగాని, భార్యయందుగాని, తోడబుట్టువుల యందు గాని ప్రీతి గలిగి తలుపు మూసికొని యింటిలో కూర్చొనుటయా లేక క్షాత్రపరా క్రమావేశపూరితుడై ధనుర్బాణ తూణీరముల ధరించి సింహగర్జనము జేసి సైన్యముల పురికొల్పి, సేనాధిపతుల ప్రేరణ జేసి రణరంగమున దుముకుటయా ధర్మము జెప్పుడనెను అపుడు కుమార్తెయొక్క యీ గంభీర వాక్కులను విని తండ్రి యేమియు మారుమాట చెప్ప జాలక ఊరక కూర్చుండిరి

అపుడు భారతి ''నాయనా! ఆ విధముగ ప్రకృతితో యుద్ధమాసన్నమైన సమయమిది ఇచట మీకును నాకును చాలకాలమునుండి యేర్పడిన మాయామయ ప్రేమపాశమును ద్రుంచవలసియుండును మహాత్ములైనవారి హృదయమునకు రెండు శక్తులు గలవు

*వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి ।*
*లోకోత్తరాణాం చేతాంసి కో ను విజ్ఞాతు మర్హతి ॥*

(దీని యర్థముపైన చెప్పబడినది)

అన్నట్లు కార్యనిర్వహణ ధర్మానుష్ఠానకాలమున నా హృదయము వజ్రమునకన్నను కఠినతమమై యుండును ప్రాణికోట్ల దుఃఖశాంతి నొనర్చుటలో నది మృదువైన మల్లెపూవుకన్నను మెత్తనిదై యుండును అట్లు కానిచో రాజాధి రాజవంశమున నుదయించిన గౌతమబుద్ధుడు తల్లిదండ్రులను, ప్రేమస్వరూపిణి యగు ''యశోధర'' యను భార్యను, చంద్రబింబమువలె నుండు రాహులుడను కుమారుని విడువ శక్తి గలిగి యుండునా? అట్టి

త్యాగమువలనగదా జగద్గురుడై తాపత్రయాగ్నిలో తపించెడు ననేకకోట్ల జీవరాసుల శోకాగ్నిని వల్లార్చి నిరతిశయానంద మొసంగెడు దివ్యశక్తిగలవాడాయెను తనకు జన్మరహితమగు పరమ నిర్వాణసుఖమును లభించినదిగదా! ఇదే రీతిగ మన కులదైవమగు తారకబ్రహ్మ, శ్రీరామచంద్రుడును లక్ష్మణస్వామిని తప్ప, తల్లిదండ్రులను, లక్ష్మణ సోదరులను విడచి దండకారణ్యమును కేగిన సంగతి దెలియదా? మఱియు రాజ వంశములో జన్మించిన పరమభక్తురాలగు మీరాబాయియు మంచి యపరకాలమున రాజగృహాంతరాళమునుండి కారు చీకటిలో బయలుపడి యొంటరియై బృందావనము నకు శ్రీ కృష్ణధ్యానపరవశురాలై ప్రయాణము జేసిన కథ విన లేదా? ఈ పుణ్యావలి కెవరు తోడ్పడిరి? ఎవరు ధనమిచ్చి రైలులో ప్రయాణము జేసి పంపిరి? వారెపుడైన గృహమును విడిచిన పిదప నొక యుత్తరమైన వ్రాసినారా? ఇదంతయు నాలో వింప వలదా? వారు ఉదయపూరు మహారాజవంశమునగదా జన్మించిరి! మఱియు మన రాజకులములోపుట్టిన బ్రహ్మవారిణి యగు సులభా యోగినియు, శతశృఙ్గవనమున మహర్షులతో గూడనుండి బ్రహ్మనిష్ఠయు, యోగాభ్యాసము ననుష్ఠించి, యష్టసిద్ధుల నెవరి సహాయమువలన బడసిరి? మీరు చెప్పునది మాయాధనమును గుఱించియే, ఇది యాత్రలో వాల యపాయమును గలుగ జేయునది మఱియు ననర్థము లన్నిటికిని కారణము పై జెప్పినవారి కక్షయమగు దైవధనముండెను దైవధనము భయమును కలిగించునదిగాని, లందఱికిని కనిపించునదిగాని కాదు రేచీకటి గలవారికి దీపము గొప్పసహాయ కారియైనను, సూర్యుడుదయించినతోడనే దీపాదులెట్లుపేక్షింబడునో, నాలాగున దైవ ధనముగలిగిన ప్రపంచధనము లక్ష్యపెట్ట బడదు మీరు చెప్పిన ప్రకారము శ్రీరత్నమాంబగారినిగూడ దీసికొని వెళ్ళెదను'' అని నుడివెను

ఇట్లు వచింపగా విని జనకుడు ''తల్లీ! నీకు దెలియని ధర్మము లేదు మాతాపితరుల యనుగ్రహము గలవారికి సమస్త సిద్ధులు గలుగును అట్లుగానివారి కేలాటి సిద్ధులును గలుగవని నీవు చెప్పిన వాక్యమును మరచితివా? అంతేగాక జననీజనకులమగు మమ్ములను దుఃఖసాగరమున బడద్రోసివెళ్ళి, మీరే సుఖమును బడయుగలరా''ని చెప్పగా, జనకునితో భారతీదేవి యిట్లనెను ''నాయనా! మీరు

చెప్పినది నిజము అయితే ధర్మమందు ముఖ్యమనియు,గౌణమనియు రెండు మార్గములు గలవు తల్లిదండ్రులను దుఃఖపెట్టి తన దేహేంద్రియ సౌఖ్యములకొఱకు వారిని త్యజింప రాదు అట్లులైనచో నది దోషమేకాని, తల్లిని తల్లివంశమును, తండ్రిని, తండ్రివంశమును, తాను నివసించెడు దేశమును గూడ పావనమొనర్చెడు దైవజ్ఞాన విషయమైనది దోషము గాదు

*ధన్యా మాతా పితా ధన్యో ధన్యం గోత్రం కులం వసు ।*
*ధన్యా చ వసుధాదేవీ యత్ర స్యాద్గురుభక్తతా ॥*

దైవవిషయమై ప్రహ్లాదుడు తండ్రిని విడిచి పెట్టెను విభీషణుడు తల్లిని, సోదరులను, రాజ్యమును త్యజింపవలసివచ్చెను మీరాబాయి రాజ్యసంపదను మాతా పితరులను త్యజింపవలసి వచ్చెను సిద్ధార్థుడు యువరాజై యుండునపుడే తల్లిని, శుద్ధోదనుండగు తండ్రినుపేక్షించెను అట్టి గౌతమబుద్ధుని కన్న మనకేమి గొప్ప తనము గలదు? ఆయన రారాజు గదా! మీరాబాయికన్న మనకేమి రాజ్యము గలదు? శ్రీకృష్ణాయ త్తచిత్తురాలగుటచే వారేమియు సందేహము గలిగి యుండలేదు కావున మీరును దృశ్యభ్రాన్తి నశించుట కొఱకు బాగుగా మనన, నిది, ధ్యాసనముల జేయ వలయునని చెప్పిరి అయిన నిపుడు వెళ్ళుతలచలేదు దైవాజ్ఞ ఎపుడేతెంచునో యపుడు వెళ్ళెదము కావున మీ రేమియు భయపడ నవసరములేద'' ని చెప్పిరి ఈ వాక్యమును వినగానే మాతాపితరులయొక్క దుఃఖము కార్చిచ్చుచే దహించెడి సమయమున కుంభవృష్టి గురిసిన, నిప్పు చల్లారునట్లు చాలవఱకు శాంతించెను

వెంటనే తల్లిదండ్రులను పంపివేసి, శ్రీరత్నమాంబగారిని పిలిచి''సోదరీ! ఏదో ఒక విధముగ మాతాపితరుల ఒప్పించితిని రేపటి దినమునుండి మీరు గీతా పారాయణమునకు వెళ్ళవలదు వారే స్వయముగ శీలించి నేర్చుకొనుట మంచిది నా వలె మీరును పదునొకండు, లేక పదిరెండుఘంటలవరకు ధ్యానకుటీరము నుండి బయటకు రావలదు ఈ దినమునుండి మీరును నారవస్త్రములను ధరించ వలయును ఇక మీదట మీకు ఘోషాపద్ధతి అవసరము లేదు'' అని చెప్పిరి మరురోజు మఱల తల్లిదండ్రులు వచ్చి'' తల్లీ! యాత్ర పూర్తి జేసికొని

మరల యెప్పుడు మాకు దర్శనమిచ్చి, మాశోకాగ్నిని వల్లార్చి యానంద మొసంగగలవ'' ని పలుకగా భారతీదేవి యిట్లనియె ''ఆ విషయమును నిన్నటి రోజుననే చెప్పితినిగదా? మఱల నేల యీ దినము వచ్చి పొగతో కూడిన యగ్నిని గాలి ప్రజ్వలింప జేయునట్లు జేయుచున్నారు? ''సత్యాన్నాస్తి పరో ధర్మః'' అని యుండుటచే సత్యమునకన్న శ్రేష్ఠమగు ధర్మము లేదు కాని దానిని జెప్పినచో మీకు సంకటము గలుగవచ్చును మఱల తిరిగివచ్చునా? లేదా యని యిపుడెటుల జెప్పనగును? ధ్రువుడు తన యభీష్టమును నిర్వహించుట కొఱకు మాతయొక్క యనుగ్రహము బడసి వెళ్ళుచుండగా శ్రీనారదమునియొక్క యనుగ్రహమువలన సంకల్పము పూర్తియైన తర్వాత స్వగృహమునకు తిరిగివచ్చిన ట్లునను, శ్రీసిద్ధార్థుడు పూర్ణజ్ఞానమగు నిర్వాణమును బొందిన పిదప స్వరాజ్యమునకు మఱలి వచ్చినట్లునను, మార్కండేయుడు ఈశ్వరానుగ్రహము బడసి మాతాపితరులుండెడు పర్ణశాలకు తిరిగి వచ్చినట్లునను, నాకు గలిగిన సంశయములన్నియు నివృత్తియై దృశ్యరహితమగు నిర్వాణము సిద్ధించి నిర్వికల్పమగు సమాధి లభించి, బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము దృఢముగా గలిగినచో మఱల మిమ్ముల నిటకేతెంచి దర్శించెదను అట్లు కానిచో నీజన్మములో నా మనస్సు వెనుకకు తిరుగుట యనునదే గలుగదు ఒకవేళ నేను ప్రకృతి రహితమగు ముక్తిని బొందిన బొందవలయును లేక నీ నిష్ఠతోనే తపో భూమిలో మరణింపవలయును ఇదే నాయొక్క దృఢసంకల్పము ఇక జననమరణములలో దగుల్కొని తాపత్రయములలో నేను జీవింపజాలను ఈ దివ్యమంత్రమునే సిద్ధార్థుడు నిరంతరము జపించి, పరమనిర్వాణము నొంది జన్మరహితమగు మోక్షము నొందిరి

**''ఇహాసనే శుష్యతుమే శరీరం త్వగస్థిమాంసం ప్రళయంచ యాతు''**

**అప్రాప్య బోధిం బహుకల్ప దుర్లభాం నైవాసనాత్కాయ మతశ్చలిష్యతే॥**
**(బుద్ధగీత)**

( దీనియర్థముపై జెప్పినదే ) గీతలో శ్రీకృష్ణుడు చేసిన యిటువంటి మంత్రోపదేశము చేతనే యర్జునునకు గలిగిన మోహావేశగ్రహము పారిపోయెను

*హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।*
*తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృత నిశ్చయః ॥*

ఓ యర్జునా! యుద్ధమునందు శత్రువులచేత చంపబడితివేని స్వర్గమును బొందగలవు జయించితివేని భూమండ లాధిపత్యము ననుభవింపగలవు అందువలన నేదైనను సరే యని నిశ్చయించుకొని యుద్ధముకొఱకు నిశ్చయబుద్ధి గలవాడవగుచు లెమ్ము

దీనియొక్క యంతరార్థ మేమనగా? ప్రకృతి గుణములగు శత్రువులను జయించి పరమాత్మ జ్ఞానమగు మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడు గావలయునని బ్రహ్మనిష్ఠ జేయువానికి ముక్తి సిద్ధించుటకు ముందుగా నీ దేహము పోయినను కొదువ లేదు ఉత్తమమైన స్వర్గము లభించును లేక అరిషడ్వర్గముల జయించిన, నీ జన్మములోనే, ఇచ్చటనే మోక్ష సామ్రాజ్యాభిషిక్తుడై శాశ్వతసుఖముల ననుభవింప వచ్చును మఱియు క్షాత్రవంశములో బుట్టిన యర్జునునియొక్క దీనావస్థ గాంచి భగవాను డుపదేశించినది జూడుడు,

*కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।*
*అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥*

ఓ యర్జునా! ఏహేతువువలన సంకటమునందు పామరులచే సేవింపబడినదియును, స్వర్గలోకమును గలుగ జేయనదియును, అపకీర్తిని గలుగ జేయునదియును నగు నీ మోహము నిన్ను పొందినది?

*క్లైబ్యం మాస్మ గమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే ।*
*క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥*

ఓ యర్జునా! భయమును పొందకుము నీ యందీభయముండుట దగదు నీచమైన మనస్సునందలి హీనతను, పిరికితనమును విడిచి యుద్ధమునకు లెమ్ము ఈ శ్లోకమున క్లైబ్య శబ్దమును ప్రయోగించిరి క్లైబ్యమనగా క్లీబత్వము అనగా నపుంసకత్వము స్త్రీయును, పురుషుడును కానివానినిగా శ్రీకృష్ణుడు, అవమానము చేసి యర్జునుని నపార్జితునిగా జేసెను ఈ రెండవ

మరల యెప్పుడు మాకు దర్శనమిచ్చి, మాశోకాగ్నిని వల్లార్చి యానంద మొసంగగలవ'' ని పలుకగా భారతీదేవి యిట్లనియె ''ఆ విషయమును నిన్నటి రోజుననే చెప్పితినిగదా? మఱలనేల యీ దినము వచ్చి పొగతో కూడిన యగ్నిని గాలి ప్రజ్వలింప జేయునట్లు జేయుచున్నారు? ''సత్యాన్నాస్తి పరో ధర్మః'' అని యుండుటచే సత్యమునకన్న శ్రేష్ఠమగు ధర్మము లేదు కాని దానిని జెప్పినచో మీకు సంకటము గలుగవచ్చును మఱల తిరిగివచ్చునా? లేదా యని యిపుడెటుల జెప్పనగును? ధ్రువుడు తన యభీష్టమును నిర్వహించుట కొఱకు మాతయొక్క యనుగ్రహము బడసి వెళ్ళుచుండగా శ్రీనారదమునియొక్క యనుగ్రహమువలన సంకల్పము పూర్తియైన తర్వాత స్వగృహమునకు తిరిగివచ్చిన ట్లును, శ్రీసిద్ధార్థుడు పూర్ణజ్ఞానమగు నిర్వాణమును బొందిన పిదప స్వరాజ్యమునకు మఱలి వచ్చినట్లును, మార్కండేయుఁ డీశ్వరానుగ్రహము బడసి మాతాపితరులుండెడు పర్ణశాలకు తిరిగి వచ్చినట్లును, నాకు గలిగిన సంశయములన్నియు నివృత్తియై దృశ్యరహితమగు నిర్వాణము సిద్ధించి నిర్వికల్పమగు సమాధి లభించి, బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము దృఢముగా గలిగినచో మఱల మిమ్ముల నిటకేతెంచి దర్శించెదను అట్లు కానిచో నీజన్మములో నా మనస్సు వెనుకకు తిరుగుట యనునదే గలుగదు ఒకవేళ నేను ప్రకృతి రహితమగు ముక్తిని బొందిన బొందవలయును లేక నీ నిష్ఠతోనే తపో భూమిలో మరణింపవలయును ఇదే నాయొక్క దృఢసంకల్పము ఇక జననమరణములలో దగుల్కొని తాపత్రయములలో నేను జీవింపజాలను ఈ దివ్యమంత్రమునే సిద్ధార్థుడు నిరంతరము జపించి, పరమనిర్వాణము నొంది జన్మరహితమగు మోక్షము నొందిరి

**''ఇహాసనే శుష్యతుమే శరీరం త్వగస్థిమాంసం ప్రళయంచ యాతు''**

**అప్రాప్య బోధిం బహుకల్ప దుర్లభాం నైవాసనాత్కాయ మతశ్చలిష్యతే॥**

**(బుద్ధగీత)**

( దీనియర్థముపై జెప్పినదే ) గీతలో శ్రీకృష్ణుడు చేసిన యిటువంటి మంత్రోపదేశము చేతనే యర్జునునకు గలిగిన మోహావేశగ్రహము పారిపోయెను

రావణేశ్వరుడు పెద్దసాధు వేషము, గొప్ప మహర్షి వేషమును ధరించి సీతాపహరణము జేసిన కథ నీవు చదివి యున్నావుగదా! ఆరీతిగ నర్జునుడు గొప్ప సన్న్యాసి వేషమును ధరించి సుభద్రాదేవిని తెచ్చిన కథయును నీవు మఱచి యుండ లేదని తలంచుచున్నాము మీ యాత్రకు మేము మనఃపూర్తిగ సమ్మతి నొసంగక పోయినచో మాకు నెల్లపుడు ఆ బాధ గలుగుచుండును నీకుగూడ నొకపుడైనను తల్లిదండ్రులు లనుగ్రహించి పంపకపోయిరిగదా యని మనస్సులో విచారము గలుగవచ్చును కావున జనకుడు సీతాదేవిని తారకబ్రహ్మమగు శ్రీరామచంద్రునకు సమర్పించినట్లు మాతాపితరులమగు మేమును మిమ్ములను శ్రీరాముని దివ్యపాదములలో సమర్పణ జేయుచున్నాము లంకలో నశోకవనమున నేలాటి పాతివ్రత్యమునకు భంగము గలుగక శ్రీజానకి తన వ్రతమును నెట్లు కాపాడుకొనెనో, మఱల లంకావిజయము గలిగిన పిమ్మట నయోధ్యాపురికి వచ్చి చేరిరో, అదేవిధముగ మీకును శుభము గలుగుగాక యని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నామని వచించెను ఆ వాక్యములను విని తల్లిదండ్రులతో నట్లే యగునుగాక యని భారతీదేవి యంగీకారమును జూపినట్లు మౌనముగా నుండి శిరస్సు వంచి నమస్కరించెను

కొంచెము సేపు ఊరకయుండి ''దైవస్వరూపులగు జననీ జనకులారా! ఈ విషయమై మీరేమియు భయపడనవసరము లేదు స్వభావవైరాగ్యమనియు, అభావవైరాగ్యమనియు వైరాగ్యము రెండు తెగలుగ నున్నది సర్వసంపదలు గలిగి పూర్ణ యౌవనకాలమున విషయవిరక్తి గలిగినవారికి మరల నెచట నెప్పుడును చెడుబుద్ధి గలుగదు వారు విషము గలిసిన క్షీరాన్నమువలెను, వమనమైన వస్తువులవలెను విషయముల జూచుచుందురు మఱియు స్త్రీయందట్టి దోషము లేనిచో పురుషులేమియు జేయజాలరు రావణేశ్వరుడు బహువిధముల భయము చేతను, నయముచేతను మాచినను సీతాదేవి యెటుల చలించలేదో, అట్టి దృఢము నాకు గలిగియుండినను మీ వాక్యములను శిరసావహించి జాగ్రత్తపడెదను కావుననే శ్రీరత్నమాంబగారిని గూడ దీసికొని వెళ్ళుటకు నిశ్చయించడమైనది మీరు మనఃపూర్తిగా నంగీకార మీయని యెడల నా

హృదయములో గూడ నది యొక కారణముగా తలంపు గలుగవచ్చును'' అని వచించెను

తరువాత జననియగు రామేశ్వరమ్మగారు ''బిడ్డా! ఇదివరలో ననేకులు నీ తండ్రిగారిని నన్నును ననేక విధములుగా దూషించుచుండిరి ఏదేమన ''ఆడపిల్లలు చెప్పినట్లు మీరు నడుచుచున్నారు మనవంశములో యౌవనము వచ్చినవో వివాహము జేయకుండెడి వారెవరు గలరు? ఎంత గొప్పవారైనను వయస్సు వచ్చిన పిల్లకు సరియైన బంధుత్వము దొరకక పోయినను స్వజాతియందెవరికైన నొకరి కిచ్చి వివాహము జేయుట ధర్మము'' ని చెప్పుచుండిరి కాని పిమ్మట వారును నీ భక్తివైరాగ్య జ్ఞానాదులను, గీతా పారాయణమునకు వచ్చెడు మహిళామండలిని జూచి యిపుడు వారు సంతోషించుచున్నారు మఱియు నా పుట్టింటి వారిచ్చిన నగలును, భూమియును నీకిచ్చి వివాహము జేయ తలంపు గలిగియుండెను శ్రీసీతారాములవలెను, లక్ష్మీనారాయణులవలెను, పార్వతీ పరమేశ్వరులవలెను గల అల్లుడును కుమార్తెను జూచెడు భాగ్యము లేక పోయెను గదా!'' యని కన్నీరు విడిచెను అపుడు తల్లిని జూచిభారతీదేవి ''యింకను మీ పామరత్వము పోలేదా? అజ్ఞానులనేక విధములుగా జెప్పుదురు వారి మాటలను బాలభాషితములనుగాను, భ్రాంతులవచనములగాను విజ్ఞులు తలంతురు మీరు గురునివద్ద వేదాంతశ్రవణము జేసియు మనన నిది ధ్యాసనములచే దృశ్యభ్రాన్తి నశించువఱకు తీవ్ర బ్రహ్మనిష్ఠను జేయని కారణముచే నిట్లు బలుకుచున్నారు'' ని చెప్పి తల్లిని యోదార్చి ''యమ్మా! శ్రీ తరిగొండ వెంకమాంబగారికి వివాహమిష్టము లేకపోయినను వారు ఐదు సంవత్సరముల ప్రాయములోనుండిన బాలిక యైనను, కులమునకు వెరచి బలాత్కారముగ వివాహము జేయ తలంచిన సంగతి దెలిసికొనినపుడు తల్లిదండ్రులనుద్దేశించి యిట్లు పలికిరి ''జననీ జనకులారా! మీరు నన్నొక మానవ క్రిమికి నీయబోవుచున్నారు నన్ను శ్రీ వైకుంఠవాసులగు శ్రీ వేంకటేశ్వరున కిచ్చినచో ఆ శ్రీమన్నారాయణుడు మీ యింటికి అల్లుడై యుండునుగదా, పామరుల మాటలను విని, యట్టి పుణ్యమును పోగొట్టుకొను చున్నారా? మఱియు శ్రీవైకుంఠము మీయల్లుని యిల్లగుచున్నది కదా! అట్టి

పుణ్యమగు నోమును మీరు నోచుకొనక పోతిరిగదా'' యని యుపదేశించిరను వెంకమాంబగారి వాక్యములను జెప్పి, తల్లియొక్క దుఃఖబాష్పములను స్వహస్తముతో తుడిచి ఇంటికి బంపివేసిరి

ఈలాగున కొన్నిరోజులు ప్రయాణోద్యమమును గురించి, తనలో తాను విచారించుకొనుచుండ తపస్సుకొఱకును, ప్రయాణమునకును నుత్తరాయణము మాఘమాసము, శుక్లపక్షము శుభదాయకమని, యిదివఱలో విని యుండు విషయము జ్ఞాపకమునకు వచ్చిన, కొలది దినములలోనే యఘమును నశింపచేయు మాఘమాసము వచ్చినది ఈ మధ్య నొకనాడు గీతాపారాయణ జేయు భామా మణులందఱును భారతీదేవి తీర్థయాత్ర వెళ్ళు విషయమై మాతాపితరులతో జరిగిన సంభాషణనెట్లో యెఱింగి యందఱును గీతాపారాయణానంతరము హంసపక్షుల గుంపు ఆకాశమునుండి మానస సరోవరములో ప్రవేశించునట్లు భారతీదేవిగారి కుటీరములో ప్రవేశించిరి అత్తరి యందఱును నమస్కరించి, తీర్థయాత్రా విషయమై యిట్లడిగిరి ''తల్లీ! మీరిక యాత్ర చేయవలయునా? జిజ్ఞాసువులకును, శుభేచ్ఛాస్థితి లోనుండు వారికిని యాత్ర తగునుగాని, యింత యోగానుష్ఠానము ఆరూఢ స్థితియు గల మీబోటివారికేల యీ భ్రాన్తి గలుగవలయును?

*ఉత్తమా తత్త్వ చింతైవ మధ్యమం శాస్త్రచింతనమ్ ।*
*అధమా మంత్రచింతా చ తీర్థ భ్రాంత్యధమాధమా ॥*

మీ శరీర కాంతి, యోగసిద్ధిగలిగినదని చూపరులకు జెప్పకనే చెప్పుచున్నది

*వపుః కృశత్వం వదనే ప్రసన్నతా నాదస్ఫుటత్వం నయనే సునిర్మలే ।*
*అరోగతా బిందుజయోఽగ్ని దీపనం నాడీవిశుద్ధిర్హఠయోగలక్షణమ్ ॥*

యోగసిద్ధిగలవారికి శరీర కృశత్వము, ముఖప్రసన్నత, స్ఫుటవచనము, నేత్రప్రకాశము, మంచి ఆరోగ్యము, అచంచలమగు బ్రహ్మచర్యము, జఠరాగ్ని దీపనము, నాడీశుద్ధి ఇవి గలుగుచుండును ఇవన్నియు మీయందు గాననగు

యున్నాడు'' అని పలికిరి

ఈ వాక్యమును విని భారతీదేవి శరత్కాల శుభ్ర మేఘములో మెరపు మెరయు విధంబున ప్రసన్నవదనముతో మంద హాస మొనర్చి యిట్లు చెప్పిరి ''గీతాపారాయణమే పునీతురాండ్రగు నో వనితామణులారా! మీరు వచించినది కొంతవఱకు నిజము యాత్రను జేయనిచో లోకజ్ఞానము గలుగదు ఒక తైలబిందువు నీటిలో వేసినచో నెటుల నంతట వ్యాపించునో దానినే యితర స్థలములో నుంచిన నంతట వ్యాపించదో, అటులే ఒక స్థలమున నుండువారు మహాపట్టి వుండుబాకవువలెను, బోనులో నుండు సింహమువలెను, పంజరమునందుండెడు పక్షివలె నుందురేగాని, వారికి విశాలమైన విశ్వజ్ఞానము గలుగదు

*యస్తుపర్యటతే దేశాన్ యస్తు సేవేత పండితాన్ ।*

*తస్య విస్తారితా బుద్ధిస్తైలబిందురివాంభసి ॥*

ఎవడు దేశసంచారము జేయలేదో ఎవడుబ్రహ్మనిష్ఠులను, సాధుపురుషులను, వారి యాశ్రమములను జూడలేదో, వారిబుద్ధి సంకుచితమై యుండును ప్రపంచ ములో ననేక సంస్థలను, అనేక బ్రహ్మవేత్తలను, అట్టివారి యాశ్రమములను జూచి, అట్టివారి తత్త్వమును గ్రహించిన వారి బుద్ధి నీటిపై వేయబడిన నూనెచుక్కవలె విశాలమగును అటుల చేయనందుచే తామే గొప్ప తపస్వులమనియు, తామే గొప్ప భక్తులమనియు తలంచుటకు కారణమగు చున్నది మఱియు తామే గొప్ప యోగులమనియు, తామే గొప్ప జ్ఞానులమనియు, తామే గొప్ప పండితులమనియు, తామే గొప్ప యన్నదాతల మనియు, తమకే యిందరు శిష్యులు గలరనియు, తామే యెక్కువ సమయము ధ్యాననిష్ఠా సమాధులలో నుండువారమనియు, తమకు సమానమైన వైరాగ్యము గలవారు లేరనియు, తమకు సమానమైన పుణ్యకర్మల జేయువారు లోకములో నుండరనియు, తమ యాశ్రమమునకు సమానమగు ఆశ్రమము మరెచ్చటను లేదనియు, అహంకారపరులై యితరులను తూలనాడుటకును, తమ్ముస్తోత్రము జేసుకొనుటకును కారణమగుచున్నది

కావుననే, ఏదైన ఒక సంఘమును స్థాపించదలచినవారు నిశ్చయముగా దేశసంచారము జేయవలయును అయితే విశ్వజ్ఞానవమును గ్రహించేవారుగా నుండవలయును లేనిచో గొప్ప లాభముండనేరదు నేను కేవలము తీర్థయాత్రకొఱకై వెళ్ళుట లేదు ఎచ్చటెచ్చట గొప్ప యోగులు, సిద్ధపురుషులు, తాపసోత్తములు, తపస్వినులు, యోగినులు, విదుషీమణులు, పరమ భక్తురాండ్రు, దానశీలురు, విజ్ఞాన సంపన్నులు, కారణ గురువులు, పరమ గురువులు మొదలగువారు గలరో వారిని కనుగొనుటకును, శివజీవైక్య విషయమై నాకు గలిగిన సందేహమును నివర్తింప జేసికొనుట కొఱకును వెళ్ళుచున్నాను మరియొక విశేషము గలదు ఏమన! జల మంతటను నొకేవిధముగా నుండగా కొన్ని పుణ్యతీర్థము లెట్లగునని కొందఱడు గుదురు ఆ విధముగా నంతయు పంచభూతాత్మకముగా నుండగా పుణ్యస్థలమని కొన్నిటినెట్లు చెప్పగలరు? మనస్సే ప్రధానముగదా! యని నాతోగూడ ననేకులు ప్రశ్నించియున్నారు ఇవి యన్నియు సూక్ష్మబుద్ధియు, నంతఃకరణశుద్ధియు, సచ్ఛాస్త్ర విచారణయు, మహాత్ముల సహవాసము లేనందుచే గలిగెడు పొరపాటులు మేఘజలమంతట నొకేవిధముగా వర్షించినను స్థలభేదములచే శుద్ధాశుద్ధ భేదము లుగా కనుపించుట లేదా? ఆలాగున స్థలభేదముగూడ గలదు కొన్ని యూషర భూములు, మరికొన్ని గంధకపుభూములు, ఇంక కొన్ని రాతిభూములు అని యిట్లుండగా, కర్షకుడంతటను భూమి యొకటేయని తలంచి వ్యవసాయము జేయునా?

కావున బుద్ధికి పరమగు జ్ఞేయస్థితి గలుగువఱకు, దేశకాలస్థలముల నను సరించి యుండవలయును ఉప్పునీరు, చౌటినీరు, సున్నపునీరు, దుర్గంధపు నీరును జూడక నంతయు నీరే యని జలపానము జేయు వారుందురా? తపస్సునకు, యోగ మునకు, శుద్ధమగు పుణ్యభూమియు, నిర్మలమగు నుదకమును తప్పక యుండ వలయును అంతేగాక ఇదివఱకు గొప్పమహనీయుల సమాధిగాని, లేక దేవాల యముగాని, లేక యజ్ఞము జేసిన పుణ్యక్షేత్రముగాని ఉండవలయును లేనిచో నిర్విఘ్నముగ తపస్సుగాని, యోగసిద్ధిగాని గలుగజాలదు కనుకనే యోగసిద్ధి స్థలమును గుఱించి శాస్త్రములో విశేషముగా చెప్పుటకు

కారణమైనది

*శివదేవాలయే గోష్ఠే సర్వదేవాలయే శుభే ।*
*వటస్య ధాత్ర్యాం మూలేవా మఠే బృందావనే తథా ॥*

శివదేవాలయము, గోవుల కట్టివేయు స్థలము, పవిత్రమైన సమస్త దేవాలయము లలోను, వటవృక్ష మూలములోను, ఉసిరిక చెట్టుక్రిందను, మఠములలోను పుష్పోద్యానములందున్ను,

*పవిత్రే నిర్మలే దేశే నిత్యానుష్ఠానతోఽపి వా ।*
*నిర్వేదనేన మౌనేన జపమే తత్సమారభేత్ ॥*

అలాగున పవిత్రమైన యే స్థలమందుగాని యాసీనుడై, నిత్యానుష్ఠానము జేయువాడు చలనము లేనివాడై మౌనముతో కూడి జపమాచరింపవలయును

*యస్తు బిల్వవనే నిత్యం కుటీం కృత్వా వసేన్నరః ।*
*సర్వే మన్త్రాః ప్రసిధ్యంతి జపమాత్రేణ కేవలమ్ ॥*

*పర్వతాగ్రే నదీతీరే బిల్వమూలే శివాలయే ।*
*అగ్నిహోత్రే కేశవస్య సన్నిధౌ చ జపేత్తు యః ।*
*నైవాస్య విఘ్నం కుర్వన్తి దానవా యక్షరాక్షసాః ॥*

బిల్వవనమున కుటీరము నిర్మించుకొని నివసించి, మన్త్రముల జపించిన శీఘ్రముగా సిద్ధిగలుగును పర్వతాగ్రమునందును, పుణ్యనదీ తీరమునందును మారేడు చెట్టు మొదటను, శివాలయమునందును, అగ్నిహోత్ర సమీపమునందును, విష్ణ్వాలయము నందును జపించిన దానవ యక్షరాక్షసులు మన్త్ర జపమునకు విఘ్నము జేయలేరు మనుజులలో శాంతి, శమ, దమ, కరుణాది సద్గుణములుగల బ్రహ్మజ్ఞాన సంపన్నుడును, సామాన్యరజోగుణము గలవాడును, పాపకృత్యము జేయు తమోగుణస్థుడును నను భేదమున్నట్లు స్థలముయొక్క భేదమున్ను ఉండును గోవుయొక్క దేహమందంతటను క్షీరము వ్యాపించి యుండినను స్తనము నుండి క్షీరమును, దాని సమీపమున మఱియొక

స్థలము నుండి మూత్రమును, దానిదగ్గఱ మఱియొక స్థలమునుండి గోమయము నెట్లు వచ్చుచున్నవో ఆలాగున స్థలమునకును భేదము గలదు అదేరీతిగ మాతృశరీరములో గూడ భేదము గలిగియున్నది శిశువులు స్తన్యపానముచే వృద్ధినొందవలయునే గాని మలమూత్ర ముల భుజింతురా? మనస్సే ప్రధానమని చెప్పెడు వాక్యమునకు గొప్ప అర్థము గలదు అయితే పుణ్యస్థలములలో నివసించినను, పుణ్యకార్యముల జేయుట చేతనే ప్రయోజనము గలదు లేనిచో గలుగదు మఱియు బీజమునననుసరించి వృక్షమేర్పడునట్లు పుణ్యజీవులైనచో పుణ్యకార్యములనే చేయుదురు ఆలాగున పాపజీవులైనచో పాప కర్మములనే చేయుదురు అదే మనస్సు ప్రధానమని చెప్పెడు వాక్యముయొక్క యర్థము మఱియు నిర్విషయ మనస్సైనచో మోక్షమును బొందును విషయ దోషముగల మనస్సైనచో నరకము గలుగుననియే శ్రుతి చెప్పుచున్నది

*మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।*
*బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥*

బంధనమునకును మోక్షమునకును మనస్సే కారణము ఎట్లందురా? విషయాసక్తిగల మనస్సైనచో బంధమును, నిర్విషయ మనస్సైనచో ముక్తియును గలుగుననియే శ్రుతివాక్యమున కర్థము కారణము లేనిదే కార్యముండదు కారణమున కన్యముగా కార్యము గలుగదు బీజము కారణము వృక్షము కార్యము, ఆలాగున మనుజుడు సత్త్వరజస్తమస్సులనెడు మూడుగుణములలో నేగుణము గలిగియున్నాడో దాని కనుగుణమగు ప్రవృత్తి గలిగియుండుననియే శ్రుతివాక్యములయొక్క నిజార్థము ఈశ్రుతియొక్క పూర్వోత్తరపదముల యర్థమును విచారింపనందు చేతనే విపరీతార్థము గలుగుటకు కారణమగుచున్నది కొందరు స్నానమేల? జపమేల? యోగ మేల? తపస్సేల? నియమ మేల? ఏది భుజించిననేమి? ఏది చేసిననేమి? మనస్సే ప్రధానమని చెప్ప నారంభించిరి అందువలననే వారు దేనికిగూడ నుపయోగపడక పోయిరి అంతియేగాక మేధాసంపత్తి గలవారికిని, శాస్త్రసార మెఱింగిన వారికిని, గౌరవనీయులకును, సాధువులపై, సన్న్యాసులపై, గురువులపై విశ్వాసము లేక పోయినది దీనివలననే

బ్రహ్మవిద్య యింతటి పతనమునొందుటకు కారణమైనది అధోలోకమునకు జారిపోయిన బ్రహ్మవిద్య నుద్ధరింపవలసియుండినచో, బ్రహ్మనిష్ఠులును, పరమభక్తులును నగువారి హృదయములో నొక పిడికె డన్నము పడిన మన వంశమంతయు పావనమగున'' ను విశ్వాసము జనులకు గలుగు లాగున ప్రతిముముక్షువును, సాధకులును ననుష్ఠానపరులై యుండవలయును అట్టి పవిత్రత పూర్వకాలపు సన్న్యాసులకును, బ్రాహ్మణులకును నుండినందుచేతనే యనేక రాజులు, శ్రీమంతులు వారికి అగ్రహారములను, మాన్యములను దానముగా నిచ్చుటకు కారణమైనది పూర్వీకులు పుణ్యముచే సంపాదించిన యగ్రహారములను, మాన్యములను, వార్షిక సంపాదనలను నిప్పుడుండెడి వారమ్మి జీవించుచున్నారు కాలపరిణామ మీవిధమున మారినది'' అని బోధించిరి

మఱియు ''మీలో నెవ్వరైనను లేక పురుషులలో నెవ్వరైనను నీ భారతదేశము నుద్ధరింపవలసినచో గొప్ప తపస్సునుగాని, గొప్ప యోగమునుగాని, గొప్పవిద్యను గాని సంపాదించుట యంత ముఖ్యమైన పనిగాదు లేక దీనికి అవతారపురుషుడు పుట్టవలయుననిగాని విచారింప నవసరము లేదు మీ యుదరములో నొక పిడికె డన్నము పడినచో మన జన్మ పావనమగును'' ని నమ్మకము జనులకు గలుగునట్లు చేసిన జాలును దీనికి మీకేమియు ప్రయాస లేదు హృదయముయొక్క నిర్మలత గలిగిన చాలును ఒకవేళ మేము లేక పోయినను, మీరందఱును మామూలు ప్రకారము గీతాపారాయణ జేయుచు నిపుడుండేలాగున అనుష్ఠానమును గలిగియుండ వలయును బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధము గలుగజేసెడు కార్య మెంత పుణ్యమైనదైనను భ్రమపడి దానిలో ప్రవేశింపగూడదు అది ప్రత్యక్షముగా కనుపించు ఫలముగలదై నను, ఆత్మశక్తి గలుగనిచో దాని కల్పాయువు గలుగు నేగాని దీర్ఘాయుస్సు గలిగి యుండదు మఱియు ఫలవృక్షములను విశేషముగ పెట్టి పెంచేలాగున చూడరాదు అది సంసారుల పని ఆ గృహస్థుల పనిని సన్న్యాసులు చేయబూనుటచే సన్న్యాసులు చేయవలసిన పని నిలిచి పోయినందున లోకమాత్మజ్ఞానములో కొఱత గలిగి జడత్వమును పొందుటకు కారణమైనది జీవులకు గల జడత్వమును తొలగించి వారిని చైతన్యవంతులనుగా జేయుటయు,

బ్రహ్మవిద్యను వృద్ధిపఱచుటయు, సోదర భావమును, జీవకారుణ్యమును, విషయవిరక్తిని వృద్ధిపఱచుటయు, జీవుల యంతఃకరణములో గల భవరోగములను రహితమొనర్చుటలో నానావిధములగు కార్యముల నొనర్చుటయు, సన్న్యాసుల పనిగా నుండవలయును వైద్యులు చేయ వలసిన పనిలో కొఱత గలిగినచో లోకమేలాగున రోగ బాధితమై దుఃఖము నొంద వలసియుండునో, ఆలాగున భవరోగమును రహితమొనర్చుటలో, నెంతకాల మెందరు ప్రయత్నించినను చాలకనే పోతున్నది అందుచే ఇంకను లోకము భవరోగ పీడితముగుచునే యున్నది అయితే యీ వాక్యములం దాధారపడి సోమరులైయుండి పవిత్రజీవితమును, పావనకాలమును వ్యర్థపఱచకూడదు అత్యావసరమగు వృక్షము లను పుష్పములను మాత్రము పెట్టి పెంచిన చాలును తక్కిన కాలమంతయు బ్రహ్మనిష్ఠలోను, శాస్త్రవిచారములోను, ధర్మబోధలోను గడుపవలయును ఒక్క క్షణ కాలమైనను వ్యర్థముగా పోవునపుడు పేదవాని చేతినుండి పెన్నిధి జారి పోయిన యెడల అతడెట్లు తపించునో, అట్టి మనఃపరివర్తనము గలిగియుండుటయే నిజమైన వైరాగ్యమగును నేను యాత్రను జేయుట నాకొకరికి మాత్రమని తలంపవలదు దైవకృపచే దీనియందుత్తీర్ణత గలిగిన మీరుగూడ వేదాంతముయొక్క నిజార్థము నెఱుంగగల'' రనెను

ఈ మాటను వినినతోడనే కొందఱు మానినీమణులు మేముగూడ వచ్చెదమని చెప్పగా, భారతి యీ విషయమై మఱల యోచించుకొనవచ్చును ఇప్పటికే భోజన కాల మతిక్రమించినదని చెప్పి, ఇక నిచ్చట నుండినచో వీరు వెళ్ళరని తలంచి, తమ ధ్యానమొనర్చుకొను గదికి వెళ్ళిరి అత్తరి వధూమణులందఱు విచార హృదయులై వారి వారి స్వగృహములకు ప్రయాణమయిరి ఇదేరీతిగ యాత్రను గురించి తలంచు చుండగా నతిపుణ్యమగు మాఘశుద్ధ భీష్మైకాదశి దినము వచ్చినది ఆ దినమంద ఱును భజనల జేసి, ఫలాహారాది, దైవిక కార్యముల నన్నిటిని మామూలు ప్రకార మచటనే జరిపి, బ్రహ్మవిచారము సేయుచు నస్తమయ కాలమున నందఱును గృహోన్ముఖులై యుండు తరుణమున శ్రీ రత్నమాంబగారందఱితోను, రేపటి దినము ద్వాదశి

పారణ లందరికి నిపటనే జరుగును' ని చెప్పగా వధూమణులందఱును 'అట్లే' యని యంగీకరించిరి

మరునటి దినము ప్రాతఃకాలమున మహిళామండలి వారేతెంచి గీతాపారాయణ పూర్తి యగునప్పటికి నందరికిని భోజనాదుల పరమ సంతోషముతో, నరేంద్ర రాజుగా రేర్పాటు చేయించుచుండిరి అందఱును సంతృప్తిగా నారగించిరి పిమ్మట ప్రతిదినము చేయుచుండెడు దారముతీయుట, భజన సలుపుట, వేదాంతవిచారణ జేయుట మొదలగు దినచర్యలన్నియు పూర్తిగ జరుపగా నాదినము భారతీదేవియు వారితోనే కలిసి మెలసి యుండెను భారతీదేవి ఆ దినమెపుడును జెప్పనటువంటి వేదాన్తతత్వమును గుఱించియు, పరమభక్తి వైరాగ్యముల గుఱించియు బోధించెను మఱియు నిట్లనిరి ''మనుష్యజన్మము యొక్క ముఖ్యలక్ష్యములు రెండు అందులో నొకటి ముఖ్యమనియు, రెండవది గౌణమనియు బ్రహ్మవేత్తలు చెప్పుదురు ముఖ్యము మఱల జన్మము గలుగని జీవన్ముక్తిని పొందుట గౌణము ఫలాపేక్ష లేక సమత్త్వబుద్ధి గలిగి, ప్రాణికోట్లకు మేలుచేయుట దీనివలన నుత్తమ పుణ్య లోకప్రాప్తి గలుగును ఈ విషయమై భర్తృహరి నాల్గింతస్తులుగా జెప్పియున్నారు

*న ధ్యాతం పదమీశ్వరస్య విధివత్సంసారవిచ్ఛిత్తయే*
*స్వర్గద్వార కవాటపాటన పటుర్ధర్మోఽపి నోపార్జితః ।*
*నారీపీనపయోధరోరుయుగళం స్వప్నేఽపి నాలింగితం*
*మాతుః కేవలమేవయౌవన వనచ్ఛేదే కుఠారా వయమ్ ॥*

ఈశ్వరకృపను సంపాదించి మోక్షమును బొందుట ఉత్తమోత్తమము సత్కర్మ లజేసి స్వర్గలోకమును బొందుట యుత్తమము గృహస్థధర్మమును విధిప్రకారమనుష్ఠించి ధర్మబద్ధమగు నింద్రియ సౌఖ్యముల ననుభవించుట మధ్యమము పుణ్య కర్మల జేయకయు, పరప్రాణుల పీడించుటయు, నిద్రాహారాదులచే కాలము గడుపుట యధమము ఈ నాల్గవతరగతివారు మాతృద్రోహులు వ్యర్థముగ జననికి గర్భభారమును గలుగజేయుటచే పశుప్రాయులు

ఈ వాక్యముల నాకర్ణించి మహిళాసంఘమువారు ఎప్పుడును జెప్పనటువంటి యీ యపారబోధ నీ దినము చెప్పుటకు కారణ మేమియో యని యొకరితో నొకరు చెప్పుకొనుచు ప్రయాణోన్ముఖులై యుండగా, ప్రత్యేకముగ క్షత్రియకన్యకల సంబోధించి ''శరీరము నీటిపై బుడుగ వంటిది జీవితము విద్యుల్లతవలె క్షణికము ప్రాణముండువరకు ధర్మాచరణ మొకటియే మోక్షద్వారములోనికి దీసికొని వెళ్ళును కావున నేనిచటనే యెల్లపు డుందునని తలంపవలదు ముఖ్యముగా క్షత్రియులకు నీ ధర్మము బాగుగా దెలియును ఏలన? పుత్రుడు యౌవనారూఢు డగునపుడు వారిపై రాజ్యభారమును, కుటుంబకార్యములను మోపి, వానప్రస్థాశ్రమమునకు వెళ్లుదురు జనకుడాచరించుచు వచ్చిన ధర్మకార్యము లేలాగున కొమరులాచరింతురో, ఆలాగున నేకాలమ్మైనను నేను లేని కాలము వచ్చును అప్పుడు గూడ నిదివఱలో జరుగుచుండిన గీతాపారాయణము దైవభజనాదులు మీరు సలుపుచుండ వలయును'' అని వచించి భారతి యందఱితోను వారివారి గృహములకు వెళ్ళేలాగున కరముతో సంజ్ఞను జేసెను కొందఱు మగువ లీవాక్య మెపుడును భారతీదేవిగారు చెప్పలేదే యని శంకించి నిశ్చేష్టురాండ్రై యచటనే నిలిచిరి అపుడు భారతి యిక నిచట నిలిచి యుండినచో నీనాతులు నన్ను విడచి వెళ్ళరని దలంచి ధ్యానగృహములోనికి వెళ్ళిరి అప్పుడు మానినీమణులందరును భారతీదేవి వచించిన వాక్యముల నొక్కొక్కదాని నర్థము జేసికొని తమ గృహములకు వెళ్ళిరి

మరుసటి దినము మామూలు ప్రకారము, గీతాపారాయణమునకు మహిళా మండళి వారందఱు వచ్చినపుడు, భారతీదేవి యచ్చటనే యుండుట జూచి, నిన్నటి దినమున గలిగిన విషాదము పోయినది ఆ దినము పారాయణ జేసి స్వసదనములకు వెళ్ళిరి వారు పోయిన తర్వాత రత్నమాంబగారిని పిలిచి ''సముద్రము నదులను తనలోని కతివేగముగ నాకర్షించునట్లు, దైవము నా మనస్సు నతివేగముగ నాకర్షించు చున్నది ఇది ప్రయాణ విషయమై యుండవచ్చును కావున మన యిద్దరికి రెండేసి నారవస్త్రములు, రెండేసి

ఎండిపోగుచ్చలను, ధ్యానమునకు దగిన రెండు తెల్లధావళులును (తెలుపు పంచెలు), జపమాచరించుటకు రెండు రుద్రాక్షమాలలను గోమయముతో కుట్టబడి యుండు విభూతియును, చిన్న కుంకుమడబ్బియును, లోహ త్రయముతో గూడియుండు కాశీనామక కమండలమును, నీ రుపయోగించెడు చెంబును, మన యిద్దరియొక్క భగవద్గీతాపారాయణ పుస్తకములును, కైవల్య కఠ ముండక, మాండూక్యోపనిషత్తులును, ప్రత్యేకముగ రెండు మూటలుగా కట్టవలసినది'' అని చెప్పుచు శ్రీ సిద్ధార్థుండేలాగున ప్రయాణముకొరకు రాత్రిళ్ళు విచారము జేయుచుండెనో, ఆలాగున భారతీ దేవియు తీర్థయాత్రా సమయము నాలోచించుచుండెను లేదూడను కట్టివేసిన స్థలమునకు ఆవు అపుడపుడువచ్చి మా మనట్లు, తీర్థయాత్ర విషయము వినినప్పటినుండి రాత్రులలో నొక్కొక యామమునకు రామేశ్వరమ్మ వీరిని వచ్చి మామమండెను మామూలు ప్రకారము మూడవ యామమున వచ్చిమాడ భారతియు, రత్నమాంబయు స్నానమాచరించి కొంచెముసేపు ఆత్మలో పరమాత్మను ధ్యానము జేయుచుండిరి తల్లి మావి వెళ్ళినవెంటనే మీరాబాయి రాజగృహమునుండి శ్రీకృష్ణ పరవశచిత్తముతో బయటకు పోయినట్లు, హృదయమున సర్వేశ్వరుని ధ్యానించుచు, కులదైవమగు శ్రీరాముని, పరమ ఋషులను, ధర్మదేవతను తలంచుచు భారతీదేవియు, శ్రీరత్నమాంబగారును ఒక్కొక్కమూటను, నొక జలపాత్రను దీసికొని ధ్యానపరవశ చిత్తముగలవారలై యాశ్రమము విడిచి కుటీరము తలుపులను చాచి, పశ్చిమముఖులై ప్రయాణము జేసిరి సూర్యోదయమైనచో నెవ్వరైనను గనుగొనెదరని దలంచి గౌతమబుద్ధుడతి వేగముగ నెటుల పరుగెత్తెనో అట్లు వీరునెవ్వరైన చూచెదరేమోయని తలంచి శరవేగమున వెళ్ళుచుండిరి గృహములో నిద్రించునపు డిల్లగ్నిదగ్ధమై, కాలిన శరీరము గల వనితలెట్లు జలాశయముకొరకు పరుగిడుచుందురో, భారతీదేవియు, రత్నమాంబ గారును తాపత్రయాగ్నిని చల్లార్చుకొనుట కొఱకాలాగున వేగముగ వెళ్ళిరి కిరాతకుల వలనుండి తప్పించుకొని వెళ్ళెడు లేళ్ళేలాగున వెనుకకు మఱలి చూడక, యొక వనమునుండి వేరొక వనమునకును, నచ్చటినుండి మరియొక వనమునకును వెళ్ళు చుండునో, మరియు కైవర్తకుల వలను భేదించుకొని పోయెడు

మత్స్యము లేలాగున నొక మడుగునుండి మఱియొక మడుగునకును, నచటనుండి యింకొక హ్రదము నకును, నచటనుండి మరియొక యగాధ జలాశయమునకు నెట్లు పోవుచుండునో, ఆలాగున భారతీదేవియు రత్నమాంబగారును, సంసారమునుండి తప్పించుకొని యొక గ్రామమునుండి మరియొక గ్రామము, నచటనుండి నింకొక గ్రామమునకును వెళ్ళుచుండిరి

ఈ విధమున పోవుచు పోవుచు సూర్యోదయమగుసరికి ఇరువది మైళ్లదూరము వెళ్ళిరి వనమునుండి వనాంతరములకును సెలయేళ్ళలో నుండు నొక మడుగునుండి మరియొక మడుగునకు పోయెడు హరిణ మీనము లెట్లు కొంతదూరము వెళ్ళిన తదుపరి మఱల నెమ్మదిగ సంచరించునో, అదేవిధముగ వీరును గమనవేగమును తగ్గించి మామూలుగా నడువ సాగిరి పడమటి ముఖముగా నడుచుచుండుటచే, వారికన్న ముందుగా వారి నీడ పోవుట చూడగా, తానాచరించిన ధర్మము ముందుగా వెళ్ళుచున్నట్లు గోచరించెను దారిలో పోవుచుండువారందఱును వీరుభయులను కొంతతడవు కనురెప్పలార్పకనే చూచుచు, నిశ్చేష్టులై నిలుచుచు ''వీరెవరై యుందురు? రాజకుటుంబములో నుండువారి వలె గనుపించుచున్నారు కాని యంతఃపుర స్త్రీలైనచో నాభరణములును మంచి వస్త్రము లుండవలయును అవి వీరికి లేవు నారవస్త్రముల ధరించియున్నారు కావున నేదేశపు యోగినులుగానో ఉండవచ్చునని చెప్పుకొనుచు వెళ్ళుచుండిరి మఱికొందఱు స్త్రీలు కూడనుండు వారితో ''ఓ యోయమ్మలారా! చూడుడి ఇటువంటి మగువలుగూడ లోకములో గలరా? వీరెవరు? ఏమి వీరువన దేవతలా?'' యని చెప్పుటయు, మఱికొందరు యువతీమణులు, ''అక్కరో! చూడుడు ఇటువంటిమనుజులను మనమెప్పుడైన కన్నులార కనియున్నామా? వీరు దేవతా స్త్రీలా, కాదు నారచీరలు, రుద్రాక్షమా లలు, ధరించియున్నారు వీరు సాధుస్త్రీలుగా నుందురు పాంచాల దేశపు స్త్రీలు పొడుగుగాను, పచ్చని వర్ణము గలవారుగా నుందురని వినియున్నాము అందుచే వారై యుండవచ్చునని'' చెప్పుకొనుచు పోవుచుండిరి

మఱికొందరు కాంతలు, తమతోకూడ నుండువారలతో ''నమ్మరో వీరెవరు? తపోభూమిలోనుండి కాయసిద్ధి గలిగిన తపస్వినులా? లేక స్వర్గలోకములోనుండి దిగివచ్చిన యప్సరసలా?'' అనగా నపుడు వారిలో నొకతె ''కాదు ఏలన యప్సర స్త్రీలైనచో వారికి నతిసుందర వస్త్రాభరణవము లుండును వీరు నారవస్త్రముల ధరించి యుండుటచేతను, విభూతిని పూసికొనియుండుటచేతను, శ్రీకాశీరామేశ్వరాది యాత్రల జేయువారుగా నున్నార'ని చెప్పుచునవటనే నిలిచి, కొంతసేపు వీరిని జూచు చుండిరి మఱికొందఱు భామలు''అమ్మమ్మా? అదిగో చూడుడు ఈస్త్రీలు ఎవరై యుండవచ్చును? గృహస్థా శ్రమమందుండెడివారు కారు తపస్వినులుగా గనుపించు చున్నారు నేపాళదేశ స్త్రీలు గొప్ప యోగినులు, పొడవైన దేహము గలవారు, బక్క శరీరము గలవారని వినియున్నాము వీరాదేశస్థులై యుందురు తీర్థయాత్రాపరులై పోవుచుండెడివారివలె తోచుచున్నది'' అని పరస్పరము చెప్పు కొనుచుండిరి ఈలాగున బాటసారులగు నారీమణులును, పురుషులును దారి పొడుగున చూచుచు జెప్పుకొనుచుండిరి అటుల నడచి నడచి, సాయంకాలమునకు 35 మైళ్ళదూరము వెళ్లిరి అచటనుండు గ్రామములో నొక పుణ్యయువతియగు రెడ్డియమ్మ కట్టియుండెడు సత్రవములో జేరిరి యాత్రాపరులై వచ్చెడు సాధువులకు, తీర్థయాత్రాపరులకు, అతిథులకు ఆహారాదుల నిచ్చి యా సత్రవము గలవా రాదరించు చుండిరి వారీ దివ్యరూపధారిణులగు నారీమణుల జూచి విస్మయమంది దగ్గఱ కరుదెంచి వినయమముతో పాదప్రక్షాళనవమునకు జలమొసంగి, పవిత్రాసనమున కూర్చుండబెట్టిరి భారతీదేవి స్నానము జేసినచో బాగుండునని చెప్పుటచే జలాశయమును జూపగా, వీరుభయులు స్నానము జేసిరి ధ్యానమునకు సత్రము పై భాగమున స్థల మేర్పాటు చేసి యుండునట్లు సత్రమువారు చెప్పి, వెండియు 'అమ్మలారా! మీ రేభోజనము జేసెదర'ని యడుగగా భారతీదేవి మీ రేమిచ్చినను చాలునని చెప్పి ధ్యానమునకు వెళ్లిరి

ఇట్లుండ నచట భారతీదేవి తపోవనమున నారీమణులు మామూలు ప్రకా

రము గీతాపారాయణ ప్రార్థనాదులను పూర్తి జేయునప్పటికి 11 ఘంటలు దాటినది వధూమణు లందఱును కూర్చొని శ్రీ రత్నమాంబగారైన నింతవఱకు బయటకు రాలేదని యొకరు వెళ్ళిచూడగా మామూలు ప్రకారము లోపల తలుపు గడియ వేయక తలుపు చాచియుండుటను జూచి వెంటనే వచ్చి యీ సంగతి యా యమ్మలతో జెప్పగా మఱికొందరు వెళ్ళి సూదిరంధ్రములో దారము నెక్కించినప్పు డెట్టి సూక్ష్మపు చూపు గలిగియుందురో యట్టి సూక్ష్మదృష్టితో తలుపుద్వారము నుండి చూచినను నెవరును కనుపించ లేదు ఈ సంగతి నెమ్మదిగ గీతాపారాయణ సంఘము వారితో మానినీమణులు చెప్పగా భారతీదేవి యుండు ధ్యానకుటీరమును జూచె దమని కొందఱు పరుగిడి వెళ్లి చూడగా, నచటగూడ తలుపు చాచి యుండెనే గాని గడియ వేసియుండ లేదు అప్పుడు కొందఱు లలనామణులు తలుపును జాగ్రత్తగా తెరచి లోపలికి వెళ్లి చూడగా నెవరును కనుపించ లేదు అపుడు యోషిన్మణులంద ఱును ముఖ్యముగ రాజకన్యకలును ''ఇంకేమున్నది, ఇంకేమున్నది దైవమా!'' యని చెప్పుచు బిగ్గరగా నేడ్వసాగిరి అతిభక్తి పరవశురాండ్రై రాజకన్యకలు తుఫాను గాలిచే కదళీవనములోగల యరటి చెట్లు ఒకదానిపై నొకటి పడిపోవునట్లు ''ఓ భగ వంతుడా! ఈ విధముగా జేసితివా?'' యనుచు నొకరిపై నొకరు పడిపోయిరి పల్లవశాఖలను నరకి యెండలో వేసినచో వృక్షములెట్లు మలమలమాడిపడి యుండునో, ఆలాగున భూపాలకన్యకలు మూర్ఛితలై పడి యుండిరి ఈ శబ్దము లను దుఃఖరోదనలను విని భారతీదేవియొక్క జననీ జనకులు సంభ్రమముతో నేవిపత్తు సంభవించెనో యని పరుగెత్తి వచ్చునప్పటికి రాజకన్యకలు గుంపులు గుంపులుగ నుండుట జూచి తపోవనద్వారములో నిలిచి విచారించగా ''నాత్మకన్న నధికముగా ప్రేమించి యుండిన భారతీదేవి యిదివఱలో తీర్థయాత్ర వెళ్ళవలయునని చెప్పిన ప్రకారము వెళ్ళిపోయిరి శ్రీరత్నమాంబగారును లేరు'' అని నారీమణులు దుఃఖవారిధిలో మునిగి కన్నీరు గార్చుచు నరచుచు జెప్పిరి

ఈ కర్ణకఠోరమైన వాక్యమును వినిన వెంటనే మావటివాడంకుశముతో మర్మసంధిలో పట్టి యీడ్చబడిన గజమువలె నరేంద్రుడును కొంచము సేపు

కూలబడి పిమ్మట తనపూజా గృహమును ప్రవేశించి తలుపుల మూసివేసి యేమియు తోచక విచారమనస్కుడై భూమిపై బడిపోయెను భారతీదేవిగారి తల్లియగు రామేశ్వరమ్మ గారును, ''హా! దైవమా! దైవమా!'' యని వాపోవుచు లోపలికివచ్చి తన బిడ్డ ధ్యానము జేయు గదియంతటను వెదకెను అచ్చటంతయు చేతితో తడువుచు కానరామిచే రెండవబిడ్డవలె జూచుచుండిన శ్రీ రత్నమాంబగారు ధ్యానము చేయు కుటీరమునకు బోయి యచటను వెతకి కానరానందుచే 'దేవుడా! ఇంతకాలము నిన్ను కొలిచిన మాకిట్లను గ్రహించితివా?' అని విలపించుచు బాణము తగిలిన రాజహంసమువలె భూమిపై గూలెను

ఈ విధమున కొంతతడవు జరిగిన పిమ్మట మహిళాసంఘములో మంచి ప్రజ్ఞయు, మనోధైర్యమును గల కొందఱు మానినీమణులు మూర్ఛనుండి తెప్పరిల్లి ముఖము చన్నీటితో కడుగుకొని శీతలజలముచే నందరి ముఖములను కడుగుచు కొందఱికి మంచినీరిచ్చి యోదార్చుచు, మనశ్శాంతి గలిగెడు మృదు వాక్యముల జెప్పుచు, 'దుఃఖింపవలదు ఇదివఱలోనే మనతో భారతీదేవిగారు చెప్పుచుండిరిగదా! మఱల వారు త్వరలో కార్యసిద్ధి గలిగి తిరిగి వచ్చునట్లు సర్వేశ్వరుని ప్రార్థన జేయుట మేలు అందుచే వారు త్వరలోనే రాగలరు వారు చెప్పినట్లు మనము చేయుటయే నిజమైన ధర్మమగును ' అని యందఱిని చాలవఱకు శాంతపఱచి భారతీదేవిగారి తల్లితో ''మీరును నీలాగున దుఃఖముతో నుండరాదు భారతీదేవిగా రిదివఱలోనే యిట్లు జరుగబోవుచున్నదని మనతో జెప్పియుండిరిగదా! ఇటువంటి బిడ్డ మీ గర్భములో జన్మించినందుచే మీరు చాల పుణ్యజీవులని లోకమంతట స్తుతించుట వినియుండ లేదా? మనమందరమును వారికి భగవదనుగ్రహము గలిగి జ్ఞానము పూర్ణముగ సిద్ధించి త్వరలోనే మనతో కలియులాగున భగవంతుని ప్రార్థన చేసెదము భజన ప్రారంభించుడు!'' అని చెప్పునప్పటికి మూడవ యామము సమీపించినది ఈ సమయములో నరేంద్రరాజుగారును నిట్టి విషమ సమయమున మనమిట్లుండుట భావ్యము కాదని తలంచి మనస్సును స్వాధీనపఱచుకొని తోటయొక్క ప్రాకార ద్వారము వఱకు వచ్చి సంగతులన్నియు మఱల మఱల నడిగి తెలిసికొనుచు

మా బిడ్డలు తపస్సు చేసే స్థలములను పరిశోధింపుడు అచట నేదైన యున్నదాయని చెప్పగా నచట కందఱును వెళ్ళి చూచిరి చూడగా నచట ఉత్తరము పడియుండెను ధ్యానమునకు నుపయోగించెడు దర్భాసనములు మాత్రమే యుండెను మఱేమియు నుండలేదు ఆ ఉత్తరము శ్రీ భారతీదేవిగారు స్వహస్తముతో వ్రాసియుండిరి దానియందీ క్రింది వాక్యములు గలవు

''ఓ దైవస్వరూపులగు జననీ జనకులారా! మీకు నిహలోకసౌఖ్యముల కేమియు కొఱత లేదు దైవజ్ఞానము గలిగిన సంతతి యుండినచో తల్లికిని తండ్రికిని పరలోకసుఖమునకేమియు కొఱత గలుగదు ఈ దినమునుండి మనకు గలిగి యుండు బంధము తెగి పోయినదని తలంపవలయును మీ రెట్లుందురో యని నేను దలంపను నే నెట్లుందునో యని మీరును దలంపవలదు నన్ను గురించి వెదక నవసరము లేదు వెదకినను దొరకను మీరెంతవఱ కతిధులకు, సాధువులకు నన్నమిడెదరో యంతవఱకు మాకును నన్న పానాదులకు కొఱత గలుగదు నేను దైవకార్యార్థమై వెళ్ళుచున్నాను ''

ఇట్లు,

**మీ భారతీదేవి**

మాఘశుక్ల త్రయోదశి

ఓమ్ తత్ సత్



ఈ యుత్తరమును పలుమారులు జదువు కొనుచు, కన్నుల కద్దుకొనుచు, భారతీదేవి తండ్రిగారి కందజేసిరి వారును శ్రీ సీతారామలక్ష్మణ వియోగముచే పరితపించెడు దశరధునివలె దుఃఖించుచు, నాయుత్తరమును పలుమారు చదువుచు, నడుగువారందఱికిని జూపించుచు, మహిళా సంఘమువారి యాశ్రమావరణ ద్వారము వఱకు వచ్చి, ''తల్లులారా! మీయందఱికిని వందనములు ఇప్పటికే నాల్గవ యామము ముగియుచున్నది నేటిదినమునుండి

మీరందఱుగాని లేక కొందఱుగాని యిచటనే యుండి గీతాపారాయణాదుల జరుపుచుండవలయునని నేను కోరుచున్నాను మీకు కావలసిన సహాయములన్నియు సమకూర్చెదను, మిమ్ములను మా బిడ్డలవలె జూడగలను'' ని చెప్పగా, మహిళామణులు కొందరు మాలో చాలామంది గృహస్థులము మామూలుగా పారాయణాదులకు వచ్చి గీతాపారాయణాదులను జేసెదమని చెప్పిరి కొందఱు వితంతువులును, కొందఱు రాజకన్యకలును ''మేమిచటనే యుండదలంచితిమి మాఖర్చుల నన్నిటిని మేమే నిర్వహించుకొనగలము ధనము లేని వారెవ్వరైన నుండినచో వారికి మాత్రము సహాయము జేసిన చాలును మీదయ మాత్రము గలిగియుండుట చాలున'' నియు చెప్పగా, రాజుగారు ''నా జీవితముండు వఱకు మీరేమియు విచారపడ నవసరము లేదు సహాయము కావలసిన దంతయు జేయుటకు సిద్ధముగా నున్నాను మీరిచటనే యుండి పారాయణ భజనాదుల జేయుచుండినచో భారతీదేవి లేని కొఱత మాకు గలుగ'' దనిరి

ఇట్లు చెప్పుచుండగనే వాయువేగమున భాతీదేవి ఆశ్రమములో లేని విషయము గ్రామమంతయు వ్యాపించెను అప్పుడు శ్రీసిద్ధార్థుడు రాజనగరు వీడి పోయినపు డాపట్టణ వాసులందఱును తండ్రియగు శుద్ధోదనుడు,తన ధర్మపత్నియు నెట్లు శోకసాగరమున మునిగి మూర్ఛితులై పడిపోయిరో, ఆవిధమున నా నగరవాసులును, భారతీదేవి మాతాపితరులును మోహపరవశులైరి మఱియు నయోధ్యాపురమునుండి శ్రీసీతారామలక్ష్మణులు వనవాసమునకు వెళ్ళిన దినమున రాజభవనములోనుండు వారును, పురజనులు నెట్లు భక్తి పరవశులై పోయిరో, ఆ దృశ్యము నీ దినమున మఱల కన్నులార గాంచుచున్నామని జనులు చెప్పుకొన దొడగిరి మఱియు పాండవులైదుగురును, ద్రౌపదియు వనమునకు వెళ్ళిన సమయమున కరినగరమున నేవిధముగ జనులు తపించుచుండిరో,తరువాత నట్టి భక్తి పరవశమగు పుణ్యదినమును నేటికి జూడగలిగితిమని లోకులు వచించుచుండిరి ఇట్లుండగా భారతి తల్లిగారు భరింపరాని దుఃఖము గలవారై, ఈ విధమున విలపించిరి ''అయ్యో! సంధ్యాసమ

ముము సమీపించినదే! నాబిడ్డలు ఈ దిన మెచ్చట భోజనము జేసిరో? ఎవరు పెట్టిరో? ఎచట నున్నారో? దైవమా! నీవే రక్షకుడవు ఆకలి గలిగి వచ్చినవారి ముఖము జూడ జాలక, వారికన్నమిడిన తర్వాత నేను భోజనము జేయునది సత్యమైనచో మా బిడ్డల కాకలి సమయమున అన్నము దొరకుగాక! యతులు, బ్రహ్మచారులు మొదలైన వారికి అన్నభిక్ష మిడిన తర్వాత నేను భుజించునది సత్యమైనచో మా బిడ్డలకు కొఱత లేక యన్నముదొరకు గాక! అతిధులకు నభ్యాగతులకు అన్నము పెట్టిన తరువాత నేను భుజించునది నిజమైనచో నా బిడ్డలకు సకాలమునకన్నము దొరకునుగాత! దాహముతో వచ్చినవారికి చలివేంద్రము పెట్టించి, మంచినీరుగాని, మజ్జిగగాని ప్రేమతో నేనిప్పించునది సత్యమైనచో మా బిడ్డల కెచటను నేకొఱతయు గలుగకుండును గాక! నేను ఎన్ని పనులుండినను దైవారాధన ధ్యానాదుల జేసిన తర్వాతనే భోజనము జేయునది సత్యమైనచో, లోకములో నా బిడ్డలకన్నము దొరకును గాత! దేవాలయములో నైవేద్యమైనది దెలిసికొన్న తర్వాత నేను భుజించు నది సత్యమైనచో, అన్ని దేవాలయములలోను, అన్నసత్రములలోను మా బిడ్డల కన్నము దొరకునుగాక! దేవాలయము నిర్మించి దైవపూజ చేసి, సాధువులకును, బ్రాహ్మణులకును భోజనము పెట్టిన రీతిగని ఇహదైవమగు నాపతికి భోజనముపెట్టిన తరువాతనే నేను భుజించునది నిజమైనచో నా బిడ్డలకెచ్చటను కొఱత గలుగక యన్నము లభించునుగాక! తల్లి లేనట్టియు, తల్లియుండియు పాలు లేనట్టి చంటి బిడ్డలకు నా యీ స్వహస్తముతో పాలు పోయునది సత్యమైనచో మా బిడ్డల కేమియు కొఱత గలుగకుండుగాక! అనాధులగు రోగుల కౌషధమునకును, అన్నమునకును వైద్యశాల నిర్మించి ప్రేమతో మా భర్తగా రాదరించుచున్నది సత్యమైనచో నెచటను మా బిడ్డల కేవిధమగు బాధలును గలుగకుండు గాక! అనాధులగు బ్రహ్మచారులకు సంస్కృతపాఠశాలను నిర్మించి, తగిన పండితుల నేర్పరచి నా పతి నిర్వహించుచున్నది సత్యమైనచో నా బిడ్డలకు బ్రహ్మవిద్యాప్రకాశమునకెట్టి యావరణయు గలుగ కుండుగాక! దంపతులమగు మేము సద్గురు సేవ జేసి వేదాంతవిచారణ జేయునది నిజమైనచో మా బిడ్డలకును తగిన మునీంద్రులు దొరకి త్వరలో సందేహనివృత్తి గలిగి మా దగ్గఱకు వచ్చి

చేరుదురుగాక! నేను పతివ్రతా ధర్మము నాచరింమనది సత్యమగువో నా బిడ్డల కేకాలమునగూడ బ్రహ్మచర్యవ్రత భంగము గలుగక పోవునుగాక! నేనన్యభావముతో నితరపురుషుల జూడనిది దైవసాక్షిగా సత్యమైనచో నా బిడ్డల ముఖారవిందమును గూడ నేపురుషుడును దుష్టభావముతో జూడకుండును గాత! నేను గృహస్థాశ్రమములో నుండి గృహస్థబ్రహ్మచర్యమును దైవసాక్షిగా నాచరించునది సత్య మైనచో నా బిడ్డలకును మనోవాక్కాయ కర్మలలో బ్రహ్మచర్యవ్రతము చెడ కుండును గాక!''

అని ధర్మదేవత నుద్దేశించి ప్రతిజ్ఞావాక్యములను వచించిరి మఱియు దుఃఖము నాపుకొనజాలక మార్కండేయుని తల్లియగు మరుద్వతీదేవి పుత్రుని యల్పాయుస్సును విని దుఃఖించినట్లు, రామేశ్వరమ్మగారును శోకాకుల హృదయముతో రోదనము జేయ దొడంగిరి ''అయ్యో! నేను ఏబిడ్డల జూచి యోర్వజాలక పోతినో గదా! లేనిచో నాకేల నీపుత్రికా శోకము గలుగవలయును ఓ దైవమా! నేనే జన్మమున సవతిబిడ్డలను తండ్రిదగ్గరకు జేరనీయక, నా బిడ్డలను దగ్గఱకు జేర్చి ప్రేమించి సవతి బిడ్డలకు దుఃఖము గలుగ జేసితినో గదా! లేనిచో నీలాటి క్లేశ మేల గలుగ వలయును? నేను దూడలను సరిగాపాలు ద్రావనీయక పాలనన్నిటిని పిండించి గోవును, దూడను దుఃఖపెట్టితినా యేమి? నేనెవరి బిడ్డకైన సంబంధముకొఱకు వచ్చినవారికి లేని దోషము జెప్పి వివాహము జేయనీయక జేసిన క్రూరురాలనైతినా యేమి? లేనిచో నాబిడ్డ యొక్క కల్యాణముజూడ భాగ్యము లేక పోవునా? నేనెవరేని పుణ్యదంపతుల భర్తతో భార్యయందు నిష్కారణముగ దోషమును నిర్మించి చెప్పి భార్యాభర్తలను వేఱుపఱచిన పాపాత్మురాలనైతినో, అట్టైన ఆ పతివ్రత యెంత క్లేశము నొందెనో గదా? అట్లుగానిచో నాకేల యీ పుత్రికా శోకము గలుగ వల యును? నాభర్త గృహమున అధిపతియై యుండగా భర్తకు శయన మంత్రము నుపదేశించి మరదుల భార్యల కేమియు నివ్వనీయక గృహచ్ఛిద్రము నొనర్చితినా యేమి? లేనిచో నీ మహాదుఃఖ మేల నన్ను బాధించును?'' అని యిట్లు పలుతెరగుల దుఃఖించుచు కడుపుమంట యధికమగుటచే నింటి వేల్పులను గూడ దూలనాడ నారంభించిరి

''కులదైవమని తలంచి యనన్యభక్తితో కొలుచుచుండు శ్రీరాముడెట్టి గతి కలుగ జేసెను? సీతను వనమునకు గొని పోయి తాపస వేషమును వేయించి చూచుట తన కిష్టమైనట్లు నాబిడ్డగూడ నిర్మలభక్తి గలిగి తనను కొలుచుచుండినందుచే నట్టి తాపసవేష మును ధరింపజేసెను కాబోలు! ఇట్టి దేవతలను సేవించువారి కిట్టి గతియే గలుగునని యిపుడు ప్రత్యక్షమైనది వనములో ననేక ఋషిపుంగవు లర్ఘ్యపాద్యములిచ్చి పూజించుటకు వ్రతము బూనియుండగా, కిరాతకుల స్త్రీయగు శబరి యాశ్రమమునకు ముందుగవెళ్ళి యచట నావెంయొక్క యెంగిలి పండ్లను భుజించి రామచంద్రుడు సంతుష్టుడాయెను తపస్వినులగు స్త్రీలపై యింతమోహమా? మఱియు నతనియొక్క సహవాస మరణ్యములో నుండు సాధువులతోను, గుడిసె వేసికొని కౌపీన ధారులైయుండు మునులతోను గలసియుండునేగాని, సౌధాంత రాళములందు రాజులతో గూడియుండెనా?

అలాగుననే కృష్ణుడనువా డొకడు గొప్ప దేవుడై యుండెను అతని చరిత్ర గూడ నీలాగుననే యుంటున్నది పాండవులకును పాంచాల భూపాలుని పుత్రికకును రహస్యోపదేశముజేసి తాపసవేషము వేయించి యరణ్యమునకు బంపి వేసెను ఆలాగున నా బిడ్డను గూడ తపస్వినిగా జేసి యడవి పాలు చేసెను ఇతనికి తపోధనులగు మహర్షులే స్నేహితులు లేనిచో నింద్రప్రస్థమున దుర్యోధన మహారాజుగారు భోజనమునకు నిమంత్రణ జేసియుండు సమయమున శూద్రజాతిలో బుట్టి పరమదరిద్రుడగు విదురుని గుడిసెకు వెళ్ళి వారిచ్చిన యాకునో, యలమునో భుజించి తృప్తుడై యేల వచ్చెను? ఇది దుర్యోధనుని, రారాజుల నవమానపఱచుట గాదా, మఱియు ద్వారకాపురిలో కృష్ణుని దర్శించుటకును, రాజకీయ కార్యముల మాట్లాడుటకును, గోపురద్వారమున నెన్నియో రోజుల నుండికనిపెట్టుకొని యెన్నియో కానుకల తెచ్చినటువంటి యెందరో రాజులుండగా కడు బీద బ్రాహ్మణుడును, కట్టుకొనుటకు బట్టగూడ లేనివాడును నగు కుచేలుడు గోపురద్వారమునవచ్చియున్నాడని వినిన వెంటనే లక్ష్మీదేవియు తానును లేచి యర్ఘ్యపాద్యముల దీసికొని పరుగెత్తివచ్చి యాబాపని

పూజించెను స్వయముగా చేతులతో కుచేలుని ఆలింగనము జేసికొనెను మరియు రెండు చేతులను బట్టుకొని లోపలికి తీసికొని వెళ్ళి సాక్షాత్తుతాను కూర్చుండు ఆసనముపై కూర్చుండబెట్టి సగము రాగులును, సగము వడ్లును గల కుచేలుని యటుకులను స్వయముగా తీసికొని తినెను ఇతడును చూడగా రాజాధి రాజులను రాజపూజితులగు మహా రాజులను గూడ నవమానించుటయు, నేమియు లేక గుడిసెలో నివసించి యుండు మునీంద్రుల నాదరించుటయు స్వభావము గలవాడు ఇతనియొక్క మిక్కిలి స్నేహితు లెవరు? యాదవులలో బుట్టిన ఉద్ధవుడు తన పెద్దభక్తుడు, శూద్రులలో జన్మించిన విదురుడు రెండవవాడు ఒక రాజైన నితనికి స్నేహితుడు గలడా? ఇట్టి దేవతల నారాధించువారి కిట్టి గతియే గలుగునని వేఱుగ జెప్పనేల? మన భారతియే సాక్షి రెండవది మీరాబాయి

ఇక నవతారమూర్తుల నందరిని జూడుడు వామనావతారములో, బ్రహ్మచారి వేషముతో నింటింటికి బిచ్చమెత్తుట బ్రహ్మచారి ధర్మమట మరియొకడు పరశురాముడు వీడు పుట్టినప్పటినుండి బ్రహ్మచర్యమును బూని యడవికేగి తపస్సు చేయుచుండెనట పూర్ణావతారము బుద్ధుడు ఇతడు తల్లిదండ్రులను శోక సాగర ములో ముంచి యర్ధరాత్రిలో రాజగృహము వదలి,శోభాయమానములగు రాజ చిహ్నములను భిక్షుకునకిచ్చి యా బీదవానియొక్క శిధిల వస్త్రములను దీసికొని ధరించి యడవిపాలై బిచ్చమెత్తి జీవించుచుండెను ఈ దేవతల నందరిని మిక్కిలి భక్తితో భజించుచున్న మన భారతికిగూడ నదేగతి బట్టెను అయ్యో! భగవత్స్వరూపు లారా! నా కులదైవతములారా! శ్రీరామచంద్రమూర్తీ! నాకడుపుమంటను తాళజాల క మిమ్ములనేదేదియో తూలనాడితిని నా దుఃఖము పట్టజాలక దేహము దెలియక నేమేమి చెప్పితినో నాకు గూడ జ్ఞాపకము లేదు కారుణ్యమూర్తులారా! మీ కరుణను నాలుగు వేదములు గూడ వర్ణింపజాలక పోయినవి సహస్రశిరస్సులును, రెండువేల నాలుకలును గల యాదిశేషుడు గూడ మీ కారుణ్యమును వర్ణింపజాలకున్నాడు మీకు భక్తులపై గల కరుణయేమని వర్ణింపగలను, రజోగుణ,

తమోగుణస్థులు, శుద్ధ సత్త్వమగు మిమ్ములను (ఆత్మను) జేరజాలరను తత్త్వమును కుచేలముని వృత్తాంతముచే దెలిపినారు జాతిగాని, పురుషుడుగాని, విద్యగాని, మోక్షమునకు ముఖ్యము గాదను రహస్యము శబరిగాధవల్ల వెల్లడి చేసినారు బ్రహ్మచర్య వ్రతమును జీవిత ప్రాధమికదశనుండి చక్కగాననుష్ఠించు చుండవల యునని వామనావతారముచే దెలిపినారు తపోమహిమ లేనిచో లోకమును జయింపజాల మనెడు సూక్ష్మరహస్యమును పరశురామావతారముచేత వెల్లడి చేసినారు గృహస్థ దంపతులు సైతము కొంతకాలము తపమొనర్చిన మాత్రమున మోహ సాగరము దాటుటకును, క్రోధాదిరాక్షసులను జయించుటకును సాధ్యమగునని శ్రీరామావతారమున సముద్రతరణ, రాక్షసనిగ్రహములచే వెల్లడి చేసినారు భగవంతునకు భక్తిగలవారే గొప్పవారని ఉద్ధవ, విదురాదులవల్ల తెలిపినారు సన్న్యాసము లేనిచో నిస్సంకల్పము గలిగి మోక్షము సిద్ధింపదని బుద్ధావతారముచే నుపదేశించినారు కట్టకడకు ప్రతివారును నంత్య కాలము వచ్చుటకు ముందుగ సర్వసంగ పరిత్యాగులై, పుణ్యాశ్రమములో, పుణ్య తీర్థములో, పుణ్యవనములో నివసించి పరబ్రహ్మధ్యానము జేయవలయునని పాండవులయొక్క మహాప్రస్థాన యాత్రవల్ల లోకమునకుపదేశించినారు తపస్సును బ్రహ్మజ్ఞానమును పురుషులకు మాత్రమే కాదనియు, స్త్రీలకును గూడ నధికారము గలదనియు శ్రీ సీతాదేవి, శ్రీమతి పాంచాలిమొదలగువారి వనవాసమువల్లను, మహాప్రస్థాన యాత్రవల్లను లోకమున కెఱింగించినారు అంధకారము ప్రకాశము దగ్గఱకు రాజాలనట్లు అజ్ఞానము జ్ఞానజ్యోతి దగ్గరకు జేరజాలదనెడి పరమతత్త్వమును సాధువులు, మహర్షులు వీరలలోగల ప్రేమవల్ల ప్రపంచమునకు చాటినారు మహానుభావులారా! జీవులు తరింపవలసిన మార్గములన్నిటిని మీరాచరించి చూపితిరి మాంస చక్షుస్సుగలవారు, మాయామోహములో నుండువారు మీయొక్క పరమ రహస్యము నెట్లు తెలిసికొన గలరు? ఈ తత్త్వము గీతలోనే దెలిపియున్నారు

*న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।*
*దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥*

దీని యర్థముపై జెప్పినదే మనోవేదనను సహింపజాలక నే నేమియో చెప్పి యుందును శరణు శరణు, రక్షింపుడు రక్షింపుడు, క్షమింపుడు క్షమింపుడు, పలు మారు క్షమింపుడు, నా బిడ్డలను కాపాడుడు ఆడదాన్నైనందుచే మనోనిగ్రహము చాలక నీలాగున ఒడలు తెలియక వాగితిని దానినంతయు భగవత్స్వరూపులగు మీరు దప్ప మరెవరు క్షమింపగలరు! వెండియు శ్రీరత్నమాంబగారి తల్లిదండ్రులతో నేనేమి చెప్పగలను! వారును గొప్ప రాజకుటుంబములో బుట్టినవారు పసివారు మీ బిడ్డతో జేరినందుచే మా బిడ్డ యేమైనదోయని వారు నన్నడిగినచో నేనేమి చెప్ప గలన'' ని అనుకొనుచు నేడ్చుట జూచి యామెను అనేక మహిళామణులు శాంతి వాక్యములను జెప్పికొంతవఱకు శాంతి నొందించిరి

ఇంతలో సూర్యుడు ఆ నారీమణుల శోకమును జూడజాలకనో యన్నట్లు పశ్చిమాంబుధి మున్గుచుండగా (అస్తమించుచుండగా) నందఱును వారివారి గృహములకు వెళ్ళిరి

తండ్రియగు నరేంద్రునికి రాత్రియంతయు తల్లియొక్క దుఃఖమును జూచుచు భారతీదేవిని వెదకుటకు జనులను బంపవలయునను విచారముచే నెట్లో గడచెను కడకు పుత్రికా వియోగవేదనను సహింపజాలక నరేంద్రరాజుగారు వెదుక బంపిన వారికి వారు గనబడరని దెలిసియు, ప్రాతఃకాలమైన వెంటనే కొందఱి నుత్తరముగాను, కొందరిని తూర్పుదిశగాను, మరికొందరిని దక్షిణముగాను, నన్వేషించుటకు బంపిరి ఏలననగా! హిమాలయ ప్రాంతములందుండు ఋషులను జూడవలయునని భారతీదేవి యిదివఱలో జెప్పుచుండుట చేతను, శ్రీకాశీ పుణ్యక్షేత్రమునకు వెళ్ళవలసియుండిన యుత్తరమే వెళ్ళియుందురు లేక తూర్పు సముద్రమునుండియే పాండవులు భూప్రదక్షిణమునకై వెళ్ళియుండిరి అదేరీతిగా వెళ్ళియుండవచ్చునని యునట్లు చేయడమైనది లేక శ్రీ రామేశ్వరదర్శనము జేసి భారతభూమికి ప్రదక్షిణముగా వెళ్ళియుండవచ్చునని దలంచి దక్షిణమునకు జనులను బంపు కారణమైనది దైవ మాయా ప్రభావముచే పశ్చిమమునకు వెళ్ళిన సంగతి జ్ఞాపకమునకు

రాకపోయెను గౌతమబుద్ధుడు రాజగృహము విడిచి పోయిన ప్రాతఃకాలమున తనతల్లిదండ్రులు లేవిధముగ నన్వేషించుట కొఱకు జనులను పంపిన, వారలలో కొందరొక రోజునకును, మఱికొందఱు రెండురోజులలోను, ఇక కొందరు మూడు రోజులకును, సిద్ధార్థరాకొమారుని గాంచక దుఃఖాకుల హృదయములతో తిరిగి వచ్చిరో, యాలాగుననే వీరును కొందఱదే దినమునకును, మఱికొందఱు రెండవరోజునకును, ఇంక కొందఱు మూడవ రోజునకును ననేకస్థలము లను, మార్గములను, గ్రామములను పట్టణములను, పుణ్యక్షేత్రములను, పుణ్యాశ్రమ ములను, పుణ్యతీర్థములను వెదకియు, ననేకుల నడిగియు కనుపించ నందుచేతను నేజాడయు దెలియనందుచేతను, మనోవేదనతో రోదనము జేయుచు తిరిగివచ్చి నరేంద్రునితో నా విషయము దెలిపిరి

ఇచ్చట నీలాగున నుండగా భారతిగారు తపోవనములో నుండునపుడే లాగున మహిళామణులు గీతాపారాయణ, భజనలు, వ్రతములు, జరుపుచుందురో ఆలాగున జరుపుచు వచ్చిరి ఈలాగున కొంతకాలము జరిగిన పిమ్మట శ్రీ బుద్ధ దేవుని జననీజనకు లేవిధముగ తీర్థయాత్రికులగు సాధువులతోను, బైరాగులతోను, సన్న్యాసులతోను "బుద్ధుని మీ రెవరైన ఎచటనైన కనియున్నారా" యని యడుగు చుండిరో, ఆలాగున భారతీదేవి మాతాపితరులును కాశీ రామేశ్వర యాత్రాపరులగు సన్న్యాసులతోను, సాధు వులతోను మీ రెవరైననెచ్చటనైన మా భారతీదేవిని జూచితిరా యని వినయముతో నడుగుచుండిరి, తల్లిగారు మహాఘోషాపద్ధతి గలిగియుండిన వారైనను సాధువుల నెవరినైన జూచిన దగ్గఱకు పిలచి వారితో కొమరితె యొక్క స్వభావమును గురించి చెప్పుచుండెడివారు, పొడవుగైన బక్క శరీరమును, బంగారు ఛాయము గలిగియుండును లలాటమందు విభూతిని ధరించి, మధ్యభాగమున కుంకుమ రేఖ గలిగియుండును నార వస్త్రముల ధరించియుండును వెంట్రుకలు పొడవుగా నుండును అగ్రభాగము మాత్రము ముడివేసి వెనుకకు వేసియుండును జనమధ్యములో నుండరు ఎల్లపుడు నేకాంతములో నివసింతురు మృదువైన భాషతో మాటలాడుదురు పురుషులధిష్ఠించి యుండెడు స్థలమున నుండరు స్త్రీలైనను వైరాగ్యము, భక్తి, దైవజ్ఞానము గలవారితో మాత్ర మత్యవసరముగ

నుండినచో భాషించుదురు యౌవనారంభకాలము గలిగియుండి వికసించిన తామరపుష్పము వలె మనోహరమైన ముఖమును, నిర్మలమైన నేత్రములను గలిగియుందురు శాంతియు, కరుణయు, భక్తియు ముఖమునుండి ప్రవహించుచున్నట్లు గనుపించును ఎట్టి క్రూరులకైనను మా భారతిని గాంచిన జాలి గలుగక పోదు ఇట్టివారిని మీ రెవటనైన జూచియున్నారా? మఱియు భారతీదేవి యని పేరుగలిగియుందురు బాలవితంతువు శ్రీ రత్నమాంబయను వనితామణియు వారితో గూడ నుండును జాతిలో క్షత్రియులు'' లని కన్నీరు గార్చుచు నడుగుచుండిరి ఆ సాధువులకు కావలసిన యన్నవస్త్రముల నడిగి పెట్టుచుండిరి సాధువుల జూచిన తన ఘోషా పద్ధతిని మరచి పోవుదురు అంతేగాక ప్రశ్నలను జెప్పువారిని, జ్యోతిషము దెలిసిన వారినిగూడ నడుగుటకు మనుజుల బంపి విచారించుచుండిరి

వారందఱును భారతీదేవియు రత్నమాంబగారును జీవించి యున్నారనియు, మహర్షుల దగ్గఱ బ్రహ్మ విచారమును, తపస్సును, యోగనిష్ఠయు గలిగియున్నారనియు జెప్పుచుండిరి ఈ విషయమును భారతీదేవి వెళ్ళి పోయినప్పటినుండి బహుకాలమువఱకు తల్లి యెల్లరిని యడుగుచునేయుండిరి మఱియు నెప్పుడు తిరిగివచ్చెదరని యడుగగా, నా జ్యోతిష్కులు ''ఆ విషయమును మేము చెప్పజాలము, రావలయునని మనస్సు రత్నమాంబగారికి కలదు కాని భారతీదేవిగారి కేసంకల్పములును లేవు హృదయ మెప్పుడును బ్రహ్మభావనతో నిండియుంటున్నది ఏలాటి దుఃఖమనునది లేదు నిరతిశయానంద సుఖము గలవారై యున్నార''ని చెప్పుచుండిరి మఱియు ''సామాన్య మనుజులై యుండినచో సంకల్పము లుండును వీరి కేలాటి సంకల్ప ములు లేనందుచే మఱల తిరిగి వచ్చు సంగతిని మాజ్యోతిశ్శాస్త్రములు చెప్పజాలవు ఏలన! వేదశాస్త్రముల కతీతమగు బ్రహ్మభావములో నుండువారి స్థితిని వేద శాస్త్రము లెట్లు దెలిసికొనగలవు? మా మాటలు తప్పిపోయినచో మఱల మా వద్ద కెవరును రానేరారు అంతేగాక మా శాస్త్రమునకు భ్రష్టత్వము గలుగును మేము స్పష్టముగ దెలియనిదానిని జెప్పము ఉన్నదున్నట్లు మాత్రము

జెప్పగలము అంతేగాదు రామచంద్ర నరేంద్రగారు మాకు బాగుగా దలియును ఏద్వైన తప్పు పలికినచో మఱల మేమీ దేశములో నుండజాలము కావున అసత్యమును మేము చెప్పజాలమ'' ని వచ్చి యడుగు వారందఱితోను చెప్పి పంపుచుండిరి

ఇది యిట్లుండగా సత్రములో పై భాగమున ధ్యానమును జేయుచుండిన భారతీదేవి రాత్రి మొదటి యామాంతమున నిష్ఠనుండి లేచునప్పటికి తగిన వారిచే నన్నము, నాలుగు కూరలు, క్షీరాన్నముతో సత్రమువారు వంటలు చేయించిరి అన్నమును, నొక కూరయును మాత్రము వడ్డించిన చాలునని భారతీదేవి సంజ్ఞ జూపగా రెడ్డియమ్మగారు దగ్గఱయుండి అయ్యో! మీ యాకారమే గొప్పవంశములో జన్మించిన వారుగా దెలుపుచున్నది మీ కొకకూరమాత్ర మెట్లు పెట్టగలము' అనిరి అప్పుడు భారతీదేవి ''యమ్మా! మేమనాలాగున చాల కాలమునుండి యభ్యసించియున్నాము అంతేగాక దాని నొక నియమముగా జేసికొనియున్నాము'' అన్నపుడు అట్లైనచో క్షీరాన్నమునైనను వడ్డించుకొనుడని ప్రార్థింపగా నంగీకరించినారు అప్పుడు రెడ్డియమ్మగారు ''అమ్మా! మిమ్ముల నే తల్లిగారు కన్నారో! వారి గర్భ మెంత పుణ్యవంతమైనదో! ఈ సత్రము కట్టిన తర్వాత నిట్టి వారిని మేము చూచియుండ లేదు సత్రము నిర్మించిన దానియొక్క ఫలితము నీ దినము పొందినాము మా జన్మ నేటికి ధన్యమైనది మారెడ్డిగా రీ సత్రమునిర్మించుటలో చాల శ్రమ పడియున్నారు వారు స్వర్గలోకము నలంకరించిరి వారును నిప్పటికి మీ బోటివారిచట యాతిథ్యమును స్వీకరించినందుచే ధన్యజీవితము గలవారైరని చెప్పి భోజనస్థలమునుండి బయటకు వచ్చి వేసిరి

భోజనమగు సరికి సత్రములోనెవరో గొప్ప మహాత్మురాలు వచ్చియున్నారని విని వారిని దర్శింప ఆరాత్రియనేకమంది నారీమణు లచటికి వచ్చి చేరిరి అత్తరి రెడ్డియమ్మగారు భారతీదేవిగారి నుద్దేశించి యిట్లు పలికిరి ''తల్లులారా! మీరిద్దరును గొప్ప వైరాగ్యమును, తపస్సును గలిగినవారినిగా మీ శరీర ప్రకృతియే చెప్పుచున్నది

ఆకారసదృశ ప్రజ్ఞః ప్రజ్ఞయా సదృశాగమః ।
ఆగమై స్సదృశారంభః ఆరంభ సదృశోదయః ॥

అని కాళిదాస మహాకవి వర్ణించినట్లు ' శరీరాకారమునకు తగిన ప్రజ్ఞయు, ప్రజ్ఞకుదగిన శాస్త్రజ్ఞానమును, శాస్త్రజ్ఞానమునకు దగినటువంటి ప్రవృత్తియును, ఆ ప్రవృత్తికనుగుణమగు ననుభవజ్ఞానమును గలిగియుండును' అను భావము మిమ్ములను జూడగా స్పష్టమగుచున్నది

రాత్రి ప్రొద్దధికమైనది ఎక్కువచెప్పి కాల విలంబనము జేయ తలంచ లేదు మీ వృత్తాంతమును మీరు చెప్పకపోయినను, జ్ఞానమువల్ల మీ రెక్కువవారైనను వయస్సున నేనధికమైనదాన నగుటచే మా బిడ్డలవలెనే మిమ్ములను తలంచుచున్నాము మాతృవాక్యములవలె నా వాక్యముల విని నా యభీష్టము పూర్తి జేయవలెను లదేమన ఈ సత్రమును పాలించుట కిదివఱలో నెవరును సాధువులు దొరకలేదు దీనికి మంచి వరి పండెడు 100 ఎకరముల భూమియు, 50000 రూప్యములును గలవు ఇచ్చట విశాల ఫలవృక్షములు గలతోటయు, నీ జలాశయమును గలవు ఇది యొక కమిటీచే పాలింప బడులాగున చేయించడమైనది మేమొకగృహస్థులము మీ బోటి తపస్వినులుండిన మాబోటి యబలలముగూడ బాగుపడగలము ఇట కేతెంచెడు సాధువులను గూడ చక్కగ జూడగలరు కావున రేపుదయమున వీటి నన్నిటిని మీ స్వాధీనము జేసెదము సర్వాధికారము మీ కే చెందజేసెదము అట్లు కానిచో స్వాతంత్ర్యములేదని తలంచెదరేమో! స్వాతంత్ర్యములేని స్థలములో నుత్తమ సాధువు లుండరని మాకు దెలియును

స్వాతంత్ర్యా త్సుఖమాప్నోతి స్వాతంత్ర్యాల్లభతే పరమ్ ।
స్వాతంత్ర్యాన్నిర్వృతిం గచ్ఛే త్స్వాతంత్ర్యాత్పరమం పదమ్ ॥

శాస్త్రమిట్లు వచించుచున్నది గదా''! యనిరి

ఈ మాటలవిని భారతీదేవి వీరితో నింక నెక్కువగా మాట్లాడినచో నిదియొక బంధనము గలుగునని నిశ్చయించి మౌనముగా నుండిరి దాని చూచి

రేపు మాట్లాడ వచ్చు ననుకొని యుందురని తలంచి యందఱును వారి వారి గృహములకు వెళ్ళిరి భారతీదేవియు, రత్నమాంబగారును పరుండిరి నాల్గవ యామారంభమున వెంటనే లేచి భారతీదేవి రత్నమాంబగారితో నిట్లుచెప్పిరి ''ఇకమీద మనము దినమున కిరువది మైళ్ళు నడచిన చాలును నిన్నటిరీతిగ తొందరగా నడవ నక్కఱ లేదు నింపాదిగ యాత్ర జేయుచు నెచ్చటెచ్చట క్షేత్రములు, తీర్థములు ఆశ్రమములు గలవో వాటి నన్నిటిని దర్శించుకొని వెళ్ళిన చాలును మన యుద్దేశముగూడ తీర్థయాత్ర కాదు గదా? ప్రపంచ స్థితిగతులె ట్లుండును? ఏయే సాధువు లెట్లున్నారు? వారి యాచరణ యెట్లున్నదని గ్రహించుట గదా! యాత్రయొక్క ప్రయోజనము అయితే సూర్యోదయమునకు ముందుగా నీ స్థలమును విడిచి పెట్టవలయు''నని చెప్పి స్నానము జేసి కొంతసేపు ధ్యానము జేసికొని ప్రయాణమై వెళ్ళిరి

ఆలాగున నెమ్మదిగ నడచుచు గ్రామములను, జనులను, పొలములను జూచుచు పోయి పోయి 15 మైళ్ళు వెళ్ళగా నచట నొకసత్రము కాన్పింపగా నందుజేరిరి అది వైశ్యులచే కట్టింపబడినది అచటగూడ యాత్రికులందఱికిని భోజన ముచితముగ బెట్టుచుందురు సత్రపు మేనేజరు భారతీదేవిగారిని కొంతసేపు చంద్రోదయమును జూచు చకోరమువలె దృష్టి చలింపక చూచి వారి సమీపమునకు వచ్చి చాల వినయముతో మీ రెచ్చట నుండి వచ్చుచున్నారని యడుగగా నేమియు ప్రత్యుత్తరము జెప్పనందుచే వీరు గొప్ప కుటుంబములోనుండు స్త్రీలైనందుచే పురుషులతో మాట్లాడకున్నారని గ్రహించి, సత్రము గట్టించిన యజమానుని ధర్మపత్నిగారి దగ్గఱకు మనుజులను 'వెంటనే రావలయును' ని చెప్పి పంపిరి ఈ వాక్యముల విని యామె సత్రములోనికివచ్చి మేనేజరుగారి నేమియని యడుగగా ''నేడు మీ పుణ్యమువలన నీ సత్రమున కిద్దరు తపస్వినులు వచ్చియున్నారు నేను జన్మ మెత్తినది మొదలిట్టి దివ్యదేహముగల వారిని జూచియుండ లేదు వారిని పలుకరించితిని వారేమియు పలుక లేదు అదిగో! ఆ రావిచెట్టు క్రింద కూర్చొనియున్నారు కావున మీరే విచారింపవలయునని చెప్పగా నామె వెళ్ళి భారతీదేవి రత్నమాంబగార్లను కుశలప్రశ్నల నొనర్చి శుద్ధమగునొక గదిలోనికి

తీసికొని వెళ్ళి భోజనాదులను పెట్టించిన తర్వాత ''నో యమ్మలారా! ఎప్పటికి వెళ్ళుచున్నారు? మిమ్ములను జూచిన నా మనస్సు కరుగుచున్నది ఏ తల్లి కడుపులో ముత్యపు చిప్పలోపల మంచి ముత్యము పుట్టినట్లు మీరు పుట్టితిరి? మీకు తల్లి గలదా? ఉండినచో మిమ్ముల జూడక వారెట్లు జీవింతురని మీ పాదకమలముల జూడగా నెఱ్ఱదామరపూవులవలె నుంటున్నవే మీరు కఠినమగు కంకరరోడ్డులో నెట్లు నడువగలరు? మీరెంతవఱకు తీర్థయాత్ర జేయదలంచితిరో నంతవఱకు మా గుమాస్తాను మీతో గూడవచ్చి సమస్తకార్యములను జేయించే లాగున బంపెద ఒకవేళ పురుషులతోగూడ యాత్ర జేయుట యోగ్యము కాదని తలంచినచో మీకు యాత్ర కొఱ కెంత ధనము కావలెనో దాని నిపుడే యిచ్చెద అది ఖర్చైపోయినచో నుత్తర ములద్వారాగాని, తంతిమూలమునగాని తెలియ జేసినచో మఱల నెంతైనను పంపెదము ఉత్తమభూమిలో వ్యవసాయము జేయుట కెవరైన నాలసింతురా? గోత్రమెఱింగి పెండ్లిని, క్షేత్రమెఱింగి విత్తనములు, పాత్రనెఱింగి దానమును జేయవలయునని పెద్దలు చెప్పియున్నారు

*సుక్షేత్రే వాపయే ద్బీజం సుపాత్రే నిక్షి పేద్ధనమ్।*
*సుక్షేత్రే చ సుపాత్రే చ హ్యుప్తం తన్న వినశ్యతి॥*

సుక్షేత్రమునందు చల్లిన బీజము మంచి ఫలము నొసంగును సత్పాత్రమునందు సమర్పింపబడిన ధనము అధిక పుణ్యమును గలుగ జేయును సుక్షేత్రమునందు చల్లిన బీజము సత్పాత్రమునం దొసంగిన ధనము నెన్నటికిని నశింపదు ''

ఇట్లు వైశ్యభామిని యధికప్రేమతో జెప్పెడు వాక్యములను విని ''కన్నతల్లికన్న నధికముగా సాధువులను, అతిధులను ప్రేమించు ఓ యమ్మా! మే మపరిగ్రహ వ్రతమును బూని యున్నాము అట్లు చేయనందుచేతనే యనేకులు తీర్థయాత్రల జేసియు, శ్రీరామనామము జపించియు, యోగ జపాదుల నవలంబించియు ఫలితము నొందకపోవుచున్నారు మరియు పాదచారులమై యాత్రజేయ వలయునని నిశ్చయించుకున్నాము

*ప్రతిగ్రహ సమర్థోఽపి ప్రసంగం తత్ర వర్జయేత్ ।*
*ప్రతిగ్రహేణ హ్యాస్యాశు బ్రాహ్మం తేజః ప్రశామ్యతి ॥*

గాయత్రీ జప, అగ్నిహోత్ర, వేదాధ్యయనాదులచే ప్రతిగ్రహమునకు సమర్థుడైనను, ప్రతిగ్రహమందుగల ప్రవృత్తిని వీడవలయును ఏలననగా పరుల వస్తువును గ్రహించుట చేత బ్రహ్మ తేజస్సు త్వరలో నశించి పోవునని మను మహర్షులు వచించి యున్నారు అదేవిధముగ గీతయందు గూడ గలదు

*యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః ।*
*ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥*

ధ్యానమును చేయువా డేకాకిగాను, నియమింపబడిన యంతఃకరణము, దేహము గలవాడుగను, ఆశ లేనివాడుగను, అపరిగ్రహ వ్రతము గలవాడుగనునై యెల్లపుడును మనస్సు నాత్మయందైక్యపఱచి యుండవలయును మఱియు వివేకచూడామణియందు-

*వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే ।*
*తస్మిన్నేవార్థవంతః స్యుః ఫలవన్తః శమాదయః ॥*

ఏ పురుషునకు వైరాగ్యమును, ముముక్షుత్వమును తీవ్రమై ( దృఢకరమై) యుండునో, వానియందే శమాదులు సార్థకములై శీఘ్రఫలము నొసంగును

*యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః ।*
*నిరీహా చ నిరాశా చ నిత్యమేకాంతశీలతా ॥*

యోగి మోక్షముయొక్క మొదటి ద్వారము వాఙ్నిరోధము, అపరిగ్రహము, విషయదోష రాహిత్యము, ఏ వస్తువులందు నాశ లేకుండుట, యెల్లపుడు నేకాంత వాసము ఈ గుణములు గలిగియుండవలయును

*శరీరపోషణార్థీసన్ య ఆత్మానం దిదృక్షతి ।*
*గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి ॥*

ఏ పురుషుడు శరీరపోషణమాత్ర తత్పరుడై యాత్మసాక్షాత్కారమును గోరునో, వాడు మొసలిని తెప్ప కొయ్యగా పట్టుకొని నదిని దాటుటకు యత్నించు మూఢునివలె మోసపోవును

మరియు పాతంజలయోగశాస్త్రమందు ''అపరిగ్రహస్థైర్య జన్మకధంతా సంబోధః'' అనగా ఎల్లపుడును అపరిగ్రహమును అభ్యాసముచేయు దృఢమనస్కులకు జన్మాంతరములయందు తానే ప్రాణిగా నుండినదియు, ఏ పని జేసినదియు, ఏ ఫలము నొందినదియు నివి మొదలుగాగల విషయములు జ్ఞప్తికి వచ్చును అనగా పూర్వజన్మ జ్ఞానము గోచరించునని భావము బాహ్యవస్తు పరిత్యాగము మాత్రము చాలదు అనాత్మవృత్తి సంకల్పములుగూడ నశించవలయును కావున పూర్వీకులగు ఋషులెట్లు యాత్రజేసిరో అలాగున ఆచరింప దలచినాము పాదహరమే పాపహర మని పెద్దలు వచించిరి కావున మమ్ముల నీ విషయమై ఏమియు నిర్బంధింపవలదు ఈ పరిగ్రహ వర్జితవ్రతమును నభ్యసింపక పోవుట వలననే సాధువుల తపస్సును, యోగమును ఓటి కుండలో బోసిన జలమువలె నిష్ఫలమయ్యెను (ఇక వీరితో మాటలు పెట్టుకొనిన నిన్నటివలె ననేకులు చేరెదరని తలంచి) మేము ఎండలో నడచివచ్చితిమి కొంతతడవు విశ్రమింపవలయు''నని చెప్పగా నందఱు తరువాత రావచ్చునని చెప్పుకొనుచు వెళ్ళిరి భారతీదేవిగారును కొంత విశ్రాంతిని బొందిరి

ఆ జనులు వెళ్లినవెంటనే భారతీదేవి రత్నమాంబగారితో 'నిక మన మిచ్చట నుండ రాదు ఆయువతులు తప్పక వచ్చెదు' రని చెప్పి, యెండలోనే ప్రయాణమై వెళ్ళిరి దారిలో రత్నమాంబగారితో ''నిన్నను నేడును జరిగినది చూచితిరా? మన భారత దేశ మెంత పుణ్యభూమియో! దైవమునందును, దైవభక్తులందు నెంత విశ్వాసము? కన్నబిడ్డలకన్న నెక్కువ ప్రీతితో సన్న్యాసులను, అతిధులను జూచుచున్నారు ఇకమీదటను లోకములో నీలాగున జరుగవలసియుండినచో సాధువులందఱును మంచి బ్రహ్మనిష్ఠాపరులై యుండవలయును మంచి వ్రతనిష్ఠయు, శాస్త్రమునందు పరిచయమును నుండినచో నీ

విశ్వాసమాచంద్రార్కమము నిలుచును లేనిచో ఎండకాల మేతెంచుసరికి జలాశయము లింకునట్లు కొంత కాలమునకు జనులకుండు ఈ ధర్మబుద్ధి నశించును ఇప్పటికే చాలవఱకు ధర్మము నశించిపోయినది స్వభావ వైరాగ్యము గలవారు బయలుదేరనందుచే ధర్మచ్యుతి గలుగుటకు కారణమైనది'' అని ఇట్లు చెప్పుకొనుచూ ఆ రాత్రికి పదిమైళ్ళ దూరముననున్న నొక గ్రామము నందలి దేవాలయమును జేరిరి

భారతి ''సాధారణముగ నిరువదిమైళ్ళు ప్రయాణము నిశ్చయించినను స్థలము ననుసరించి యొకప్పుడు హెచ్చుతక్కువలు గలుగును మొత్తముపై దినమునకు 20 మైళ్లు చూచుకొనిన చాలును ముఖ్యములగు పుణ్యక్షేత్రములు, పుణ్యాశ్రమములు తటస్థించిన మూడురోజులచట నుండవచ్చును దానికన్న నధికముగా నెచ్చటనుగూడ నుండరా'' దని రత్నమాంబగారితో జెప్పి, యారాత్రి ఆ దేవాలయములో నుండునట్లు నిశ్చయించుకొనిరి అప్పటికి సంధ్యారాగము కూడ మాయమగుచుండెను భారతీదేవిగారిని జూచి, అర్చకుండగు విప్రుడు కారుమేఘమును జూచిన చాతకపక్షివలె నిశ్చేష్టుడై, కొంతసేపట్లే చూచి వారి సన్నిధిజేరి నమ్రభావముతో మీరెవరని యడిగెను అప్పుడు వారేమియు మాట్లాడనందుచే బ్రాహ్మణుడు తనలో తాను ''వీరెవరు వన దేవతలా? లేక ఈశ్వరుని గుఱించి తపస్సును జేసిన భవానియా! అట్లే యున్నారే!'' యని తలపోసి, సందేహము తీరక శిరస్సు,దేహమును, పాదములను జూచుచు వీరు మనుష్యులే, నేపాళదేశపు స్త్రీలవలె నున్నారు కాశీ రామేశ్వర తీర్థయాత్రకై బయలుదేరి యుండవచ్చును కాని మన యాడవారిని పిలుచుట మంచిది వారికి భక్తియు, వేదాంత విచారణయు, యోగసాధనగూడ దెలియును నేను కుటుంబపోషణ నిమిత్తము జీవిత మంతయు వినియోగ పఱచినను చాలకనే పోతున్న'' దని తనలో తానే యోచించు కొని పతివ్రతయు, సాధుసేవయందు ప్రీతి గలదియు నగు తన భార్యను పిలుచుటకు దగ్గఱ నుండు ఇంటికి వెళ్ళి సంభ్రమముతో నిట్లు చెప్పిరి ''సంధ్యాసమయమున దేవాలయమున కిద్దరు స్త్రీలు వచ్చియున్నారు వారు స్త్రీలా? లేక దేవతలా? అని సందేహము నాకింకను పోలేదు

లేక ఈవనములో నుండెడు వనదేవతలా? అట్లుగానిచో మన మారాధించెడు శ్రీభవానీ దేవతయా? అని సంశయమును గలుగుచున్నది నేను వారిని పలుకరించినను పలుకలేదు పార్వతీదేవి ఈశ్వరుని గుఱించి తప మొనర్చిన కాలమున నిట్లుండెనని మనకు చూపుటకొఱ కీలాగున యావిర్భవించెనా? అని తోచుచున్నది'' యనెను

దానిని వినిన వెంటనే ధర్మపత్ని దేవాలయమునకు వచ్చి వారి దగ్గఱకు వెళ్ళి నమస్కరించి మీ రెవరని యడుగగా 'మేము యాత్రాపరులము గోకర్ణక్షేత్ర దర్శనమునకై వెళ్ళుచున్నాము రాత్రి యీ దేవాలయములో నుండి ప్రాతఃకాలమున వెళ్ళవచ్చునని తలంచియున్నాము''ని భారతీదేవి చెప్పిన వచనముల వినినపు డర్చకునకు వీరు మనుష్యులని నమ్మకము గలిగెను పరమపతివ్రతయగు బ్రాహ్మణ స్త్రీకి మనస్సులో తొట్రుపాటు గలిగి, యిపుడు మీకేమి కావలయునని యడుగగా 'మాకేమియు నవసరము లేదు రాత్రి యిచటుండి వెళ్ళి పోయెదమ'నిరి అపుడు ''బ్రాహ్మణియట్లు గాదు మీరేమి భోజనమును జేయుదురు''ని యడుగగా భారతీదేవి '' మేమొకపూట మాత్రము భోజనము చేసెడి నియమము బెట్టుకొన్నాము అదియు మధ్యాహ్నమున జరిగెను'' అని అనగా నపుడు బ్రాహ్మణి- ''మేము గృహస్థులము మా యింటికి వచ్చిన యతిథులను సత్కరించుట మా ధర్మము కార్యార్థమై యతిథిగా వచ్చిన నచికేతు డుపవసించినందుచే మూడు వరముల నతనికి యమధర్మరాజు ప్రాయశ్చిత్తముగా నిచ్చెను ఈ కథ కఠోపనిషత్తులో వినియున్నాము ఎట్లన!

*ఆశాప్రతీక్షే సఙ్గతం సూనృతాం చేష్టాపూర్తే పుత్రపశూంశ్చ సర్వాన్ ।*
*ఏతద్వృఙ్క్తే పురుషస్యాల్ప మేధసో యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే॥*

అతిథి పూజ జేయక పోవుటచే వచ్చునట్టి ప్రత్యవాయ మేమనగా! ఎవనియింట నతిథి భోజనాదులు లేకయుండునో వానికిహపరలోకసాధనములుగా నుండెడు యజ్ఞారామ, తటాకాది నిర్మాణమువలన గలిగెడు పుణ్యఫలమంతయు నశించును

*వైశ్వానరః ప్రవిశత్యతిథి ర్బ్రాహ్మణో గృహాన్ ।*

*తస్యైతాం శాంతిం కుర్వన్తి హర వైవస్వతోదకమ్ ॥*

అగ్ని యతిథిరూపుడై గృహములను ప్రవేశించుచున్నాడు ఆ యతిథికి అర్ఘ్యపాద్యా సన భోజనాదులగు శాంతిని గృహస్థులు చేయుచున్నారు అని అతిథి యగు నచికేతుని జూపి యమధర్మరాజునకు వారి భార్య యీలాగున చెప్పెను అని నుడివెను మఱియు పరాశర మహర్షియు చెప్పినది చూడుడు

*అతిథిం తత్ర సంప్రాప్తం పూజయే త్స్వాగతాదినా।*
*అర్ఘ్యాసన ప్రదానేన పాద ప్రక్షాళనేన చ ॥*
*శ్రద్ధయా చాన్నదానేన ప్రియప్రశ్నోత్తరేణ చ।*
*గచ్ఛన్తం చానుయానేన ప్రీతిముత్పాదయే ద్గృహీ ॥*

గృహాశ్రమి యగువాడు తన యింటికి వచ్చిన యతిథిని స్వాగత వచన మడిగి కాలు సేతులు కడుగుకొనుటకు నుదకము నిచ్చి, కూర్చుండుట కాసన మొసంగి యాదరణ పూర్వకముగా నన్న పానీయములను తన శక్త్యనుసారమ మర్చి ప్రేమతో నత డడిగిన దానికి మక్కువతో బదులు జెప్పి యతడు తృప్తుడై ప్రయాణమయి పోవుచుండగా కొంతదూరమువఱకు సాగనంపి సంతోషపెట్టవలయును

*అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే।*
*పితరస్తస్య నశ్యన్తి దశ వర్షాణి పంచ చ ॥*
*కాష్ఠభారసహస్రేణ ఘృతకుంభశతేన చ।*
*అతిథిర్యస్య భగ్నాశస్తస్య హూమో నిరర్థకః ॥*

అన్నార్థియయిన యతిథి యెవని గృహమున కేగి గృహమునందు భోజనమును పొందకయే యచటనుండి మరలునో, ఆ గృహపతియొక్క పితరు లతడు తమ కొసంగిన దానిని పదునైదు సంవత్సరముల దనుక నారగింపరు తన యింటికి వచ్చిన యతిథికి ఆశాభంగ మొనర్చినవాడు వేలకొలది కావళ్ళపలాశాది సమిధలతోను, నూర్లకొలది ఘృత కుంభములతోను హోమము నొనర్చినను నెట్టి ఫలమును బొందడు

*యతిహస్తే జలం దద్యాద్భిక్షాం దత్వా పునర్జలమ్ ।*
*తద్భైక్షం మేరుణా తుల్యం తజ్జలం సాగరోపమమ్ ॥*

యతీశ్వరునకు ప్రథమమున హస్తోదకమిచ్చి భిక్ష పెట్టి మఱల హస్తమునందు జలమొసంగవలయును ఆ భిక్షాన్నము మేరు పర్వతముతో సమానమగును ఆ జలము సముద్రముతో సమానముగా పెరుగును మరియు శాస్త్రాంతరమునం దిట్లు గలదు

*అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే ।*
*స తస్మై దుష్కృతం దత్వా పుణ్యమాదాయ గచ్ఛతి ॥*

ఏ గృహస్థుని యింటినుండి యతిథి భగ్నాశుడై వెళ్ళునో, అట్టివాని దురితమును గృహస్థుడు దీసికొని, తన పుణ్యమును వానికిచ్చి పంపుచున్నాడు

అతిథి లక్షణము

*దూరాధ్వోపగతం శ్రాన్తం, వైశ్వదేవ ఉపస్థితమ్ ।*
*అతిథిం తం విజానీయా న్నాతిథిః పూర్వమాగతః ॥*

పగలు వైశ్వదేవాంతమున గ్రామాంతరమునుండి పాదచారియై దూరగ మనము వలన నలసి యాకొని వచ్చినవా డతిథి యనబడును పూర్వదివసమున నెపుడైన వచ్చియున్నవాడతిథి కాడు అతిథి యనగా, ఆతిథియందు వచ్చి ఆతిథియందే వెళ్ళువాడును, దానికి ముందే తిథి యందును రానివాడును నగును ఈ లక్షణము గలవాడే యతిథిగాని యపుడపుడు వచ్చెడువాడు గాని, లేకముందెపుడైన వచ్చి యుండెడువాడు గాని యతిథి కాడు

*నైకగ్రామీణ మతిథిం న గృహీత కదాచ న ।*
*అనిత్య మాగతో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే ॥*

తన గ్రామసమీపము నందుండువాడు భోజన సమయమునకు వచ్చినను వాడతిథి కాడు యాత్రికుడై, మజలీ దూరమునుండి భోజనసమయమునకు

నిరాధారుడై వచ్చిన వాడతిథి యనంబడును మఱియు గృహస్థుల కెక్కువ తపస్సు, యోగము చేయుటకు సమయము లేనప్పటికిని అతిథి సేవవల్లనే అవి యన్నియు చేకూరునని శాస్త్రము చెప్పుచున్నది కావున భోజన మక్కర లేకున్నను ఫలమూలములగాని, పాలు పెరుగులగాని మీబోటి తపస్వినులు గ్రహించదగును'' అని చెప్పెను అప్పుడు భారతి ''అమ్మా! ఈలాటి యేర్పాటు లుండినచో నొకరోజు దొరకవచ్చును మఱియొకరోజు దొరకక పోవచ్చును దొరకనిచో నెవరినైన నడిగెడు బుద్ధి గలుగును మఱియు పాలు విషయమై చాల ప్రతిబంధకములు గలవు కొన్ని చోట్లనవి దొరకవు ఎచటను నేప్రయాస లేకను దొఱకెడు ఆహారమునే బ్రహ్మనిష్ఠ లలవాటు చేసికొన వలయును మన పూర్వీకులు వనములో నుండి, యచట దొఱకిన ఫలమూలాదులను భుజించుచుండినందుచే వారి కెంత గౌరవము, మాహాత్మ్యమును గలిగినవో చూడుడు ఆలాగున నిపుడుండు ముముక్షువు లాచరించిన మాత్రమే క్షీణించిపోవుచున్న బ్రహ్మవిద్య నుద్ధరింపగలరు ఏ సమయమున నేది దొరకినను నుపేక్షింపక సాధువులు భుజింపవలయునని యొక నియమము గలదు అది యాకలి గలిగి యవసరమని తోచినపుడు మాత్రమే యన్వయించును సరియైన సాధన చేయువారి కొకరోజు భుజించుట, మఱొకరోజు లేకుండుట యైనచో, నిష్ఠ సరిగ జరుగదు కాన యాకలి గొన్నప్పుడేది లభించినను దానితో తృప్తి నొందవలయునని పలికిరి

ఈ మాటలవిని బ్రాహ్మణమ్మ యేమియు నుత్తరము జెప్పజాలక నిట్లనిరి ''మిమ్ములను జూచిన గొప్ప యోగానుభవముగల తపస్వినులువలె గనబడుచున్నారు అట్టి మీరు నడకచే డస్సియున్నారు శొంఠి, మిరియాలు, జీలకఱ్ఱ, యాలకులు వేసి జలమును కాచి కషాయముచేసి తెచ్చెదను మాగురువులవారు గూడ కషాయములో నావుపాలు బోసి త్రాగెదరు ఆ విధముగానైనను మీ రంగీకరింపవలయును లేనిచో నేనును నా బిడ్డలును ఈ రాత్రి యుపవాసముండ వలసియుండును అతిథి వచ్చియుండగా వారిని సత్కరింపక భుజించెడు అన్నము గోమాంస సమానమనియు, పానమొనర్చు జలము మద్యసదృశమనియు వినియున్నాను కావున గృహస్థులమగు మా కొఱకైనను

మీరంగీకరింప వలయును'' ని చెప్పగా భారతీదేవి వారియొక్క భక్తి ప్రభావమునకు విస్మయమంది యంగీకరించిరి

వెంటనే పట్టరాని సంతోషముతో పరుగిడి వెళ్ళి పైన జెప్పిన వస్తువులచే కాచబడిన జలమును, ఆవుపాలును, పంచదారయు దీసికొని యాడుబిడ్డలతో గూడ వచ్చిరి ఆ సమయమున వీరు ధ్యానమందుండుటను జూచి తల్లి పిల్లలతో ''వారు నిష్ఠలో నున్నారు నిశ్శబ్దముగా నుండవలయును బ్రహ్మనిష్ఠుల ధ్యానమునకు భంగము గలిగించుట గొప్పపాపము వారి మనస్సు దైవభావములోనుండి దృశ్యములోనికి త్రిప్పినవార మగుదుము అట్లు చేసినవారికి జలమునుండి తీరములోనికి తీసి వేసిన మత్స్యమున కున్నంత సంకటముండును కావుననే, నిర్జన స్థలమునందుండి ధ్యానము జేయవలయునని చెప్పెడు రహస్యము'' ని కొంచెము దూరము నుండియే నిశ్శబ్దముగా నుండులాగున సంజ్ఞను జూపిన, వెంటనే యా పిల్లలును ఆసనము వేసికొని నిశ్చలముగ కూర్చుండిరి భారతీదేవి రత్నమాంబగారును ధ్యానమునుండి లేచిన వెంటనే, వారికి పిల్లలచే నమస్కారమును జేయించి, తానును నమస్కరించి శొంఠి నీళ్ళను, పాలను, పంచదారయు నిచ్చిరి భారతీదేవిగారును, రత్నమాంబగారును దీర్ఘప్రయాణ మొనర్చి యెండలో నడచి వచ్చుటచే నలసియున్నందున తృప్తిగ పాలు బోసిన శొంఠినీరు ద్రాగిరి తరువాత నా బ్రాహ్మణి యిట్లు చెప్పెను ''తపస్వినులారా! నేను పతివ్రతా ధర్మము నాచరించుదానను పతియాజ్ఞ ప్రకార మిచటికి వచ్చితిని భర్తగారికిని భోజనము పెట్టవలసియుండును కాననేను నింటికి వెళ్లవలసియున్నది మీరు రేపటిదినము మా యింటిలో భిక్ష దీసికొని వెళ్ళవలయు'' నని చెప్పగా దాని కేమియు బదులు మాట్లాడక ఊరకుండుట జూచి వారిని విడిచిపోవుట కిష్టము లేకుండినప్పటికిని, గృహస్థ ధర్మసూత్రము నాలోచించి గోవు దగ్గఱనుండి త్రాడు వేసి కట్టి లాగబడు దూడ పోవునట్లు పోయెను

వారు వెళ్ళిన తరువాత బ్రాహ్మణ పిల్లలు నిశ్చలముగాను, నిశ్శబ్దముగాను చాలసేపు కూర్చుండిన విషయమై భారతీదేవి రత్నమాంబగారితో నిట్లనెను ''చూచితిరా! బాల్యకాలమున గలగిన యభ్యాస మహిమ! సామాన్య శిశువులు

ఈలాగున నిశ్శబ్దముగాను, నిశ్చలముగాను నుండగలరా? మఱియు తల్లియొక్క యోగ్యతను దీనివల్ల దెలిసికొనవచ్చును తల్లియొక్క సంకల్పము ననుసరించి గర్భములోగల శిశువుయొక్క స్వభావమున్ను చాలవఱకును తల్లియొక్క రక్తమే శిశువు యొక్క శరీరమై మారుచుండును మఱియు శైశవావస్థలో బిడ్డలు మాతృసాన్నిధ్యమందే యుందురు అనా నశన, శయనముల నన్నిటిని తల్లితో కలసి చేయుచుందురు వారియొక్క శరీరములో నేర్పడిన పాలవల్లనే శిశువులు పోషింపబడుచుందురు యధార్థముగ చిత్రకారు డతని మనస్సు ననుసరించి చిత్రమును చిత్రించునట్లు మాతృస్వభావము ననుసరించియే సంతానము గూడ చిత్రింపబడును లేక శిల్పి యేలాగున తన సంకల్పము ననుసరించి విగ్రహమును నిర్మించునో, ఆలాగున జననియు తన స్వభావము ననుసరించి బిడ్డలను తయారు చేయవచ్చును ఎవరో యొకరు మాత్రమే సరిగా కుదరకపోవుదురు గాని యందరు నట్లుండరు శైశవము దాటిన తరువాత మాత్రమే తండ్రి దగ్గఱనుండి పుత్రులు పితృస్వభావమును గ్రహించుకొన గలుగుదురు పుత్ర పుత్రికల జ్ఞానాభివృద్ధిలో మాతాపితరు లిరువురును మంచి శ్రద్ధ తీసికొనవలసి యుండును జీవునియొక్క సంస్కారము మారదని కొందఱు చెప్పినను నది యందఱకును సంబంధించదు కొందఱు మాత్రమే యట్లుండవచ్చును నూలు తెలుపుగానుండినను నలుపు, ఎఱుపు మొదలగు రంగులతో జేరునప్పుడేలాగున ఆ నూలుయొక్క నైజమగు తెలుపు పోయి ఆయారంగుల స్వభావము గలుగుచుండునో ఆలాగున చాలవఱకు స్వభావమును మార్పు చేయవచ్చును దీనియందు మాతృ యత్నము ముఖ్యముగా నుండవలయును ఆవిషయమై యీ బ్రాహ్మణ బిడ్డలే సాక్ష్యము

దీనికి ముఖ్యముగ నాహార నియమము నేర్పఱచవలయును నియమితాహారమును, నియమిత సమయమున నియమముగానే పెట్టవలయును బిడ్డలకు ఇష్టమువచ్చినప్పుడెల్ల వస్తువులను పెట్టుటయు, దుకాణములనుండి వస్తువులను దెప్పించి యిచ్చుటయు, వీధిలో తిరుగుచు నమ్ముచుండెడివారి దగ్గరనుండి కొని యిచ్చుటయు మహాదోషము బిడ్డలు చెడుటకిదియే కారణము ఆవస్తువులు శుద్ధముగా నుండవు ఏ వస్తువునైనను తయారు జేయునపు డావ్యక్తియొక్క భావము,

సంకల్పము ఆవస్తువునందు ప్రవేశించును విక్రయించు వారు శుద్ధముగా నుండరు ఆవస్తువులును శుద్ధముగా నుండుట అరుదు అమ్మగా మిగిలిన వస్తువుల నెన్ని రోజులైన దాచియుంచి యమ్ముచుందురు దానియందు సూక్ష్మక్రిములు గూడ పుట్టవచ్చును అంతేగాక దుకాణమందుండు మిఠాయి వస్తువులను కడు బీదపిల్లలు చూచుటచే దృష్టి దోషమును, ఆపిల్లలయొక్క ఆశయును గలిగి యుండును గాలి గొట్టు నపుడు వీధిలోగల దుమ్ము దానిలో జేరుచుండును మురికి కాలువలో ఎలుకలు, కప్పలు, పాములు మొదలగునవి చచ్చి పడియుండును మలముగూడ పేండును వాటిపై వ్రాలి యుండు ఈగలన్నియు నీ మిఠాయిపై వ్రాలుచుండును ఆ దోషమంతయు నీవస్తువులందు చేరుచుండును వెండియు, వీధులలో కుష్ఠు, క్షయ, రోగములు గలవారును, హీనజాతులవా రును నెంగిలి నుమియుదురు వాటియందు వ్రాలిన ఈగలు ఈ మిఠాయిపై వ్రాలును ఆ రోగాణువులు మిఠాయి ద్వారా భుజించువారికి జేరును అట్టి దురభ్యాసముండుటచేతనే పిల్లలు దొంగపని నేర్చుకొనుట కవకాశము గలుగుచున్నది ఇపుడు సన్యాసులు గూడ కాఫీహోటల్‌కు మిఠాయి యంగళ్ళకు పోవనారంభించిరి అందువలననే గృహస్థులకు సన్యాసులపై విశ్వాసము తగ్గిపోవు టకు కారణమైనది కావుననే ''ఆహారశుద్ధౌ సత్త్వ శుద్ధిః సత్త్వశుద్ధౌ ధృవాస్మృతిః''॥ అని యుపనిషత్తు చెప్పుచున్నది '' అని చెప్పి వీరును శయనించి, మామూలు ప్రకారము బ్రహ్మముహూర్తమునకు ముందుగానే స్నాన మాచరించి, ధ్యానము సలిపి ప్రయాణమై వెళ్లిరి

నింపాదిగా నడచుచు మధ్యాహ్న కాలమునకు 15 మైళ్ళు వెళ్ళి యచ్చటనుండు నొక యాశ్రమమును జేరిరి అయ్యది చాల చిన్న ఆశ్రమము మెట్ట ప్రదేశము అయినను తీర్థయాత్రా పరులకును, నతిథులకును నీశ్వరు డిచ్చినంత పదార్థములను నిండు భక్తి శ్రద్ధలతో నిచ్చుచుండిరి భారతీదేవిగారిని జూచినతోడనే యాశ్రమస్థులు విస్మయమందిరి పొడవైన శరీరమును, పండిన బంగెనపల్లి మామిపండువలె గల శరీరకాంతియును జూచి ''వీరెవరో తెలియదు ఇచట తమిదయన్నము, చిక్కని మజ్జిగ యును మాత్రమే గలదుగదా? వీరి కన్నము పెట్టక నీ రాగిసంకటి యెట్లు పెట్టవచ్చును'' నువారి సందేహస్థితిని చూచి భారతీదేవి నిండు వినయముతో నాశ్రమస్థులతో ''మాకొఱకు మీరేమియు

విచారపడుట గాని, ప్రత్యేకభోజనము నేర్పాటు చేయుట గాని యక్కర లేదు మీకీశ్వరుడిచ్చిన దేదైన వాలును మేముగూడ నన్ని విధములగు భోజనముల దినెడి యభ్యాసము గలవారము జ్వలించుచుండెడు అగ్నియందు దహింపబడని పదార్థ మేది గలదు? స్వల్పాగ్నియైనచో నన్నిటిని భస్మ మొనర్చు శక్తి గలిగి యుండదు జఠరాగ్ని ప్రజ్వలించు వారికే యన్నమైనను జీర్ణించును అంతే కాదు ఏ దేశ శీతోష్ణము ననుసరించియే ధాన్యము పండునో, ఆ స్థలములో నుండువానికి దానికన్న మఱియే యాహారమును నారోగ్యమును గలుగజేయదు మఱియొక స్థలములో నా శీతోష్ణములచే గలిగిన ధాన్యము ఇతర శీతోష్ణము లందుండువారు భుజించినచో నారోగ్యము సరిగా నుండదు కనుకనే బ్రహ్మనిష్ఠ లాకలిబాధ గలుగువఱకన్నము విషయమై విచారింపకూడదనియు, నిద్రవచ్చి పడిపోవువఱకు పరుండు స్థలమును గుఱించి వెదుకగూడదనియు, పెద్దలు చెప్పెడు రహస్యము అంతేగాదు ఏ సమయమున నేది దొరికినను యద్దానిని భగవత్ప్రసాదమని తలంచి ప్రీతితో భుజించుటయే సాధుధర్మమగును అట్లుగాక కొందఱు సాధువులు మా కభ్యాసము లేదు, మాకు జీర్ణముకాదు మాకు రుచింపదు మాకు బియ్యపన్నమే కావలయును మాకు గోధుమరొట్టె యభ్యాసమనియు జెప్పుటచే ధర్మనిర్వాహ కులకును, దాన శీలురకును, నయిష్టము గలిగి దానధర్మముల జేయకున్నారు అందువలన ధర్మమభివృద్ధి నొందకపోవుచున్నది అంతేకాదు, ధర్మక్షయము గూడ గలుగవచ్చును అందువలననే గీతయందు ''యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః'' అని యుపదేశించుటకు కారణము మఱియు సాధన పంచకమందు శ్రీశంకరులు ''స్వాద్వన్నం నతు యాచ్యతాం విధివశాత్ప్రాప్తేన సంతుష్యతామ్'' అని యుపదేశించిరి ఆహార రుచిని కోరకుడు ఈశ్వరుడిచ్చిన దానితో సంతసింపుడని పైవాక్యమున కర్థము ఎవరు దేని నొసగినను ప్రీతితో భుజించినచో దాతల కెంతో సంతోషము గలుగును అప్పుడే ధర్మము వృద్ధినొందును దాతల మనస్సున కేవిధమగు నొప్పిని గలుగ జేయరాదు

అట్లు వారికి మనోవేదనను గలుగ జేయువారు ధర్మవినాశకారకు లగుదురు గృహస్థులెంతో కష్టపడి పండించియు లేక ధర్మశీలురగు పుణ్యాత్ముల ననేకుల నాశ్రయించి సంపాదించియు ధర్మకార్యముల జేయుచున్నారు వారికి సాధువులకు

పెట్టవలయునని విధి యేమైనను గలదా! ఏమి? కాబట్టి తీర్థయాత్రాపరులగు నతిథు లందఱు నీకార్యమునం దెంతో జాగ్రత, వహింపవలయును మఱియు రజోగుణ తమోగుణవముల గలుగ జేయు కట్వామ్ల లవణాదులను వమాత్రము వర్జింపవలయును ఆలాగున హింసాకరమగు నాహారమును తగదు హింసాహారములు సాధువుల కెవ్వరును పెట్టరు పై జెప్పిన విధముగ నాచరించు సాధువులను జూచిన యందఱి మనస్సున జాలి గలిగి దానధర్మముల నభివృద్ధి జేయుటకై యత్నింతురు '' అని యిట్లు ధర్మోపన్యాసమును జెప్ప వారాశ్చర్యచకితులై యూరకుండిరి అంతట భోజనసమయ మాయెను

భారతీదేవి, రత్నమాంబగారును భోజనమునకు కూర్చొనిరి తమిద యన్నమును చిక్కని మజ్జిగయును, వారు వండియుండు అనపకాయ కూరయును తృప్తిగ భుజించిరి వారియొక్క యోగ్యతను జూచి యాశ్రమము వారింకను రెండు మూడు రోజు లిచటనే యుండిన బాగుండునని తలంచి వారితో జెప్పి యెంత ప్రార్థించి నను వారు నిలువరైరి కొంచెము సేపు విశ్రమించి ప్రయాణమైరి కొంత దూరము వఱ కాయాశ్రమము నందలి సాధువులు గూడ వెళ్లి సాగనంపిరి సాధువృత్తి యిట్లుండ వలయునని శ్రీ రత్నమాంబగారితో భారతీదేవి చెప్పెను ఒక సాధు వొక స్థలమునం దుండిన నింకను నాపుణ్యాత్ముడిచ్చటనే యుండిన బాగుండునని జనులచే ననిపించుకొనవలయునేగాని, యితడు వెళ్ళి పోయినచో బాగుండునని యనిపించు కోకూడదు ఈ విధముగ ప్రతిమధ్యాహ్నములను రాత్రులలోను నేలాటి కొఱతయు గలుగక పుణ్యాశ్రమములను, పుణ్యక్షేత్రములను, పుణ్యతీర్థములను, వనములను, తాపసులు వసించెడు గుహలను దర్శించుకొనుచు గోకర్ణయాత్రను జేయుచుండిరి వీరి యాత్ర శ్రీసీతారామ లక్ష్మణుల వనవాస యాత్రవలె నతిపావనముగా నుండెను

ఇది యిట్లుండగా భారతీదేవిగారి పూర్వస్థలమున గీతాపరన మొనర్చు మహిళా సంఘమువారు భారతీదేవి యున్నపుడెట్టి భక్తి గలిగి పారాయణ భజనాదులు సలుపుచుండిరో, ఆలాగుననే చేయుచుండిరి అచ్చట నివసింప దలంచిన నలుగురిలో నిద్దరు వితంతువులును, ఇద్దరు కన్యకలు నుండిరి వారి

సొంత ఖర్చుతో నాలుగు ధ్యానమందిరముల కట్టించుకొనిరి భారతీదేవిగారి పటమును, వారు ధ్యానము జేయుచుండిన దర్భాసనమును, వారు నివసించుచుండిన కుటీరములో పెట్టి పూజించుచుండిరి మఱియు భారతీదేవిగారు ప్రయాణ సమయములో వ్రాసిన యుత్తరమునకు గూడ నద్దము వేయించి పూజలో నుంచిరి ఆ దినము గొప్ప సమారాధన గూడ జరిగెను ఈ వధూమణుల భక్తి, వైరాగ్యానుష్ఠానములను జూచి భారతీదేవి మాతాపితరులు ఒక భారతి పోయినను, నలుగురు భారతీదేవులు ఏర్పడిరని సంతసించుచుండిరి అప్పటినుండి భారతీదేవి జననీజనకుల దుఃఖము చాలవఱకు నుపశమించెను భారతీదేవి తల్లిదండ్రులు తన బిడ్డ నేలాగున చూచుచుండిరో ఆలాగున నీయనుష్ఠానము జేయు మానినీ మణులను గూడ జూచుచుండిరి ఇచట నీలాగున శాంతమగు ప్రకృతి యేర్పడినది

అచట భారతీదేవియు సృష్టియొక్క చిత్ర విచిత్రముల నవలోకించుచు నానందభరితయై, యేలాటి కొఱతయును లేక నొకరోజు వరియన్నమును, మఱి యొక రోజు జొన్నన్నమును, ఇంకొకరోజు తమిద సంకటియు తినుచు కర్ణాట దేశముయొక్క పశ్చిమ పర్వత ప్రదేశమును దాటుచు క్రమముగ నచ్చటచ్చట నాశ్రమములను, సాధువుల మఠములను దర్శించుచు కొన్ని రోజులకు ''ఉడిపి'' స్థలమును జేరిరి అచటనే శ్రీమధ్వాచార్యులుండి తన శ్రీవిష్ణుమతమును బోధించి యున్నారు ఇపుడు గూడ నచటచట మఠములు గలవు యాత్రికులను చాల భక్తితో నాదరించుదురు ఇచ్చట వేదపాఠశాలయు, సంస్కృతకళాశాలయు నవ్య తేజస్సులతో విరాజిల్లుచున్నవి ఇంక ద్వైతమతమును బోధించెడు నాచార్యుల స్థలములును చాల గలవు ఒక రోజుమాత్ర మచటనుండి మఱల 'సుబ్రహ్మణ్యము'నకు వెళ్ళిరి ఇది చాల దండకారణ్యము తపస్సొనరించువారికి మంచి యనుకూలము గలదు ఇచ్చట శ్రీ కుమారస్వామియొక్క మంచి మందిర మొకటి గలదు ఇచ్చట నుండియే కావేరీ నది ప్రవహింపనారంభించి, శ్రీరంగము ద్వారా సముద్రములోనికి ప్రవేశించుచున్నది ఇచట గూడ సాధువులకు మంచి సత్కారము గలదు అచ్చటనుండి ''ధర్మస్థలము'' నకు వెళ్ళిరి ఇది పేరుకు

దగిన ధర్మము గలిగినది ఇవి యన్నియు నీలగిరి రీతిగ నుండును ఇచ్చట తపస్సును జేయువారికి మంచి యాదరణ గలిగియున్నది ఇచ్చట శ్రీశంకరనారాయణ క్షేత్రము గలదు శివవైష్ణవ భ్రాన్తిగల వారీ పుణ్యక్షేత్రమును దర్శించినచో వారియొక్క మతద్వేష రోగ భ్రమము నశించును

అచ్చటనుండి ముందుగ నిశ్చయించుకొనిన శ్రీ మహాబలేశ్వరుడుండు గోకర్ణ పుణ్యక్షేత్రమున కరుదెంచిరి ఇది పశ్చిమ సముద్రమున వెలయుచున్నది ఒక్కొక్కప్పుడు సముద్రజల మానందముతో భజన జేయుచు నీశ్వరదర్శనమునకు వచ్చుచు న్నట్లు మనోహరమగు తెల్లని నురుగులతోను, చిన్నచిన్న ఘోషములు గల యలలతోను దేవాలయముద్గ్గఱకు గూడ వచ్చుచుండును ఇచట విశేషముగ బ్రాహ్మణాగ్రహార ములును, శ్రీ ఆదిశంకరాచార్యుల మఠములును ననేకాన్నసత్ర ములును గలవు ఇచట గొప్ప ''సంస్కృతకళాశాల'' గలదు సముద్రతీర పర్వత పంక్తులలో నచ్చటచ్చట తపస్సునకనుకూలమగు గుహలు గలవు కొన్నిటిలో కొందఱు యోగులును, తాపసులును ననుష్ఠాము జేయుచుందురు ఈ క్షేత్రములో సర్వజనులును నీశ్వరుని యభిషేక పూజాదుల జేయవచ్చును మహాశివరాత్రి రోజులలో నిచట 10 దినములు గొప్ప యుత్సవము జరుగును భారతీదేవి, రత్నమాంబగారు నచట సముద్రస్నానము జేసి తన వంశీయ పితృ దేవతలకు తర్పణ మొనర్చి, మహాబలేశ్వరునకు నభిషేక పూజాదులు సలిపిరి మూడు రోజు లచటనుండి, యా ప్రదేశములో నుండు మఠములు, అన్నదాన సత్రములు, సాధువులు వసించు నేకాంతప్రదేశములు మొదలగు వాటిని దర్శించిరి ఎచట కేగినను స్త్రీలు మాత్రమేగాక పురుషులు సహ, మీరేదేశీయులు? అని యడుగుచుండిరి ముఖ్యముగా నారీమణులు వీరెవరో ఎంత తేజస్సు గలవారు? ఎంత ప్రశాంతమగు ముఖమును నడతయును గలిగియున్నారు? హంస గమనమని వినియున్నాము అది యిపుడు కనబడుచున్నది పాంచాలదేశపు స్త్రీలు పొడుగైనవారై సువర్ణకాంతి గలిగియుండు నట్లు వినియున్నాము వీరు వారుగానే యుండవచ్చును ఈ పుణ్యక్షేత్రములో మనము పుట్టినందుచేతగదా ఇట్టి పుణ్యాత్మురాలిని దర్శింప గలిగతిమి ఈ విధమున నొకరితో నొకరు చెప్పుకొనుచుండిరి

అచ్చటనుండి 'పాండురంగ విఠలు' దేవుని దర్శనమునకై వెళ్ళుచు దారిలో కొన్నిరోజులు నడవవలసివచ్చెను అప్పటికి కర్ణాటక దేశమును దాటి మహారాష్ట్రదేశములో నడుగుపెట్టిరి మార్గములో గూడ ననేక సత్రములు గలవు కాని యెక్కువ స్థలములలో జొన్నరొట్టె, పప్పు, కూర మాత్రమే దొరకును కొన్ని సత్రములలో జొన్నరొట్టెయు, కొంత యన్నముగూడ లభించును పూర్వము ఇట్టి భోజన మభ్యసించియుండుటచేతను, జఠరాగ్ని ప్రజ్వలించినపుడు మాత్రమే భుజించు చుండుటచేతను, కొంత ప్రాణాయామము గలిగి యుండుటచేతను, ఆకలి శమించుటకు మాత్రము భుజించువారగుటచేతను వారి కేలాటి శరీరమార్పు గలుగలేదు కాని, శ్రీరత్నమాంబగారికి మాత్రము రక్తవిరేచనములును, జ్వరబాధయు గలిగెను అచ్చట దారిలో స్త్రీల మఠమొకటి యుండెను దానియందు వారము రోజులుండి శరీరారోగ్యమును సంపాదించుకొనిరి ఆ మహారాష్ట్రదేశ స్త్రీలయొక్క భక్తి, సేవ యపారమైనవి వారికి మంచి యౌషధమిప్పించి చక్కని పథ్యమును జేయించి, కన్నతల్లులు చంటిబిడ్డలను జూచునట్లు వారాదరించిరి వారిది మహారాష్ట్ర భాషయైనను నచటనుండు పరమభక్తురాండ్రలో చాల మందికి హిందీ, సంస్కృత భాషలు దెలియును భారతీదేవిగారి కీరెండు భాషలు దెలియుటజూచి వీరియొక్క తపస్సును, ఆత్మప్రబోధమును గాంచి యెల్లపుడును నచటనే యుండవలయునని యెంత ప్రార్థించినను, పాండురంగవిఠలు దర్శనమునకు వెళ్ళవలయునని చెప్పి ప్రయాణమై పోయిరి వారి మఠములో శ్రీవిఠల్ విగ్రహము గలదు వారికి నామస్మరణయే ముఖ్యము గీతాపారాయణయును, శ్రీభాగవత పఠనమును గూడ జేయుచుందురు। క్రమక్రమముగ కొన్ని రోజులకు పండరీపురమును జేరిరి మార్గమధ్యమున నపుడపుడు కొంత భోజనావరోధము గూడ గలిగెను

ఈ పుణ్యక్షేత్రము భక్తిమయప్రదేశము ప్రతివారును చూడదగినది ముఖ్యముగ శ్రీమంతులగు పురుషులును, నారీమణులును సేవింపదగినది మంచి యౌవనావస్థలో నుండు శ్రీమంతులగు వధూమణులు గూడ తన్మయము నొంది భజన చేయుచుందురు ఆలాగున విద్యావంతులును, శ్రీమంతులునునగు

యువకులు గూడ నేకాగ్రచిత్తముతో భజన జేయుచు తన్మయులై యుందురు అచట గూడ నన్ని జాతులవారును శ్రీవిఠలు దేవుని పూజింపవచ్చును 'శ్రీవిఠల్ శ్రీవిఠల్' అను శబ్దము తప్ప మఱియొక వాక్యము వినరాదు అనేక మఠములు గలవు పరమభక్తులగు తుకారాం, జ్ఞానదేవాదుల మఠములును, శ్రీసక్కుబాయి, ముక్తాబాయి మొదలగు నారీమణుల సమాధులును, మఠములును గలవు చంద్రభాగానది యీ పండరీ క్షేత్రము నానుకొని ప్రవహించుచుండును అచట ననేక సాధువులును, ఆశ్రమములు నుండుటచే నవియన్నియు దర్శించుచు 10 రోజు లుండిరి అచటినుండి బొంబాయి మహా పట్టణమునకు బయలు దేరివెళ్లి, యీ దివ్యపట్టణములో గల నన్నదానసత్రముల జూచుకొని రెండు రోజులుండిరి అచటనుండి పంచవటికి ప్రయాణమై నర్మదా నదియందు స్నానమాచరించి యానదీతీరమున గల యోంకారేశ్వరుని దర్శించుకొనిరి ఈ స్థలము తపస్సును జేయువారికి గొప్ప మహిమను గలుగజేయునది కాని యన్నసత్రము లంత యనుకూలస్థితిలో లేవు అయినను భిక్షాటనమును జేయు వారికి ప్రతియింటిలో అతిభక్తితో భోజనవేళ కేతెంచెడు యతులకు, బ్రహ్మచారులకు నన్నమిడెదరు ఇచట గోధుమరొట్టెయు, జొన్న రొట్టెయు స్వల్పముగ నన్నముగూడ నుండును

ఉత్తర దేశమున మంచి తపస్సు అధ్యయనముగల సన్న్యాసులు, బ్రహ్మచారులు మాత్రమే యన్నభిక్ష నాచరింతురు చాల గౌరవముతో వారికి గృహిణులు భిక్షమిడెదరు ఆ దేశములో నది చాల గౌరవముగా తలంతురేగాని దక్షిణ దేశమువలె హీన ముగా దలంపరు కాని దాక్షిణాత్యులవలె యోగ్యత లేనివారు గూడ కేవలము భోజనార్థమై భిక్షాన్నమునకు వెళ్ళున ట్లెవరును బోరు

*యతిశ్చ బ్రహ్మచారీ చ పక్వాన్నస్వామినావుభౌ ।*
*తయోరన్నమదద్వాతు భుక్త్వా చాంద్రాయణం చరేత్ ॥*

యతియు, బ్రహ్మచారియు వీరిద్దరు గృహాశ్రములు వండుకొన్న పక్వాన్నమున కర్తలయినవారు ఆ యతి, బ్రహ్మచారుల కన్నము పెట్టక తన కడుపునకు దినువాడు చాంద్రాయణ వ్రతము నాచరించిన గాని పాపమునుండి పవిత్రుడు గాజాలడు

మఱియు నీ దేశమున అతిథి సత్కారమును జేయనిచో తమయొక్క గృహస్థ ధర్మమును చక్కగా నాచరించని వారినిగా దలంతురు ఏ గృహమున కతిథి వచ్చినను గొప్ప పుణ్యముగ తలచెదరు ఏ యింటికైన యతిథివచ్చి యాదరింప శక్తిలేక పోయినచో తమ పుణ్యము నశించి పోయినట్లు పరితపించెదరు ఈ ప్రదేశములో నెక్కువ మంది బ్రాహ్మణులు ఆ యతిథి పూజయందు తత్పరులై యుండెడివారు గలరు రెండు రోజులచటనుండి పిదప శ్రీకృష్ణుని పట్టణమగు శ్రీద్వారకకు ప్రయాణమయిరి దారి మధ్యలో గోధుమరొట్టెయు, సజ్జరొట్టెయు, జొన్నరొట్టెయు, దాల్ (పప్పు, కూరయు) దొరకునేగాని, వరియన్నము చాల అరుదుగ నుండును పై జెప్పిన రొట్టెలే ఆ దేశములో ముఖ్యాహారములు కూరగాయలు గూడ నెక్కువగ దొరకవు, అయిదారు మైళ్ళలో సత్రములుండును ఆ దేశమువారు తమసొంత చుట్టముల నాదరించి నట్లతిథుల నాదరింతురు యాత్రికులను, సాధువుల నెంతో ప్రేమతో నాదరింతురు మొదటనే పై జెప్పిన రొట్టెల నభ్యసించియుండుటచే వీరి కేబాధయు గలుగలేదు ఆ దేశములో సామాన్యగృహస్థులు గూడ కారము పులుసు దినరు అందుచే కాబోలు వారంత సాత్త్వికులై యుండుటకు కారణము ఈ స్థలములోను మధ్య మధ్య భోజనము దొఱకని రోజులుగూడ కొన్ని గలిగెను ద్వారకను సమీపించునప్పటికి పాలును పెరుగును కావలసినంత దొరకును వారికి సాధువులపై గల భక్తి యపారము అచట నుండి హిందీభాషయే ప్రధానముగా నుండును సంస్కృతము దెలిసియుండినందుచే భారతీదేవికి యన్నిభాషలు సులభముగా నలవడెను సంస్కృతము దెలిసినవారికి హిందీ ప్రయాస లేకయే యభ్యసింపనగును ఈ ద్వారకా ప్రయాణమార్గములోనే ''మార్వాడుదేశము'' గలదు వీరికి దేవునికన్నను సాధువులపై ప్రీతి యధికము చిన్నగ్రామముగా నుండిన నొక సదావర్తి నేర్పాటు చేసియుందురు ఈ మార్గములో కొన్ని స్థలములలో సజ్జ, మొక్కజొన్న, జొన్నరొట్టెలు మాత్ర ముండును కొన్ని స్థలములలో 'సత్తువ గూడ సదావర్తి గలదు (ఇది శనగ, గోధుమ, జొన్న మొద లగునవి వేయించి పిండి జేసినది) అచ్చట సంచరించెడి వారికి వృక్షశాఖల యందు శ్రీకృష్ణుడు నెమలిపింఛము ధరించి యాడుచున్నట్లు తోచులాగున మయూర సమూహములు గలవు

వాటియొక్క కేకాధ్వని వినినచో నావృక్షశాఖలందు శ్రీకృష్ణుడు వేణుగానమును జేయుచున్నాడా? అని తోచును భూతదయ యందలి మహిమవల్ల నా నెమళ్ళ నెవరును బాధింపరు

ఈ దారిలో దత్తాత్రేయులు తపంబొనర్చిన ''గిర్నార్''అను పర్వతము గలదు దీనిని ''ఆబూ'' పర్వతమని గూడ పిలుతురు ఇయ్యది గొప్ప యెత్తైన మహీ ధరము మొదటి నుండి యగ్రమువఱకు వలయాకారముగ 18 మైళ్ళు దూర ముండును పర్వతముయొక్క చుట్టుప్రదేశములందును చిన్న చిన్న యాశ్రమములును, నచట నిద్దరు ముగ్గురు సాధువులు నుందురు పర్వత మధ్యభాగమునందును, పై భాగమునందును నన్నసత్రములున్నవి యాత్రికులగు సాధువులకేలాటి కొఱతయు లేదు అయితే ముఖ్యముగ నన్నిటిలోను కిచడీయు (పులగము) కొన్నిటిలో సత్తువయును, కొన్నిటిలో రొట్టి, దాలును ఇచ్చెదరు ఈ కొండలో నుండువారికి యోగాభ్యాసమునం దెక్కువ ప్రీతి యుండును గోరకనాధ్ సంప్రదాయులగు సాధువులే యెక్కువగా నుందురు పర్వతముయొక్క ఏ ప్రదేశమునందైనను జలాధారము సమృద్ధిగ నుండును ఆ 'నాధ్' సంప్రదాయ సాధువులు స్త్రీలతో నెక్కువ మాట్లా డరు కాని స్త్రీలైనను సాధువృత్తిలో నుండువారిని బాగుగా నాదరింతురు అచ్చట నుండు అనేక సాధువులను, ఆశ్రమములను మూడు రోజులు దర్శించి వారు శ్రీద్వార కాపురి నుద్దేశించి ప్రయాణము సాగించిరి

మార్గమధ్యములోనే కుచేలమహాముని స్థలమగు సుదామపురి గలదు అది సామాన్యమగు నొక గ్రామము అచ్చట గూడ తీర్థయాత్రికులగు సాధువులకు సత్రములు గలవు శ్రీ ద్వారకకు వెళ్ళుటకు గృహస్థు లొంటెలపై ప్రయాణమును జేయుదురు భక్తులు, సాధువులు, పాదచారులుగానే వెళ్ళుదురు శ్రీకృష్ణపురమగు ద్వారకాపురి పశ్చిమసాగర తీరమందలరారుచున్నది శ్రీ భాగవతములో వర్ణించియుండు ద్వారకను సముద్రుడు తన గర్భములో నుంచియున్నాడు మాఘ ములో వర్ణించినట్లిపుడు లేకపోయినను నిపుడుగూడ చాలవఱకు నా చిహ్నములు గలవు ఎట్లన!

*యత్సాలముత్తుంగతయా విజేతుం దూరాదుదస్థీయత సాగరస్య ।*
*మహోర్మిభిర్వ్యాహతవాంఛితార్థైః వ్రీడాది నాభ్యాశగతైర్విలిల్యే ॥*

*కుతూహలే నేవ జవాదుపేత్య ప్రాకారభిత్త్యా సహసా నిరుద్ధః ।*
*రసష్నరోదీద్భృశమంబు వర్షవ్యాజేన యస్యా బహిరంబువాహః ॥*

సముద్ర తరంగము లాద్వారకాపురియొక్క ప్రాకారము నౌన్నత్యముతో జయించుటకో యన్నట్లు దూరమందుండియే యెగిరెగిరి పడుచు వచ్చి దగ్గర జేరి తమ కోరిక యీ డేరనందున సిగ్గుపడినవో యన్నట్లు సముద్రమున లీనమై పోయినవి పాపము, మేఘుడు ద్వారకాపురిలోన ప్రవేశింపవలెనని కాబోలు నా దరికి వేగముగా వచ్చి కోటగోడ లడ్డమైనందున లోపలకు బోవ లేక బైటనే పెద్ద యుఱుముగా మొఱ్ఱపెట్టుచు వర్షము గురియుట యను వంకతో కన్నీరు పెట్టుకొనియె

ఈ దృశ్య మట కాననగును అచట శ్రీ కృష్ణవిగ్రహము నందఱు తాకి పూజించవచ్చును ఇచట నిపుడుగూడ గొప్ప గొప్ప గోవులు గలవు పాలు పెరుగు కొల్లగా దొరకును ఇచటను శ్రీశంకరాది మతత్రయాచార్యుల మఠములు గలవు చాల యున్న సత్రవయులును సంస్కృతపాఠశాలలునున్నవి తాపసులు శ్రీరామభక్తులగు బైరాగులు, శ్రీకృష్ణ చైతన్య సంప్రదాయులగు పరమ భక్తులైన స్త్రీ పురుషులు గలరు పురుషులకన్న స్త్రీ లెన్నో రెట్లధికముగా నున్నారు వీరి చేతిలో తులసీమాలయు, శ్రీ భగవద్గీతయును సదా యుండును ఎల్లప్పుడును ''రాధే కృష్ణ'' యని స్మరణ చేయుచుందురు స్త్రీ లెక్కువగా నుండుటచేతను, శ్రీకృష్ణుడు నివసించిన భూమి యగుటచేతను, శ్రీ కృష్ణాంఘ్రిధూళిచే పావనమగు ప్రదేశమగుటచేతను వారు 10 రోజులచటనే యుండి యన్ని స్థలములను దిలకించుచుండిరి

అచటనుండి పాంచాల దేశమున కరుదెంచుటకు నిశ్చయించి కొంతదూరము వెళ్ళు సరికి ''శ్రీగురునానక్'' భక్తుల గురుద్వారము కనపడసాగెను వీరికి మూర్తిపూజ లేనప్పటికిని నానక్ రచించిన గ్రంధములను పూజింతురు దానిని 'గ్రంధసాహెబ్' అని వచింతురు తక్కిన విషయము

లన్నిటిలోను హిందువులవలె నుందురు వీరికి సాధుసేవ యనిన కడుగొప్ప వీరి యాశ్రమములకు గురుద్వార ములని పేర్లు శ్రీనానక్‌ను వీరు శ్రీకృష్ణావతారముగ నమ్మెదురు ఈ దేశమందంతట గోధుమ రొట్టె ముఖ్యాహారముగ నుండును వీరు సిక్కుమతస్థులు హిందువులుగూడ నీ దేశమున విశేషముగ నున్నారు ఈ సిక్కు మతస్థులు గూడ హిందువులలో నొక తెగవారేగాని, యితరులు కారు ఈ దేశములో గోరక్‌నాథ్ సంప్రదాయ మఠవముల నేకములు గ౯ఁవు వీరికి యోగాభ్యాసము ముఖ్యము దానియందు గూడ హఠయోగ మును ప్రధానముగ దలంతురు హఠయోగ సంప్రదాయ మీ సంప్రదాయమునకు జెందిన యాత్మారామానాథ్, మత్స్యేంద్రనాథ్ సంప్రదాయమున నేర్పడినది కావుననే హఠయోగ ప్రదీపికయందు

*ప్రణమ్య శ్రీ గురుం నాథం స్వాత్మారామేణ యోగినా ।*
*కేవలం రాజయోగాయ హఠవిద్యోపదిశ్యతే ॥*

తన గురువైన గోరక్షనాథులను భక్తిపూర్వకముగ నమస్కరించి స్వాత్మారామ యోగిచేత కేవలము రాజయోగసిద్ధికొఱకు హఠవిద్య ఉపదేశింపబడుచున్నది

*హఠవిద్యాం హి మత్స్యేంద్ర గోరక్షాద్యా విజానతే ।*
*స్వాత్మారామోఽథవా యోగీ జానీతే తత్ప్రసాదతః ॥*

మత్స్యేంద్ర, గోరక్షాది యోగులు సాధన లక్షణ భేద ఫలముల వలన విశేషముగా హఠవిద్యను దెలిసి యున్నారనుట సుప్రసిద్ధము స్వాత్మారాముండను యోగియును, ఆ గోరక్షానాథుని కృపవలన దెలిసికొనియున్నాడు మఱియు వీరికి యోగాభ్యాసము ముఖ్యమగుటచే దాని కనుగుణముగా వైరాగ్యము గూడ గొప్పగా నుంటున్నది అందువల్ల సామాన్యముగ స్త్రీల నంత దయతో జూతురు నానక్ సంప్రదాయులు గొప్ప దయాపరులును, సాధుసేవయందు ప్రీతిగలవారును నైయుండుటచే వారికి సాధువు లపై నింత దయ గలుగుటకు కారణము స్త్రీలు గూడ చాల దయతో చూచెదరు ఉదాసి సాంప్రదాయులగు స్త్రీ శ్రీ నానక్ పంథాలో జేరినవారు సామాన్యముగ జను లందరు నా సంప్రదాయ మూలపురుషు

ననుసరించియే యుందురు కావుననే బౌద్ధులలో నహింసాధర్మమును గలిగియుండుటకును, క్రైస్తవులలో పరమత సహనమును గలిగియుండుటకును, మహమ్మదీయులలో కొందఱికి పరమత సహనము లేకపోవుటకును కారణము మహమ్మదుగా రాకాలపు జనుల స్వభావము ననుసరించి కొన్ని విషయములలో పరమతసహనము లేక పోయినను సత్యమందును, దైవమందును గొప్ప విశ్వాసమును, గొప్ప కార్యశూరత్వమును గలిగి యుండిరి ఇపుడును నొక్కొక్క సంప్రదాయ పురుషుని యనుసరించి యామతాను యాయులు ప్రవర్తించు చున్నారు

అయితే ఆ మూలపురుషు లాయాకాలమును, దేశమును బట్టి ప్రవర్తించు చుండినను తదనుయాయు లదే పద్ధతిని గలిగి యుండకూడదు అదిగూడ నొక విధమగు పరాధీనతయే అస్వాతంత్ర్యమే విచక్షణబుద్ధి గలవాడు దేశకాలముల ననుసరించి మూలసూత్రమునకు హాని కలుగనీయక యీ వర్తమాన స్థితి ననుసరించి సత్యాసత్యములను న్యాయాన్యాయములను దెలిసికొన శక్తి గలిగి యుండవలయును అయితే అందరు నాలాగున అవలంబింపకూడదు న్యాయాన్యాయములను, సత్యాసత్యార్థములను నిజముగ దెలిసికొనెడి వ్యక్తికి మాత్రమే యది చెల్లును అట్లు కానందు చేతనే మత వైషమ్యములు గలుగుచున్నవి

పాంచాల దేశమున ముఖ్యమగు స్థలములలో సంచరించుచు లాహోరు మహా పట్టణమును జేరిరి ఇది చాల చల్లని ప్రదేశము అనేక ఫలవృక్షములతో గూడినది బహువిధములగు కూరగాయలు గలవు మహమ్మదీయులు గూడ నిచట విశేషముగ గలరు వారిలోను గొప్ప శ్రీమంతులున్నారు హిందువులును వారును మిక్కిలి సోదర భావము గలిగియుందురు ముస్లిములుగూడ చాలమంది సదావర్తి నిచ్చువారు గలరు ఇస్లాముల కిచ్చునట్లు హిందువులకు గూడ నిచ్చుచున్నారు లాహోరునకు కొంత దూరమున 'అమృతసరొ' మున్నది అచటనే సిక్కుమతస్థుల సువర్ణమందిరము గలదు తీర్థయాత్రికులపై, సాధువులపై పంజాబీలకు ప్రీతి మెండు సాధువుల కొఱకనేక అన్నసత్రముల నేర్పరచినారు పురుషులకన్న స్త్రీలకు దైవభక్తియు, దానబుద్ధియు నెన్నియో రెట్లధికమని చెప్పుట అతిశయోక్తి

కాజాలదు హృషీకేశములో గల అన్నసత్రము లెక్కువగా పంజాబీయులవే మన పూర్వీకులగు నార్యుల యోగ్యతయు, వర్చస్సును పొడుగైన శరీరమును వీరిలో మూర్తీభవించినట్లు చూపరులకు గోచరించును

అచ్చటనుండి వారిరువురు కాశ్మీరదేశమునకు వెళ్ళ దలంచిరి అది చాల మనోహరమై, శీతలమై యుండును మంచుకాలములో హిమము గడ్డకట్టి పోవును ఎంత వైరాగ్యము గలవారైనను ఆ కాలమున మంచి వెచ్చని కంబళి లేనిచో నచట జీవింపజాలరు ఇచట అన్నమును, గోధుమ రొట్టెయు మామూలు ఆహారముగ నుండును అందఱును తెల్లగను లేకనెఱ్ఱగను నుందురు ఇది భారతదేశముయొక్క శిరస్సనియే చెప్పవచ్చును ఇపుడు భారతభూమియొక్క యుత్తరభాగమువఱకు వెళ్ళితిమనుకొనిరి ఇచట నెక్కువ పంజాబీభాషయును, హిందీయును నందఱికిని దెలియును ఈ స్థలమునందంతటను విశేష దానధర్మములు గలవు ఇదియే పాండవపత్నియు, శ్రీకృష్ణకరుణకు పాత్రురాలైనట్టియు పాంచాలి జన్మించిన పుణ్యభూమి యని హృదయములో తలంచి యచటనుండి మఱల వెళ్ళిన మార్గము నుండి లాహోరునకు వచ్చి హరిద్వారము వైపు తిరిగిరి ఈ మధ్యలో కొన్ని సత్రములలో మొదట ఆదరించినట్లు ఆదరింపక క్రొత్తగ వచ్చినవారిని లోపలికి విడచిన తరువాత వారి దగ్గఱకు సత్రపు మేనేజరు వచ్చి మీరిదివఱలో వచ్చినవారు కారా? అని అడిగిన తర్వాత భోజనార్థము లోపలికి బంపిరి పూర్వముండిన ప్రీతి అపుడు కనుపించ లేదు అపుడు వారు యాచనావృత్తియొక్క దోషమును చక్కగ గ్రహించిరి యాచనవల్ల అమృతప్రాయముగా నుండు హృదయముగల దాతల మనస్సు విషముగా మారునట్లు గ్రహించిరి ''యాచనాంతంచ గౌరవం'' అను వాక్యమును జ్ఞాపకమునకు దెచ్చుకొనిరి అప్పటినుండి పూర్వము వెళ్ళియుండు మఠములకు గాని, ఆశ్రమములకుగాని వెళ్ళక క్రొత్తస్థలములకు వెళ్ళి ఒక పూట మాత్రము యుండే లాగున నిశ్చయించుకున్నారు ఇపుడు యాచనయొక్క దీనభావమున్ను అయాచన యొక్క గౌరవభావమున్ను తెలిసికొనడమైనది

క్రమమున సంచరించుకొనుచు నాశ్రమములను, తీర్థములను, క్షేత్రములను

దర్శించుచు కొన్నిరోజులకు మధుర, బృందావనము, గోకులము, గోవర్ధనములందు దర్శనాసక్తి గలిగి ఆచోటులకు వెళ్ళిరి ఈ యాత్రాస్థలము లధికముగా పవిత్రమగు యమునానదీ తీరమునందుంటున్నవి మధుర గొప్పపట్టణము యమునా నది యొడ్డున గలదు అచ్చట అనేక సత్రములు గలవు అచ్చటనుండి బృందావన మునకు వెళ్ళిరి గో కులము సామాన్యమగు పల్లెటూరు, గోవర్ధనగిరియు చాల పుణ్యమ యమ్మైనది బృందావనము ముఖ్యము అచట చైతన్య సంప్రదాయులగు సాధువులును, సాధు స్త్రీలును నెక్కువగలరు బైరాగులును, నద్వైత మతస్థులగు సన్న్యాసులును నుందురు నారీమణులలో నింత భక్తిగలవారు ప్రపంచమున మరెచ్చటను లేరు బంగాళాదేశపు మహిళామణులు పెక్కుండ్రు గలరు అనేక భజనమందిరములున్నవి గొప్ప సాధువులు గూడ నున్నారు శ్రీకృష్ణభక్తి యొకటియే వారికి మిక్కిలి ప్రీతి ఇచటెల్లపుడు ''రాధేకృష్ణ'' యని వినవచ్చుచుండును భక్తి తప్ప వేఱుపాయములు వీరి కిష్టములు కావు అంతేకాక వీరికి నమ్మకమును లేదు భక్తియొకటియే ముక్తి మార్గమునకు సులభోపాయమని వీరి ముఖ్యాభిప్రాయము శ్రీభగవద్గీత వీరికి ముఖ్య మయినది రెండవది భాగవతము దీనికి మించిన గ్రంధమును వారు చూడనే చూడరు

*భక్త్యామా మభిజానాతి యావాన్యశ్చాఽస్మి తత్త్వతః ।*
*తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥*

ఇది గీతాంతిమమగు నష్టాదశాధ్యాయములో నుండుటచే నిదియే శ్రీకృష్ణ సిద్ధాన్తమని వారు చెప్పుదురు భక్తిచే సర్వవ్యాపకత గలవాడను, సచ్చిదానంద ఘనుడనునగు నన్ను యథార్థముగ తెలిసికొనుచున్నాడు కాన పరమార్థము నెరింగి తదనంతరము నన్ను పొందుచుండును

కృష్ణచైతన్యులు బంగాళదేశము నందవతరించిన వారగుటయే వారికింత శ్రీకృష్ణభక్తి గలిగియుండుటకు కారణమని తోచుచున్నది రకరకములగు చిన్నవి, పెద్దవి గీతలు వారివద్ద గలవు

మఱియు నెవరికైనను భక్తివల్లనే యథార్థజ్ఞానము దెలిసికొనుటకును భగవత్ప్రాప్తి గలుగుటకు సాధ్యమగునని వారి నమ్మకము ఈ గీతావాక్యమే వారికి

పరమ ప్రమాణము, బృందావనమున మీరాబాయి ఆశ్రమ మిప్పటికిని గలదు దాని కార్యముల న్నియు నుదయపూర్ సంస్థానమునుండియే జరుపబడుచున్నవి

*''హరేరామ హరేరామ రామరామ హరే హరే ।*
*హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే ॥*

ఈ కలిసంతరణోపనిషత్తు నందుగల మంత్రమే వారి ముఖ్యజపము, మఱియు నేకాదశాధ్యాయమున గల

*నాహం వేదైర్నతపసా న దానేన నచేజ్యయా।*
*శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యధా*

నన్ను ఏవిధముగా జూచినవాడ వైతివో అటువంటి స్వరూపము గల నేను వేదముల చేత దర్శించుటకు సాధ్యుడను గాను, భక్తిహీనమగు తపస్సుచేతను జూచుటకు వీలుపడను నిర్మల భక్తిలేని దానముచేతగూడ దర్శించుటకు శక్యుడను గాను నిర్మలమగు భక్తిలేనిచో యాగము చేతగూడ దర్శించుటకు సాధ్యుడను కాను ''

*భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున ।*
*జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥*

ఓ యర్జునుడా! ఇట్లు విశ్వరూపినైన నన్ను భగవదేక నిష్ఠయైన భక్తిచేతనే యథార్థముగా దెలిసికొనుటకును, దర్శించుటకును, నాయందైక్య మొందుటకును, సాధ్యమగును దీనియందు''జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం'' అని మూడంతస్తులుగా చెప్పబడెను మొదట తెలిసికొనుట, రెండవది దర్శించుట, మూడవది ప్రవేశించుట అనగా భగవన్మయుడగుట, ఈ మూడును అనన్యభక్తివల్లనే సాధ్యములని వారి దృఢమైన నమ్మకము మఱియు ''కలౌ భక్తిఃకలౌ భక్తిః'' అని యందఱితోను జెప్పుచుందురు కలియుగమున భక్తి తప్ప ముక్తికి మఱి యే మార్గమును లేదని యీ వాక్యముయొక్క యర్థము

ఈ పుణ్యభూమి అందఱిచేతను చూడదగినది ఇచట వనితామణి

లందఱును సాధుస్వభావము గలవారగుటచేతను, దర్శింపవలసిన స్థలము లనేకము లుండుటచేతను, ధ్యాననిష్ఠల కత్యంతాను కూలమగు ప్రదేశమగుటచేతను, భారతీదేవి నెల రోజులు ధ్యాన భజన స్మరణలచే కాలమును గడిపిరి అచటనుండెడు కాంతామణు లందఱును భారతీదేవియొక్క నిర్విషయత్వమును, ఆత్మ సంయమమును, భక్తి, ధ్యానములలోఁగల తన్మయస్థితియు జూచి చాల యానందించిరి మఱియు నెల్లపుడును నిష్ఠలోనే యుండుటచేతను, నిరాశచేతను, దృఢవైరాగ్యముచేతను, శాస్త్ర పాండిత్యముచేతను నందఱును విస్మయము నొందిరి ఆ పరమ భక్తురాండ్రగు మానినీ మణులు పుణ్యభూమియగు నీ బృందావనమున నెల్లపుడు నుండులాగున భారతీదేవిని ప్రార్థించిరి అందువలననే యొకనెల రోజులచట నుండి ధ్యాన నిష్ఠలతో కాలము గడిపిరి ఆ స్థలము విడిచి వచ్చుట కిష్టము లేనివారైనను తమకు గల యాధ్యాత్మిక జ్ఞానములో గలిగియుండు సందేహము గొప్ప వ్రణమువలె బాధించుటచేతను, చేయవలసిన కార్యములు మిగిలి యుండుటచేతను, ఆ పరమభక్తురాండ్ర యనుమతిని బడసి కురుక్షేత్రమును దర్శింప కుతూహలము గలిగి యాత్రనారంభించిరి దారిమధ్యలో భారతీదేవి బృందావనములోఁగల మహిళా మణులయొక్క భక్తిని గుఱించియు, నన్న దానముల గుఱించియు రత్నమాంబగారితో చెప్పుచు తన కాస్థలము విడిచి వచ్చుట కిష్టము లేదనియు, దక్షిణదేశములో నట్టి పుణ్యభూమియు, నట్టి నిర్మల భక్తియు నెచ్చట గలదని మాట్లాడుచుండగా, యాత్రనారంభించి యొక సంవత్సరము పూర్తియై నదని జ్ఞాపకమునకు వచ్చినది ఇంకను జరుగవలసిన కార్యములెక్కువగా నుండుటచే ప్రయాణమును కొంత యెక్కువ జేసికొని శ్రీకృష్ణభగవానుడు గీతనుపదేశించిన పుణ్యభూమి యగు కురుక్షేత్రమును జేరిరి అచట గీతను మూడావృత్తులు పారాయణ జేసిరి ఆ స్థలమిపుడడవి ప్రదేశమైనది 5000 సంవత్సరములకు పూర్వము మహా క్షేత్రమై యుండవచ్చును కాలము మార్పుచే నిట్లు పరిణమించుటలో నేలాటి యాశ్చ ర్యమును లేదు

అచ్చటనుండి హరిద్వారమునకు ప్రయాణమై పోయెడి మార్గములో నానక్ సంప్రదాయులగు నుదాసీ సాధువులయొక్క యాశ్రమములును, గొప్ప

మఠములును, గురు ద్వారములును గలవు వారియొక్క దానశీలత గాంచిన దక్షిణ దేశీయులు సిగ్గు పడవలసియుండును సాధారణముగ నొక్కొక్క మఠము గొప్ప జమీందారుల స్థితికన్న నెక్కువగా నుండునని చెప్పవచ్చును అచ్చటచ్చట నూతన మతప్రచారకులగు నార్యసమాజస్థులను గూడ జూచిరి పంజాబు ప్రాంతములో నార్యమతస్థులు ప్రబలి యున్నారు క్రమముగ నడచుచు హరిద్వారము జేరిరి దీనికి విష్ణుద్వారమనియు పేరు గలదు అనగా నచ్చటనుండి హిమాలయము ప్రారంభమగుచుండును బదరీ నాథక్షేత్రము వైకుంఠమనియే జనుల నమ్మకము దానికిగోపురద్వారము వంటిది హరిద్వారము ఇది గంగాతీరమున వెలయుచున్నది దీనికి కొలదిదూరములో నార్య సమాజస్థుల గురుకులము గలదు అవటినుండి కొంత దూరమున కన్యాగురుకులము గూడ వెలుగుచున్నది ఈ ప్రదేశము డెహరాడూన్ జిల్లాలో జేరినది ఈ రెండు గురుకులములును శ్రీ దయానందస్వామిగారి యశ్రాంతమగు పరిశ్రమయొక్క ఫలితములు శ్రీ శ్రద్ధానందస్వామిగారే వీటిని స్థాపించినారు పూర్వీక ఋషులయొక్క జ్ఞాపకమీస్థలముల జూచువారికి గలుగుచుండును బ్రహ్మచారులయొక్క వేదపఠనము, నగ్నిపూజయు జూడదగినవి ఇచట మానవకల్పితమగు జాతిభేద పిశాచమునకు స్థానము లేదు ఈ దుష్టగ్రహమును దయానందుడు వేదప్రమాణ మంత్రములచే నుచ్చాటనము జేసి యాకాశమునకు పారద్రోలినాడు ఆ యతివర్యుడు గుణమున కాధిక్యమిచ్చెనే గాని కులమున కాధిక్య మీయలేదు సన్న్యాసాశ్రమమును, బ్రాహ్మణజాతిని యోగ్యత ననుసరించి గౌరవింతురు ఆర్యసమాజస్థులు బ్రాహ్మణులను, సన్న్యాసులను నిందింతురని యొకలోపము వారిపై జనులు చెప్పుచుందురు ఈ వాక్యము సరియైనది గాదని వారి యాచరణ వల్లనే గ్రహించుకొంటిమని భారతీదేవి సనాతనులతో వచించిరి కేవలము వేషములతో మాత్రము సన్న్యాసినిగాని, బ్రాహ్మణుని గాని వారు నమ్మరు

దయానందస్వామి గూడ సన్న్యాసిగానే యుండిరో ఇపుడు గూడ వారిలో సన్న్యాస పద్ధతులు గలవు అన్నము లభించునని దలంచెడు సోమరులకు వారు సన్న్యాసమీయరు ధర్మబోధనము జేయుట కర్హతగలవారికి మాత్రమే సన్న్యాసమిచ్చెదరు గురుకుల నిర్వాహకులు చాల గౌరవముతో జూచిరని భారతీదేవి

స్వయముగా జెప్పిరి గురుకుల నిర్వాహకు లొకయుత్తరము వ్రాసి యొక మనుష్యునకిచ్చి కన్యాగురుకులమునకు వారిని బంపిరి వారును స్త్రీలగుటచే కన్యాగురుకులము జూచుటకీ లాగున వీరు చేసియుండవచ్చునని తలంచిరి కాని వీరు సహాయార్థము మనుజుడు కావలయుననిగాని, యుత్తరమీయవలయుననిగాని వారిని కోరియుండలేదు పాదచారిణులై సంచరించుట వారి నియమమగుటచే నడచుచు కన్యాగురుకులము జేరిరి ఇది లోకౌన్నత్యమును వాంఛించు ప్రతివ్యక్తియు చూడదగినది ఎందరో బాలికలును, యువతులును, బ్రహ్మచర్య దీక్ష గలిగి వేదము పఠించుట, బ్రహ్మచారులవలె బ్రహ్మచారిణులును, నుపనయనము గలిగియుండుట, నగ్నిపూజను జేయుటయు జూడగా పూర్వకాలపు ఋషికన్యలు జ్ఞాపకము వచ్చెదరు వీరు వేదమునే ముఖ్య ప్రమాణముగా దలంతురు వీరిని జూచిన బృహదారణ్యకమందు జెప్పబడిన గార్గి జ్ఞాపకము వచ్చినది వేదవిద్యయం దెంతో గొప్ప జ్ఞానము గలుగుటచేతనే పండితుల మధ్య మహాపండితుడగు యాజ్ఞవల్క్యమహామునితో నా మహాత్మురాలు శాస్త్రవాద మును జేసియుండును చిన్నకాలమున బాలురుగాని బాలికలుగాని తల్లివలననే పోషింపబడవలసి యుందురు తల్లి జ్ఞానవంతురాలును,దైవ భక్తురాలును, జీవకారుణ్యవతియు గాకపోయినచో బాల్యమునుండి బిడ్డలకు సుగుణ సంపత్తియు, ధర్మశీలతయు, నిర్మలాచారము నెట్లు నేర్ప గలుగును? ఇచట నుపాధ్యాయపదవి యందుండు వారందరును స్త్రీలే ఇదివఱలో నిట్టి కన్యాగురుకులము నెచ్చటను జూడనందుచే మూడురోజులచటనే యుండిరి వీరు సనాతనమగు హిందూమతములో నుండువారే కాని వేరు మతస్థులు కారు ఏ విధముగా వైష్ణవులు, శైవులు మొదలగు షణ్మతస్థులును సనాతనులుగా నుంటున్నారో, వీరును నదేవిధముగ నుండువారే వీరికి వేదమే ప్రమాణము భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞానయోగతపస్సులు సనాతనులకువలె వీరికి గూడగలవు శివ జీవైక్యములో మాత్రమే కొంత భేదము గలిగియున్నది

ఇట్టి భేదములు నూతనములు గావు సాంఖ్యమతకర్తయగు కపిలమునికిని, యోగమతకర్తయగు పతంజలి మహర్షికిని శివజీవైక్యములో నభిప్రాయభేదము గలిగియున్నది ఆలాగున అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతకర్తలగు శ్రీశంకర

రామానుజ, మధ్వాచార్యులకును శివజీవైక్యములో భేదాభిప్రాయము గనుపించుచున్నది అట్లులైనను వారందఱును నేవిధముగా సనాతన హిందువులుగా పరిగణింపబడెదరో, అలాగుననే యార్యులను గూడ దలంచిన చాలును తక్కిన భేదములు స్వల్పములు వాటిని గొప్పవారెవరును ముఖ్యముగా దలంపరు ఆర్యులలో బ్రహ్మచర్య వ్రతమును, వేదపఠనమును, గాయత్రీ జపమును ముఖ్యములు ఇవి సనాతన ఋషులకు ముఖ్య ప్రియతమములు మూడురోజు లచటనే యుండి కన్యాగురుకుల వేదపఠనమును, అగ్ని పూజయు, బ్రహ్మచర్యపాలనమును, నింద్రియనిగ్రహమును, సాత్త్వికాహారమును జూచి యానందించిరి వారికి కావ్యశాస్త్రములలోను, పురాణములలోను ప్రీతి లేదు భారతీదేవి సంస్కృతములో సంభాషించుటచేతను, వ్యాకరణము పఠించి యుండుట చేతను,నుభయ గురుకుల కార్యనిర్వాహకులు చాల గౌరవించిరి మఱల హరిద్వారమునకు తిరిగి వచ్చిరి ఇచట గంగాతీరములో ననేక మఠములు గలవు పరమహంస సన్న్యాసుల నిచటనే చూడవలయును భూలోకములో నెచ్చటను నింత యెక్కువగా సాధువులు కనిపించరు దీనికి సమీపమున సనాతనుల ఋషి గురుకులవాస మొకటి గలదు ఇదియు సామాన్యముగా మంచి స్థితిలో నుంటున్నది కాని యార్యమతస్థులవలె నంత విశాలభావము లేదు వీరు జాతికి ఎక్కువ నాధిక్యము నిచ్చెదరేగాని న్యాయ బుద్ధితో పరీక్షించి గుణమున కాధిక్యము నీయక పోవుట వారికొక గొప్ప కొఱతయని తలంచవలయును

హరిద్వారమున శ్రీశంకర సాంప్రదాయులగు నద్వైత సన్న్యాసు లెక్కువ మంది గలరు ఇతర సంప్రదాయులగు సాధువుల మఠములును గలవు ఇచట కేవలము వాక్కుతో మాత్రమద్వైతమును జెప్పెడి సన్న్యాసులు గూడ కొందఱు గలరు మంచి తపస్సును, యోగాభ్యాసము గూడ గలిగిన వారీ సన్న్యాసులలో నున్నారు దైవభక్తి యును గలిగియున్నారు అద్వైత ప్రాప్తియే పరమపురుషార్థమని వీరి నమ్మకము నిష్కామకర్మ, దైవభక్తి, తపస్సు, యోగము ఇవి యన్నియు నద్వైత బ్రహ్మమార్గమునకు గొని పోయెడు మార్గము లనియే వీరి నమ్మకము వీరికి వేదముయొక్క శిరస్సనబడు వేదాంతమగు నుపనిషత్తులే ముఖ్యప్రమాణములు

శ్రీ వేదవ్యాసులు రచించిన బ్రహ్మసూత్రములకు శ్రీ శంకరులు చేసిన భాష్యమును ముఖ్యముగ పఠింతురు శ్రీ భగవద్గీతను గూడ పరమ ప్రమాణముగ నంగీకరింతురు వీరికి ప్రస్థానత్రయము ముఖ్య ప్రమాణము ప్రస్థాన త్రయమనగా ప్రయాణమునకు మూడు మార్గములని భావము

1 దశోపనిషత్తులు, 2 బ్రహ్మసూత్రములు, 3 శ్రీ భగవద్గీత ఇవి మూడును మోక్షమునకు మార్గములని తాత్పర్యము గొప్ప పండితులును, తపశ్శాలురు నిచట ననేకులు వసించుచున్నారు భారతీదేవికిగల సందేహము నిదివఱలో నెవరిని నడిగి యుండ లేదు ఇచట కొందఱి నడుగ దలంచినను నేకారణముననో మనస్సు పోలేదు దానివల్ల నీ జీవికి నెచట సంస్కారముండునో యచటికి సర్వేశ్వరుడు దీసికొని వెళ్ళునని నమ్మకము గలిగి యున్నందున నచట నా ప్రస్తావనను జేయ లేదు అచట కొన్ని రోజు లుండి, సాధువుల మఠములను సన్న్యాసుల మఠములను దర్శించుచు ధ్యానమును జేయుచుండిరి ఈ స్థలమున తపస్వినులగు పంజాబీ స్త్రీలు గూడ కొందఱుంటు న్నారు వీరి యాశ్రమములు, పురుషులతో సంబంధము లేక విడిగా నుంటున్నవి వీరును బ్రహ్మముహూర్తమున గంగలో స్నానమాచరించి ధ్యానమును జేసికొని గీతా పారాయణమును జేయుదురు చాలా స్థలములలో సాకారార్చన పూజాదులు గూడ గలవు ఈ యోగినులలోను, వేదాంత విచారణ గలవారును, సాంఖ్య తత్త్వ విశారదలును, అష్టాంగ యోగసాధకులును నగు వధూమణులు గలరు కాని మహాపండితు లగు యతివరులుండు ప్రదేశమగుటచే శాస్త్ర విచారాపేక్షగల వారందరు నచటికి వెళ్ళెదరు ఈ నారీమణులు గూడ పరమహంస పరివ్రాజకుల యాశ్రమమునకు వెళ్ళి శ్రవణమును జేయుచుందురు వీరిలో కూడ జడలు పెంచినవారును, కాషాయము ధరించినవారును గలరు వీరినందఱిని జూచినపుడు భారతీదేవిగారి హృదయ మానందముతో పొంగి పొరలుచుండెను అపుడిట్టి తలంపు భారతీదేవికి గలిగెను ''ప్రాప్తియుండిన యెడల, తల్లిగారు తనకీయ దలంచిన ధనము నంతయు దీసికొని యీలాటి యాశ్రమమును తన దేశములో స్థాపింపవలయును '' వెంటనే మనస్సుతో ''తొందర పడకుము నీవు దేనికొఱకు సమస్తమును విడిచితివో యది

ప్రాప్తించువరకు వెనుకకు తిరుగకుము ఇపుడు నీవు ఏ గొప్ప కార్యమును ప్రారంభించినను నిర్విఘ్నముగా జేయజాలవు ఈ ధర్మబుద్ధియు నొక విధమగు విఘ్నమని మరువకుము ఈలాటి కార్యముల జేయువారు లోకములో ననేకులు గలరు కాని వారాత్మశాంతి నొందక పోవుటచే నితరుల తాపత్రయాగ్నిని చల్లార్ప జాలకయు, తనకును సంపూర్ణ మగు నాత్మశాంతి దొరకకయు నున్నారు'' ని ధైర్యమును జెప్పి యా ప్రదేశమునంతయు జూచుచు, రాత్రులందు మాత్రము సాధుస్త్రీల మఠము లందు కొన్ని రోజులును, నపుడపుడు గంగాతీరమునందుండి ధ్యానము చేయుచును నొక మాసము దినము లొక క్షణమువలె గడపిరి

అచటినుండి హృషీకేశమునకు వెళ్ళిరి అచట గూడ ననేకాశ్రమములు గలవు అచటుండు ఆశ్రమము లన్నిటిలోను స్వర్గాశ్రమము గొప్పది అదియొక రాజసంస్థానమువలె నుండును హార్బరునందలి గిడ్డంగుల రీతిగ గోధుమ మూటలు, కందిపప్పు బస్తాలు, పంచదార బస్తాలు, నేతి డబ్బాలును, ఇతర భోజన పదార్థములును సమృద్ధిగ సమకూర్చియుందురు ఇది ప్రపంచములోగల సాధువులందఱికిని పరమేశ్వరుడు సమకూర్చిన ప్రదేశమా యని చూపరులకు తోచక మానదు ఇట్టి మహోన్నత కార్యమును ఏ మహారాజులుగాని, రాజాధిరాజులుగాని చేయజాలరు అయితే దీనియొక్క మూలకారకుడెవరని విచారింపగా దేశమును, జాతి మతమును, ఆశ్రమమును దెలియని ''కాలీ కంబల్ బాబా'' అను పేరుగల యొక మహాసాధు సంకల్పమని దెలియబడెను కాలీ కంబల్ బాబా యనగా నలుపుగల మోటు కంబళి మాత్రము పైన వేసికొని తిరిగెడు సాధువని యర్థము ఈ మహాపురుషుడు వ్రాసిన యొక గ్రంథము గలదు దాని పేరు ' పక్షపాతరహిత అనుభవప్రకాశ్ దీని నిప్పటికిని అనేకులు చదువుచుందురు వారి జీవిత చరిత్రము నప్పటి జనులూహించి రచించిన గ్రంథమొకటి గలదు అది హిందీ భాషయందున్నది

ఈ దివ్యపురుషుడు హృషీకేశములో చాలా కాలము తపస్సు చేసెను ఆకాలమున నచట అన్నసత్రములుగాని, సరియగు కుటీరములుగాని లేనందుచే సాధువుల దుస్థితిని జూచి దుఃఖించెడివారట తరువాత కలకత్తా మొదలగు

మహానగరములకు వెళ్ళి ధర్మోపదేశముల జేయుచుండగా ననేక శ్రీమంతులున్ను, రాజులున్ను శిష్యులైరి వారివల్ల గొప్ప ధనము సమకూర్చి యిట్టి ధర్మకార్యమును జేయించిరనియు మఱల పంజాబ్ దేశమునకును బొంబాయి ప్రదేశమునకు వెళ్ళి ధర్మోపదేశము జేయుచుండగా వారియొక్క దైవశక్తి కందఱును నచ్చెరువంది యచట గూడ ననేక శ్రీమంతులు, రాజులు గూడ శిష్యులుగ నేర్పడినందుచేనట్టి మహోన్నత ధర్మకార్యమును స్థాపించి యాచంద్రార్కముగా జరగేలాగున కమిటీ నేర్పఱచి పిమ్మట వారు పరమసమాధి నొందిరని చెప్పుదురు

ఈ స్వర్గాశ్రమ మొకటి మాత్రము కాదు హరిద్వాము నుండి బదరి కాశ్రమ మువఱకు వీరి సత్రములు గలవు ఈ మహానుభావుని కరుణ లేక పోయినచో హృషీకేశముననింత మంది సాధువులు తపస్సు చేయుటకును, బదరీనాథ్ క్షేత్ర దర్శన మునకు యాత్రీకులు పోవుటకును సాధ్యము కానేరదు ఏ జాతివార్కైనను నచట అన్నమునకు కొరత లేదు ఇటువంటి స్థలము భూలోకములో మఱి యెచటను లేదనుట యతిశయోక్తి కాజాలదు ఆ సాధువులయొక్క ప్రార్థన నుల్లంఘింపజాలక చంటిబిడ్డల యభీష్టమును త్రోసివేయ తల్లికి నొల్లకానట్లు శ్రీ అన్నపూర్ణాదేవి యచటనే యుండి పోయెనా యని చూపరులకు తోచకమానదు సాధువులకు కావలసిన కుటీరములును, పుస్తకములును, కంబళ్ళను, కమండలములను, వస్త్రములను, దీపమునకు నూనెయు, రోగుల కౌషధమును నాశ్రమమువా రిచ్చుచుందురు కాని సంప్రదాయముతో గూడిన వారును, శమదమాదులు గలిగినవారుగా నుండవలయును అట్టి వారికి మాత్రమే కుటీరములు దొరకును ఆశ్రమ హద్దులోపల స్త్రీలకు కుటీరము లియ్యరు భోజనసమయమున సుమారు మూడు వేలకు తక్కువ కాకుండునట్లు సాధువులు వచ్చెదరు స్త్రీలకు సదావర్తి నిచ్చెదరు అనగా వంటసామగ్రి నిచ్చెదరు భోజనకాలమున సాధువులకు మాత్రముగాక బీదలకు గూడ భోజనము పెట్టబడును రెండు మూడురోజు లుండ దలచిన యాత్రీకులకు భోజనము పెట్టెదరు అచటనుండి సదావర్తి దీసికొని వండుకొని భుజించి ధ్యాననిష్ఠాదులను సలిపెడు స్త్రీలు గూడ సమీపమున నాశ్రమము కట్టుకొని యున్నారు అచ్చట

గూడ సాధువులగు స్త్రీలకు గూడ భోజనము గలదు ఇచట ననేక పండితులును, యోగసిద్ధిని పొందినవారును నుంటున్నారు అచట భారతీదేవి యొక్క సందేహమును నిర్మూలన మొనర్చ శక్తిగల యనేక తాపసులు గూడ నున్నారు కాని కొంతకాలము వారి దగ్గఱనే యుండి వేదాంత విచారణయు, మనన నిది ధ్యాసనములనెక్కువ కాలము చేయవలసియుండుట చేతను, తీర్థయాత్రలు పూర్తిచేయవలయునని సంకల్ప ముండుటచేతను, సందేహనివృత్తి విషయమై యెవరిని నడుగ లేదు కాని యిచట గొప్ప యోగు లెవరైన యున్నారాయని, అచటుండు సాధువుల నడుగగా గొప్పవారియొక్క పేర్లను దెలుపుచు, భారతీదేవిగారి స్వభావమును గ్రహించి కేరళదేశస్థురాలని తలంచి మీకు దగిన పరమగురుడు కలియుగ వైకుంఠమనబడు శ్రీ వేంకటాచలమున నొకరున్నారని చెప్పిరి

అప్పటినుండి ఆ ప్రాంతములోనుండు మహాత్ముల దర్శనము జేయుచు వారి బోధలను వినుచుండిరే కాని తన సంశయనివృత్తి కొఱకెవరితోను ప్రస్తావించి యుండ లేదు అనేక మంది మహాత్ములు తపస్సు చేసిన ప్రదేశమగుటచే హృషీకేశమున నెచట గూర్చుండినను అప్రయత్నముగానే మనస్సు నిర్వికల్ప సమాధిలోనికి సులభముగా వెళ్ళుచుండెను "వేలకొలది మహాత్ముల కన్నమిడిన వారెంత పుణ్యాత్ములో" యని భారతీదేవి రత్నమాంబగారితో ననుచు "దక్షణదేశమున నెందరో శ్రీమంతులును, రాజులును, జమీందారులును నుండియు నొకాశ్రమమైనను సరియైనది లేదుగదా? మఱియు నీ హరిద్వారమున, హృషీకేశమున, కర్ణాటక, ఆంధ్ర, ద్రావిడ, కేరళదేశస్థు లగు సన్న్యాసులెంద రోయున్నారు భారతదేశములో గల సమస్తదేశము లందుండు సాధువులును నిచటనే యుంటున్నారు ఈ దాక్షిణాత్యులకు ఆ దేశములలో సరియైన యాశ్రమములు లేక పోవుటవలన గదా! యిచ్చటుండు టకు కారణము ఈ పుణ్యాత్ము లంద ఱిచటనుండుటచే నా దేశములో ధర్మబోధకులు లేక పోవచ్చును " అని చెప్పిరి మూడు నెలలు హరిద్వార హృషీకేశములలో కాలము గడిపి సమాధి నిష్ఠలను మఱింత బలపఱచి యెల్లపుడు నచటనే యుండదలంచినను సంస్కారమనెడు త్రాడుకట్టి లాగుకొని పోవునట్లు బదరికాశ్రమము నుద్దేశించి

ప్రయాణమైరి

హిమాలయ పర్వత పంక్తులలో పడు సూర్యోదయాస్తమయ కాలములలోని భాస్కరుని కిరణములచేనైన హిమావృత పర్వతాగ్ర ప్రకాశము జూడవలసినదే కాని చెప్పనలవి కాదు కాలీకంబల్ బాబా సత్రము వారచ్చటచ్చట బదరీనాధ యాత్రీకులకు సత్రముల నిర్మించి భోజనాది సౌకర్యములను సమకూర్చియున్నారు నెమ్మదిగ పర్వత ములనెక్కుచు దిగుచు ధ్యానము జేయుచు నడచుచు కొన్నిరోజులకు పుణ్యభూమి యగు బదరికాశ్రమమును జేరిరి శ్రీవ్యాసాది ఋషులు తపంబొనర్చిన వనములు, గుహలు దర్శించుచు శ్రీశంకరాచార్యులు వ్యాససూత్రమునకు భాష్యమొనర్చిన స్థలమును దర్శించిరి అచట భారతీదేవిగారు బ్రహ్మసూత్రములను పఠించుచు కొన్నిరోజులు కాలము గడిపిరి శ్రీ మధ్వాచార్యులు వ్యాససూత్రములకు భాష్యము జేసి శ్రీ వ్యాసులకు జూపిన ప్రదేశ మిచట గలదు త్రిమతస్థుల మఠములుగాక, నింక ననేక సంప్రదాయములవారి మఠములు గూడ నచట గలవు శంకరులు భాష్యమొనర్చెడి కాలమున శిష్యులు చలిని యోర్వజాలనందుచే వారి కొఱకు శంకరుల దివ్యప్రభావముచే కల్పింపబడిన యగ్ని గుండమను పేరు గల వేడినీరు గలిగిన ఒక తీర్థము గూడ నచట నున్నది అది యుండుటవలననే యిప్పటి మనుష్యు లచట నివసించ గలుగుచున్నారు అచట స్నానమొనర్చి శ్రీబదరీనారాయణ దర్శనము చేసికొని బ్రహ్మకపాలతీర్థములో గతించిన తమ వంశీయులందఱికిని, పిండ తర్పణముల భక్తితో జేయవలయునని మనస్సులో నుభయులును దలచిరి పురోహితులు సంకల్పము ప్రారంభించునపుడు భారతీదేవి మేము సంకల్పరాహిత్యము జేయ తలంపు గలవారము మాకు కావలసినది సంకల్పము గాదు నిస్సంకల్పమని చెప్పగా వీరియొక్క వర్చస్సును ప్రభావమును ప్రశాంతమును జూచి ఆయా తీర్థవాసులలో పెద్దవారును కొంత బ్రహ్మనిష్ఠగలవారును నగు నొక పురోహితుడు ''తల్లులారా! మిమ్ములను జూచునపుడే మీయొక్క తపస్సు గోచరించుచున్నది మీకు నిస్సంకల్పము గలుగునట్లును, మోక్షసిద్ధి గలుగునట్లును, ఈ బదరీనారాయణాశ్రమమున నీ బ్రహ్మకపాలములో సంకల్పము జెప్పెద మీ

వద్ద ధనమేమియు లేదని మీ ప్రవర్తనవలననే దెలియవచ్చుచున్నది మీ వంటి పుణ్యజీవులు, తపస్వినులగు వారికి సంకల్పమును జెప్పెడి భాగ్యము గలిగినందులకు నాజన్మము ధన్యమైనదని తలంచుచున్నానని చెప్పగా, భారతీదేవి ''నాయనా! మీ వంటి వారిచట కొందరు సంకల్పము జెప్పునపుడు ''ఆచంద్ర తారార్కం సంసారాభివృద్ధిరస్తు'' అని చెప్పెడు వాక్యమువిని భయముగలుగుచున్నది ఇది సిద్ధక్షేత్రము గనుక నిచటనేమి సంకల్పించినను నట్లు జరుగవచ్చును కావున మాకాలాగున జెప్పవలదు అని మిమ్ములను ప్రార్థించుచున్నాను మఱియు నేను బ్రహ్మచారిణిని మీరు పుత్రపౌత్రాభి వృద్ధిరస్తు'' అని చెప్పునపు డితర పురోహితులును ''తథాఽస్తు తథాఽస్తు'' అని చెప్పెదరేమో యని చాల భీతి గలుగుచున్నది''నెను భారతీదేవి యొక్క పైవాక్యములను విని వృద్ధ బ్రాహ్మణుడు ''దానివల్ల మీరు భయపడనక్కర లేదు ఈ స్థలము సిద్ధక్షేత్రమైనను, నాత్మశుద్ధియు, సంకల్పసిద్ధియు లేనివారియొక్క వాక్యములు నిష్ఫలములు అవి లోపల బీజములు లేని విత్తనములవంటివి మఱియు వీరి వాక్యములు తుమ్మెదలు రంధ్రము జేసిన వెదురునుండి గలిగెడు నాదముల వంటివే గాని శ్రీకృష్ణుని వేణునాదమునుండి గలిగిన ధ్వనులవంటివిగావు ఇవి మందు వేసి గుండు వేయక కాల్చిన తుపాకి శబ్దము వంటివేగాని మఱేమియు వీటియందు లే''దనెను విప్రుని వచనంబుల నాకర్ణించి భారతి, రత్నమాంబగార్లు మిక్కిలి సంతోషము నొందిరి అంతట భూసురోత్తముడు మఱల ''బిడ్డలారా! ఆత్మశుద్ధియు, సంకల్పసిద్ధియు గలిగి సత్యము సంభాషించెడువారి యొక్క వాక్యము లిచటనే గాదు మరెచటనైనను ఫలించును '' అని పలికెను ఈ వాక్యములను విని సంతసించి, పరలోకగతులైన తన వంశీయ పితరులందఱికిని పిండ తర్పణ మొనర్చిరి

తరువాత భూలోకములో ననాథులై తర్పణము చేయుట కెవరును లేని పితృదేవతలందఱికిని తర్పణమిడిరి అప్పుడు భారతీదేవి గంభీర భావముతో ధ్యానా రూఢస్థితిలో మనస్సును నిల్పి యిట్లు పలికెను ''వారి వారి గోత్రములలో వారికి వారు మాత్రము తర్పణమిడిన ఆ పితరులకు జెందునుగాని యితరులకు జెందదను వాడుక గలదు అది మామూలు మనుజులకు సంబంధించినదే గాని మూడు లోకము లలోగల సమస్త ప్రాణులును సర్వేశ్వరునినుండి పుట్టినవనెడు నమ్మకము

గలవారికి సంబంధించినది కాదు అట్టివారు చేసెడు తర్పణమునకు బ్రహ్మతర్పణమని పేరున్నది కావున మనుజులు మాత్రము కాదు పశుపక్ష్యాది సర్వప్రాణుల గోత్రములోను నేను పుట్టినాను దీనికి బ్రహ్మ గోత్రమని పేరు కావున నే నీ బదరీనాథసిద్ధక్షేత్రములో, బ్రహ్మకపాల దివ్యతీర్థములో జేయుతర్పణము చరాచర ప్రాణికోట్ల కన్నిటికిని జెందునుగాక'' యని మనస్సునందేకాగ్రభావముతో నుచ్చైః స్వరముతో పలికి తర్పణమిడిరి భారతీదేవి ఈ వాక్యముల నుచ్చరించి చిత్తైకాగ్రతతో నిశ్చేష్టురాలై నిలుచుండుట జూచి యచటనుండు బ్రాహ్మణు లందఱును, సాధువులందఱును, యాత్రికులును, పర్వతము చుట్టు చెక్కిన విగ్రహములవలె కొంతసేపు నిశ్చలురై యుండిరి ఇదివఱలో నిట్టి విశాలభావముతో, విశ్వప్రేమతో, లోకైక కుటుంబ భావముతో సంకల్పించి వేదమంత్రము నుచ్చరించి తర్పణ మిడిన వారిని కనివిని యుండలేదని యచటనుండు బ్రాహ్మణులును, యాత్రికులును జెప్పుకొనుచు విస్మయముతో, చాతకపక్షిసమూహము నీల మేఘమును నిశ్చేష్టతతో జూచుచున్నట్లు భారతీదేవిని జూచుచుండిరి మరియు,

*అయం బంధురయం నేతి గణనా లఘుచేతసామ్ ।*
*ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥*

అనియున్న శాస్త్రవాక్యమీనాడు సార్థకత బొందుటను జూచితిమిగదా! యని పురోహిత బ్రాహ్మణులు చెప్పుకొనుచుండిరి (వీరు మావారు, వీరు మావారు కారని గల భావమల్పబుద్ధిగలవారిది, ఉదారచరితులు విశాల హృదయులగు వారికీ లోక మంతయు సొంతకుటుంబమువలె నుండును) వెండియు నీ బదరీనాథ క్షేత్రమున మాత్రమే తల్లిదండ్రులు జీవించియుండినను గూడ వారికి జేయువలసిన తర్పణాదుల జేయుగలవెూ? లేదో! యని సందేహముగలవారు వారి జననీజనకులకు తర్పణమిడవచ్చును మఱియు తనయొక్క స్వాత్మపిండమును గూడనిచటనే జీవించియున్నపుడు చేయవచ్చునని వినియుండుటచే నచటనుండు బ్రాహ్మణోత్తములను విచారించి చేయుట మంచిదని యెంచి అడుగగా, ఈ స్థలములోను, శాస్త్రోక్తముగ సన్న్యసించెడు

సమయమున నితర స్థలములలోను మాత్రమే యాత్మపిండమునకు విధి గలదని చెప్పిరి మాతాపితరులకు పుత్రుడు లేడని సందేహము గలుగునేమో యని తలంచి యా ఋణము గూడ వారు జీవించి యుండగనే తీర్పవచ్చునని విశ్చయించి, జననీ జనకుల యొక్కయు, తనయొక్క పిండతర్పణాది క్రియలను భారతీదేవియు శ్రీరత్నమాంబ గారును జేసిరి అపుడు భారతీదేవి రత్నమాంబగారితో మనము గొప్పదియగు నొక ఋణమును తీర్చినవారమైతిమి కనుకనే పుణ్యాజీవులు జ్ఞాన సంపన్నులు జన్మించినచో నావంశ పితృదేవత లానందింతురని చెప్పెడు శాస్త్రరహస్యము అనేక మంది ఋషులు తపస్సు చేసిన పుణ్యభూమి యగుటచే నొక మండలమురోజు లచటనే యుండెదమని నిశ్చయించి యా బదరీనాధ క్షేత్రములో నుండిరి అపుడా బదరీనాధములోగల యాశ్రమములను తీర్థములను దర్శించుచుండిరి శ్రీ బుద్ధదేవుడు చెప్పినట్లు తాను వెళ్లునపుడు తనతోగూడ నీడ వెళ్ళునట్లు, జీవుల కర్మయు వెంబడించు ననునది భారతీదేవిని జూచిన వారందఱును వారిని జనులు పరమాదరణతో నాదరించుటను చూచి, ఇదియే దృష్టాంతమని చెప్పుకొనుచుండిరి

తల్లియొక్క ఛాయ పుత్రపుత్రికలతోను, గురుని నీడ శిష్య ప్రశిష్యులతోను, భర్తఛాయ భార్యతోను, భార్యఛాయ భర్తతోను వెళ్ళునట్లు, వారివారి కర్మ, మంచిది గాని చెడ్డది గాని వారితో గూడ వెళ్లునేగాని యితరుల వెంట వెళ్ళదు కనుకనే ''ఎవరికివారే యమునాతీరే'' యని చెప్పుటకు కారణము, దీనివల్ల పతిసేవచే భార్యకును, గురు సేవచే శిష్యులకును, మాతాపితరులసేవచే బిడ్డలకును ప్రయోజనము లేదని తలంపవలదు వారిసేవచేనెంత పుణ్యము నార్జింతురో యది వారివారితో గూడనే యుండును లేనిచో లేదు బదరీనాధస్వామి దర్శనాదులనొనర్చి హృషీకేశ హరిద్వారముల ద్వారా తిరిగివచ్చి నైమిశారణ్యమునకేగ యాత్ర నారంభించిరి అనేక వనములు, పల్లెలు, పట్టణములు, తీర్థములు, అచ్చటచ్చట గల పుణ్యాశ్రమములు మొదలగు వాటిని దర్శించుకొని నైమిశారణ్య పుణ్యభూమిలోనికి జేరిరి

ఇదియే శ్రీసూతమహర్షి 12 సంవత్సరములుండి శౌనకాది మునులకు

నష్టాదశ పురాణములు జెప్పిన ప్రదేశము ఇది గోమతీపుణ్యనదీ తీరమందు గలదు పురాణములో వర్ణించినంత పరిస్థితి యిప్పుడు లేదు వేలకొలది సంవత్సరములు గడచినందుచేతను, ప్రకృతి పరిణామముచే మార్పు గలుగుటచేతను నీ లాగుననుండవచ్చును అయినను కొన్ని ఆశ్రమములు, మఠములు ఇప్పుడు గూడ గలవు ఎక్కువ మంది సాధువులును బైరాగి సంప్రదాయులును నెల్లపుడును శ్రీరామ జపధ్యానపరాయణులై యుందురు ద్గలనే యొక చిన్న గ్రామము గలదు పూర్వమిది తపోవనమై యుండినందుకిపుడు కూడ ననే కాధారములు గలవు యాత్రికులగు సాధువులకు నిచట నేమియు కొరత లేదు బ్రాహ్మణేతరుడగు శ్రీ సూతమహర్షి, బ్రహ్మర్షి, రాజర్షి, దేవర్షులగు నైమిశార ణ్యావాసులైన యరువదివేల ఋషులమండలము మధ్య నక్షత్రమండలము మధ్య శరత్కాలపూర్ణిమ నాటి చంద్రునివలె తేజరిల్లుచు పురాణముల జెప్పిన పుణ్యభూమి యగుటచే మూడురోజులచట నుండి, పిమ్మట శ్రీరామచంద్రజన్మభూమియగు నయోధ్యానగరములోనికి వచ్చిరి ఇచట ''సీతారాం సీతారాం'' అని పావన శబ్ద మంతట రేయింబగళ్లు ఎల్లపుడును వినబడుచునే యుండును రాత్రియని, పగలని భేదము లేక తారకమంత్రము వినబడుచునే యుండును ఇచ్చట ననేకాశ్రమములు గలవు వీటియందు కొన్నిటిలో వందలు వందలు శ్రీరామభక్తపరులగు బైరాగి సాధువులున్నారు వీరందఱును గొప్ప విరాగులు సదా శ్రీరామ ధ్యానపరాయణులై కాపీనధారులై కొందరున్నారు చాల సత్రములను అతిధులకును, యాత్రికులకును, సాధువులకును, శ్రీమంతులగు మార్వాడీలును, రాజులును కట్టించియున్నారు స్వయంపాకము జేసికొనువారికి సామగ్రి నిచ్చెదరు ఇపుడుగూడ నిక్ష్వాకు సంతతి సూర్యవంశపు రాజులనగరము ( రాజభవనము) అచట గలదు ఇచట శ్రీరామ మందిరమునకన్న నాంజనేయ క్షేత్రమే గొప్పది పూజాదులు హనుమంతస్వామికే యెక్కువ జరుగుచుండును దీనివల్ల భగవంతునికి భక్తులపైగల గౌరవము ప్రీతియు ద్యోతకమగుచున్నది ఇది మహావిఖ్యాతి గల సరయూనదీ తీరమందు వెలయుచున్నది ఇప్పటికిని జనులు చాల భక్తిగలవారు గలరు శ్రీవాల్మీకి మహర్షి శ్రీ అయోధ్యను గుఱించి వర్ణించిన దానిలో చాలవఱకు నిపుడుగూడ గనుపించుచున్నది ఇప్పటికి మూడు యుగములు గడిచినందుచే నీ మార్పు

సహజముగానే యుండవచ్చును భారతీదేవిగారి కులదైవము శ్రీరామచంద్రుడగుటచే పదిరోజులవటుండి, శ్రీరామ మంత్రమును దినమునకు బదివేల చొప్పున లక్ష జపము నావృత్తి జేసెను సరయూనదీ తీరము నందేకాంత ప్రదేశమున వృక్షచ్ఛాయలోనే రేయింబవళ్ళుండి యీ జపము పూర్తి జేసెను పగలొకపూట మాత్రము సత్రములో భోజనము జేయుచుండెను

తరువాత నచటనుండి ప్రయాగకు వచ్చి చేరిరి ఇచటనే గంగా, యమునా, సరస్వతీ నదులు సంగమమగు త్రివేణి గలదు శ్రీ రామేశ్వరాభిషేకమున కిచటి నుండియే తీర్థము దీసికొని వెళ్లుదురు ఇది చాల పుణ్యభూమి ఇచట బ్రహ్మనిష్ఠులకు చాల సత్రములు గలవు అనేక శ్రీమంతులు నివసించుచున్నారు దీనికే "అలహాబాద్" అని పెరు మూడురోజులా ప్రయాగతీర్థములోనే నివాసము నేర్పఱచుకొనిరి అచటను పితరులకు తర్పణాదులను జేసి రెండు కాశీ కుప్పెళ్ళలో తీర్థము తీసుకొని భద్రపఱచి శ్రీ వారాణాసిపురమునకు ప్రయాణమై యచటకు జేరిరి ఈ పట్టణము శివ పురాణములో వర్ణించి యుండు దానికంటె నెక్కువగా యున్నదేగాని తక్కువ లేదు! ఇచ టనేకులు సన్యాసులు గలరు అనేక సంస్కృత కళాశాలలును, విశ్వవిద్యాలయమును నీ పుణ్యక్షేత్రమునందు గలవు గంగ కాశీ పట్టణము నానుకొని చంద్రరేఖాకారముగ ప్రవహించుచున్నది మొదట మణికర్ణిక యందుస్నాన మాచరించి తన వంశీయులగు పితరులకు శ్రాద్ధతర్పణాదులను సలిపి గంగాస్నానము జేసి, తీర్థము దీసికొని వెళ్ళి శ్రీ విశ్వనాథస్వామి కభిషేకము జేసి దర్శనము జేసికొనిరి ఈ విశ్వేశ్వరున కందఱు నభిషేక పూజాదులను జేసికొన వచ్చును దీనివలన నీశ్వరపూజాదుల కందఱును గూడనర్హులని బోధపడుచున్నది అంతేగాక నీశ్వరుడందరిని సమానముగా జూచు వాడని గోచరించును

అప్పటికి చాతుర్మాస్యవ్రతము సమీపించినందుచే ఆ నాలుగు నెలలు శ్రీకాశిలోనే గడప నిశ్చయించు కొనిరి కొన్ని సంవత్సరములకు పూర్వ మీ పట్టణమున 365 అన్న సత్రము లుండెనట ఇప్పుడు కొన్నికొన్ని సత్రములను గలిపి యొకటిగా జేసిరనియు, రమారమి యిప్పటికిని 100 అన్నసత్రములు కొఱత లేక జరుగుచున్నవనియు జెప్పుదురు కొన్ని మైళ్ళ విస్తీర్ణము గల పురమగుటచే

ననేక ప్రదేశములలో సత్రముల గట్టియున్నారు భరతఖండములోగల ముఖ్యులగు రాజు లందఱు నచట నన్నసత్రముల నిర్మించినారు గంగాతీరమందును, విశ్వనాథ క్షేత్ర మందును అన్నపూర్ణామందిరము దగ్గఱను గొప్ప గొప్ప సత్రములు గలవు ఈ యన్నపూర్ణాదేవి గుడియు చాల సుందరముగా నున్నది ఇచటను విశ్వేశ్వరాలయము నందును ననేక పండితులు, సన్న్యాసులు పారాయణను జేయుచుందురు ఇచ్చట భారతదేశమందు గల సమస్త ప్రాంతీయ జనులును, సన్న్యాసులును, పండితులును నివసించుచున్నారు. ఇదియుగాక మండలేశ్వరులగు పీఠాధిపతుల యస్థానములు గొప్పవి గలవు ఈ పీఠాధిపతులలో ముఖ్యులందఱును వేదాంత శాస్త్రమునం దాచార్య పరీక్షలో నుత్తీర్ణులైన వారే వీరి మఠములందు గూడ చాల మంది యతీశ్వరులు గలరు అందఱును గూడ మంచి వర్చస్సునను, సంయమమునను గలిగి శోభాయమానములగు కాషాయాంబరముల ధరించిన వారలే వీరికి తపస్సునకన్న, యోగమున కన్న, విద్యయం దెక్కువ యభిమానము గలదు

ఈ కాశి యొకటి మాత్రముగాదు ఉత్తరదేశము నందంతటను సన్న్యాసులు సాధువులు పగలు 11 ఘంటలవఱకు నేమియు భుజింపరు ధ్యానము, ఉపనిషత్పఠనము, బ్రహ్మవిచారము, పూజాదుల జేయుచుందురు దక్షిణదేశము నందుండు సాధువులవలె నుదయమున నిష్ఠాకాలమున నాష్టచేయరు నిష్ఠాసమయమున నాష్ట యేర్పాటు చేసినందుచేతనే వీరి నిష్ఠయంతయు నష్టమై పోవుటకు కారణమైనది మఱల కొందఱు మాత్రము రాత్రులలో రొట్టె మొదలగున దేదేని భుజింతురు చాలమంది సన్న్యాసులు భుజింపరు పాలుగాని, పండ్లుగాని కొందఱు భుజింతురు రాత్రులలో నేమియు తిననివా రనేకులు గలరు మధ్యాహ్నము నుండి ప్రతి మండలేశ్వర మఠములోను, శాస్త్రశ్రవణము జరుగుచుండును గంగా తీరములో సాయంకాలమున ననేక ప్రదేశములలో పురాణముల జదువువారును, హరకథాదుల జెప్పెడివారును గలరు ఆ మహాపట్టణమున గృహస్థ జనులకన్న సన్న్యాసులు ఎక్కువగా నున్నట్లు దోచును ఈ నగరము జూచువారికి సన్న్యాసులకును, బ్రహ్మచారులకును, విద్యార్థు లకును, పుట్టినిల్లు వంటిదా యని తోచక మానదు

దీనియందే మాత్రము గూడ నతిశయోక్తి లేదు ఎచట జూచినను దేవళములు, మఠములు, సాధువులు నేత్రమున కానందమును గొలుపుచుందురు మహామహోపాధ్యాయులగు పండిత ప్రకాండులు గూడ నెందరో గలరు ఈ పట్టణము శ్రీ కాశీ రాజుచే పాలింపబడుచున్నది ఎచ్చట జూచినను తపోవనములగు చిన్నచిన్న యుద్యానవనములను సాధువులుండుటకు నిర్మించియుందురు అచట వేదాంత విచారణ కాధిక్యము ఏ తోట జూచినను తాపసోత్తముల ఆశ్రమములచే ప్రశాంతముగ గనుపించుచుండును భారతఖండ భూపాలురచే నడుపబడుచుండు సంస్కృత పాఠశాల లెన్నియో గలవు మధ్యాహ్న సమయమున నెచ్చటికేగినను భోజనము దొరకును జటాకాషాయాదుల ధరించి విభూతిని బూసికొని రుద్రాక్షమాల గలిగియుండు నారీమణులు గూడ గలరు వీరికిని ఆశ్రమము లున్నవి హరిద్వార హృషీకేశములలో వలె నిచటను తపస్వినులు యోగినులు నున్నారు ఇచట సన్న్యాసులుండెడు మఠములలోగాని, ఆశ్రమములలోగాని స్త్రీ లుండరు ఈ నియమమును చాల జాగ్రత్తతో పాలించుచున్నారు అదే విధముగ సాధు స్త్రీలుండు మఠములలో పురుషులు గూడ నుండరు వేదాంత శ్రవణకాలములో మండలేశ్వరుల మఠములలో సాయంకాలము వఱకు స్త్రీ లుండవచ్చును బ్రహ్మ నిష్ఠకు, బ్రహ్మ విచారణకును ననుకూలముండినను ఎపుడు జనబాహుళ్య మధికముగా నుండుటచే నేకాంతత చాలవఱకు తగ్గినది కాని సంప్రదాయ బద్ధులగు సాధువులకును, బ్రహ్మచారులకును, బ్రాహ్మణులకును మాత్రమెక్కువ సౌకర్యము గలదు తక్కిన వారి నంత శ్రద్ధతో జూడరు విద్యాలయములలోను, అన్నసత్రములలోను బ్రాహ్మణేతరులకు అనుకూలము చాల తక్కువగా నున్నది దీనివలన గుణపరిశీలనము, విశాలభావము లేక, కులపరిశీలన సంకుచిత భావము చాలమందిలో నున్నట్లు ప్రతీతమగుచున్నది

ఇచట సాధువులనగా దక్షిణ దేశీయులవలె స్వయముగా సాధువేషము గలిగి ''నేను గూడ సాధువు'' నని చెప్పునట్లు కాదు విధిప్రకారము ఆచార్యముఖమున సన్న్యసించిన వారుగా నుండవలయును బ్రాహ్మణులకు మాత్ర మేర్పడిన

సత్రములలో వచ్చినవారిపై సందేహము గలిగినచో నతి రహస్యమగు ప్రవర నెట్లడుగుదురో, ఆలాగున నూతనముగా మఠమునకు వెళ్ళిన వారిలో యోగ్యత లేని వారిని సన్న్యాస పద్ధతుల నడుగుదురు బ్రాహ్మణులందు ప్రవరయెంత గోప్యమో, వీరియందు ''ప్రేష'' మంత్రముగూడ నంత గూఢముగా నుండును బ్రాహ్మణులయందు వేద, గోత్రసూత్రాదులేలాగున సామాన్యములుగా నుండునో, ఆలాగున యతిసంప్రదాయములో గల ఆచార్య, మఠ, గిరి, పురి, సరస్వతి నామము లంత ముఖ్యములు గావు అయినను నెవరిపై సంశయము గలుగునో వారి నడిగిన యెడల వారు విధి ప్రకారము జెప్పనిచో నతనికి మఱల కాశి యందే మఠమునందు గూడ ప్రవేశించుట కవకాశముండదు ఆతడు యాచనావృత్తితో జీవింపవలసి యుండును అట్టి యాత్రికులకు గూడ భోజనము పెట్టెడు స్థలము లనేకములు గలవు ఆ సన్న్యాస పద్ధతి విధి ప్రకారముగ జెప్పినచో నతడు దుష్టుడైనను, శిష్టుడైనను వానికి కాశియందే కొఱతయు గలుగదు అట్లు జెప్పని వారెంత మహాత్ములైనను వారిని సరిగా చూడరు

చాతుర్మాస్యవ్రతమును కాశిలో గడపుచు నిదివఱలో గురూపదిష్టమగు శివ మంత్రము నక్షరలక్షలు గంగాతీరమునందును, శ్రీ విశ్వనాథ క్షేత్రమందును, శ్రీ అన్నపూర్ణామందిరమునందును పూర్తిని చేసిరి ఒక్కొక్కరోజున నొక్కొక్క పుణ్యతీర్థమునందు స్నానము జేసి ధ్యాన జపాదుల నాచరించుచు, చాతుర్మాస్యవ్రతమును కాశిలోనే గడపిరి భారతీదేవికి సంస్కృత భాషయందు సంభాషింప శక్తి గలిగినందుచే మండలేశ్వరులేగాక సన్న్యాసులును పండితులును చాల గౌరవముతో జూచుచుండిరి ఏ యే సహాయము కావలయునని మండలేశ్వరు లడుగుచుండిరి భారతీదేవి తపస్సుచే కృశించిన శరీరమును, సర్వేంద్రియ సంయమముచే గలిగిన నిశ్చలత్వమును, పొడుగైన దేహమును, యౌవనకాలమును, విభూతి, రుద్రాక్ష నారవస్త్రధారణయు జూచెడి వారందరును వీరిపై చాల భక్తి భావము గలిగియుండిరి సిద్ధాంత కౌముదియందును, పాతంజల యోగదర్శనమునందును, దశోపనిషత్తులందును, శ్రీభగ వద్గీతయందును మండలేశ్వరు లపుడపుడు సంస్కృతములో కొన్ని ప్రశ్నలు వేయుచుండిరి

భారతీదేవి వాటికన్నిటికిని నంతర్ముఖదృష్టి గలిగి సంస్కృతములోనే సమాధానమును జెప్పు చుండెను అపు డా యతిరాజులకు గలిగిన సంతోష మింతంత కాదు విద్యయొక్క మాహాత్మ్య మచట భారతీదేవి బాగుగ దెలిసి కొనెను ఎవరేమి సహాయము కావలయు నని యడిగినను నేమియు నక్కర లేదని చెప్పుచుండిరి రేయింబవళ్ళను గంగాతీరము నందే యధికముగా నుండెడి వారు కాశీలో శ్రీసూత మహర్షి ప్రణవమును గురించి యుపదేశించిన ముక్తిమంటపములో గూర్చుండి వేద మూలమగు ప్రణవమును ధ్యానించుచుండిరి అపుడపుడు వెళ్ళి శ్రీఅన్నపూర్ణాదేవి దర్శనమును, విశ్వనాథుని యొక్క దర్శనమును జేయుచుండిరి తనకుగల త్రిపుటి యొక్క యేకత్వవిషయమై యెవరినడిగి సందేహ నివృత్తి చేసికొనవచ్చునని కొందరి నాలోచింపగా హృషీకేశములో జెప్పిన ట్లివట గూడననేక మహనీయుల పేర్లను బేర్కొనుచు, అయినను శేషాచలముననొక బ్రహ్మనిష్ఠుడు గలడనియు, భారతీదేవి కేరళ దేశస్థురాలని యెరుగుటవలన ఆ బ్రహ్మనిష్ఠుని ఆశ్రయించుటయే మీకు మంచిదనియు జెప్పిన వాక్యమును విని, యా భారతీదేవి, హృషీకేశములో నీ విధముగానే జనులు చెప్పిరి ఇచట గూడ నీ విధముగానే చెప్పుచున్నారు కావున దీనియం దంతరంగ సంస్కారమేదైన యుండి యుండవలెనని దలంచినవారె, అచటనే సంశయనివృత్తి గలుగ గలదని నిశ్చయించు కొనెను

ఈ కాశిలో విద్యాప్రభావ మెక్కువేగాని, ధ్యాననిష్ఠలు గలవారరుదుగా నున్నారని భారతీ దేవిగారికి గోచరించినది అదియుగాక కాశిలోగల మండలేశ్వరు లందఱు గొప్ప పాండిత్యము గల వారగుటచే సూత్రభాష్యము, అద్వైత సిద్ధి మొదలగు పాఠములే చెప్పుచుందురు వారు శాస్త్రములచే నెట్టి వారినైనను జెప్పి యొప్పించెడు శక్తిగలవారు ఇట్టి వారనేకులు గలరని తనలో నిశ్చయించుకొని చాతుర్మాస్యవ్రతము పూర్తికాగానే, గయా యాత్రను జేయదలంచి ప్రయాణమై గయను జేరిరి

ఇచటను సాధువుల కనుకూలమగు ననేకసత్రములు గలవు శ్రీవిష్ణుపాద మునందు తన వంశీయులగు పితృదేవత లందఱికిని శ్రాద్ధ తర్పణాదులను జేసిన

తరువాత బ్రహ్మకపాలమున, బదరీనాధ పుణ్యక్షేత్రములో వలె నిచటను ''లోకములో నేప్రాణికి పితృక్రియ లేకుండ యుండునో, అట్టి పితృదేవతల నుద్దేశించి వేదమంత్రముతో సంకల్పన జేసి తర్పణమును విడుచుచు నీ తర్పణమువల్ల అనాధ పితృ దేవత లెల్లరును ప్రేతలోకమునుండి స్వర్గలోకమునకు వెళ్ళుదురుగాక! నేను భక్తిపూర్వకముగ, ధ్యాన సమేతముగ, నేకాగ్రభావముతో మంత్రపురస్సరముగ జేసెడు నీ తర్పణమువల్ల సకల పితృదేవతలును ప్రేతలోకమునుండి విముక్తిగలవారై తరింతురు గాత! వారికి ప్రేత విమోచనము గలుగుగాక!'' యని ముమ్మా రుచ్చరించుచు, మూడుసార్లనాధులై యుండు భూలోక పితృ దేవతలకు పిండ తర్పణమిడిరి ఈ వాక్యము విని బదరీనాధ తీర్ధయాత్రవాసులవలె, గయా తీర్ధవాసులగు పురోహితులును, జనులును విస్మయ మొందుచు, చంద్రోదయమును చకోరపక్షులు నిశ్చేష్టతతో జూచుచు చంద్రికను పానమును జేయునట్లు భారతీదేవిని గాంచు చుండిరి ఆపురోహితుల జూచి భారతీదేవి యిటుల జెప్ప దొడంగెను

వారివారి గోత్రస్థులు చేసిన తర్పణము వల్లనే ప్రేతలోకవిముక్తి గలిగి పుణ్యలోక ప్రాప్తి గలుగునని సందేహపడనక్కర లేదు నేను మీ యందరి గోత్రములో జేరిన దానను ఆత్మభావనలో నాది బ్రహ్మగోత్రము మీరును బ్రహ్మగోత్రములో జేరినవారే శ్రుతిస్మృతు లాలాగుననే చెప్పుచున్నవి

ముండకోపనిషత్తు -

*యధా సుదీప్తా త్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః ।*
*తధాక్షరాద్వివిధా స్సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి ॥*

బాగుగామండుచున్న యగ్నినుండి వేలకొలది సమానరూపములుగల యగ్నికణము లేవిధముగా పుట్టుచున్నవో, ఆ ప్రకారమే నాశరహితమగు పరబ్రహ్మ నుండి నానావిధములగు జీవులు పుట్టుచున్నవి ఆయక్షరమగు పరబ్రహ్మమునందే లీనమగుచున్నవి

అదేప్రకారము గీతయందలి శ్లోకమును జూచుడు

*మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।*
*మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥*

లోకమునందున్న యీ సమస్త ప్రజలును, నెవరియొక్క సంతానములై యున్నవో అట్టి ప్రాచీనులైన భృగువు మొదలగు నేడుగురు మహర్షులును, సనకాదులైన నలువురు ఋషులును నదేరీతిగ సావర్ణి మొదలగు మనువులును, నాయొక్క భావముచే పుట్టిరి కావున వారందఱును నాస్వరూపులే ఇందుచే వారి వారివల్ల నుద్భవించిన ప్రజలందఱును, వారి సంతతివారే, వారిగోత్రమువారే అందుచే ప్రపంచములోగల మానవులందఱికి, మనుజులనియు, మానవులనియు పేరు గలిగినది అనగా మనువు యొక్క సంతానములని గ్రహించు కొనవలయును వీరిలో భృగ్వాది మహర్షులు పవృత్తి మార్గములో నుండువారికి ధర్మోపదేశమును జేయువారు అనగా ఆ ప్రవృత్తి గృహస్థులగు జనులు సంపూర్ణాత్మశుద్ధి లేని వారగుటచే, కర్మానుష్ఠానము లద్వారా ముక్తిని బొందదగినవారు నివృత్తి మార్గస్థు లాత్మశుద్ధి కలిగిన వారగుటచే వీరికి బ్రహ్మతత్త్వమును సనకాది మహర్షులు బోధించుచుందురు ఆ మనువు లెవ రనగా-

*భృగుం మరీచి మత్రించ పులస్త్యం పులహం క్రతుమ్ ।*
*వసిష్ఠం చ మహాతేజా స్సోఽసృజ న్మనసా సుతాన్ ॥*

1 భృగువు, 2 మరీచి, 3 అత్రి, 4 పులస్త్యుడు, 5 పులహుడు, 6 క్రతువు, 7 వసిష్ఠుడు వీరు మహాతేజస్వులు, భగవన్మానస పుత్రులు సనకాదు లెవరనగా?

*సనకశ్చ సనందశ్చ సనాతన మునిస్తతః ।*
*సనత్సుజాత ఇత్యేతే యోగివర్యాశ్శివప్రియాః ॥*

1 సనకుడు, 2 సనందనుడు, 3 సనత్కుమారుడు, 4 సనత్సుజాతుడు వీరు మహాయోగివర్యులు భగవత్ ప్రియులు ఊర్ధ్వరేతస్కులు

మఱియు గీతలో। - "*మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః*"

నాయొక్క యంశమై సనాతనమై యుండువాడే జీవుడు మఱియు

*'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత'*

ఓ యర్జునా! సమస్త ప్రాణులలోగల యాత్మ చైతన్యమును నాయొక్క స్వరూప ముగా నెఱుగుము

ఇట్లుండుటచే మీరందఱును మాగోత్రస్థులు నేను గూడ మీ గోత్రస్థురాలనే అపరోక్షాను భూతియందు చూడుడు

*ఘటత్వేన యధా పృధ్వీ పటత్వేనైవ తంతవః ।*
*విన్నిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥*

కారణమున కన్యముగా కార్యము లేదనెడి తత్త్వము మూఢులు దెలిసికొన జాలక మృత్తిక వేఱు, ఘటములు వేఱు, తంతువులు వేఱు, వస్త్రములు వేఱు అని తెలిసికొను చున్నటుల కారణస్వరూపుడగు పరమేశ్వరునుండి పుట్టిన జీవులను వేఱు, వేఱుగా తెలిసి కొనుచున్నారు

*కనకం కుండలత్వేన తరంగత్వేన వై జలమ్ ।*
*విన్నిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥*

అదేరీతిగ జ్ఞానము లేనివారు సువర్ణమును వేఱుగాను, ఆభరణములు వేఱు గాను, సముద్రమును వేఱుగాను, కెరటాల బుడగలను వేఱుగాను తెలియుదురు జ్ఞానులైనవారివి యన్నియు నొకటే యని గ్రహించుదురు

*గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా ।*
*విన్నిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥*

దారువులు వేఱు, వాటివల్ల నేర్పడిన గృహమువేఱు, ఇనుము వేఱు, దానిచే తయారైన ఖడ్గము, మిషనులు ఇంజనులు వేఱుఅని మూఢులు తెలిసి కొను చుందురు జ్ఞానులైన వారివియన్నియు నొకటే యని యెట్లు దెలిసికొందురో ఆ రీతిగ, నోప్రేత లోకవాసులారా! మనమందరము నొకగోత్రస్థులమే

సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్ ।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ ॥

కనకమునుండి యేర్పడిన యనేక నామరూపములు గల యాభరణముల నన్నిటిని వివేకజ్ఞులు సువర్ణముగా నెట్లు దలంతురో, ఆలాగున బ్రహ్మమునుండి యేర్పడిన జీవకోట్లనేక రూపములుగా నుండినను యధార్థముగ విచారించినచో బ్రహ్మస్వరూపులే యగుదురు

*యధా తరంగ కల్లోలై ర్జలమేవ స్ఫురత్యలమ్ ।*
*పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మాండౌఘైస్తథాఽఽత్మతా ॥*

ఏవిధముగ సాగరములోగల తరంగ బుద్బుదాదులు జలమయమ్మై యుండునో, ఆలాగున ఒకే తామ్రముచే చేయబడిన పాత్రలు, విగ్రహాదు లనేక విధములుగనుండి నను, వివేకజ్ఞానము గలవాడొకే తామ్రమని యెట్లు దెలిసికొనునో ఆలాగున నామ రూపములతో గూడిన నసంఖ్యాకములగు జీవకోట్లును ఈశ్వరాకృతియే'' యని చెప్పుచు నుచ్చైఃస్వరముతో ధ్యానారూఢభావముతో నిలచి ''ప్రేతలోకము నందుండు జీవులకన్నిటికిని నేను వేదమంత్ర పురస్సరముగ నొసగు నీతర్పణమువల్ల, ప్రేతలోక విముక్తి గలిగి పుణ్యలోకప్రాప్తి గలుగుగాక!'' యని మఱియొకతూరి తర్పణ మిడిరి మఱియు, బ్రహ్మోపనిషత్తునందిట్లు గలదు

*సూచనా త్సూత్రమిత్యాహుస్సూత్రం నామ పరంపదమ్ ।*
*తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః ॥*

సూక్ష్మముగా మణిగణములో వ్యాపించి యుండు సూత్రము వలె, నీ చరాచర ప్రాణికోట్ల యందంతర్యామియై యే సూత్రాత్మ వెలుగుచుండునో యట్టి సూత్ర మును దెలిసికొన్న వా డెవడో, యట్టివాడే వేదవేదాంగ పారగుడగు విప్రుడగును అట్టివాడే పరమపదవిని పొందగలడు

*యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ।*
*తత్సూత్రం ధారయే ద్యోగీ యోగవి త్తత్త్వదర్శివాన్ ॥*

అనేక రకములగు మణుల మధ్య నుండి, యేదారము మణిగణమును భరించుచున్నదో యాలాగున, చరాచర ప్రాణికోట్ల యందన్నిటిలోను, ఏసూత్రాత్ముడుండి వాటిని భరించుచుండునో, అట్టి సూత్రాత్మను ధరించినవాడే యోగి

యగు చున్నాడు అట్టి యోగియే నిజమైన తత్త్వ దర్శకుడగుచున్నాడు

*బహిస్సూత్రం త్యజేద్విద్వాన్యోగ ముత్తమమాస్థితః ।*
*బ్రహ్మభావమిదం సూత్రం ధారయే ద్యః స చేతనః ॥*

దేహమందు గల యజ్ఞోపవీతము గొప్పదని తలంచక ( లేక త్యజించి) ఉత్తమ మగు నాత్మయోగమును ధరించినవాడై బ్రహ్మభావ మగు సూత్రమును ధరించిన వాడెవడో, వాడే చేతనాత్ముడు కాని వాడచేతనుడు

*ధారణాత్తస్య సూత్రస్య నోచ్ఛిష్టో నాऽశుచిర్భవేత్ ।*
*సూత్ర మంతర్గతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినామ్ ॥*

*తేవై సూత్రవిదో లోకే తే చ యజ్ఞోపవీతినః ।*
*జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే ॥*

అట్టి యంతరాత్మ సూత్రము ధరించినవానికి యుచ్ఛిష్ట దోషముగాని, యశుచి దోషముగాని సంభవింపదు ఇట్టి జ్ఞాన యజ్ఞోపవీతుడగు సర్వాంతర్యామియైన పరమేశ్వరుని యంతరాత్మ స్వరూపునిగ దలచినవారెవరో, వారే నిజమైన యజ్ఞోపవీత మును ధరించిన వారును, యజ్ఞోప వీతముయొక్క నిజమైన తత్త్వము దెలిసినవారు నగుచున్నారు అట్టి బ్రహ్మము నవలంబించినవారే బ్రాహ్మణులు దేహమునకు సాక్షి యగు నాత్మను పొందినవారే ద్విజులు మామూలుగా దేహము జాత మగుట మొదటి జన్మమనబడును దేహములో గల యాత్మ జనించుట యనగా నాత్మజ్ఞానము గలుగుట రెండవ జన్మ మనబడును ఇట్టి రెండవ జన్మము గలవారే ద్విజులు అట్టి జన్మమే పవిత్రమైనది సర్వోత్కృష్టమైనదని చెప్పబడును ఈ యర్థమునే గీతయందు శ్రీ కృష్ణభగవానులుప దేశించినారు

*మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।*
*మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥*

ఓ పార్థా! నాకంటె శ్రేష్ఠమైనది మరియొకటి కొంచెమైనను లేదు

దారమునందు మణుల సమూహామువలె నాయందీ సమస్త ప్రాణులును గూర్చబడినవి అనగా నన్ని జీవరాసుల యందంతరాత్మగా నుండెడివాడు భగవంతుడే! కావున ననాధులగు నో ప్రేతములారా! పై జెప్పిన గోత్రములచేతను నిపుడు చెప్పినసూత్రముల చేతను మీ వంశమునందు జన్మించినందుచే మీ యందఱికిని వేదమంత్ర పురస్సరముగ నిచ్చెడు నీ తర్పణమువల్ల మీ రందఱు ప్రేతలోకవిముక్తులై పుణ్యలోకమును బొందుదురు గాక!'' యని కొంత సేపు బ్రహ్మధ్యాన భావములోనుండి తర్పణము విడిచిరి దీనినంతయును జూచుచుండెడు పురోహితులు, బ్రాహ్మణులు, యాత్రికులు విస్మయ చేతస్కులై, మేఘధ్వనిని వినుచుండు మయూర పంక్తివలె నిశ్చేష్టులై భారతీదేవిని కను రెప్పలార్పక కొంతసేపు చూచుచుండిరి అపుడచటనుండు బ్రాహ్మణోత్తము లీ విధముగ జెప్పసాగిరి

**నృత్యంతి పితర స్సర్వే సంతుష్టాస్తస్య వంశజాః ।**
**దేవాశ్చ ఋషయస్తృప్తాః ప్రయాంతి పరమం పదమ్ ॥**

జ్ఞానియొక్క జన్మమును జూచి దేవతలు సంతోషింతురు ఋషులు సంతుష్టిగలవా రగుదురు ఆ వంశీయులగు సమస్త పితరులును నానందపరవశులై తాండవ మాడు చుందురు ఆ జ్ఞానికి సంబంధించిన పితరులందఱును, ప్రేత లోకమునుండి విముక్తి గలిగి పుణ్యలోకమును జేరుదురని ప్రమాణ శ్లోకమును వచించి, దానియొక్క తాత్పర్యము యాత్రికులకు విశదముగా జెప్పిరి ఈ విధముగ విశ్వైక కుటుంబ మునందు దయగలవారిని మేమింతవఱకుజూచి యుండ లేదని వృద్ధులగు బ్రాహ్మ ణులు చెప్పుచుండిరి మూడురోజు లచటనుండివారు శ్రీ బుద్ధగయావలోక నాసక్తులై యాత్రను ప్రారంభించిరి శ్రీ గౌతమబుద్ధుడు బోధిత్వము పొందిన ప్రదేశమగుటచే నది మిక్కిలి పవిత్రమైనది అచట బౌద్ధ సన్న్యాసులు బుద్ధ డాసీనుడై బోధిత్వమును పొందిన వృక్షమును పూజించుచున్నారు ఇది చాల ఏకాంతప్రదేశము అచ్చటికి వెళ్లిన వారందఱికిని మూడు రోజులు భోజన సామగ్రి నిచ్చెదరు

సామాన్యముగ పదిరోజులైన నచట నుండవచ్చును ఇప్పు డాస్థలములో

కొంచెము ప్రదేశము మాత్రము బౌద్ధసన్న్యాసులకు గలదు ముఖ్యమఠము సనాతన సన్న్యాసులదే భారతదేశమున హృషీకేశములో గల'' కాళీకంబల్ బాబా'' మఠము తరువాత, బుద్ధ గయయందలి మఠమంతటి గొప్పది మరి యెచ్చటను లేదు వీరియొక్క మఠమున బియ్యము, పప్పు, గోధుమపిండి, నెయ్యి మొదలగు సామగ్రులు సమకూర్చి యుండు ''నుగ్రాణము''ను జూచిన సముద్రరేవులలో సామానులుండు గిడ్డంగులవలె నిండి యుండును శ్రీ బుద్ధ దేవుడు నిర్వాణ సాక్షాత్కారము బడసిన పుణ్యస్థలమగుటచే మూడురోజు లచటనే యుండి భారతీదేవి సిద్ధాసనారూఢురాలై రెండవ బుద్ధుని వలె ధ్యానసమాధి నాచరించిరి ఇప్పటికి యాత్ర నారంభించి రెండు సంవత్సరములు పూర్తియయినవి ఇకజూడదగిన పుణ్యస్థలము లెక్కువ లేవని తలంచి, తక్కిన స్థలముల నన్నిటిని ఒక సంవత్సరములో దర్శించి పూర్తి చేయవలయునని సంకల్పించి యుండుట చేతను, పాదచారిణియై నడువ వలసియుండుటచేతను, నిదివఱలో నొనర్చిన యాత్రల యందు గ్రహించిన ధర్మ రహస్యముల ననేకములను మనసున దలపోయుచు, రత్నమాంబగారితో జెప్పుచు నిరువురును కలకత్తాకు యాత్ర నారంభించిరి

మధ్యలో శ్రీ కృష్ణచైతన్యస్వామి జన్మించిన నవద్వీపమును జేరిరి ఇచట నిర్మలభక్తి వర్షము సదా కుంభవృష్టివలె కురియుచుండును 'హరేరామ, హరేకృష్ణ'' అని యనేకు లుచ్చరించుచుందురు ఇది కలికల్మష దోషనాశమునకు మంత్రమని బ్రహ్మదేవుడు నారదముని కుపదేశించెను రమారమి వెయ్యిమంది స్త్రీలచట భజనను జేయుచుందురు అచటనుండు మఠములలో స్త్రీల మఠమే గొప్పది బృందావనములో నుండు స్త్రీల యాశ్రమ నియమమువలె నిచటను శ్రీకృష్ణ స్మరణయు, గీతాపఠనము, భాగవతశ్రవణము ముఖ్యములు భగవద్భక్తుల సేవను ఎక్కువగా దలంతురు భాగవతములో వర్ణించిన గోపికా స్త్రీ లేవిధముగా భక్తిపరవశురాండ్రుగా నుండిరో నారీమణులు గూడ నట్టివారివలె కనుపింతురు ఇచ్చటి కెవరు వచ్చినను మూడురోజులు భోజనముగాని, సదావర్తిగాని యిచ్చెడి యేర్పాటు గలదు భజనపరురాండ్రగు వధూ మణులైనచో నెన్ని రోజులైన

నుండవచ్చును కాని వా రేర్పఱచియుండు నియమములను లేశమైనను దాటరాదు స్త్రీల యాశ్రమములో పురుషు లుండకూడదు బాలికలు, యువతులు, వృద్ధురాండ్రు మొదలగు వనితామణులు గూడ నుండి భజన పారాయణ పూజాదులను జేయుచుందురు దినత్రయ మచటనుండి వారియొక్క భజన, భక్తి పారాయణలను జూచి మిక్కిలి యానందభరితులై యచటనుండి కలకత్తాచేరి కాళీక్షేత్ర దర్శనమునకు వెళ్ళిరి

ఆ స్థలము దయార్ద్ర హృదయులగు సాధువులకు పనికిరాదు ఇచటనుండు కాళికాదేవి విగ్రహము మహాభయంకరమైనది హింసలు లేని దినము లేదని చెప్ప వచ్చును యాత్రికులకు సత్రములు గలవు నగరములో ననేక సదావర్తులును నన్నసత్రములు నున్నవి కాళికాదేవి యొక్క నల్లని భయంకర విగ్రహమును జూచి భారతీదేవి-''తల్లీ? శాంతి నొందుము, ప్రళయకాలమింకను రాలేదు నీవు లోక మాతవు గాదా! బిడ్డలను దినెడు క్రూరజంతువులు గూడ లోకములో లేవే! ఉగ్రదృష్టిని లోనికి వశీకరించి శాంత దృష్టిని, 'కరుణాదృష్టిని, ప్రేమదృష్టిని వహింపుమమ్మా' యని ప్రార్థించి యా స్థలమునుండి వెంటనే గంగా తీరమునగల సత్రమునకు వెళ్ళిరి కాళికాక్షేత్రావరణములో నేమియు పుచ్చుకొనలేదు సత్రములో భోజనమును జేసి యాదినమే జగన్నాథక్షేత్రమునకు వెళ్ళదలంప ననేకులు భారతీదేవిగారిని జూచి, యూ కలకత్తాలో ననేకాశ్రమములు, చైతన్యసంప్రదాయులగు స్త్రీ పురుషులవి గలవు వారందఱు పరమ భక్తులు వారిని దర్శించుట మంచిదని చెప్పిరి అయినను వినక శ్రీ జగన్నాథస్వామి యుండెడు పూరీయాత్రకై బయలు దేరి అచటచట గల యాశ్రమములను జూచుచు జగన్నాథమునకు వచ్చి చేరిరి

ఇచ్చట కృష్ణచైతన్య సంప్రదాయకుల మఠములు చాల గలవు మతత్రయా చార్యుల పీఠములు గూడ నిచట నున్నవి యాత్రికులకు కొన్ని సత్రముల నన్నపానా దుల కొఱ కేర్పఱచి యున్నారు ఈ పూరీ యంతయు భక్తిమయముగానే యుంటు న్నది ఆ దేశములో గలవారుగూడ సాధువులపై మంచి విశ్వాసముగలవారు ఇచట జాతి, మత, వివక్షత లేదు ఒకే స్థలమున

నందందఱును భుజింతురు ప్రకాశము దగ్గఱ కంధకారఱము చేరనట్లు, అజ్ఞాన కల్పితమగు వర్ణదోష మిచట నేమియు లేదు సర్వులకును, సమానత్వము గలుగుటచేతనే, సర్వజగన్నాథమని పేరు వచ్చినది ఈ దేవాలయమున నన్నమును విశేషముగనైవేద్యముగ బెట్టుచుందురు ప్రతి సాధువునకును నీయన్న ప్రసాదమునే వినియోగపరచెదరు మరము లన్నిటిలోను నీదేవుని ప్రసాదమే భోజనముగా నుండును ఆ గ్రామమంతటను గాక తత్పరిసర ప్రదేశములలో నీ యన్నమునే చాలామంది భుజించుచుందురు ఈ యూరిలో ప్రత్యేకించి యన్నము వండెడివారు లేరని చెప్పినచో నాశ్చర్యము గాజాలదు ఏ కరుణామూర్తి యిట్టి యేర్పాటు చేసెనో, ఆ పుణ్యము వలననే, ఆ దయార్ద్ర హృదయుని దయవల్లనే అనేక సాధువులును, విద్యార్థులును, నేటికిని సుఖముగ జీవించుచున్నారు అచట మట్టి పాత్రలోనే వంటలన్నియు జరుగుటచే నా భాండములను పగులగొట్టి యా పెంకుల లోనే భోజనము పెట్టుచుందురు ఈ క్షేత్రము పూర్వసముద్ర తీరమునందు గలదు ఇచట నేకాంత ప్రదేశమున ననేకులు ధ్యానపరాయణులై యున్నారు బృందావనమువలె నిచటను భక్తి ప్రధానమే గాని యోగ, జ్ఞానముల విచారణ తక్కువగా నుంటున్నది అయినను భక్తి యందేకాగ్రత గలిగి యింద్రియనిగ్రహముతో గూడి యెక్కువ కాలము విచారణా ధ్యానసమాధులలో నుండువారును గూడ గలరు ఇచటను పరమ భక్తిగల నారీమణు లనేకులున్నారు వారిలో నెక్కువమంది బెంగాలీలే గీతాపారాయణము, నామస్మరణయు వీరికి ముఖ్యములు దీనులపై కరుణ, సాధువులపై భక్తియు వీరిలో నెండు ఒకవారమురోజు లిచటనుండి అన్ని యాశ్రమముల, తీర్థముల, నేకాంత ప్రదేశముల దర్శించుచు, ధ్యానము సలుపుచు కాలము గడపిరి ఇచటనే శ్రీ కృష్ణచైతన్యుడు ''హా! కృష్ణ!'' హేకృష్ణ! యని పిలుచుచు స్వశరీరముతో సముద్రముపై నడచుకొని శ్రీ వైకుంఠమునకు వెళ్ళినట్లు చెప్పుదురు

భారతీదేవి రత్నమాంబగారితో నిక మన మాంధ్రదేశములోని కడుగుబెట్ట బోవుచున్నాము కన్నడమునకును, తెనుగునకును నెక్కువ వ్యత్యాసము లేదు అక్షరములు గూడ నించుమించు నొకేవిధముగ నుండును ఇదివఱలో దర్శించిన

పుణ్యాశ్రమములను పుణ్యజీవులగు సాధువుల నిక నెక్కువగ జూడ జాలమని చెప్పుచు గంజాం జిల్లాలోని కడుగిడిరి అచటనుండి పాదచారిణులైయే సింహాచల దర్శనమును జేసి యచటనుండి బయలు దేరి గోదావరీ స్నాన మాచరించి యచటినుండి శ్రీ భద్రాచలమునకు ప్రయాణమై యడవిలోనే సంచరించి, శ్రీ రామదాసుగారికి దర్శనమిచ్చిన శ్రీ రామమందిరమును బ్రవేశించిరి ఇది గోదావరీతీరమందు గలదు ఇచట కొన్ని సత్రములు గలవు సాధువులకు దగిన యేర్పాటులు కొన్ని గలవు కాని యుత్తర దేశము వలెకాక బ్రహ్మనిష్ఠులు తాపసోత్తము లరుదుగా నున్నారు ఈ స్థలములో మూడురోజులుండి శ్రీశైలపర్వతమునకు పోదలంచి యాత్ర నారంభించిరి

క్రమముగ నైజాం దేశమున సంచరించుచు, శ్రీశైల ప్రదేశమును జేరిరి ఇది చాలా యరణ్య ప్రదేశము ఆదిమనివాసులగు కిరాతవంశమునకు జెందిన చెంచుజాతివారు మాత్రమే యచట నివసించుచున్నారు వీరిని జూడగా భూతగణా ధినాధుడగు నీశ్వరునికి గల నామధేయము సార్ధకమైనదని తోచును అయినను చెంచు జాతివారు గూడ యాత్రికులై వచ్చెడు సాధువులకు భక్తితో పాలును, పెరుగును నిచ్చెదరు ఇచట గూడ తపస్సు చేయుటకు దగిన గుహలు, మండపములు, తీర్థములు గలవు కాని చాల నిర్జన ప్రదేశము! ఏకాంతవాసమును జేయదలంచువారికి మంచి ప్రదేశము భోజనాదులు స్వయముగా నేర్పాటు చేసికొనినచో నచ్చటనుండుటకు వీలగును ఇటువంటి పుణ్యస్థలముత్తర దేశములో నుండినచో నెందరో తాపసులును, నెన్నియో సత్రములును నుండ గలవు ఈ స్థలము జూచుట తోడనే, యీ దేశములో భక్తిజ్ఞాన వైరాగ్యములు కొఱత గలిగి యున్నట్లు గోచరించును కొన్ని మఠములు గూడ గలవు వాటిని శివరాత్రులలో తెరచెదరట అప్పుడు సాధువులకు భోజన మొసంగెదరు పరమైకాంతస్థలమిక దొరకదని తలంచి యొక పక్షము రోజులచటి గుహలలో ధ్యానము సలిపిరి ఆ చెంచువాండ్రు చాల భక్తితో పాలు తెచ్చి యిచ్చు చుండిరి ఇంకను కొంత కాల మచట నుండ దలంచినను వత్సరత్రయము మాత్రము తీర్థయాత్ర కొఱకు నిశ్చయించినందున నదియును పూర్తిగానుండుట చేతను, నింకను

దక్షిణదేశయాత్రను జేయవలసి యుండుటచేతను, నచటనుండి తుంగభద్ర ద్వారా మైసూరు దేశ సంచార మొనరించుచు నరుణాచలమును జేరిరి

ఇచట తమిళ భాషయే మాతృభాషగా నుంటున్నది ఈ యరుణగిరిలోను ననేక గహ్వరములు గలవు పూర్వకాల మిచట ననేకులు తపమొనర్చినట్లాయా చిహ్నములచే నిశ్చయించుకొనవచ్చును పర్వతపాద ప్రదేశములలో కొన్ని చిన్నచిన్న ఆశ్రమములును, తీర్థములును గలవు అచ్చటచ్చట కొందఱు సాధువులు ధ్యానమును జేయుచున్నారు గ్రామములో కొన్ని సత్రములు గలవు వాటిలో నూతనముగా వచ్చెడు సాధువులకు భోజనమిడెదరు వారికి, మంచి యనుష్ఠానము గలవారని తోచినచో, ధ్యానమునకు గదులనిచ్చి భోజనవసతిని కల్పించెదరు ఇచట సాధువులు (పరదేశులు) అనేకులున్నారు వీరు భిక్షాన్నముచే కాలము గడపువారు వీరిలో స్త్రీలును, పురుషులును గూడనున్నారు స్నానధ్యానాద్యనుష్ఠానములు గలవారరుదు ఆ యరుణాచలస్వామి కరుణ వల్ల నెందరో పరదేశులు భిక్షాన్నమునకు వచ్చినను కడుబీదలగు గృహస్థులు గూడ లేదని చెప్పరు తమ కలిమికి దగిన యన్నమును బెట్టక మానరు ఈ పుణ్యమిచట తప్ప మఱియెచటను గనబడదు! కొంత ధ్యానాను ష్ఠానములు గలవారై యుండినచో మఠములలో గాని, లేక గృహస్థుల యిండ్లలోగాని, భక్తితో భోజనమిడెదరు మూడు రోజు లచటనుండు తీర్థములను, నాశ్రమములను దర్శించుచు అరుణాచలేశ్వరుని దర్శనమును జేసి, కాంచీపురమునకు యాత్ర చేసిరి

అట్లు నెమ్మదిగ నడచుచు కాంచీపురమును జేరిరి ఇచట శివకంచి యనియు, విష్ణు కంచియనియు రెండు పుణ్యస్థలములు గలవు ఈ రెండు క్షేత్రములును మహాగొప్పవి కాని తీర్థయాత్రికులకు, సాధువులకు, నధ్యయన పరులకు, బ్రహ్మచారులకు దగిన యాశ్రయము చాల తక్కువగానున్నది ఈ రెండు దేవాలయములలోను కొందఱు సాధువులకు భోజనము గాని సదావర్తిగాని యొకరోజు మాత్రమిచ్చెదరు ఈ దక్షిణదేశీయులు వారి ధనమంతయు దేవాలయముల గట్టుటలో ఖర్చుచేయుదురే గాని యుత్తర దేశీయులవలె బ్రహ్మనిష్ఠులకు, బ్రహ్మచారులై అధ్యయనమును జేయువారి కుపయోగింపరు

ఉపయోగించినను నతి స్వల్పముగానే యుపయోగింతురు దక్షిణదేశస్థుల సొమ్ము రాతికిని, సున్నమునకును వినియోగ పడును ఉత్తర దేశస్థులధనము బ్రహ్మనిష్ఠులకును, బ్రహ్మచారులకును వినియోగపడుటచే వారు ధన్యాత్ములగుదురు దాక్షిణాత్యులు మనుజులు నిర్మించిన జడములగు దేవళములకును, మూర్తులకును ధనమును వినియోగపఱతురు ఉత్తరదేశనివాసు లీశ్వరుడు నిర్మించిన దేహమునకును, చైతన్యాత్మకును వారికి గలిగిన దానిని వినియోగపఱచి పుణ్యాత్ములగుదురు దక్షిణ దేశనివాసులు జడమును పూజించు వారు ఉత్తరదేశ నివాసులు చైతన్యము నారాధించెడివారు దీనివల్లనే, వీరియొక్క ప్రజ్ఞావిశేషము దెలిసి కొనవచ్చును ఈ గ్రామములో కొందఱు వ్యాపారస్థులు యాత్రికులగు సాధువులకు దేవళములో ప్రసాదము నిమిత్తము కొన్ని చీట్ల నేర్పరచి యున్నారు ఈ రెండు క్షేత్రములలోను నొక్కొక్క రోజుండి శ్రీ శివచిదంబరమునకు బయనమైరి

మార్గమధ్యములో ననేక మఠములను, గ్రామములను జూచుకొని శివచిదంబరమును జేరిరి ఇది సువర్ణమందిరము ఇచ్చటనే యాదియాంధ్రులలో జన్మించిన ''శ్రీనందనార్'' జనులందఱు చూచుచుండగనే యగ్నిలో కర్పూరము జ్యోతిగా మారి యైక్యము పొందునట్లు, పరమశివునియందైక్యమును బొందెను అటువంటి పుణ్యక్షేత్ర మిది అయిన నిపుడు మాత్ర మితర క్షేత్రము లన్నిటి వలెనే, ఇచటను నాదిమనివాసులకు ప్రవేశము లేదు ''శ్రీనందనార్'' అను పేరుగల మునివరుడు శివదర్శనమునకు వచ్చినపుడు శ్రీ శివసన్నిధిలో నందికేశ్వరుని విగ్రహముండి నందుచే నీలాగున యర్థముగల యొక కీర్తన పాడెను 'నే నెన్నియో కష్టనష్టములను సహించి యెన్నియో రోజుల నుండి శివదర్శనము చేయవలయునని ప్రయత్నించుచు, నీశివ సన్నిధిని జేరితిని ఇచట నీవు గూడ పరమ భక్తుడవై యుండియు నాకు శివదర్శనమున కడ్డుగా పరుండి యున్నావా! కొంచెము తొలగవే'' యని పాడగా నా నందికేశ్వర విగ్రహము మార్గ మిచ్చిన ట్లిప్పటికిని నందికేశ్వర విగ్రహము శివసన్నిధి నుండి తొలగినట్లు కొంచము దూరముగానే యున్నది మరియు శ్రీవ్యాకరణ శాస్త్రమును పాణిని

మొదలగువారు, సనకాదిఋషు లిచటనే సాక్షాత్పరమేశ్వరునినుండి పొందిరి కనుకనే మూలసూత్రాంతరమున కౌముదియందు "ఇతి మాహేశ్వరాణి సూత్రాణ్యణాది సంజ్ఞార్థాని" అని గలదు ఇప్పటికిగూడ నదేవిధముగ చదువుటకదే కారణమైనది మరియు

*"నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచ వారమ్।*
*ఉద్ధర్తుకామా స్సనకాది సిద్ధానే తద్విమర్శే శివసూత్ర జాలమ్॥"*

సనకాది ఋషులందఱును, వ్యాకరణశాస్త్ర సిద్ధికొఱకు శ్రీ పరమ శివుని కీర్తన ప్రార్థనలు చేయగా, నర్తనమును జేయుచున్నపుడా పరమశివుడు తన డమఱుకము నొకసారి ఆకాశమండలమున వాయించగా 14 ధ్వనులు గలిగెను అవియే 14 సూత్రములుగనేర్పడెను ఈశ్వరుండా సనకాది మునుల నుద్ధరించుట కొఱకు దీని నుపదేశించెను కావుననే "మాహేశ్వరాణి సూత్రాణి" అని పేరు గలిగినది

*వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిమ్ ।*
*పాణినిం సూత్రకారం చ ప్రణతోఽస్మి మునిత్రయమ్ ॥*

వ్యాకరణ శాస్త్రమును ప్రారంభించునపుడీ వాక్యమును మొదట పఠించుట శిష్టాచారమై యున్నది వ్యాకరణసూత్రములను రచించిన పాణిని మునిని, వార్తికముల రచించిన వరరుచిని, మహాభాష్యమును వ్రాసిన పతంజలి మునిని, ఈ ముగ్గురికి నమస్కరించుచున్నాను అని ప్రార్థనము జేసి, పాఠము ప్రారంభింతురు అనగా పాణిని జేసిన యష్టాధ్యాయ సూత్రముల కర్థము మహాపండితులకు గూడ నవగాహము కానందుచే, కొంతవఱకు తెలిసేలాగున వరరుచి వార్తికముల రచించిరి అదియును మహాపండితులకు గూడ సంపూర్ణముగ బోధపడనందుచే పతంజలి మహాభాష్యమును రచించెను అదియు గూడ నిప్పటికి గొప్ప వ్యాకరణ వేత్తల కర్థమగునే కాని సామాన్యులకు గాదు అట్టి పుణ్యస్థల మిది

ఇప్పటికిని బ్రహ్మముహూర్తములో ప్రతిదినమును పతంజలి మహర్షికి నభిషేకపూజాదులును, క్షీరనివేదమును జరుగుచున్నవి ఆ సమయమునకు

ముఖ్యులగువారు, దర్శనమునకు వెళ్ళెదరు మందోష్ణముగు పాలలో పంచదారగలిపి నివేదించిన పాల నందఱికిని నా సమయమున నర్చకు లిచ్చెదరు అది ముఖ్యప్రసాదముగా తలంచి శాస్త్రపఠనజేయు బ్రహ్మచారులును, నా ప్రభాతకాలమున దర్శనార్థము వచ్చి స్వీకరించెదరు ఇది శ్రీ పతంజలి మునియొక్క మహా ప్రసాదమని తలంతురు ఈ క్షీరప్రసాదపానమువల్ల విద్యాభివృద్ధి గలుగుననియు, ముఖ్యముగ వ్యాకరణ శాస్త్రము ప్రబోధమగుననియు వారి నమ్మకము ఈ క్షేత్రములోను గ్రామములో గూడ సాధువులకు కొఱత లేక భోజనాదులు దొఱకును ఇచ్చట కొన్ని రోజులుండి, తాను చదివిన వ్యాకరణ సూత్రములన్నియు, శ్రీ పతంజలి సన్నిధిలో భారతీదేవి పఠించుమండెను అచ్చటనుండు విప్రవర్యులందఱును భారతీదేవి యొక్క వ్యాకరణోచ్చారణ స్ఫుటత్వమును విని, యార్యులకాలములో నుండు నారీమణు లవలె పొడవైన శరీరమును, కృశత్వమును, తపస్సుచే గలిగిన సువర్ణకాంతిని, విశాలములగు నేత్రములను గాంచి యచ్చెరు వందిరి దీనిని జూచి భారతీదేవి రత్న మాంబగార్ల కుండుటకు దగిన వసతియు భోజనాదిసౌకర్యములన్నిటిని క్షేత్రాధికారులతి భక్తితో నొనరుచుచుండిరి అప్పుడు భారతి విద్యయొక్క మహిమను గురించి రత్నమాంబగారితో నిట్లు చెప్పెను

*మాతే వ రక్షతి పితేవ హి తేనియుఙ్క్తే*
*కాంతేవ చాభిరమయత్యపనీయఖేదమ్ ।*
*కీర్తిం చ దిక్షు వితనోతి తనోతి లక్ష్మీం*
*కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా ॥*

విద్య తల్లివలె రక్షించును తండ్రివలె ధర్మము నుపదేశించును పతివ్రతయగు నారివలె శాంతిని గలుగ జేయును దశదిక్కులయందు కీర్తిని గలుగజేయును అంతటను లక్ష్మిని సమకూర్చును కల్పవృక్షమువలె సకల సంపదల నొసంగును విద్య సమస్తమును సాధింప జేయును భారతీదేవికి నాదేశ భాషయగు తమిళము బాగుగా దెలియక పోయినను సంస్కృతములో శుద్ధముగ మాట్లాడు శక్తియు, మృదుమధుర స్వరమును, మితభాషణయు, సంయమ వృత్తియు, తపస్వినుల

వేషమును జూచి చిదంబరక్షేత్రములో గల పండితులందఱు విస్మయము నొందిరి పట్టణములో గల సన్న్యాసుల మఠములోను కొన్నిరోజులు నీరు భోజనము జేసిరి ఉత్తర దేశమునవలె నిచట అంత సాత్త్విక భోజనముండదు పులుపు, కారము, ఉప్పు బాగుగా వాడుదురు అయితే నిది యుష్ణప్రదేశమగుటచేత పులుపు తప్పక కొంతయుండవల యును ఈ దేశములో బ్రాహ్మణసన్న్యాసుల మఠములు చాల తక్కువగా నుండును కాని బ్రాహ్మణేతరులగు శైవసాంప్రదాయకులకు మఠము లనేకములు గలవు వీరిలో సంస్కృతపరిచయము గలవారు కొలది మాత్రమే యుండినను, తమిళ భాషయందు గొప్ప పాండిత్యము గల వారనేకులు గలరు ఇతర భాషలలో గల వేదాన్త గ్రంథములకన్న నరవభాషలో నెక్కువ వేదాంత గ్రంథములు గలవు ఈ దేశములో శివ భక్తి ప్రచార కులగు 63 నాయనార్లుండిరి వారిలో అప్పర్, సుందరర్, మాణిక్యవాచకర్, జ్ఞానదేవ సంబందర్ అను నలుగురు ముఖ్యులు భక్తిపరమై చేసిన తేవార తిరువాచకములు చాల ముఖ్యములు- వానిలో నపారభక్తియు, వైరాగ్యము, వేదాంత జ్ఞానమును గలదు కైవల్య నవనీతమను గ్రంథము వేదాంతమునందు చాల విఖ్యాతమైనది అరవదేశములో గల నారీమణులలో ననేకులు పరమ భక్తు రాండ్రుండిరి వారిలో కారక్కాలమ్మ మొదలైనవారు ముఖ్యులు అనేక స్థలములలో స్త్రీలు స్వయముగా మఠములను కట్టించుకొని యాత్రికుల కన్నదానమును జేయుచుందురు పతంజలి మహర్షియందు గల భక్తివల్ల కొన్నిరోజులచటనే యుండి శివగంగ తీర్థములో స్నానమాచరించి శివదర్శన మొనర్చి శ్రీ పతంజలి సన్నిధిలో వ్యాకరణ శాస్త్రమును బఠించుచు శివమంత్రము నక్షరలక్షలు పురశ్చరణను జేయుచు దైవభావనలో ధ్యాననిష్ఠలో కాలము గడుపు చుండిరి అనుదినము ప్రాతఃకాలమున పతంజలి మహర్షిదేవస్థానసన్నిధిలో వ్యాకర ణము పఠింప ప్రారంభించునపుడు-

*ఓం నమః పాణినికాత్యాయన పతంజలిభ్యః శబ్దవిద్యా*
*సంప్రదాయ కర్తృభ్యో వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥*

అని నిండుభక్తితో నేకాగ్ర ధ్యానముతో పఠించుచుండిరి మరియు

*వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిమ్ ।*

*పాణినిం సూత్రకారం చ ప్రణతోఽస్మి మునిత్రయమ్ ॥*

( దీని యర్థము పైన వ్రాసినదే, )

*యేనాక్షర సమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్ ।*
*కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః ॥*
*యేన ధౌతా గిరః పుంసాం విమలై శ్శబ్దవారిభిః ।*
*తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః ॥*

ఎవనివల్ల నక్షరామ్నాయము ( వ్యాకరణశాస్త్రము) పరమ శివునివల్ల పొందబడి సంపూర్ణవ్యాకరణము లోకమున కనుగ్రహింపబడెనో, అట్టి పాణిని మహర్షికొఱకు నమస్కారము మనుజులయొక్క వాక్యములు అనగా శబ్దజాలమెవనివల్ల శుద్ధముగ జేయబడెనో, ఎవనివల్ల నజ్ఞానాంధకారము నశింపజేయబడినదో అట్టి పాణిని మహామునికి నమస్కారము అను స్తోత్రముతో ప్రారంభించి పఠించుచుండిరి అనగా మలిన వస్త్రములనుతికిన నెట్లు శుభ్రపడునో ఆలాగున శుద్ధములేని శబ్ద సమూహమును నిర్మలమగు వ్యాకరణ జలములో కడిగి శుద్ధపఱచినవారు పాణిని మహర్షియగుటచే వారి నిట్లు స్తోత్రము చేయడమైనది ఈ విధముగ వ్రతముతో పఠించుట జూచి యోగ సమాధులు గలవారని గ్రహించుటచే, జనులనేకులు భారతీదేవి దర్శనార్థము వచ్చుట కారంభించిరి అదియును బంధనమని తలంచి యింకను యాత్ర పూర్తికానందుచే నటనుండి బయలుదేరి శ్రీ రంగనాథ దర్శనమునకు వెళ్ళిరి

దారిమధ్యలో కావేరీతీరమున చాల మందిరములు, మఠములును గలవు క్రమముగ పాదచారిణులై శ్రీ రంగనాథ మందిరమును జేరిరి ఇచటను ఆదిమ నివాసియగు శ్రీ తిరుప్పాణి ఆళ్వారను పేరుగల యొక మహాముని పూర్వ ముండిరి శివభక్తియందు నందనారును, విష్ణుభక్తియందు తిరుప్పాణి ఆళ్వారును సమానులై యుండిరి ఇచటను నారీమణులలో ''ఆండాళ్'' యను పేరు గలిగిన ఒక మహాతప స్విని యుండెను వైష్ణవ భక్తులగు పన్నిద్దరాళ్వార్లలో నీ నారీమణి గూడ జేరినవారు ఈ ఆళ్వారుల ప్రతిమల నిప్పటికి పెట్టి పూజించుచున్నారు

శివభక్తులలో కారక్కాలమ్మయు, విష్ణుభక్తులలో శ్రీ ఆండాళమ్మయు నుండిరని వినినపుడు భారతీ దేవికి మరింత ధైర్యమును, ఉత్సాహమును గలిగెను ఈ పండ్రెండుగురు పరమభక్తులలో నమ్మాళ్వారు ముఖ్యులు వీరు బ్రాహ్మణేతర కులములో జన్మించినవారు ఈ భక్తులు రచించిన వాటిని నాళ్వారుల ''పాశురము'' లందురు వైష్ణవులకు వేదముకన్న దీనియందాధిక్యము గలదు కావుననే ముఖ్యములగు విష్ణుక్షేత్రములన్నిటిలోను పూజాదులన్నియు నీ ద్రవిడ ప్రబంధములతో జరుపుదురు శ్రీ రంగ క్షేత్రమునకు సమానమగు, గొప్పదేవాలయము మరి యొకటి కనుపించదు ఇచటను యాత్రికులగు భక్తజనులకు కొంత భోజన సదుపాయము గలదు ఇంత గొప్పదగు దేవాలయమ్ము నకు, తగినంత యన్నదానము సాధువులకుగాని, సన్న్యాసులకుగాని, అధ్యయనపరు లగు బ్రహ్మచారులకుగాని లేదు ఇచటను మనుష్యనిర్మితమగు దేవాలయమునకు గల పూజ్యత దైవనిర్మితమగు జీవులకు లేదు

*''ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయతే।*
*ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥*

ఓ యర్జునా! ఈ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది ఈ క్షేత్రమును నెవ డెఱుంగుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని క్షేత్రక్షేత్రజ్ఞ విభాగము నెఱుంగువారు చెప్పుచున్నారు

కావున చైతన్య క్షేత్రమునకు, క్షేత్రజ్ఞునకు నిచటగూడ పూజ చాల తక్కువగా నున్నది ఇటువంటి దేవాలయము ఉత్తర దేశమునందుండినచో వేల కొలది సాధువులు, బ్రాహ్మణులు, బ్రహ్మచారు లుండెడివారు కావేరీస్నానము శ్రీరంగ దర్శనము మూడురోజులు చేసికొని దిండికల్ మార్గముగా శ్రీ కుమారస్వామి క్షేత్రమగు ''పళని'' కి ప్రయాణమైరి ఈ క్షేత్రము సామాన్యమైన యొక కొండకుపరిభాగమున వెలయుచున్నది సుందరములగు సోపానములను, దీపములను నమర్చియున్నారు ఈ సుబ్రహ్మణ్యస్వామి మహిమ యపారమైనది అనేక సిద్ధపురుషులెప్పటికిని నిచట నుంటున్నారని పెద్దలు చెప్పెదరు

ఆంధ్రప్రదేశమున శ్రీ వెంకటేశ్వరులెట్లో, ఈ దేశమున పళని సుబ్రహ్మణ్యస్వామి యునట్లే యుండును ఇచ్చటికనేక యాత్రికులు వచ్చి ప్రార్థనలను ( ముడుపులు) చెల్లించుచుందురు ఇచట పంచామృతాభిషేకమును నదే ప్రసాదముగను ముఖ్యముగ నుండును ఇచ్చట చేయు పంచామృతమునకు సరి యగునది మరెచ్చటను దొరకదు పళని పంచామృతము, పండరీభజన, జగన్నాధుని యన్నము, తిరుపతి ధనము నీ నాలుగును లోక ప్రసిద్ధములు అగస్త్యులు, భోగర్షి మొదలగు పరమసిద్ధు లిచటనుండినవారలే

ఇచటనుండు అన్నసత్రములులును, పరదేశులును, వేఱే యే దేశమందును కనుపించరు పరదేసియనగా నీదేశము ( ఇహలోక సంబంధము లేనివాడై పరలోక జ్ఞానవముకలవాడు) అనగా దైవ జ్ఞానవముగలవాడని యర్థవము వీరిలో మంచియనుష్ఠానము, మోక్షమును గుఱించిన జ్ఞానము గల వారెక్కువ లేరు ఇచట దేవుని ప్రార్థనను జేయువారు (మొక్కుబడి తీర్చువారు) సాధువుల కన్నమిడుటయే ముఖ్యమని తలంచి ప్రతిగృహస్థాశ్రమస్థులును పరదేశీయులకు భోజన మిడుచుందురు పరదేశులనగా సాధువులని యర్థము శక్త్యనుసారము 10,100,1000 మొదలగు సంఖ్యగల సాధువులకు భోజనము పెట్టెదరు వీరిలో పరమార్థ విచారణగాని, భక్తిగాని కట్టకడకు స్నానముకూడ లేని యనేక పురుషులును, స్త్రీలును, పిల్లలు నున్నారు కాని వారెవరైన నను సరే కరుణా సాగరుడగు నా కార్తికేయస్వామికి సంతోషమగుట ఆ పార్వతీ తనయునికి అన్నదానమునకు సరియగు ప్రీతి కలుగజేయునది మఱియొకటి లేదని చెప్పెదరు ఈలాగున చేయుటచే జనుల జీవితము వ్యర్థమయిపోవుచున్నదని చెప్పెడు విజ్ఞాన శాస్త్రము నిచటి దేవి వినునే వినదట!

ఆలాగున చెప్పువారికి కొంతబాధయు గూడ గలుగునని, అట్లు చెప్పుటచే తనకు ( కార్తికేయస్వామికి) కోపము గలుగునని భక్తులు చెప్పుకొనుచుందురు పండరీనాధునికి భజనయందెంత ప్రీతియో ఆలాగున ఇచట అన్నదానమందు నిండు ప్రీతి శివపుత్రునికి గలదని చెప్పెదరు ఎంతమందికి భోజనమేకకాలమున కావలసి యుండినను ఆ సమయమున తయారు చేయ గలిగిన పరికరములు గలవు ఏ

విధములగు వంటకములు కావలసిన ఆ రకములగు వంటకముల జేయగలరు దానివల్ల లాభము సంపాదింపవలయునను బుద్ధితో నాకార్యమును జేయుట లేదు ఇది యీ సుబ్రహ్మణ్యస్వామియొక్క గొప్ప సేవయనియు, సాధుకైంకర్యమనియు తలంచి దానికి తగిన రేట్లు ఏర్పరచియే వారాలాగున చేయుచున్నారు ఇచట నొక వారము రోజులుండి శ్రీ స్వామిదర్శనమును జేయుచు నచటికి ప్రార్ధన చెల్లించుటకు వచ్చెడు కావళ్ళను, అన్నదానములను, మఠములను, పరదేశీయుల గుంపులను దర్శించుచు, కొండపై నుండు సిద్ధపురుషులు తపమొనర్చి యుండెడు గుహలలో రేయింబవలు కొన్నిరోజులు ధ్యాన సమాధినిష్ఠల నభ్యసించి తరువాత మధురకు వెళ్ళిరి ఇది పుణ్య శివక్షేత్రము ఆ స్వామిపేరు సుందరేశ్వరమూర్తి ఈశ్వరి పేరు మీనాక్షి ఇచట నీశ్వరుని కన్న మీనాక్షికాధిక్యము కావుననే మధుర మీనాక్షియని ప్రసిద్ధి గలిగినది ఇది చోళ, పాండ్య మహారాజుల కాలమున కట్టబడినది ఇంత సుందరముగా మఱియొక మందిరము భూలోకములో జూడలేము ఈ మందిరముయొక్క సౌందర్యమువల్లనే ఆ స్వామికి సుందరేశ్వరుడని పేరుగల్గనేమో! లేక సుందరేశ్వరుడను నామము గలిగినందున అట్లు గట్టించిరేమో! యని తోచును

కృష్ణశిలయందు చేసియుండు శిల్పపు పనులను జూచినచో కళాజ్ఞానము లేని కేవలం మొఱటు మనిషియైనను కొంతసేపు నిశ్చేష్టుడై యవలోకనము చేసియే వెళ్ళును అష్టశిలా గజములపై గర్భగృహమును నిర్మించియున్నారు ఇది చూడదగినదే పాండ్యరాజుల కాలమున నిర్మించియుండు సభామండపమును, యంత్రసహాయము లేని కాలములో నిట్టి విస్తీర్ణము, ఎత్తునుగల యీ స్తంభము నెట్లు నిలబెట్టి కట్టిరోయని యాశ్చర్యము గలుగని వారుండరు మూడురోజు లచట నివసించి శ్రీరామేశ్వర యాత్రకై ప్రయాణమైరి మధురలో గూడ కొన్ని సత్రములు గలవు సాధువుల కేమియు కొఱత లేదు అయితే ''మతియెంతో గతి యంతే'' యనెడి సామ్యము నంతటను జూడందగును ''యాగతిస్సా మతిర్భవేత్, యామ తిస్సాగతిర్భవేత్'' అను సామ్యము నంతటను జూడదగును అచ్చటనుండి నడచుచు సేతుబంధనమునకు శంకుస్థాపన మొనర్చిన నవపాషాణము దర్శించి,

శ్రీ రామచంద్రుని దివ్యహస్తములతో ప్రతిష్ఠించి పూజించిన శ్రీరామేశ్వరస్వామి దర్శనాసక్తితో నచ్చటికి జేరిరి

ఇచట ననేక తీర్థములును, మఠములును గలవు తీర్థ స్నానమును జేసి త్రివేణినుండి తెచ్చినగంగా తీర్థముచే శ్రీరామేశ్వరములో నభిషేకము జేయుచు, తీర్థ ప్రసాదములను దీసికొనిరి ఈ మానవ జన్మమెత్తినందు కొకగొప్ప కార్యము నిర్విఘ్నముగ నీ దినమునకు జేయడమైనదని శ్రీ భారతీదేవిగారు రత్నమాంబగారితో జెప్పిరి రెండురోజులచటుండి సేతువునకు వెళ్ళి, సముద్రస్నానమాచరించి దినత్రయ మా సేతువులోనే యుండి కులదైవమగు నాశ్రీరామచంద్రుని హృదయమున ధ్యానించుచు సమాధి నిష్ఠల జేసిరి ఆ సేతువులో గూడ సత్రములో భోజనములును, కొన్ని స్థలములలో మజ్జిగయు, సత్తువ పిండియును నిచ్చెదరు కొందఱు నైష్ఠికులు మాత్రము దినత్రయ మచటనే యుండి స్నాన, ధ్యాన, జపాదులచటనేచేయుదురు ఆ సేతువు లోను తన వంశీయ పితృదేవతలకు భక్తి పూర్వకముగ పిండతర్పణమిడిరి తీర్థ యాత్రలలో పితృతర్పణ మిడుట ఇచట నాఖరని భారతీదేవి రత్నమాంబగారికి దెలిపిరి అచట గూడ ప్రపంచములో పిండ తర్పణము జేయువారలు లేని జీవులెవరు గలరో వారందఱికిని గయయందు శ్రీ విష్ణుపాదమున శ్రాద్ధమును జేయునపు డుచ్చస్వరముతో వచించినట్లు వేదవాక్యముల నుచ్చరించి తర్పణమిడిరి ''నా యీ తర్పణమువల్ల భూలోకమందుగల సకల పితృదేవతలును ముక్తి నొందుదురు గాత! ప్రేతలోకము నుండి పుణ్యలోకము నొందుదురుగాత!'' యని ప్రార్థనాపూర్వకముగ ధ్యానారూఢ చిత్తులై శ్రాద్ధతర్పణములను జేసిరి

రత్నమాంబగారితో నిపుడు మనము భారతమాత కొక ప్రదక్షిణమును జేసినవారలమైతిమి దీనికే చతుర్ధామమని పేరు అనగా (1) ద్వారక, (2) బదరీనాధము, (3) జగన్నాధము, (4) రామేశ్వరమను పేర్లతో కూడిన నాల్గు ధామములలోనిది నాల్గవది భారతీదేవిభక్తియు, ధ్యానమును గలిగి భూలోక పితృదేవతలకు శ్రాద్ధతర్పణాదుల జేయుట జూచి, యందఱును యచ్చెరు వంది, భారతీదేవినే చూచుచుండిరి ''భగవద్గాత్రము నుండియే సర్వజీవరాసులు

నేర్పడినవని చెప్పెడు శ్రుతివాక్యములు సత్యమైనచో నేమనీ సర్వజీవులు నొకే గోత్రము గలవారమే మణులలో సూత్రమువలె ప్రాణికోట్లన్నిటిలోను బ్రహ్మమే వ్యాపించి యుండుటచే ''సూత్రే మణిగణా ఇవ'' అను భగవద్వాక్యము సత్యమైనచో నీ జీవకోట్ల యొక్కయు, నాయొక్కయు గోత్రమును, సూత్రము నొక్కటియే అని ''బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూరాజన్యః కృతః ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత'' అనెడి శ్రుతిని యుచ్చస్వరముతో వచించెను మఱియు, కావుననో పితృదేవతలారా! నేను మీ గోత్రమును సూత్రమును గలదాన నగుటచే, మీరందఱును ప్రేతలోకమునుండి యుద్ధరింపబడిన వారలై స్వర్గలోకమును పొందుదురు గాత'' యని వేదమంత్రము నుచ్చరించి మూడుసార్లు శ్రాద్ధతర్పణా దులను విడచిరి అపుడు పురోహితులును, యాత్రికులును ఆశ్చర్యముతో జూచుచుండిరి ఈ లాగున నిచ్చట మేము జన్మమెత్తిన తర్వాత ఎవరిని తర్పణమును జేసిన వారిని చూచి యుండలేదని వృద్ధులగు విప్రులును, ఇతరబ్రాహ్మణులు నొకరితో నొకరు చెప్పుకొను చుండిరి అచ్చటనుండి త్వరలోనే రామేశ్వరమునకు వచ్చి, సంవత్సర యాత్రకాలము సమీపించినదని కన్యాకుమారి దర్శనము నుద్దేశించి పయనమైరి

కాలి నడకతోనే కన్యాకుమారిని జేరిరి ఇది దక్షిణసముద్రతీరమున నుండు మహాపుణ్యక్షేత్రము ఇచ్చటనుండి మలయాళదేశము ప్రారంభమగుచుండును ఈ క్షేత్రతీరమున ధ్యానము చేయుటకు మంచి యనుకూలము గలదు అయినను ధ్యాన నిష్ఠాపరు లెక్కువ మంది యున్నట్లు కనుపించదు ఇది శ్రీ భవానీ క్షేత్రము యాత్రికులగు సాధువులకొక రోజు సత్రములో భోజనముగాని, సదావర్తిగాని యిచ్చెదరు మిక్కిలి చల్లని ప్రదేశము, ఈ దేవీ విగ్రహమును, నచట జరుగుచుండు పూజలును, సాత్త్వికములుగా నుండును భక్తులకు మనః ప్రసన్నతయు, శాంతియు నిచట గలుగుచుండును ఒకరోజు మాత్ర మచటనుండి పిమ్మట అనంతశయనమునకు వచ్చి చేరిరి దీనికే ''తిరువనంతపురమ''ని పేరు ఇచ్చటి ప్రకృతికిని, భారతదేశము నందలి యితర ప్రదేశముల ప్రకృతికిని చాల మార్పు గలదు ఇది భరత ఖండముయొక్క నైరుతి సముద్రతీరమునం దున్నది ఇచట

నుండు శీతోష్ణముల యనుకూలము మఱి యెచటను లేదని చెప్పవచ్చును నారికేళ వనములతోను, కదళీవృక్ష సమూహముల తోను దేశమంతయు చాల చల్లదనము గలిగి నీలగిరి వలెనుండును అరటికాయలు విశేషముగా నుండును కూరగాయ లింత చౌకగా నెచ్చటను దొరకవు ఎచ్చట గాంచి నను జలము సమృద్ధిగా నుండును ఇచటనుండు శ్రీ పద్మనాభస్వామి దేవాలయము చాల గొప్పది దీనియొక్క పని, యితర దేశములం దున్నట్లు గాక నూతనముగా నుండును దేవాలయమునకు సమీపమున గొప్పసత్రము గలదు బ్రాహ్మణులకు గల యనుకూల మితర సాధువులకు లేదు అయినను తీర్థయాత్రాపరులకు మాత్రము కొంత యనుకూలముగల యొక సత్రము గలదు దీనిజూచినచో నుత్తర హిందూస్థానములో నున్నట్లు, బ్రహ్మనిష్ఠాపరులును, తపస్సిద్ధియును, యోగనిష్ఠయును, జ్ఞానమును గలిగిన సిద్ధపురుషులీ దేశములో పూర్వమధికముగా నుండ లేదని గోచరించును సాధువుల మఠములెక్కువ లేక పోవుటకు కారణమదే యని తలంపు గలుగును ఉత్తరదేశములో ననేక సిద్ధ పురుషులు తాపసవర్యులుండిన కారణముచేతనే యన్ని యాశ్రమములు మఠములు, ఏర్పడినవి ఈ ఆంధ్రాది ద్రవిడ దేశము లైదింటిలోను ననేక మంది శ్రీమంతులు, రాజులుండినను జ్ఞానోపదేశమును జేసి వారి మనస్సును దైవకార్యములలో ప్రవేశింపజేసెడు శక్తిగల మహాత్ములు, సాధుపుంగవులు, ఋషిశ్రేష్ఠులు లేక పోవుటయే, బ్రహ్మవిద్యయు, సాధు సంరక్షణయు, సన్న్యాసుల ఆశ్రమములును ఇంత తగ్గిపోవుటకు కారణమని గోచరించును

శ్రీ ఆది శంకరాచార్యులీ కేరళదేశమునందు జన్మించినను, అతి బాల్యకాల మందే యుత్తరదేశమునకు వెళ్లి తన దివ్యశక్తినంతయు నా దేశమందే వ్యాపింప జేయుట అచట నన్ని ఆశ్రమములును సాధువులును నేర్పడుటకు కారణమైనది శ్రీరామానుజాచార్యులు ద్రవిడ దేశములోను, శ్రీ మధ్వాచార్యులు కర్ణాట దేశము నందును జన్మించి నవారైనను, వారి వారి సంప్రదాయమునకు జెందినవారికి మాత్రము కొన్ని మఠము లేర్పఱచిరేగాని, సర్వజనులకు ననుకూలమగునట్లు ఈ ధర్మకార్యములో ప్రవర్తించి యుండ లేదు వారి జీవితమంతయు మతవ్యాప్తి

కొఱకు వినియోగపఱచిరి ఈ కేరళ దేశములో నచ్చటచ్చట కొన్ని సన్న్యాసుల యాశ్రమములు గూడ గలవు ఈ దేశములోగల స్త్రీ పురుషు లందఱును శుభ్రత గలిగియుందురు సంస్కృతజ్ఞానము చాలమందికి గలిగియుండును బాల్యవివాహ పిశాచ మీ దేశమున నడుగిడ లేదు మలయాళమున మంత్రవేత్తలు కలరనెడి వాక్యమును విని యీ బాల్యవివాహమను పెనుభూత మచటికి వెళ్ళుటకు భయపడి నిలిచి పోయెనేమో యని తోచును అంతేగాక స్త్రీలకు పునర్వివాహము స్వభావముగానే గలిగియున్నది నంబూదిరి బ్రాహ్మణులలో మాత్రము పునర్వివాహము లేదు బాల్యవివాహ నియమము గలదు అయితే వీరు చాల కొద్దిమంది మాత్రమే గలరు తక్కిన క్షత్రియాదుల కీరెండు నియమములు లేవు ఇది స్త్రీలు నోచిన నోమువల్ల, శ్రీవిష్ణువు వీరిని ననుగ్రహించెనా యని తలంప వలయును ఇది విష్ణుక్షేత్రము చాల శుద్ధముగాను, భక్తిపరముగాను నుండును వీరు మూడురోజులచటుండిరి అప్పటికి నయస్కాంతము ఇనుము నాకర్షించినట్లు మనస్సు వారిని శ్రీవేంకటాచలమునకు లాగుచుండెను అచ్చటనుండి, వర్కాలక్షేత్రమును దర్శించి, కొల్లము మార్గముగా తిరునల్వేలి జిల్లా ద్వారా వచ్చుచు కుర్తాలము, పాపనాశము మొదలగు నేకాంత ప్రదేశముల నవలోకించి తిరువళ్ళూరు, ఘటికాచ లము, తిరుత్తని మొదలగు పుణ్యక్షేత్రముల దర్శించి శ్రీకాళహస్తీశ్వర సన్నిధిని జేరిరి ఇది సువర్ణముఖీ నదీతీరమున గలదు దీనికి దక్షిణ కాశియను ప్రసిద్ధమగు పేరు గలదు తిరువళ్ళూరు మొదలుకొని యనేకులు తిరుపతిలో గల తపస్వియొక్క పేరును విఖ్యాతిగ జెప్పుచుండిరి కాళహస్తిక్షేత్ర ప్రదేశమున పూర్వమనేక ఋషులు తాపసులుండినట్లు నిదర్శనము లనేకములు గలవు

ఇపుడు కూడ భరద్వాజాశ్రమము, అగస్త్యాశ్రమము, శుకాశ్రమము మొదలగు దివ్యనామధేయములు గల యనేకాశ్రమములు గలవు కాని యిప్పుడు ఆశ్రమముల పేర్లు మాత్రమే యున్నవిగాని తాపసులు, యోగులు అరుదు ఇచట మూడు రోజులుండి పయనమై తిరుపతి దారిలో తిరుచానూరును దర్శించి తిరుపతికి వెళ్ళి, కపిలముని తపస్సు చేసిన కపిల తీర్థమున స్నానమాచరించి, శ్రీ తిరుపతి శైలారోహణ మును ప్రారంభించిరి ఒక్కొక్క కొండను క్రమముగా దాటునపుడు

సప్తజ్ఞాన భూమికల నుద్దేశించి యీలాగున సప్తపర్వతములు ఏర్పడియుండునని తోచెను లేక షడాధారములకు పై భాగమున బ్రహ్మరంధ్రమందు పరమాత్మ వెలుగుచుండునని తెలుపుట కొఱకు నీ యేడు కొండలపై శ్రీ వేంకటేశ్వరు డుండెనా యని తలంపు గలిగెను అట్లు గాకపోయిన సప్తావరణములను దాటిన మాత్రముననే పరమాత్మ దర్శనము సిద్ధించునని ముముక్షువులు తెలిసికొనుటకైన నిట్లుండవచ్చును

మొదటిది కాళీగోపురము ఇది చాల యెత్తయినది ఎక్కుటకును మిక్కిలి ప్రయాసగ నుండును ఇది దాటినచో తక్కిన కొండలను దాటుటకు ప్రయాస యుండదు దీనివల్ల శుభేచ్ఛయను మొదట భూమికలో ప్రవేశము ప్రయాస యనియు, శుభేచ్ఛ గల్గినచో తక్కిన యాఱు భూమికలును ప్రయాస లేకనే దాట వచ్చునని యర్థమగుచున్నది కాళీగోపురమని చెప్పుటలో మహామాయా మోహినియగు మూలప్రకృతియని యర్థమగుచుండును కనుకనే గీతయందు 'మమ మాయా దురత్యయా' యని చెప్పుటకు గారణము ఏదైన భారమగు మూటలు మొదలగునవి గలవారు కొండయెక్కుట కెంతో కష్టపడుచుందురు అంతేగాక నచ్చటచ్చట కూర్చుండి శ్రమదీర్చుకొని మఱల యెక్కవలసియుండును భారమైన మూట లేనివారెక్కువ ప్రయాస లేకయే త్వరలోనే యెక్కి పోవుచున్నారు దీనిజూడగా సంసార సంబంధమగు భారము గలవారు మోక్షమార్గములో త్వరితగతిని పొందుట కష్టసాధ్యమని యర్థమగుచుండును లేక కర్మభారము కలవారు గూడ ముక్తి పథములో నడచుట ప్రయాస యని గోచరించును బరువు లేనివారు సులభముగా నెక్కిపోవునది చూడగా పాపకర్మములు నశించినవారు మోక్షమార్గములో సులభముగా వెళ్ళుదురని బోధ పడుచుండును స్థూలమగు శరీరము గలవారు స్త్రీలుగాని, పురుషులుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని చాల శ్రమ పడి అచ్చటచ్చట కూర్చుండుచు, పర్వతా రోహణము జేయునది చూడగా దేహాభిమానము గల వారు మోక్షమునొందుట కష్ట సాధ్యమని దెలియును కనుకనే గీతలో -

**క్లేశోఽధికతర స్తేషామవ్యక్తాసక్త చేతసామ్ ।**

*అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥*

అక్షర స్వరూపమైన బ్రహ్మమార్గము దేహాభిమానముగలవారిచేత నతికష్టముగా పొందబడుచుండును కనుక అక్షర పరబ్రహ్మము నందాసక్తమైన చిత్తముగల వారికి క్షరరూపమైన దానిలో నాసక్తి గలిగియుండిన యెడల, నక్షర స్వరూపముగల మార్గ మధిక కష్టమైనదని తాత్పర్యము

ఆబాల వృద్ధపర్యన్త మందఱును గోవింద స్మరణచేయుచు వెళ్ళుట నవలోకన మొనర్చిన కలియుగమున భక్తియే ముక్తికి కారణమనియు, నామస్మరణ చేతనే మోక్షము సిద్ధించుననియు తెలియును కావుననే-''కలౌ భక్తిః కలౌ భక్తిః'' అని రెండు సారులు చెప్పుదురు ఇచట మఱియొక రహస్యము గలదు శరీర స్థూలత్వము గలవారు పర్వతారోహణము చేయజాలరని తోచినచో నట్టివారు డోలి మోయువారి సాయము నర్థించిన, వారు మోసుకొని పోయెదరు దీనివల్ల కర్మచేతగాని, శరీరాభిమానముచే గాని మోక్షమార్గములో తీవ్రముగ నడువ లేని జిజ్ఞాసువులు గొప్ప బ్రహ్మనిష్ఠుల సహవాసమును చేయవలయును అట్లయినచో వారి వైరాగ్య, ధ్యానబలముల నవలంబించి దాటవచ్చునని యర్థమగుచున్నది డోలీలో కూర్చుండి మనుజులచే మోయించుకొనుట పాపమని కొందఱు తలంతురు అది సరియైన యాలోచన కాదు పరులను పీడించుటవల్లనే పాప మేర్పడును మోయువారికి సరిగా కూలి యివ్వనిచో దోషమే గాని, లేనిచో దోషము కాదు వాహకులకు పని దొరికిన సంతోషము గాని, లేనిచో, కుటుంబ పోషణ గడుపమార్గము లభింపమిచే వ్యాకులురుగ నుందురు ఆఱు కొండలను దాటి యేడవకొండలో ప్రవేశించునపుడు క్షురకర్మను జేయు శాలయందు క్షౌరమును జేయుదురు చాల రోజులనుండియు, కొన్ని మాసములనుండియు, సంవత్సరములనుండియు పెరిగియుండు కేశములను దీసివేయుటను జూడగ ననేక జన్మములనుండి వచ్చిన కర్మరాసులన్నియు నశించిన మాత్రముననే దైవదర్శమగునని తోచును కేశములకు నాలుగు ధర్మములు గలవు

1 అనాది, అనగా జీవులు పుట్టుటకు ముందుగా గర్భములోనుండియే శిశువునకు వెంట్రుకలుండును 2 అసంఖ్యము అనగా, వెంట్రుకలు లెక్కకు మించి

యుండును 3 సూక్ష్మము అనగా, కంటికి కనుపించవు, 4 నలుపు (1) ఆవిధముగ జీవుని యొక్క కర్మయు ననాది అది యెప్పుడేర్పడునది దెలియదు (2) కర్మలు గూడ నసంఖ్యాకములు, సృష్ట్యారంభమునుండి వచ్చుచున్నవి (3) అవి దృష్టికి గోచరింపనందుచే సూక్ష్మములు (4) నలుపనగా మూలప్రకృతి మాయ, ఈ కర్మను రహితమొనర్పవలయును ఇదే క్షురకర్మయొక్క రహస్యము అచ్చటనుండి శ్రీ పుష్కరిణీతీర్థస్నానము, కర్మరహితులకు మాత్రమే జ్ఞానస్నానము లభించును కనుకనే

**'' ధ్యానహ్రదే జ్ఞానజలే రాగద్వేష మలాపహే ।**
**యఃస్నాతి మానసే తీర్థే సయాతి పరమాంగతిమ్ ॥**

అని చెప్పుటకు కారణము ధ్యానమనెడు మడుగులో, రాగద్వేషము లనెడు మాలిన్యము లేక, నిర్మలమగు జ్ఞానజలమనెడు మానస తీర్థముం దెవరు స్నానమాచరింతురో అట్టివా రెవ్వరైనను పరమోత్కృష్టమైన పరమగతిని బొందెదరు

ఈ క్షౌరమైన తర్వాత స్త్రీ పురుషు లందఱును బోడి తలలుగల వారగుటచేతను, పచ్చని వస్త్రమును ధరించిన వారగుటచేతను, నొకే విధముగా నుందురు తరువాత యొకరినొకరు ''గోవింద, గోవింద'' యనియే పిలుచుకొందురు దీనివల్ల నజ్ఞాన ముండువరకే భేదముండుననియు, నది తొలగిన నందఱిలోను గల పరమాత్మ ఒకే విధముగ నుండునట్లు తోచుననియు నర్థమగుచున్నది కనుకనే-

***సర్వ భూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।***
***ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥***

సకల భూతములందు బ్రహ్మమును జూచుచున్నవాడు యోగముతో గూడిన నంతఃకరణముగలవాడగుచు తన్ను సకల భూతములందున్న వానినిగాను, తనయందు సమస్త భూతము లున్నవాటినిగాను జూచుచున్నాడు

***ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి ।***
***తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥***

సమానుడుగాను, నధికుడుగాను లేనందుచే నేక స్వరూపుడును, సర్వమును స్వాధీనపఱచుకొని సమస్తభూతములకు నంతరాత్మ స్వరూపుడగు నేపరమాత్మ యేకమగు తన రూపమును ననేక విధములుగా జేయుచున్నాడో, అటువంటి స్వశరీర హృదయాకాశమునందుండు ఆత్మను ఏ జ్ఞానులు ప్రత్యక్షముగ జూచుచున్నారో వారలకు నిత్యమగు నాత్మానందసుఖము గలుగుచున్నది ఇతరులకు లేదు

*నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానామేకో బహూనాం యో విదధాతి కామాన్।*
*తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషామ్॥*

ఎవ డనేకులకు కర్మఫలరూపములగు కోరికల నిచ్చుచున్నాడో, ఒకడై యే సర్వజ్ఞుడగు పరమాత్మ నశించువానిలో నశింపనివాడో, బ్రహ్మాది సర్వజీవులకు జీవమును గలుగ జేయువాడో, హృదయ గుహాయందుండు నా పరమాత్మను నెవరు మరలింపబడిన యింద్రియ వ్యాపారములు గలవారలై, ప్రత్యక్షముగ జూచుచున్నారో వారలకు నిత్యమైన పరమశాంతి ( యుపరతి) గలుగును ఇతరులకు గలుగదు

తిరుపతి యాత్రను జేయువారు భార్య భర్తనైనను, భర్త భార్యనైనను ఓ! గోవిందా! ఓ గోవిందా! యనియు, నదేవిధముగ బ్రాహ్మణుడు బ్రాహ్మణేతరుని, హే! గోవిందా! హే! గోవిందా! యనియు నట్లే బ్రాహ్మణేతరుడైనను బ్రాహ్మణుని హే!గోవిందా! యనియే పిలుతురు ఇది మిక్కుటముగ నరవదేశ యాత్రికులలో వినందగును దీనివల్ల జ్ఞానము గలిగిన యందఱిలోను నొకే దైవము కనబడవలయునని యర్థమగుచున్నది మఱియు దేవునియందు ప్రార్థన ( ముడుపు) గలవారు పసుపు వస్త్రమునే ధరింతురు తెలుపుగాని, యెఱుపు నలుపుగాని, వర్ణముగల వస్త్రములను ధరింపరు దీనివల్ల సత్త్వ, రజః, తమోగుణములకు పైనుండు స్వయంప్రకాశమగు తురీయపదమును పొందినవారును, త్రిగుణములు లేనివారును మాత్రమే పరమాత్మ దర్శనమున కర్హులని గోచరించును ఈ పసుపు వస్త్రధారణ అరవ యాత్రికులలో నెక్కువ గనందగును ఇట్టివారే శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనమును జేయగలరు పరమాత్మ సన్నిధిలో నేలాటిభేదమును లేక స్త్రీలు, పురుషులు, బ్రాహ్మణులు, అబ్రాహ్మణులు నొకే స్థలమున నొకే మారు దేవుని దర్శించుటను జూచిన, శ్రీవైకుంఠమునగాని, ముక్తజీవులు పొందెడు

మోక్షము నందుగాని భేదము లేదని యర్థమగు చుండును ఏడుకొండ లందును మెట్లు చాల నున్నగా నున్నందుచే జాగ్రత్తగా నడువవలసి యుండును లేనిచో జారి పడెదరు ఈ తత్త్వముయొక్క జ్ఞాపకముకొఱకు గీతలో నిట్లుపదేశించడమైనది

**శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥**

ఓ అర్జునుడా! ధైర్యముతో గూడిన బుద్ధిచేత, మనస్సు నాత్మయందు నిలిపి, మెల్లమెల్లగా విషయములనుండి శాంతిని పొందవలయును మఱియు నాత్మతత్త్వము కంటె నితరమైన దానిని కొంచెముగానైనను ధ్యానకాలములో సంకల్పము గలుగనీయక జూడవలయును

అదియు గాక మోక్షమునకు సప్తసోపానములను జెప్పియుండుటచే వాటియొక్క జ్ఞాపకముకొఱకు సప్తపర్వతము లేర్పడి యుండవచ్చును

**స్నానం దానం తపో హోమం పూజా సజ్జన సంగతిః ।**
**బ్రహ్మవిద్యాప్రబోధశ్చ ముక్తి సోపానసప్తకమ్ ॥**

1 తీర్థస్నానము, 2 దానము, 3 తపస్సు, 4 హోమము, 5 దైవపూజ, 6 సజ్జన సాంగత్యము 7 బ్రహ్మవిద్యాప్రబోధము అను నీ యేడును ముక్తి సోపానము లనబడును

భారతీదేవియు, రత్నమాంబగారును పుష్కరిణియందు స్నానమొనర్చి శ్రీవేంకటేశ్వర దర్శనమొనర్చిరి ఆ రోజునకు యాత్రకొఱకు సంకల్పించిన మూడు సంవత్సరములును పూర్తియైనవి తరువాత రామానుజకూటములో భోజనము జేసి, నిజగురువును వెదుకనారంభించిరి గీతయందు అంతిమాధ్యాయమునకు మోక్షసన్న్యాసమని నామకరణమొనర్చినది చూచిన, శ్రీ వేంకటేశ్వరులున్ను స్త్రీ పురుషులందరి శిఖాచ్ఛేదనము జేసి పసుపు వస్త్రమును ధరింపజేయునది గ్రహించిన కట్టకడ కందరున్ను సన్న్యాసులైన మాత్రమే మోక్షము గలుగునట్లుపదేశించినట్లు గోచరించును కనుకనే దశావతారములలో అంత్యముగ నేర్పడిన శ్రీ బుద్ధుడు గూడ సన్న్యాస

మవలంబించినాడని వ్యక్తమగుచుండును మఱియు నే విష్ణ్వాలయములో జూచినను, లక్ష్మీదేవి విగ్రహముగూడ నుండును శ్రీ వేంకటేశ్వరులో లక్ష్మీదేవియగు అలువేలుమంగమ్మను తిరుచానూరులో నుంచి తా నేకాకియై, బ్రహ్మచారివ్రతమును బూని తిరుపతి తిరుమలకొండపై నుండునది చూచిన, తపస్సులో నందరున్ను బ్రహ్మ చర్యవ్రతము కలిగి యుండవలయుననియు, అట్లయిన మాత్రమే జ్ఞానసిద్ధి గలుగు ననియు, దానివల్లనే మోక్షము సిద్ధించుననియు దెలియందగును

ఓమ్



ఓం తత్ సత్

# శ్రీబాలయోగిని

## చతుర్ధ సర్గము



## జ్ఞానఘట్టము

ఆ దినము మాఘశుద్ధ త్రయోదశి యగుటచే నీ త్రయోదశి దినముననే మనము పూర్వాశ్రమమునుగూడ విడిచితిమని శ్రీభారతీదేవిగారు రత్నమాంబగారితో జెప్పిరి మరియు ''నీదినమే యీశ్వర సంకల్పముచే మనమును ఈ స్థానమును జేరితిమి మాఘమాసము యోగసిద్ధిని గలుగజేయునదని శాస్త్రములో వినియున్నాను త్రయోదశి దినమగుటచే చంద్రుడు చాలవరకు పూర్ణత్వము నొంది యున్నట్లు, నేను నిదివరలో నే జేసిన ధ్యానాదులచే కొంత వఱకు పూర్ణత్వస్థితిని పొంది యున్నాను తక్కిన కొఱత యిచటనే త్వరలో పూర్తి కాగలదని యీ దిన మీశ్వరుడిచటికి మనలను జేర్చిన శకునముచే తీర్మానించుకొనవచ్చును మఱియు నీ దినము చీకటి ముప్పాతిక పరక భాగము నశించి పోయినది ఇక పరకభాగమే గలదు ఈ దినముతో గూడ మూడురోజులకది గూడ నశించును నాకును ప్రస్తుతము సందేహమొకటి మాత్రమే గలదు కాన పై యంధకారనాశమువలె, ఆ యొక్క సందేహమున్ను తప్పక పరమ ఋషుల కరుణవల్ల నివృత్తియై, పున్నమి చంద్రునివలె దృశ్యరహితమగు పరిపూర్ణ జ్ఞానము గలుగునని నిశ్చయముగ సూచింపబడుచున్నది'' అని చెప్పిరి

తరువాత కేరళ దేశ తాపసియుండు స్థలమెద్ది యని జనుల నడుగగా నీ ''శ్రీవేంకటేశ్వర క్షేత్రమున కీశాన్యభాగమున నర్ధక్రోశ మాత్ర దూరములో గోగర్భమను నొక పుణ్యతీర్థము గలదు దానియొక్క పూర్వభాగమున సమీపములోనే పాండవులు తప మొనర్చిన గుహ యొకటి గలదు అది తపస్సును జేయువారికి యోగ్యముగా నున్నది ఆ గహ్వరమునందు మీరడిగిన తాపసి చాల కాలమునుండి తపమొనర్చుచున్నారు మఱియు, కేరళ శబ్దము సంస్కృతము దానికి

మలయాళమనియు గలదు వారికి శ్రీ మలయాళస్వాములవారని పేరు వ్యవహారమున్నది వారు సర్వదా తీవ్ర నిష్ఠలో కాలము గడుపుచు మౌనముగా నుండుటచేతను, మలయాళ దేశీయు లగుటచేతను, మేమందరము మలయాళస్వాములవారని పిలుచుచుందుము ఈ నామధేయమే యచట ప్రసిద్ధిగా నున్నది'' ని తెలిపి వారితో గూడ కొంతదూరము వచ్చి మార్గమును జూపి, ఆ జనులు తిరిగి స్వగృహమునకు వెళ్ళునపుడు, వారలు మేమును ఆ మహాత్ముని దర్శనమున కపుడ ప్పుడు వెళ్లుచుడెదమ''ని చెప్పిరి ఆ వాక్యమును విని తన కార్యసిద్ధి గలిగెడు శుభ చిహ్నములన్నియు కనుపించుటచే సర్వేశ్వరుని మనంబున నించుక ధ్యానించి భారతీదేవి మిక్కిలి యానంద మొందిన హృదయము గలిగి నడచుచు గోగర్భ పర్వతముయొక్క క్రిందిభాగము నకు దిగుచు కొంత దూరము వెళ్ళగా, సెలయేరు పారుచు చల్లని జలాశయమగు గోగర్భ తీర్థము కాననయ్యెను అందు స్నానమాచరించి కొంచెము సేపు ధ్యానమొనర్చి కారణగురువరుని స్థలమును వెదకుచుండగా నిర్జన ప్రదేశమున నున్నత పర్వతముయొక్క క్రింది భాగమున నొక బిలమున్నట్లు గోచరించెను అయినను వెంటనే అచటికి వెళ్ళుట భావ్యము గాదని తలంచి యాగోగర్భా శ్రమముయొక్క చుట్టునుండు ప్రదేశమును జూచుచుండిరి

ఆ పర్వతమునుండి ప్రవహించు జలము శిలయందు నిమ్నభాగమున పడుచుండెడి శబ్దము చుట్టును పర్వతములుండుటచే ప్రతిధ్వనించుచుండెను ఆ ధ్వని నేకాగ్రముగా వినుచుండగా నాప్రదేశమందంతటను నోంకారధ్వని గలుగుచున్నట్లు గోచరించెను దీని వల్ల నిచ్చట జలము గూడ ప్రణవమునే యుపదేశించుచున్నదని తెలియబడెను మఱియు పర్వతములయొక్క చిన్ని చిన్ని రంధ్రములనుండి పావురములు కూయుచుండు మధుర ధ్వనుల నాకర్ణింపగా నిచటనుండు గిరులు గూడ నోంకారమునే యుపదేశించు చున్నట్లు గోచరించెను వాయువు వీచునపుడు పర్వతబిలములతో రాపిడి గలిగివచ్చెడు శబ్దము గూడ ప్రణవమునే యుచ్చరించుచున్నట్లు ఎల్లరికి తేట తెల్లమగును ఎత్తైన వృక్షముల నుండి మయూరముల కీకాశబ్దములను వినగా నీ తరువులన్నియు ప్రణవమునే బోధించునట్లు భావన గలుగుచుండును అందుచే నాకాశము గూడ నోంకారమునే

తెలుపుచున్నట్లుండును భృంగములు రంధ్రముల జేసియుండు వెదురు పొదలనుండి బయలుదేరు వాయువుయొక్క స్వరమును వినినయెడల నీవనమంతయు ఓంకారమునే యుచ్చరించుచున్నట్లు స్పష్టమగును మఱియు వృక్షములయొక్క కోటరములందుండెడు శకున్తములయొక్క శబ్దములను వినిన యీ ప్రదేశమంతయు ప్రణవమునే యుపదేశించునట్లు తోచును దీని వల్ల నీ లోకము ప్రణవమయమని తెలియుచుండును పరబ్రహ్మమును తెలియజేయు ప్రణవశబ్దము తప్ప నిచట మఱియొక శబ్దము వినబడుట లేదు

వెండియు, శుక, పిక, బకాదిపక్షి వర్గము లనేకము లీప్రదేశమునందుండుట జూడగా నీ మహాత్ముని యహింసా ప్రభావముచేతనే యావిహంగములన్నియు నిచట జేరుటకును, నిర్భయముగా జనుల దగ్గఱ తిరుగుటకును కారణమని యెటువంటి వార్కైనను తోచకమానదు కిరాతకుల భయమావంతయు లేమిచే నిర్భీతిగా నీ విహంగ సంఘములు ఈ యాశ్రమములో నివసించుచున్నవని తెలియును ఈ ప్రదేశమున కృష్ణసారములు భయము లేక సంచరించునది జూడగా శ్రీ పతంజలి మహర్షి చెప్పినట్లు ''అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః'' అహింసాభ్యాసమును జేయునట్టి యోగి నివసించెడు స్థలమున స్వభావ వైరము గల జీవులుగూడ వైరమును విడిచి ప్రవర్తించును అన్న శాస్త్రవాక్యమిచట ప్రత్యక్షమగును ఇకను లెక్క లేని వనమృగములు గూడ నీ ప్రదేశమున నిర్భయముగా సంచరించుటను జూడగా నిచటనుండు బ్రహ్మనిష్ఠుల యహింసా ప్రభావమనియే గ్రహింప దగును మఱియు భ్రమర సమూహము వనవృక్ష కుసుమములలో గల మధువును పానమును జేసి యొక వనమునుండి మఱియొక వనమునకు పోవుచున్నపుడు గలిగెడు ధ్వనిని వినినచో నిచటనుండు పక్షులే గాక భ్రమరాది క్రిములు గూడ ప్రణవధ్వనియగు నాద బ్రహ్మమునే లోకమున కుపదేశించుచున్నట్లు తెలియవచ్చును ఇంకను సమీపమందుండునొక సరస్సునుండి తామర పూవులో గల తేనెనుపానము జేసి యానంద భరితములై మఱియొక పద్మసరస్సునకు వెళ్ళెడు భృంగ జాలమంతయు నీ యోంకారమునే తామాచరించి తృప్తి పొందుటయేగాక లోకము లోనికి గూడ వెళ్ళి యుపదేశించుచున్నట్లు స్పష్టమగును ఇంకను బిల్వ, అశ్వత్థ, ఆమ్ర, కదంబ, జంబూ జంబీరాదివృక్షములచే నీ యాశ్రమమంతయు

నావృత్తమై చల్లని తీర్థము గలిగి మనస్సును ప్రశాంతమొనర్చు చుండును మఱియు, ఆశ్రమ ప్రదేశమున వెలయుచుండు తులసీవనములును, మల్లె, మొల్ల, పన్నీరు మొదలగు పుష్ప సమూహ ములను జూడగా నెంతయో మనోహరముగా నుండును తులసినుండియు, పుష్ప ములనుండియు వచ్చెడు సుగంధమగు వాయువు నాసికారంధ్రములలో ప్రవేశించి నిర్మలానందమును గలుగ జేయును ఇవి యన్నియు దర్శించిన తాపత్రయాగ్నిని చల్లార్చెడు స్థలముగా నీయాశ్రమము గోచరమగును

మఱియు సంధ్యాకాలమున హోమమును జేయునప్పుడు పర్వతగహ్వరము నుండి కలిగెడు శబ్దము కేవల మోంకారమునే యుపదేశించు చుండును అందువలన అగ్ని గూడ నిచ్చట ప్రణవమునే యుపదేశించుచున్నట్లు బోధపడుచుండును వృక్షాగ్రమయూర ధ్వనులవల్ల నాకాశమును, వాయు ప్రసారము బిలములో దగిలి వచ్చుటవల్ల పవనమును, హోమగుండమునుండి వచ్చెడు ధ్వనిని జూచిన యగ్నియు, ఉన్నత ప్రదేశమునుండి నిమ్న ప్రదేశమునకు పడెడు జలశబ్ద మోంకార మగుటచే జలమును, పర్వతమధ్యప్రదేశము చిన్న చిన్న తొఱ్ఱలలోనుండి కపోతములు కూయుట ప్రణవమగుటచే పృధివియును నిచట ప్రణవమయమై యున్నట్లు బోధ పడుచుండును ఇచ్చట ధ్యానము చేయు తాపసుని మహిమవల్లనే జడములగు పంచభూతములు గూడ ప్రణవమయములై పోయెనాయని తోచుచుండును ఏలననగా నుప్పులో వేసిన యూర గాయలు లవణమయమై మారునట్లును, ఇంగువలోనుంచిన పదార్థము ఇంగువ మయమైయున్నట్లును, సువాసనాద్రవ్యము గల పెట్టెయందుండు వస్త్రము లన్నియు సుగంధము గలవిగా నగునట్లును, నిచటనుండు సంయమి యొక్క ధ్యానబలముచే వృక్షములన్నియు, పక్షులన్నియు, భ్రమరాదికీటకములన్నియు ప్రణవమయములై యున్నట్లు దోచును దీనియందు సందేహము లేదు

ఇట్లు తమలో తామాలోచించుకొని చెప్పుకొనుచుండగా నొక సాధుపురుషుడు సమాధినిష్ఠనుండి లేచి బయటకు వచ్చినట్లు కనబడెను వెంటనే వారి దగ్గఱకు భారతీ దేవి వెళ్ళి నమస్కరించి యిట్లడిగెను 'మహాత్మా!' యిచట

కేరళ దేశ తాపసి యొకరున్నా రని విని వారి దర్శనార్థము వచ్చియున్నాము మేము క్రొత్తవారము, ఇంతకుముం దెపుడును రాలేదు మాకా మహాత్ముని దర్శనము మీరు దయ గలిగి చేయింపవల యును ఇచటి పద్ధతి యేమియు మాకు దెలియదు' ని గడు వినయముతో రాయియైనను కరుగునట్లు చెప్పెను ఆ వాక్యములవిని భాతీదేవిగారి తాపసవేషమును జూచుటచే వీరు గొప్ప బ్రహ్మనిష్ఠ గలిగి యుండువారని తలంచి ''తల్లులారా! అదిగో! పాండవగుహ ముఖద్వారమున దర్భాసనములో సిద్ధాసనమందు కూర్చుండువారని'' చూపుచు జలము కొఱకా సాధుపుంగవుడు వెళ్ళెను పూజార్థములగు ఫలపుష్పములను హస్తములో ధరించిన భారతీదేవి మనస్సు సూదంటురాతి సమీపమునకు ఇనుమెట్లా కర్షింపబడునో అలాగున ఆచార్య సన్నిధిలోనికి ఆకర్షింపబడినది నది యేలాగున వేగముగ పరుగిడి సముద్రములో జేరునో అలాగున భారతీదేవియు జ్ఞానసాగరుండగు నాకారణ గురువరుని పాదకమలముల లోనికి జేరెను రాజహంస తామర పుష్పసమూహము లోనికి ప్రవేశించినట్లు భారతీదేవియు, శ్రీ గురు పాదపద్మములోనికి ప్రవేశించెను స్వభావముగ స్త్రీయగుటచేతను, నంతేగాక నూతనమగుటచేతను, మనస్సులో గలిగిన భక్తివల్ల పరవశత్వము నొందుటచేతను, కొంత దగ్గఱవచ్చినను మఱల నడువజాలక అచటనే నిలిచి యానందబాష్పముల ధారధారలుగా వర్షించుచుండెను ఆ సమయము నకు మొదట కనుపించిన సాధువరుడు తీర్థము దీసికొని వచ్చినప్పుడీ నారీమణి కొద్దిగ దగ్గఱకు వచ్చి నిలచియుండుటను జూచి యింకను శ్రీ గురువు దగ్గఱకు వెళ్ళలేదని తలంచి పరమ గురుని దగ్గఱకు వెళ్ళి కొలది దూరముగా నిలిచియుండు నారీమణుల వృత్తాంతము నెఱిగింపగా నాచార్యుడు రావచ్చునని సంజ్ఞ జూపి నందుచే, దగ్గఱకు వెళ్ళి గూడ విలపించుచు, ప్రకాశముగల నక్షత్ర మేలాగున రాత్రికాలములో భూమికి సమీపమున వచ్చినపుడు పృధివిలోని కాకర్షింపబడు చుండునో ఆలా గున దేశికేంద్రపాదములోనికి సమిత్పాణినియైన భారతీదేవి ఆకర్షింప బడి భక్తి పరవ శత్వముచే భూమిపై బడి స్మృతి తప్పినదాయెను అట్టిస్థితి జూచి యాచార్యుండు స్వయముగా లేచి రెండు చేతులతోను పట్టుకొని నిలబెట్టెను అయినను నానందవార్ధిచే వస్త్రములు తడసియుండుట చేతను గద్గదస్వరముచేతను, రోమాంచము గలుగుట చేతను, ఏమియు మాట్లాడజాలక

చంద్రోదయమున వికసించెడు కువలయమువలె వికసించిన నేత్రములు గలదై నిశ్చేష్టత గలిగి యుండెను దాని జూచి గురువరుండు భారతీదేవి భక్తికి చాల సంతసించి తాను గూడ నానంద బాష్పాకుల నేత్రుడై దగ్గఱనుండు సాధువును బిలచి వీరిని కొంచెము వెనుకకు దీసికొని వెళ్ళి శీతలోదకమిచ్చి కొంచెము సేపు కూర్చుండ బెట్టుమని చెప్పెను అంతట దగ్గఱనుండు శ్రీరత్నమాంబగారును, ఆ సాధుసత్తముడును నట్లొనర్చిరి

అప్పటికి సూర్యాస్తమయమైనందుచే శ్రీ వేంకటేశ్వర క్షేత్రమునకు నుత్తరభాగమున కొలది దూరములో నేకాంత ప్రదేశము నందుండు శ్రీ తరికొండ వెంకమాంబగారి సమాధి దగ్గఱ ధ్యానపరులై యుండు నారీమణుల యాశ్రమములో నుండి రేపు రావచ్చునని చెప్పి బంపిరి భారతీదేవికి వెళ్ళుట కిష్టము లేక పోయినప్పటికిని, నిది యీ యాశ్రమ నియమమనియు నచట బ్రహ్మనిష్ఠ చేయు మానినీమణులు మనభక్త సంఘములో జేరినవారనియు జెప్పిన యాచార్యుల వాక్యములను విని యాసాధు పుంగవునితో గూడ ప్రయాణమై పోయిరి వీరికి ననుకూలమగు నేర్పాటుల జేయ వలయునని స్త్రీల యాశ్రమములో నుండు తపస్వినులకు జెప్పమని దేశికుండా జ్ఞాపించెను గోవును విడిచి లేదూడ వెళ్ళుటకిష్టగించనట్లు భారతీదేవికి వెళ్ళుట కిష్టములేకున్నను గురువాక్యము నుల్లంఘనీయ మని తలంచి వెళ్ళిరి భారతీదేవిని జూచి యచటనుండు నారీమణులు మిక్కిలి సంతసించి, యుచితమగు కుటీరమునిచ్చి సత్కరించిరి ఆ రాత్రియంతయు తల్లిని విడిచిన బాలగోవత్సమువలె భారతీదేవి కాలము గడిపిరి ఆ దినము ఏమి భోజనము జేసెదరని-య్యాశ్రమ వాసినులడుగగా మే మిద్దరమును రాత్రి యేమియు భోజనమును జేయమని చెప్పిరి ఎంత శ్రమయైనను నిష్ఠను జేయుచుండు భారతీదేవి, కూర్చుండుటకైన శక్తి లేని డగ్గుత్తిచే మాట్లాడ జాలక యానందపరవశురాలై నీటిలో మునిగిన దానివలె తడిసిన వస్త్రములుగలదై యూరక పడియుండెను

మరునాడు బ్రహ్మముహూర్తమున స్నానమాచరించి ధ్యానాదు లొనర్చి, గురు సన్నిధికి వచ్చి కొంచెము సేపు దూరముగా కూర్చుండెను అప్పటికి ధ్యాన

సమాధులు పూర్తిచేసి లేచి గుహద్వారమున నాచార్యుం డాసీనుడై యుండుటను జూచి వెంటనే సమీపించి దేశికేంద్రుని పాదములకు నమస్కరించి నిశ్చేష్టురాలై భిత్తిలో చిత్రించిన చిత్తరువువలె చేతులు ముడుచుకొని నిలిచియుండెను అపుడా భారతీదేవి గారిని పాదములనుండి శిరస్సు వఱకు గురువరుండు పారజూచి యీ సంయమిని బ్రహ్మ నిష్ఠలకుగల యింద్రియ నిగ్రహములన్నిటిని గలిగియున్నదా? యని పరీక్షింపగా పాదములు రెండును సందు లేక పెట్టియుండుటయు, కరములు రెండును చక్కగా జేర్చుకొని హృదయమున నమస్కార మొనర్చుచుండుటయు, శిరస్సు కొంచెమైనను వంకర లేకయు నేత్రములు రెండును కొంచెమూర్ధ్వదృష్టిగలిగి యర్ధోన్మీలనము కలిగియుండుటయు, ముఖమునం దేవిధమగు ప్రకృతివికారము లేశమైనను లేనిదై పండిన మామిడి పండు వర్ణము గలిగియుండుటయు, దేహము పండి యెండిన పొడుగగు కరక్కాయ ఛాయ గలిగి యుండుటయు, నారవస్త్రము పాదమునుండి ఆరు అంగుళముల పై భాగమున ధరించియుండుటయు, లలాటమున శుభ్రమైన విభూతి ధరించుటయును జూచి వీరు తపస్సుచేతను, మంచి వ్రతముల చేతను, ప్రాణాయామాది యోగములచేతను, తమోగుణ, రజోగుణముల నశింప జేసిన వారే గాక, సత్త్వగుణము గూడ కొంతవఱకు నశించి కేవల విశుద్ధతత్త్వము గలిగి యున్నారనిన్నీ, పలుచని శరీరము గలిగి సర్వేంద్రియ నిశ్చలత్వము గలిగియుండుటకదే కారణమని తలంచి శాస్త్రప్రకారము ఉంటున్నారాయని చూడగా

***న పాణి పాదచపలో న నేత్ర చపలో యది ।***
***న చ వాక్చపలశ్చైవ మితి శిష్టస్య లక్షణమ్ ॥***

ఇట్టి లక్షణములు కనిపించుటచే మిక్కిలి దయితో, దైవభావముతో '' మీరెవరు? ఇచట కరుదెంచుటకు కారణమేమి? చెప్పెదరా '' యని యడుగగా భారతీదేవి మూలము నరికిన త్రాటిమానుపడునట్లు శ్రీగురుచరణారవిందములలో బడి నమస్కరించి ఆనందబాష్పములతో, గద్గదస్వరముతో నిల్లనియె '' ఓ మహాత్మా! నేను కేరళదేశములో నుండుదానను పవిత్రమగు క్షత్రియకులములో జన్మించితిని నాపేరు భారతీదేవి యందురు తీర్థయాత్రను సంపూర్ణముగా జేసి కారణగురుని

వెదకి వెదకి సంచరించుచుండగా ననేకుల ముఖపద్మమునుండి శ్రీవారియొక్క పావన నామధేయమును విని యిచట కరుదెంచితిని జలరహితమగు నెడారిలో గ్రీష్మఋతువున దాహముచే తపించి దాహశాంతి కొఱకు వచ్చెడు మృగమువలె నేనిచటికి వచ్చితిని సంసారమను నెడారిలో తాపత్రయముచే తపించుచు జ్ఞానామృత పానము కోరి వెదకి వెదకి తమ సన్నిధిని జేరితిని భవదీయకరుణామృత దివ్యదృష్టి యనుశీతల జలము నిచ్చి కాపాడవలయును మఱియు గ్రీష్మఋతువులో మధ్యాహ్నకాలమున కాలుచుండెడు ఇసుకలో పడి యల్లాడుచుండు ఎరువు దిబ్బలో గల తెల్లని పెద్ద పురుగు నీడను కోరుచున్నట్లు, దృశ్యబాధచే తపించబడుచున్న నేను తావకానుగ్రహ మనెడు దృశ్య శమనమైన యాత్మశాంతిలో జేరుకొనవలయునని యపేక్షచే వచ్చితిని ఇకను శీతల జలములో విహరించుచుండెడు మత్స్యమును నెండలో పడవేసినచో మఱల నుదకమును పొందుట కెట్లు తపించునో, ఆలాగున పరమశాంతి భావయుత మగు నాత్మభావములోనుండి దృశ్యమగు తపనములో బడి పరితపించెడి నన్ను దృక్కగు తురీయ జ్ఞానసాగరములో జేర్పవలయునని కోరిక గలిగి భవదీయ సన్నిధి జేరితిని అగాధ జలాశయములో విహరించెడు కూర్మమును కిరాతకులు పట్టి యుష్ణజలముగల పాత్రలో పడవేసిన దాని సంకట మెటువంటిదో, యట్టి తపనము ఈజీవిని దృశ్యభావము లయము గలుగనందుచే దహించుచున్నదని" చెప్పి, కరముల ముడుచుకొని యుండెను ఆ భారతీదేవిగారిని జూచి హృదయములో దయగలవారైనను నీ మానినీమణి చెప్పినట్లు వీరు యథార్థముగ గలిగియుండువారా యని పరిశోధింపదలచి పరమ గురుడగు దేశికేంద్రు డిట్లనెను

గురుడు - పూర్వకాలమున నార్యకన్యకలు గూడ బ్రహ్మచర్యమును, గురుకులవాసమును సలుపుచు వేదాధ్యయనమును, గాయత్రిజపమును, అగ్నిహోత్రము, తపశ్చర్యలును వీనిని జేయుచుండిరి దానిని బట్టియే యిప్పుడు కూడ నార్యమతస్థులు కన్యాగురుకుల మేర్పఱచియున్నారు ఇది యొక నూతనమగు సంగతి గాదు లోకజ్ఞానము కొఱకును, ఋషుల దర్శనముకొరకును, పూర్వమునుండి భూసంచా రము గలిగియుండిరి ఇదియు క్రొత్త విషయము కాదని తేలికగా వచించి తరువాత బ్రహ్మచర్యవ్రతమును సమాప్తి జేసి గురువరుని

యాశీర్వాదము పొంది మఱల గృహస్థాశ్రమములో ప్రవేశించుట యనాదియగు సనాతన ధర్మమని చెప్పి యూర కుండిరి

అపుడు భారతీదేవిగారి నుద్దేశించి వచించిన కర్ణకఠోరవాక్యము భారతీదేవికి చెవిలో సీసము కరిగించి పోసినట్లుండెను అంతేగాదు జ్వలించుచుండెడి హోమ గుండములో ఘృతము బోసినచో నెట్లు మరింత పొంగి యగ్ని ప్రజ్వలించునో యాలాగున దృశ్యవిలయము గానందుచే పరితపించెడి భారతీదేవిగారి హృదయము మరింత దుఃఖాగ్నితో జ్వలింపసాగెను ఏమియు ప్రత్యుత్తరమును జెప్పక మౌనము వహించి యుండు భారతీదేవిగారి ముఖము మహాఖిన్నత వహించియున్నట్లును, సంసార మునందు విరక్తిగలిగియున్నట్లును, అంతేగాక సంసారము మహాభయమును గలుగ జేయుననెడి దైన్యభావమును ఆచార్యుండు గ్రహించెను అయినను నింకను శోధింపవలయునని దలంచి ''అమ్మా! దుఃఖింపకుము మహనీయుల పాదములో జేరినవారికి మఱల దుఃఖముండదు పాపములన్నియు నశించి శుభకాలమా విర్భవించినపుడే పుణ్యాత్ములగు మహనీయుల దర్శనము గలుగును మేము ధర్మమును బోధించువారము'' ఇట్లని నుడివెడు దేశికేంద్రుని వాక్యమును విని సంసారమునందు గల దుఃఖమును భారతీదేవి చెప్ప దొడంగెను శ్రీ శంకరులు రచించిన లక్ష్మీనృసింహ స్తోత్రము నపుడపుడు పఠించియుండుటచే నిట్లు చదివి చెప్పిరి

***సంసారసాగరవిశాలకరాళ కామ నక్రగ్రహ గ్రసన నిగ్రహ విగ్రహస్య ।***
***మగ్నస్య రాగలసదూర్మినిపీడితస్య లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥***

ఓ లక్ష్మీ నృసింహస్వామీ! సంసారమనుసముద్రమందలి భయంకరమైన కామమను పెద్ద మొసలిచే మ్రింగబడుచున్నవాడనై, విషయ చింతలనెడి యలలచే వెనుకకు ముందుకు గుంజబడి బాధలనొందుచున్న నాకు కరావలంబము నిమ్ము!

***సంసార ఘోరగహనే చరతో మురారే! మారోగ్రభీకర మృగ ప్రవరార్దితస్య ।***
***ఆర్తస్య మత్సరనిదాఘనిపీడితస్య లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్॥***

ఓ మురారీ! సంసారమను కారడవియందు బడి తిరుగుచు మన్మధుడను నీ క్రూరమృగము వాతంబడి బాధనొందుచున్నాను క్రోధమను గ్రీష్మముచే మిగుల తపింపబడుచున్న నాకు ప్రాపగుము

***సంసారకూప మతిఘోర మగాధమూలం సంప్రాప్య దుఃఖశత సర్ప సమాకులస్య ।***
***దీనస్య దేవ కృపయా శరణాగతస్య లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్ ॥***

ఓ లక్ష్మీనృసింహా! మిగుల భయంకరమై చాల లోతుగల సంసారమనెడు నూతిలో బడి దుఃఖములను పాములకు జిక్కి కలవరము నొందిన కృపణుడనగు నన్ను కరుణించి చేయూత నిచ్చి లేవదీయుము

***సంసారభీకర కరీంద్ర కరాభిఘాత నిష్పీడ్యమాన వపుషస్సక లార్థితస్య।***
***ప్రాణ ప్రయాణ భవభీతిసమాకులస్య లక్ష్మీ నృసింహ!మమ దేహి కరావలంబమ్॥***

ఓ లక్ష్మీ నృసింహస్వామీ! సంసారమను భయంకరమైన మదపుటేనుగు తొండపు దెబ్బలచే నొచ్చిన మేనుగలవాడను, సమస్త బాధలచే గృశించినవాడను, ప్రాణాపద వలననైన భయముతో గూడుకొనిన వాడనునగు నాకు జేయూత నొసంగుము

***సంసారసర్ప విషదుష్టభ యోగ్ర తీవ్రదంష్ట్రాకరాళ విషదగ్ధ వినష్టమూర్తేః ।***
***నాగారి వాహన! సుధాబ్ధినివాసశౌరే! లక్ష్మీ నృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥***

ఓ గరుడవాహనుడా! పాలసముద్రమున బవ్వళించు నో దేవా! సంసారమను త్రాచుబాముయొక్క విషముచే దుష్టములై, భయంకరములై, క్రూరములై తీక్ష్ణములైన కోఱలయందలి భీషణ మయిన విషసంపర్కముచే నశించిన శరీరముగల నాకు జేయూత నొసంగుము

***సంసారజాలపతితస్య జగన్నివాస సర్వేంద్రియార్థ బడిశస్థఝషాత్మనశ్చ ।***
***ప్రోత్తమ్భిత ప్రచుర తాలుక మస్తకస్య లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥***

సర్వలోకాంత ర్యామిఖగు నో లక్ష్మీనృసింహ స్వామీ! సంసారపు జిక్కులమారి వలలో దగులుకొని శబ్ద స్పర్శ రూప రసగంధాది విషయములకు

లోనై వలలోని చేపమాదిరి తన్నుకొనుచున్నవాడనై, ఎత్తబడినదియు తెలియబడిన పెదవులు తలయు గల నాకు జేయూత నిచ్చి దయతో గాపాడుము

*సంసార దావదహనాకుల భీకరో గ్రజ్వాలావలీభి రభిదగ్ధ తనూరుహస్య ।*
*త్వత్పాదయుగ్మ సరసీరుహమ స్తకస్య లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥*

ఓ లక్ష్మీనృసింహ స్వామీ! సంసారమను కార్చిచ్చుయొక్క అన్నివైపుల జుట్టి వచ్చుచున్న భయంకరములై, క్రూరములైన మంటలచే మాడి పోయిన రోమములు గలవాడనై నీ పాదములను శిరమున దాల్చి ధ్యానించుచున్న నాకు జేయూత నొసగి దిక్కగుము

*సంసారసాగర నిమజ్జనముహ్యమానం దీనం విలోకయ విభో! కరుణానిధే! మామ్!*
*ప్రహ్లాద ఖేదపరిహార పరావతార ! లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥*

దయగల యో మహానుభావా! సంసార సముద్రమునబడి యుక్కిరి బిక్కిరి యగుచున్న దిక్కు లేని నన్ను గాపాడుము నాకు చేయి యందిమ్ము

మఱియు తాను బాల్యకాలములో పఠనమొనర్చిన వివేకచూడామణిలోగల వైరాగ్య సంబంధములగు శ్లోకములు జ్ఞాపకము వచ్చినందుచే వాటినిగూడ కొన్నింటిని చెప్ప దొడంగిరి

***స్వామిన్నమస్తే! నతలోకబంధో! కారుణ్యసిన్ధో! పతితం భవాబ్ధౌ !***
***మాముద్ధరాత్మీయక టాక్షదృష్ట్యా ఋజ్వ్యాతికారుణ్యసుధాభివృష్ట్యా!***

మీచరణారవిందములకు నమస్కారము తమకు నమ్రులగు వారలకు జననీ జనకులవలె బంధువుడవును, దయాసముద్రుడవునగునో! స్వామీ! నేను సంసార సాగరమగ్నుడనైతిని తమ కరుణామృత వర్షధారలచేతను, సరళ కటాక్షవీక్షణము చేతను నన్నుద్ధరింప వేడుచున్నాను

**దుర్వార సంసారదవాగ్ని తప్తం దోధూయమానం-దురదృష్టవాతైః ।**
**భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః శ్శరణ్యమన్యం యదహం నజానే ॥**

గురుస్వామీ! నేను దుర్వారసంసారదావానలములో జిక్కి పరితపించుచు,

ప్రారబ్ద వాయువుచే, గంపింపబడుచు, మృత్యువువలన భీతి జెంది తమకు శరణాగతుడనై తిని నన్ను రక్షింపుడు తమకంటె శరణాగతుల నితరులనెవరిని నేనెఱుంగను - ఇట్లు చెప్పి మౌనముగానుండగా ఇంకను పరిశోధించవలయునని తలంచి పరమగురు డిట్లు చెప్పుదొడంగెను

''భారతీదేవీ! కుంతీదేవికి బాల్యకాలమున తపోధనుడగు దూర్వాస మహాముని యే విధముగ దివ్యమంత్రము నుపదేశించెనో, ఆలాగున మీకును నిష్టార్ధ సిద్ధికొరకు దివ్యమంత్రము నొకదాని నుపదేశించెదను దీనిని వ్రతనిష్ఠగలిగి యక్షరలక్షలు పునశ్చరణ జేసినచో మీకిష్టమైన రాజకుటుంబములో జన్మించినవాడును, ధార్మికుడును, విద్యావంతుడును, మంచి రూపవంతుడును, గొప్ప శ్రీమంతుడునగు భర్త లభించును కావున పవిత్రమగు గృహస్థాశ్రమమును స్వీకరించి దానధర్మముల జేయుచు, పుణ్యము గలుగజేయు నోముల నోచుచు సుఖముగా నుండవచ్చును'' భారతీదేవి యీాకర్ణవేద నాకరములగు వాక్యమును విని ''యిది నా మనస్సును పరీక్షించుటకొఱకు గురువరుడు చెప్పెనో? యేమో? సమయము వచ్చినపుడు సరియగు సమాధానమును జెప్పనిచో న్యాయస్థానములో వాద ప్రతివాదులను గురించి న్యాయాధిపతి యడుగు నపుడు మౌనమును ధరించి విషయము చెడిపోయిన తదుపరి మఱల పశ్చాత్తాపపడిన నెట్లు ప్రయోజనము లేదో యట్లేయగును అదియుగాక శ్రీ శంకరాచార్యులే ప్రశ్నోత్తర మణిరత్నమాల యందిట్లు చెప్పియున్నారు ''మూకోఽస్తి కోవా బధిరశ్చ కో వా వక్తుం న యుక్తం సమయే సమర్థః'' తా॥ మూగవాడెవడు? చెవిటివాడెవడను ప్రశ్నలకు సమయానుసారముగా విషయమును సరిగా జెప్ప సమర్ధత లేనివాడు నోరుండియు మూకుడనియు, చెవియుండియు చెవిటివాడనియు వచించిరి కనుక నిపుడూరకుండుట తగదని మది దలంచి యిట్లు చెప్పనారంభించిరి

**''న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే ఽమృతత్వమానశుః''** కర్మానుష్ఠానముచేత గాని, సంతానముచేతగాని, ధనమువలనగాని మోక్షము గలుగదు అట్టి యమృతత్వము త్యాగముచేత మాత్రము సిద్ధించునను శ్రుతివాక్యమును తెలుపుచు మఱియు,

***ధర్మరజ్జ్వా వ్రజేదూర్ధ్వం పాపరజ్జ్వా వ్రజేదధః ।***
***ద్వయం జ్ఞానాసినా ఛిత్వా విదేహః శాంతిమృచ్ఛతి ॥***

జీవుడు పుణ్యకర్మానుష్ఠాన మనెడి త్రాడుచే పుణ్యలోకమును పొందును పాపాచరణ మను పాశముచే నరకలోకమున కీడ్వబడును

కావున ముముక్షువగువాడు జ్ఞానఖడ్గముచే నీపాశద్వయమును భేదించి విదేహముక్తుడై పరమశాంతిని పొందవలయును

**సన్న్యస్య సర్వకర్మాణి భవబంధవిముక్తయే ।**
**యత్యతాం పండితైర్ధీరైరాత్మాభ్యాస ఉపస్థితైః ॥**

బ్రహ్మనిష్ఠుడు సంసారబంధ నివృత్తిఁగోరునేని ధీరుడుగాను పండితుడుగాను నుండి యాత్మధ్యానాభ్యాసమును జేయవలయును బాహ్యకర్మలనన్నిటిని పూర్తిగ విడిచి నిరంతరము వేదాంత బ్రహ్మవిచారణను జేయవలయును ఇట్లుండుటచే నిపుడు నేను సరియగు సమాధానమును జెప్పకయున్నచో మఱల జెప్పుట కవకాశ ముండదు అంతేగాక భయపడిగాని, మరేవిధముగా గాని మౌనముగానుండి మఱల గురువరుని యాజ్ఞ యుల్లంఘించి నడచుట మంచిది కాదని తలంచి, ''హే కారుణ్య సాగరా! గురూత్తమా! తామీ దీనురాలిపై కరుణించి నా యభిప్రాయమును జెప్పుట కనుమతించెదరేని యించుక మనవి చేసెదననెను''

గురుడు - ఎవ్వరైనను వారి యభిప్రాయమును జెప్పుట కవకాశమీక తనకడ్డు చెప్పకూడ దని తలంచు వారుండినచో, నది మూర్ఖత్వమేయగును ఈ దురభిమానము వల్లనే రావణేశ్వరుడు నశించెను కావున మానినీమణీ! మీ యాశయమును స్పష్టముగ దెలుపవచ్చును

భారతి - అయ్యా! సంసారసాగరమున తపించుచు నెంతో పుణ్యవిశేషముచే తీరమును జేరుటకు ప్రాకులాడి వచ్చెడు దీన జీవులకు జేయూత నొసంగి పైకి జేర్చు టకు తారకులుగా నేర్పడిన తమబోటి గురువరేణ్యులు అట్టి జీవులను క్రిందకు త్రోయుట ధర్మమగునా? ( యని నిండు దీనభావముతో జెప్పుచు, ముందు చెప్పిన

శ్లోకముల యర్థమును వివరించిరి )

గురుడు - అట్లయినచో ధనాకర్షణగల మలయాళమంత్రము నుపదేశించెదను ఈ మంత్రము నొక మండలము మంచి నిష్ఠతో జప మొనర్చిన యెడల విశేషధనము చేకూరును ఇది సామాన్యమంత్రమని తలంపవలదు నేను గొప్ప గురుసేవ జేసి దీనిని సంపాదించితిని ఇది యందఱికిని జెప్పదగినది కాదు ఆ పవిత్రధనమును పాడు చేయక గౌరవముకొఱకు రాజసకార్యములలో వినియోగపరుపక, ధర్మకార్యములు మాత్రమే చేయవలయునని ప్రతిజ్ఞను చేయించిన తర్వాతనే యా ఋషి నా కుపదే శించెను

భారతి - ప్రబోధజ్ఞాననిలయా! పరమగురో! భజగోవిందము చిన్నకాలమున చదివిన జ్ఞాపకము గలదు దానిలో

*అర్థమనర్థం భావయనిత్యం నాస్తితతస్సుఖ లేశస్సత్యమ్ ।*
*పుత్రాదపి ధనభాజాం భీతిః సర్వత్రైషా విహితారీతిః ॥*

అని కలదు మఱియు నీ ధనము తల్లితండ్రిగురువులకు గూడ ప్రాణహాని గలిగించునది దీనికొఱకనేక యుద్ధములు జరుగుచున్నవి ఇది దగ్గఱుండిన రాత్రులు నిద్ర గూడ పట్టదు పరమ వైరాగ్యముగల యోగికి గూడ ధ్యానములో నిది నిశ్చలత్వమును గలుగ జేయదు దీనికి భయపడియే ఆత్మ ధనమును గోరి వనమునకు ఋషులు పరుగిడి పోయిరి కలిదేవత కిదే మూలస్థానమని భాగవతమునందు గలదు దీనివల్లనే హింసయు, జారత్వము, చోరత్వము, పానత్వాది దుర్గుణములు గలుగుచున్నవి కావుననే శ్రీగౌతమబుద్ధుడు శ్రీ శంకరాచార్యులు మొదలగువారు దాని జోలికి పోక దూరముగానే యుండిరి అది యగ్నివంటిది ఎంత దొరకినను తృప్తి నొందదు ఇయ్యది పెనుభూతము కనుక మహనీయులు దానియందు ప్రీతి నుంచక దైవమందు మనస్సునుంచి తరించిరి దైవవిధి ననుసరించి వచ్చిన దానిలో మమత్వమొందక సత్కర్మలను జేయుచుందురే కాని వారు స్వయముగ జేయరు పూర్వకాలమిదియును బ్రహ్మనిష్ఠుల కవసరముగా నుండ లేదు ఏలననగా అట్టి ధర్మకార్యముల చేసెడు పుణ్యాత్ము లనేకులుండిరి

మఱియు గర్వము, అహంకారము మొదలగు దోషము లకన్నిటికినిది మూలము దుర్యోధనాదులే దీనికి తార్కాణము

గురుడు - అట్లయినచో నది వలదు జనాకర్షణ మంత్రము నుపదేశించెదను ఇది మలయాళ భగవతీమంత్రము ఇది నాకొక గొప్పయోగి యుపదేశించెను

భారతి - జనాకర్షణయొక్క రహస్యము గూడ ధనాకర్షణయే యగును కేవలము జనులచే నేమి ప్రయోజనము? పామరజనులు చేరుటచే నాస్థల మపవిత్రమగుటవలన బ్రహ్మనిష్ఠను జేయుటకుగాని, ముముక్షువులకు శ్రవణ మనననిదిధ్యాసనముల జేయుటకుగాని సమయమే దొరకదు కనుకనే వైరాగ్య సంపన్నులు నిర్జన ప్రదేశమును జేరుదురు కావున నిదియు మంచిది గాదు

గురుడు - అటులయినచో నదియు నవసరము లేదు బీజాక్షరములతో గూడిన యొక యంత్రము నిచ్చెదను దీనిని పూజించినచో భూతములు పట్టినవారు దుష్టగ్రహములు పట్టినవా రనేకులు వచ్చెదరు వారికి నీవలన సౌఖ్యము గలుగుటచే ననేక ధర్మకార్యములును, అన్నదానములును వారు చేయుదురు దానినైన నంగీకరించరాదా?

భారతి - ఆచార్యవర్యా! గీతయందు భూత ప్రేత పిశాచములను పూజించువారు మరణాంతమున దుష్టగ్రహములై, ప్రేతములై, పిశాచులై యుండెదరనియు, నది తామసగుణము గలవారి లక్షణమనియు చెప్పబడినది అందుచే నది బ్రహ్మనిష్ఠులకు తగదు దీనియొక్క యుపదేశము గూడ ధనకాంక్షయే యగును

***యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః।***
***భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్ ॥***

దేవతలను పూజించువారు తత్తద్దేవతలను పొందుదురు పితృదేవతల నారాధించు వారు పితృదేవతలను పొందుదురు భూతప్రేత పిశాచములను పూజించువా రాయా భూత ప్రేతాదులనే పొందుదురు పరమాత్మనగు నన్నారాధించువా రంత్యకాల మున నాయందు జేరుదురు ఎట్లనగా ఏ లక్ష్యమును గుఱించి విడిచిన బాణ మాలక్ష్యములోనే చేరును ఏ బీజమును విత్తువారి

కదేవృక్షమై అట్టి ఫలమునే యిచ్చునట్లును, ఎవరేకర్మల జేయుదురో వారికి దాని కనుగుణమగు ఫలమే గలుగును కాబట్టి ఆ యంత్రపూజయును బ్రహ్మనిష్ఠ లకు దగదు మఱియు నీశ్వర నిర్మితమగు హృదయ కమలమనెడి యంత్రమును ''సోఽహం'' అను భావనచే పూజించువారి కక్షయమగు జ్ఞానధనము లభింపుచుండగా నమృతమును త్యజించి విషమును పానమును జేయు వారు మూఢులు గదా! ఇటువంటి యంత్రమును పూజింతురు అంతేగాక యీలాటి కార్యములలో నొకగొప్ప రహస్యము గలదు ఇటువంటి పూజలుండినచో నీశ్వర విశ్వాసమునకును, సత్యమునకును దూరులగుదురు ఏలననగా దైవకృపచే ఋషుల కరుణచే భక్తులు స్వయముగా వచ్చుటయు, ఆశ్రమకార్యముల నిర్వహించుటయు జరుగుచున్నప్పు డిది దైవకరుణచే గలిగినదను బుద్ధి యస్తమించి యీ క్షుద్రమంత్రము యొక్కయు, యంత్రముయొక్కయు మహిమవలననే జరుగుచున్న ట్లు తలంపు గలుగును కావున నిదియు నపాయకరమైనది

గురుడు - కానిచో పోనిమ్ము దైవభక్తికి దూరము కానటువంటి దివ్యమంత్ర మొండు గలదు దీనికి సంతాన గోపాలమని పేరు దీనిని పుణ్యతీర్థమందు పుణ్యక్షేత్ర మందుగాని యుండి నియమముతో నక్షర లక్షలు జపమొనర్చినచో సిద్ధి యగును మఱల ప్రతిరోజును మంత్రశక్తి క్షయము నొందకుండుటకు షోడశావృత్తి జపించిన చాలును సంతానము లేక రాజకుటుంబములోగల రాణులకుగాని, సంతానము లేక అనేక పుణ్యకర్మల చేసియు సంతతి గలుగక పరితపించెడువారికిని దీనినుపదేశించినచో సంతతి గలుగును అందువలన వారు గొప్ప ధనమును ఖర్చుజేసి మఠము లను, పాఠశాలలను, సాధువులకు సత్రములను గట్టించెదరు ఈ మంత్రమును నేను చాల ప్రయాసపడి సంపాదించితిని

భారతి - ఇది పై జెప్పిన దోషములతో గూడియుండక పోయినను దీనివల్ల తన బ్రహ్మనిష్ఠనుండియు, దైవవిశ్వాసము నుండియు తాను జారిపోవును ఏలన! మంత్రబలముచే నటుల సంతానము గలిగినదను భావము గలుగును కాని దైవమహిమచే కలిగినదను బుద్ధి గలుగదు కాన నిదియు మంచిది కాదు తపస్సిద్ధి గలుగునపుడే సంతానోత్పత్తి గలుగుట మాత్రము కాదు అట్టి యోగి తలంచినదంతయు

ప్రయాస లేకయే గలుగును మఱియు కల్పవృక్షము, చింతామణి, కామధేనువు ద్గఱకు వెళ్ళిన వారి సంకల్పములు గూడ ఫలించును మనస్సులో గల వికల్పములు నశించి నిర్వికల్ప సమాధి గలుగుటయే కల్పవృక్షము చిత్తమందుగల చింతలన్నియు నశించి నిశ్చింత జ్ఞానము గలుగుటయే చింతామణి మనస్సులోగల కామములన్నియు నశించి జితకా ముడగుటయే కామధేను వనబడును అట్టి స్థితి నొందక ఈ చిన్న చిన్న కార్యములలో ప్రవేశించు వారెవరో వారు దీనులే యగుదురు

గురుడు - ఏల ఇట్టి దివ్యమంత్రములను నిర్లక్ష్యమును జేయుచున్నారు? 'అపుత్రస్య గతిర్నాస్తి'' అని తలంచి తపించువారికి నీ మంత్రోపదేశమును జేసి వారి సంసారమును వృద్ధిపఱచి వారి శోకాగ్నిని చల్లార్చి యానందము కలుగ జేయ గూడదా?

భారతి - ఇది పామరుల స్వభావము సంతానమువల్లగాని, కర్మలచేగాని, యుత్తమగతి గలుగదు అది తనయొక్క పుణ్యావర్తనముచేతను, జ్ఞానానుష్ఠానముచేత మాత్రము గలుగును ''అమృతత్వస్య నాశాస్తి విత్తేనేత్యేవ హి శ్రుతిః'' విత్తమువలనగాని, విత్తసాధ్యమగు యజ్ఞాది కర్మలవలనగాని అమృతత్త్వము సిద్ధింపదు

***ఋణమోచనకర్తారః పితుః సన్తి సుతాదయః ।***
***బంధమోచనకర్తా తు స్వస్మాదన్యో న కశ్చన॥***

తండ్రి చేసిన అప్పులను పుత్రాదులు తీర్చ గలరు కాని ఎవని భవబంధమును వాడే విముక్తిని జేసికొనవలెగాని యితరులు చేయజాలరు కనుక తన బంధమోచనమునకు తానే యత్నింపవలెను

**పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా ।**
**ఆరోగ్య సిద్ధిర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా ॥**

వ్యాధిగ్రస్తుడు తాను స్వయముగ నౌషధమును సేవించి పథ్యమును జేసిన యెడల వాని కారోగ్యము గలుగును వాని కొఱకితరులు ఔషధసేవయు పథ్యమును జేసినయెడల రోగియొక్క రోగము కుదురునా? కుదురదు మఱియు నిపుడు

ప్రపంచములో కనబడు జనులందఱు జన్మాంతరములో సంతానము లేనివారై యుందురా? సంతానముచే మోక్షము గలుగునది నిజమైనచో మఱల వారేల యిపుడు జన్మించిరి? కావున జ్ఞానమొక దానివల్లనే మోక్షము గలుగును అర్థానికి విషయవైరాగ్యము, ధ్యానము, బ్రహ్మవిచారణయు కావలయును ఒకవేళ స్వర్గము గూడ పుత్రుల వలన గలుగునని చెప్పినచో పూర్వజన్మములో పుత్రులు చేసిన కర్మలచే స్వర్గము కలిగియుండినచో నిపుడు మఱల నీ మనుజులందఱు నేల జన్మమెత్తవలయును? మఱియు పుత్ర శబ్దమునకర్థము యోగవాసిష్ఠమున నిట్లు గలదు త్రాణమును జేయు నదగుటవలన పుత్రశబ్దము గలిగినది జననమరణ దుఃఖసాగరమునుండి ఆత్మను తమయొక్క జ్ఞానమువల్ల నుద్ధరించుటయే పుత్రశబ్దము యొక్క యర్థమగును ''బోధో జ్ఞానమయస్సుతః'' తనకు ఆత్మబోధము గలుగుటయే సంతానశబ్దమునకర్థము దీనికి బ్రహ్మానుసంధాన ముండవలయునే గాని మఱియెన్ని సంతానములుండినను సాధ్యము గాదు

***ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నం సంసార వారిధౌ ।***
***యోగారూఢత్వమాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా ॥***

చిత్తనిరోధ రూప యోగారూఢ భావమును బొంది తత్త్వసాక్షాత్కారనిష్ఠతో, సంసార నిమగ్నుండైన తనను తానే యుద్ధరించుకొన వలయును (వివేకచూడామణి) గీతయందు గూడ 'ఉద్ధరేదాత్మనాత్మానం' అనియు గలదు మఱియు పురుషుడైనచో ముక్తికాంతతోను, స్త్రీయగుచో నాత్మారామునితోను రమించవలయును ఈ ప్రాపంచిక స్త్రీ పురుషుల చేరిక వలన సంతానము గలుగునట్లు ఆత్మారాముని యందు మనస్సు నైక్యపఱచుటచేత స్త్రీకిన్ని, ముక్తికాంతతో నైక్యము గలుగుటచే పురుషునకును జ్ఞానోదయమగును అట్టి జ్ఞానోదయము వలననే తరింపవలయును మఱియు ధృతరాష్ట్రునకు నూఱుగురు బిడ్డలుండిరి వారివల్ల తానేమి గతిని బొందెను? కావుననే వార్ధక్యకాలమున ధృతరాష్ట్రుడు భార్యయగు గాంధారితో గూడ వనములకేగి యుభయులును ధ్యాననిష్ఠాపరులై మోక్షముకొఱకు యత్నించిరి మఱియు పుత్రులు లేనివారికి సద్గతి లేదనెడి వాక్యముయొక్క నిజార్థమేమనగా, మనమెల్లరము

16 లేక 20 సంవత్సరములు మాతాపితరులచే సంరక్షింపబడి యున్నాము మనము శక్తిహీన స్థితి యగు బాల్యమున నున్నపుడు వారు యౌవనమందు శక్తిగలవారై యుండిరి మరల మనకు యౌవనమువచ్చి శక్తిగలుగునపుడు వారు వృద్ధులై శక్తిహీనులై యుందురు మనము శక్తిలేక శైశవావస్థ యందున్నపుడెన్ని సంవత్సరములు వారివల్ల పోషింపబడినవారమై వారికి ఋణస్థుల మైతిమో అన్ని సంవత్సరములు వార్ధక్యదశలో శక్తి హీనావస్థయందున్నపుడు వారిని పోషించి మాతాపితరుల ఋణమును తీర్పవలయును ఇదియే తల్లిదండ్రుల ఋణమును దీర్పవలయునని చెప్పెడి వాక్యముయొక్క నిజార్థము మాతాపితరులు వహించియుండు ప్రపంచకార్యము లన్నియు కొడుకు, కోడండ్రు, కూతుళ్లు వహించి జననీజనకులను దైవకార్యములలో ప్రవర్తించునట్లు చేసి, వారికి దైవకృప గలిగే లాగున చేసెడు పుత్రులే సత్పుత్రులగుదురు అయితే అమ్మయబ్బ లకు దైవకార్యమం దిష్టము లేనిచో నేమి చేయగలమని కొందఱు ప్రశ్నింతురు అట్లైనచో దోషము లేదు వారి సంస్కార మాలాగున నున్నదని తలంప వలయును కాని యన్న వస్త్రాదులను శక్తి వంచన లేక నిర్వహించుచు తల్లిదండ్రుల ఋణమును తీర్చవల యును మఱియు వారున్నప్పుడైనను లేక వారి యనంతరమైనను మాతాపితరుల జ్ఞాపకార్థమై శక్తి కొలది ధర్మకార్యములగాని, దైవకార్యములగాని చేయుట మంచిది అపుడు పుత్రులయొక్క మనస్సునకు గూడ శాంతి గలుగును అయితే కొందఱీ విధముగ జెప్పువారు గలరు ''మరణానంతర మిహలోకమున జేసెడు పితృక్రియలు పరలోకమందుండువారి కెట్లు చెందును? స్వగృహములో భోజనమును విస్తరలో నుంచగా గ్రామాంతరము వెళ్ళియుండు వారికే చెందుట లేదే'' యని వచింతురు ఇది కేవలము జడదృష్టితో గూడిన పామరుల ప్రశ్న యగును వీరికి మంత్రశక్తియందు గాని, మనశ్శక్తియందుగాని యనుభవము లేదు

ఒకవేళ పరలోకమందుండువారి కందకపోయినను పోవుగాక! కర్మయొక్క ఫలము కర్తలైన సంతానములకు తప్పక లభించునుగదా! ఒకడెంత దూరములో నుండినను మంత్రశాస్త్ర ప్రకారము వారి నామము నుద్దేశించి మారణప్రయోగము జేసినచో తప్పక వారికది తగులును కాని దీనికిని ప్రత్యక్ష ప్రమాణ మేమి యని యడుగుదురు అనేకుల కావిధముగ జరుగుచుండుటయే ప్రత్యక్ష ప్రమాణము

ఇది మంత్రశాస్త్రముయొక్క శక్తి మఱియు సర్పమంత్రమహిమచే దూరప్రదేశములో పాముయొక్క విషము తగిలినవారు తంతివార్తను బంపినచో నా భిషగ్వరుండు తంతివార్త తెచ్చినవారికి తీర్థము మంత్రించి యిచ్చుటగాని, వృక్షములకు లింగము కట్టుటవలనగాని విషశమనము జరుగుచున్నది ఇటువంటివి ఎన్నియో గలవు ఇంకను తపశ్శక్తి యోగశక్తి గలవారు తమ సంకల్పమువలననే యనేక కార్యముల జేయుదురు అట్టివారిపుడు లేనందుచేతనే శాస్త్రమందు విశ్వాసము సామాన్యులకు లేక పోవుచున్నది మఱియు నంత్యక్రియాసంస్కార కాలములలో క్రైస్తవులు, మహమ్మదీయులు, బౌద్ధులు, ఆర్యులు, బ్రహ్మసమాజస్థులు మొదలగువారు బైబిలు, ఖురాను, వేదపఠనము, అగ్నిహోత్రము మొదలగు కర్మలు వారివారి మతానుసారము మంత్రపూర్వకముగ జేయుచున్నారు దానివలన మరణించిన జీవికి ఫలము లేకుండినచో వారావిధముగ నేల జేయవలయును? మన నేత్రమునకు కనబడినది మాత్రము సత్యమనియు, కనబడనిది యసత్యమనియు తలంచరాదు మనదృష్టికి గోచరము గాని దివ్యశక్తు లెన్నియో గలవు అట్టి సంకల్పన శక్తిగల సిద్ధపురుషు లరుదుగా నున్నారు దానిచేతనే యిట్లు సందేహము గలుగుటకు కారణమైనది ఇపుడు నిస్తంత్రి వచనము (తంతిలేనివార్త) రేడియో లోకమంతటను వినుచున్నాము అంతేగాక లోకాంతరములకు గూడ దీనిని బంపవచ్చునని వారు చెప్పుచున్నారు ఇదియును నొకవిధమగు జడశక్తియై యుండగా చైతన్యముతో గూడిన మనశ్శక్తి యొక్క మహిమనేమని చెప్పవచ్చును! దీనినే వైర్లెస్ అని చెప్పెదరు మఱియు రేడియో యంత్ర ముండు గదిలో మాత్రమే ఆ శబ్దము వినబడును రేడియో యంత్రము లేని గదిలో నాశబ్దము వినబడదు ఆలాగుననే విశుద్ధాంతఃకరణము గలవారై యేకాగ్రతగల చిత్తము గలవారికే యది గోచరించును ఆకాశమునందు మనస్సంయమమును జేయుటకు శక్తిగల యోగికి అప్రత్యక్షమగు విషయము ప్రత్యక్షమగునని పాతంజలి యోగశాస్త్రమందు గలదు

గురుడు - ఇహలోకమునకు సంబంధించినవి పై జెప్పబడినవి ఇష్టము లేదేని స్వర్గలోకసుఖము నుద్దేశించి యజ్ఞాది క్రతువు లొనర్చెడు పరలోక సుఖ కారణముల నుపదేశించెదను

భారతి - యతివరా! యజ్ఞాది క్రతువులచే పరలోకసుఖము నుద్దేశించి చేయునది మధ్యమ ధర్మమనియు, ఇహసుఖమునకు మాత్ర మిచ్ఛ గలిగి ప్రవర్తించెడు కర్మ లధమములనియు, మోక్షముకొఱకు త్యాగమును జేసి తత్త్వవిచారణను జేయుట ఉత్తమ ధర్మమనియు వినియుంటిని మఱియు నుత్తమమగు సత్త్వగుణముతో గూడి యాత్మయజ్ఞమును జేయువారు శ్రేష్ఠులనియు, మధ్యమమగు రజోగుణాన్వితులై యజ్ఞాదిక్రతువు లొనర్చెడి వారు సామాన్యులనియు, విషయసుఖములను మాత్రముద్దేశించి ప్రాకృత క్రియాచారముల నాచరించువారు నికృష్టులనియు శాస్త్రసమ్మతము అంతేగాక పశువధతో గూడిన యజ్ఞముచే గలిగెడు సౌఖ్యము స్వర్గలోకమున రంభాది భోగమని గదా శాస్త్రప్రమాణము! ఈ విషయమై శ్రీగౌతమబుద్ధుడు యజ్ఞాది క్రతువులను జేయువారి నీలాగున ప్రశ్నించిరి అదేమనగా ఓ కర్మకాండ పరులారా! మీ గురువుగాని, తండ్రిగాని యజ్ఞమును జేసి స్వర్గములో రంభాది సుఖము లనుభవించుచుండినచో నామె మీకు గురుపత్నిగాని లేక మారుతల్లిగాగాని యుండ వలయును గదా! ఓహో! గురుపత్నీ గమనము, మాతృశయ్యాగమనము ''ఎంత పాపమైనది''? అట్టి ప్రశ్నకు భూలోకము నుండి నేటికిని సమాధానము రాలేదు బింబిసారరాజు చేయు యజ్ఞమం దిట్టి ప్రశ్నము సిద్ధార్థుడు వేసినప్పుడే బింబిసారుడు యజ్ఞాగ్నికుండములో నీళ్ళు పోసి యూపస్తంభమునకు కట్టియుండు సాధుపశువును విప్పి బయటకు దోలి పంపెను మఱియు హింస పాపమని యెట్టి మూఢునకైనను దెలియును ''అహింసా పరమో ధర్మః'' ధర్మము లన్నిటిలోను అహింసయే పరమ ధర్మమనియుండగా, ''అధర్మః ప్రాణినాం వధః'' అని శాస్త్రముద్ఘోషించు చుండగా నధర్మమగు ప్రాణిహింసవల్ల ధర్మప్రాప్తియగు సుఖ మెట్లు గలుగును? విషబీజము పెట్టినచో నమృతఫల మెటుల గలుగును? మఱియు నవరంధ్రములు మూసి చంపునప్పు డాప్రాణి యెంత సంకట మనుభవించుచుండునో గదా! దాని మాంసము నేతిలో వేయించి తినుటకన్న రాక్షసకృత్యము మరి యేది గలదు? మఱియు సోమలతయను నొక విధమగు తీగను నీరుగల మట్టి పాత్రలో వేసినచో నది కొన్ని రోజులకు పులిసి మద్యమువలె మత్తు కలిగించునదిగా నుండును దీనిని సోమరసమని అందురు దీనిని, మాంసమును హోమించుటయే గదా యజ్ఞము

**దేవానామమృతం న్నాణామృషీణాం చాఽన్న మోషధిః ।**
**దైత్యరక్ష పిశాచాద్యైర్దత్తం మద్యాఽమిషాది చ ॥**

శాస్త్రములో ఆహార విధిని జేయునపు డమృతము దేవతలకును, అన్నము మనుజులకును, ఫలమూలములను ఋషులకును, మాంసము, మద్యము రాక్షసాదులకును, తృణపత్రాదులు పశువులకును నేర్పడియున్నది అప్పుడీ మాంస భక్షకు లేవర్గమునకు జెందినవారని యోచించుటకు తగిన బుద్ధి యీ కలికాలమున లేదని చెప్పినచో నిక లోకస్థితి నేమని చెప్పవచ్చును? కనుకనే శ్రీకృష్ణుడు గీతయందు ''యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి'' యజ్ఞము లన్నిటిలోను జపయజ్ఞము విష్ణుస్వరూప మనియు, పుణ్యప్రదమనియు జెప్పుటకు కారణము మఱియు తైత్తిరీయ శ్రుతి యందు ఆత్మ యజ్ఞమును గురించి విపులముగ దెలుపబడి యున్నది అట్టి ఆత్మ యజ్ఞమును జేయువారు జ్ఞానామృతమును పానము జేసి జనన మరణ రహితమగు మోక్షమును పొందవచ్చును మఱియు కర్మయజ్ఞముచే నొకవేళ స్వర్గసుఖము గలిగినను ఆ పుణ్యము నశింపగానే భూలోకములోనికి దేవతలచే త్రోయబడుదురు కనుకనే ''క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి'' యని గీతా ప్రమాణము మఱియు శ్రీకృష్ణభగవానుడు యజ్ఞాదిక్రతువులను సువాసనయును, ఫలోపయోగమును, పూజార్హతయు లేని యెఱ్ఱని బాడిశపువ్వులవలె వర్ణించిరి దీనికన్న పరమప్రమాణము మరియొకటి కావలయునా?

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః ॥**

ఓ అర్జునుడా! పండితులు కానివారు వేదవాక్యముల యొక్క నర్థవాదములందాసక్తులై ఫలమును, వాసనయు లేని పుష్పమునువలె రమ్యమైన స్వర్గముకంటె నిత రమ్యమైనది లేదనెడి ఏ వాక్యమును జెప్పుచున్నారో యట్టివారికి మనస్సునందు నిశ్చయార్థము స్వరూపముగాగల బుద్ధి యుండదు మరియు నట్టి కర్మయజ్ఞమున కెంతయో ధనము కావలయును అనేక జనుల యొక్క సహాయము కావలయును,

ఆత్మయజ్ఞమన్నచో ఒక మనుజునితో గాని, ఒక వస్తువుతో గాని సంబంధము లేకయే ముక్తియను గొప్పసుఖమును కలుగ జేయుచుండ నిట్టి యాత్మయజ్ఞమును వీడుట విషామృతములను వివేచనను జేయు వివేకశక్తి లేనివాడు అమృతము నుపేక్షించి విషయుక్త వస్తువును భుజించినట్లు గదా! యని వచించెను

కొన్నిరోజు లీవిధముగ సంభాషించుచు ప్రతిరోజును సంధ్యాకాలమున భారతీదేవిగారు గురువరుని యాజ్ఞను బొంది రత్నమాంబగారితో గూడ నారీమణుల యాశ్రమమునకు వెళ్ళుచుండిరి మఱల ప్రాతఃకాల మెపుడువచ్చునా! యని చంద్రోదయమును నిరీక్షించుచుండు చకోరమువలె రాత్రి గడపి నాల్గవ యామారంభముననే స్నానమాచరించి యాచార్యసన్నిధి కరుదెంచి ప్రణామ మొనర్చి నిలుచుచుండగా నాచార్యుడు కూర్చుండ నాజ్ఞాపించుచుండిరి ఇదే రీతిగ ప్రతిదినమును సందేహనివృత్తి గలుగు వఱకు వచ్చి వెళ్ళుచుండునట్లు దేశికుండాజ్ఞాపించిరి

గురుడు - భారతీదేవిగారూ! మీకు గీతయందు మంచి పరిచయము గలిగి యున్నట్లు మీ వాక్యములవలననే దెలియుచున్నది గీత నిష్కామకర్మ యోగమును గదా యుపదేశించుచున్నది కావున ఫలాపేక్ష విడిచి పరప్రాణుల కుపకారమును జేయుచుండవచ్చును గదా? లేక ఈశ్వరార్పణ బుద్ధితో దైవకార్యములైనను జేయ వచ్చును ఇక తపస్సు చేసి యెపుడో సిద్ధి గలిగిన తర్వాత లోకోపకారమును జేయ వచ్చునని తలంచుట కన్న యిది (యుపకారము) ప్రత్యక్షముగా నిపుడు కనుపించునది గదా! అట్లయినచో గొప్పవారందఱు సంతోషింతురు కావలసిన సహాయమును గూడ చేయుదురు కావున గీతాధర్మము నవలంబింపవచ్చును గదా!

భారతి - గురువరేణ్యా! గీత కర్మయోగము నొక దానిని మాత్రము బోధించుట లేదు ఆరవ అధ్యాయమున ధ్యానయోగమును, పండ్రెండవ అధ్యాయమున భక్తియోగమును, పదునెనిమిదవ అధ్యాయమున మోక్షసన్న్యాసయోగమును, ఈ విధముగ పదునెనిమిది యోగముల నుపదేశించుచున్నది 'చతుర్విధ యోగములలో నిష్కామ కర్మయోగమును నొక యోగమనుటలో సందేహము లేదు కాని గీతోపదేశము ద్వితీయాధ్యాయమున

పదునాకొండవ శ్లోకమునుండి ప్రారంభించియున్నారు ఆ యధ్యాయమునకు సాంఖ్యయోగమని పేరు సాంఖ్యమునకు తత్త్వజ్ఞానమనియే యర్థము ఇందుచే తత్త్వజ్ఞానము ప్రధమమున సంపాదింపవలయునని తాత్పర్యమగుచున్నది మూడవ అధ్యాయమున కర్మయోగమును చెప్పుటకిదే కారణము వైద్యుడైన తరువాత వైద్యము చేయవలయును యోధుడైన పిదప యుద్ధమునకు దిగవలయును ఆలాగుననే తత్త్వజ్ఞానము గలిగిన పిమ్మట కర్మయోగమనుష్ఠింప వలసియుండును మఱియు 18 వ అధ్యాయములో మోక్షసన్న్యాసయోగమును జెప్పుటచే ముక్తికి సర్వసంగ సన్న్యాస మత్యవసరమని తెలియుచున్నది కావుననే శ్రీకృష్ణోపదేశము పొందిన ధర్మరాజాదు లంత్యమున సమస్తమును త్యజించినవారై సాధువేషమును ధరించి మహాప్రస్థానమునకు గడంగిరి మఱియు శ్రీమద్భాగవతమున నేకాదశ స్కంధమందు శ్రీకృష్ణుని యందు పరమభక్తిగల యుద్ధవునకు పరమార్థతత్త్వము నుపదేశించునపుడు సర్వసంగపరిత్యాగ మొనర్చి యొంటరిగా బదరికాశ్రమమగు పుణ్యక్షేత్రమునకు వెళ్ళి యోగసమాధినిష్ఠలో నుండేలాగున నుపదేశించిరి ఈ రెండు సంగతులను జూచిన సర్వసంగ పరిత్యాగమే పరమపురుషార్థమునకు హేతువని గోచరమగుచున్నది మఱియు నొక్కొక్కరి సంస్కారమును బట్టి కర్మయోగమందుగాని, భక్తియోగమందుగాని, ధ్యానయోగమందుగాని జ్ఞానయోగమందుగాని, ప్రవృత్తి గలుగును

కాని వీరునలువురు నీ నాల్గు గుణములు గలిగియుండ వలెను ఒక్కొక్కరి కొక్కొక్క దానియందు ముఖ్యబుద్ధియు తక్కిన వాటియందు గౌణబుద్ధియు నుండ వచ్చును నాల్గింటిలోను ముఖ్యబుద్ధి గలిగి జిజ్ఞాసువుల సంస్కారమును కనుగొని యుపదేశించువాడే గీతార్థమును సంపూర్ణముగా నెఱిగినవాడు లేనిచో దేనియందైన నొక దానియందు కొఱత గలవారే యగుదురు మఱియు పూర్ణప్రజ్ఞగలవాడు నాల్గింటి లోను సమర్థుడై యుండును నాలుగుపాదములు గలిగి మంచిస్థితి యందుండు గోవు ఏలాగున నుండునో ఆలాగున నాలుగు యోగములు గలవాడు పూర్ణుడై యుండును అట్లుగానిచో వారిస్థితి యపూర్ణమని గ్రహింపవలయును ఈ కాలమున ఆత్మతత్త్వమును బోధించెడు పరమత్యాగులు

ముఖ్యముగ నుండవలయును దానియందొక దానియందు మాత్రమే జనులకు నిరతిశయానందము గల్గును అట్లు కానందుచేతనే పాశ్చాత్త్యులును, ప్రాచ్యదేశస్థులగు జపానీయులును యుద్ధములో మునిగి నిప్పులో పడి మాడి పోయెడు మిడతలవలె నున్నారు పశ్చిమ దేశీయులకు శ్రీయేసు దీనినేనా యుపదేశించినది? తూర్పుదేశస్థులగు జపానీయులకు శ్రీగౌతమబుద్ధుడీ విధముగనేనా బోధించెను? కావున నాత్మశుద్ధియందు కొఱతగలిగి నందుచే దయాశూన్యులై, కఠినహృదయులై జనుల హృదయము చెడినందుచే లోకమంతటు కష్టము వాటిల్లెను తత్త్వజ్ఞానము బోధించెడువారు లేనందుచే మనవారికట్టి దుస్థితి గలిగెను మఱియు కర్మయోగాదులను గుఱించి మరియొక యభిప్రాయము వేదాన్తశాస్త్రము నందు గలదు నిష్కామ కర్మయోగముచే నంతఃకరణములో గల మలిన నివృత్తియు, భక్తియోగమగు దైవోపాసనచే హృదయములోగల విక్షేపనివృత్తియు, ధ్యానయోగముచే చిత్తములో గల చలనముడిగి యేకాగ్రతయు, తత్త్వబోధముచే ఆత్మ స్వరూపమును మరుగు పఱచెడు ఆవరణ నివృత్తియు గలుగునని కలదు ఉపాసన యందు యోగమంతర్భూతము అందుచేతనే గీత మొదటి ఆరు అధ్యాయములు కర్మయోగమును, 7 నుండి 12 వఱకు భక్తియోగమును, 13 నుండి 18 వఱకు జ్ఞానయోగమును నుపదేశించుటకు గారణమైనది అపుడే హృదయములోగల మల, విక్షేప, ఆవరణములను మూడుదోషములును తొలగును మలము బురద నీటి వంటిది విక్షేపము కదలెడు జలమువంటిది ఆవరణ మూయబడిన పాత్ర యందుగల జలము వంటిది ఈ మూడు దోషములు లేని పాత్రలో సూర్యబింబ మేలాగున స్పష్టముగ ప్రతిఫలించునో ఆ రీతిగ మల, విక్షేపావరణాది దోషరహితమగు హృదయమందు వెలుగుచుండు ఆత్మ చూడదగును

మఱియు శ్రీకృష్ణుడు భగవద్గీత నుపదేశించిన తర్వాత ఉత్తరగీత నుప దేశించియున్నాడు ఇది ధ్యానయోగపరముగాను, ఆత్మతత్త్వవిచారణ పరముగా నున్నది అందుచేతను కర్మయోగమంతఃకరణశుద్ధి కొఱకని స్పష్టమగుచున్నది ఒకవేళ కొంత నిష్కామ కర్మయోగమును విడువకుండినను వారుగూడ

నాత్మతత్త్వవిచారము జేసియుందురు ధ్యానమును తప్పక చేయుదురు కర్మయోగమును గుఱించి చెప్పునపుడు జనకుని అందఱును దృష్టాంతముగ వచింతురు శ్రీకృష్ణభగవానుడును ''కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః'' అని యుపదేశించి యున్నారు జనకునియొక్క జీవిత మంతయు యోగవాసిష్ఠమున గానదగును ఎంతటి తపోనిధి! ఎంతటి ధ్యానైక నిష్ఠుడు! ఎంత జ్ఞాన విచారతత్పరుడు''!

ఇట్లు సధైర్యముగ వచించెడు భారతీదేవియొక్క బుద్ధికుశలతయును, సంస్కృత పాండిత్యమును, తీవ్రమగుముముక్షుత్వమును, సత్యములోగల ధీరత్వమును, వైరాగ్యమును జూచి గురువరుడు ప్రసన్నవదనుడై యిట్లనియె

గురుడు - మీరు సూర్యకులమున నుద్భవిల్లినట్లు దెలిపితిరి సూర్యుని నుండి ప్రథమమున జన్మించినవాడు మనుమహర్షి ధర్మశాస్త్రము లన్నిటికిని మనుస్మృతి మూలమైనది దానియందు మూడుఋణములతో గూడి మనుజులు పుట్టుచున్నారనియు, ఆ ఋణత్రయము దీర్పక పోయినచో మోక్షము గలుగదనియు గలదు

**ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్।**
**అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః ॥**

ఋణముల మూడింటిని తీర్చియే మోక్షమునందు మనస్సును ప్రవేశపెట్టవలెను అట్లు ఋణముల మూటిని దీర్పక మోక్షమార్గమున మనస్సును ప్రవేశపెట్టినవాడు అధః పతితుడగును ఆ మూడు ఋణము లెవ్వియన, 1 ఋషి ఋణము, 2 పితృఋణము, 3 దేవఋణము

**అధీత్య విధివద్వేదాన్ పుత్రాంశ్చోత్పాద్య ధర్మతః।**
**ఇష్ట్వా చ శక్తితో యజ్ఞైర్మనో మోక్షే నివేశయేత్ ॥**

విధిచొప్పున వేదముల నధ్యయనమును జేసి ఋషిఋణమును, ఋతుకాలమున స్వభార్యయందు పుత్రోత్పత్తిని గావించి పితృఋణమును, శక్తి కొలది యగ్నిహోత్రాది కర్మల నొనర్చి దేవఋణమును తీర్చవలయును ఆవల

సన్న్యాసమున మనస్సును ప్రవేశపెట్టవలయును వీనికి ఋషియజ్ఞము పితృయజ్ఞము దైవయజ్ఞములని నామ ములు

భారతి - బ్రహ్మజ్ఞానైక నిలయా! శాస్త్రములలో ప్రవృత్తి మార్గమనియు, నివృత్తి మార్గమనియు రెండు మార్గములు అందుచే పై నుదాహరించిన ఋణత్రయ విషయము ప్రవృత్తి మార్గమేకాని నివృత్తి మార్గము కాదు ఆ మనుశాస్త్రమందే అంత్యమున ద్వాదశాధ్యాయమందు కేవలము నివృత్తి మార్గముపదేశింపబడి యున్నది అచట బ్రహ్మవిచారణ యొకదాని వలననే మోక్షము గలుగునని తెలుపబడెను ఆలకించుడు

***సర్వమాత్మని సంపశ్యే త్సచ్చాసచ్చ సమాహితః ।***
***సర్వం హ్యాత్మని సంపశ్య న్నాధర్మే కురుతే మనః ॥***

సత్పదార్థమును నసత్పదార్థమును నెఱిగి, యది యంతయు బ్రహ్మస్వరూపమనియు, పరమాత్మస్వరూపమగు తనయందిది యెల్ల నున్నదనియు నెఱిగినవాడై అట్టి ఆత్మస్వరూపమును ధ్యానప్రకర్షచే నసత్పదార్థము లేదనెడి భామును ప్రత్యక్షముగ జేసికొనవలయును తన్ను తానెఱుంగవలెననియు తాత్పర్యము అట్లు తన్ను తానె ఱింగినవా డసత్కర్మలయందు మనంబునుంచ జాలడు

***తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్ ।***
***తపసా కల్మషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥***

తపస్సును, బ్రహ్మజ్ఞానమును విప్రునకు మిక్కిలి మేలొసగును తపస్సుచే నంతఃకరణమందుగల దోషములు నశించును బ్రహ్మజ్ఞానముచే మోక్షము నొందును

***అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠా గ్రంధిభ్యో ధారిణో వరాః ।***
***ధారిభ్యో జ్ఞానినః శ్రేష్ఠా జ్ఞానిభ్యో వ్యవసాయినః ॥***

ఇంచుకంత వేదాధ్యయనము చేయనివారికంటెను కొంతవరకు చదివినవాడు శ్రేష్ఠుడు అట్టివానికంటెను పూర్తి గ్రంథము నభ్యసించినవారు శ్రేష్ఠులు కేవల

గ్రంథపఠనము చేయువారి కంటె వేదార్థములను వర్ణించు వారు శ్రేష్ఠులు వేదములను, వేదముల యర్థములను వర్ణించువారికంటె తదర్థజ్ఞానము గలవారు మిక్కిలి శ్రేష్ఠులు వారికంటె చక్కగ ననుష్ఠించువారు మీదు మిక్కిలి శ్రేష్ఠులు ఆత్మానుభవనిష్ఠ గలవారందరి కన్న నుత్తములని భావము

*వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞో యత్ర తత్రాశ్రమే వసన్ ।*
*ఇహైవ లోకే తిష్ఠన్ స బ్రహ్మభూయాయ కల్పతే ॥*

వేదమును వేదార్థమగు బ్రహ్మతత్త్వము నెవడెఱుంగునో వాడు బ్రహ్మజ్ఞానము గలవాడగుటచే బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమ ములలో దేనియందున్నను నీ లోకముననే యుండి మోక్షమును బొందుచున్నాడు అనగా గృహమందుండినను, వనమందుండినను వాడు ముక్తుడు

పిదప భారతి యిట్లనియె - బ్రహ్మచర్యాశ్రమమునుండి తురీయాశ్రమ ములో ప్రవేశించినవారు పూర్వకాలములోను అనేకులుండిరి ఆ విషయమై పద్మపురాణమున నొక కధ గలదు

*పురా మధువనే పుణ్యే ఋషి రాసీద్విశాలకః।*
*తపోఽధ్యయనసంపన్న స్తేజసా బ్రహ్మణా సమః ॥*
*జజ్ఞిరే తస్య రేవత్యాం నవపుత్రా గ్రహా ఇవ।*
*ధ్రువశ్శశీ బుధస్తారో జ్యోతిష్మానితి పంచమః॥*
*అగ్నిహోత్ర ప్రియా స్సర్వే గృహధర్మేషు రేమిరే।*
*నిర్మోహో జితమాయశ్చ ధ్యానకాష్ఠో గుణాధికః ॥*

*ఏతే గృహే విరక్తా హి చత్వారో ద్విజసూనవః।*
*చతుర్థాశ్రమ మాపన్నా స్సర్వకర్మ సునిస్పృహాః ॥*
*గ్రామైకనిరతా స్సర్వే నిస్సంగా నిష్ప్రతిగ్రహాః।*
*నిశ్శిఖా నోపవీతాశ్చ సమలోష్టాశ్మకాంచనాః ॥*

*యేన కేన చిదాచ్ఛన్నాః యేనకేన చిదాశితాః ।*
*సాయం గృహస్థితా నిత్యం బ్రహ్మధ్యాన పరాయణాః ॥*

*జితేంద్రియా నిరాహారా శీతవాత సహిష్ణవః।*
*పశ్యంతో విష్ణురూపేణ జగత్సర్వం చరాచరమ్ ॥*
*చరంతి లీలయా పృథ్వీం తేఽన్యోన్యం మౌనమాశ్రితాః।*
*న కుర్వంతి క్రియాం కాంచి దణుమాత్రం చ యోగినః।*
*దృష్టజ్ఞానాస్త్వసందేహాః చిద్విచార విశారదాః ॥*

పూర్వము మధువనములో విశాలకుడను ఋషి యొకడుండెను ఆయన చక్కగ వేదాధ్యయనము జేసినవాడు చక్కగ తపస్సును జేసినవాడు తేజస్సునందు బ్రహ్మను బోలియుండెను ఆయన రేవతి యనుకన్యను పెండ్లి చేసికొనెను ఆమెయందు నవగ్రహములో అను నట్లాయనకు తొమ్మిది మంది కుమాళ్ళు గలిగిరి అందు ధ్రువుడు, శశి, బుధుడు, తారుడు, జ్యోతిష్మంతుడు అను నీ యైదుగురున్ను అగ్నికార్యము మొదలగు వైదిక కర్మల యందాసక్తి గలవారై గృహస్థాశ్రమమందు వర్తించు చుండిరి మఱియు నిర్మోహుడు, జితమాయుడు, ధ్యానకాష్ఠుడు, గుణాధికుడను నీ నల్గురు బ్రహ్మనిష్ఠులు వైరాగ్యము గలవారై యిల్లు విడిచి నాల్గవ ఆశ్రమమైన యిత్యా శ్రమమందున్నవారై, సకలకర్మలందును నిచ్ఛ లేనివారై, ఒక్కొక్క యూరియందొక్కొక్క రాత్రి మాత్రము నివసించు చుండిరి విషయములం దాసక్తి లేక యుండిరి ఇతరులవద్ద ఏమియు తీసికొనకయు శిఖాయజ్ఞోప వీతములు లేనివారై యుండిరి మట్టి, రాయి, బంగారు వీటియందు సమభావము గల్గియుండిరి అనగా ద్రవ్యాపేక్ష లేనివారైయుండిరి దేహమును కప్పుకొనుటకు నేది దొరికితే దానితో దేహాచ్ఛాదనను జేసికొనుచుండిరి తమకు లభ్యమైన యాహారము తినువారై యుండిరి సాయంకాలమునకు నేయిల్లుగుపడితే ఆ యింటియందు నివసించెడివారు ఎడతెగక బ్రహ్మధ్యాన మును జేయుచుండిరి మఱియు వారలు జితేంద్రియులును, నిరాహారులున్నునై యుండిరి చలిగాలికి ఓర్చుకొనుచుండిరి చరాచరములతో గూడిన అనగా స్థావర జంగమరూపమైన యీ ప్రపంచమంతయు విష్ణురూపమని యెంచుచుండిరి మౌనము ధరించి విలాసముగ నీ లోకమునందంతటు సంచరించుచుండిరి ఒకప్పుడేని కొంచమైనను యోగీశ్వరులు చేయని కార్యమును జేయువారు కారు మరియు వారు తత్త్వము

దెలిసిన వారై జ్ఞానవిషయమున అణుమాత్రమైనను సందేహము లేక మిగుల సామర్ధ్యము గలవారై లోకమందంతటను సంచరించుచుండిరి మరియు,

**యధా జాతబలో వహ్నిర్దహత్యార్ద్రానపి ద్రుమాన్ ।**
**తధా దహతి వేదజ్ఞః కర్మజం దోషమాత్మనః ॥**

ఎట్లు జ్వలించుచున్న యగ్ని పచ్చిమ్రాకులను కాల్చివేయ జాలియున్నదో ఆలాగుననే వేదమూలమగు నాత్మజ్ఞానము నెఱింగినవాడు తన దుష్కృత దోషముల నన్నిటిని దహింప జేయగలడు

**యధోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః ।**
**ఆత్మజ్ఞానే శమే చ స్యా ద్వేదాభ్యాసే చ యత్నవాన్ ॥**

బ్రాహ్మణుడు శాస్త్రవిహితములగు నగ్నిహోత్రాది కర్మలను పరిత్యజించియైనను, పరమాత్మచింతనము, ఇంద్రియజయము, ప్రణవజపము, ఉపనిషదాది పారాయణము మొదలగు వీటియందు ప్రయత్నపరుడై యుండవలయును

**ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానా మేతి సామ్యతామ్ ।**
**నివృత్తం సేవమానస్తు భూతాన త్యేతి పంచ వై ॥**

ప్రవృత్తి కర్మలగు యజ్ఞ దానాదుల ననుష్ఠించుటచేత దేవలోకములో దేవతలతో సమానత్వము నొందును నివృత్తి పరమగు బ్రహ్మనిష్ఠానుష్ఠానముచేత జన్మమును గలిగించెడి పంచభూతములను దాటి మోక్షమును నొందుచున్నాడు

**అకామోపహతం నిత్యం నివృత్తం చ విధీయతే ।**
**కామతస్తు కృతం నిత్యం ప్రవృత్త ముపదిశ్యతే ॥**

ఫలాపేక్ష లేక నిత్యమును జేయబడు కర్మ నివృత్త మనబడును ఫలాపేక్ష గలిగి చేయు కర్మ ప్రవృత్త మనబడును

**ఇహ చాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే ।**
**నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్త ముపదిశ్యతే ॥**

ఇహలోకసుఖ నిమిత్తకమును, స్వర్గలోకసుఖ నిమిత్తకమును నగు కర్మ ప్రవృత్త మనబడును ఇహలోక ఫలముగాని, స్వర్గలోక ఫలముగాని లేక బ్రహ్మజ్ఞానము నల వరచుకొనుటకు జేయు ధ్యానాద్యనుష్ఠానము నివృత్త కర్మమనబడును

**సుఖాభ్యుదయికం చైవ నై శ్రేయసిక మేవ చ ।**
**ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికమ్ ॥**

ఈ వైదిక కర్మ స్వర్గాది సుఖప్రాప్తి హేతువగుటచే ప్రవృత్తి కర్మయనియు, సంసారనివృత్తి హేతువైన జ్ఞానానుష్ఠానమాచరించినచో, నివృత్తికర్మయనియు నిరు తెఱగులుగా భిన్నమైయున్నది

***వేదాభ్యాసస్తపో జ్ఞాన మింద్రియాణాం చ సంయమః ।***
***అహింసా గురుసేవా చ నిశ్శ్రేయసకరం పరమ్ ॥***

ఉపనిషదాదులను పఠించుట, తప మాచరించుట, ఉపనిషదర్థము నెఱుగుట, బ్రహ్మజ్ఞానము, ఇంద్రియనిగ్రహము, అహింసావ్రతము, గురుశుశ్రూష యివి యెల్లను మోక్షమునకు ముఖ్యసాధనములు

***సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।***
***సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి ॥***

స్థావర జంగమ రూపములగు సర్వభూతంబులందును ఆత్మ స్వరూపముతో నున్నను, సర్వభూతములును పరమాత్మ స్వరూపముగా తనయందున్నవి యను జ్ఞానముగలవాడై బ్రహ్మార్పణ బుద్ధితో నాత్మ యజ్ఞమును జేయువాడు బ్రహ్మత్వమును పొందుచున్నాడు దీనికన్నను పరమప్రమాణ మింకేమి కావలయును? మఱియు బృహదార ణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యమైత్రేయీ సంవాదమొకటి గలదు ఇది తమకు తెలియనిది కాదు స్త్రీలకు సంబంధించినదగుటచే నిచట ఉద్ధరింప తలంచడమైనది ( బృహదారణ్యకోపనిషత్ - చతుర్థాధ్యాయము, చతుర్థ బ్రాహ్మణము )

***ఉ॥ మైత్రేయీతి హోవాచ యాజ్ఞవల్క్య ఉద్యాస్యన్వా అరేఽహమస్మాత్ స్థానాదస్మి హన్తతేఽనయా కాత్యాయన్యాఽన్తం కరవాణీతి ॥***

యాజ్ఞవల్క్య మహాఋషికి మైత్రేయి,కాత్యాయనులను ఇద్దరు భార్యలు కలరు వారిలో మొదటి భార్యయగు మైత్రేయిని యాజ్ఞవల్క్య మహాఋషి పిలచి ఓ మైత్రేయీ! నేను ఈ గృహస్థాశ్రమమునుండి శ్రేష్ఠమగు సన్న్యాసాశ్రమము పొందుట కిచ్ఛ గలవాడ నగుచున్నాను కనుక నీ యంగీకారమును గోరుచున్నాను మరియు ఈ నారెండవ భార్యయగు కాత్యాయనితో నీకు ధన విభాగమును చేసెదనని పలికెను

**ఉ॥ సా హోవాచ మైత్రేయీ! యన్నుమ ఇయం భగోః సర్వా పృధివీ విత్తేన పూర్ణాస్యా త్కధంతే నామృతా స్యామితి నేతిహోవాచయాజ్ఞవ ల్క్యో యదైవో పకరణవతాం జీవితం తధైవ తే జీవితగ్ స్యాదమృతత్వస్యతుంనాశాస్తి విత్తేనేతి ॥**

ఇట్లు యాజ్ఞవల్క్య మహాఋషిచేత పలుకబడిన ఆ మైత్రేయి, ఓ యాజ్ఞవల్క్య మహాఋషీ! సముద్రముచేత చుట్టబడిన యీ సమస్త భూమియు ధనముచేత నిండినదగునా? అట్టి ధనముచేత నేను ముక్తురాలగుదునా యని పలుకగా, ఆయన అట్లు కాదు గాని లోకమునందు సమస్త సాధనములు గలవారలకు సుఖజీవన మెట్లు గలుగునో ఆ విధముగానే నీకును ధనముచేత సుఖజీవనము కలుగును గాని మనస్సుతో నైనను మోక్షేచ్ఛ లేదని పలికెను

**ఉ॥ సాహోవాచ మైత్రేయీ! యేనాఽహం నామృతాస్యాం కిమహం తేన, కుర్యాం యదేవ భగవాన్వేద తదేవ మే బ్రూహీతి॥**

ఈ పూర్వము చెప్పిన ప్రకారము యాజ్ఞవల్క్యమహాఋషిచేత పలుకబడిన ఆ మైత్రేయి '' ఓ యాజ్ఞవల్క్యమహాఋషీ! నేను ఏ ధనముచేత ముక్తురాలనుకానో, అట్టి ధనముతో నేను ఏమి చేయుదును కనుక పూజ్యుడవగు నీవు మోక్షసాధనమని దేనిని తెలిసికొని యున్నావో, అట్టి మోక్షసాధనమునే నాకొఱకు చెప్పుమా'' యని పలికెను

**ఉ॥ సహోవాచ యాజ్ఞవల్క్యః ప్రియా బతారే నః సతీ ప్రియం భాషస ఏహ్యాస్స్వ వ్యాఖ్యాస్యామి తే వ్యాచక్షాణస్య తు మే నిదిధ్యాసస్వేతి ॥**

ఇట్లు మైత్రేయి విత్తసాధ్యమైన మోక్షసాధనమును తిరస్కరింపగా,

యాజ్ఞవల్క్య మహాఋషి సంతోషించినవాడై, ఓ మైత్రేయీ! పూర్వము నాకు ఇష్టురాలైతివి, ఆహా ఇప్పుడును ఇష్టమునే పలుకుచున్నావు రమ్ము కూర్చుండుము నీ కిష్టమును, మోక్షసాధనమునగు ఆత్మజ్ఞానమును జెప్పెదను ఇట్లు చెప్పుచున్న నాయొక్క వాక్యములను అర్థముతో నిశ్చయముగా ధ్యానించుటకు కోరుమా యని పలికెను

*ఉ॥ సహోవాచ న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవ త్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి, నవా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవత్యాత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి, న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవంత్యాత్మనస్తు కామాయపుత్రాః ప్రియా భవంతి, నవా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి, నా వాఅరే పశూనాం కామాయ పశవః ప్రియా భవన్తి ఆత్మనస్తు కామాయ పశవః ప్రియా భవన్తి, నవా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవత్యాత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి, నవా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియంభవత్యాత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి, నవా అరే లోకానాం కామాయ లోకాః ప్రియాభవన్త్యాత్మనస్తు, కామాయ లోకాః ప్రియా భవన్తి, నవా అరే దేవానాం కామాయ దేవాః ప్రియాభవన్త్యాత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవన్తి, నవా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి భవన్త్యాత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి, నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవత్యాత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదగ్ సర్వం విదితమ్*

ఇట్లు ఆ యాజ్ఞవల్క్య మహాఋషి తన భార్యయగు మైత్రేయిని స్తుతించి మోక్షసాధనమగు వైరాగ్యమునుపదేశించుటకు కోరినవాడై, ఆ సన్న్యాసము కొఱకు, జాయాపుత్రాదులనుండి విరాగమును బుట్టించుచున్నాడు ''ఓ మైత్రేయీ! లోకము నందు పెనిమిటియొక్క ప్రయోజనము కొఱకు భార్యకు పెనిమిటి ప్రియుడు కాడు మఱేమనిన, ఆత్మ ప్రయోజనము కొఱకే భార్యకు పెనిమిటి

ప్రియడగు చున్నాడు ఆ ప్రకారముగానే జాయాపుత్రవిత్తాదు లన్నియును ఆత్మప్రయోజనము కొఱకే ప్రియములగుచున్నవి ఇట్లు ఇతరమైన జాయాపుత్రాది సమస్తమునందుండెడి ప్రీతి, ఆత్మ ప్రాధాన్యమైనదియేగాని, సహజమైనదిగాదు కనుక ఆత్మ ప్రీతియే ముఖ్యమైనది అందువలన ఆత్మస్వరూపమే చూడదగినది ఆచార్యునివలన వినదగినది మననము చేయదగినది ధ్యానించదగినది యగుచున్నది ఇట్లు శ్రవణ, మనన, నిదిధ్యాసన ములను నిమిత్తములచేత ఆత్మ చూడబడిన దగుచున్నది ఆత్మయందు అజ్ఞానముచేత ఆరోపిత జ్ఞానవిషయమైన బ్రహ్మక్షత్రాది కర్మ నిమిత్తకమగు వర్ణాశ్రమాది లక్షణము త్రాటియందు సర్పజ్ఞానమువలెనే కలుగుచున్నది ఈ యజ్ఞానము ఆత్మ స్వరూపము యొక్క శ్రవణమనన నిదిధ్యాసనములచేత నివర్తించి, సమస్తమును తెలియబడినదై బ్రహ్మాత్మైక్య విషయమగు సమ్యగ్దర్శనము (బ్రహ్మస్వరూప మే తానవెడి నిశ్చయ జ్ఞాన ము) కలుగుచున్నదని యాజ్ఞవల్క్యమహాఋషి, భార్యయగు మైత్రేయితో పలికెను

***ఉ॥ బ్రహ్మ తం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మవేద క్షత్రం తం పరాదా ద్యోఽన్యత్రాత్మనఃక్షత్రం వేద లోకాస్తంపరాదుర్యోఽ న్యత్రాత్మనోలోకాౕ వేద దేవాస్తంపరాదుర్యోఽన్యత్రా త్మనో దేవాన్వేద భూతాని తం పరాదు ర్యోఽన్యత్రాత్మనో భూతాని వేద సర్వం తం పరాదా ద్యో ఽన్యత్రాత్మనః సర్వం వేదేదం బ్రహ్మేదం క్షత్రమిమే లోకా ఇమే దేవా ఇమాని భూతానీదగ్ం సర్వం యదయమాత్మా ॥***

ఇంతకు పూర్వము శ్రవణమనననిదిధ్యాసనములచేత ఆత్మస్వరూపము తెలియబడిన యెడల సమస్తమును తెలియబడుచున్నదని చెప్పబడినది అదెట్లనగా ఆత్మయే సర్వస్వరూపము గనుక ఆసర్వస్వరూపమైన ఆత్మ తెలియబడగా సర్వమును తెలియబడుచున్నది ఆత్మయే సర్వస్వరూప మెట్లగుననిన, ఎవడు ఈ బ్రాహ్మణ జాతిని, క్షత్రియజాతిని, లోకములను, దేవతలను, భూతములను మఱియు నితరమగు సమస్తమును ఆత్మస్వరూపముకంటె వేరుగా చూచుచున్నాడో, వానిని, ఈ బ్రాహ్మణా ది సమస్తమును అన్యముగానే చేయుచున్నది ఈ కనబడెడి

బ్రహ్మ క్షత్రాది సమస్తమును సృష్టికాలమునం దాత్మవలన బుట్టి లయకాలమునందు ఆత్మ యందే లీనమై, స్థితి కాలమునందాత్మ స్వరూపమైయున్నది కాబట్టి ఆత్మకంటే వేరుగా నేదియును తెలియ బడదు ఇట్లు తెలియబడక పోవుటవలన సర్వమును ఆత్మ స్వరూపయ్యే యున్నది కనుక ఇట్లు ఆత్మను తెలిసికొని ఆత్మే తానగుటవలన సర్వము తెలియబడినదగు చున్నది

*ఉ॥ స యధా దున్దు భ్వేర్హన్య మానస్య న బాహ్యాఞ్ఛబ్దాఞ్ శక్ను యాద్గ్రహ ణాయ దున్దుభేస్తు గ్రహణేన దున్దుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః ॥*

ఎట్లు ఈ సర్వము ఆత్మస్వరూపముగానే గ్రహించుటకు శక్యమగుచున్నది యనిన సర్వమును చిన్మాత్రస్వరూపమును అనుసరించి పొందుటవలన అంతటను చిత్స్వరూపతయే తోచుచున్నది-

ఈ యాజ్ఞవల్క్య మైత్రేయి సంవాదము గ్రహించిన, విరక్తులై త్యాగులై వెళ్ళెడు భర్తలయందు ఉత్తమ పతివ్రతలగు భార్యలెట్లు ప్రవర్తింపవలసి యుండునో గ్రహింప దగును

గురుడు - ఋషులు దీర్ఘదర్శకులు, త్రికాలజ్ఞానులు, జీవితము శుద్ధముగా నుండి అంత్యకాలవు వఱకు వ్రత భంగము గలుగకూడదని తలంచియే బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములను విధించిరి

భారతి - ఋషులు పరమపూజ్యులు దైవమందెంత భక్తిగలదో, పరమ మునులపై నను నాకంతభక్తి గలదు ఋషులు విధించిన దానిని పూర్వోత్తర విచారణను జేయక పోవుటలో గల దోషమేగాని, మఱి యొకటి గాదు ఋషులు ముముక్షువులను గాను, బుభుక్షువులను గాను, జీవులను రెండుభాగములుగా జేసియున్నారు అనగా ప్రవృత్తి మార్గస్థులనియు, నివృత్తిమార్గస్థులనియు వీరిపేర్లు ప్రవృత్తిమార్గస్థులకు వేదమార్గ మును, నివృత్తిమార్గస్థులకు వేదాంతమార్గమును నుపదేశించియున్నారు కావుననే సంసారమార్గమనియు, సన్న్యాస మార్గమనియు నిరుతెగలుగా నేర్పడుటకు కారణము మఱియు ప్రవృత్తి మార్గస్థులు గూడ బ్రహ్మచర్యాది నాలుగు మార్గములను విధిగా నాచరించవలయును గదా! అట్లయిన

నీ కాలమున బ్రహ్మచర్యాశ్రమము ననుష్ఠించు వారెందఱు గలరు? వానప్రస్థాశ్రమము నాచరించు వారెందఱు గలరు? ఈ రెండాశ్రమ ములును ముఖ్యములు గావా! శాస్త్రములో పిపీలికామార్గమనియు, విహంగమార్గమనియు, నిరు తెరగులు గలవు పిపీలికామార్గము గృహస్థులకును, విహంగమార్గము సన్న్యాసులకును నేర్పడినది ఒక వృక్షాగ్రమందు తేనెయుండిన చీమ యొక శాఖను యెక్కి మఱియొక శాఖను పొందవలసి యుండినచో క్రిందికి దిగి, యితర కొమ్మలపైకి వెళ్ళవలసియుండును ఇది క్రమముక్తి యనబడును విహంగమమైనచో పిపీలికవలె క్రిందకు దిగి యితర శాఖలకు వెళ్ళకుండగనే, మొదటి శాఖ నుండి రెండవ శాఖకు గాని, మూడవ శాఖకుగాని, నాల్గవ శాఖకుగాని, యెట్లెగిరి పోవునో, ఆ రీతిగ జన్మాంతర సుకృత విశేషముచే వైరాగ్యము గల జీవియైనచో, బ్రహ్మచర్యము నుండియే వానప్రస్థమునకుగాని, సన్న్యాసమునకుగాని పోవచ్చును ఋషులలో గూడ దత్తాత్రేయ, శుక, సనకాదులే దీనికి తార్కాణము

*బ్రహ్మచారీ గృహీవాఽపి వాన ప్రస్థోఽథవా యతిః ।*
*నారీ వా వృషలో వాఽపి పక్వో బ్రహ్మ విచారయేత్ ॥*

బ్రహ్మచారియు, గృహస్థుడును, వానప్రస్థుడు లేక యతియును, స్త్రీయైనను, శూద్రుడైనను, పరిపాకమును జెందినవారెవ్వరైనను, బ్రహ్మవిచారమును చేయవచ్చును

*సోపానవత్పరం ప్రాప్తుం భవిష్యత్యాశ్రమక్రమః ।*
*అత్యన్త పక్వచిత్తస్య క్రమాపేక్షా న విద్యతే ॥*

ఆశ్రమములయొక్క వరుస, సోపానములవలె పరస్వరూపమును పొందుట కాధారమగుచున్నది అయినను మిగుల పరిపక్వమగు చిత్తము గలవారికి యీ యాశ్రమక్రమము ననుసరించు టవసరము లేదు

గురుడు - ఋషులు పరమ దయాస్వరూపులగుటచే నేలాటి పతనము గలుగ కూడదని నాలుగాశ్రమముల నేర్పఱచిరి వారి యాజ్ఞ నతిక్రమించుట తగునా?

భారతి - దీనియొక్క సారము ప్రవృత్తిమార్గ, నివృత్తిమార్గ విభాగముచేత నిరూపించడమైనది అయితే ఋషులు పరమకారుణికులైనది నిజమైనచో నెందరో బాలవితంతువులు గలరు ఎందరో వితంతువులు యువతులుగా నుంటున్నారు వారిలో నివృత్తిమార్గాపేక్ష లేనివారికి ప్రవృత్తి మార్గావలంబన మేల విధింపలేదు? పోనిండు ఆ వితంతువులు సన్మార్గమందు లేరని తమ యభిప్రాయమా? అట్లు అభావవైరాగ్య మవలంబించియుండు వారు గూడ మంచిస్థితిలో నుండగా, స్వభావవైరాగ్యము గలవారు నిర్మలస్థితిలో నుండగల రనుటలో సందేహమేల? ఈ విషయమై స్త్రీల కార్యములో చాల యన్యాయమొనర్చియున్నారు పురుషులకు పునర్వివాహ మును జేయవచ్చుననియు, స్త్రీల కక్కర లేదనియు జెప్పెడు విధి పక్షపాతమని తప్పక ఒప్పుకొనదగినది కాని వేదమందును, మనుస్మృతియందును, పరాశరస్మృతి యందును నిటువంటి దోషములు లేవు కాని మనుస్మృతి యందు నియోగపద్ధతి యున్నది అది కలియుగమందక్కర లేదని కలియుగ పండితులు నిర్ణయించిరి పరాశరస్మృతియందు పునర్వివాహ కారణము విధించిన యీ ప్రమాణ శ్లోకమునకు విరుద్ధార్థమును వ్రాసినారు దీనిని యుగాంతర ప్రమాణమని గూడ వచించిరి కలియుగమునకేర్పడిన ప్రమాణ గ్రంథమగు పరాశరస్మృతిలోగల ప్రమాణశ్లోకము యుగాంతర ప్రమాణమని చెప్పుటకెట్లు సాహసించిరో, మిక్కిలి యాశ్చర్యమగు చున్నది అది యసత్యార్థము గనుకనే సత్యమగు ప్రమాణము బయలు పడినది కనుకనే యిపుడు పునర్వివాహము సర్వజాతులందు జరుగుటకు కారణము అది యిపుడు మనకు ప్రస్తుత విషయము కానందుచే విడిచి పెట్టడమైనది

***నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ ।***
***పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే ॥***

పతి దేశాంతరమునకు పోయి వార్త దెలియకుండినను, మృతినొందినను, సన్న్యసించినను, నపుంసకుడైనను, పతితుడైనను స్త్రీలకు వేఱొక పతి విధింపబడు చున్నాడు (పరాశరస్మృతి)

గురుడు - నాల్గంతస్థులలో సౌధము నిర్మింపవలసియుండినచో మూడంతస్తుల గట్టక నాల్గవ యంతస్తు ఆకాశమున నెట్లు నిర్మింపబడును?

భారతి - గత సంవత్సరమునగాని, దానికి ముందు సంవత్సరమునగాని, మూడంతస్తులు కట్టి కారణాంతరముచే నాల్గవది కట్టుట నిలిచి పోయెను ఈ సంవత్సరము నాల్గవ యంతస్తు నిర్మింప ప్రారంభించినపు డిదివరలో కట్టియుండు మూడంత స్తులను దీసివేసి కట్టవలయునా? లేక మూడంతస్తు లిదివరలో కట్టి యుండుటచే నాల్గవ యంతస్తు మాత్రమిపుడు కట్టిన చాలదా? ఆలాగున జన్మాంతరములో పూర్వాశ్రమ విధుల మూడింటి ననుష్ఠించి వచ్చినందుచే నీ జన్మములో పూర్వాశ్రమ విషయములలో ననిష్టము గలిగినది ఉత్తరాశ్రమ నిర్విషయ జ్ఞానమునం దభిలాష గలిగినది కావున నీ విషయమై యింతటితో ముగించెదను కావుననే శుకబ్రహ్మర్షి యొక్క వైరాగ్యమును జూచి జనకుడు మనంబున దుఃఖపడుటకు కారణమైనది ప్రారబ్ధము మూడు విధములు 1 శుద్ధప్రారబ్ధము 2 మధ్యమ ప్రారబ్ధము, 3 మలిన ప్రారబ్ధము, శుక సనక సులభాదులది యుత్తమము యాజ్ఞవల్క్య, విశ్వామిత్ర, మైత్రేయాదులది మధ్యమము వీరు కొంతకాలము సంసారములో నుండిన వారగుటచే మధ్యమమని చెప్పుటకు కారణము జనక చూడాలాదులది మలిన ప్రారబ్ధమనబడును యావజ్జీవమును గృహస్థాశ్రమములో నుండుటచే నట్లు చెప్పుటకు కారణమైనది కాని యందఱును జ్ఞానములో సమానులే జీవితములోగల కార్యములో మాత్రము భేదము గలదు మఱియు నిటువంటి ధర్మసందేహము గలుగు నపుడు ముఖ్యమును గ్రహించి గౌణమును త్యజింపవలయునని శాస్త్రనియమము

**శ్రుతి స్మృతి పురాణేషు విరుద్ధేషు పరస్పరమ్ ।**
**పూర్వం పూర్వం బలీయస్స్యాదితి న్యాయవిదో విదుః ।**

శ్రుతి, స్మృతి పురాణములలో పరస్పర విరుద్ధమెచట కనుపించునో అపుడు పూర్వము గలదానికి ముఖ్యత్వమును, వెనుక నున్న దానికి గౌణత్వమును గలదని శాస్త్రజ్ఞులు వచించిరి

**శ్రుతి స్మృతి విరుద్ధేషు శ్రుతిరేవ బలీయసీ ।**
**అవిరోధే సదా కార్యం స్మార్తం వైదికవత్సదా ॥**

శ్రుతికిని, స్మృతికినెచట విరోధము కనుపించునో యచ్చట శ్రుతి ముఖ్యము స్మృతి గౌణము కావున విరోధము గలుగని స్థలమున శ్రౌత స్మార్తాది వైదిక కార్యములు రెండును ఆచరణీయములు

**శ్రుతి స్మృతి పురాణానాం విరోధో యత్ర దృశ్యతే ।**
**తత్ర శ్రౌతం ప్రమాణం తు తయో ర్ద్వైధే స్మృతిర్వరా ॥**

శ్రుతి, స్మృతి పురాణములకు విరుద్ధభావము గలుగునపుడు శ్రుతి ప్రమాణము గాను, స్మృతికిని పురాణమునకును నెచ్చట విరోధము కనుపించునో అచట స్మృతి ప్రమాణముగాను, పురాణము గౌణముగాను గ్రహించుకొన వలయును (ఆపస్తంబము)

క్రింది న్యాయస్థానములో తీర్మానమును జిల్లాన్యాయస్థానము రద్దు చేయ వచ్చును జిల్లా న్యాయస్థానముయొక్క తీర్పును హైకోర్టువారు విచారణనచేసి రద్దుచేయవచ్చును హైకోర్టువారి విధిని పార్లమెంటువారు విచారణను జేసి త్యాజ్యము గాని గ్రాహ్యము గాని వేయవచ్చు గదా? కావుననే మైత్రేయోపనిషత్తునందు-

**యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు ।**
**తదైవ సన్న్యసేద్విద్వానన్యథా పతితో భవేత్ ॥**

ఎప్పుడు సకలవస్తువులలో వైరాగ్యము గలుగునో అపుడే అట్టి యాత్మ వివేక జ్ఞానము గల విద్వాంసుడు సన్న్యసించవలయును అట్లు విరక్తి గలుగనివాడు సన్న్య సించిన యెడల పతితుడగును

**ద్రవ్యార్థ మన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థమేవ వా ।**
**సన్న్యసేదుభయభ్రష్టః స ముక్తిం నాప్తుమర్హతి ॥**

ధన మార్జించుటకుగాని, అన్నవస్త్రములు దొరుకుననిగాని, గౌరవము గలుగునని గాని సన్న్యసించినచో నుభయలోక భ్రష్టుడగునేగాని మోక్షము గలుగదు

మఱియు బ్రహ్మచర్యమందుండిగాని, గృహస్థమందుండిగాని, వానప్రస్థమందుండి గాని యెపుడు విరక్తి గలుగునో అపుడాయా శ్రమములనుండియే సన్న్యసింపవచ్చునని శ్రుతి యుద్ఘోషించు చున్నది ''**బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేద్గృహాద్వా వనాద్వా**'' ॥

దీని యర్థము పై నుదాహరించినదే ''యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్'' ఏ దిన మందు వైరాగ్యము గలుగునో, ఆ దినమందే సన్న్యాసమును గ్రహింపవలయునని యర్థము

**బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథవా యతిః ।**
**యది స్యాత్సంయతాత్మా చ స నూనం ముక్తిమాప్నుయాత్ ॥**

బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, లేక యతియైనను ఆత్మ సంయమము గలిగియుండినచో నతడు ముక్తుడగుటకు సందేహము లేదు కావున నట్టి స్థితి గలుగనిదే యే యాశ్రమమం దున్నప్పటికిని సన్న్యసింపరాదు శ్రుతి నెవరును ఎప్పుడును మార్పుగ జేయుటకు సాధ్యము కాదు స్మృతి కాలానుగుణ్యముగాను, దేశానుగుణ్యముగాను మారుచుండును అంతేగాక మనుస్మృతియొక్క ప్రాణము కృతయుగముతో పూర్తియైనది

**కృతే తు మానవాధర్మాస్త్రేతాయాం గౌతమాస్స్మృతాః ।**
**ద్వాపరే శఙ్ఖలిఖితాః కలౌ పారాశరాస్స్మృతాః ॥**

కృతయుగమున మనుస్మృతి ధర్మమును, త్రేతాయుగమున గౌతమస్మృతి ధర్మమును, ద్వాపరమున శఙ్ఖలిఖిత స్మృతి ధర్మమును, కలియుగమున పరాశరస్మృతి ధర్మమును ప్రచురముగ జేయవలయును మఱియు మతత్రయాచార్యులగు శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీ మధ్వాచార్యులు కర్మత్యాగమొనర్చి సన్న్యసించిరి వీరు మువ్వురే గదా! త్రిమతస్థులకు గురువులు భారతఖండములో గల జనులలో నీ మతాచార్యుల యనుయాయులై యుండెడివారే యధికముగా నున్నారు నవీనకాల మతోద్ధారకులగు శ్రీదయానంద సరస్వతి స్వామిగారును నైష్ఠిక బ్రహ్మచర్యము నందుండియే సన్న్యసించిరి బౌద్ధమతాచార్యులగు శ్రీ గౌతమబుద్ధుడును సన్న్యాసియే శ్రుతి నాధారమును జేసికొనియే మతత్రయాచార్యులును సన్న్యసించిరి

గురుడు - జన్మాంతర పుణ్యవిశేషముచే వారికి నాత్మశుద్ధి గలిగియుండ వచ్చును అందుచే వారు సన్న్యసించిరి మీకు గూడ న దేరీతిగ నంతఃకరణశుద్ధి గలిగి నదో లేదో యని యెట్లు గ్రహించ గలిగితిరి?

భారతి - గురువరా! దేవరవారు నన్ను పరీక్షించుట కొఱకే యిన్ని విధములుగ శోధించు చున్నారు అయినను నాయొక్క విధిని నిర్వహించుట నా ధర్మము

***చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే ।***
***వస్తుసిద్ధి ర్విచారేణ న కించిత్కార్మకోటిభిః ॥***

అంతఃకరణశుద్ధి గలుగువఱకు మాత్రమే కర్మ విధింపబడినది అపరోక్షజ్ఞానము గలుగునని తలంచి గాదు పరమార్థమగు బ్రహ్మస్వరూపవస్తు సిద్ధి తత్త్వ విచారము చేతనే గలుగును గాని కోట్లకొలది కర్మకాండముల నాచరించినను గలుగదు సువర్ణమైనను నాలుగు విధములుగ పరిశోధింప వలయునని గలదుగదా!

***యథా చతుర్భిః కనకం పరీక్ష్యతే నికర్షణచ్ఛేదన తాపతాడనైః ।***
***తథా నరాణాం పురుషః పరీక్ష్యతే గుణేన శీలేన కులేన కర్మణా ॥***

ఏలాగున సువర్ణకారుడు బంగారును ఒరిపిడిచేతను, నరకుటచేతను, కరిగించుటచేతను, సుత్తెతో కొట్టుటచేతను నాలుగు విధములుగ పరీక్షించునో ఆలాగున ఆచార్యుడు పురుషులను బ్రహ్మవిద్యకొఱకు నాల్గు విధములుగ పరీక్షించవలయును అదెట్లన సత్త్వాదిగుణములచేతను, పుణ్యశీలముచేతను, సంప్రదాయముచేతను, చేసెడి పనుల చేతను పరీక్షించవలసియుండును ఆలాగున శోధించిన తరువాతనే తామనుగ్రహించిన చాలును మఱియు ఇపుడు తామే ప్రశ్నను జేసితిరో ఈ ప్రశ్ననే శుకమహా మునిని జనకమహారాజు అడిగియున్నాడు యోగవాసిష్ఠమున ఆ విషయము గలదు తాము బోధించు రీతిగ శ్రీకృష్ణద్వైపాయనుడు తన యాత్మపుత్రుడును, శిష్యుడు నగు శ్రీశుకమహామునికి ధర్మశాస్త్ర ప్రకారము బ్రహ్మచర్యాది మూడాశ్రమములను క్రమముగ ననుష్ఠించిన తర్వాతనే సన్న్యసింపవలయునని యుపదేశించిరి లేనిచో

పతనము గలుగునని గూడ భయపఱచి చెప్పిరి

**సద్గురు సమీపే సకలవిద్యా పరిశ్రమజ్ఞో భూత్వా, విద్వాన్సర్వమైహికాముష్మిక సుఖశ్రమం జ్ఞాత్వైషణాత్రయం, వాసనాత్రయ మమత్వాహంకారాదికం వమనాన్నమివ హేయమధిగమ్య మోక్షమార్గైక సాధనో బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్॥**

సద్గురు సన్నిధిలో సకలవిద్యలను పరిశ్రమచే దెలిసి కొన్నవాడై విద్వాంసుడై సమ స్తైహికాముష్మిక సుఖములను శ్రమ గలుగచేయునవిగా దలంచి యీషణత్రయ మును, వాసనాత్రయమును, మమత్వాహంకారాదికమును వమనాన్న మువలె హేయ ముగ దలంచి, మోక్షమార్గైక నిష్ఠగలవాడై, బ్రహ్మచర్యమును సమాప్తముగ జేసి గృహస్థాశ్రమమును స్వీకరింపవలయును గృహస్థాశ్రమమునుండి, వానప్రస్థాశ్రమ మును బొందవలయును అచ్చట తపోయోగాదులచే శుద్ధాంతఃక రణుడైన తర్వాత సన్న్యసింప వలయుననియే పరమహంస పరివ్రాజ కోపనిషత్తు చెప్పుచున్నది మనువు గూడ నీ విధముగానే చెప్పి యున్నాడు

***అనధీత్య ద్విజో వేదా ననుత్పాద్య తథా సుతా౯ ।***
***అనిష్ట్వా చైవ యజ్ఞైశ్చ మోక్షమిచ్ఛ౯ వ్రజత్యధః ॥***

వేదముల నధ్యయనమును జేయక, స్వభార్యయందు పుత్రోత్పత్తి నొనర్ప కయు, జ్యోతిష్టోమాదియాగముల జేయకయు మోక్షముగోరు ద్విజుడు నరకకూప మున బడుచున్నాడు వైరాగ్యనిధియగు శుకుడు ప్రవృత్తిమార్గము నను సరించి చెప్పెడి శాస్త్రములన్నిటిని నుక్కు ఉలితో నినుమును న రుకునట్లు కర్మ శాస్త్రముల నన్నిటిని జ్ఞానశాస్త్రమనెడి శస్త్రముచే ఛేదించెను కుమారుని వైరాగ్యమునకు మెచ్చి ''సంశ యాత్మా వినశ్యతి'' అను భయముచేతను, పుత్ర వాత్సల్యముచేతను నతనిని జనకునివద్దకు ప్రేమతో బంపివైచెను పితృవాక్యమును శిరసావహించి జనక రాజధానికి శుకుడు వెళ్ళెను మార్గమధ్యములో శుకు డీలాగున తనలో వితర్కింపసాగెను

జనకుడు క్షత్రియుడు మఱియు గృహస్థుడు అంతేగాక రాజ్యపాలనను

జేయువాడు నేనన్ననో బ్రహ్మకులమున జన్మించినవాడను నైష్ఠిక బ్రహ్మచర్యము ననుష్ఠించువాడను వనమందుండి తపమొనర్చుచు వేదాధ్యయనమును జేయువాడను కావున నాకును సంసారకూపములో పడియుండు జనకునికిని నేమి సంబంధము? కూపస్థమండూకమునకును, నరణ్యమునందుండు మృగరాజునకును నేమైన సంబంధము గలదా? మానససరస్సున తామరపూవులలో వసించెడి రాజహంసకును, బురదగుంటలో నుండు కొంగకును నెచ్చట సంబంధము? ఋష్యాశ్రమములోనుండెడి కామధేనువునకును, మలమునందు బొర్లాడుచుండు సూకరమునకు నేదైన సంబంధ ముండునా? నేను బాల్యమునుండి పుణ్యాత్ములు నివసించెడు ఋషుల పర్ణశాల లందును, వనంబులందు నివసించుచున్నాను జనకుడైతే విషయములతో గూడిన సంసారకూపమనందగు గృహమందు నివసించుచున్నాడు నేను ఏకాంతమున ధ్యానామృతమును గ్రోలుచున్నాను జనకుడైతే బహుజనసంకుల మగు గృహమునందుండి విషసమానమగు విషయముల ననుభవించుచున్నాడు అయినను ఏ బిలమందే పాముున్నదో యెట్లు దెలియును? చిన్న గుంటలో గూడ తామరపుష్ప ముండవచ్చును తండ్రియగు వ్యాసులవారి వాక్య మెందుల కతిక్రమింప వలయునని తలంచి, జనకరాజధానికి పాదచారియై శ్రీశుకమునీంద్రుడరిగెను

గోపుర ద్వారములో ప్రవేశించునపుడే భటులు నిరోధించుటచే శుకుడు మనంబున నిట్లు దలపోసెను నేను దారిలో తలంచినదంతయు సరిపోయినది సాధువులపై మహర్షులపై వీరల కేమైన గౌరవము గలదా? దొంగ లోపలికి వచ్చునపు డడ్డగించునట్లు వ్యాసపుత్రుండనగు నన్నడ్డగించిరే? అయినను క్షమ యన్నిటికన్న మిన్న యైనదగుటచే గోపురములో నొక ప్రక్కన కూర్చుండి వ్యాసపుత్రుడగు శుకుడు గోపుర ద్వారమున పడియున్నాడని ద్వారపాలకులతో జనకమహారాజున కెఱింగించు లాగున చెప్పెను -

**'క్షమా బల మశక్తానాం శక్తానాం భూషణం క్షమా'**

ఈ వాక్యమును వినినతోడనే భక్తితో ద్వారపాలకుడు రాజసన్నిధికి పరు గెత్తునది చూచి శుకుడు తనలో నిట్లు తలంచెను ఈ ద్వారపాలకులు నేను

దలంచినట్లు హీనులు కారు నా వాక్యమును విన్నతోడనే భక్తితో జనకుని సన్నిధికి పరుగెత్తినారు కనుకనెవ్వరైనా యనుమతి పొంది లోపలికి పోవలసినట్లు రాజనీతిగా నుండవచ్చును నేను వనములో నుండినవాడనగు టచే లోకజ్ఞానము సంపూర్ణముగా దెలిసికొనజాలక పోతినిగదా యని తనలో తాను చింతిల్లుచుండెను ద్వారపాలకుడు జనకునికి నమస్కరించి యెవరో యొకగొప్ప మహర్షిసత్తముడు గోపురద్వారమున వేంచేసియున్నాడు శ్రీవేదవ్యాసపుత్రుడని గూడ జెప్పిరి మఱి శుకుడను పేరు గలవాడననియు తెల్పిరి అని విన్నవించెను ఈ వాక్యమును వినగానే మేరు శిఖరమున శరత్కాల మేఘము గాలిచే నెగురగొట్టబడినట్లు రత్నఖచిత సింహాసనమునుండి సంభ్రమముతో జనకుడు లేచి పురోహితులను ముందిడుకొనివచ్చి శుకమహర్షిని జూడగానే దూరమునుండియే సాష్టాంగ నమస్కారము గావించి, గొప్ప భయభక్తులలో కూడినవాడై మహావినయముతో నర్ఘ్యపాద్యాదుల నిచ్చి పూజించి యుచిత స్థలమున నివాస మేర్పఱచి తనకు ప్రజాపాలన మొదలగు నవసరకార్యములు గలవనియు, నేడురోజులు తాము విశ్రాంతిగా నుండి మార్గాయాసమును దీర్చుకొన్న తర్వాత తాము దయచేసిన కార్యమును గుఱించి సంభాషింపవచ్చుననియు, ఆజ్ఞ యిచ్చినచో వెళ్ళెదనని యడుగగా నాలాగేనని శుకుడాజ్ఞాపించెను అంతట జనకుడు నమస్కరించి తన రాజ గృహమునకు వెళ్ళెను అప్పుడు శుకుడు వ్యాసభగవానుడు చెప్పిన వాక్యమును మఱల మఱల స్మరింపుచు జనకుని యొక్క భక్తికి చాల సంతోషించెను జనకుడు రాజగృహమును ప్రవేశించి శుకమహర్షికి సకలోపచారముల జేయుటకు దగిన యేర్పాటుల చేయించి రాజగృహములోను, నగరిలోను నుండు వేశ్యాస్త్రీల నందరిని రప్పించి యీ విధముగ వారి కాజ్ఞాపించెను ''మీలో 16 సంవత్సరముల వయస్సుకు తక్కువ గానివారును, 25 సం॥ వయస్సుకు మించనివారును నగువారు ఇచట ఏకాంత మహలులో వచ్చియుండెడు బ్రహ్మచారియగు శుకుని బ్రహ్మచర్యవ్రతమును భంగ పఱచువారి కేమియడిగినను నిచ్చెదను మీకు కావలసిన వస్త్రాభరణములు, పుష్పములు, పన్నీరు, అత్తరు మొదలగు సుగంధద్రవ్యములను నగరిలో దీసికొనవచ్చును అట్లు శుకుని భంగపఱచజాలని వారిని మిధిలాదేశము నుండి వెడలగొట్టించెదన'' ని శాసించి జనకుడు నిజకార్యముల నిర్వహింప వెళ్ళెను

అప్పటినుండి రాజభోగములగు నింద్రియోద్రేకమును కలిగించెడు పలు తెఱగుల దివ్యవస్తువులతో భోజనము చేసేలాగున దాసీ దాసులును, అంతఃపుర కన్యకలును ప్రారంభింప జూచినను శుకుడు దినమున కొకపూట మాత్రమెచ్చట చేతికేది దొరకునో దానిని భుజించునే గానియే పదార్థ మెచ్చట వడ్డించినది గూడ కన్నెత్తియైనను జూడ కుండెను పరుండుటకు హంసతూలికా పాన్పును, రత్నఖచిత మంచము నిచ్చినను, వట్టి భూమియందు దర్భాసనముపైననే శయనించుచు ండెను ప్రాతఃకాలమగుటకు ముందుగానే వేడినీరు తెచ్చియుంచినను, మంచి మంచి వాసనాద్రవ్యములతో కూడిన తైలమును సువర్ణపాత్రలో తెచ్చి పెట్టినను వాటిని జూడకనే నదికివెళ్ళి స్నానమాచరించి వచ్చుచుండెను ఈ విధముగనుండగా జనకుని యాజ్ఞను పాలించి మంచి సన్మానమును పొందవలయునని తలంచి యావారకాంతలు ఒక్కొక్క పుడొంటరిగాను, మఱి యొకపుడు జంటగాను, ముగ్గురుగాను, నలుగురుగాను వచ్చి వేదాంతవాక్యములను జెప్పుచు, భక్తి రసమగు కీర్తనల పాడుచు, మధురమగు గానమును, వీణలతోను, నితర వాద్యములతోను బాడుచు, పుష్పముల జల్లుచు, అత్తరు, పన్నీరు మొదలగు ననేక విధములగు సుగంధద్రవ్యముల జల్లుచు నర్తనముల సాగించుచు నెన్నియో విధములగు కామచేష్టలను జేయుచు, శక్తికొలది కళానైపుణ్య మును జూపించుచుండిరి అయినను శిలాప్రతిమ యగు విగ్రహమునకైనను కొంచమైన చలనము గలుగునేమో కాని నించుకైనను శుకమహర్షికి చలనమేర్పడ లేదు మఱి యొకప్పుడు మఱికొందఱు విలాసినీమణులు వచ్చి పంచభూతముల యుత్పత్తి స్థితిలయమునకు హేతువగు సాంఖ్య శాస్త్రమును జెప్పుచు, నిరువదినాలుగు తత్త్వము లగు నా యా ఇంద్రియములకు నాయా గుణములు స్వభావములేగాని సాక్షియగు నాత్మకు నింద్రియ వ్యాపారములకు సంబంధములేదని సాంఖ్యమత శుష్కవేదాంతమును జెప్పుచు, నింద్రియములకు తత్తద్విషయములు స్వభావములే, వాటియందు మమత్వముంచిన మాత్రమే బంధనమగునని పాపభూయిష్ఠ వేదాంతమును బోధించుచు, తమను మోహాంధకారములో బడద్రోయ నెంత యత్నించినను, పరిపూర్ణమగు నాత్మదృష్టి నుండి బహిర్దృష్టి యాశుకమునికి గొంచెమైనను గలుగ

లేదు ఈలాగున ప్రతిరోజును ననేక విధములుగా శుకుని చలింప జూచినను నవి యన్నియు మేరు పర్వతమును కదలించుటకు జేసెడి వాయుదేవుని ప్రయత్నము లట్లు వ్యర్థములైనవే గాని యంతర్దృష్టినుండి కొంచెమైనను బహిర్దృష్టి శుకమహర్షికి గలుగ లేదు

దీని జూచి యాయువతీమణులు భయపడి యీ మహాత్మునికి కోపము గలిగి నేత్రములతో జూచినచో మనము నిప్పునందు పడిన మిడుతలవలె భస్మమయ్యెదమని తలంచి భక్తితో నమస్కరించి, జనకునికడకు వెళ్ళి యందఱును నమస్కరించి ''రాజేంద్రా! మీరు మమ్ములను దేశమునుండి వెళ్ళగొట్టినను సరే, లేక చంపినను సరే'' యని యొక్కొక్కతెయు నిట్లు చెప్పదొడంగెను ''ఓ రాజేంద్రా! మేము చేసిన కృత్యములచే రాతి గుండెయైన కరుగునే కాని యా మహాత్ముని మనస్సు ఎంత మాత్రమైనను కరుగ లేదు'' మఱికొందఱు చంద్రముఖులు ''భూపాలాగ్రణీ! మేము చేసిన కామకలాపముచే సూర్యుడైనను చల్లబడునుగాని యామునిసత్తముని మనస్సునందే మార్పును గలుగ లేదు '' తరువాత మఱియొక సంఘమువారగు నిందు వదనలు ''ఓ పృథివీపతీ! మే మొనరించిన వికారవృత్తులచే సముద్రపు నీటియందైనను వేడి గలుగునేగాని యాపరమ ఋషి చిత్తము కట్టుకదలలేదు!'' తరువాత మరియొక వారకాంతా సంఘమువారు ''ఓ జనక చక్రవర్తీ! మేము చేసిన మన్మథ కృత్యములకు చంద్రుడైనను వేడిని పొందునుగాని యా యోగిపుంగవుడు కన్నెత్తియైన మమ్ములను జూచుటగాని, చెవితోనైన మా గానములను వినుటగాని చేయలేదు'' ఇక కొందఱు కామినీమణులు ''ఓ రాజచంద్రమా! మేము చేసిన కామవిలాసములకు ప్రాణములేని శవమైనను వికారమొందునేగాని ఆ పరమమునీంద్రుడు సమాధినిష్ఠనుండి కొంచె మైనను చలించలేదు ఆ ముని యేకాంతముగా నున్నప్పుడు మాలోనొక్కొక్కరము నొక్కొక్కప్పుడు ఇద్దరముగాను, ముగ్గురముగాను నతని మనస్సును చలింప జేయుట కేయే కార్యముల జేయవలయునో, యాభావ విలాసములు జూపినను, నవియన్నియు పర్వతముపై నిశితబాణ ప్రయోగమువలె వ్యర్థములైనవి శిలాపర్వతముపై కుంభవృష్టి కురిసినను కొంచెమేని లోపలి భాగమెట్లు తడువదో,

ఆలాగున మేము చేసిన కామచేష్ట లచే నా తపోనిధి బ్రహ్మనిష్టయం దచంచలుడై యుండెను అవి యన్నియు నిరుపయోగవములైనవి మహాపంచీకరణ సాంఖ్యశాస్త్రము గూడ వ్యర్థమైపాయెనే గాని, యామహామనస్కుడగు మహాత్ముడమనస్కములోనే యుండెను భూపాలోత్తమా! మేము గావించిన గానకళా కలాపములచే సముద్రములో వర్షించిన వానల వలన సముద్రమే విధముగ హెచ్చు తగ్గులు లేకుండనుండునో, ఆలాగున యామహాత్ముడు వికారరహితుడై పరిపూర్ణస్థితియందే యుండెను దీనివల్ల మేమేమి గ్రహించితిమనగా నే కళాశాస్త్రమును, సంగీతశాస్త్రమును, అనుభవము లేని పంచీకరణ సాంఖ్యశాస్త్రమును, ధర్మహీనులగు విషయలోలురకు నుపయోగపడునని నిశ్చయించుకొంటిమి ధర్మనిరతులై నిర్విషయస్థితిని పొందినవారికివి నిరుపయోగములని తలంచి, యికమీదట పై శాస్త్రముల నభ్యసించుట మాని వేసెదము రోగమున కుపయోగపడని వైద్యమేల నభ్యసించవలయును? కావున నీ కళలయందు మాకు విసుగు గలిగినది ''

ఇట్లని యా చిగురుబోణులు చెప్పిన వాక్యములను విని, జనకుడిట్లు వచించెను ''ఇప్పుడు కాకపోయినను, మరియొకసారి మీరు వెళ్ళి కళాశాస్త్రముల ననుసరించి నయన, ముఖ, భావములచే శుకముని మనస్సును చలింపజేయ వలయును లేనిచో రేపటిదినము మిథిలానగరము నుండి మాత్రమే గాక విదేహ దేశము నుండి మిమ్ము వెడలగొట్టించెదనని'' చెప్పగా నాభూపాల వాక్యమును విని, ఆ యువతులందఱు మూలము నరికిన కదళీవృక్షమువలె భూమిపై పడి జనకునకు నమస్కరించి నిలిచి యిట్లు విన్నవించిరి ''రాజకులావతంసా! తాము నిప్పులో దుముక నాజ్ఞాపించినను మారుమాటాడక నగ్నియందు దుముకుదుము, గాని తపస్తేజస్సుతో జ్వలించెడు ఆ పరమ ఋషి కడకు మాత్రము మేము పోజాలము అ సంయమీంద్రుడు దృష్టిని కొంచెమైనను మాపై బఱపినను, వెంటనే నిర్జీవులమై పోయెదము మఱియు నా పుణ్యాత్ముడెంతో ప్రయత్నముతో నతిపవిత్రమగు బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నాడు అట్టి మహాత్ముని వ్రతభంగమును జేసినచో, మేము జన్మజన్మాంతరములలో గూడ నంత్యకులమందు

నుద్భవిల్లి, కుష్ఠువ్యాధిగలవారలమై యిహములోను, పరలోకమున పురుగులు, చీములతోను, నిండిన నరకములో పడి పోవలసియుండును మఱియు తమయొక్క ప్రేరేపణవల్లనే యిట్లు జరిగినదని దివ్యదృష్టితో నా మహానుభావుండు దెలిసికొనినచో మీవంశము మాత్రమే గాక రాజ్యముగూడ భస్మమై పోవును'' అని చెప్పుచు నా నారీమణులందఱును, మఱల జనకమహీపాలకుని పాదములపై బడి యేడ్వసాగిరి అప్పుడు జనకుడు కరుణ గలిగిన వాడై, అట్లయినచో మీ మీస్థానములకు వెళ్ళిపొండని చెప్పి వారందరికిని, మంచి వస్త్రాభరణాదుల నధికముగ నిచ్చి పంపెను శుకమహర్షియొక్క వైరాగ్యమునకు జనకుడు మిక్కిలి సంతసించి అట్టి వైరాగ్యము తనకు గలుగలేదని హృదయములో తలంచి పశ్చాత్తాపము నొందుచుండెను వైరాగ్య లక్షణములు గల శ్రుతివాక్యముల నిట్లు పఠింప దొడంగెను

***శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః ।***
***న హృష్యతి న చ స్తౌతి స విజ్ఞేయో జితేంద్రియః ॥***

స్తుతి నిందలను వినిగాని, శీతోష్ణముల స్పృశించిగాని, శత్రుమిత్రులను జూచి గాని, రుచి అరుచులను భుజించిగాని, సుగంధ దుర్గంధముల నాఘ్రాణించిగాని, ఏ నరుడు హర్షమును గాని, విషాదమునుగాని పొందడో అట్టివాడే జితేంద్రయుడని తెలియవలెను

***గతే ప్రాణే యధా దేహ స్సుఖదుఃఖే న విందతి ।***
***తధా చే త్ప్రాణయుక్తోఽపి స కైవల్యాశ్రమే వసేత్ ॥***

ప్రాణము పోయిన తర్వాత, ఆ శవము సుఖదుఃఖముల నెట్లు బొందజాలదో, ఆలాగున ప్రాణముతో గూడియున్నపుడు గూడ నెవడుండునో యట్టివాడే ప్రకృతి నశించిన జీవన్ముక్తుడగును

***సాన్నిధ్యే విషయాణాం చ సమర్థోఽవికలేంద్రియః ।***
***సుప్తవద్వర్తతే నిత్యం భిక్షుర్ముఖ్య స్స కీర్తితః ॥***

భోగ్యములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయములు సన్నిధాన మందుండినను, తాను శబ్దాది విషయముల ననుభవించుటకు సమర్థుడై యున్నప్ప

టికిని, చక్షుశ్శ్రోత్రాదీంద్రియములలోపము లేకున్నప్పటికిని నెవడు విషయములను దెలిసికొనక నిద్రించువానివలె నుండునో, అతడు నిర్విషయుడనంబడును

***యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే ।***
***యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే ॥***

ఏ పురుషుడు సుషుప్తి దశయందుండియు, జాగ్రతగలవాడై యుండునో, ఎవడు జాగ్రదవస్థయందుండియు, సుషుప్తి యందుండు వానివలె నుండునో, ఎవనియొక్క జ్ఞానము, వాసనా శూన్యమైయుండునో యతడు జీవన్ముక్తుడనంబడును

***మణి మంత్రౌషధై ర్వహ్ని స్సుదీప్తోఽపి యథేంధనమ్ ।***
***ప్రదగ్ధుం నైవ శక్తస్స్యా త్ప్రతి బద్ధస్తథైవ చ ।***
***జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్త స్సుదృఢోఽపి చ।***
***ప్రదగ్ధుం నైవ శక్తస్స్యా త్ప్రతిబద్ధస్తు కల్మషమ్ ॥***

మణి మంత్రములచేతను, మూలికలచేతను ప్రతిబంధింపబడిన దాహశక్తిగల యగ్ని స్వతః విశేషముగా మండుచున్నప్పటికిని కట్టెల నేప్రకారము గ్రహింప జాలదో యా ప్రకారమే తత్త్వజ్ఞానము గూడ, దృఢముగ నుదయించి ప్రకాశించుచున్నప్పటికిని, విషయ ప్రతిబంధము గలదేని మోక్షప్రతిబంధక పాపములను (అజ్ఞానమును) నివృత్తి చేయ శక్తి గలుగదు

ఈ శ్రుతిస్మృతి వాక్యముల నన్నిటిని జనకుడు మనంబున చింతన చేసుకొని శుకునియొక్క నిర్విషయత్వమును గూర్చియు, తనకు విషయరాహిత్యము గలుగని దానిని గురించియు నాత్మలో విచారించుచు నింకను కొన్ని శ్రుతులనుగురించి యాలోచించెను

***శబ్ద స్పర్శమయా యేఽర్థా అనర్థా ఇవ తే స్థితాః ।***
***యేషాం సక్తస్తు భూతాత్మా న స్మరేచ్ఛ పరం పదమ్ ॥***

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఇంద్రియార్థము లనబడును అవి

ముము క్షువుల కనర్థములే ఎందుకనగా ఆ యింద్రియ విషయములలో నాసక్తి నొందిన మనుజుడు పరమమగు పదవిని (ముక్తిని) స్మరించుటకైన శక్తుడు గాడు

**అంధవత్పశ్య రూపాణి శబ్దం బధిరవచ్ఛృణు ।**
**కాష్ఠవత్పశ్య వై దేహం ప్రశాన్త స్యేతి లక్షణమ్ ॥**

నేత్రములుండియు అంధునివలె రూపము నవలోకించు వాడును, చెవులుండియు చెవిటి వానివలె శబ్దమును వినువాడును, సర్వేంద్రియములు సమృద్ధిగ గలిగి యుండియు, నిర్వికారమగు కట్టెవలె శరీరము గలవాడెవడో అతడే ప్రకృతి నశించిన శాంతాత్ము డనబడును

**యస్మిన్క్షాంతి శ్శమ శ్శౌచం సత్యం సంతోష మార్జవమ్ ।**
**అకించన్యమదంభశ్చ స కైవల్యాశ్రమే వసేత్ ॥**

ఎవనియందు శాంతియు, శమము, శౌచము, సత్యము, సంతోషము, ఋజుత్వము, అకించనత్వము- అదంభము ఈ గుణములున్నవో అతడే కైవల్యమనెడు ముక్తిధామమున కర్హుడగును

**ధృతిః క్షమాదమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః ।**
**ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥**

ధైర్యము, ఓరిమి, దమము, పరవస్తు పరిగ్రహరాహిత్యము, బాహ్యాభ్యంతరశుద్ధి, యింద్రియనిగ్రహము, శుద్ధమగు బుద్ధి, ఆధ్యాత్మవిద్య, సత్యము, క్రోధరాహిత్యము ఈ పదియును బ్రహ్మనిష్ఠునియొక్క లక్షణములు

సర్వ సంపత్సమృద్ధిగల సార్వభౌమునివలె శ్రీ శుకుడును జ్ఞాన సంపత్సమృద్ధి గలిగి ముక్తులలో సర్వజ్ఞుడుగా నుంటున్నాడని జనకుడు తనలో తాను దలంచెను మరురోజు జనకుడు ప్రాతఃకాలమున ధ్యానపూజాదుల త్వరలో నిర్వహించి, మంత్రు లతో గూడ ఫలపుష్పాదులను స్వయముగా హస్తమున ధరించి, శుకమహర్షి సన్నిధికడ కతివినయభక్తులతో వెళ్ళి నమస్కరించగా, శుకుడు కూర్చుండుటకు శిరస్సుతో నాజ్ఞాపించెను అంతట ఉన్నతాసనములు ముందుగా

సమర్పియున్నను నెల్లరును భూమియందే కూర్చుండిరి తరువాత మిధిలేశ్వరుడు లేచి నిలచి, కరములు ముకుళింపజేసి శ్రీ వ్యాసపుత్రునితో నిట్లనియె ''మాపూర్వీకులు చేసిన పుణ్యము వల్లను, మహర్షుల సేవవల్లను తమ బోటి మునీంద్రుల పాదధూళిచే మేమందరమును పునీతులమైతిమి మా పితరులలో నెవరైనను ప్రేతలోకమందుండినచో, తమ పాదధూళి మాగృహమున సోకినవెంటనే ప్రేతత్వమును విడిచి పుణ్యలోకమునకు వెళ్ళియుందురు తామేతెంచిన సంగతి యేదియో వినిపించినచో వెంటనే చేయుటకు సిద్ధముగా నున్నా'' ననియు వచించి మౌనముగా నుండెను

శుకుడు జనకమహారాజును గాంచి, మందస్మితుడై యాసీనుడగునట్లు సంజ్ఞను జేసెను దానిని గ్రహించి జనకు డుపవిష్టుడై మౌనముతో నుండెను శ్రీకృష్ణద్వైపాయన సూనుండగు శుకమహర్షియు కొంతతడవు మౌనముతో ధ్యానమందుండి శ్రీ కృష్ణభగవానుని యపరావతారమగు శ్రీ వ్యాసమునికిని, తనకును గలిగిన వృత్తాంతముల నన్నిటిని జనక మహీపాలునితో చాల గంభీర భావముతోను, ప్రసన్నవదనముతోను వచించెను ''శ్రీ వేదవ్యాస మహామునియొక్క యాజ్ఞను శిరసావహించి, మీ రాజధానికి రావడమైనది వ్యాస మునివరుడు బ్రహ్మచర్యాశ్రమమును పూర్తి జేసిన తరువాత, గృహస్థాశ్రమములో ప్రవేశింపవలయుననియు, నచటినుండియే వానప్రస్థాశ్రమమార్గమేర్పడుననియు నచట కనీసము 8 లేక 6 సంవత్సరములైన విధి ప్రకారము తపశ్చర్యను జేసిన మాత్రమే సంసారముననున్న కాలములో గలిగిన విషయ వాసనలు, వృత్తులు నశించుననియు తరువాత మాత్రమే సన్న్యసింపవలయుననియు శాస్త్రక్రమము ననుసరించి నాకు బోధించిరి నేను ఇవియన్నియు ప్రవృత్తిమార్గశాస్త్రమనియు, విషయ విరక్తి గలిగినప్పుడే సన్న్యసింపవచ్చునని చెప్పెడు నివృత్తిమార్గ ప్రమాణములచే దానికి బదులు చెప్పితిని ( ఆ ప్రమాణములు వారియివురకును గలిగిన వాదప్రతివాదములలో గనందగును) మఱియు వ్యాసమునీంద్రుండు ఋక్, యజు, స్సామ, అధర్వణ వేదములలో నీలాగున క్రమముక్తియే కనబడుచున్నదనియు నాకు బోధించిరి అపుడు నేను ఋగ్వేదాది నాలుగు వేదములును, తదంగములగు శిక్షా కల్పాదులును ప్రవృత్తిమార్గస్థుల కేర్పడినవి కాని, నివృత్తి మార్గస్థులకు కాదని,

వేదముయొక్క శిరస్సులగు నుపనిషచ్ఛాస్త్రములచే ఖండించితిని అంతేగాక అవి యన్నియు నపరవిద్యను బోధించినవేగాని, పరవిద్యయగు పరబ్రహ్మను బోధింప జాలవని కూడ సవినయముగ జెప్పితిని

**తత్రాఽపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేదశ్శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి, అథ పరా యయా, తదక్షర మధిగమ్యతే**

వాటిలో ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము, శిక్ష, కల్పసూత్రము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము ఇవియన్నియు అపరవిద్య యనిచెప్పబడును దేనిచే నక్షరమగు పరబ్రహ్మము దెలిసికొనబడునో నది పరవిద్యయనియు చెప్పబడును

***న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం***
***నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః।***
***తమేవ భాంతమనుభాతి సర్వం***
***తస్య భాసా సర్వమిదం విభాతి॥***

స్వప్రకాశుడగు సూర్యుడు, ఆత్మభూతుడగు నాపరబ్రహ్మమును ప్రకాశింప జేయుట లేదు చంద్రుడు, నక్షత్రములును, మెరుపులును నాపరమాత్మను ప్రకాశింప జేయుట లేదు ఇక మన కన్నులకెదుట కనబడుచున్న యీయగ్నిహోత్రు డెటుల ప్రకాశింప జేయును? అంతటను ప్రకాశించుచున్న ఆ పరమేశ్వరు ననుసరించియే యివి యన్నియు ప్రకాశించుచున్నవి ఈ ప్రపంచమంతయు నా పరమేశ్వరుని ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నది అని ముండక శ్రుతిని ప్రమాణముగా జూపితిని సంసారములో నుండి విషయముల ననుభవించిన తర్వాత సన్న్యసింప వలయునని ద్వైపాయనముని మతము ఆ వాక్యము నాకు నచ్చ లేదు అది విషము భుజించి దాని రుచి నెఱింగిన పిదప, యమృతపానము చేయవలయునని చెప్పునట్లుండెను విషము దినినవాడు దానివల్లనే హతుడై పోవునేగాని మఱల నతని కమృతపానము జేయుటకు కాలమే లేదు అట్లే సంసార

విషయము ననుభవించువారికి మఱల యెప్పుడు జ్ఞానా మృతమును గ్రోలుటకు సమయముండు''ననియు సమాధానము జెప్పితిని అంతేగాక అగ్నిహోత్రుడు సమిధలచేతను, హవిస్సుచేతను అంతకంతకు ప్రజ్వలించునేగాని శాంతి నొందదుగదా! ఆలాగున విషయానుభవముచేత దోష మంతకంతకు పెరుగునేగాని విరుద్ధదనియు బదులు చెప్పితిని

***న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి ।***
***హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥***

( దీని యర్థము పై నుదాహరింపబడినదే )

***యధా నిరింధనో వహ్నిస్స్వయమేవోపశామ్యతి ।***
***తధా వృత్తిక్షయా చ్చిత్తం స్వయమేవోపశామ్యతి ॥***

కట్టెలు లేని యెడల వహ్ని స్వయముగా ఆరిపోవునట్లు, వృత్తులు లేనియెడల మనస్సు తనకు తానుగా శాంతించును

***సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేఽగ్నిశిఖా యధా ।***
***ఉపభోగేన కామేన హ్యాశా చోపరివర్ధతే ॥***

ఘృతముచేతను, కట్టెలచేతను, అగ్నిజ్వాల అంతకంతకు వృద్ధి నొందునట్లు కామముయొక్క భోగముచేత ఆశ ఉపర్యుపరివృద్ధి నొందుచుండును

మఱియు పెద్దపులి నోటిలో చిక్కుకొన్న గోవు తిరుగ బయటకువచ్చి పాలిచ్చు విషయమై యెవ్వరైన జ్యోతిషమును జెప్ప గలుగుదురా? అట్లే సంసార వ్యాఘ్రపు నోటిలో బడిన జీవుని యొక్క గతియని పారాశర్యమునికి దెలిపితిని అదేరీతిగ సర్పము నోటిలో బడిన మండూకము ఈగలను పట్టుకొనుటకు యత్నించునా? అజ్ఞానకాల సర్పపు నోటిలో బడిన జీవుడు భోగము ననుభవించిన తర్వాత యోగము ననుష్ఠింపవల యుననెడి వాక్యమందలి సత్యముపైన జెప్పినట్లుండును''ని బ్రహ్మనిధియగు నాతండ్రితో వచించితిని 'సముద్రమందు మునిగి పోయినవాడు మఱల వచ్చి గృహకృత్యములను నిర్వహింపగలడని తలంచుట యెట్టిదో విషయములను లవణమును, రాగద్వేషాదును మకర తిమింగిలాదులును,

సుఖ దుఃఖములను కల్లోలములును, సందేహములను సుడులును గల అంతము లేని సంసారసాగరమున బడినవాడు ముక్తి యనుతీరమును జేరుటయు నటువంటిదని సత్యవతీ పుత్రునితో బలికితిని సాగరములో పడిపోయిన వారిలో దైవానుగ్రహముచే నొకరో లేక ఇద్దరో ఒకవేళ పై జెప్పిన జలజంతువుల బాధను తప్పించుకొని యొడ్డును చేరినను జేరవచ్చును ఆ విధముగ సంసారములో పడిపోయిన వారిలో యొక రిద్దరు వారి సంస్కారము మంచిదైనచో మోక్షపుదరిని జేరుదురేగాని దానిని నమ్మి యజాగ్రతతో కాలము గడుపకూడద''ని బదరికాశ్రమ వాసియగు-బాదరాయణునితో వందన మొనర్చి పలికితిని

ఈ వాక్యముల నన్నిటిని యాలకించి బ్రహ్మవేత్తయగు జనకుడు మంచిదైనను చెడ్డదైనను ననుభవింపక యెట్లది చేదుగానో లేక మధురముగానో ఉన్నట్లు దెలియునని ప్రశ్నించిరి

అప్పుడు నేను వేదమును విభాగ మొనర్చిన నా తండ్రితో నిది సరియైనది కాదనియు, నిది కేవలము జడమతులతో జెప్పదగిన వాక్య మనియు, కొంచెమైనను విచారణశక్తి గలవాడైనచో నొకడు నిప్పులోబడి తపించుటను జూచి గ్రహింపజాలక యగ్ని గుండములో పడిన మాత్రముననే యా దహనశక్తి దెలియు నని దలంచి తానును నిప్పులో పడిన వాని చందమున నుండునని ప్రణమిల్లి మనవి చేసితిని దీనిని విని యేమియును బలుకక కొంతసేపు మౌనముగా నుండి యేమియో దీర్ఘముగా నాలోచించుచున్నట్లుండి కుమారా! అని నన్ను దగ్గఱకు బిలిచి మీ వద్దకు వెళ్ళి సందేహ నివృత్తిని జేసికొనవలసినదని మహాభారత కర్తయగు నమ్మౌని ఆజ్ఞాపించెను శ్రీ వ్యాసాజ్ఞను శిరసావహించి యిచ్చటికి వచ్చితినని'' చెప్పెను

ఆ శుకమునీంద్రుని వాక్యము నేకాగ్రముతో సావధానముగా వినుచున్న విదేహ భూపతి కొంచెము సేపు మౌనముగా నేమియో దీర్ఘాలోచన చేసెడి వానివలెనుండి యిట్లు చెప్పదొడంగెను

జనకుడు - ''సమాధి నిలయములో సదాయుండు శ్రీ బాదరాయణీ! మీ మహిమయును, ఊర్ధ్వరేతస్కత్వమును చాలమంది మహనీయులవల్ల విని

యుంటిని అవి యన్నియు మీ దివ్య సన్నిధిలో జెప్పబూనిన విరక్తులగు తమ కాత్మస్తుతిగా తోచవచ్చును మఱియు నపరోక్షముగ మంచి మాటలనుచు, పరోక్షముగ చెడు మాటలు చెప్పువారు నీచులని తపోధనుడగు శ్రీ వసిష్ఠమునీంద్రునివల్ల వినియుంటిని మఱియు నపరోక్షముగ నిందించువారును, పరోక్షముగ స్తుతించువారును శ్రేష్ఠులగువారనియు, పేరు శ్రేయస్సును కోరువారనియు నరుంధతీపతియగు మునిసత్తముడు దెలిపెను కాబట్టి యిక ఆ విషయము చెప్పను అయినను నాయొక్క సంతోషమును పట్టజాలక ఒక విషయమును జెప్పెద శ్రీ బాదరాయణముని, యీ జీవిపై నెంత గొప్ప గౌరవభావము గలిగియుండునో! అందువలనగదా మీబోటి తపోనిధులను సందేహ నివృత్తి కొఱకు గృహస్థుడనగు నా దగ్గఱకు బంపిరి ఇందువలన నాజన్మ ధన్యమని నమ్ము చున్నాన''ని చెప్పుచు ఆనంద బాష్పముల గార్చుచు ఆత్మానంద భరితుడై మఱియు నిట్లనెను ''శ్రీవ్యాసభగవానునకును, తమకును గలిగిన సంభాషణల నన్నిటిని సావధానమున వింటిని సాక్షాన్నారాయణునియొక్క యపరావతారమే శ్రీ వ్యాసుడని సర్వఋషులును నేక కంఠముతో పలికియున్నారు కావున నా సమాధి నిలయునికన్న నధికముగా దెలిసినవా రెవరు గలరు? నేను గూడ బాల్యకాలమున మీ వలె వైరా గ్యము గలిగి యరణ్యావాసమునకు సన్నద్ధుడనై యుండగా బ్రహ్మమానసపుత్రుడును, మీకు ముత్తాతయునగు శ్రీ వసిష్ఠుండు వనవాసులకు తపశ్శక్తియు, యోగశక్తియు గలుగునే గాని యాత్మ విచారణ లేనిచో మోక్షము గలుగదని చెప్పి గృహస్థాశ్రమములోనుండి, నిష్కామ కర్మయోగము ననుష్ఠించి, గృహస్థునకు విధించి యుండు ధర్మయుక్తములగు విషయసుఖముల ననుభవించుచుండినను, వాటి యందాసక్తి లేనివాడవై ఆత్మవిచారణను జేయుచుండుమని యాజ్ఞాపించిరి ఈ విధిని లెస్సగా ననుష్ఠించినచో వనములో తపమొనర్చెడు మునికిని మీకును ఆత్మజ్ఞాన లభ్యమగు, మోక్షములో మాత్రమేలాటి కొఱతయుగలుగదని శిరముపై కరమునుంచి యాశీర్వ దించినందుచే, సంసారము నందుండినను, బుఱదయందుండు కుమ్మరి పురుగు వలెను, నీటిలో నుండెడు పద్మపత్రమువలెను దేనితో నంటక సాక్షిమాత్రుడనై ధర్మశాస్త్రములో విధించినట్లు రాజ్యకార్యములను జూచుకొనుచు, నాత్మవిచార

ములో నిరతిశయానందముతో కాలము గడుపుచున్నాను

శుకుడు - రాజేంద్రా! వ్యాసభగవానుడు శ్రీ నారాయణావతార మనియు, వేదముల విభజించిన మహానుభావుడనియు మీరు చెప్పినది నిజము అయితే ఎవరెవరేయే కార్యములో నియుక్తులై యుందురో వారికదే సరియనియు, నందఱు నాలాగుననే యుండవలయుననియు తోచెడు దైవ మాయాశక్తి ప్రభావమొకటి గలదు ఏలనన! వ్యాసులు వేదముల గుఱించియే విశేషముగ నుపదేశించిరి వేదాంతమును గుఱించి స్వల్పముగానే చెప్పిరి ఇది నా యొక్క బాల్యావస్థను జూచియో, లేక పుత్ర వాత్సల్యము వలననో! అట్లుగాక ఆత్మ శుద్ధి గలిగినదా లేదా యని పరీక్షార్థము వచించిరో చెప్పజాలము వేదముయొక్క చివరి భాగమగు వేదాంతమును ఉపనిషత్తులు బోధించుచుండును కావుననే ''ఓం నమశ్శ్రుతి శిరః'' అని చెప్పబడినది కావున కర్మజ్ఞానమునకును, బ్రహ్మజ్ఞానమునకును అంధకార ప్రకాశములకువలె భేదము గలదు అదేరీతిగ శ్రీవసిష్ఠుడును సర్వజ్ఞుడైనను కర్మకాండ ప్రవృత్తియందే మిక్కిలి మక్కువగలిగియున్నారు వసిష్ఠాది సప్తఋషులు ప్రవృత్తిమార్గస్థులకు నుపదేశించు వారనియు సనకాదులగు నలుగురు ఋషులు ఊర్ధ్వరేతస్కులై, తపస్సంపత్తియు, జ్ఞానసంపత్తియు గలిగియుండి నివృత్తిమార్గస్థులకు నుపదేశించు వారనియు, శాస్త్రమే చెప్పుచున్నది కావున వారి వాక్యములన్నియు పరమ ప్రమాణములని తలంచ నక్కరలేదు''

జనకుడు - ఒకరికి బ్రహ్మచర్యాది వానప్రస్థ పర్యంతము గల మూడాశ్రమములను విధిగా ననుష్ఠింపక నాల్గవ యాశ్రమమగు తురీయాశ్రమమున కధికారమెట్లు గలుగును? క్రింది తరగతులలో చదువవలసిన పాఠములను చక్కగా చదివి యుత్తీర్ణుడు గానిచో పై తరగతులలో నెట్లు ప్రవేశము గలుగును?

శుకుడు - హేరాజేంద్ర! తాము చెప్పినది నిజము, అయితే యది కేవలము వర్తమానదృష్టి గోచరమేకాని భూతదృష్టియు, భావిదృష్టియు గలవారు మాత్రమే జీవునియొక్క యంతరంగమందలి సంస్కారము నెఱుంగగలరు ఏలననగా? జీవుడనాదిగా ననేకజన్మము లెత్తుచు నెత్తుచు వచ్చినవాడు కావున జన్మాంతరములో బ్రహ్మచర్య మునుండి వానప్రస్థము వఱకు మూడాశ్రమముల లోనుండి వచ్చుచు

తురీయాశ్రమ గ్రహణమునకు సమీపించునప్పుడు ఆ జన్మ ప్రారబ్ధము నశించినందుచే, నా దేహమునకు వియోగము గలిగెను వాడు మరుజన్మమునకు వచ్చినను మఱల బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థముద్వారా తురీయాశ్రమము పొందవలసి యుండునా? లేక అట్టి సంస్కారము గలవాడు మొదటనే తురీయాశ్రమవిధిలో ప్రవేశింపవచ్చునా? అట్లుగాక నాలుగాశ్రమములు క్రమముగ నవలంబించ వలయుననియు జెప్పినచో నితర స్థలములలో క్రింది తరగతిలో చదువవలసిన శాస్త్రములన్నియు చక్కగా నధ్యయనమును జేసిన యొక విద్యార్థి మరియొక యున్నత పాఠశాలకు వెళ్ళినపుడు ''మా పాఠశాలవిధి యీలాగున యున్నది అదేమన నీ పాఠశాలలో జేరతలంచువారు ప్రాథమిక తరగతినుండియే చదివి తీరవలయుననియు ఆయా పాఠశాల ప్రధానోపాధ్యాయుడు చెప్పి నట్లుండును ఇది చర్విత చర్వణమే యగును

జనకుడు - అవును అందఱును పై తరగతిని చదువుట కధికారము గలిగియున్నారా? లేదా యను విషయమును పాఠశాల ప్రధానోపాధ్యాయుడు చూడవలసి యుండును గదా! ఆలాగున యీ జీవి జన్మాంతరమందు బ్రహ్మచర్యాది మూడాశ్రమ ముల ననుష్ఠించి శుద్ధుడై యున్నాడా యని పరీక్షను జేయవలసి యుండును గదా!

శుకుడు - మంచిది నలుగురు ఒకవస్తువును మిక్కిలి ప్రీతితో భుజించు చున్నారు వారితో కూడ నుండు ఐదవవానిని తమతో కూడ భుజించుటకు ప్రేరణను జేసిరి అప్పుడది నాకు వలదు అయ్యది నా శరీరమునకు బాధ గలుగ జేయును విశేషముగ దాహమును గలుగ జేయును అది దేహమునకును, మనస్సునకును మిక్కిలి బాధ కలుగజేయునని చెప్పినచో నాపదార్థమెప్పుడైన నతడు భుజించి దానిచే గలిగిన కష్టము ననుభవించిన యొక స్మృతి యుండుట చేతనే యీలాగున ఇప్పుడు చెప్పుటకు కారణమైనది ఆలాగున పండితులును, పామరులును, గోపాలకులును, భూపాలకులును, వెయ్యేల, రోగగ్రస్తులైన వారును, అధిక సంతానము గలవారును, జీవనాధార మేమియు లేనివారు గూడ సంసారవిషయమును విడువజాలక దానియందే రమించుచుండగా

నతిసుందరగాత్రుడై; యక్షయ శ్రీమంతుడై, సర్వేంద్రియ పుష్టిగలవాడై, విద్యావంతుడై యుండు యువకుడు సంసారవిషయమును విషమువలె తలంచునపుడు జన్మాంతర స్మృతియే కారణమని తలంచరాదా?'' అని వచించెను ఈ పుణ్యాత్ముని సుకృతమేమని చెప్పవలయును

ఇట్లు శుక దేవుని వాక్యము వినిన జనకమహారాజు పిడుగు పడిన మానవునివలె నిశ్చేష్టుడై యేమియు ప్రత్యుత్తరమును జెప్పుటకు తోచనందుచే, కూర్చుండి తనలో తాను కొంచెము సేపు యోచించిన తర్వాత 'ఆలాగున జన్మాంతర తపోధ్యానాదుల విశేష పుణ్యమువల్ల నంతఃకరణ శుద్ధిగలవారికి మాత్రము క్రింది మెట్లులగు గృహస్థాది మూడాశ్రమములును నవసరము లేదని చెప్పి,

**విశ్వామిత్ర పరాశరప్రభృతయో వాతాంబుపర్ణాశనాః**
**తేఽపి స్త్రీముఖపంకజం సులలితం దృష్ట్వైవ మోహం గతాః ।**
**శాల్యన్నం సఘృతం పయో దధియుతం భుంజన్తి యే మానవాః**
**తేషా మింద్రియ నిగ్రహో యది భవేద్వింధ్యః ప్లవేత్సాగరే ॥**

విశ్వామిత్ర పరాశర ప్రభృతులగు మహర్షులు వాయు, జల, ఫల, పత్రాదులను భుజించెడివారు అట్టి తాపసోత్తములే స్త్రీలయొక్క ముఖపద్మమును జూడగా మోహపరవశులై పోయిరి అట్లుండగా నింద్రియ పుష్టిని బాగుగా గలుగజేసెడి మంచి వరియన్నము, గోధుమరొట్టె మొదలైనవి, పాలు, పెరుగు, నెయ్యి మొదలగువాటితో గూడ భుజించు మనుజులు ఇంద్రియ నిగ్రహము గలవారైనచో వింధ్యపర్వతము సముద్రములో మునుగక తేలవలసి యుండును వింధ్యపర్వతము పెద్ద నల్లరాతితో గూడిన కొండ విశ్వామిత్రుడు మేనకయందును, పరాశరుడు కైవర్తకన్యయందును మోహ పరవశులైరి మఱియు

**దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనమ్ ।**
**దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా ॥**

ఎంత గొప్పవానికైనను విషయత్యాగము చాల దుర్లభమైనది ఒకవేళ విషయవిరక్తి గలిగినను, తత్త్వజ్ఞానము గలుగుట మరింత దుర్లభమైనది ఒకవేళ

తత్త్వజ్ఞాన దర్శనము గలిగినను, గురుకృప లేక నిరంతరము సహజావస్థయగు నాత్మభావములో నిలకడ గలిగి యుండుట మరింత దుర్లభము అని యోగశాస్త్రమందు శ్రీ ఆదినాథుడుపదేశించెను మఱియు

*దుర్లభం త్రయమే వైత ద్దైవాను గ్రహహేతుకమ్ ।*
*మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥*

మనుష్య శరీరప్రాప్తి గలుగుట మిక్కిలి దుర్లభము ఒకవేళ అది ప్రాప్తించినను మోక్షేచ్ఛ యుదయించుట మరింత దుర్లభము ఒకవేళ ముముక్షుత్వము గలిగినను బ్రహ్మ జ్ఞాన సంపన్నుండగు గురువు లభించుట మరింత దుర్లభము ఈమూడును గొప్ప దైవానుగ్రహము గలవానికి మాత్రమే లభించును అనుగ్రహశూన్యులకు దొరకవు అని కలదు కాబట్టి పతనము గలుగకూడదని తలంచియే, శ్రీ వ్యాసభగవానుడు చెప్పియుండ వచ్చును'' అని చెప్పెను

శుకుడు - అది మాత్రము నిక్కము ఇంద్రియముల బలమతి దుర్వార మైనది కనుకనే

*మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్ ।*
*బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ॥*

బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలవాడు తల్లితోనైనను, కుమార్తెతోనైనను, సోదరితో నైనను, వివిక్త ప్రదేశమునందుండరాదు అనగా రెండవవారు లేనటువంటి యేకాంత ప్రదేశమున నివసింపకూడదు ఏలననగా! నింద్రియ సమూహము మిక్కిలి బలమైనది గొప్ప విద్వాంసు నైనను( జ్ఞాననిష్ఠునైనను) మోహింపచేయును అని చెప్పిరి అదేరీతిగ బ్రహ్మచర్యవ్రతమును సలిపెడు స్త్రీయైనను, తండ్రి, కొడుకు, సోదరు డుండెడు ప్రదేశమున నొంటరియై యుండరాదు శ్రుతి యీలాగున చెప్పుటకు కారణమేమన పురుషుడైనచో నెట్టి పాపియైనను తల్లి, కూతురు, సోదరియందెన్నడు దుష్టబుద్ధి గలిగియుండడు అదేవిధముగ నెంత పాపాత్ములైనను స్త్రీ తండ్రి, కొడుకు, సోదరునియందు చెడు సంకల్పమును తలంపదు వారలనే నిషేధింపగా సామాన్యస్థితిలో కొంత భక్తి గలిగి యౌవనస్థితిలో

నుండి ఇతర స్త్రీలతో పురుషుడు, పురుషులతో స్త్రీయును కలిసియుండుట యెంత యపాయకరమో యని దెలుపుట కొఱకే యీ శ్లోకము జెప్పబడినది

***యతతో హ్యపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః ।***
***ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥***

ఓ అర్జునా! ప్రకృతినుండి విముక్తిపొందుటకు ప్రయత్నించువాడైనప్పటికిని, విద్వాంసుడై యున్నప్పటికినినట్టి పురుషుని మనస్సును గూడ మిగుల క్షోభమును పెట్టునట్టి స్వభావము గల యింద్రియములు పురుషుని విషయము లందాసక్తుని జేయుచున్నవి గదా! అని గీతయందు గూడ గలదు మఱియు బ్రహ్మనిష్ఠులలో నగ్రగణ్యుడగు శ్రీ దత్తాత్రేయులు నిట్లే నిర్వచించిరి

***అగ్నిగుండ సమానారీ ఘృతకుంభసమః పుమాన్ ।***
***సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥***

స్త్రీ యగ్నిగుండమునకు సమానమైనది పురుషుడు నేతికుండ వంటివాడు అగ్నికుండ సమీపమున నేతికుండ నుంచినచో నెట్లు కరుగకుండ నుండజాలదో, నాలాగున యుభయుల యొక్క సమావేశముచే మనస్సు కరుగక (చలింపక) పోదు మఱియు నిప్పుపై నేతికుండనుంచిన కరుగని కాలమొకటి యుండినచో నట్టి కాలమున నుభయ సమావేశమందు కూడ మనస్సు మార్పునొందక స్థైర్యము గలిగి యుండగలదు అని చెప్పుచు శుకుడు మాటాడకుండెను

జనకుడు - ఇంత తపోమహిమయు, బ్రహ్మజ్ఞానమును గలిగి గురుడుగాను, తండ్రిగాను నుండెడు శ్రీ వ్యాసభగవానుడు నుడివిన వాక్యముల నతిక్రమించుటలో మీకు భయము లేదా!

శుకుడు - రాజేంద్రా! వారు వారుండేలాగున అందఱు నుండవలయునను నొక స్వభావము మహాత్ములయందు గూడ గలదు! అది యే మహిమయో, యెవరును నెఱుంగ జాలకున్నారు ఇది యాలోచించినచో, మహనీయుల బుద్ధికి గూడ పరమై యొకదైవశక్తి పని చేయుచున్నట్లు గోచరమగుచున్నది [1] శ్రీ కపిలుడు

తన యొక్క సాంఖ్యమును, శ్రీ వసిష్ఠుడు తనయొక్క కర్మజ్ఞాన సముచ్చయమును, శ్రీ నారదుడు తనయొక్క విష్ణుభక్తియు, శ్రీ నామదేవుడు తనయొక్క శివభక్తియు, శ్రీ వ్యాసుడు తనయొక్క వేదమతమును, [2] శ్రీ గౌతముడు తన న్యాయ మతమును, పెంపొందించుటయే దీనికి తార్కాణము (ఈలాగున భావికాలమున గూడ నుండును పతంజలి తన యోగమును, శ్రీ జైనముని తన యుర్హత్పదవియు, శ్రీ బుద్ధుడు తన నిర్వాణపదమును, శ్రీ శంకరుడు తన యద్వైతమ[illegible]మును, శ్రీ రామానుజుడు తన విశిష్టాద్వైత మతమును, శ్రీ మధ్వుడు తన ద్వైతమతమును, శ్రీ యేసు క్రీస్తు తన దైవ మతమును, శ్రీ మహమ్మదు తన ముస్లీం మతమును, శ్రీ కృష్ణచైతన్యుడు భక్తిమతమును, శ్రీ దయానందుడార్య మతమును, శ్రీ రామ మోహనుడు తన బ్రాహ్మ మతమును వృద్ధి పఱచుటయే దీనికి తార్కాణము )

ఆలాగున మీయొక్క నిష్కామకర్మయోగమును నాయొక్క వైరాగ్య యోగమును యోచించుకొనవలయును ఇది యుపనిషన్మతము భేదములకు మాయయే కారణమనియు, మాయ నశించినపు డభేదము గలుగుననియు శాస్త్రము చెప్పుచున్నది అయితే యీచెప్పిన మహనీయులందఱును, మాయ నశించిన వారలనియే లోకము నమ్ముచున్నది అయితే వీరికి గూడ నీ భేదమెట్లు గలిగినదని దీర్ఘముగ నాలోచించి యివి యన్నియు జీవుల పరిపక్వము ననుసరించి యుండవలయునని యాత్మలో దలంచి సమన్వయ పఱచినచో నభేదముగానే యుంటున్నదని యెరింగి యానందముతో నుంటున్నాను మరియు నీశ్వరునియొక్క మహిమ యీలాగున నుంటున్నది ఈ విషయమై మహిమ్నః స్తోత్రమి ట్లుపదేశించుచున్నది

*త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవ మితి*
*ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః పథ్య మితి చ ।*

---

(1) కపిలుడు మొదలగువారు కృత, త్రేతా, ద్వాపర యుగములవారు
(2) గౌతముడు మొదలగువారు కలియుగపువారు

*రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానా పధజుషాం*
*నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥*

వేదత్రయమార్గము, కాపిలశాస్త్రమార్గము, పతంజలియోగ శాస్త్రమార్గము, శైవాగమసిద్ధాన్తమార్గము, పాంచరాత్రాది వైష్ణవాగమమార్గము అని భిన్న భిన్న మార్గములలో నీ మార్గ ముత్తమము, ఈ మార్గము హితము అని చెప్పినను వారి వారి యిచ్ఛానుసారము ఋజువక్రములగు నానామార్గములను పొందియుండు నదీనదజలములన్నిటికి సముద్ర మొక్కటియే యెట్లు పొందదగినదో ఆ ప్రకారము ఆయా మతములన్నిటికి నీవొక్కడవే పొందదగినవాడవుగా విరాజిల్లుచున్నావు మరియు నష్టావక్రమునీంద్రులును నీ విధముగానే వచించిరి

*నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తధా ।*
*దృష్ట్వా నిర్వేదమాపన్నః కో న శామ్యతి మానవః ॥*

గౌతమ జైమిన్యాదిమతములు, హోమ, జప, తపస్సులచే సాధువుల మతములు పలువిధములు పతంజలి మొదలుగా గల వారియోగమతములు, వసిష్ఠాదుల కర్మజ్ఞాన సముచ్ఛయ మతములు నానావిధముగా నుండుటయు నొకదానికొకటి సంబంధము లేనందుచే నీ మతముల యెడలను, కర్మములయెడలను నిరాశను జెంది సద్గురూప దిష్టమార్గమున నాత్మాను సంధాన నిష్ఠాపరుడగు వాడెట్లుపశమింపక యుండును? అనగా ఇవియన్నియు మార్గభేదములే కాని యాత్మానుభవము ఒకటే యని తలంచి శాంతి నొందును

మఱియు ఎవరేవృత్తిలో నుందురో వారికన్న నధికపదవిని కుమారుడు సంపాదించిన యెడల తండ్రికి సంతోషమే గలుగును ఎట్లన? ఉన్నతోద్యోగములో నుండు తండ్రి యొక్క కుమారుడత్యున్నతోద్యోగమునకు వెళ్ళునట్లును, పండితుని పుత్రుడు మహాపండితుడుగా నగునట్లును, శ్రీమంతుని కుమారుడు మహా శ్రీమంతుడగునట్లు బ్రహ్మనిధియగు శ్రీ వ్యాసముని గొప్ప భక్తి, జ్ఞాన, యోగ, వైరాగ్యనిధి యగుటచే నాస్థితి వారికి ప్రీతి గలుగ జేయునోగాని యప్రీతిని గలుగ

జేయుదు మరియు నున్నత స్థితిలో నుండు వారి సంతానము నిమ్నస్థితి యందుండినచో మనోవేదనకు కారణమగును మరియు నున్నతోద్యోగములో నుండు తండ్రి తన కుమారునికి తనకన్న నెక్కువ స్థితి గలుగుటకు యత్నించుచుండుటయు, కనీసము తన స్థితి యందైన నుంచుటకు విద్యాదులను జెప్పించునేగాని తక్కువ స్థితి యందుంచ నొల్లడు అదేరీతిగ నున్నతోద్యోగముగల తండ్రి తన పుత్రుడు చిన్న యుద్యోగములో నుండుట కిష్టపడడు కుమారుడును తండ్రియొక్క స్థితిని లేక దానికంటె నధికస్థితిని సంపాదింప యత్నించునేగాని చిన్న యుద్యోగ ప్రాప్తికై యత్నింపడుగదా! అని చెప్పెను

పిదప 'నా సందేహమను బంధనమునుండి విడుదల జేసిన ఓ జనకమహారాజా! మీకును మీ ప్రజలకును నెల్లప్పుడును శుభమే గలుగునుగాక'', యని శుకమహర్షి వినయముతో వచించిన వాక్యము నాలకించి, జనకుండేమియు పలుకనేరక కొంతతడవుకు లేచి నిలచి ''ఓ శుకమహర్షీ! మీ యొక్క దృఢవైరాగ్యమునకును, నిశ్చలమగు మనఃస్థితికిని, ఆరూఢమగు జ్ఞానమునకును మిక్కిలి సంతసించితిమి మీబోటి వైరాగ్యనిధులకు, జ్ఞాననిష్ఠులకును, తురీయమందు సదా విహరించు మహాత్ములకు మాత్ర మిట్టి క్రమపద్ధతి యవసరము లేదు వారు వమనాన్నమువలె నీ యింద్రియ సుఖములను జూచెదరు క్షీరాన్నమైనను అది విషసంకలితమైనదను విషయము తెలిసిన వారితో నా క్షీరాన్న ప్రయోజనము నెంతగ జెప్పినను వారెట్లు తినజాలరో ఆలాగున దృశ్యవిషయముల నన్నిటిని విషపూరితములుగ దలపోయువారికి బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాద్యాశ్రమ పద్ధతి యవసరము లేదు మీయొక్క యతీతవైరాగ్యమునకు, అఖండజ్ఞానమునకు, దృఢవ్రతమునకు మిక్కిలి యానందించితిని మీకు విధి నిషేధము లతో బని లేదు మీరు సర్వజ్ఞులు మీ కరుణామృతవృష్టివల్ల మేమెల్లరమును మా దేశమును నెల్లప్పుడు సుభిక్షము గానుండుగాక! '' యని ప్రార్థన జేసి శుకబ్రహ్మర్షి యొక్క పాదకమలములపై తామరపుష్పముపై భ్రమరము వాలునట్లు వ్రాలెను అట్లు పడియుండు రాజశ్రేష్ఠుని శుకమహర్షి తన పవిత్రమగు దివ్యహస్తములతో లేవనెత్తి నిలువ బెట్టెను అపుడు జనకుడు

**''యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥**

ఓ ఫల్గునా! ఏ మానవుడు సదా యాత్మయందే ప్రీతిగలవాడును, ఆత్మ ధ్యాస ముచే నాత్మయందే తృప్తినొందువాడును, ఆత్మయందే యానందభరితుడై యుండెడి వాడు నగుచున్నాడో, అట్టి యాత్మవేత్తకు జేయదగిన విధి మఱియొకటి లేదు''ని వచించెడు గీతావాక్యమును జెప్పెను మఱియు,

***భేదాభేదౌ సపది గళితౌ పుణ్యపాపే విశీర్ణే,***
***మాయామోహౌ క్షయమధిగతౌ నష్టసందేహవృత్తీ ।***
***మాయాతీతం త్రిగుణరహితం ప్రాప్య తత్త్వావబోధం,***
***నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః ॥***

భేదాభేదములు సంపూర్ణముగ నశించినవాడును, పుణ్యపాపములు క్షయించిన వాడును, మాయామోహములు క్షయము నొందినవాడును, సమస్త సందేహములు నశించినవాడును, త్రిగుణరహితమగు మాయాతీతమును బొందినవాడును, బ్రహ్మతత్త్వావబోధము గలవాడును, త్రిగుణాతీతమగు మార్గమందు సదా నిర్భీతిగా సంచరించువాడునగు జీవన్ముక్తునకు విధి యెక్కడ? నిషేధ మెచ్చట?'' (విధినిషేధ ములు పాటింపనక్కరలేదని చెప్పెడి వారవధూత వృత్తియందు దిగంబరుడైయుండు శ్రీ శుకమహర్షియొక్క స్థితి తమకు గలిగినదా లేదా యని తమలో తాము విచారించుకొనుట శ్రేయస్కరము) అని వచించుచు నిశ్చేష్టుడై ఆనందభరితుడై నిలిచియుండెను

అట్టి జనకభూపాలు నుద్దేశించి శుకుడు మఱియు నిట్లనియె ఓ రాజ శిఖామణీ! మీయొక్క పుణ్యవిశేషముచేతను, మీపై శ్రీ వసిష్ఠ, యాజ్ఞవల్క్య, పంచశిఖాది పరమ మునులకు గల యనుగ్రహముచేతను, గృహ స్థాశ్రమమందుండియు పరమైకాంతవనములో తపమాచరించి పరమమునులు పొందదగిన జ్ఞానమును మీరు ప్రయాసము లేకనే పొందితిరి మీకును, మీ దేశమునకును, మీ ప్రజలకు నెల్లప్పుడు శుభమే గలుగుగాక! మీ వంశమందెల్లప్పుడు

ధర్మాత్ములును, బ్రహ్మజ్ఞాన సంపన్నులు నుదయింతురుగాక! బ్రహ్మనిష్ఠులపై, ధర్మనిరతులపై, పరమభక్తులపై మీకెల్లప్పుడును భక్తియు, ప్రీతియు గలుగుగాక! అని చెప్పి యాశీర్వదించి, శుకుడు ప్రయాణమాయెను ఆ సమయమున నర్ఘ్యపాద్యాదులచే జనకుడు పూజించి నమస్కరించిన పిదప నితర రాజులును మంత్రు లెల్లరును నమస్కరించి నిలిచిరి అపుడు జనకుడు,

***అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।***
***అఫాలలోచన శ్శంభుర్భగవాన్బాదరాయణః ॥***

***శ్రీపరాశరపౌత్రం శ్రీవ్యాస పుత్రమకల్మషమ్ ।***
***నిత్యవైరాగ్య సంపన్నం జీవన్ముక్తం శుకం భజే ॥***

నాలుగు ముఖములు లేని యేకముఖము గల బ్రహ్మయు, నాలుగు హస్తములు లేని విష్ణువును, ఫాలలోచనమనెడి తృతీయనేత్రము లేని రెండు నేత్రములుగల శివుడునగు శ్రీ వ్యాసమహామునిని ధ్యానించుచున్నాను పరాశరమహర్షియొక్క పౌత్రుడును, శ్రీ వ్యాసమహాముని పుత్రుడును, మాయయనెడి కల్మషము లేనివాడును, ఎల్లప్పుడును మహావైరాగ్య సంపన్నుడును, జీవించియున్నపుడే ముక్తిని పొందిన వాడునగు శుకునికి నమస్కరించుచున్నాను అని స్తోత్రమును జేసెను ''ఓ శుక మహర్షీ! మఱియు మీకు వందనములు మీయొక్క యమోఘాశీస్సువల్ల మా వంశమును, మా దేశమును, మాప్రజలును నెల్లప్పుడు శుభము గలిగయున్నారని నమ్ముచున్నాను మీ పాదధూళిచే మిధిలాభూమి ధన్యత్వము నొందినదని తలంచు చున్నాను '' అని యతడు చెప్పిన భక్తిపరవశ వాక్యములను విని శుకుడు ప్రయాణమై యాసనమునుండి లేచి జనకునిగూర్చి ''పార్థివేశా! నాకు గల సందేహముల నన్నిటిని తీర్చినన్ను ధన్యునిగా జేసిన మీరును నా కొక గురువు కారా! కాన మీకు నమస్కరించుట విధియైయున్నది కులగోత్రములను, వర్ణాశ్రమములను, స్త్రీ పురుషులనెడి భేదమును పాటింపకయే గురువును పూజింపవలయునని శాస్త్రమందు గలదు'' అని వచించి నమస్కరింప ప్రారంభించెను అట్టి శుకమహర్షియొక్క రెండు కరములను జనకుడు మంత్రులును పట్టుకొని ఆపి, మిధిలాధీశుడు శుకమహర్షితో ''మహర్షి సత్తమా! తమకు దెలియని

ధర్మము లేదు అయినను తాము మాపైగల యనుగ్రహ ముచే నానంద పరవశులై యున్నారు తాము బ్రహ్మర్షి సత్తములు, నేను క్షత్రియుడను మీరు నైష్ఠిక బ్రహ్మ చారులు నేను గృహస్థ బ్రహ్మచారిని తాము వనమునందుండి తపోధనులై యుండెడి వారు నేను గృహము నందుండి నశ్వరములగు ప్రపంచధనములతో గూడి సంసార మందుండువాడను మఱియు మీ ముత్తాతయగు వసిష్ఠ మహర్షివల్ల నిష్కామ కర్మపర మగు జ్ఞానమును, యాజ్ఞవల్క్యమహర్షివల్ల బ్రహ్మతత్త్వ జ్ఞానమును, కపిల మహర్షి ముఖ్యశిష్యుడు పంచశిఖ మునీశ్వరునివలన సాంఖ్యతత్త్వమును, అష్టావక్ర మునివలన యమనస్క తత్త్వమును బొందినవాడను అయినను, ధర్మశాస్త్ర ప్రకారము మిమ్ములను మేము పూజించుటయు, మీరు మమ్ములను నాశీర్వదించుటయు సమ్మత మయినది వసిష్ఠమునివలన నాత్మజ్ఞానము గలవాడనైనను, ధర్మశాస్త్రరీతిగ సామాన్య మనుజునివలె నుండి ధర్మాచరణ నాచరించువాడను '' అని పలికెను

శుకుడు - '' ఓ భూపాలాగ్రణీ! మీరు శ్రీవసిష్ఠమునివలన నాత్మజ్ఞానమును బొందినవారైనను, రాజధర్మమును విడువక ఆచరించు చుండిరనియు, కృష్ణద్వైపాయ నుడనేక సారులు చెప్పుచుండినది వినియున్నాను దీపము దగ్గఱకు చీకటి చేరనట్లు స్వయంప్రకాశమగు నాపరబ్రహ్మభావము నర్ధక్షణమైనను మరుపు లేక ఉన్నట్లిదివరలో ఆ వ్యాసభగవానుని నుండి గ్రహించి యుంటిని ఆలాగున సూర్యుని సమీపమున కంధకారము ప్రవేశించనట్లు మీ స్వరూపసాక్షాత్కారజ్ఞానమున కావరణము గలుగకుండు గాక! గృహస్థు డవై యుండినను, రాజ్యపరిపాలన కార్యమనెడి భారముండినను, అర్ధక్షణమైనను ఆ బ్రహ్మభావము నుండి జారకుందువు గాక'' యని యనుగ్రహించి ప్రయాణమై పర్వతమునుండి గాలిచే నెగురగొట్టబడిన శరత్కాల మేఘమువలె శుకుడు నడువసాగెను

అప్పుడు మంగళ మేళములును, భేరీనాదములును మహారు మ్రోగెను అంతఃపుర స్త్రీలందఱును, రాజకన్యకలందఱును తెరచాటున నుండి శుకమహర్షిని దర్శించిరి పురజనులందఱును, బ్రాహ్మణులును, జనకుడును, కరముల ముకుళింపచేసి వేదములను పఠించుచు శుకుని సాగనంపుటను జూడగా,

కైలాసమునుండి పరమశివుడు ఋషులతోను, దేవతలతోను, ప్రమథగణములతోను తపస్సొనరించు భక్తులనను గ్రహించుటకు వెళ్ళు నట్లుండెనని అతి పవిత్రమగు శ్రీ శుక చరిత్రను భారతీదేవి చెప్పెను అంతట,

## - భక్తియోగము -

గురుడు - భక్తియోగము శ్రేష్ఠమైనది

***జ్ఞానంతు దుష్కరం లోకే భజనం సుకరం మతమ్ ।***

***విజ్ఞానం నభవత్యేవ ద్విజ భక్తి విరోధినః ॥***

జ్ఞానము లోకమున దుష్కరమైనది భజన సుకరము, ఇదే భక్తుల మతము ఓ ద్విజులారా! భక్తి యందు ప్రీతి లేని వారికి విజ్ఞానము గలుగదని యీశ్వరు డుపదేశించియున్నాడు అని శాస్త్రములలో గనబడుచున్నది జ్ఞానము దుష్కరమనియు, భక్తి సులభమనియు గలదు మీకు మిక్కిలి ప్రీతిగల గీతా శాస్త్రము గూడ

***నాహం వేదైర్నతపసా నదానేన న చేజ్యయా ।***
***శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥***

నన్నిపుడేప్రకారము చూచినవాడవయితివో అటువంటి స్వరూపము గల నేను వేదములచేత చూచుటకు సాధ్యుడను గాను, ఘోరమగు కామ్య తపస్సుచేత చూచు టకు సాధ్యుడను గాను దానముచేత గూడ జూచుటకు సాధ్యుడను కాను యాగముల చేత గూడ సాధ్యుడను కాను

***భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।***
***జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥***

ఓ యర్జునా! యిట్లు విశ్వరూపియగు నన్ను భగవదేకనిష్ఠయగు ననన్యభక్తి చేతనే యథార్థముగ తెలిసికొనుటకును, దర్శించుటకును, నాయందు ప్రవేశించుట కును సాధ్యమై యుండును అని యుపదేశింపబడియున్నది ఇచ్చట జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం అని యుండుటంబట్టి భగవత్తత్త్వమును దెలియుటకును,

భగవంతుని సాక్షాత్కరించుటకును, భగవంతుని యందైక్యమొందుటకును భక్తియే యుత్తమ మార్గమని సాక్షాద్భగవానుడే సెలవిచ్చియున్నాడు స్త్రీలకును, సామాన్యమానవులందఱికి నిది సులభమార్గము

భారతి - దేశికేంద్రా! భగవద్భక్తియందీ దీనురాలికి మిక్కిలి ప్రీతి గలదు భగవద్భక్తివలన భగవత్కృప గలుగనిచో నీ జీవి తమసన్నిధిలో చేరియుండదు భక్తి యొక్క మహిమ వలననే సంసార సాగరమును దాటించెడు నావికునివలె నుండు తమ చరణ సన్నిధిని జేరగలిగితిని అంతేగాక యీ ప్రాణియొక్క ధ్యానాద్యనుష్ఠాన కార్య ములన్నిటిలోను నేలాటి విఘ్నములను గలుగక, యీ స్థితికి రావడమయినది అయితే భక్తియందు నాలుగవస్థలు గలవు

1 సాకారార్చన, 2 సాకారరూప మానసార్చన, 3 అంతర్యామిధ్యానము, 4 వాసు దేవమయిం సర్వం అనునవి ఈ చివరిది పూర్ణభక్తి యనబడును వీటిలో మొదటనుండి మూడు విధములగు భక్తిమార్గములతో నిప్పటిస్థితికి వచ్చి చేరడమయి నది నాల్గవదగు పూర్ణభక్తి యింకను గలుగ లేదు ఈపూర్ణ భక్తికి జ్ఞానమను పేరుగలదు పైన జెప్పిన మూడు విధములగు భక్తిమార్గములును నాల్గవదానిలో జేరుచున్నవి సందియ మక్కరలేదు

***తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।***
***భవామి నచిరా త్పార్థ! మయ్యావేశితచేతసామ్ ॥***

ఓ యర్జునా! నాయందుంచబడిన చిత్తముగల యీ భక్తులకు నేను మృత్యు రూపమయిన సంసార సముద్రమునుండి యుద్ధారకుడనుగా శీఘ్రముగా నగుచు న్నాను

***తేషా మేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।***
***నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥***

ఓ యర్జునుడా! నేను అట్టి భక్తులననుగ్రహించుట కొఱకు మాత్రము వారియొక్క యంతఃకరణమందుండి వారి యజ్ఞానవమువలన గలిగిన

మోహాంధకారమును వెలుగుమన్న జ్ఞానమనెడి దీపముచేత పోగొట్టుచున్నాను మఱియు -

***తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।***
***దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ॥***

ఏ జ్ఞానయోగముచేత, వివేకసంపన్నులగువారు నన్ను పొందుచున్నారో, అట్టి జ్ఞానయోగము నెల్లపుడును భగవంతునియం దేకాగ్రచిత్తులును, ప్రేమతో భజించు వారునునగు నా వివేకవంతుల కిచ్చుచున్నాను అని శ్రీకృష్ణభగవానుడు చెప్పెను ఇచట అట్టి యేకాంత భక్తిగలవారికి భగవంతుని యందైక్యము నొందుటకు (సాక్షాత్కార జ్ఞానము గలుగుటకు) నే విజ్ఞానము కావలయునో, దానిని నేనొసగుచున్నానని చెప్పెడి మాటలలోనే భక్తి వేఱనియు, జ్ఞానము వేఱనియు నర్థమగుచున్నది కావుననే చాలకాలము భగవంతుని నేను భజించుట వలన నిపుడు నిజమగు నాత్మజ్ఞానమును పొందవలయునని తలంపు గలిగెననియు, నా భగవంతుడే తమ సన్నిధికి జేర్చుననియు విశ్వాసము గలిగినది

***న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।***
***తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥***

ఈ తపోయోగాదులలోపల నీ ప్రపంచమందు, జ్ఞానముతో సమానమగు పవిత్రమయినది మఱియొకటి లేదు ఆ జ్ఞానము అనన్యభక్తి చేతను, ధ్యానయోగము చేతను సిద్ధిని పొందినవాడు చిరకాలముచేత తనయందు తానే పొందుచున్నాడు అట్టి దైవసాక్షాత్కారజ్ఞానము పొందవలయునని ప్రేరణ గలుగ జేసినది గూడ నా భగవంతుడే మఱియు,

***యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।***
***జ్ఞానాఽగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥***

ఓ ఫల్గుణా! లెస్సగా ప్రజ్వలింపబడిన అగ్నిహోత్రుడు కట్టెల నేవిధముగ భస్మీపటలమొనర్చుచున్నాడో, ఆ ప్రకారముగ జ్ఞానమనుఅగ్ని సమస్తకర్మలను భస్మముగా జేయుచున్నది మఱియు,

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥**

సమస్త పాపములు చేసినవారికంటె నధిక పాపాత్ముడవగుదువేని, నీవు జ్ఞానమనెడు తెప్పచేతనే సమస్త పాపసముద్రమును లెస్సగా దాటగలవు మఱియు ''జ్ఞానీ త్వాత్మైవ మే మతం '' అనియు నుండుటవలన నాల్గవదగు జ్ఞానమే సర్వోత్తమ మైనదని యెట్టివారికైనను దెలియును అట్టి జ్ఞాన ప్రాప్తిని గలుగజేసి యీ దీనురాలిని సంరక్షించవలయునని యొక ప్రార్థన మాత్రమీ జీవియందు గలదు ఇకను ఛాందో గ్యోపనిషత్తునందు దేవర్షిసత్తముడగు నారదమునియొక్క చరిత్ర గలదు నారద మహర్షికన్న భగవద్భక్తుడిక మూడులోకములలోను మఱియొకడెవడును లేడు శ్రీ వైకుంఠమందు సాక్షాచ్ఛ్రీమన్నారాయణమూర్తితో తలంచి నపుడెల్ల సంభాషించువారు శ్రీ నారదులే అట్టి దేవర్షియగు నారదుడు గూడ ''తరతి శోకమాత్మవిత్'' అని యుపనిషద్వాక్యమును ఋషిమండలిలో వినినవాడై యట్టి స్థితి తనకును గలిగిన దాయని మనంబున దీర్ఘముగ వితర్కించగా, తనకు ద్వంద్వాతీత స్థితి గలుగ లేదనియు, దృశ్య మాత్మలో విలయము నొందలేదనియు, నిశ్చయబుద్ధి గలిగి యీ ద్వంద్వమే సంసార సాగరమనియు, దీనినుండి దరిజేర్చు మహానుభావుండెవడని చింతిల్లుచుండగా బ్రహ్మమానస పుత్రులును, జన్మనా బ్రహ్మజ్ఞానముగలవారును, నివృత్తి మార్గమునే యుపదేశించి భక్తుల తరింపచేయువారును నగు సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను ఋషుల జ్ఞాపకము గలిగి వారిలో ముఖ్యుడగు సనత్కుమారుని కడకు స్వయముగా పాదచారియై, సమిత్పాణియై వెళ్లి విధిప్రకారము నమస్కారమొనర్చి తన్ను సంసారదుఃఖసాగరము నుండి తీరమునకు జేర్చవలయునని చాల దీనభావముతో అడిగి యున్నారు అప్పుడు నారదమునియొక్క వృత్తాంతమును సాంతముగ ప్రశాంతముగ శ్రీ సనత్కుమారులడిగియున్నారు ( ఆ విషయ మిచట వ్రాయబడుచున్నది )

**ఛాన్దోగ్యోపనిషత్, సప్తమ ప్రపాఠకే ప్రథమః ఖండః**

**ఉ॥ సహోవాచర్గ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదగ్ం సామవేద మాథర్వణం**

***చతుర్థమితిహాస పురాణం పఞ్చమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకోవాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పదేవజనవిద్యామేత ద్భగవోఽధ్యేమి ॥***

సనత్కుమారునిచే బ్రహ్మోపదేశమునకు ముందుగా నారదమహాముని నీకు అధ్యయనముద్వారా అభ్యాసమై తెలియబడియుండెడి విషయమును దెలియ జేయవలయునని యాజ్ఞాపింపబడినవాడై తనచే నభ్యసింపబడియుండెడి విద్యలను అనువాదమును జేసి చెప్పుచున్నాడు సర్వజ్ఞులై యుండెడి యోస్వామీ! నేను ఋగ్వేదమును గ్రమముగా నధ్యయనమును జేసి యభ్యసించి యున్నాను ఆ ప్రకారమే యజుర్వేదమును, సామవేదమును, ఉపాసనా ప్రధానమై నాల్గవదిగా నేర్పడియుండెడి యథర్వణవేదమును, అయిదవ వేదముగా నిరూపింపబడి యుండెడి ఇతిహాస పురా ణాదులునూ, వేదములకు పదవిభాగము ద్వారా అర్థను తెలియచేయు వ్యాకరణ మును, శ్రాద్ధము మొదలైన వానియొక్క కల్పమును, ఉత్పాతము మొదల యిన వానిని తెలిసికొనుటకు దగిన శాస్త్రమును, మహాకాలము మొదలుగాగల నిధి శాస్త్రమును, వాచోయుక్తి ప్రధానమై యుండెడి తర్కశాస్త్ర మును, నీతివిద్యయును, నిరుక్తమును, ఋగ్యజుస్సామరూపమైన బ్రహ్మవిద్యకు శిక్షాకల్ప- ఛందస్సులను దెలియజేయు శాస్త్రములును, భూతములను స్వాధీనపఱచు కొనుటకు సాధకములైన తన్త్రములను, క్షత్రియులభ్యసించుట కర్హములైన ధనుర్వేదమును, జ్యోతిషశాస్త్రమును, గారుడము, గాన్ధర్వము, నృత్యము, గీతము, వాద్యము, శిల్పము మొదలయిన విద్యలను నీప్రకారము సమస్త విధములయిన శాస్త్రములను, అధ్యయనమును జేసి గ్రమముగా నభ్యసించి యున్నా''నని బ్రహ్మవేత్తయైన సనత్కుమారునితో నారద మహాముని విజ్ఞాపనమును జేసినవాడాయెను

***ఉ॥ సోఽహం భగవో మన్త్రవిదేవాస్మి నాత్మవిత్ శ్రుతం హ్యేవమే భగవద్దృశేభ్య స్తరతి శోకమాత్మవి దితి సోఽహం భగవశ్శోచామి తం మా భగవాఞ్ఛోకస్య పారం తారయత్వితి తం హోవాచ యద్వై కిం చైతదధ్య గీష్ఠానామైవైతత్ ।***

ఈ ప్రకారము సమస్తశాస్త్రములను వాని యర్థమును తెలిసికొనినవాడనై

యున్నను, ఆత్మస్వరూప విజ్ఞానము లేనివాడనైతిని మీవంటి సర్వజ్ఞులవలన ఆత్మ స్వరూప విజ్ఞానము గలవాడే కృతకృత్యుడై సర్వానర్థములను అతిక్రమించి వర్తించునని శ్రవణవిషయమై యున్నదిగాని స్వానుభవ విషయము కాలేదు గనుక సర్వశాస్త్రముల నభ్యసించిన వాడనైనను ఆత్మస్వరూప విజ్ఞానము లేనందున శోకసాగరమునందు మగ్ను డనై సంతాపము పొందుచున్నాను కాబట్టి సర్వజ్ఞులైన మీరు నా యందను గ్రహించి యీ శోకముయొక్క యంతమును పొందుటకు సాధకమై యుండెడి బ్రహ్మాత్మైక త్వమును బోధించి కృతార్థునిగ జేయ వలయునని ప్రార్థించినవాడాయెను ఈ వాక్యమును బ్రహ్మనిష్ఠుడై యుండెడి సనత్కుమారుడు విని యో నారదుడా! నీవు సకల శాస్త్రముల నభ్యసించి యేయే విషయములను దెలిసికొని యుంటివో, ఆయా విశేష ములన్నియును వాచోవికారమై యుండెడి నామ మాత్రమే యైనందున అనృతముగా దెలియవలసినదని చెప్పుచున్నాడు

***ఉ॥ నామ వా ఋగ్వేదో యజుర్వేద స్సామవేద ఆథర్వణశ్చతుర్థ ఇతిహాస పురాణః పంచమో వేదానాం వేదః పిత్ర్యోరాశి ర్దైవో నిధిర్వాకోవాక్యమే కాయనం దేవ విద్యా, బ్రహ్మవిద్యా, భూతవిద్యా, క్షత్రవిద్యా, నక్షత్రవిద్యా, సర్పదేవజనవిద్యా నామైవైతన్నామోపాస్స్వేతి***

ఓ నారదుడా! నీచేత నభ్యసింపబడియుండెడి ఋగ్వేదము నామమాత్రమై యున్నది గాని వస్తుస్వరూపము గాదు ఆ ప్రకారమే యజుర్వేదమును, సామవేద మును, అధర్వణ వేదమును, ఇతిహాస పురాణములును, వ్యాకరణమును, శ్రాద్ధకల్పమును, గణితశాస్త్రమును, ఉత్పాతాది విజ్ఞానమును గలుగజేయు శాస్త్రమును, నిధి శాస్త్రమును, తర్క శాస్త్రమును, నీతివిద్యయును, నిరుక్తమును, శిక్షాకల్ప ఛందస్సు మొదలయిన విద్యలును, భూతతంత్రమును, ధనుర్వేదమును, జ్యోతిష మును, గారుడ, గాన్ధర్వ, నృత్య, గీత, వాద్య, శిల్పములు మొదలుగాగల విద్యలన్ని యును నామమాత్రమై యున్నవి కనుక సర్వ విద్యాభిదాయకమై యుండెడి నామ స్వరూపమును బ్రహ్మదృష్టితో నుపాసన జేయవలసినదని యుపాస్యవిషయమును నిరూపించి చెప్పినవాడాయెను

***ఉ॥ యదా వై విజానాత్యథ సత్యం వదతి, నావిజానన్ సత్యం వదతి, విజాన న్నేవ సత్యం వదతి, విజానం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి విజ్ఞానం భగవో విజిజ్ఞాస ఇతి***

పరమార్థసత్యస్వరూపమును విస్పష్టముగా నెప్పుడు తెలిసికొని యుండునో, యప్పుడే వికారానృతాభినివేశము లేనందున, కేవల సన్మాత్రమునే వస్తు స్వరూపముగా జెప్పుచుండును ఈ ప్రకారము పరమార్థ సత్యస్వరూపము తెలియక భేదమునందు సత్యత్వ దృష్టి గలిగియుండెడు పురుషుడు, సత్యస్వరూపమును నిరూపించుటకు అర్హుడు గానందున వస్తుస్వరూప విజ్ఞానమే సత్యాత్మస్వరూప విజ్ఞాన ప్రయోజకమై యున్నది కనుక నీవును విజ్ఞానస్వరూపమును విస్పష్టముగా దెలిసికొనవలసినదని సనత్కుమారు డాజ్ఞాపించెను ఈ వాక్యమును నారదముని విని సర్వజ్ఞులైన మీ వలన విజ్ఞానస్వరూపమును విస్పష్టముగా దెలియగోరి యున్నాను కనుక ఉపదేశముద్వారా అనుగ్రహింపవలయునని ప్రార్థించిన వాడాయెను

***ఉ॥ యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమాథ యత్రాన్యత్పశ్యత్యన్య చ్ఛృణోత్యన్య ద్విజానాతి తదల్పం యో వై భూమా తదమృత మథ యదల్పం తన్మర్త్యం సభగవః కస్మిన్ప్రతిష్ఠిత ఇతిస్వే మహిమ్ని యదివా నమహిమ్నీతి***

ఓ నారదుడా! దేశకాలవస్తువిభాగమును క్రియాకారక ఫలభేదమును లేక అపరిచ్ఛిన్నాద్వితీయ కేవల సత్తామాత్రమై యుండెడి యే స్వరూపస్థితియందు స్వస్వరూపముకంటె నితరమయిన దర్శనవిషయమును స్వాత్మకంటె అన్యముగా శ్రవణ విషయమును విజ్ఞాన విషయము గూడ లేకుండునో, అట్టి కేవల స్వరూపస్థితియే బ్రహ్మమని చెప్పబడుచున్నది ఇందులకు విలక్షణముగా స్వాత్మయందు అవిద్యా కల్పితమయిననామరూపోపాధిచే భిన్నముగా చూడబడుచు, వినబడుచు, తెలియ బడుచుండెడి వికార ప్రపంచమంతయు నుపాధి పరిచ్ఛిన్నమై యున్నందున నల్పమని చెప్పబడుచున్నది, కనుక యీ చెప్పబడిన ప్రకారము

నిర్వికారాఖండస్వరూప కేవల సత్తామాత్రమై యుండెడి, బ్రహ్మస్వరూపమేదియో యదియే మరణధర్మరహిత మగుటవలన అవినాశియై పరమార్థ సత్యస్వరూపముగా జెప్పబడును

***ఆజ్యావపన్నుతం సర్వమగ్నిరేవ భవే ద్యథా ।***
***విదితం విదితం వేద్యం సంవిదేవ భవేత్తథా ॥***

***కర్పూరో దీప సంసర్గా ద్దీప ఏవ భవేద్యథా ।***
***వేద్యవేదనసంసర్గాత్ సంవిదేవ భవేత్తథా ॥***

***సంవిదితం సం విదితం సం విన్మయైవ భవతి సం వేద్యమ్ ।***
***ఆజ్యా వాహిత మాహిత మగ్నిమయం కిం న జాయతే కాష్ఠమ్ ॥***

అగ్నియందు హోమము చేయబడిన నెయ్యి యంతయు నెట్లగ్నియే యగునో, అట్లు తెలియదగిన స్వస్వరూపజ్ఞానానుభవము గలుగగా కలుగగా జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునే పొందును కర్పూరము దీపపు సంబంధమువలన నెటుల జ్యోతియ గునో, అట్లే తెలియదగిన బ్రహ్మస్వరూప జ్ఞానానుభవము వలన జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునే పొందును అగ్నియందు కట్టెలను వేసి కొంచెము సేపుంచినచో నెట్లు క్రమముగా నవి యగ్నియగునో అట్లు స్వస్వరూపమును గురూపదేశము ప్రకారము భావింపగా భావింపగా జ్ఞానరూపియగు తానే బ్రహ్మము అగును'' అని సనత్కుమారుడు నారదున కుపదేశించెను మఱియు గీత నాల్గవ అధ్యాయములో ఆత్మజ్ఞానము నొందిన మాత్రమే ముక్తుడు కాగలడనియు అట్టి జ్ఞానము తత్త్వవేత్తలగు మహాత్ముల వలననే గలుగవలసి యుండుననియు శ్రీకృష్ణభగవానులుపదేశించి యున్నారు అట్టి జ్ఞానము కొఱకు తమ పాదారవిందముల సన్నిధికి చేరడమైనది

***తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।***
***ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥***

తత్త్వవేత్తలగు జ్ఞానులు నీకు ఏ జ్ఞానము నుపదేశింపగలరో, ఆ జ్ఞానమును నమస్కారముచేతను, సమయము చూచి విమర్శించి యడుగుటచేతను, గురు

వాక్యపాలన యనెడి శుశ్రూషచేతను తెలిసికొనుము

మఱియు శ్రీ పండరీనాథుడు గూడ ఆత్మజ్ఞానమును సంపాదింప వలయు ననియు నామదేవునితో నాగనాథ క్షేత్రమునందుండు వీశోబాకేశుడు గొప్ప బ్రహ్మనిష్ఠుడనియు, నా మహాత్మునివల్ల నట్టి జ్ఞానమును పొందవలయుననియు చెప్పినట్లు మహాభక్త విజయమున నామదేవుని చరిత్రయందు గలదు ఈ కలియుగమున అర్ధశతాబ్దమువఱకు జీవించియుండిన శ్రీ రామకృష్ణపరమహంస గారితో శ్రీకాళికాదేవి గూడ జ్ఞానమును సంపాదించు కొనవలయుననియు, నది జీవన్ముక్తుడగు తోతాపురి యుపదేశించుననియు దెలిపినట్లు పరమహంస చరిత్రయందు గలదు విష్ణుభక్తియందు నామదేవునితో సమాను డాకాలములో తుకారామస్వామి మొదలగు భక్తకోటియందు మఱియొకడు లేడు ఆలాగుననే దేవీ భక్తియందు పరమహంసగారికి సమానులగువా రెవరు గలరు? తల్లికిని బిడ్డకును నెంత సంబంధము గలిగియుండునో ఆలాటి సంబంధము ప్రత్యక్షముగా కాళికాదేవికిని, రామకృష్ణ పరమహంసగారికిని గలిగి యుండెను శ్రీతరిగొండ వెంకమాంబగారును భక్తివల్ల తృప్తినొందక శ్రీ వేంకటేశ్వరులతో జ్ఞానమును ప్రసాదించవలయునని కోరి యున్నట్లు వారి చరిత్రయందు గలదు శ్రీ తరిగొండ వేంకమాంబగారి భక్తి యేమనవచ్చును? అట్టి భక్తివలననే వారు జ్ఞానమును బడసిరి గీత 13వ అధ్యాయమునందు జ్ఞానజ్ఞేయములను గుఱించి యుపదేశించునపుడు జ్ఞానము అనగా ననుష్ఠానములో నన్యభక్తిని ఉపదేశించిన తర్వాత దీనివలన సాక్షాత్కారజ్ఞానమున కర్హత గలుగునే గాని,

**'' జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే ''**

జ్ఞేయమును జెప్పుచున్నాను అట్టి జ్ఞేయమువలననే యమృతత్వమును (మోక్షమును) పొందగలవని శ్రీకృష్ణుడే దెలిపియుండినందుచే భక్తికి పరమగు జ్ఞానమొకటి గలదని యర్థమగుచున్నది విస్తారముగ జెప్పి తమ యమూల్యమగు కాలమును వ్యర్థ పరుపనని వచించెను భారతీదేవిగారి ఆ వాక్యమును విని ఆమెయొక్క ప్రవిమల హృదయ మునకును, వైరాగ్యమునకును, మిక్కిలి సంతసించి గురువరుం డింకను పరీక్షింపవలయునని యిట్లనియె

గురుడు - భారతీదేవిగారూ! మీయొక్క భక్తిజ్ఞానవైరాగ్యములకే గాక ప్రశ్నలకు తగిన సమాధానమును జెప్పునది చూడ ఋషిమండలియందు యాజ్ఞవల్క్యమహర్షితో ప్రశ్నల వేసిన ఋషి పుత్రికయు, బ్రహ్మచారిణియు నగు గార్గివలె కనిపించు చున్నావు (యోగము) అయినను యోగానుభవము లేక ద్వంద్వసహనవమును, బ్రహ్మచింతనకు దగిన చిత్తైకాగ్రతయు గలుగదు శ్రీకృష్ణభగవానుని యోగేశ్వరుడని గదా ఋషులు వచించుచున్నారు కనుకనే గీతయొక్క యంతిమ శ్లోకములో

***యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।***
***తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతిర్మతిర్మమ ॥***

ఏ పక్షమున యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడున్నాడో, ఏ పక్షమున వింటిని పట్టిన యర్జునుడున్నాడో, ఆ పక్షమున రాజ్యలక్ష్మియు, జయమును, ఐశ్వర్యాభివృద్ధియును, న్యాయమును తొలగక నిలిచియుండునని నాయొక్క నిశ్చయము ఇట్లు సంజయుండు ధృతరాష్ట్రునితో వచించెను మఱియు

***"ఏవముక్త్వా తతో రాజన్మహాయోగేశ్వరో హరిః"***

హే రాజా! మహాయోగేశ్వరుడగు నారాయణుం డీవిధముగ పలికెను ఇచ్చట గూడ యోగియనిగాని, యోగీశ్వరుడని గాని చెప్పక 'మహాయోగేశ్వరో హరిః' అని చెప్ప బడినది కాబట్టి యోగాభ్యాసమును జేయవలయును ఎవరికైనను మంచికార్యము తటస్థించు నపుడు వారి యోగ మీలాగున నున్నదని జనులు చెప్పుకొనుచుందురు మఱియు 8 వ అధ్యాయమున

***వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।***
***అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్।***

యోగి యీ యర్థమును దెలిసికొని వేదములయందును, యజ్ఞముల యందును, తపస్సులయందును, దానములయందును నేపుణ్యఫలము నిర్దేశింపబడి నదో, ఆ పుణ్యఫలమును సమస్తము నతిక్రమించుచున్నాడు ఇదియును గాక మొదటి కారణమును, సర్వోత్తమమునైన స్థానమగు బ్రహ్మమును పొందుచున్నాడు

దీనివలన యోగ మహిమ యెంత గొప్పదో దెలిసికొనవచ్చును మఱియు ఆరవ అధ్యాయమున యోగ మును గుఱించియే భగవంతు డుపదేశించియున్నాడు

**'ఆరురుక్షో ర్మునే ర్యోగం'** మోక్షపదము నొందుటకు నిచ్ఛగల మననశీలునకు యోగము సోపానమువంటిదని గ్రహింపవలయును మఱియు,

***యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః ।***
***ఏకాకీ యతచితత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥***

యోగముగలవా డేకాకియై, నియమింపబడిన యంతఃకరణమును దేహమును గలవాడును, ఆశలు లేని వాడును, పరవస్తు పరిగ్రహము లేనివాడును, ఏకాంత మందున్నవాడునై యెల్లపుడును మనస్సును పరమాత్మయందు చక్కగా నుంచవలయును ఇక దీనికంటె పరమ ప్రమాణమేమి కావలయును? సామాన్యముగ ప్రపంచములో గొప్ప యోగ్యత గలవానిని జూచిన ''ఆతని యోగమును జూడుడు'' అని మామూలుగా జెప్పుచుందురు ''**యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధి గచ్ఛతి**'' అని యుండుట వలన యోగసాధనగల ముని, జ్ఞానము నచిరకాలములోనే పొందగలుగునని సాక్షాద్భగవంతుడే యుపదేశించియున్నాడు మఱియు ప్రతి అధ్యా యాంతమున ''శ్రీభగవద్గీతా సూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే'' అనగా శ్రీభగవంతునిచే చెప్పబడిన యుపనిషత్సారమును, బ్రహ్మవిద్యయును, యోగశాస్త్రమును అని కనిపించుటచే యోగముచేతనే బ్రహ్మవిద్య పొందదగునని స్పష్టమగుచున్నది నేను ఏకాంతమున ఋషుల యనుగ్రహమువల్ల నీ యోగాభ్యాసము బహుకాలము చేసి యున్నాను యోగకర్తలందఱును యోగము లేనిచో ముక్తిని పొందజాలరనియే వచించిరి కనుకనే హఠయోగ ప్రదీపిక యందు మొట్టమొదట ధ్యాన శ్లోకమునందే ''విభ్రాజతే ప్రోన్నత రాజయోగ మారోఢు మిచ్ఛో రధిరోహిణీవ'' మిగుల శ్రేష్ఠమగు జ్ఞానయోగము నధి రోహించుటకు, కోరిక గలవానికి నిచ్చెనవలె, నీ యోగ సాధన ఉపయోగపడును సోపానములు లేని యెడల సౌధము పైకెక్కుట కెట్లు సాధ్యము గాదో ఆ రీతిగనే మోక్షసౌధమునకు యోగము లేనిచో ప్రవేశింప సాధ్యము కాదు అని చెప్పబడెను

*బ్రాహ్మణ క్షత్రియ విశాం స్త్రీశూద్రాణాం చ పావనమ్ ।*
*శాంతయే కర్మణా మన్యద్యోగాన్నాస్తి విముక్తయే ॥*

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు మొదలగు వారందఱికిని కర్మ నశించుటకును, మోక్షమును పొందుటకును యోగముకంటె పరిశుద్ధమగు మార్గము వేఱొకటి లేదు ఇట్టి బలమగు ప్రమాణముకన్న మఱియేమి కావలయును? దీనివల్ల స్త్రీలకుకూడ బ్రహ్మవిద్యయం దధికారము గలదని స్పష్టమగుచున్నది

**యోగ హీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్ ।**
**తస్మా ద్యోగంచ జ్ఞానం చ ముముక్షుర్దృఢమభ్యసేత్ ॥**

మోక్షమును గలుగ జేయు జ్ఞానము యోగము లేనిచో సిద్ధించునది కాదు ఇది నిశ్చయము అందువలన ముముక్షువగువాడు తప్పక యోగము ననుష్ఠించిన తరువాత జ్ఞానాభ్యాసమును జేయవలసియుండును ఇక నీ విషయమై విశేషముగ జెప్పనక్కర లేదని తలంచెద ఇయ్యది సర్వులకు జెప్పదగినది కాదు బ్రహ్మచర్య నియమమును, ఆహారనియమమును, ఏకాంత ప్రదేశమును యోగమునకు ముఖ్యాంశములు

*దృష్టే తథానుశ్రవికే విరక్తం విషయే మనః ।*
*యస్య తస్యాఽధికారోఽస్మిన్ యోగే నాన్యస్య కస్యచిత్ ॥*

ఇహలోక, పరలోక విషయములందు విరక్తి నొందిన చిత్తము గలవానికే యీ యోగమునం దధికారము గలదు తదితరులకు లేదు అంతేగాని అటునిటు తిరుగు చుండువారికిది యుపదేశింపరాదు అని యోగకర్తలే నిర్వచించిరి

*గురుప్రసాదాల్లభతే యోగ మష్టాంగసంయుతమ్ ।*
*శివప్రసాదాల్లభతే యోగసిద్ధిం చ శాశ్వతమ్ ॥*

యోగసిద్ధి గల గురుని యనుగ్రహము వలననే యష్టాంగ సహిత యోగమును, శివ ప్రసాదమువలన శాశ్వతమగు యోగసిద్ధియును (మోక్షమును)

గలుగును ''వసిష్ఠాద్యైశ్చ మునిభిర్మత్స్యేంద్రాద్యైశ్చ యోగిభిః'' వసిష్ఠవిశ్వామిత్ర పరాశర ప్రభృతులగు మునులచేతను, మత్స్యేంద్ర దత్తాత్రేయ గోరక్షాది యోగులచేతను నీ యోగ మనుష్ఠింపబడినది స్త్రీలలో గూడ సులభ గొప్ప యోగిని యగుటచేతనే తాను సంకల్పించినట్లు దేహమును ధరింప శక్తి గలదగుటం జేసి జనకమహారాజాను గూడ విస్మయ మొందించెడు యోగ మహిమ గలిగినదాయెను శతశృంగ పర్వతమున మహర్షుల సేవ జేసియే యట్టి దివ్య యోగవిద్యను ఆమె నేర్చుకొనెను ఆమెయు రాజ కన్యకయే బ్రహ్మచారిణియే

మఱియు చూడాల యను శిఖిధ్వజ మహారాజు ధర్మపత్ని యోగసిద్ధివలననే తన భర్తయగు శిఖిధ్వజుండు వనమున చిరకాలము తపం బొనర్చుచుండ కుంభముని వేషము ధరించి బ్రహ్మజ్ఞానము నుపదేశించియున్నారు ఇట్టి మహిమలన్నియు యోగమందు గలవు కావున మీరును యోగసిద్ధి పొందవలసి యుండిన అద్దానిని బడసి యణిమాద్యష్ట సిద్ధుల నొంది లోకములో మహిమలను జూపుచు గొప్ప గౌరవమును బొందవచ్చును అట్లు మహిమ యవసరము లేదని తోచిన యెడల నిర్వికల్ప సమాధిలో చిరకాలముండుట కుపయోగపడును

భారతి – కరుణాకరా! గురువరా! యోగసాధనయందు దీనికిని ప్రీతిమెండు అది లేనిచో ద్వంద్వసహనశక్తియు, నింద్రియ సంయమమును గలుగదు శీతోష్ణముల సహింప శక్తియు దీనివలననే గలుగును గొప్ప యోగసిద్ధి యవసరము లేక పోయినను కొంతవఱకు యోగసాధన యుండిన మాత్రముననే నిదిధ్యాసమం దెక్కువ కాలము నిలుచుటకు సాధ్యమగును ''నివాత దీపవచ్చిత్తం సమాధి రభిధీయతే'' అన్నట్లు గాలి లేని చోట చలనము లేని దీపమువలె స్వరూప సాక్షాత్కార జ్ఞానజ్యోతి నిలుచుటకు తగిన ధ్యాన ధారణలకు యోగ ముండవలయును

***నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే।***
***తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥***

ఈ లోకమున తపో యోగాదుల లోపల జ్ఞానమునకు సమానముగ

పావనమైనది మఱియొకటి లేదు యోగముచేతనే సిద్ధిని పొందినవారు కొంతకాలము పోగా తన యందు గల ఆజ్ఞానమును స్వయముగా తానే పొందుచున్నాడు అని భగవానుడు పదేశించెను ఇచ్చట యోగము సాధనముగాను, జ్ఞానము సాధ్యముగాను వచించియున్నారు కనుకనే ''తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి'' అని చెప్పుటకు కారణము అందుచే యోగానుష్ఠానమువలన కాలము పరిపక్వావస్థకు వచ్చినపుడు తనలోగల యాత్మ జ్ఞాన మావిర్భవించునని భావము ఇదివఱలో తాము సెలవిచ్చిన హఠయోగాది శాస్త్రముల యొక్క తాత్పర్యము గూడ నిట్లే కనుపించుచున్నది ఆత్మారామ యోగీంద్రులును నా విధ ముగానే చెప్పియున్నారు ''కేవలం రాజయోగాయ హఠవిద్యోపదిశ్యతే'' కేవలము జ్ఞాన సిద్ధికొఱకే ఆత్మారామ యోగీంద్రునిచే యోగవిద్య యుపదేశింపబడుచున్నదని గలదు

*న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన ।*
*ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ ॥*

ఏ మనుజుడును ప్రాణవాయువుచేత జీవింపడు అపాన వాయువుచేత గూడ జీవింపడు ప్రాణాపాన వ్యతిరిక్తాత్మచేతనే జీవించుచున్నాడు ఏ యాత్మ నీ ప్రాణాపానములాశ్రయించియున్నవో, అట్టి యాత్మయే ప్రాణమునకు కూడా ప్రాణ మయినది ఏలనన ఈ ప్రాణము నేది ప్రేరణ చేయుచున్నదో అదే యాత్మ దానికే ముఖ్యప్రాణమని పేరు అట్లాత్మను దెలియక ఈ ప్రాణములను మాత్రము వశపఱచు కొనుటకు జేసెడు ప్రయత్నము ముఖ్యమైనది గాదని కఠోపనిషత్తునందు గలదు యోగములో ముఖ్యమైనది ప్రాణాయామము దానిని గూడ నిషేధించగా తక్కిన యోగ ములగూర్చి చెప్పనేల? మఱియు ''ధ్యానం జ్ఞానస్య కారణమ్'' ధ్యానయోగము జ్ఞానయోగమునకు కారణము ఇదియు యోగము సోపానమువంటిదనియు, జ్ఞానము సౌధాంత ర్భాగానంద నిలయమనియు దెలుపుచున్నది (అర్థమగుచున్నది) తమబోటి మహనీయుల కరుణవలనను, సర్వేశ్వరుని యనుగ్రహమువలనను, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులవరకుగల సాధనల నన్నిటిని శ్రీ పాతంజల

యోగదర్శనము ననుసరించి కొంతవఱకు శీలించియున్నాను సమాధి యందు గూడ నివాతదీప స్థితి యవస్థ గలిగినది మఱియు నుత్థాన దశయందు గూడ సంస్కారదశలుగాని, వృత్తులుగాని, దృశ్యవాసనలుగాని గలుగుట లేదు కాని దృశ్య లయము మాత్రము గలుగ లేదు అది జ్ఞానమొకదానిచే మాత్రమే గలుగ వలయునని మహర్షులయొక్కయు, ఉపనిషత్తులయొక్కయు అభిప్రాయమై యున్నది దృశ్యమున్నచో దృక్కును దర్శనమును యుండే తీరవలయును అప్పుడు ''ఏకం సత్'' అని యుండెడు స్థితి గలుగదు దృశ్యముండిన పెద్దపులిదగ్గఱ కట్టివేసియుండు ఆవుయొక్క శాంతి యెట్టిదో ఈ యోగియొక్క శాంతియు నట్టిదే యోగముచే జ్ఞానాగ్ని ప్రజ్వలించు చుండిన మఱల ఉత్థానదశలో వృత్తులు, సంస్కారములు, జన్మాంతర వాసనలు గాని గలగవు అట్లు గాకపోయినచో ధ్యానములో, సమాధిలో నుండునపు డానందముగా నుండి మఱల ఉత్థాన దశలోనికి వచ్చునపుడు మామూలు గుణము లుండినచో జ్ఞానాగ్ని యింకను ప్రజ్వలించ లేదనియే యోగముతో కూడిన జ్ఞానశాస్త్రము చెప్పుచున్నది

***తత్త్వావబోధ ఏవాసౌ వాసనా తృణపావకః ।***
***ప్రోక్తస్సమాధిశబ్దేన నతు తూష్ణీమవస్థితిః ॥***

అసత్యములగు జగజ్జీవేశ్వరాది భేదములను నిరసించి సత్యమగు బ్రహ్మజ్ఞానము నెఱుంగుట తత్త్వావబోధమనబడును పాఠాంతరమున సత్త్వావ బోధమని గూడ గలదు సత్త్వావ బోధమనగా తానే బ్రహ్మమనియు, తనకంటె నితరమెద్దియు లేదని యెఱుంగుటయే సమాధి యగును ఇది సమస్త వాసనలనెడు శుష్కతృణములకు ప్రజ్వలితమగు నగ్నివంటి దగుటచే వాసనలను నశింప జేయును మఱియు

***నైతజ్జాగ్రన్నవ స్వప్నం సంకల్పానామభావనాత్ ।***
***సుషుప్తిభావో నాప్యేతదభావాజ్జడతాస్థితేః ॥***

సమాధియందు దృశ్యము స్ఫురింపనందుచే నది జాగ్రదవస్థ గాదు బ్రహ్మాకారముగ మనస్సు పరిణమించుటచే నితర సంకల్పములు లేనందున స్వప్నావస్థ వంటిది కాదు జడత్వము ( తమస్సు) కానందుచేత సుషుప్తియు ( నిద్రావస్థయును)

గాదు మరేమన! ఆ సమాధి కేవలతురీయమై, జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలకు విలక్షణమై యున్నది

***నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః ।***
***వృత్తివిస్మరణం సమ్యక్సమాధి రభిధీయతే ॥***

చిత్తమును బ్రహ్మధ్యానమున లయింప జేసి బ్రహ్మాకారముగను, నిర్వికారము గను జేయుచు చిత్తవృత్తులను గలుగనీయకుండుట సమాధి యని చెప్పబడును

***అక్షుబ్ధా నిరహంకార ద్వంద్వేష్వనుపాయినీ ।***
***బ్రహ్మన్ సమాధిశబ్దేన మేరోః స్థిరతరా స్థితిః ॥***

అహంకారశూన్యమై, సుఖదుఃఖాది ద్వందములచే బాధింపబడనిదై, దృశ్య విషయముల వలన క్షోభింపబడనిదై యుండు స్థితి మేరుపర్వతమున కన్నను మిక్కిలి స్థిరముగా నుండును అట్టి స్థిరతరమగు స్థితియే సమాధి యనబడును సంకల్పములు నశించుటచే నలలు లేని సముద్రమువలెను, ద్వంద్వములచే బాధింపబడనందుచే మహా మేరుపర్వతమువలె స్థిరముగా నుండునని భావము

***ధ్యాతృధ్యానే విహాయ స్వే నివాత స్థితదీపవత్ ।***
***ధ్యేయైకగోచరం చిత్తం సమాధిరభిధీయతే ॥***

ధ్యానము, ధ్యాత అనెడి వృత్తులు లేక ధ్యేయమగు బ్రహ్మస్వరూపము నొందిన చిత్తమే సమాధి యనబడును భ్రమరకీటక న్యాయమున ధ్యానింపగా ధ్యాతయే ధ్యేయా కారమగును అనగా బ్రహ్మాకారము నొందును అదియే సమాధి

***ఊర్ధ్వపూర్ణమధఃపూర్ణం మధ్యపూర్ణం శివాత్మకమ్ ।***
***సాక్షా ద్విధిముఖో హ్యేష సమాధిః పారమార్థికః ॥***

మీదను క్రిందను నడుమను నిండి యున్నట్టి సర్వపరిపూర్ణ బ్రహ్మాకారదశయే శాస్త్రసిద్ధమైన సాక్షాద్విధిరూపమగు సమాధి యగును

ఇక నిర్బీజ సమాధి యనియు, సబీజ సమాధియనియు శబ్దానువిద్ధ సమాధి

యనియు, దృగనువిద్ధ సమాధియనియు, సాలంబ సమాధియనియు, నిరాలంబ సమాధియనియు ననేకములు గలవు కావున దృశ్యభావ మీ యనాధురాలనగు నాకు పోలేదు గండుపిల్లి దగ్గర, గూటిలో నుండు ఎలుక కెంత సౌఖ్యముండునో దృశ్యవిల యముకాని యోగియొక్క సుఖము నటువంటి దే మరియు నొక బోనుయందు రెండు గదులు నిర్మించి యొక దానియందు సింహమును, మఱియొక దానియందు మేక పిల్లను ఉంచిన యెడల ఆ అజకిశోరమున కెంత మనశ్శాంతి యుండునో, ఆలాగున దృద్దర్శన దృశ్యములయొక్క యేకత్వము గలుగని వారికి యోగానందముండును ఇదే నన్ను సర్వదా బాధించుచున్నది మఱియు నొక రాష్ట్రములో కొంతభాగము యుద్ధములో జయించి, మఱికొంతభాగము శత్రువశమై యుండినచో, నూతనరాజున కేలాగున నిర్బృతి కలుగక యెల్లప్పుడు భయము గలుగుచుండునో ఆలాగున తురీయ పదమునందుండు యోగికి నైనను దృశ్యవిలయము గలుగనిచో నిర్భయమును నిరతి శయానందమును గలుగదు సమాధిలో నుండువఱకు మిక్కిలి యానందము గలిగి యుండినను సమాధినుండి లేచిన పిమ్మట దృశ్య మాత్మ కన్యముగా కనుపించిన పైజెప్పిన స్థితియే గల్గును! మఱియు రాష్ట్రమంతయు జయింపనిచో సార్వభౌమత్వమెట్లు కలుగదో, శత్రుబాధ యెట్లు నశింపదో, ఆ రీతిగ త్రిపుటిలో నేకత్వము గలుగనంత వరకు తన యనుష్ఠానము పూర్తియైనదని తలంచి యజాగ్రత పడరాదు శత్రువును, విషమును, నిప్పును, అవిద్యయును కొంచమైన మిగిలి యుండిన భయంకరములని శాస్త్రము తెలుపుచున్నది మఱియు యోగులలో గొప్పవారు సనకాదులు ఎవరు యోగ విషయమును జెప్పినను సనకాది యోగులనే దృష్టాంతమిచ్చెదరు అట్టి సనకాది యోగులు నలుగురును, కైలాస శిఖరమందు యోగమువల్ల పూర్ణజ్ఞానసిద్ధి గలుగక పోయినందుచే పరమ గురుడగు శ్రీ దక్షిణామూర్తి వలన జ్ఞానోపదేశమొంది కృతార్థులైనట్లు శాస్త్రమందు గలదు

*చిత్రం వటతరో ర్మూలే వృద్ధా శ్శిష్యా గురుర్యువా ।*
*గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః ॥*

కైలాసశిఖరమున వటవృక్ష మూలమున యోగాసీనుడై యుండు

దక్షిణామూర్తి పరమగురుని సనకాదులగు మహర్షులు విధిప్రకార మాశ్రయించి చిన్ముద్ర అనగా జ్ఞానముద్ర యొక్క రహస్యోపదేశము నొంది కృతార్థులైనట్లు శాస్త్రమునందు గలదు

కావున పరమగురుని వెదకి వెదకి శ్రమపడి తమసన్నిధిని జేరితిని మఱియు రాజ కుటుంబములో జన్మించిన ''మదాలస'' యను బ్రహ్మనిష్ఠురాలగు మహారాణి యొక్క పెద్ద కొమరుండగు అలర్కుడు యోగమందు గొప్ప మహిమను సంపాదించినను తన తల్లియగు మదాలస యుపదేశమువలన శ్రీ దత్తాత్రేయ ముని కడకేగి, బ్రహ్మజ్ఞానోపదేశము నొందినట్లు పురాణమందు గలదు ఇంకను శిఖిధ్వజుడను రాజేంద్రుడు వనమున తప మాచరించుచు యోగాభ్యాస పరుడై యుండియు, నాత్మ విశ్రాంతి నొందక పోవుటచే హృదయమున తాపము గలుగుటవలన, యోగసిద్ధియు, జ్ఞాన సిద్ధియు గల తన భార్యయగు చూడాల, కుంభముని వేషమును ధరించి, ఆకాశమార్గ మున వెళ్ళి యాశిఖిధ్వజునకాత్మ విశ్రాంతి పరమగు బ్రహ్మజ్ఞానము నుపదేశించినట్లు యోగవాసిష్ఠమందు గలదు మఱియు గోరక్‌నాథ్ అను గొప్పయోగి, యోగసిద్ధిని పొందినను భక్తియును, జ్ఞానమును లేనందుచే శ్రీకాశీలో శ్రీ రామానంద స్వామిని జయించు నుద్దేశముతో రామానందస్వామి మఠమునకు ముందు వీధిలో శూలమును నాటి దానిపై యోగశక్తిచే కూర్చుండి రామానందస్వామిని వాదమునకు పిలువగా రామానందస్వామి శిష్యుడగు శ్రీ కబీరుదాసు ''ఈ యోగము, ఇంద్రజాలము వంటిదనియు, నింతకాలము యోగాభ్యాసమును జేసియు, నెంతకాలమో కష్టపడియు, మీ గర్వము, మీ యహంకారము నశింపక పోయినది గదా! పరమభక్తుడును, భగవ త్సాక్షాత్కార జ్ఞానమును గలిగి పరమ సాధువైయుండు మా గురువరేణ్యుడగు రామానందుల వారిని వాదమున కాహ్వానించుచున్నారా! నన్ను జయించిన తర్వాత రామానందస్వాములను జయింపవచ్చునని'' చెప్పి యొక నూలుండను పై కెగురవేయుగా నొక క్రాటిమాను పొడుగున నూలుండ యగ్రభాగముండుటచే, నాదారమును పట్టు కొని చాలయెత్తున నుండు దారపు ఉండపై కబీరుదాసు కూర్చుండి, నాతో సమాన ముగ నాసీనుడవై, వాదము

చేయుము, రమ్ము రమ్మని పిలువగా గోరక్‌నాథ్ పైకి చూచిచూచి యేమియు నుపాయము తోచక తన శూలము నూడబెరికి భుజముపై పెట్టుకొని క్రింద జూచుచు వచ్చిన దారి బట్టుకొని వెళ్ళినట్లు భక్తవిజయమందు గలదు

మఱియు యోగాభ్యాసముగాని, ప్రాణాయామముగాని, జపముగాని, వ్రతము గాని, తీర్థయాత్రగాని, అర్చన, భజన, పూజాదులుగాని, యేలాటి విచారణశక్తి లేని వారికి గూడ సాధ్యమైన కార్యములే ఏలన, ఇవి యన్నియు నేత్రమునకు కనుపించెడు ఈ జగత్తు లేదని చెప్పుట లేదు జగత్తునుండి ముక్తి గలుగవలయుననియే యుపదేశించుచున్నవి కావున వీటియందు గొప్ప ప్రజ్ఞతో గూడిన విచారణ యవసరము లేదు బ్రహ్మ జ్ఞానమన్ననో యట్టిది గాదు అది కనుపించెడు ఈ జగమంతయు చైతన్య స్వరూపముగ నాత్మ విచారణ వలన కనబడకుండ జేయును కనుపించని యాత్మను (దైవమును) కనుపించునట్లు చేయును అంతే గాదు, ప్రత్యక్షముగ జేసి అదే తనయొక్క స్వరూపమగు ఆత్మయని నిస్సంశయ మొనర్చును అందువలననే ''వేదాంతం బ్రహ్మ విద్యాంతం'' అని చెప్పుటకు కారణము మనీషులయొక్క మేధాశక్తియు, ఆత్మశక్తియు, బుద్ధి సూక్ష్మతయు నిచ్చుట కనందగును దానియొక్క మహిమ యెటువంటిదనగా? ఉన్న దానిని లేనిదానినిగాను, లేనిదానిని ఉన్న దానినిగాను చేయుచుండును అనగా కనబడునదంతయు మాయయనియు, కనబడనిదియే మాయారహిత మనియు, యుక్తివల్లను, శాస్త్రమువల్లను, అనుభవమువలనను, అది స్పష్టముగ వివరించును అంతేగాదు అరచేతిలో గల ఉసిరిక పండువలె ప్రత్యక్షముగ నిరూపించును యధార్థముగ చెప్పినచో నీ యోగమును, భక్తియును, నిష్కామ కర్మయును బ్రహ్మ విద్యను గ్రహించుటకు తగినట్లంతఃకరణమును శుద్ధపఱచుట కేర్పడినవి ఈ మూడు యోగములవలన బుద్ధి శుద్ధమై నిర్విషయమైన మాత్రమే పరబ్రహ్మము గోచరించును ఇదే శాస్త్రములోగల నిగూఢ రహస్యము కేవలము ఇటుకరాతి గోడయందు మన ప్రతి బింబము కనుపించదు సున్నపు పూతవేసి, దానిపై మంచి నీరు సున్నము వేసి, మఱియు దానిపై వెన్నలాంటి సున్నము వేసి స్ఫటిక రాతితో బాగుగ రుద్దినచో ఆ గోడ యద్దమువలె నేర్పడును అపుడు

తనయొక్క బింబము స్పష్టముగా నా గోడయందు కనుపించునట్లు కర్మ, భక్తి, యోగములచే బుద్ధి శుద్ధమైనపు డాత్మ విచారణ క్షర్హత కలుగును మోటు గోడయందు గూడ తన ప్రతిబింబముండెను శుద్ధముగా లేనందుచే ప్రతిబింబము ప్రతిఫలింప లేదు ఆలాగున దైవజ్ఞానము (ఈశ్వరస్వరూపము) అందఱియందు నొకే విధమునా నున్నది హృదయశుద్ధి విహీనుల కగుపడుట లేదు కనుకనే గీత 18 వ అధ్యాయమున గీతాశాస్త్రముయొక్క సారము సంక్షేపముగా జెప్పెదనని శ్రీ కృష్ణుడు మూడు శ్లోకములచే నిట్లుపదేశించి యున్నారు

***సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।***
***సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥***

ఓ యర్జునా! ఏది శ్రేష్ఠమైన బ్రహ్మజ్ఞానముయొక్క పర్యవసానమో, నైష్కర్మ్య సిద్ధిని పొందినవాడై యే ప్రకారముగ పరమాత్మను పొందుచున్నాడో, ఆ ప్రకారము సంక్షేపముగా జెప్పెడు నాయొక్క బోధ తెలిసికొనుము

***బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।***
***శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥***

***వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।***
***ధ్యానయోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥***

మాయారహితమైన బుద్ధితో కూడినవాడును, ధైర్యముతో బుద్ధిని వశముగ జేసికొనియును, శబ్దస్పర్శరూప రసగంధములనునట్టి విషయములను వదలి రాగ ద్వేషములను బాగుగా విడిచియు, జనరహితమును, పవిత్రమునునగు నేకాంత ప్రదే శమునందుండెడివాడును, అల్పాహారము గలవాడును, వాక్కాయ మనంబుల స్వాధీన ముగ జేసికొనినవాడును, నెల్లప్పుడును ఆత్మస్వరూప చింతనాసక్తుడునై యిహపర భోగములందు మిక్కిలి విరక్తిగలవాడును నగు వానికే ఈ బ్రహ్మసాక్షాత్కారమునందధి కారము గలుగును

***మలినో హి యథాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।***
***తథాఽవిపక్వ కరణ ఆత్మ జ్ఞానస్య నక్షమః ॥***

మలినమగు దర్పణమున నేలాగున తన రూపమును జూడ సాధ్యము కాదో, ఆ రీతిగ పరిపక్వము లేని యంతఃకరణమున నాత్మజ్ఞానము గలుగజాలదు మలినదర్పణమును శుద్ధముగ జేసినచో ఏలాగున తన రూపమును స్పష్టముగ జూడ గలుగునో, అదేవిధముగ నంతఃకరణ శుద్ధి గలిగిన ఆత్మస్వరూపజ్ఞానమును జూడశక్తి గలుగును

***ఫలం కతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్।***
***న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి ॥***

కతక రేణువుయొక్క పేరు చెప్పినచో ఏలాగున బురదనీరు శుద్ధము కాదో, చిల్ల గింజను బురదనీటిలో అరగ దీసిన మాత్రమే జలము శుద్ధమగునో ఆలాగున క్రియా శూన్యమగు వట్టిమాటచేత నాత్మశుద్ధి గలుగ నేరదు

ఇట్లు చెప్పుటలో కర్మయోగముచేతను, భక్తియోగముచేతను, యమాద్యష్టాంగ యోగముచేతను, మనోనిర్మలత గలిగిన పిమ్మటనే తత్త్వబోధము గలుగునని తేలుచు న్నది మఱియు,''బుద్ధ్యా విశుద్ధయా యుక్తః'' అని చెప్పుటకును ''సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ'' అని యుపదేశించుటకును కారణమైనది మఱియు శ్రీబాదరాయణ మునివరుడు రచించిన బ్రహ్మసూత్రములలో మొదట ''అథాతో బ్రహ్మజిజ్ఞాసా'' అని రచించుట కిదే కారణము 'అథ' శబ్దమున కిచ్చుట యనంతరమనియే భాష్యకర్తలగు శ్రీ శంకరాచార్య ప్రభృతులెల్లరు అర్థము వ్రాసియున్నారు దేనికనంతరమనగా నిష్కామకర్మయోగముచే నంతఃకరణ శుద్ధియు, భక్తియోగముచే విక్షేపనివృత్తియు, అష్టాంగయోగముచే చిత్తైకాగ్రతయు గలిగి శమదమాది సాధనసంపన్నుడైన యనంత రమనియే భాష్యకారు లర్థమును జెప్పియున్నారు ఇదే నిజమగు వేదాంతార్థ గ్రహణమునకు దగిన మనః స్థితియని గ్రహించుకొనవలయును సూత్రశబ్దముయొక్క యర్థమును జూడుడు

**''అల్పాక్షర మసం దిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్**
**అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః''**

కొద్ది అక్షరములతో గూడినదియు, సందేహము లేనిదియు, సారము మాత్రము గలదియు, సర్వతోముఖముగ శాస్త్రము ననుసరించినదియు, దోషశూన్యమైనదియు, నిరంకుశమైనదియునగు వాక్యము సూత్రమని సూత్రవిదులగు జ్ఞానులు చెప్పిరి గొప్పదగు వటవృక్షమతి సూక్ష్మ బీజములో నిమిడియున్నట్లు, అనేక వాక్యార్థము లొక శబ్దమునందిమిడి యుండునదియే సూత్రము అట్లంతఃకరణశుద్ధి గలుగని వారికి జేసెడు బ్రహ్మోపదేశము మలినవస్త్ర మునకు రంగువేసి నట్లుండును ఆ రంగు నీళ్ళు తడిసిన వెంటనే వదలిపోవును వస్త్రమును శుద్ధపఱచిన తరువాత రంగులో ముంచినచో నది గట్టిగ పట్టుకొనును మఱలనీటిలో తడిసినను వదలిపోదు

***యథా చ మలినే వస్త్రే రంగః శుభ్రతరో న హి ।***
***క్షాళనే హి కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జతే ॥***

ఆలాగున యపక్వహృదయము గలవారికి నుపదేశించినచో నింద్రియవిషయ సామీప్యమున విషయవృత్తి గలుగును

మఱియు పచ్చికుండపై బొమ్మలు చిత్రించిన యొడల నీళ్ళచే తడిసినప్పుడు ఆ ఘటమును, రంగును కఱిగిపోవును కాల్చబడిన ఘటముపై చిత్రించినచో నాలాగు ననే యుండును కావుననే విషయవిరక్తి గలిగి పరిపక్వస్థితి గలుగువఱకును ఆవములో కుండలు కాలునట్లు, హృదయము తపస్సులోను, అనుష్ఠానమందును కాలవలయును కావున భ్రమరము పురుగును తనరూపముగా జేయునట్లు, జీవోపాధిగల క్రిమి వలెనుండు జీవుని, శివత్వమగు భ్రమరమునుగా జేయువలయునని శ్రీవారిని పదేపదే కోరుచున్నాను ఏమేమో తెలిసియో తెలియకనో పండితులవలె తమ సన్నిధిలో వచించి తిని శ్రీవారి సాన్నిధ్య మహిమవలననే ఈ విధముగ నింతయు జెప్పుటకును శక్తి గలిగినది చిన్నపిల్లల వాక్యములు యధార్థములు గాకపోయినను తల్లిదండ్రులెట్లు వాటి నాలకించి సంతసించి బిడ్డలయొక్క యభీప్సితమును నెరవేర్చెదరో ఆలాగున దైవము గాను, గురువుగాను, నున్నట్టి తమరిని నమ్మి యిచ్చటికి వచ్చి చేరితిని నే నేజన్మములో నోచిన నోముయొక్క పుణ్యఫలముచేతనో, లేక నా మాతాపితరులు చేసిన తపస్సు

వలననో లేక ఇంతకాలము దైవము పై ఆధారపడి చేసిన భక్తివలన గలిగిన సర్వేశ్వరుని కరుణవలననో, సంసారసాగరములో తపించెడి జీవ కోట్లను తరింపజేయు తమ పాదకమల సన్నిధికి జేరడమైనది తమయొక్క యమూల్యమగు సమయమును చాల పోగొట్టిన దాననైతిని క్షమింపవలయును దృశ్య విలయమగు నే జ్ఞానము ఏకమై సత్తా మాత్రమగు బ్రహ్మమైయున్నదో ఈ జీవి కట్టిస్థితిని గలుగ జేయవలయును అట్టి పరిపూర్ణత్వమును కరుణించి యనుగ్రహింపవలయునని మఱల మఱల ప్రార్థన చేయుదానను అట్టి యద్వయమగు స్థితిని నేను పొందేలాగున యాశీర్వదింపవలయును అది యోగముచే పొందదగినది కాదు అంతేగాక ఎంత శ్రద్ధగలవాడైనను స్వప్రయత్నముతో పొందదగినది గాదు స్వయముగా శాస్త్రవిచారణ చేతను పొంద దగినది కాదని శంకరు లుపదేశించిరి

*న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా ।*
*బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షః సిధ్యతి నాన్యథా ॥*

హఠాది యోగాభ్యాసము వలన గాని, సాంఖ్యశాస్త్రరీత్యా ప్రకృతి పురుష వివేచన వలన గాని, యజ్ఞాది కర్మాచరణవలన గాని, తర్క మీమాంసాది శాస్త్రాధ్యయ నమువలన గాని, బంధవిముక్తి పూర్వకముగా పరమానంద ప్రాప్తిరూప మోక్షము సిద్ధింపదు బ్రహ్మాత్మై కత్వ మనెడి జ్ఞాన మొకదానివలననే మోక్షప్రాప్తి గలుగును

*పఠంతు శాస్త్రాణి యజన్తు దేవాన్*
*కుర్వన్తు కర్మాణి భజంతు దేవతాః ।*
*ఆత్మైక్య బోధేన వినా విముక్తి*
*ర్న సిధ్యతి బ్రహ్మశతాంతరేఽపి ॥*

షట్శాస్త్రములను వ్యాఖ్యాన సహితముగ పఠింతురుగాక! యజ్ఞాదికర్మల వలన నింద్రాది దేవతలను తృప్తినొందింతురుగాక! కర్మలనెల్లను జేయుదురుగాక! దేవతలను యోగముచే తృప్తినొందింతురుగాక! ఆత్మజ్ఞానము గలుగనిదె నూఱు బ్రహ్మకల్పములకైనను ముక్తి సిద్ధింపదు

*అకృత్వా దృశ్యవిలయ మజ్ఞాత్వా తత్త్వ మాత్మనః ।*
*బాహ్యశబ్దైః కుతో ముక్తి రుక్తి మాత్రఫలైర్నృణామ్ ॥*

బ్రహ్మాత్మైక్య వృత్తిగల జ్ఞానికి దృశ్యప్రపంచము స్ఫురింపదు ఆ ప్రకారము దృశ్య విలయమగునట్టి యాత్మ తత్త్వజ్ఞానము గలుగనిదే గురూపదేశము లేకనే శాస్త్రావ లోకనమువలన గలిగిన యర్థజ్ఞానముచే శబ్దోచ్చారణమును జేసినంత మాత్రముననే ముక్తి గలుగదు అది శబ్దోచ్చారణ మాత్రమే యగును

*అకృత్వా శత్రుసంహార మగత్వాఽఖిలభూశ్రియమ్ ।*
*రాజాఽహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి ॥*

శత్రువులను నిశ్శేషముగ సంహరించి, యఖిల భూమండలాధిపత్యమును వహించిన వాడే రాజగును కాని, 'నేను రాజును, నేను రాజును' అని చెప్పినంత మాత్రమున రాజా కాజాలడు

*పథ్య మౌషధసేవా చ క్రియతే యేన రోగిణా ।*
*ఆరోగ్యసిద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా ॥*

వ్యాధిగ్రస్తుడు తాను స్వయముగా ఔషధమును సేవించి పథ్యముగ నుండిన యెడల వాని కారోగ్యము గలుగును ఇతరులౌషధసేవయు, పథ్యమును జేసినచో రోగియొక్క రోగము కుదురునా? కుదరదు కాన బ్రహ్మజ్ఞానోపదేశమును జేయ ప్రార్థించుచున్నానని చెప్పెను

భారతీదేవియొక్క బ్రహ్మసాక్షాత్కార జ్ఞానప్రాప్తి నొందు టకు గల తీవ్రతను జూచియు, ధారణాధ్యానసమాధులవలకి దివలలో పొందియుండు స్థితిని గ్రహించియు విశుద్ధాంతఃకరణస్థితి నెఱింగియు గురువరు డిట్లు చెప్ప దొడగెను

గురుడు – ''పరమ ఋషిసంతతిలో జన్మించిన భారతీదేవిగారూ! మీకు శుభము చేకూరుగాత! నేను చిరకాలమనేక సాధనలను జేసియు, త్రిపుటి రహితమగు నీ యేకైక సత్తామాత్రమగు బ్రహ్మమును పొందజాలక విసుగుగలిగి యేకాంతమున బహుకాల పర్యంతము నిదిధ్యాసములందు త్రిపుటి రహిత బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారస్థితిలోనుండి యనుష్ఠించినందుచేతను, శ్రీగురు

కరుణాకటాక్షవుచేతను, సర్వేశ్వరుని కృపచేతను నీ యద్వైతస్థితిని పొందగలిగితిని అనేక భక్తు లిదివఱకు తరణోపాయ మడుగుచుండినను కొందఱికి మంత్రోపదేశము, మఱికొందరికి యోగసాధనయు, ఇకకొందఱికి నేకాంత భక్తియు,కొందఱికి సాంఖ్య విచారణయు, కొందఱికి యమనియమాద్యష్టాంగ యోగములతో గూడిన నిర్వికల్ప సమాధియు నుపదేశించితిని అపుడు వారందఱును పరమానంద భరితులై తరించితిమి తరించితిమని చెప్పుచు నా నందభరితులై వెళ్ళిరి కావున మీరును నీ ధ్యానసమాధులతో తృప్తినొంది యానంద ముతో వెళ్ళవలసినది' ని పలుకుచు నికను ఈ భారతీదేవిని పరీక్షించవలయును పరిపక్వము లేనివారిని ధనాభిలాషచేత గాని, యితరమైన సహాయాభిలాషచేతగాని చేర్చినచో మఱల చిక్కులు గలుగును కొందఱు తమ సంఘము వృద్ధియగుటకును, శ్రీమంతులు, ఉద్యోగస్థులు, తమ సంఘములో జేరినచో లోకములో గౌరవము గలుగుననియు, వారికి హితములగు మాటల జెప్పి చేర్పజూచెదరు వారికాత్మశుద్ధి గలదా! లేదా! యని శోధింపనందుచేతనే మఱల వారిలోగల యొక్కొక్క ప్రకృతి గుణమున్ను బయటపడదొడంగును అప్పుడు కలహములు, విరోధములు గలుగును దాని వలన నశాంతియే మిగులును నిజముగ జూచిన బ్రహ్మజ్ఞానమునకు గీత 16 వ అధ్యాయమున జెప్పిన దైవధనము గలవాడే యర్హుడగును అట్టివాడు బాహ్యధనము లేనివాడైనను వానియొక్క ధ్యానజ్ఞానములచే ననేక ధనవంతులు పాదాక్రాన్తులగుదురు అంతేగాక స్త్రీల కుపదేశించు విషయములో మరింత జాగ్రతవహింప వలయును' ని తలంచి, నచికేతువు కొఱకు యమధర్మరాజు చెప్పినట్లు ఈ భారతీదేవిని మఱియొకసారి పరీక్ష చేయవలయునని యిట్లనియె

''అమ్మా! యిదివఱలో జెప్పిన జనాకర్షణ, ధనాకర్షణ మంత్రములను, యంత్రములను నేర్చుకొని గొప్ప శ్రీమంతురాలవై సుఖములను పొందుము లేక కాయసిద్ధిగల కల్పమును సేవించి యెల్లపుడును రూపయౌవనములు గలిగి చిరకాలము సుఖముల ననుభవింపుము బ్రహ్మవిద్య యొకటి మాత్రము పరమఋషుల ధనమగుటచే దానిని సర్వసంగపరిత్యాగము గలుగని వారికేదో ధనాభిలాష గలిగి చెప్పుట శ్రేష్ఠకులములో జన్మించిన మంచి వైదిక నిష్ఠగల

బీదబ్రాహ్మణుడు విద్యయు, రూపము, సుగుణ సంపత్తియు గలిగిన తన పుత్రికను ధనాభిలాష గలిగి మ్లేచ్ఛులకిచ్చినట్లగును కావున బ్రహ్మజ్ఞానము నడుగకుము తక్కిన తపోయోగాదుల నడుగుము ఉపదేశించె దను

*దేవైరత్రాపి విచికిత్సితం పురా నహి సు జ్ఞేయ మణురేషధర్మః ।*
*అన్యం వరం నచికేతో వృణీష్వ మా మోపరోత్సీరతి మాసృజైనమ్ ॥*

(కఠోపనిషత్తు)

ఓ నచికేతుడా! ఆత్మవిషయమైన యీ ధర్మమతి సూక్ష్మమైనదిన్నీ తెలియ నలవిగానిదని యగుటచే నన్ను నిర్బంధింప జేయక దీనిని విడిచి మరియొక వరమును కోరుమని యముడు బలికెను

*దేవైరత్రాపి విచికిత్సితం కిల త్వం చ మృత్యోయన్నసు విజ్ఞేయ మాత్థ ।*
*వక్తా చాస్యత్వాదృగన్యో న లభ్యో నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్ ॥*

ఓ యముడా! నీవు ఈ యాత్మధర్మము మిక్కిలి దుర్లభమైనదనియు, దీనివిషయమై దేవతలును, సందేహముగలవారని చెప్పితివి కనుక దీనిని జెప్పెడివాడు నీవు తప్ప మఱియొక డెవడును లేడు నేను కోరిన వరమునకు సమానమగు వరమును మఱియొకటి లేదు కాబట్టి దీనినే నాకు జెప్పమని యముని నడిగెను

*శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తిహిరణ్య మశ్వాన్ ।*
*భూమేర్మహదాయతనం వృణీష్వ స్వయం చ జీవ శరదోయావ దిచ్ఛసి ॥*

ఓ నచికేతుడా! దుర్లభమగు ఆత్మతత్త్వమును తప్ప యితరమైనటువంటి దీర్ఘాయువుగల పుత్రపౌత్రాదులను, గజ, తురగ, హిరణ్యాదులను, భూమండలాధిపత్యమును, వీటిననుభవించుటకు తగిన యాయుర్దాయమును వీటి యన్నిటిలో నీవు దేనిని కోరినను నిచ్చుచున్నానని యముడు పలికెను

*ఏ తత్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ విత్తం చిరజీవికాం చ ।*
*మహాభూమౌ నచికేత స్త్వమేధి కామానాం త్వా కామభాజం కరోమి॥*

ఓ నచికేతుడా! నీవు ధనమును జీవమును కోరినవాడవై యీ మహాభూమి యందు వృద్ధి నొందుము నిన్ను మనుష్య దైవకామములలో నభీష్టము పొందిన వానినిగా జేసెదనని యముడు బలికెను

*యే యే కామా దుర్లభా మర్త్యలోకే*
*సర్వాన్ కామాం శ్ఛందతః ప్రార్థయస్వ ।*
*ఇమారామాస్సరథా స్సతూర్యా*
*నహీదృశాలంభనీయా, మనుష్యైః ।*
*ఆభిర్మత్ప్రత్తాభిః పరిచార యస్వ*
*నచికేతో! మరణం మాను ప్రాక్షీః ॥*

ఓ నచికేతుడా! మర్త్యలోకమునందు పొందనలవిగాని కోరికల నన్నిటిని నీ యిష్ట ప్రకారము కోరుము మనుష్యులచే పొందనలవిగాని శ్రేష్ఠులగు నీ యప్సరసలను నీ కిచ్చుచున్నాను వీరిచే పరిచర్యను జేయించుకొనుము జననమరణ రహితమగు బ్రహ్మజ్ఞాన ప్రశ్న నడుగకుము

*శ్వోభావా మర్త్యస్య యదంతకైతత్ సర్వేంద్రియాణాం జరయన్తి తేజః।*
*అపిసర్వం జీవిత మల్పమేవ తవైవవాహాస్తవ నృత్యగీతే ॥*

ఓ యమముడా! నీవు చెప్పిన నశ్వరములగు సర్వభోగములును, సర్వేంద్రియముల తేజస్సును జీర్ణము చేయుచున్నవి బ్రహ్మయొక్క ఆయుస్సును మిక్కిలి స్వల్పమైనది అట్లుండగా స్వల్పాయుస్సు గల నాకీ భోగములతో నేమివని? సర్వభోగములు నీకే యుండుగాక యని నచికేతుడు బలికెను

*న విత్తేన తర్పణీయో మనుష్యో లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా ।*
*జీవిష్యామో యావదీశిష్యసి త్వం వరస్తు మే వరణీయస్స ఏవ ॥*

ఓ యముడా! మనుజుడు ధనమును బొందుచునే యున్నాడు ధనమును పొంది తృప్తి పొందినవాడు లేడు నీవెంత మట్టుకు యమలోకమునకు ప్రభువుగా నుంటున్నావో అంతవట్టుకు నిన్ను జూచితిమేని జీవించియుందుము నీ ప్రభుత్వము గడచిన పిదప యీ వరములు లేకపోవును కాబట్టి ఈ రెండింటి

విషయము నేను కోరవలసినదే లేదు పూర్వము నేను కోరినదే కోరదగిన వరముగా నున్నదని నచికేతుడు పలికెను

*అజీర్యతా మమృతానాముపేత్య జీర్య న్మర్త్యః క్వధస్థః ప్రజానన్ ।*
*అభిధ్యాయన్ వర్ణరతి ప్రమోదా నతిదీర్ఘే జీవితే కో రమేత ॥*

ఓ యముడా! మనుష్యుడు, జరామరణాదులు లేక మహా సౌభాగ్యమును పొందియున్న దేవతలను పొంది, పరమార్థ స్వరూపమును దెలిసికొనగోరినవాడై, యస్థిరమైన యాయుస్సునందు నీవు చెప్పిన యప్సరసాది భోగములనెవడు కోరునని నచికేతుడు పలికెను

*యస్మిన్నిదం విచికిత్సంతి మృత్యో యత్సాంపరాయే మహతి బ్రూహినస్తత్।*
*యోஉయం వరోగూఢ మనుప్రవిష్టో నాన్యం తస్మా న్నచికేతా వృణీతే॥*

ఓ యముడా! పరలోకమునందు దేవతలుసహా ఆత్మనుగుఱించి సంశయించు చున్నారని నీ చేతనే దెలియబడుటవలన నా యాత్మ విషయకమైన వరమతి రహ స్యమైనదిగా తలంపబడుచున్నది కనుక నాకితరమగు కోరిక యందిచ్చ లేదు నాకీ యాత్మ విషయమై చెప్పుమని నచికేతు డడిగెను

*అన్యచ్ఛ్రేయోஉన్య దుతైవ ప్రేయస్తే ఉభే నానార్థే పురుషం సినీతః ।*
*తయోశ్శ్రేయ ఆదదానస్య సాధుభవతి హీయతేஉర్థాద్య ఉ ప్రేయో వృణీతే॥*

యముడు శిష్యుడగు నచికేతుని పరీక్షించి జ్ఞానోపదేశార్హునిగా దెలిసికొని చెప్పు చున్నాడు ఓ నచికేతుడా! భిన్న ప్రయోజనములగు మోక్ష కర్మమార్గములు రెండును నధికారియగు పురుషుని పొందుచున్నవి ఈ రెండుమార్గములలో మోక్షమార్గము నవలంబించు పురుషుడు శుభంబును పొందుచున్నాడు కర్మకాండ నవలంబించు పురుషుడు క్షయించుచున్నాడు

*సత్వం ప్రియాన్ప్రియరూపాంశ్చకామానభిధ్యాయన్నచికేతో!உత్యస్రాక్షీః ।*
*నైతాం సృంకాం విత్తమయీమవాప్తో యస్యాం మజ్జన్తి బహవో మనుష్యాః ॥*

ఓ నచికేతుడా! నీవు పుత్రాది సర్వకామములను చక్కగా నాలోచించి, దోష బుద్ధిచే విడచి సర్వజనులు మునిగియుండు ధనరూపమగు నీ సంసారమును పొంద కపోతివి

*దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా ।*
*విద్యాభీప్సినం నచికేతసం మన్యే నత్వా కామా బహవోఽలోలుపంత ॥*

పండితులచే తెలిసికొనబడిన జ్ఞానాజ్ఞానములు మిక్కలి వేరైనవై భిన్నఫలముల నిచ్చుచున్నవి ఏ కారణమున నచికేతు డనేక విధములగు నప్సరసాదులను కోరలేదో ఆ కారణమున నచికేతుని జ్ఞానము గోరువానినిగా తలంచుచున్నానని యముడు బలికెను ఈ యమధర్మరాజ నచికేతుల సంవాదమగు ఉపనిషత్తును భారతీదేవికి దెలిపి మఱియు గురువరుడిట్లనెను

*వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య'తు విద్యతే ।*
*తస్మిన్నేవార్థవంతః స్యుః ఫలవన్తః శమాదయః ॥*

ఏ పురుషునకు వైరాగ్యమును, ముముక్షుత్వమును తీవ్రమైయుండునో వారికే బ్రహ్మవిద్యయం దధికారము గలదు అట్టివాని శమ, దమ, ధ్యానాది సాధనములన్నియు శీఘ్రముముగ ఫలము నొసంగును మీ రడిగిన యీ బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమును గురించి యిదివరలో నడిగినవా రరుదుగా నుంటున్నారు అట్టి భక్తియోగాది సాధనలచే వారు గొప్ప వారమైతిమని తలంచి యిక పొందవలసిన దేదియు లేదని నిశ్చయించి గొప్ప ఆశ్రమములను, మఠములను గట్టి యనేక శిష్యులతోను, ప్రశిష్యులతోను, శిష్య రాండ్రతో గూడి యుంటున్నారు వారును గొప్ప అన్నసత్రములను, దేవాలయములను నిర్మించి గొప్ప ధర్మకార్యములను, పుణ్యకార్యములను జేయుచున్నారు మీరును నిర్వికల్ప సమాధివఱకు గల సర్వసాధనలను జేసి యుండియు త్రిపుటి రహితావస్థను పొందలేక తపించి యున్నట్లిదివరలో గల సంభాషణచే గోచరించెను తీవ్రవైరా గ్యమును, భక్తియును, యోగమును గలవారికి మాత్రమే యీ బ్రహ్మతత్త్వము నుపదేశింపవలయును కావున అట్టి దివ్యామృతమును, శ్రీదక్షిణామూర్తి సనకాదు

లకుపదేశించినట్లును, శ్రీసనత్కుమారుడు శ్రీనారదమహాముని కుపదేశించి నట్లును, శ్రీకృష్ణుడు గంగాతీర మున నుద్ధవునకువదేశించినట్లును, శ్రీ దత్తాత్రేయు డలర్కున కుపదేశించినట్లును శాస్త్రమందు గలదు అట్టి బ్రహ్మవిద్యయే యిదియని గురుపరంప రను జెప్పుచు ఓ భారతీదేవీ! మీయందు వాత్సల్యభావము గలిగి బ్రహ్మతత్త్వమును దెలుపబోవుచున్నాను అయినను నీ బ్రహ్మవిద్య కెవడధికారియో వినుడు

*మేధావీ పురుషో విద్వానూహాపోహవిచక్షణః ।*
*అధికార్యాత్మవిద్యాయా ముక్తలక్షణలక్షితః ॥*

గీత13అ లోగల అమానిత్వాది లక్షణములు గలిగి మేధాశక్తి గలవాడును, శాస్త్రపరనమందు నిపుణుడును, ఊహాపోహలలో కుశలుడు నగు పురుషుడు బ్రహ్మవిద్య కర్హుడు

*వివేకినో విరక్తస్య శమాది గుణశాలినః ।*
*ముముక్షోరేవ హి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతా మతా ॥*

మఱియు ఆత్మానాత్మ వివేకజ్ఞానసంపన్నుడును, వైరాగ్యనిధియు, శమాదిషట్కసంపత్తి గలవాడును, తీవ్రతమ ముముక్షువును నగువాడే బ్రహ్మోపదేశమున కర్హుడు, మఱియు

***తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణామ్ ।***
***ముముక్షూణా మపేక్ష్యోఽయమాత్మబోధో విధీయతే ॥***

తపస్సులచేత దురితములు నశించుటవలన శుద్ధమైన యంతఃకరణము గలవారును, ఐహికాముష్మిక ఫలభోగేచ్ఛ లేనివారును, తీవ్రమోక్షాపేక్ష గలవారైన జనుల కాత్మ స్వరూపబోధము గలుగుటకొఱ కీయాత్మ బోధ యుపదేశింప బడుచున్నది

*స్వవర్ణాశ్రమ ధర్మేణ తపసా హరితోషణాత్ ।*
*సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్ ॥*

ఎవరెవరేయే యనుష్ఠానమందున్నారో దానిననుసరించి వర్తించెడు ధర్మము చేతను, తపస్సుచేతను, భగవత్ప్రీతిచేతను జీవులకు వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్తి గలుగును అట్టి నిర్మల వైరాగ్య మెటువంటిదనగా,

*బ్రహ్మాదిస్థావరాంతేషు వైరాగ్యం విషయేష్వను ।*
*యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్ ॥*

బ్రహ్మమొదలీ స్థావరాంతమువఱకుగల సకల విషయములందును ఆసక్తిలేనిదై కాకిరెట్టవలె తోచెడు వైరాగ్యమే శుద్ధవైరాగ్యమనబడును అట్టివైరాగ్యము గలిగిన మాత్రమే భయరహితమగు ఆత్మశాంతి యీ జీవునికి గలుగును మఱియు

*భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం*
*మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయమ్ ।*
*శాస్త్రే వాది భయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం*
*సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యామేవాభయమ్ ॥*

భోగమునందు రోగభయము, శ్రేష్ఠకులమునందు భ్రష్టమగుననెడి భయము, ధనమునందు రాజావలన భయము (చోరభయము,) మానమునందు దీనత్వమువలన భయము, బలమునందు శత్రువులవలన భయము, సుందరరూపమందు ముసలితనము వలన భయము, శాస్త్రమునందు వాదులవలన భయము, శ్రేష్ఠగుణమునందు దుర్మార్గుల వలన భయము, సుందరశరీరమునందు మరణమువలన భయము, ఈ భూమియందు మనుజులకు సమస్త వస్తు సముదాయము గూడ భయముతో గూడినదే యగుచున్నది వైరాగ్య మొక్కటి మాత్రమే భయము లేనిది మఱియు కఠోపనిషత్తు నందు నచికేతునికి బ్రహ్మోపదేశమును జేయునపుడు యమధర్మరాజుపదేశించినది చూడుడు

*నావిరతోదుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః ।*
*నాశాన్తమానసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ ॥*

చెడు నడవడి గలిగి యింద్రియచలన ముడుగక యేకాగ్రచిత్తములేక అన్నిటి యందు వ్యాపించెడు మనస్సుగల మనుజుడీయాత్మను పొందడు చెడు నడతను

వదలి యింద్రియ చాపల్యము లేక యేకాగ్రచిత్తము గలిగి అన్నిటియందు వ్యాపించని మనస్సుగల మనుజుడీ యాత్మను జ్ఞానముచేత పొందుచున్నాడు

*నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన ।*
*యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥*

ఈ యాత్మ వేదాధ్యయనాది సాధనలచేత పొంద శక్యమైనది కాదు మేధా విశేషమగు ధారణాశక్తిచేతను సాధ్యము గాదు విశేషముగ శాస్త్ర శ్రవణముచేతను సాధ్యము కాదు ఏ ఆత్మసాధకు డితర సాధనలను విడిచి యాత్మయొక్క సాధననే ప్రార్థించుచున్నాడో వానికి నీ యాత్మస్వరూపము ప్రత్యక్షమగుచున్నది

*శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః ।*
*ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥*

అనేకులచే నేయాత్మ శ్రవణము జేయుటకొఱకును నలవిగానిదో, వినినవారైనను ననేకులు దెలియజాలరైరో, అట్టి యా యాత్మజ్ఞానమును చెప్పెడివాడరుదు నిపుణుడై యా యాత్మను పొందువాడును అరుదు నిపుణుడగు నాచార్యునిచేత శిక్షితుడై తెలిసి కొనువాడును అరుదు అని చెప్పబడెను (కఠోపనిషత్తు చదువ ప్రారంభించుటకు ముందుగా బ్రహ్మతత్త్వోపదేశమును దక్షిణామూర్తి సనకాదుల కుపదేశించిన విషయముతో మనస్సు ననుసంధానమును జేయవలయును )

## జ్ఞానము

ఓ భారతీదేవీ! అనేక ఋషుల తపస్సుచే పావనమైన యీ పుణ్యస్థలమున మీకు బ్రహ్మోపదేశమును జేయబోవుచున్నాను మీరును మీ గోత్రీక విశ్వామిత్ర మహర్షిని, మీ తల్లిదండ్రులను, మీ కులదైవమగు శ్రీరామచంద్రుని హృదయములో బాగుగా ధ్యానించి యిదివరలో మీకు మంత్రోపదేశమును, యోగసాధనయును, సాంఖ్యసూత్రమును, అత్యంతవైరాగ్యమును, అనన్యభక్తియు నుపదేశించిన గురువును గూడ ధ్యానింపవలయును ఇపుడు నావల్ల పరమమగు

పరబ్రహ్మోపదేశమును పొందినను పూర్వముండిన గురునిపైగల భక్తి విశ్వాసములను పోనీయ గూడదు ఇదివఱలో వారిపై గల భక్తి తగ్గింపరాదు వారి విషయమై యేమేమి యేయే కాలములో జేయుచుంటిరో, ఇచ్చుచుంటిరో, అప్పటికన్న నికమీదట నెక్కువగానే చేయవలయును అపుడే మీరు కృతజ్ఞతగల వారగుదురు కృతజ్ఞతకు సరియగు పుణ్యము మఱియొకటి లేదు కృతఘ్నతకు సరియగు పాపమును మఱియొకటి లేదనియు గూడ మునులు వచించిరి దర్భాసనమున నుత్తరాభిముఖివై సిద్ధాసనమున కూర్చుండి బ్రహ్మవిద్యా పరంపరలో నుండు బ్రహ్మాది ఋషులను నీక్రింది విధమున మనస్సులో బాగుగా ధ్యానమును జేయవలయును

*ఓం నారాయణం పద్మభువం వశిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ ।*
*వ్యాసం శుకం గౌడపదం మహాంతం గోవిందయోగీంద్ర మథాస్య శిష్యమ్ ॥*

*శ్రీశంకరాచార్యమథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యమ్।*
*తం తోటకం వార్తికకార మన్యానస్మద్గురూన్ సంతత మానతోఽస్మి ॥*

మఱియు, ''ఓం పరమ గురుభ్యో నమః, ఓం సర్వమహర్షిభ్యో నమః'' అని సమస్త ఋషులకును, మహాత్ములందఱకును నిర్విఘ్నముగ బ్రహ్మ సాక్షాత్కారము గలుగుట కొఱకు ధ్యానపూర్వకముగ నమస్కార మొనర్పవలయును ఆలాగున దేవతలకును, అసురులకును, రాక్షసులకును, ప్రేతములకును, భూతములకును, వనదేవతలకును, మృగములకును, వెయ్యేల మూడులోకములలో గల బ్రహ్మాది స్తంబపర్యంతముగల చరాచర ప్రాణికోట్లన్నిటికిని భక్తి పూర్వకముగ నమస్కరింప వలయును అటులైనచో వారెవరును విఘ్నముల గలుగనీయక బ్రహ్మసాక్షాత్కారము గలుగుటలో సహాయపడుదురు దీనిలోగల మహిమ యటువంటిది అంతేగాక వాక్కుతో చెప్పులాగున సర్వప్రాణులకు మేలు చేయవలయునేగాని కీడేకాలము నందును జేయరాదు ఇదియే ''ప్రేష'' మంత్రార్థము యొక్క ముఖ్యమగు సారము

దీనిని బ్రహ్మోపదేశ సమయమునను, సన్న్యాసదీక్షనొసంగు సమయమునను నాచార్యులు శిష్యుల కుపదేశింతురు ''అభయం సర్వభూతేభ్యః''

అని యుపదేశించిన తర్వాతనే బ్రహ్మోపదేశము నిచ్చెదరు అనాదికాలమునుండి వచ్చుచున్న జన్మము లన్నియు నీ జన్మతో పూర్తియగును అనంతకాలమునుండి వచ్చుచుండెడు కర్మలన్నియు నీ దినముతో విలయమొందును అంతే గాదు సృష్ట్యారంభమునుండి మనుష్యుని నీడవలె వెంబడించి వచ్చుచుండిన యవిద్య, సరియగు మధ్యాహ్న సమయమున తన నీడ లేక పోవునట్లు ఈ క్షణములోనే యాత్మయందు లయమగును ఇక జననమరణ రూపమగు భవసాగరములో పడనవసరము లేదు అంతే కాదు నిరతిశయ బ్రహ్మసుఖము గూడ నీ దినమున నీ క్షణముతోనే గలుగును చిరకాలము నుండి పర్వత బిలములో నిమిడియుండు అంధకార సమూహమంతయు దీపము వెలిగించిన వెంటనే మాయమైపోవున ట్లనంత కల్పమునుండి హృదయగుహయందు నిగూఢమైయుండు నజ్ఞాన మీ జ్ఞానబోధముచే నీ క్షణములోనే తొలగిపోవును అని గురువరుడు బ్రహ్మాకార భావము గలిగి గంభీర హృదయముతో వచించుచు, ధ్రువుని శిరమున కరమునుంచి యుపదేశించెడు శ్రీమన్నారాయణునివలె నుండెను దేశికేంద్రుడు కరుణతో జెప్పుచున్న ఈ మాటలు వినినపుడు తన్మయము నొందిన భారతీదేవియొక్క రెండు నేత్రములనుండి ధారధారలుగా గారుచుండు ఆనందబాష్పముల వలన దేహమంతయు గొప్ప వానలో తడిసినట్లు తడిసి పోయెను

అపుడు గురువరుడు ''ఓ భారతీదేవిగారూ! ఇపుడు తన్మయములోనుండి మతిమరుపు గలుగకుండునట్లు చూడవలయును వేదముయొక్క మూలమై, సర్వవిఘ్నములను తొలగించునదైన యతిపవిత్రమగు ఓంకారమును ఆత్మభావముతోను, దైవభావముతోను, దీర్ఘముగ నుచ్చరింపవలయును 'దీర్ఘో మోక్షప్రదాయకః' ప్రణవమును, ప్రాణమును మనస్సును, ఆత్మను దృశ్యమును దైవభావములో నేకముగ జేసి, ధ్యానమును జేయవలయును తనయం దవి యన్నియు నైక్యపఱచి దైవస్వరూపముగ నవియన్నియు వాటియం దన్నిటిలోను తానును నేకమై యున్నట్లు దృఢనిశ్చయము గలుగజేసికొన వలయును అనగా ధ్యేయాకారభావములో నిలువవలయును ఇచ్చట భావమున్ను, ధ్యానమున్ను లేని స్థితి ఇది యని గ్రహింపవలయును ధ్యానమనియు, భావమనియు గ్రాహ్యార్థముగ నట్లు చెప్పడమైనది నిజముగ నదియే భావాతీతము అదియే ధ్యానాతీతము అది

''ఓం తత్ సత్'' ''ఓం ఏకం సత్'' అది యమృతము ఆనందఘనము జ్ఞానమునకు పైభాగమగు జ్ఞేయము ధ్యానమునకు పైన నుండెడును ధ్యేయము, జీవునకు పై నుండెడు ఈశ్వరునకన్నను పైననుండెడు పరమాత్మస్వరూపము అదియే పరబ్రహ్మము దీనికన్న నచ్చట వాక్యము లేదు కనుకనే వేదముయొక్క అంత్య మని చెప్పుటకు కారణమైనది కావుననే దానికి వేదాంతమని పేరు గలిగినది వేదము శబ్దమయము అచ్చటికి శబ్దము వెళ్లనందుచే వేదము గూడ నా బ్రహ్మైక స్వరూపమును జెప్పజాలక ''నేతి నేతీతి నేతీతి'' ఇదికాదు, ఇదికాదు, ఇది కాదని మాత్రము వచించి నిలిచి పోయెను కనుకనే ''శబ్దాతీతం పరంబ్రహ్మ నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే'' వేదమ యమగు శబ్దమునకతీతమనియు, అచట శబ్దము ప్రవర్తింప జాలనందుచే నిశ్శబ్దమనియు జెప్పడమైనది దీనినే యతీత మార్గమనియును జెప్పెదరు

*యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ।*
*ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన ॥*

వాక్కులు వాఙ్మనో విశిష్టమైన మనోమయమునుండి బ్రహ్మానందమును పొంద లేక మనస్సుతో గూడ మరలుచున్నవి అట్టి మనోమయ బ్రహ్మకు ఉపాసనా ఫల భూతమగు అధిదైవికానందమును దెలిసికొనిన విద్వాంసుడు గర్భవాసాది దుఃఖ ములనుండి యెపుడును భయపడడు

*అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్ ।*
*ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న స బ్రాహ్మణః ॥*

ఈ యోంకారమెనిమి దంగములతోను, నాలుగు పాదములతోను, మూడు స్థాన ములతోను, అయిదు దైవతములతోను గూడినది ఇట్టి ఓంకారమును ( అనగా నోంకారస్వరూపమగు బ్రహ్మను) ఎవడెఱుంగుచున్నాడో వాడే బ్రాహ్మణు డనంబడును ఎవడెఱుంగజాలడో వాడు బ్రాహ్మణుడు కాడు బ్రహ్మావలంబకు లగుటచేతనే బ్రాహ్మణు లని పేరు వచ్చినది

*ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।*

*ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥*

ఈ ఓంకారమును బ్రహ్మస్వరూపముగాను, శ్రేష్ఠమైనదానిని గాను చక్కగా దెలిసికొని యెవడు దేనిని గోరి యుపాసించునో, వాని కది సిద్ధించును అనగా నే బ్రహ్మప్రాప్తి పొంద నిశ్చయించి దీనిని ధ్యానించునో వాడు దానిని పొంద గలుగును

*ఏత దాలంబనం శ్రేష్ఠ మేత దాలంబనం పరమ్ ।*
*ఏత దాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥*

ఈ యోంకారమగు బ్రహ్మప్రాప్తి సాధనముత్కృష్టమైనది ఈ యోంకారమగు నాలంబనము పరాపర బ్రహ్మరూపమైనది ఈ యోంకార రూపమైన బ్రహ్మరూపప్రాప్తి సాధనమును తెలిసికొని బ్రహ్మలోకమునందు పూజ్యుడగుచున్నాడు

*అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్ ।*
*మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి ॥*

ధీరుడనిత్యములైన దేహములం దున్నటువంటి శరీరము లేని గొప్పదగు వ్యాపించి యున్న ఆత్మను దెలిసికొని మఱల దుఃఖింపడు దీనికే యశరీరమని నామము గలదు ఇటువంటివారు శరీరముతో గూడియున్నను అశరీరులనియే పిలువబడుదురు కనుకనే జనకుడు దేహముతో గూడుకొనియుండియు విదేహుడని పిలువబడెను

*న తత్రసూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాన్తికుతోఽయమగ్నిః ।*
*తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ॥*

ఆ పరబ్రహ్మమందు సర్వమును ప్రకాశింపజేయునట్టి సూర్యుడు ప్రకాశించుట లేదు (సూర్యుడు ప్రకాశింపజాలడు) అచ్చట చంద్రనక్షత్రములు ప్రకాశించుట లేదు ఈ మెరుపులు ప్రకాశింపవు ఇక నీ యగ్ని యెట్లు ప్రకాశించును? సూర్యాది సమస్త ప్రకాశములును నా పరబ్రహ్మ స్వరూపము

''ఓం తత్ సత్'' ''ఓం ఏకం సత్'' అది యమృతము ఆనందఘనము జ్ఞానమునకు పైభాగమగు జ్ఞేయము ధ్యానమునకు పైన నుండెడును ధ్యేయము, జీవునకు పై నుండెడు ఈశ్వరునకన్నను పైననుండెడు పరమాత్మస్వరూపము అదియే పరబ్రహ్మము దీనికన్న నచ్చట వాక్యము లేదు కనుకనే వేదముయొక్క అంత్య మని చెప్పుటకు కారణమైనది కావుననే దానికి వేదాంతమని పేరు గలిగినది వేదము శబ్దమయము అచ్చటికి శబ్దము వెళ్లనందుచే వేదము గూడ నా బ్రహ్మైక స్వరూపమును జెప్పజాలక ''నేతి నేతీతి నేతీతి'' ఇదికాదు, ఇదికాదు, ఇది కాదని మాత్రము వచించి నిలిచి పోయెను కనుకనే ''శబ్దాతీతం పరంబ్రహ్మ నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే'' వేదమ యమగు శబ్దమునకతీతమనియు, అచట శబ్దము ప్రవర్తింప జాలనందుచే నిశ్శబ్దమనియు జెప్పడమైనది దీనినే యతీత మార్గమనియును జెప్పెదరు

*యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ।*
*ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన ॥*

వాక్కులు వాఙ్మనోవిశిష్టమైన మనోమయమునుండి బ్రహ్మానందమును పొంద లేక మనస్సుతో గూడ మరలుచున్నవి అట్టి మనోమయ బ్రహ్మకు ఉపాసనా ఫల భూతమగు అధిదైవికానందమును దెలిసికొనిన విద్వాంసుడు గర్భవాసాది దుఃఖ ములనుండి యెపుడును భయపడడు

*అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్ ।*
*ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న స బ్రాహ్మణః ॥*

ఈ యోంకారమెనిమి దంగములతోను, నాలుగు పాదములతోను, మూడు స్థాన ములతోను, అయిదు దైవతములతోను గూడినది ఇట్టి ఓంకారమును ( అనగా నోంకారస్వరూపమగు బ్రహ్మను) ఎవడెఱుంగుచున్నాడో వాడే బ్రాహ్మణు డనంబడును ఎవడెఱుంగజాలడో వాడు బ్రాహ్మణుడు కాడు బ్రహ్మావలంబకు లగుటచేతనే బ్రాహ్మణు లని పేరు వచ్చినది

*ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।*

*ఈక్షణధ్యాన సంస్పర్శై ర్మత్స్యకూర్మ విహంగమాః ।*
*పోషయన్తి స్వకాన్ పుత్రాన్ తద్వత్పండితవృత్తయః ॥*

లోకములో మత్స్యములు, కూర్మములు, పక్షులు తమ తమ బిడ్డలను దర్శనము చేతను, ధ్యానముచేతను, స్పర్శచేతను నే ప్రకారముగా తన స్వరూపముగ జేయుచున్నవో, ఆ ప్రకారముగనే బ్రహ్మతత్త్వజ్ఞానముగల యోగులు గూడ అంతరంగిక శిష్యులనను గ్రహించుచుందురు అనగా మత్స్యములు గ్రుడ్లనుపెట్టి కన్నులతోజూడగా నాచూపు తగిలిన గ్రుడ్లన్నియు పిల్లలగును కూర్మములు ఎచ్చటనో భూమిపై గ్రుడ్లుపెట్టి నీటిలోనుండి మనస్సులో ధ్యానించుటవలన నవియన్నియు పిల్లలై తన దగ్గరకు వచ్చి చేరును పక్షులు రెక్కలలోపల గ్రుడ్లనుంచి స్పృశించుట వలన (పొదుగుట) గ్రుడ్లు పిల్లలగును బ్రహ్మ నిష్ఠులును నీ మూడు విధములలో నొకగానిచేగాని, రెండింటిచేతగాని, లేక మూడింటిచేతగాని యంతరంగ భక్తిగల ముముక్షులయొక్క యావరణములను నశింపజేసి వారిని తమ యాత్మస్వరూపముగ జేయుదురు నాల్గవది భ్రమరకీటకన్యాయ మొకటి గలదు అది ఆత్మమంత్రోపదేశ పద్ధతిగా నుండును భ్రమరము కీటకమును గొని తెచ్చి గూటిలోనుంచి హ్రీంకారనాదమును చేసిన యెడల కొంతకాలమున కా పురుగు తుమ్మెద యగును ఇది మందాధికారి కేర్పడినది గురుడు బ్రహ్మోపదేశమును జేసి కొంత సమ యమేకాంతముగ మౌనముగానుండి బ్రహ్మచింతన చేయులాగున చేయును బ్రహ్మనిష్ఠ లుత్తమాధికారులగు ముముక్షువులను హస్తమస్తక సంయోగముచేతను, మధ్యమాధికారులను ఆత్మదృష్టితో జూచుటచేతను, మందాధికారులను వీరు కృతార్థులు గావలయునని తలంచుటచేతను, అత్యంతమందాధికారుల కుపదేశమును జేసి కొంతకాలమేకాంత స్థలమున ధ్యాననిష్ఠాదులను జేయించియు, తనవలెనే వారిని గూడ తయారు చేయుదురు గురువుచే కలిగిన ప్రయోజన మిది వీటికి మీనవృత్తి, కూర్మవృత్తి, విహంగవృత్తి, భ్రమరవృత్తులని పేర్లు

*యథా నద్య స్స్యందమానాస్సముద్రే అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ ।*
*తథా విద్వా న్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥*

లోకమునందు నామరూపములు గలిగి ప్రవహించుచున్న గంగాది మహానదులు సముద్రమును పొందినవై తమ తమ నామరూపములను వదలి సముద్రమునందు పృథక్కుగా కనబడక సముద్రరూపమునే యెట్లు పొందుచున్నవో, అట్లే జ్ఞానము గలవాడవిద్యాకృతములగు నామరూపములను వదలినవాడై పరాత్పరుడును, ప్రకాశస్వరూపుడునగు పరబ్రహ్మను పొందుచున్నాడు

*భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।*
*క్షీయన్తే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే ॥*

పరావరమగు పరబ్రహ్మ సాక్షాత్కారము గలుగునపుడు హృదయగ్రంధు లన్నియు నశించిపోవును సంశయములన్నియు క్షీణించును వీనియొక్క కర్మలన్నియు భస్మములై పోవును

*యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।*
*అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥*

ఈ బ్రహ్మజ్ఞానియొక్క హృదయము నాశ్రయించియున్న సమస్తములగు కోరిక లెపుడు విడిచిపోవుచున్నవో అనంతరము మనుజుండు మరణము లేనివాడగు చున్నాడు ఇచ్చటనే యీ లోకముననే, యీ దేహమందున్నపుడే బ్రహ్మమును బొందుచున్నాడు

*యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః ।*
*అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్ ॥*

ఎపుడు బుద్ధియొక్క సమస్తమైన యజ్ఞానబంధములు జీవించియుండగానే భేదింపబడుచున్నవో, అటు తరువాత మనుజుడమృతమును పొందుచున్నాడు (జనన మరణములు లేనివాడగుచున్నాడు ) ఇది యనుశాసనము దైవాజ్ఞ యగుచున్నది

అత్తరి ప్రతిష్ఠింపబడిన విగ్రహమునకైనను చలనము గలుగునేమో కాని భారతీదేవి యెంత మాత్రమైన చలనముగాని, బహిర్దృష్టిగాని, యంతర్దృష్టిగాని లేక యంతరాంతర్దృష్టిలోనే నిలిచిపోయియుండెను ధ్యానారూఢమగు నచలస్థితిని

జూచి యిదివఱలో భారతీదేవిగా రభ్యసించిన సమాధిబలముచేతనే యిట్టి యనుభవము గలిగినదని గురు వరుడు తనలో తాను తలంచి ఒక యామమువఱకు ధ్యానముయొక్క కాష్ఠలోనే నిలిచి యుండు భారతీదేవిగారిని జూచుచుండెను ఇక యెంతకాలమైనను నీలాగున సమాధిలో నుండగలదని నిశ్చయించుకొని యాచార్యవరుడు సమాధినుండి యుత్థాన దశ గలుగు లాగున మనంబున సంకల్పించి మూర్ధస్థానమున నంగుష్ఠమును బాగుగా నొక్కి తడిమినను నుత్థానదశకు రాకుండెను కాన ఈలాగుననే యీ తల్లి యుండి పోయినచో వీరివలన లోకము పరమార్థతత్త్వమును గ్రహింపజాలదనియు, నీ పరమ యోగిని వలన నారీమణులు తరింపవలయుననియు గురువరుడు నిశ్చయించి, ఆవు వెన్నలో తెల్లమిరియాలు వేసి మెత్తగనూరి బ్రహ్మరంధ్రమగు మూర్ధస్థానములో బాగుగ మర్దనమును జేయించగా ప్రాణము పోయినవానికి మఱల ప్రాణము గలిగినట్లు మొదట హృదయస్పందనము గలుగుటయు, తరువాత కొంచెము ప్రాణవాయువు చలించుటయు, పిమ్మట జ్ఞానేంద్రియములు వికసించుటయు, తదనంతరము కర్మేంద్రియములు మేల్కొనుటయు, అటు తర్వాత దేహమందతటను ప్రాణము ప్రవేశించి సర్వేంద్రియములును ప్రాణవంతములై నేత్రముల దెరచి చూచుటయు, పిమ్మట మెల్లగా మాట్లాడ శక్తి గలుగుటయు గలిగెను

దాని జూచి గురువరు డీదిన మిక నేమియును జేయవలదని చెప్పిన తోడనే భారతీ దేవిగారి నిష్ఠలో గల పరమకాష్ఠ స్థితిని అంత వరకు సూర్యుడు గూడ చూచుచుండెనా యని తోచులాగున నపుడే రవి యస్తమించెను

మరురోజున గురువరుడు ''తల్లీ భారతీదేవిగారూ! ఇపుడు మీరు పొంద వలసిన దంతయు పొందినవారైతిరి ఇకనిట్టి సమాధినిష్ఠ యవసరము లేదు మహావాక్యము నర్థముతో సహశ్రవణము చేయవలయు''నని చెప్పి నాలుగు మహావాక్యములనుపదేశించెను

1 ఓం ప్రజ్ఞానం బ్రహ్మ, 2 ఓం అహం బ్రహ్మాస్మి, 3 ఓం తత్త్వమసి, 4 ఓం అయమాత్మా బ్రహ్మ

''ప్రజ్ఞానం బ్రహ్మ'' అనెడి మహావాక్యమందుండెడి ప్రజ్ఞాన శబ్దమున కర్థము

1 ప్రజ్ఞానం బ్రహ్మ ( ఋగ్వేదము, ఐతరేయోపనిత్తు , లక్షణవాక్యము )

*యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ ।*
*స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥*

యేన = చక్షుర్ద్వారా వ్యాపించిన అంతఃకరణవృత్తితో గూడినట్టియే చైతన్యముచేత, ఇదం = చూచుటకు యోగ్యమైన యీ రూపాదికమును, ఈక్షతే= (పురుషుడు) చూచుచున్నాడో, శృణోతి = (శబ్దములను) వినుచున్నాడో, జిఘ్రతి= (గంధములను) ఆఘ్రాణించు చున్నాడో, వ్యాకరోతి = (శబ్ద సమూహమును) వ్యవహరించుచున్నాడో, స్వాద్వస్వాదూ, స్వాదు = తీపిని - అస్వాదు = చేదును, (అనగా రసములననుట) విజానాతి = ఎఱుగు చున్నాడో, తత్= ఆ చైతన్యము, ప్రజ్ఞానం = ప్రజ్ఞానమని, ఉదీరితం = చెప్పబడినది అనగా ప్రజ్ఞాన శబ్దముచేత చెప్పబడుచున్నదనుట

*చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు ।*
*చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి ॥*

చతుర్ముఖేంద్ర దేవేషు, చతుర్ముఖ = బ్రహ్మదేవునియందును, ఇంద్రదేవేషు= ఇంద్రాది దేవతలయందును, మనుష్యాశ్వగవాదిషు, మనుష్య = మనుష్యుల యందును, అశ్వ = గుఱ్ఱములయందును, గవాదిషు = గోవు మొదలగు వానియందునుగల, ఏకం = ఒక్కటియగు, చైతన్యం = చైతన్యము, బ్రహ్మ = బ్రహ్మమగును అతః = ఈ కారణమువల్ల, మయ్యపి = నా దేహమందునుగల, ప్రజ్ఞానం = ప్రజ్ఞానము, బ్రహ్మ = బ్రహ్మమగును

2 అహం బ్రహ్మాస్మి, ( యజుర్వేదము, బృహదారణ్యకోపనిషత్తు, అనుభవ వాక్యము )

*పరిపూర్ణః పరాత్మాఽస్మిన్ దేహే విద్యాధికారిణి ।*
*బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే ॥*

పరిపూర్ణః = పరిచ్ఛిన్నత్వము లేని పరమాత్మ, అస్మిన్ = ఈ మాయాకల్పిత జగత్తునందు, విద్యాధికారిణి, విద్యా = జ్ఞానసంపాదనమునకు, అధికారిణి = యోగ్యమగు, దేహే = మనుష్యాది శరీరమందు, బుద్ధేః = సూక్ష్మ శరీరమునకు, సాక్షితయా = సాక్షిభావము చేత, (అనగా నిర్వికారముగానను‌ట) స్థిత్వా = ఉండి, స్ఫురన్ = ప్రకాశించుచున్నవాడగుచు, అహమితి = నేనని, ఈర్యతే = చెప్పబడుచున్నాడు అనగా లక్షణావృత్తివల్ల అహమనెడి పదముచే జెప్పబడుచు న్నాడనుట

*స్వతఃపూర్ణః పరాత్మా త్ర బ్రహ్మశబ్దేన వర్ణితః ।*
*అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మ భవామ్యహమ్ ॥*

స్వతః = స్వాభావికముగా, పూర్ణః = అపరిచ్ఛిన్నుడగు, పరాత్మా = పూర్వోక్త పర మాత్మ, అత్ర = మహావాక్యమందు, బ్రహ్మశబ్దేన, బ్రహ్మ = బ్రహ్మమనెడి, శబ్దేన = పదముచేత, వర్ణితః = లక్షణావృత్తిచేత చెప్పబడుచున్నాడు, అస్మీతి = ఐతిననెడిపదము ఐక్యపరామర్శః, ఐక్య = ఏకత్వమును, పరామర్శః = తెలుపుచున్నదగును, తేన = అందుచేత, అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మముగ, భవామి = అగుచున్నాను

3 తత్త్వమసి (సామవేదము, ఛాందోగ్యోపనిషత్తు, ఉపదేశవాక్యము )

*ఏకమేవాద్వితీయం సన్నామ రూపవివర్జితమ్ ।*
*సృష్టేః పురాఽధునాఽప్యస్య తాదృక్త్వం తదితీర్యతే ॥*

సృష్టేః = సృష్టికి, పురా = పూర్వము, నామరూపవివర్జితం, నామరూప = నామరూపములచేత, వివర్జితం = విడువబడినట్టియు, (అనగా నామరూపములు లేని దనుట), అద్వితీయం = రెండవది లేనట్టియు, ఏకమేవ = ఒక్కటియగు, సత్ = సద్వస్తువు, (ప్రతిపాదింపబడియుండెనో,) అస్య = ఈ సద్వస్తువునకు, అధునాఽపి = ఇప్పుడును, (సృష్ట్యుత్తర కాలమందనుట) తాదృక్త్వం = విచారదృష్టిచే నట్టి స్వభావము, తదితి = అది యనెడి పదముచేత, ఈర్యతే = లక్షణావృత్తివల్ల జెప్పబడుచున్నది

*శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితమ్ ।*
*ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్యమనుభూయతామ్ ॥*

శ్రోతుః = ముముక్షువుయొక్క, దేహేంద్రియాతీతం, దేహేంద్రియ = స్థూలాది శరీరత్రయముకంటె, అతీతం = విలక్షణమగు, వస్తు = సద్వస్తువు, అత్ర= ఈ మహావాక్య మందు, త్వంపదేరితం, త్వం = నీవనెడి, పద = శబ్దముచేత, ఈరితం = చెప్పబడుచున్నది, అసీతి = ఐతివనెడి శబ్దముచేత, ఏకతా = ఐక్యము, గ్రాహ్యతే = గ్రహింపబడుచున్నది తదైక్యం, తత్ = ఆ తత్త్వం పదార్థములయొక్క, ఐక్యం = ఏకత్వము, అనుభూయతాం = (ముముక్షువులచే) అనుభవింపబడుగాక।

4 అయమాత్మా బ్రహ్మ (అథర్వణవేదము - మాండూక్యోపనిషత్తు - సాక్షాత్కార వాక్యము)

*స్వప్రకాశాపరోక్షత్వ మయ మిత్యుక్తితో మతమ్ ।*
*అహంకారాది దేహాంతాత్ప్రత్యగాత్మేతి గీయతే ॥*

అయమితి = ఈయని, ఉక్తితః = చెప్పుటవల్ల, స్వప్రకాశాపరోక్షత్వం - స్వప్రకాశ = స్వయముగా బ్రకాశించుటచేత, అపరోక్షత్వము = ప్రత్యక్షత్వము, మతం = సమ్మతమగును, అహంకారాది దేహాంతాత్ - అహంకార = అహంకారమే, ఆది = ఆదిగా గలిగినట్టియు, దేహ = స్థూలదేహమే, అంతాత్ = అంతముగాగల ప్రపంచముకంటె, ప్రత్యగాత్మేతి - ప్రత్యక్ = అధిష్ఠానత్వ సాక్షిత్వములచేత లోగా నుండెడి, ఆత్మేతి = ఆత్మయని, గీయతే = చెప్పబడుచున్నది

*దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే ।*
*బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్ ॥*

దృశ్యమానస్య = కనబడుచుండెడి, సర్వస్య = సకలమగు, జగతః = జగంబునకు, తత్త్వం = అధిష్ఠానరూపము, బ్రహ్మశబ్దేన = బ్రహ్మశబ్దముచేత, ఈర్యతే= చెప్పబడుచున్నది, తద్బ్రహ్మ = ఆ బ్రహ్మము, స్వప్రకాశాత్మరూపకం- స్వప్రకాశ = స్వయంప్రకాశమానుడగు, ఆత్మ = ప్రత్యగాత్మయే, రూపకం = స్వరూపము గలదిగా అగును, అనగా ఆ ప్రత్యగాత్మయే బ్రహ్మమనుట

ఈ మహావాక్యముల నిపుడు సంక్షిప్తముగ సూత్రవాక్యరీతిగ జెప్పడమైనది దీనిని మఱల సావధానముగ పంచదశి అయిదవ ప్రకరణమందు జూచుకొని రూఢి పఱచుకొనవలయును''

భారతీదేవి యీలాగున మహావాక్య విచారణ మనన నిదిధ్యాసనముల జేయు చుండగా నొకరోజున తరిగొండ వెంకమాంబగారి తపోవనములో నుండెడు తపస్వినులగు నారీమణులలో ముఖ్యురాండ్రగు చెల్లాయమ్మగారు మొదలగు వారందఱును భారతీదేవియు గురుదర్శనార్థ మేతెంచిరి ఆ దినము పుణ్యమగు మాఘ శుక్ల ఏకాదశియైయుండెను వీరపుడపుడు గోగర్భమునకు వచ్చి శ్రవణమును చేయుచుండెడివారు అపుడు గురుదేవుడు చెల్లాయమ్మగారితో భారతీదేవిగారి ధ్యానానుష్ఠానముల గుఱించియు, స్వభావమును గుఱించియు నడుగగా ''గురువరా! ఈ భారతీ దేవిగారు, తరిగొండ వెంకమాంబగారు మఱల జన్మమెత్తి వచ్చినారని జనులందఱును జెప్పుచున్నారు మేము గూడ నట్లే తలంచుచున్నాము మాకు తమ దగ్గఱకు వచ్చి యన్ని సంగతుల నడిగి తెలిసికొనుటకు భయముగానున్నది అంతేగాదు తమ కృపవలన జ్ఞానముయొక్క స్వరూపము తెలిసి యుండినను, శాస్త్ర పరిచయ మెక్కువ లేనందుచే తాము చెప్పునదంతయు గ్రహింపజాలకున్నాము ఈ తల్లి వచ్చినప్పటినుండి ప్రతిరోజును నిచ్చట జరుగుచుండెడు విషయముల నన్నిటిని మాకు తెలుపుచుండును గొప్ప సాధుభావము గలవారును, మిత భాషిణియు, సదా నిష్ఠలోనే కాలము గడుపు వారుగా నున్నారు ఏకభుక్తము తప్ప మరేమియు భుజించువారు కారు వట్టి దర్భాస నములో నుండెదరు దాహమైనచో మంచినీరు మాత్రము త్రాగుదురు మాకు సర్వేశ్వరుడే వీరిని పంపినట్లు తలంచుచున్నాము'' అని చెప్పెను

గురుడు – చెల్లాయమ్మగారూ! దర్భాసనము మంచిదైనను వేడి గుణముండుటచే వేసవికాలమున బాగుండదు భారతీదేవిగారికి భోజన మెట్లు జరుగుచున్నది?

చె – గురువరా! వీరు వచ్చినది మొదలు ఊరిలోనుండు అనేక మానినీమణులు వచ్చుటయు, భజనలు జేయుటయు, శ్రవణమొనర్చుటయు

జరుగుచున్నది మా భోజనమునుండియే వీరికి గూడ భోజనము పెట్టతలంచినను, వీరికొఱకు భక్తురాండ్రు తెచ్చెడు సామానులు వీరిరువురకేగాక ప్రతిదినము నలుగురు సాధువులకు పెట్టేలాగున మిగులుచున్నది అంతేగాక అపుడపుడు సమారాధనలకూడ జేయుచున్నారు అనేక వధూమణులు వీరివల్ల శ్రీ భగవద్గీతను జెప్పించుకొనుచున్నారు

గురు – తల్లులారా! వారివారి జన్మాంతరపుణ్యము గాని, పాపము గాని వారి నీడవలె నెచ్చటికేగినను వెంబడించుచుండును అది పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకిలో కట్టిన ధనము వంటిది దానిలో డబ్బుకట్టిన యీ గవర్నమెంటు పాలనయందుండు దేశమున కెచ్చటకు పోయినను మఱల ఆ పోస్టాఫీసునుండి ధనమును దీసికొనవచ్చును కట్టియుండు ధనము ఖర్చయినచో మఱల యివ్వరు ఆలాగున పుణ్యకర్మ లనేకముల జేసిన తరువాత తపస్సుకొరకుగాని, తీర్థయాత్రకొఱకుగాని వెళ్లవలయును అపుడెచటుండినను కొఱత గలుగదు ఈశ్వర రాజ్యములో నట్టివారి కెచటను కొఱత ఉండదు పుణ్యముయొక్క స్థితి యిటువంటిది మఱియు నే దానమును జేసిన అదియే వారికి దొరుకును పుణ్యకర్మలచే శరీర సంరక్షణకు కావలసినవన్నియు లభించునుగాని, దైవభక్తి లేనిచో ప్రకృతి దోషము నశించదు గురుసేవ అనగా బ్రహ్మ నిష్ఠుల సేవ జేయనిచో తత్త్వబోధము గలుగనేరదు కావుననే కొందఱికి భక్తి యుండినను దారిద్ర్యబాధ గలుగుచుండును కొందఱికి భక్తియు, ధనము నుండినను చక్కని వైరాగ్యము, సరియైన గురుబోధయు గలుగకపోవుచున్నది పుణ్యకర్మయును, దైవభక్తియును, సాధుసేవయును గలిగియుండేలాగున చూడవలయునని శాస్త్రము చెప్పెడు రహస్యమిదే ముముక్షువులందఱు, సాధ్యమైనంత పుణ్యకర్మయును, దైవభక్తియును, తత్త్వబోధమును గలిగియుండేలాగున చూడవలయును దీపము జ్వలించుటకు తైలము, వత్తి, ప్రమిద, గాలిలేని స్థలము ఉండవలసినట్లు, జ్ఞానజ్యోతి వెలుగుటకు దైవభక్తి తైలమువంటిది ధర్మానుష్ఠానము ప్రమిదవంటిది చిత్తైకాగ్రత వత్తి వంటిది ఆరోగ్యము మొదలగునవి గాలిలేని ప్రదేశము వంటివి కావున ఈ విషయములలో జాగ్రత్త గలిగి యుండవలయును మఱియు నీకాలమున వేదాన్తము శ్రవణము జేయువారు చాలమంది యున్నారు కాని మనన నిదిధ్యాసనముల

జేయువారరుదైరి అందుచే బ్రహ్మసాక్షాత్కారమందు పూర్ణానుభవమును పొందజాలకున్నారు ఈ విషయమై శ్రీశంకరుడు వివేకచూడామణియందు జెప్పినది జూడుడు

*శ్రుతేః శతగుణం విద్యా న్మననం మననాదపి ।*
*నిదిధ్యాసం లక్ష గుణమనన్తం నిర్వికల్పకమ్ ॥*

సర్వసంగపరిత్యాగానంతరము గురుముఖమున వేదాన్తవాక్య శ్రవణముజేయు టుత్తమము శ్రవణముకంటె మననము నూఱురెట్లధిక ఫలము నిచ్చును మననముకంటె నిదిధ్యాసనము లక్షమడుంగు లధిక ఫలము నిచ్చును నిదిధ్యాసనముకంటె నిర్వికల్ప సమాధి అనంత ఫలము నొసంగును

*ప్రథమం శ్రవణం కృత్వా ద్వితీయే మననం తథా ।*
*నిదిధ్యాసనకం పశ్చా త్సాక్షాత్కారస్తదా భవేత్ ॥*

ప్రథమమున వేదాంతశ్రవణము, తరువాత మననము, మఱల నిదిధ్యాసనము, అటు తర్వాత సాక్షాత్కారము గలుగునని కపిల మహర్షి వచించెను ఈ విషయమునే యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి బృహదారణ్యకము నందుపదేశించెను ''ఆత్మావారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః'' ఓ మైత్రేయీ! మొదట ఆత్మను గురించి సంశయ విపర్యయములు తొలగువఱకు గురుముఖమునుండి శ్రవణము చేయవలయును తరువాత ఏకాంతమునందుండి మననమును జేయవలయును పిమ్మట మరింత తీవ్రత గలిగి నిదిధ్యాసనమును జేయవలయును అటు తర్వాత సాక్షాత్కారము గలుగును ఈ విధమున నాలుగంతస్తులు గలవు ఇప్పు డుండెడివారు విత్తు మాత్రము పెట్టి మఱల దానిని పోషించుటగాని, పశ్వాదిమృగమువలన బాధ కలుగకుండ సంరక్షించుటగాని, చీడపురుగులు చెరుపకుండ జూచుటగాని చేయుట లేదు అందుచేతనే పోషణ లేని వృక్షము వలె బ్రహ్మజ్ఞానానందఫలమును గలుగజేయక, వీరి యుపదేశములు శుష్కించి పోవుచున్నవి కాబట్టి తల్లులారా! మీరందఱును ఋషిసంతతిలో జన్మించినట్లు తలంచి శ్రీ తరిగొండ వెంకమాంబగారగు పరమ యోగిని యుండిన యాశ్రమములో నుంటున్నామని మరువకూడదు ఇట్టి పవిత్ర భావనయే మిమ్ముల

నుద్ధరింప గలుగును అట్లాత్మస్వరూప సత్యమును బోధింపక మీ జన్మము, కులము, స్త్రీ పురుషాది వ్యక్తిత్వమును గుఱించి మాత్రము చెప్పెడివారు మిమ్ములను సత్యము నుండి అసత్యములోనికిని, ప్రకాశమునుండి చీకటిలోనికిని, అమృతమునుండి మరణములోనికి త్రోయువారేయని తప్పక నమ్మవలెను కనుకనే శ్రుతి యీ విధముగా జెప్పినది

*శ్రుతి:– అసతో మా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ*

ఓ పరమాత్మా! కరుణాసింధో! అసత్తునుండి సత్తులోనికి నన్ను ప్రవేశింప జేయుము తమస్సునుండి నన్ను ప్రకాశములోనికి దీసికొని వెళ్ళుము మృత్యువునుండి నన్ను (మరణస్వరూపమగు నీ జన్మమునుండి) అమృతస్వరూపములోనికి దీసికొని వెళ్ళుము

చె – కారణ గురువరా! కలియుగములో నుండువారి కట్టి ఋషులచే పొందదగిన బ్రహ్మత్వము గలుగునా?

గురు – తల్లులారా! ఇంత కాలమిచట అపుడపుడు శ్రవణమును జేసియు మఱల నేల మీకీ దేహభ్రాన్తి గలుగుచున్నది? ఆ నాలుగు యుగములలోను, నాలుగు యుగములు గలవు అది వారియొక్క స్వాత్త్విక, రాజస, మిశ్ర, తామస గుణముల ననుసరించి యుండును

*ప్రభూతం చ యదా సత్త్వం మనోబుద్ధీంద్రియాణి చ ।*
*తదా కృతయుగం విద్యాద్జ్ఞానే తపసి యద్రతిః ॥*

ఎప్పుడైతే సత్త్వగుణ ముద్భవిల్లునో, మనస్సు, బుద్ధి, యింద్రియములును వృద్ధినొందునో, (శుద్ధములై వికసించి స్వాధీనములై యుండునో) మఱియు దానమునందును ఆసక్తి గలిగియుండునో, అపుడాజీవికి కృతయుగమని గ్రహింప వలయును

*యదా కర్మసు కార్యేషు శక్తిర్యశసి దేహినామ్ ।*
*తదా త్రేతా రజోవృత్తి రితి జానీహి శౌనక! ॥*

ఓయీ! శౌనకా! ఎపుడు నిత్యనైమిత్తికాది కర్మలయందును, లోకసేవా కార్యముల యందును, కీర్తియందును, మానవులకు శక్తియు నాసక్తియు గలుగునో, అప్పుడు రజోగుణముతో గూడుకొన్న త్రేతాయుగమని తెలిసికొనుము

*యదా లోభస్త్వసంతోషో మానో దంభోఽథ మత్సరః ।*
*కర్మణాం చాపి కామ్యానాం ద్వాపరస్తద్రజస్తమః ॥*

ఎపుడు లోభము, అసంతోషము, మానము, మత్సరము, కామ్యకర్మలయందిచ్ఛ మున్నగు గుణములుండునో, అపుడట్టివారికి రజస్తమోగుణ మిశ్రితమగు ద్వాపర యుగమని తెలియవలయును

*యదా సదాఽనృతం తంద్రా నిద్రా హింసాది సాధనమ్ ।*
*శోకో మోహో భయం దైన్యం స కలిస్తు తదా స్మృతః ॥*

ఎపుడైతే యెల్లపుడు ననత్యము, కునికిపాటు, నిద్ర, హింసాదులకు సాధనమును, శోకము,మోహము, భయము, దైన్యము మొదలగు గుణములతో గూడియుందురో అపుడు వారికి కలియుగమనియు తలంపవలయును తల్లులారా! ఇట్టి పరమార్థ సత్యమునుపదేశించువారరుదైనందుచే కలియుగము కల్మష స్వభావమని తలంచి నిర్మలతకొఱకు ప్రయత్నించుటకైన జనులు లేకపోయిరి శ్రీ బుద్ధుడు, శ్రీశంకరులు, శ్రీరామానుజాచార్యులు, శ్రీకృష్ణచైతన్యులు, గురునానక్, శ్రీయేసుక్రీస్తు, శ్రీమహమ్మదునబి, శ్రీరామకృష్ణ పరమహంసలు, వారిధర్మపత్ని యగు శ్రీశారదాదేవి, శ్రీతరిగొండ వెంకమాంబగారు మొదలగు వారెందరో జీవన్ముక్తి నొందలేదా? ఆ విధముగనే యుగాంతరములోను స్త్రీలలో పౌతమసి, మైత్రేయి, గార్గి, విశ్వవర, కాత్యాయని, మదాలస, చూడాల మొదలైన తపస్వినులెందరో యుండిరి గదా! అట్లుండగా మీరేల సందేహపడుచున్నారు? ఇక నేదైన భారతీదేవిని గురించి చెప్పవలసియున్నదా?

చెల్లా – కారణగురువరా! అనేకమంది పండితులు, శాస్త్రులు, భారతీదేవిని జూచుట కేతెంచుచుందురు వారందఱు సంస్కృతమునందే మాట్లాడుచుందురు ప్రార్థనకాలమున ప్రణవ ధ్యానమును గాంచి కొందఱత్యంతానంద భరితులై

యుందురు కొందఱు మాత్రము స్త్రీలకును, బ్రాహ్మణేతరులకును ప్రణవధ్యానమున కర్హత గలదా? యని ప్రశ్నింతురు

గురు – ఇది లోకములో అనాదినుండి వచ్చుచున్నది ప్రపంచములో మధురఫలముల నొసంగు వృక్షములు కొన్ని, పులుపుగల ఫలమునిచ్చెడి మ్రానులు కొన్నియు, చేదైన ఫలములనిచ్చు తరువులు కొన్నియు ననాదినుండి యుంటున్నవి ఆ విధముగానే జనులలో దేవతా స్వభావముగలవారు కొందఱు, మనుష్య స్వభావము గలవారు కొందఱు, రాక్షస స్వభావము గలవారు కొందఱును గలరు అయితే అధికారము లేదని చెప్పెడివారిని భగవద్గీత చదువవచ్చునా? యని యడుగవలయును

చెల్లా – పూర్వము భగవద్గీతను స్త్రీలును, శూద్రాదులును చదివినవారు కారు కాలమహిమవలన నిపుడందఱును జదువుచున్నారు అంతేగాదు ప్రణవము శ్రుతి సారమైయున్నప్పటికిని గీత భారతమున భీష్మపర్వము నందుండుటచే వాటిని చదువుటలో నిరోధము లేదు ఏలననగా స్త్రీశూద్రులకొఱకే పురాణము లేర్పడినవి భారతమున్ను చరితాత్మకమగుటచే పురాణములలో జేరినది కనుకనే వ్యాసము నీంద్రుడు ''స్త్రీశూద్ర ద్విజ బంధూనాం'' అని వచించెను అందువలన పారాయణను జేయవచ్చును

గురుడు – మంచిది ప్రణవధ్యానమును జేయకూడదని చెప్పెడివారి నీ విధముగ ప్రశ్నింపవలెను గీత మొదలగునవి చదివినచో మాత్రము చాలునని మీ యాశయమా? లేక ఆచరించుటకొరకే చదువవలయునని మీ యాశయమా? చదివినంత మాత్రమున చాలునని చెప్పినచో వైద్యశాస్త్ర పఠనమువలననే రోగము లుపశమింపవలసి యుండును దీపముయొక్క వార్తవలన చీకటి నశింపవలయును అన్నశబ్ద శ్రవణమువలననే ఆకలి శమింపవలయును అట్లుగాక ఆచరింప వలయుననియే భగవదాశయమని వారు చెప్పినచో అంత్యకాలముననే ధ్యానమువలన జీవుడు ముక్తుడు కాగలడని యర్జునుడు 8 వఅధ్యాయమున శ్రీకృష్ణునడుగగా ప్రణవమునే చెప్పియున్నాడు కఠోపనిషత్తు నందును నచికేతు డాత్మవిషమై యడిగినపుడు యమధర్మరాజు ఈ విధముగా ప్రణవము నుపదేశించి యున్నాడు

మఱియు గీత 8 వ అధ్యాయమున ప్రణవము నుపదేశించు నపుడును, కఠోపనిషత్తునందున యమధర్మరాజు పదేశించినపుడును వ్యక్తిగతమగు నధికార మేమియు జెప్పియుండ లేదు అయితే బ్రహ్మవిద్యకు దగిన యోగ్యత మాత్రము దెలిపియున్నారు ఇక నీ విషయమై ''ప్రణవో పాసన'' యను గ్రంథమును జూడనగును సంయమినులారా! ఆచరణ లేని వేదాన్త విచారము ప్రచారమునకు వచ్చి నప్పటి నుండియే బ్రహ్మజ్ఞానము క్షీణించి పోయినది శ్రీకాశియందుగూడ సాక్షాచ్ఛంకరుడు ప్రాణప్రయాణకాలములో జీవకోట్లకు నీ ప్రణవమునే యుపదేశించుచున్నాడు

*కాశీపతిః కారుణికః కరాభ్యామాదాయ మూర్ధాన మతీవ తాసామ్ ।*
*ఆగమ్య వేగాదుపగచ్ఛ తాసా మోంకార మోంకారయతిస్మ కర్ణే ॥*

సువృత్త, మరుద్వతి, కమల, విమల అను మృకండముని భార్యలు మణికర్ణికలో స్నానమాచరించి విశ్వేశ్వరునకు ప్రదక్షిణమును జేయుచుండగా వారికి వళ్లు తిరిగెను అపుడు వారి మనస్సులందిట్లు వేడుకొనిరి ''ఓ విశ్వేశ్వరా! సకల పాపములను పోగొట్టువాడా! కోరినవారికి సమస్త శుభముల నిచ్చువాడా! హే శూలపాణే! సకల భయమును పోగొట్టినవాడా! మాకు రక్షకుడవగుము'' అని వేడుకొనుచు స్మృతి తప్పి నేలపై బడిరి అపుడు కాశీ విశ్వేశ్వరుడు ఆ మృగశృంగుని భార్యలయందు కనికరము గలవాడై వారి తలల దన చేతులతో లేవనెత్తి పట్టుకొని ఆ నలుగురి చెవులయందు నేక కాలములో ''ఓం ఓం'' అని తారక మంత్రమగు ప్రణవము నుపదేశించెను అప్పుడు వారు ముక్తులైరి ఈ కథ మాఘ పురాణ మందు గలదు స్త్రీలగు మరుద్వతి మొదలగువారికి పరమశివుడే ప్రణవము నుపదేశించెను దీనిని గ్రహించిన యెడల స్త్రీల కధికారము కలదా? లేదా? యని బోధపడును ఇక నేదేని లోపము నెవ్వరైనను జెప్పుదరా?

చెల్లా – సంసార సాగరము తరింప జేయుటకు నావగా నేర్పడిన దేశికేంద్రా! స్త్రీలకు తపస్సెక్కడ చెప్పబడినది? అంతేగాక, కృతత్రేతాది యుగములలో తపో, ధ్యాన యోగాదులు విధింపబడినవని కొంద ఱాక్షేపించెదరు

గురుడు – ఏ యుగములోనైనను తపస్సంపన్నులు, జ్ఞానసంపన్నులును నియతముగ నుండెదరు కృతయుగమున నెక్కువమంది యుండిరి క్రమముగ యుగ పవిత్రత తగ్గిపోయెనే గాని ద్వాపర కలియుగములందట్టి వారు లేక పోలేదు మైత్రేయి, గార్గి, తరిగొండ వెంకమాంబగార్లు మొదలైనవారు తపస్వినులే ఈ విషయము గూడ మాఘ పురాణమున గలదు ఇక ఆత్మగుణమును త్యజించి యుగధర్మమును పరిశీలింపవచ్చును

*పురా కృతయుగే రామ! బ్రాహ్మణా వై తపస్వినః ।*
*అబ్రాహ్మణస్తతో రాజ న్న తపస్వీ కథం చ న ॥*

*త్రేతాయుగేఽ వ్యవర్తన్త బ్రాహ్మణాః క్షత్రియాశ్చ యే ।*
*తపోఽ తప్యన్త తే సర్వే శుశ్రూషామపరే జనాః ॥*

*తతో ద్వాపర సంజాతే తపో వైశ్యాన్సమావిశత్!*
*యుగేషు త్రిషు రాజేంద్ర! ధర్మం చక్రుర్ద్విజాతయః!*
*భవితా శూద్రయోన్యాం హి తపశ్చర్యా కలౌ యుగే !!*

ఓ రామచంద్రా! పూర్వము కృతయుగమునందు బ్రాహ్మణులు మాత్రము తపస్సును జేయుచుండిరి ఓ రాజా! బ్రాహ్మణులు కానివారు కృతయుగమునం దొకా నొకపుడు గూడ దపస్సును జేయునది లేదు త్రేతాయుగమునందు బ్రాహ్మణులు, క్షత్రియులు గూడ తపమొనర్చుచుండిరి మిగిలిన వారందఱు నా తపమును జేయు వారికి శుశ్రూషను జేయుచుండిరి తర్వాత ద్వాపర యుగమునందు వైశ్యులు గూడ తపమును జేయుచు వచ్చిరి అనగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు గూడ తపమును జేయు చుండిరి ఓ రాజశ్రేష్ఠుడా! ఈ విధముగ మూడు యుగములందును ద్విజాలగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు ధర్మమును జరుపుచుండిరి కలియుగమునందు శూద్రయోనుల యందు పుట్టినవారు గూడ తపస్సును చేయుదురు ఇట్లు చెప్పి గురువరు డింక నేదైన మన భారతీదేవిపై లోపములు జనులు చెప్పెదరా? అని యడిగెను

చెల్లా – కొంద ''ఱాడవారంద ఱీలాగున బ్రహ్మచర్యమును, తపస్సును సలుప నారంభించినచో కలియుగ మెటుల నడచున'' ని ప్రశ్నింతురు

గురు – ఇయ్యది పామరుల ప్రశ్న వండితు లెవరును నిటువంటి దానికి సమాధానమును జెప్పరు శాస్త్రసమ్మతమైన దానికే వారు సమాధానమును జెప్పెదరు ఒకరు పెద్దవైద్య పరీక్ష కొఱకు తీవ్రనిష్ఠ గలిగి చదువుచుండగా నొకడు వెళ్ళి ''మీ రందరీ విధముగ వైద్య విద్యను జదివినచో నెల్లరును నీ విధముగ జదివెదరు అప్పుడు మీ దగ్గఱకు రోగులెవరు వచ్చెదరు? అట్లే మఱియొకడు న్యాయవాది పరీక్ష కతితీవ్రతతో జదువుచుండగా మఱియొకడు మీవలె నెల్లరు న్యాయవాద పరీక్ష జదివిన యెడల, మీ వద్దకు కేసు నెవరు తీసికొనివత్తురు '' అని యడిగినట్లున్నది ఒకనికి వైరాగ్యభక్తులు గలిగి జ్ఞానమందిచ్ఛ గలిగినచో అది వారికి జన్మాంతర సంస్కారము చేతనో, యీశ్వర కరుణచేతనో గలిగినచో, దాని నెవ పు కాదని చెప్పగలరు? శ్రీశంక రులు గూడ నీ విధముగానే నుడివియున్నారు ''స్వదర్ణాశ్రమ ధర్మేణ తపసా హరితోషణాత్'' జన్మాంతరధర్మానుష్ఠానముచేతను, వ్రతానుష్ఠానములచేతను, సర్వేశ్వరునికి కరుణ గలుగునపుడు ముక్తియందభిలాష గలుగును తల్లులారా! మీకు గూడ నిది మంచిసమయము శాస్త్రజ్ఞానము లేనిచో జనులకు బోధింప శక్తి గలుగదు ఎంత యోధుడై యున్నను రణరంగమున అస్త్ర శస్త్రములు లేనిచో శత్రువుతో నెట్లు పోరాడ గలుగును? అయితే మంచి అస్త్రశస్త్రములుండినను దానిప్రయోగ విధానము దెలియనిచో నవి యేమియు ప్రయోగపడవు అదేరీతిగ జనుల హృదయములలోగల దుర్గుణములను, దుష్ట బుద్ధులను తొలగింపవలయునన్నచో శాస్త్ర యుక్తియు, తదనుభవమును గలిగియుండవలయును అట్లుగాక శాస్త్రమును మాత్రము జదివి యనుభవము లేనిచో నదియును ప్రయోజనమును గలుగజేయదు ఈ రెండును పూర్వజన్మ సుకృత విశేషమువలననే గలుగును మఱియు స్త్రీలుండెడు స్థలములో నెల్లపుడుండి పురుషుడు బోధించుట కవకాశముండదు స్త్రీలకు స్త్రీలే బోధకులుగా నుండినచో ఎంతో యుపయోగముగ నుండును స్త్రీల ఆస్పత్రులలో స్త్రీలే డాక్టర్లు గను, స్త్రీలపాఠశాలలందు స్త్రీలే యుపాధ్యాయినులుగాను, స్త్రీల జైళ్ళలో స్త్రీలే వార్డర్లుగాను, స్త్రీల సభలో స్త్రీలే వాలంటీర్లుగ నుండుట చూచుట లేదా? ఇదియే సరియగు పద్ధతి యగును అయినను అట్టి అనుకూలత లేని స్థలములో ధర్మమును కాపాడుకొనుచు వేదాంత శ్రవణమును జేయవచ్చును

*తావదేవ నిరోద్ధవ్యం యావద్ధృది గతం క్షయమ్ ।*
*ఏతద్ జ్ఞానం చ ధ్యానం చ శేషోఽన్యో గ్రంధవిస్తరః ॥*

మనస్సెంతకాలమునకు హృదయమునందే విలీనమై యుండునో, అంతకాలము మనస్సును నిరోధించవలయును ఇదియే జ్ఞానము ఇదియే ధ్యానము ఇతరమంతయు గ్రంధవిస్తారమే యగును

ఇక ఛాందోగ్యోపనిషత్తునందుగల ఉద్దాలక శ్వేతకేతు సంభాషణను జూడుడి! అరుణుడను ఋషియొక్క పౌత్రుడైన శ్వేతకేతుడను బ్రాహ్మణుడు పూర్వకాలమున నుండెను ఆ శ్వేతకేతుని నుద్దేశించి తండ్రియైన యుద్దాలకుడు చెప్పుచున్నాడు ''ఓ శ్వేతకేతుడా! మనకులమున కనురూపమైన గురువుల సమీపమునకు బోయి, స్వాధ్యాయాధ్యయనము కొఱకు బ్రహ్మచర్యమును నిమిత్తముగ జేసికొని ఉపనయనపూర్వకముగా నధ్యయనమును జేయుచు నివసింపవలసినది ఓ ప్రియదర్శనుడవైన శ్వేతకేతుడా! మనకులమునందు బుట్టిన వాడు వేదశాస్త్రముల నధ్యయనమును జేయక తనకు బ్రాహ్మణత్వము లేకపోయినను బ్రాహ్మణులు మా బంధువులని చెప్పుకొనుచుండెడివానివలె అయినవాడు లేడు'' అని తండ్రియైన యుద్దాలకుడు శ్వేతకేతునకు జెప్పినవాడాయెను తండ్రిచే నాజ్ఞాపింపబడిన ఆ శ్వేతకేతుడు పండ్రెండు సంవత్సరములవాడై యుండి గురుసమీపమునకు బోయి ఇరువదినాలుగు సంవత్సరములవాడగు పర్యన్తము, పండ్రెండు సంవత్సరములు సమస్త వేదములును సమగ్రముముగా నధ్యయనమును జేసి వాని యర్థమును దెలిసికొని పాండిత్యమున నాకు సమానులయినవారు లేరని గంభీరమైన మనస్సు గలవాడును, నాతో సమానముగా ప్రవచనము చేయువారు లేరని తలంచిన వాడునై వినయము లేక అతిగర్వముతో గూడి గృహమునకు వచ్చినవాడాయెను ఈ ప్రకార మభిమాన విశిష్టుడై విద్యకనురూపమైన వినయము లేక గర్వముతో గూడుకొని వచ్చియుండెడి శ్వేతకేతుని తండ్రియైన యుద్దాలకుడు చూచి యోగ్యమైన ధర్మమునందు ప్రవర్తింపజేయవలె ననెడి ఇచ్ఛచే వక్ష్యమాణ వాక్యమును జెప్పినవాడాయెను

''ప్రియదర్శనుడవైన ఓ శ్వేతకేతుడా! గంభీరమయిన మనస్సుగలవాడవును,

ప్రవచన సమర్థుడననెడి అభిమానముతో గూడినవాడవును, పరిపూర్ణుడనైతినను గర్వము గలిగి యున్నవాడవునయియున్నావు ఈ ప్రకార మభినివేశముతో దుర్వినీతుడవై యుండుట యేయతిశయముచే నేర్పడినది? వేదాంతములయందు ప్రసిద్ధమై శాస్త్రాచార్యోపదేశ మూలముగానే తెలియదగియుండెడి రహస్య విషయమును ఆచార్యు లను గూర్చి వినయపూర్వకముగా ప్రశ్నను జేసి వారివలన నుపదేశముద్వారా దెలిసికొని యుంటివా లేదా? ఏ విషయమును ఉపదేశముద్వారా గ్రహించుటచే శ్రవణము చేయబడకుండెడి విషయముగూడ శ్రవణము చేయబడినదిగాను, మననము చేయబడని విషయము గూడ మననము జేయబడినదిగాను, నిదిధ్యాసచేత నిశ్చయింపబడని విషయముగూడ తెలియబడి యున్నదిగాను అగుచున్నదో అట్టి రహస్యవిషయమును ఉపదేశము ద్వారా గ్రహించియుంటివా?'' అని యుద్దాలకుడు శ్వేతకేతుడనెడి పుత్రుని ప్రశ్నించెను

ఈ వాక్యమును శ్వేతకేతుడు విని యీ విషయమును అసంగతముగా భావించినవాడై ''సర్వజ్ఞులైన యో స్వామీ! అటువంటి యుపదేశ విషయము అసంభావితమై యున్నది ఏ విధముగా సంభవించుట కర్హమైయుండునో చెప్పవలసినది'' అని వినయపూర్వకముగా నడిగినవాడాయెను'' ఓ ప్రియదర్శనుడా! ఒక మట్టిముద్ద తెలియబడుటచేత సమస్తమైన, మృత్తుయొక్క భేదమై యుండెడి ఘటశరావాదికమంతయును వాగ్వ్యాపారమే యాశ్రయముగాగల నామధేయ మాత్రమై యుండెడి కార్యరూపకమయినదంతయు నన్పతమనియు, మట్టి స్వరూపమే అబాధిత వస్తుస్వరూపమై యున్నదనియు, నీ ప్రకార మేలాగున తెలియబడినది యగుచున్నదో, ఓ శ్వేతకేతుడా! ఒకటియై యుండెడి సువర్ణముయొక్క కణికము తెలియుట చేత సమస్తమైన సువర్ణభేదమై యుండెడి కటకమకుటాద్యాకార మంతయును వాగ్వ్యాపారమే యాశ్రయముగాగల నామధేయ మాత్రమైన భేదరూపముగా పరిణమించి యున్నదైనందున అన్పతమనియు, సువర్ణరూపము మాత్రమే కారణరూపముగా అబాధితమై యున్నందున సత్యమనియు ఏ ప్రకారము తెలియబడినది యగుచున్నదో, ఓ ప్రియ దర్శనుడా! ఒకటియైన నల్లని లోహసంబద్ధమైన నఖనికృన్తము( గోరుగొల్లు) తెలియుటచేత సమస్తమైన అయోవికారమైన వాశ్యాకుద్దాల కాది భేదమంతయును

వాగ్వ్యాపారవే మూలవముగాగల నామధేయ మాత్రవే యయినందున కార్యరూపముగా పరిణమించి యుండెడి భేదవికారమంతయును అనృత మనియు నల్లని లోహముయొక్క స్వరూ పము మాత్రమే అబాధిత సత్యస్వరూపమనియు, ఏ ప్రకారముగా తెలియబడినది అగుచున్నదో ఈ ప్రకారమే ఓ శ్వేతకేతుడా! వేదాంతవములయందు ప్రసిద్ధవై శాస్త్రాచార్యోపదేశవమూలవముగానే తెలియదగియుండెడి రహస్య విషయ జ్ఞానమును కార్యప్రపంచ మంతయు అనృతమనియు, కారణము మాత్రమే అబాధితమై యున్నందున సత్యమ నియు, తెలియజేయుచున్నందున సర్వవిజ్ఞాన సాధకమగుచున్న'' దని ఉద్దాలకుడు చెప్పిన వాడాయెను

''ప్రజ్ఞావంతులైన నా గురువులు ఈ వస్తుస్వరూపవిషయమును తెలిసిన వారలై యుండ లేదు ఈ సర్వజ్ఞత్వసాధక వస్తుస్వరూపములు తెలిసియున్న వారలై రేని ప్రియశిష్యుడనై భక్తిగలిగి యుండెడి నాకొఱకు ఎందువలన చెప్ప కుందురు? నిశ్చయము ఇందువలన వారివలన నాకు తెలియబడకుండెడి యీ వస్తుస్వరూపమును సర్వజ్ఞులై యుండెడి మీరే నా కుపదేశమును జేయవలయును'' అని శ్వేతకేతుడు ప్రార్థించెను ''ఓ ప్రియదర్శ నుడా! ఆ ప్రకారముగానే వస్తు స్వరూపమును నీ కుపదేశించెదను'' అని తండ్రియైన యుద్దాలకుడు అంగీకార వాక్యమును జెప్పెను

1 ఈ ప్రత్యక్షాది విషయమై నామరూప క్రియాభేదభిన్నమైయుండెడి సమస్త ప్రపంచమును ఈ యధిష్ఠాన సత్తా మాత్రమే స్వరూపముగా గలిగియున్నది ఆ యధి ష్ఠాన సత్స్వరూపమే, పారమార్థిక సత్యస్వరూపమైయున్నది ఆ నిరుపాధిక కేవల సత్యస్వరూపవే సర్వప్రపంచములో నహమాది సర్వవృత్తులకు సాక్షియైయుండెడి యద్వితీయాఖండైక రస పూర్ణ బ్రహ్మాభిన్న ప్రత్యక్స్వరూపమై యున్నవాడవైతివి అని శ్వేతకేతునికి తండ్రియైన యుద్దాలకుడు శ్రుతి యుక్త్యనుభవములచే బోధించిన వాడయ్యెను ఈ వాక్యమును శ్వేతకేతుడు విని ప్రతిదివసము సుషుప్తియందు సర్వప్రాణులకు బ్రహ్మప్రాప్తి సాధారణముగా నేర్పడియున్న యెడల నందఱును మేము బ్రహ్మస్వరూపమును బొందుచున్నామని

తెలిసికొనవలసియుండును ఆ ప్రకారము తెలియుట యనుభవారూఢమై యుండ లేదు గనుక ఈ అర్థము అసంభావితమై యున్నదని తోచుటచే సంశయముగలవాడై తండ్రిని గూర్చి ''జ్ఞానైశ్వర్య పరిపూర్ణులై యుండెడి మీరు ఈ అర్థ విషయమునే నన్ను గూర్చి వివరణ జేసి సంశయము నివర్తించు లాగున దృష్టాంతపూర్వకముగా బోధించి, యనుగ్రహింప వలయును'' అని ప్రార్థించెను

ఈ వాక్యము నుద్దాలకుడు విని ''ఓ శ్వేతకేతుడా! ఆ ప్రకారమే బోధించెదనని యనుగ్రహించి యంగీకార వాక్యమును జెప్పినవాడాయెను'' ఓ శ్వేతకేతుడా! ఏ ప్రకారము మధుమక్షికములు మధుద్రవ్యమును సంపాదించి కల్పించుచున్నవై నానావిధ పుష్పఫలయుక్తములై యుండెడి వృక్షములయొక్క బహువిధములైన రసములను కలిసికొనియుండునట్లు మధురసము నైక్యమును బొందించుచున్నవో, ఆ మధుద్రవ్యము నందేకీభవించి యుండెడి రసములును, ఆ మధురసమునందు నేనీ వృక్షముయొక్క రసమునైతిని, నేనీవృక్షమునకు ప్రతియోగియైయుండెడి ఈ వృక్షసారమైతిని అని ఏ ప్రకారము వ్యావర్తక భేదమును పొందక యేకీభవించి సమరసమై యుండెడినో, ఈ ప్రకారముగానే ఓ శ్వేతకేతుడా! ఈ ప్రత్యక్షాది విషయమై యుండెడి సమస్త ప్రాణులును వానివాని సంస్కార వాసనలతో సత్తామాత్రమై యుండెడి బ్రహ్మస్వరూపమునందు సంఘీభావమై లయించి సన్మాత్రమైయున్నందున సత్తామాత్ర బ్రహ్మస్వరూపము నందేకీభవించి తన్మాత్రమై యున్నామని వృత్తి శూన్యమయినందున తెలిసికొనుట లేదు ఆ ప్రకారము సుషుప్త్యుత్క్రాంతి సమయములలో వాసనా విశిష్టములై యధిష్ఠాన సత్తామాత్ర బ్రహ్మస్వరూపమును బొందియుండెడి సమస్త ప్రాణులును ఈ దర్శన వృత్తి రూపమయిన జాగ్రత్స్వప్నములయందు వ్యాఘ్ర స్వరూపమైగాని, సింహరూపము గాని, తోడేలు రూపము గాని, పందిరూపముగాని, పురుగురూప ముగాని, పక్షిగాని, దోమగాని, మత్కుణముగాని, ఏ యే వాసనా విశిష్టమయిన నామరూప క్రియలు గలిగియున్నవో, ఆ యా వాసనా విశిష్ట నామరూపక్రియలు గలవిగానే ఆవిర్భవించుచున్నవి

2 ఈ ప్రకారము సర్వలయాధిష్ఠానమై యుండెడి యే స్వరూపమునందు

నిర్వాసనవముగా లయించియుండెడి భూతవములు సత్యాభిసంధి గలిగి యుండుటను, నిమిత్తముగ జేసికొని సన్మాత్రముగానే శేషించుటయును, వాసనాసహితముగా లయించి యనృతాభి సంధి గలిగియుండెడి భూతములు మఱల పూర్వవాసనానురూపముగా ఉత్థిత ములగుటయును సంభవించుచున్నదో అట్టి సత్స్వరూపమే సర్వప్రపంచ బీజభూతమై నిర్వచింప శక్యముగాని సూక్ష్మాంశమైయున్నది కనుక ఈ ప్రత్యక్షాది విషయమై యుండెడి ప్రపంచమంతయును నీ యధిష్ఠాన సన్మాత్రమే స్వరూపముగా గలిగియున్నది అదియే ఆబాధితసత్తా మాత్రమై యుండెడి బ్రహ్మస్వరూపము అదియే అహమాది సర్వవృత్తులకును సాక్షియైయుండెడి నిర్వికారాసంగచిద్రూప ప్రత్యక్స్వ రూపమై యున్నది ఆ అద్వితీయ బ్రహ్మాభిన్న ప్రత్యక్స్వరూపమే కర్తృత్వాద్యుపహితమై జీవసంజ్ఞను పొందియుండెడి యాత్మాభాస కధిష్ఠానమైన నిర్వికారాసంగ ప్రత్యగాత్మ స్వరూపమాత్రమై యుండెడి నీవును అయితివి'' అని చెప్పినవాడాయెను ఈ ప్రకారము తండ్రియైన యుద్దాలకునిచే నుపదేశింపబడిన వాక్యమును విని లోకానుభవమున, సుప్తోత్థితుడై దేశాన్తరమును పొందియుండెడి పురుషుడు తాను సుషుప్తిని పొంది యుండెడి దేశము దెలిసియున్నవాడై యున్నట్లు సన్మాత్రమునందు లయించి పూర్వవాసనతో నుత్థితుడై యుండెడివాడు పూర్వము నేను సన్మాత్రమైయుంటినని దెలిసియుండుట లేదు కనుక ఈ యర్థమునందు సంశయము గలవాడై తండ్రిని గూర్చి సర్వజ్ఞులైన మీరు మఱల నీ యర్థమునే నన్ను గూర్చి విస్పష్టముగా దెలియులాగున దృష్టాన్తపూర్వకముగా ననుగ్రహింపవలయు''నని ప్రార్థించెను

ఈ వాక్యమును తండ్రి విని ''ఓ శ్వేతకేతుడా! ఆ ప్రకారమే వివరణ జేసి చెప్పెదనని వక్ష్యమాణ ప్రకారముగా జెప్పినవాడాయెను ''ఓ శ్వేతకేతుడా! ఈ లోక ప్రసిద్ధములైన గంగ, యమున, సిన్ధు, కావేరి మొదలయిన నదులు పూర్వభాగమునందు తూర్పుగా సముద్రములోనికి బ్రవహించునవి కొన్నియును, పశ్చిమభాగమునందు పశ్చిమముగా ప్రవహించునవి కొన్నియును ప్రవర్తించుచున్నవి ఆ ప్రకారము ప్రవర్తించుచుండెడి నదీ నదములన్నియును సముద్రమునుండి

మేఘములచే గ్రహింపబడెడి జలమును ఆ మేఘములు పర్వతములమీద వర్షించినందున పుట్టినవై సముద్రమునందే లయమును బొందుచున్నవి కనుక సముద్రము లోపలనే యేకీభవించుచున్నవై ఆ నదులు ఆ సముద్రమునందు నేను ఈ గంగానదిగనున్న దాననైతిననియు, నేను ఈ సింధునది సంజ్ఞ గలదాననైతిననియు వ్యావర్తక భేద విషశేమును పొందక యేకీభవించియుండుట యే ప్రకారమో ఓ శ్వేతకేతుడా! ఈ నదీ దృష్టాన్తమువలెనే ఈ ప్రత్యక్షాది విషయవముగా ప్రసిద్ధమై యుండెడి సమస్తభూతములును సర్వాధిష్ఠాన సత్తాస్వరూపమునుండి ఆవిర్భవించినవై సన్మాత్రమునుండి ఉత్పన్నమై వ్యక్తీభవించియున్నామని దెలిసికొన లేకుండుట ప్రసిద్ధమైనది ఆ ప్రకారము సన్మాత్రమునందు లయమును బొంది తిరిగి వ్యక్తీభవించుచుండెడి భూతములు సత్సంపత్తి పూర్వ మీలోకమున వ్యాఘ్రస్వరూపము గాని, సింహరూపము గాని, తోడేలు స్వరూపముగాని, పందిరూపముగాని, పురుగు గాని, శలభముగాని, దోమయుగాని, మత్కుణముగాని యేయే స్వరూపసంస్కారము లతో గూడుకొని యుండినవో, ఆయా స్వరూపవాసనా సంస్కారములతోడనే మఱల నావిర్భవించుచున్నవి

3 ఈ సమస్త భూతములును మరణ ప్రళయములలో, నేసన్మాత్రమునందు లయించుచున్నవో ఆ స్వరూపమే సమస్త ప్రపంచాధిష్ఠాన సత్తామాత్రమైయుండెడి సూక్ష్మాంశమైయున్నది గనుక ఈ ప్రపంచమంతయును ఈ సత్తామాత్రమే స్వరూపముగా గలిగియున్నది అదియే అబాధితమై యుండెడి సత్యస్వరూపము అదియే అహమాది సర్వవృత్త్యధిష్ఠాన సాక్షిస్వరూప ప్రత్యగాత్మయైనది ఓ శ్వేతకేతుడా! కర్తృత్వాదివిశిష్టమై జీవసంజ్ఞచే వ్యవహరింపబడుచుండెడి యాత్మాభాసోపలక్షిత ప్రత్యక్స్వరూపమైన నీవును, సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాదిధర్మోపలక్షితమై యుండెడి యద్వితీయాఖణ్డ పరిపూర్ణబ్రహ్మ స్వరూపమాత్రము అయియున్నావు అని తండ్రియైన యుద్దాలకుడు శ్వేతకేతునికి తత్త్వోపదేశము చేసినవాడాయెను

ఈ వాక్యమును శ్వేతకేతుడు విని గంగానది మొదలయిన యచేతనముల వలెనే సమస్తప్రాణులు సుషుప్త్యుత్క్రాంతి సమయమునందు సత్సంపత్తి గలిగి

సన్మాత్రముగానే యున్న యెడల సముద్రమునందుత్పన్నములై నష్టములగు చుండెడి జలబుద్బుదములకువలె వీనికిని నాశము శంకింపవలసియున్నది ఈ ప్రకారము సత్సంపత్తి సమయమునందు సమస్త ప్రాణులకు నాశము నూహించునెడల సుప్తోత్థితులై యుండెడి పురుషులు పూర్వకాల సమ్భూవ్షమైన జాగ్రదవస్థలోని నామరూపక్రియలతో గూడి యుండుట అసంభావితమై యున్నది కనుక ఈ సంశయముతో గూడినవాడై తండ్రిని గూర్చి సర్వజ్ఞులయిన మీరు తిరిగి ఈ విషయమునే నన్ను గూర్చి విస్పష్టముగా దెలియు లాగున బోధింపవల యునని ప్రార్థించెను ఈ వాక్యమును విని తండ్రియైన యుద్దాలకుడు'' ఓ శ్వేతకేతుడా! ఆ ప్రకారముగానే బోధించెద''నని యంగీకార వాక్యమును జెప్పినవాడై వక్ష్యమాణ ప్రకా రముగా జెప్పిన వాడాయెను

''ఓ శ్వేతకేతుడా! ఈ ప్రత్యక్షసిద్ధమై యుండెడి గొప్ప వృక్షముయొక్క మొదలునందు ఏ ప్రదేశమయినను గొడ్డలి మొదలుగాగల ఛేదన సాధనముతో నొక కాటు మాత్రము పడులాగున కొట్టబడినటులాయెనేని, జీవముతో గూడియున్నదై రసమును స్రవించును మధ్యభాగమునందును ఏ ప్రదేశమైనను ఆ ప్రకారమే కొంచముగా గొట్టబడినటులాయెనేని ఆ ప్రదేశమును జీవము గలిగియున్నదై రసమును స్రవించును అగ్రభాగమునందును ఏ ప్రదేశమును ఆ ప్రకారమే యొక పర్యాయము కొంచెముగా గొట్టబడినటులయిన జీవముతో గూడియున్నదై రసమును స్రవించును. అట్టి రసస్రావము గలిగియుండెడి ఈ వృక్షము ఆత్మాభాసమైన జీవస్వరూపముచే సర్వప్రదేశమునందును వ్యాపింపబడియున్నది కనుకనే ఉదకమును పానము చేయుచు విశేషవృద్ధి గలిగినదైయున్నది ఈ వృక్షమునందు రసరూపముగా నంతటను వ్యాపించి యుండెడి జీవాంశము ఏ సమయమున రోగగ్రస్తమైనది గాని, కొట్టివేయబడినది గాని ఒక్క శాఖను విడుచుచున్నదో, ఆ సమయమునందు ఆ జీవాంశముచే విడువబడిన శాఖ మాత్రమే ఎండిపోవుచున్నది రెండవ శాఖను ఆ ప్రకారమే జీవాంశము విడిచిన యెడల ఆ సమయమున ఆ రెండవ శాఖయును ఎండిపోవుచున్నది ఆ ప్రకారముగానే మూడవ శాఖయును జీవాంశము విడిచిన

యెడల ఆ సమయమునందు ఎండిపోవును సమస్తవృక్షమును జీవాంశమును విడచిన యెడల వృక్షమంతయును ఎండిపోవుచున్నది

ఓ శ్వేతకేతుడా! ఈ ప్రకారముగానే సమస్త ప్రపంచములో భూతములయందు ఆత్మాభాసయైన జీవము దేహేంద్రియమనః ప్రాణ సముదాయమునందేయంశము విడుచుచున్నదో, ఆ యంశము నష్టమై మృతమైనదను సంజ్ఞను బొందుట ప్రసిద్ధమై యున్నదని తెలిసికొనవలసినది అని ఉద్దాలకుడు శ్వేతకేతుని గూర్చి చెప్పినవా డాయెను

4 ఈ ప్రత్యక్షాది గోచరమై యుండెడి నామరూపక్రియాభేద భిన్న ప్రపంచమంతయును జీవునిచే విడువబడినదై నష్టమై మృతిని బొందుచున్నది జీవస్వరూపము మరణధర్మము లేక అమృతస్వరూపమై యుండెడి పారమార్థిక సత్తామాత్రమై శేషించుచున్నది ఈ ప్రకారము సుషుప్త్యుత్క్రాన్తులయందు జీవునికి నాశము లేదని తెలియవలసినది ఈ ప్రకారము సర్వప్రపంచాధారమై యుండెడి సన్మాత్రమేదియో అదియే ప్రపంచబీజభూత మైన సత్తామాత్ర సూక్ష్మాంశమై యున్నది గనుక ఆ ప్రపంచ మంతయును ఈ యధిష్ఠాన సత్తామాత్రమే స్వరూపముగా గలిగియున్నది అదియే త్రైకాలిక బాధారహిత సత్యస్వరూ పము అదియే అహమాది వృత్త్యుపలక్షిత కేవలాత్మ స్వరూపమై యున్నది ఓ శ్వేతకేతుడా! నీవును ఆ సర్వజగత్కారణత్వాద్యుపలక్షిత ప్రత్యగభిన్నాద్వితీయ బ్రహ్మస్వరూప మాత్రమే అయితివి అని యుద్దాలకుడు శ్వేతకేతుని గూర్చి తత్త్వోపదేశము జేసినవాడాయెను ఈ వాక్యము శ్వేతకేతుడు విని నామరూపక్రియా విభాగము లేక నిర్వికారాసంగచిద్రూపాఖండైక రసమై యుండెడి యధిష్ఠాన సత్తామాత్రస్వరూపమునందు అనేక నామరూపక్రియా సంస్కార వాసనలతో గూడియుండెడి పృథివ్యాదిస్థూలప్రపంచమంతయును అధిష్ఠించి యున్నగని తెలిసి కొనుట దురవగాహమై యున్నందున సంశయము గలవాడై తండ్రిని గూర్చి సర్వజ్ఞులై యుండెడి మీరు నన్ను గూర్చి ఈ యర్థమును వివరణ చేసి విస్పష్టముగా తెలియులాగున, నుదాహరణపూర్వకముగా ననుగ్రహింపవలయును అని ప్రార్థించెను

ఈ వాక్యమును ఉద్దాలకుడు విని ''ఓ శ్వేతకేతుడా! ఆలాగుననే వివరించి చెప్పెద'' నని యంగీకరించినవాడై వక్ష్యమాణప్రకారముగా జెప్పుచున్నాడు

5 ఈ వృక్షమునుండి మఱ్ఱిపండును తీసికొనవలయునని యుద్దాలకు డనుజ్ఞ చేసెను ఓ స్వామీ! ఇదిగో తీసికొంటినని శ్వేతకేతుడు మఱ్ఱిపండు నెత్తినవాడాయెను ఈ ఫలమును పగులగొట్టుమని తండ్రి మఱల నాజ్ఞాపించెను ఓ స్వామీ! ఇదిగో భిన్నము చేయుచున్నానని యా మఱ్ఱి పండున శ్వేతకేతుడు భేదించినవాడాయెను ఈ ఫలములో ఏమి చూచితివి అని యుద్దాలకుడు ప్రశ్న చేసెను ఓ స్వామీ! అణువులవలె సూక్ష్మమై యుండెడి ఈ బీజము లున్నవని శ్వేతకేతుడు చెప్పెను ఓ శ్వేతకేతుడా! ఈ బీజము లోపల ఒక విత్తనమును భిన్నము చేయుమని యుద్దాలకుడు ఆజ్ఞాపించెను ఓ స్వామీ! ఇదుగో భిన్నము చేసితినని శ్వేతకేతుడు ఆ వటబీజమును పగులగొట్టినవాడాయెను ఈ బీజము లోపల ఏమి చూచితివి అని యుద్దాలకుడు ప్రశ్న చేసెను ఓ స్వామీ! ఏమియును గనపడలేదు అని శ్వేతకేతుడు ఉత్తరము చెప్పెను ఆ శ్వేతకేతుని గూర్చి ఉద్దాలకుడు చెప్పుచున్నాడు ''ఓ శ్వేతకేతుడా! ఏ వృక్ష సంబంధమైన యీ బీజ మధ్యము నందు దెలియబడకుండెడి సూక్ష్మ స్వరూపమును నిరూపించి తెలిసికొన లేక పోతివో, ఈ వృక్షముయొక్క ఏ సూక్ష్మాంశము నుండి ఈ ప్రత్యక్ష విషయమయిన అనేక శాఖలతో కూడిన పత్రపుష్ప ఫలావృతమై మహాప్రమాణముగల న్యగ్రోధవృక్షము ఈ ప్రకారము ఉద్భూతమై వృద్ధి పొందుచుండుట అనుభవసిద్ధమైయున్నది గదా!

ఓ శ్వేతకేతుడా! పూర్వమంత్రమున జెప్పిన ప్రకారము వటబీజమునందు సూక్ష్మమై యుండెడి యంకురాది జననశక్తి స్వరూపము దెలియకున్నను ఆ సూక్ష్మ స్వరూపమువలన నుద్భూతమయిన మహాన్యగ్రోధము స్థూలముగా వ్యక్తీభవించినట్లు సర్వజగత్కారణ భూతమయిన సత్తామాత్రమునందు భూత సూక్ష్మాంశము తెలియకుండినను సర్వభూతములయొక్క అహమాది సర్వవృత్తులకును సాక్షిస్వరూపమై యుండెడి ప్రత్యక్ చైతన్యరూపముగా సర్వవ్యాకపకమై స్ఫురించునట్లున్ను తెలిసికొని నిశ్చయమయిన నమ్మకమును బొందవలసినది

ఈ యహమాది సర్వవృత్తులకును సాక్షిస్వరూపమై యంతటను వ్యాపించి యుండెడి స్వరూప మేదియో, అదియే సర్వప్రపంచాధిష్ఠాన సన్మాత్రమై యుండెడి సూక్ష్మాంశమైనది గనుక ఈ సమస్త ప్రపంచమున్ను ఈ సత్తామాత్రమే స్వరూపముగా గలిగియున్నది అదియే ఎప్పటికిన్ని ఏకస్వరూపమై నిత్యముగా నుండెడు సత్యస్వరూపము అదియే అహమాది సర్వవృత్తికి సాక్షియైన ప్రత్యగాత్మ స్వరూపమును అయినది గనుక శ్వేతకేతుడా! సర్వజ్ఞత్వ సర్వకారణత్వాది ధర్మోపలక్షితమైన ఆ సత్తామాత్ర సూక్ష్మాంశ మే, కర్తృత్వాద్యుపలక్షిత నిర్వికార ప్రత్యక్స్వరూప సత్తామాత్రమైన నీవును అయితివి''

ఈ వాక్యమును శ్వేతకేతుడు విని సర్వజగద్బీజభూత సూక్ష్మాంశమును తెలియకుండుటకు నిమిత్తమును తెలియగోరినవాడై ప్రశ్నను చేయుచున్నాడు ''సర్వజ్ఞులైన మీరు నన్ను గూర్చి తిరిగి ఈ యర్థమునే వివరణ చేసి విస్పష్టముగా దెలియులాగున ననుగ్రహింప వలసినది'' అని తండ్రిని గూర్చిప్రశ్న చేసెను ఓ శ్వేతకేతుడా! ఆలాగుననే నీకు విస్పష్టముగా దెలియులాగున నుదాహరణ పూర్వకముగా జెప్పెదనని వక్ష్యమాణ ప్రకారముగ జెప్పుచున్నాడు ''ఈ ఘనీభవించి రాయివలె నుండెడి ఉప్పును ఘటము నందు జేరియుండు ఉదకమునందు వేసియుంచి రేపటి ప్రాతఃకాలములో నాయొక్క సమీపమునకు ఆ లవణోదక ఘటముతో కూడా రావలసినది'' అని తండ్రియైన యుద్దాలకుడు శ్వేతకేతుని కాజ్ఞాపించిన వాడాయెను ఆ శ్వేతకేతుడును ఆ ప్రకారముగానే ఘనీభవించి రాయివలెనుండెడి యుప్పును ఘటోదకమున రాత్రికాలమున నంతయు నుంచి ప్రాతఃకాలమున దీసికొని వచ్చినవాడాయెను ఆ శ్వేతకేతుని జూచి తండ్రియైన యుద్దాలకుడు ''ఓ శ్వేతకేతుడా! రాత్రియందు ఈ ఘటములోని యుదకములో ఏ యుప్పురాతిని వేసి యుంచితివో, ఆ లవణపిండమును తిరిగి తీసికొను''మని చెప్పినవా డాయెను ఆ శ్వేతకేతుడు ఆ ఘటోదకములోని లవణమును హస్తముచేతను, చక్షుస్సు చేతను విమర్శించినవాడై తెలిసికొనలేక పోయెను

ఈ ప్రకారము చూచుటకు, స్పృశించుటకును శక్యముగాకుండిన విషయ

మునందు సంశయించుచుండెడి శ్వేతకేతుని తండ్రియైన యుద్దాలకుడు చూచి ''ఓ శ్వేతకేతుడా! ఏ ప్రకారము దర్శన స్పర్శనములకు శక్యము గాకపోవునో ఆప్రకారము ఈ ఘటోదకమునందు లవణము విలీనమైయున్న'' దని చెప్పినవాడాయెను

ఈ యుదకముయొక్క పైభాగపు జలము దీసికొని పానము చేయవలెనని యాజ్ఞా పింపగా ఆ ప్రకారమే మీది భాగమునందలి జలమును దీసికొని పానము చేయుచుండెడి పుత్రుని గూర్చి ఉదకము ఏలాగుననున్నది అని యుద్దాలకుడు ప్రశ్నము చేసెను ఉప్పుతో కూడియున్నదని శ్వేతకేతు డుత్తరము చెప్పెను ఉదకములోని మధ్యభాగమునందుండి దీసికొని పానము జేయుమని ఆజ్ఞాపించినవాడై యా ప్రకారమే పానము చేయుచుండెడి పుత్రుని గూర్చి ఈ యుదకము ఏ విధముగా నున్నదని తిరిగి ప్రశ్నము చేసెను ఇదియును ఉప్పుతోనే కూడియున్నదని శ్వేతకేతుడుత్తరమును జెప్పెను క్రింది భాగములోని యుదకమును గ్రహించి పానము చేయుమని ఆజ్ఞాపించినవాడై యా ప్రకారమే క్రింది భాగములోని యుదకమును పానము చేయుచుండెడి పుత్రుని గూర్చి ఈ యుదకము ఏ విధముగా నున్నదని యుద్దాలకుడు ప్రశ్నము చేసెను ఇదియును లవణముతోనే కూడియున్నదని శ్వేతకేతుడుత్తరమును జెప్పెను అనంతర ముద్దాలకుడు పుత్రుని గూర్చి ఈ యుదకమును పరిత్యజించి నన్ను గూర్చి సమీపములోనికి వచ్చి నీ యనుభవమును జెప్పవలయునని యాజ్ఞాపించెను ఆ శ్వేతకేతుడును ఆ యుదకమును పరిత్యజించి తండ్రియొక్క ఆజ్ఞప్రకారము వచ్చెను రాత్రియందు తనచేత నీళ్ళలో వేయబడిన యుప్పు ఇప్పటికిని నిత్యముగా ఈ యుదకము లోనే వ్యాపించియున్నదని తనయొక్క యనుభవమును విజ్ఞాపనము చేసెను ఈ ప్రకార ముదకములో సూక్ష్మస్వరూపముగా వ్యాపించి దర్శన స్పర్శనములకు గోచరము గాకుండెడి యుప్పుయొక్క స్వరూపమును జిహ్వాచే గ్రహించి తెలిసికొనిన శ్వేతకేతుని గూర్చి, ''ఓ శ్వేతకేతుడా! ఈ యుదకమునందే సూక్ష్మస్వరూపిగా వ్యాపించియున్న లవణమువలెనే ఈ తేజోభిన్నవికారమైన దేహేంద్రియ సంఘాతములోనే సూక్ష్మముగా వ్యాపించియున్న అధిష్ఠాన సత్తా స్వరూపమును వాఙ్మనస్సులచేత తెలిసికొనలేవు గనుక ఈ యుదకములోని

లవణమును జిహ్వచే తెలిసికొనినట్లు శాస్త్రాచార్యోపదేశ రూపసాధనాంతరముచే దెలియవలసిన'' దని ఉద్దాలకుడు చెప్పినవాడాయెను

6 పూర్వమంత్రమునందు నిరూపింపబడిన ప్రకారము సమస్తప్రపంచమును వ్యాపించియుండి వాఙ్మనస్సులకు గోచరము గాకుండెడు స్వరూపమేదియో అదియే సర్వజగదధిష్ఠాన సత్తామాత్రమైన సూక్ష్మాంశమై యున్నది గనుక ఈ సమస్త ప్రపంచ మును ఈ సత్తామాత్రమే స్వరూపముగా కలిగియున్నది అట్టి సన్మాత్ర సూక్ష్మస్వరూపమే కూటస్థమై నిర్వికారమైన సత్యస్వరూపము ఆ సత్యస్వరూపమే అహమాది వృత్త్యధిష్ఠాన సాక్షిస్వరూపమై యున్నది గనుక ఓ శ్వేతకేతుడా! ఆ సర్వజగ దధిష్ఠాన సత్తామాత్రస్వరూపమై కర్తృత్వాద్యుపలక్షిత విజ్ఞాన సాక్షిస్వరూపమై యుండెడి నీవును అయితివని యుద్దాలకుడు పుత్రునికి బ్రహ్మాత్మతత్త్వమునుపదేశము చేసినవాడాయెను

ఈ వాక్యమును శ్వేతకేతుడు విని పురుషార్థసాధకమైన యద్వితీయ బ్రహ్మతత్త్వసాక్షాత్కార సాధనమును దెలియగా గోరినవాడై తండ్రిని గూర్చి జ్ఞానైశ్వర్య సంపన్నులగు మీరు ఈ విషయమునే నన్ను గూర్చి విస్పష్టముగా దెలియులాగున దృష్టాంత పూర్వకముగా వివరణ జేసి బోధింపవలయును అని విజ్ఞాపన చేసినవాడాయెను ఓ శ్వేతకేతుడా! ఆలాగుననే వివరణ చేసి తత్త్వజ్ఞాన సాధనము నుదాహరణ పూర్వకముగా బోధించెదనని చెప్పినవాడాయెను

''ఓ శ్వేతకేతుడా! ఏ ప్రకారము గాంధార దేశసంబంధి యైన పురుషుని చోరులు పట్టుకొని కన్నులు కనబడకుండ నంటగట్టి పాశబద్ధునిగా జేసి గాంధారదేశములోనుండి తీసికొనివచ్చి ఆ పురుషుని ఆ దేశమున కతిదూరమై యుండెడి జనరహితమైన యరణ్య ప్రదేశమునందు విడిచిపెట్టు టెట్లో, ఆ ప్రకారముగా గన్నులు కట్టి యరణ్యములో విడువబడిన పురుషు డేప్రకార మా యరణ్యములో తూర్పుదిక్కునకు అభిముఖుడై గాని, ఉత్తరాభిముఖుడైగాని, పశ్చిమాభిముఖుడైగాని, లోకమును గూర్చి నేను చోరులచే కన్నులు గట్టి బంధింపబడినవాడనై యీ యరణ్య ప్రదేశమునందు ప్రవేశింపజేయబడిన వాడనయితినని దీనుడై విశేషధ్వనితో నరచుచుండుట యును ఏ ప్రకారమో, ఆ

ప్రకారము కన్నులు గట్టి యరణ్యమునందు ప్రవేశింప బడి నందున దిగ్భ్రమ నొంది దీనుడై సమస్త దిక్కులను గూర్చి యఱచుచుండెడి వానికి దొంగలచే గట్టబడియుండెడి బంధమును వదలించి తీసి వేసి దిక్కులను జూపించి ఈ దిక్కున గాంధారదేశమున్నది ఈ దిక్కును గూర్చి, ఈ మార్గము ననుసరించి వెళ్ళవలసినదని ఈలాగున అప్పుడు చెప్పుటయును, ఆ ప్రకారము బంధమువల్ల విడువబడి మార్గోపదేశము చేయబడిన పురుషుడు ఒక గ్రామమునుండి మఱియొక గ్రామమును అడుగుచున్నవాడై చెప్పబడిన వాక్యమును గ్రహించుట యందు శక్తి గలిగిన వాడును, వస్తుస్వరూపమును మననము చేసి మార్గమును నిశ్చయించుకొనుటకు సమర్థమైన బుద్ధిగలవాడున్నునై తనయొక్క నివాసభూతమై యుండెడి గాంధారదేశమును గూర్చియే పొందినవాడై శ్రమను పోగొట్టుకొని సుఖించుటయును నేప్రకారమో, ఈ ప్రకారముగానే ఈ లోకమునందు పూర్వకృత సుకృత దుష్కృతముల వాసనలచే బద్ధుడై స్వరూపవిజ్ఞానము లేక కర్తృత్వాదికమునందు అభినివేశము గలుగుటవలన జననమరణ సుఖదుఃఖాద్యనేకానర్థములను బొందుచున్న సమయములో సుకృత విశేషముచే పరమకారుణికుడై యుండెడి యాచార్యునివలన నుపదిష్టుడై వస్తుస్వరూప విచారణ చేసి తత్త్వజ్ఞాననిష్ఠ గలిగియుండెడి పురుషుడు అద్వితీయ బ్రహ్మాత్మతత్త్వమును దెలిసికొని కృతార్థుడగుచున్నాడు ఆ ప్రకారము గురూపదిష్ట మహావాక్య విచారణవలన దృఢాపరోక్ష జ్ఞానము గలిగియుండెడి పురుషునికి ఎంత పర్యన్తము పూర్వకర్మారబ్ధమైన దేహవియోగము గలుగకుండునో, అంతపర్యన్తమే విదేహముక్తి గలుగుటకు ఆలస్యమై యుండును ప్రారబ్ధకర్మక్షయమువలన దేహేంద్రియాది కార్య కరణ వియోగము సంభవించినతోడనే అద్వితీయ బ్రహ్మస్వరూప సంప్రాప్తి గలిగి విదేహముక్తుడగుచున్నాడు అని యుద్దాలకుడు శ్వేతకేతునికి తత్త్వజ్ఞాన సాధనోపదేశము చేసినవా డాయెను

7 పూర్వమంత్రమున శాస్త్రాచార్యోపదేశ మూలముగానే తెలియదగి యున్నట్లు ఏ స్వరూపము నిరూపింపబడియున్నదో అదియే సర్వజగదధిష్ఠాన సత్తామాత్ర బ్రహ్మస్వరూపమై యుండెడి సూక్ష్మాంశమైయున్నది గనుక ఈ ప్రత్యక్షాది విషయమై యుండెడి ప్రపంచమంతయును ఈ సత్తామాత్రమే

స్వరూపముగా గలిగి యున్నది అదియే కూటస్థ నిత్యమై యుండెడి యబాధిత సత్యస్వరూపము అదియే అహమాది వృత్త్యధిష్ఠానమైయుండెడి ప్రత్యక్స్వరూపమును నయినది గనుక ఓ శ్వేతకేతుడా! ఆ సర్వజగదధిష్ఠాన సన్మాత్రబ్రహ్మస్వరూపమే కర్తృత్వాద్యుపహిత విజ్ఞాన సాక్షిస్వరూపమైన నీవును అయితివని యుద్దాలకుడు బ్రహ్మాత్మతత్త్వ స్వరూపము నుపదేశించిన వాడాయెను ఈ శ్వేతకేతుడు విని యే యాచార్యోపదేశము వలన నేక్రమముగా బ్రహ్మప్రాప్తి గలుగునో, అట్టి క్రమమును దెలియగోరినవాడై తండ్రిని గూర్చి సర్వజ్ఞులైన మీరలు తిరిగి యీ విషయమునే నన్ను గూర్చి యుదాహరణపూర్వకముగా నన్నను గ్రహింపవలయును అని విజ్ఞాపనమును జేసెను ఓ శ్వేతకేతుడా! ఆ ప్రకారముగానే వివరణ జేసి చెప్పెదనని ఉద్దాలకు డంగీకారవాక్యమును జెప్పినవాడాయెను

''ఓ శ్వేతకేతుడా! మరణసూచకమైన జ్వరాదిసంతాపముతో గూడియున్న పురుషుని గూర్చి సోదరులు మొదలయిన బన్ధువులందఱును గలిసి నీకు సోదరుడనై యుండెడి నన్ను తెలిసికొనుచున్నావా! నీకు పుత్రుడనై యున్న నన్ను తెలిసికొనుచున్నావా! అని ప్రశ్నము చేయుచు చుట్టుకొని కూర్చుండియుందురు ఆ జ్వరాది సంతాపముతో గూడిన పురుషునియొక్క వాక్కు మొదలుగాగల బాహ్యేన్ద్రియములు అంతఃకరణమైన మనస్సు నందును, అట్టి మనస్సు ముఖ్యప్రాణమునందును, ఆ ముఖ్యప్రాణము ఔష్ణ్యరూపముగా శరీరమంతయును వ్యాపించియుండెడి తేజస్సునందును, ఆ శరీరమును వ్యాపించి యుండెడి యుష్ణరూపమైన తేజస్సు దేహేన్ద్రియములకంటే వేఱుగా కేవల స్వప్రకాశ సత్తామాత్రమై యుండెడి యధిష్ఠాన చైతన్యస్వరూపమునందును, ఎంతకాలమువఱకు లీనమై యేకీభవింపకుండునో, అంత పర్యన్తమును సమీపమునందుండెడి వారిని ఆ పురుషు డాయావృత్తి విషయముగా దెలిసికొనుచుండును

అనంతరము ఎప్పుడు వాగాది బాహ్యేన్ద్రియములు మనస్సునందును, మనస్సు అనెడి అంతరిన్ద్రియము ముఖ్య ప్రాణమునందును, ఆ ప్రాణము సర్వశరీరమును వ్యాపించి యుండెడి యుష్ణమను తేజస్సునందును, అట్టి తేజస్సు

దేహేంద్రియ విలక్షణమై సర్వవృత్త్యధిష్ఠాన సాక్షిస్వరూపమైయుండెడి కేవల స్వప్రకాశాత్మ చైతన్యమునందును లయమును బొంది యేకీభవించుచున్నదో ఆ సమయమునందు దేహసంబంధుల నభిమానించి తెలిసికొనుట సంభవింపదు

8 ఈ సర్వేంద్రియ వృత్తి లయాధిష్ఠానమైన దేవతాస్వరూపమేదియో అదియే సర్వజగత్కారణత్వోప లక్షితసత్తామాత్రమైన సూక్ష్మాంశమైయున్నది ఈ ప్రపంచమంతయును ఈ సత్తామాత్ర సూక్ష్మాంశమే స్వరూపముగా గలిగియున్నది అదియే అబాధిత నిత్యస్వరూపమును, అదియే అహమాది వృత్త్యధిష్ఠాన ప్రత్యగాత్మ స్వరూపమునయి యున్నది గనుక ఓ శ్వేతకేతుడా! ఆ సత్తామాత్ర బ్రహ్మస్వరూపమే కర్తృత్వ భోక్తృత్వ ధర్మోపలక్షిత జీవాధిష్ఠానమైన నీవును అయితివి అని తండ్రియైన యుద్దాలకుడు శ్వేతకేతునికి ఆత్మతత్త్వమును బోధించినవాడాయెను

ఈ వాక్యమును విని యీ ప్రకారము వాగాది సర్వవృత్తులును సన్మాత్రమునందు లయించుట జ్ఞానికిని అజ్ఞానికిని సమమైయుండగా జ్ఞానికి పునరావృత్తి లేకుండుటకును, అజ్ఞాని తిరిగి దేహాంతరమును బొందుటకును నిమిత్తమును దెలియ గోరినవాడై జ్ఞానైశ్వర్య సంపన్నులయిన మీరు మఱల నీ విషయమునే నన్ను గూర్చి విస్పష్టముగా దెలియులాగున బోధింపవలయును అని శ్వేతకేతుడు తండ్రిని అడిగినవాడాయెను తండ్రియైన యుద్దాలకు డీవాక్యమును విని ఓ శ్వేతకేతుడా! ఆ ప్రకారముగానే చెప్పెదనని యనుగ్రహించిన వాడాయెను

''ఓ శ్వేతకేతుడా! పరునియొక్క ధనమును దొంగతనముగా హరించినాడను సందేహమునకు పాత్రుడైన పురుషుని పట్టుకొని పరద్రవ్యమును హరించినవాడనియు, దొంగతనము చేసియున్నాడనియు ప్రకటన చేయుచు హస్తములను బంధించియును రాజుయొక్క సమీపమునకు తీసికొని వచ్చినవారైరి ఆ రాజును నీప్రకారము సందేహించుట కర్హుడై యుండెడి వానిని జూచి స్వరూపమును బరీక్ష చేయు నిమిత్తమై ఇతని కొఱకు ఇనుపముద్దను అగ్నితో గాల్చి యంటింపవలసి నదనియును, ఆ పురుషుడు ఆ దొంగతనముయొక్క విషయమున చేసినవాడై యుండియు చేయలే దని చెప్పినవాడాయెనేని ఆ

హేతువువలననే తనయొక్క స్వరూపమును అనృతముతో సంబంధించియున్న దానినిగా చేసిన వాడగును వాడబద్ధమునం దభినివేశము గలవాడు గనుకనే తాను సంకల్పించియుండెడి యనృతముచేత స్వస్వరూపమును చుట్టబడి యున్నట్టు చేసికొనినవాడై అగ్నిచే సంతప్తమై యుండెడి లోహపిండమును హస్తముచే గ్రహించినవాడగును ఇందువలన ఆ పురుషుడు దహింపబడును ఆలాగున దహింప బడుటతోనే హననము మొదలయిన శిక్షలకు బాత్రుడగును అని రాజుచే ఆజ్ఞాపింపబడును అనంతరము పూర్వమంత్రమున జెప్పబడిన ప్రకారముగాక ఆ దొంగతనము యొక్క విషయమును చేయకుండినవాడు అయినట్లాయెనేని, ఆ హేతువువలన తన స్వరూపమును సత్యముతో సంబంధించిన దానినిగానే చేసికొనెను ఆ పురుషుడు సత్యమునందు అభినివేశము గలవాడు గనుకనే సత్యముతో స్వస్వరూపమును ఆవరణ యుక్తముగా జేసికొని కాలవేయబడితప్తమైన లోహపిండమును చేతితో బట్టినవాడగును ఆ పురుషుడు ఈ ప్రకారము తప్తమైన లోహపిండమును బట్టినవాడైనను దహింపబడడు అందువలన విడువబడ వలయునని యాజ్ఞాపించును

ఆ ప్రకారము దొంగతనము చేసినాడను సంశయముతో పట్టువడియున్న పురుషుడు రాజుచే నియమింపబడిన తప్తపరశు గ్రహణ పరీక్షా విషయమున దొంగ తనము చేసి చేయ లేదని చెప్పినవాడు దహింపబడినందున శిక్షాపాత్రుడైనను, దొంగతనము చేయక నిజము చెప్పినవాడు సత్యవ్యవహితుడైనందున ఏ ప్రకారము దహింపబడక విడువబడెనో, యా ప్రకారము సర్వజగదధిష్ఠాన సద్రూప బ్రహ్మాభిన్నాత్మ జ్ఞానము గలవాడు సత్యస్వరూపుడై నందున ముక్తుడగుచున్నాడు అనృతమైన దేహాదులయందు ఆత్మబుద్ధి గలవాడు అనృతస్వరూపుడైనందున దేహాంతరమును బొందుటయును సంభావితమై యున్నది ఈ ప్రపంచమంతయును అధిష్ఠాన సన్మాత్ర బ్రహ్మస్వరూపమే యాత్మగా గలిగియున్నది ఆ సన్మాత్ర బ్రహ్మస్వరూపమే అబాధిత నిత్యస్వరూపము అదియే అహమాది వృత్త్యధిష్ఠాన సాక్షియైన ప్రత్యగాత్మయును నయినది ఓ శ్వేతకేతుడా! ఆ సకల జగదధిష్ఠాన సత్తామాత్ర బ్రహ్మస్వరూపమే నీవును అయితివి అని బ్రహ్మతత్త్వమును

బోధించినవాడాయెను ఈ యుద్దాలకుని యొక్క ''తత్త్వమసి'' అను మహావాక్యోపదేశము ద్వారా తొమ్మిది పర్యాయ ములు దృష్టాంతములతో నిరూపింపబడియుండెడి సన్మాత్ర బ్రహ్మాభిన్నాత్మ తత్త్వమును శ్వేతకేతుడు తెలిసికొనినవాడాయెను

ఈ ''తత్త్వమసి'' మహావాక్యబోధను వినుచుండగా నస్తమయమైనది గూడ వారు దెలియక పోయిరి ఆశ్రమ సంరక్షకుడగు సాధు పురుషుడు దీపము తెచ్చినపుడు చీక టైనదని తెలిసికొని యా దినము బోధను నిలిపిరి పిమ్మట శ్రీ తరిగొండ వెంక మాంబగారి తపోవన మందుండు పరమభక్తురాండ్రతో గూడ భారతీదేవియు, శ్రీచెల్లాయమ్మగారును వెళ్ళిపోయిరి ఆ దినము జరిగిన బోధసారము తత్త్వమసి బోధనవాక్య మర్థమగుటచే నెల్లరును ఆజ్ఞేయైక స్వరూపమునందే యుండిరి గురువరుడును స్నానమొనర్చుటకు వెళ్లిరి ఆ దినము బోధలు వినిన బ్రహ్మనిష్ఠ రాండ్రగు నారీమణులందఱు రాత్రి యీలాగున నాలోచించుకొనిరి శ్రీ భారతీదేవిగా రుండుపఱకే మన కిట్టి బోధ వినుట కవకాశము గలదు కావున రేపు ప్రాతఃకాలమున వారి వారి యనుష్ఠాన ములు పూర్తి జేసికొని వెళ్ళవలయునని నిశ్చయించుకొనిరి అయినను మధ్యాహ్నము వఱకు గురువరుడు బయటకు రానందున భోజన మొనర్చి వెళ్ళుదమని నిశ్చయించి మధ్యాహ్నము మూడవ యామమునకు ముందుగానే భక్తితో నా వధూమణు లెల్లరు గోగర్భా శ్రమమునకు వచ్చిరి ఆ దినము ఆహారముయొక్క విషయమై బోధ జెప్పందొడగిరి

గురు – ఆత్మసోదరియగు చెల్లాయమ్మగారూ! భారతీదేవియొక్క భోజనాది కృత్యము లెట్లుండును?

చె – గురువరా! మామూలుగా నందఱివలె ఒక కూరతో నొకపూట మాత్ర మాహారమును స్వీకరింతురు అది సాత్త్వికాహారముగా నుండును

గురు – ఏమీ? పాలు, పండ్లు దొరకవా?

చె – అనేక భక్తురాండ్రు పాలు, పండ్లు తెచ్చెదరు మేము గూడ క్షీరపాన

ఫల భక్షణములు ఋషులకు తగినవని చెప్పుచుండెదము అయినను భారతీదేవిగారు వాటిని దీసికొనుట అస్వతంత్రమనియు, పరాధీనత యనియు చెప్పుదురు ఏలననగా అంతట నవి దొరకవు అందుచే దానికొఱకు కొంత శ్రమపడవలసియుండును ఎవరికిని కష్టము లేనిది, యెచ్చటనైనను దొరుకునదిగా నుండు వస్తువు మాత్రము శుద్ధముగానుండిన చాలునని చెప్పుచుందురు

*కృతే త్వస్థిగతాః ప్రాణాః త్రేతాయాం మాంసమాశ్రితాః ।*
*ద్వాపరే రుధిరం చైవ కలౌ త్వన్నాదిషు స్థితాః ॥*

కృతయుగంబున ప్రాణములు శల్యగతములై యుండును త్రేతాయుగమునందు ప్రాణములు మాంసము నాశ్రయించియుండును ద్వాపరయుగమునందు రక్తము నాశ్ర యించి ప్రాణములు నిలిచి యుండును కలియుగమునం దన్నాదికము నాశ్రయించి ప్రాణములు దేహమునందు నిలిచియుండును అని చెప్పుచు మేమందఱమేది భుజించుదుమో దానినే భుజించెదరు ఎన్ని సామానులను భారతీదేవి దర్శనమునకు వచ్చెడివారు తెచ్చినను, వాటిని ముట్టక మేమిచ్చినది దీసికొని మాతో గూడ భారతీదేవిగారు, రత్నమాంబగారును ఆశ్రమ కార్యములను నిర్వహించుచుందురు తమ బోధలు విన్నవారు సత్యమునుండి తప్పెదరా? అభిమానము గలిగియుందురా? అని చెప్పెను

గురు – తల్లులారా! మూడు విధములగు తపస్సులు గలవు 1 దేహతపస్సు,2 వాక్తపస్సు, 3 మానసికతపస్సు – ఇట్లని శ్రీకృష్ణుడు గీతయందు దెలిపిరి అదియే సరియైన పద్ధతి దేహతపస్సుచే శరీరమందుగల విషయాదిదోషములన్నియు నశించును వాక్తపస్సుచే వాక్శుద్ధిగల్గి, చెప్పిన వాక్యములన్నియు ఫలించును మానసికతపస్సుచే హృదయము శుద్ధ మగును అప్పుడట్టివారి సంకల్పములన్నియు ఫలించును మూడద్దములు, లేక గ్లాసులుగల దానిలోపల వెలుగుచుండు ప్రకాశమంతయు వెలుగవలసియుండినచో మూడద్దములును శుద్ధముగా నుండవలయును అట్లే వాఙ్మనోదేహములకు విలక్షణమైన ఆత్మజ్యోతి వెలుగవలయునన్నచో నీ మూడు తపస్సులును గలిగియుండవలయును ధ్యానముచే

మనశ్శుద్ధియు, దివ్యమంత్రపఠనముచేతను, గీతాపారాయణమువలనను, సత్యముతోను, శాంతముతోను మాట్లాడుటవలనను, వాక్శుద్ధియు గలుగును ఆశ్రమకార్యము, అతిథిసేవ, గురు కార్యప్రవర్తన, వీటివలన దేహశుద్ధియు గలుగును కొందఱు ధ్యానము మాత్రమే చేయుదురు మఱికొందరు స్మరణ, కీర్తన, జపాదులనే యాచరింతురు ఇక కొంద ఱెప్పుడును సత్కర్మలను మాత్రము చేయుచుందురు వీరల కొక యంగము మాత్రము శుద్ధమగును సమయానుకూలముగ మూడింటిని చేయువారు త్రికాలములయందును శుద్ధాంతఃకరణులై యుందురు

**దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్ ।**
**బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥**

దైవముయొక్కయు, బ్రహ్మనిష్ఠులయొక్కయు, దేశికుడు మొదలగు గురువుల యొక్కయు, తత్త్వజ్ఞానులయొక్కయు సేవ జేయుటయు, బాహ్యాభ్యంతరశుద్ధియు, త్రికరణముల యేకత్వ ప్రవర్తనయు, బ్రహ్మచర్య వ్రతమును, ప్రాణులను దుఃఖపెట్ట కుండుటయు శరీరముచే చేయదగిన తపస్సని చెప్పబడును

**అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥**

ప్రాణులకు దుఃఖమును గలుగజేయనిదియును, యథార్థమును, వినువారికి ప్రియమైనదియు, హితమైనదియునగు మాటయును, ఉపనిషద్గీతాద్యధ్యయనము నేది గలదో, అయ్యది వాక్కుచేత చేయదగిన తపస్సనంబడును

***మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః ।***
***భావ సంశుద్ధిరిత్యేతత్తపో మానస ముచ్యతే ॥***

మనస్సుయొక్క స్వచ్ఛతయు, ప్రసన్నభావమును, మౌనమును (మననమును) మనో నిగ్రహమును, భావశుద్ధియునను నివి మనస్సంబంధమైన తపస్సని చెప్పబడినది

*మితాశనో భవేన్నిత్యం భిక్షు ర్మోక్షపరాయణః ।*
*కామ క్రోధాదయో దోషా న భవన్తి మితాశనాత్ ॥*

మోక్షాపేక్షగలవాడు నిత్యము మితాహారియై యుండవలయును ఎందుకనగా మితాహారముచే కామక్రోధాదు లనెడి యరిషడ్వర్గములును, ఆలస్యము, చపల స్వభావము మొదలైన సమస్త దోషములును నశించును

# అధ్యారోపము

గురు – అధ్యారోపాపవాదములను శ్రవణము చేసిన మాత్రమే దృశ్యభ్రాన్తి నశించును యోగసమాధిలో నంతయు నొక సద్వస్తువు, బ్రహ్మవస్తువనెడి బోధ కలిగినను, విచారణజ్ఞానము లేనిచో నిది యుక్తియుక్తముగ మఱియొకఱికి బోధింప నలవి కాదు మండుచుండెడు నగ్నికి గాలి యెంత సహాయమో ఆలాగున యాత్మజ్ఞాన ధ్యానమునకు వేదాంత శాస్త్రవిచారణయు నటువంటిది బాగుగా నెండనటువంటి కట్టెలైనను గాలి యుండినచో త్వరలో కాలిపోవును ఆలాగున పూర్ణపరిపక్వము కాని యంతఃకరణమై యున్నప్పటికిని శాస్త్రవిచారణచే నది త్వరలో శుద్ధమగును అయితే గాలి మాత్రముండినను నిప్పులేనిచో నెంత యెండిన కట్టెలైనను కాలవు ఆ రీతిగ నధ్యాత్మ శాస్త్రవిచారణ యను పవన వేగముండినను, పరబ్రహ్మస్వరూప ధ్యానమను నగ్ని యుండవలయును గొప్ప ఋషులందఱికి ధ్యాన, జ్ఞానములు రెండును ఉండెను ''అధ్యారోపాఽపవాదాభ్యాం నిష్ప్రపంచః ప్రపంచ్యతే''

అధ్యారోప అపవాదము లనెడు రెండు దోషముల వలన నిష్ప్రపంచమై దైవమయముగా నుండెడు సద్వస్తువునందు ప్రపంచము కల్పింపబడుచున్నది ఈ రెండు దోషములు మంచి బ్రహ్మనిష్ఠుడగు గురువు కడ బాగుగా శ్రవణమును జేయుటవలనే నశించును కావుననే, గురుధ్యానములో,

*అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।*
*చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥*

అని చెప్పుటకు కారణము దీని యర్థ మింతకు పూర్వము వ్రాయబడినది అధ్యారోప మనగా నొక వస్తువును జూచి మఱియొక వస్తువుగా భ్రమించుట అది యెటువలెననగా శుక్తియందు రజతాధ్యారోపము, రజ్జువునందు సర్పాధ్యారోపము, స్థాణువునందు పురుషాధ్యారోపము, మరుమరీచికలయందు జలాధ్యారోపము, ఆకాశమునందు నీలత్వాధ్యారోపము ఇవి యెటులనో అటులనే నిష్ప్రపంచ స్వరూపమైన యాత్మయందు ప్రపంచముయొక్క యారోపము అధ్యారోపము ఈ యధ్యారోప మధిష్ఠానాజ్ఞానముచేత నేతెంచినది ఆ యజ్ఞానముయొక్క స్వరూపమును సంక్షేపముగా నిచ్చట నిరూపించితిమి

ఇక అపవాదమును గురించి తెలిపెద అపవాదమనగా కారణ వ్యతిరిక్తముగ కార్యము లేదని యెఱుగుట అది యేలాగుననగా మృత్తువలన బుట్టిన ఘటశరావాదులు మృద్వ్యతిరిక్తములెట్లు కావో, స్వర్ణజనితములగు కటక, మకుటాదులు స్వర్ణవ్యతిరిక్తములెట్లు గావో, ఇనుమువలన బుట్టిన ఖడ్గ శరాదులు ఇనుముకంటె వ్యతిరిక్తమెట్లు గావో, అదే రీతిగ పంచలోహములచే నిర్మింపబడిన స్త్రీ పురుష, ఆంజనేయ, నందికేశ్వర, ఆది శేషాది విగ్రహములు పంచలోహముల కన్యములుగా నెట్లు కాజాలవో, అటులనే యాత్మవలన బుట్టిన ప్రపంచమాత్మ వ్యతిరిక్తము గాదని యెఱుగుట ఇది బాహ్యదృష్టి గలవారికి వివిధములుగా కనబడినను, మంచితత్త్వ విచారణచే నాత్మదృష్టి గలవారికి మాత్రము కల్పితమని తోచును జగత్తుయొక్క స్వభావము నీలాగున నుండును కావున భారతీదేవీ! ఇదివఱలో మీకు గలిగియుండిన దృశ్య భ్రాంతి శాస్త్రవిచారణ లేనందుచే గలిగినదేగాని మఱి యొకటి గాదు మీరును బ్రహ్మ నిష్ఠచే పరిపక్వస్థితి గలిగిన వారే శుకబ్రహ్మర్షి కేలాగున బ్రహ్మవిషయమై యనుభవము గలిగి యుండినను సందేహముచేత బాధితుడై, జనకునియొక్క యుపదేశమువలన సంశయ నివృత్తి గలిగి ధన్యుడై పూర్ణబ్రహ్మయై ఆనందభరితుడై యుండెనో, మీయొక్క స్థితియును అటువంటిదే

ఇంకను పంచ భ్రమలను గుఱించి అన్నపూర్ణోపనిషత్తు నందు ఋభు, నిదాఘ సంవాదమును దెలిపెద ఈ విచారములన్నియు చాల గొప్ప - చెప్పినట్లు

విని దృశ్యభావనను మఱల ఆత్మలోనికి రానీయకుండునట్లు జూడవలయును దీనిని కేవలము గ్రహించినచాలదు దానిని ధరింపవలయును అట్లు ధరించుటవలనను పూర్తి కానేరదు మఱల విమర్శింప వలయును అప్పుడే బుద్ధి శుద్ధమైన దానియొక్క లక్షణమై యుండును కొందఱికి గ్రహణశక్తి యుండును కాని ధారణా శక్తి యుండదు మరికొందరికి నీ గ్రహణధారణ శక్తులుండినను మఱల విమర్శించి బోధించెడు శక్తియుండదు ఇట్టి లోపము జన్మాంతరములో నేదైన కర్మదోషముండుట చేతనే గలుగును ఆలాగున వైరాగ్య, బోధ, ఉపరతులు మూడును గలుగునపుడే పూర్ణబ్రహ్మానుభవము గలుగును అయితే కొందఱికి వైరాగ్యముండును కాని యుపరతి గలుగదు మఱికొందఱికి నీవైరాగ్యోపరతు లుండినను బోధము ( ఆత్మ జ్ఞానము) ఉండదు ఇదియును జన్మాంతర దురిత విశేషమువలననే గలిగి యుండును దానియొక్క నివృత్తికొఱకు తపోధ్యాన మననాదులు చిరకాల మేకాంతమున మంచి వ్రతనిష్ఠగలవారై యభ్యసింప వలయును ఈ విషయము ప్రశ్నోత్తర రమాణిక్యమాల యందు వ్రాయబడి యున్నది సూర్యుండేవిధముగ భూమిలోగల జలమును, కిరణములచే నాకర్షించి మేఘముగ నిలిపి మఱల శుద్ధజలముగా జేసి ప్రపంచములో వర్షించుచుండునో, ఆలాగున ముముక్షువు శాస్త్రములలో గల కర్మకాండను తిలకించి, జ్ఞానసారమును గ్రహించి ఆత్మలో నిదిధ్యాసనముల నిలిపి మఱల ప్రపంచమున బోధించవలయును ఈ మూడు గుణములును గొప్పతపస్సువలనను దైవాను గ్రహమువలననే జీవులకు గలుగును

## —: పంచ భ్రమ నివృత్తి :-

*నిదాఘో నామ యోగీంద్రో ఋభుం బ్రహ్మవిదాం వరమ్ ।*
*ప్రణమ్య దండవద్భూమావుత్థాయ స పునర్మునిః ॥*

*ఆత్మతత్త్వమనుబ్రూహీత్యేవం పప్రచ్ఛ సాదరమ్ ।*
*కయోపాసనయా బ్రహ్మన్నీదృశం ప్రాప్తవానసి ॥*

*తాం మే బ్రూహి మహావిద్యాం మోక్షసామ్రాజ్యదాయినీమ్ ।*

*నిదాఘ త్వం కృతార్థోఽసి శృణు విద్యాం సనాతనీమ్ ॥*
*యస్యా విజ్ఞానమాత్రేణ జీవన్ముక్తో భవిష్యసి ।*

నిదాఘుడను విఖ్యాత మగు పేరుగల యోగీంద్రుడు బ్రహ్మవేత్తలలో వరిష్ఠుడగు ఋభువును దండమువలె పడి నమస్కరించి చేమోడ్చి యీలాగున ప్రార్థించెను మిక్కిలివినయముతో నాత్మతత్త్వము ననుగ్రహించవలయునని యడిగెను ''హే! బ్రహ్మన్! ఏయుపాసనవలన నిట్టి బ్రహ్మత్త్వమును తాము పొందియున్నారు, మోక్షసామ్రాజ్యము నొసంగునదియును, మహావిద్యయునగు దానిని నాకు నుపదేశింపు''మని నిదాఘుడు నిండు వినయముతో జెప్పిన వాక్యమును విని ఋభు మహర్షి ''ఋషిసత్తమా! నీవు కృతార్థుడవైతివి సనాతనమగు నీ బ్రహ్మవిద్యను వినుము ఈ ఉపనిషద్విద్యయొక్క విజ్ఞానము వలన నీవు జీవన్ముక్తి పదవిని పొందగలవు

*భ్రమః పంచవిధో భాతి తదేవేహ సముచ్యతే ।*
*జీవేశ్వరౌ భిన్నరూపావితి ప్రాథమికో భ్రమః ॥*

*ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వా ద్వితీయకః ।*
*శరీరత్రయ సంయుక్త జీవ స్సంగీ తృతీయకః ॥*

*జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః ।*
*కారణాద్భిన్నజగతః సత్యత్వం పంచమో భ్రమః ॥*

(1) ప్రత్యగాత్మ వేఱు, పరమాత్మ వేఱు అని యనుకొనుట ప్రథమభ్రమయన బడును (2) ఆత్మయందు ప్రతీయమానమగు కర్తృత్వాదులు వాస్తవముగ ఆత్మవే యని యనుకొనుట ద్వితీయ భ్రమ యనబడును (3) శరీరత్రయమునకు విలక్షణు డగు నాత్మకు శరీరత్రయముతో సంబంధము గలదని యనుకొనుట తృతీయభ్రమ యనంబడును (4) జగత్కారణమగు బ్రహ్మమునకు షడ్భావవికారము లున్నవి యని తలంచుట చతుర్థ భ్రమ యనబడును (5) కారణము ( బ్రహ్మము) కంటె భిన్నమగు కల్పిత ప్రపంచము సత్యమని యనుకొనుట పంచమభ్రమ యనబడును ఈ పంచభ్రమలయొక్క నివృత్తి యెట్లనగా!

*బింబ ప్రతిబింపదర్శనేన భేదభ్రమో నివృత్తః ।*
*స్ఫటికలోహిత దర్శనేన పారమార్థికకర్తృత్వభ్రమో నివృత్తః ॥*

*ఘటమఠాకాశదర్శనేన సంగీతిభ్రమో నివృత్తః ।*
*కనకరుచకదర్శనేన వికారిత్వ భ్రమో నివృత్తః ॥*
*రజ్జుసర్పదర్శనేన కారణాద్భిన్నజగతః సత్యత్వభ్రమో నివృత్తః ॥*

దర్పణమందలి ముఖప్రతిబింబము తన ముఖముకంటె భిన్నము కాదని తెలియుటవలన ప్రథమభ్రమ నివృత్తి యగును లేక సూర్యునకును సూర్యబింబమునకును అనేక పాత్రలయందు ప్రతిబింబించి యుండు ప్రతిబింబమునకును భేదము లేదని తెలిసికొనుట,2 శుద్ధమగు స్ఫటికమునకు రక్తకాంతిగల పుష్పాదుల చేరికవలన స్ఫటిక మందు తోచెడి రక్తత్వము నిజము కాదని గ్రహించుటచే రెండవభ్రమ నివృత్తి యగును (3) ఘట మఠాదుల యందుండు ఆకాశము మహాకాశముకంటె భిన్నము గాదని తెలియుటవలన మూడవ భ్రమ నివృత్తి యగును 4 సువర్ణమునకును, ఆభరణములకును కల్పితమగు భేదభ్రాంతియు, మనః కల్పితమగు గంధర్వనగరమువలెనే భ్రమ మూలమగు దృశ్యప్రపంచము సత్యము కాదని యెఱుగుటవలన నాల్గవభ్రమ నివృత్తి యగును 5 రజ్జువునందు భ్రమచే కల్పింపబడిన సర్పము మిథ్యయై కారణమగు రజ్జువుమాత్రము సత్యమైనటుల జగత్కారణమగు బ్రహ్మము నిర్వికారి యనెడు జ్ఞానమువలన నైదవ భ్రాంతి నివృత్తి యగును

*తదాప్రభృతి మచ్చిత్తం బ్రహ్మాకారమభూత్స్వయమ్ ।*
*నిదాఘ ! త్వమపీత్థం హి తత్త్వజ్ఞానమవాప్నుహి ॥*

ఋభుమహర్షి నిదాఘునితో నివ్విధంబున వచించెను "ఓ నిదాఘమునీ! పై జెప్పిన పంచభ్రమనివృత్తివలన నప్పటినుండి నా మనస్సు బ్రహ్మాకారవృత్తిని పొందెను ఆలాగుననే నీవును బ్రహ్మ సాక్షాత్కార తత్త్వజ్ఞానమును బడయుము" మని వచించి మౌన ముద్రయందుండి పోయెను అపుడు నిదాఘుడును వాచామగోచరమగు బ్రహ్మ ముయొక్క సాక్షాత్కారమును గ్రహించి ఋభువువలె బ్రహ్మాకారస్థితిని పొందెను

ఓమ్ తత్ సత్, భారతీదేవీ! ఇప్పుడు ప్రపంచమున నచల సంప్రదాయమున నీ ఋభు నిదాఘ భావమునే చెప్పుచుందురు ఋభుగీతయే వారికి ముఖ్యప్రమాణము దీనిని గ్రహించినచో నద్వైతమగు బ్రహ్మాకారస్థితిని పొందుటయే ముక్తి యని తెలియగలదు ఇంకను వేదాంత శాస్త్రములో ముఖ్యమై ప్రాణము వంటిదగు లక్షణావృత్తిని తెలిపెద ఈ భావమును బాగుగ గ్రహించిన మాత్రమే జీవబ్రహ్మల యేకత్వవిషయమందుగల సందేహము నివృత్తి యగుః

## -: ల క్ష ణా వృ త్తి :-

'త్వం' పదార్థము జీవుడు, తత్పదార్థ మీశ్వరుడు అని యనుట యా రెంటియొక్క ఐక్యార్థము త్వంపదార్థమైన జీవునియొక్క స్వరూప మెయ్యదనిన? అవిద్యయు, అధిష్ఠాన చైతన్యంబును, దానియందు కల్పితమైన లింగ శరీరమును, లింగ శరీరంబునందు ప్రతిఫలించిన చిదాభాసుడును, చిదాభాసునియొక్క ధర్మంబులైన కించిద్జ్ఞత్వ, కర్తృత్వ, భోక్తృత్వాదులును గూడి త్వంపదార్థ భూతుడైన జీవునియొక్క స్వరూపము తత్పదా ర్థమైన యీశ్వరుని యొక్క స్వరూపమేది యనిన! మాయయు, మాయాధిష్ఠాన బ్రహ్మ చైతన్యంబు, ఆతని ధర్మంబులైన సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వాది గుణంబులును గూడి తత్పదార్థ భూతుడైన యీశ్వరుని యొక్క స్వరూపము అని అనగా జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడని ఐక్యార్థము ఈ ప్రకారముగా నుపదేశించుటలో కించిద్జ్ఞత్వాది గుణంబులతో గూడుకొనిన జీవునికిని, సర్వజ్ఞత్వాది గుణంబులతో గూడిన యీశ్వరునకును ఐక్య మెట్లు గలుగును? ఈ విరుద్ధార్థమును శ్రుతులెట్లు బోధించుచున్నవి యని సంశయము గలుగును ఈ వాక్యమునకు లక్ష్యార్థమనియు, వాచ్యార్థమనియు నర్థములు రెండు తెఱంగులు వాచ్యార్థమంగీకరించినచో నెక్కడ ప్రత్యక్షవిరుద్ధముండునో, అచట లక్ష్యార్థ మంగీకరింపదగినది అట్లు కాగా నీ మహా వాక్యమందీ లక్షణచేత నైక్యము బోధింపబడు చున్నది లక్షణ ఎన్ని విధములనిన 1 జహల్లక్షణ, 2 అజహల్లక్షణ, 3 జహదజహల్లక్షణయని మూడు విధములు

అనగా (1 విడిచిన లక్షణ, 2 విడువని లక్షణ, 3 విడిచి విడువని లక్షణ) ఒక బ్రాహ్మణుడు గంగాతీరంబు నందుండి వచ్చెనేని యతనిం జూచి మఱియొక బ్రాహ్మణుడు గంగాతీరమందు విశేషంబు లేమియని ప్రశ్నింపనతడు "గంగాయాం ఘోషః" అనగా గంగయందు గొల్లపల్లె యున్నదని చెప్పెను ఈ మాటకు దాత్పర్యమేమి యనిన గంగయను పదమునకు ప్రవాహార్థము గనుక నా ప్రవాహమందు గొల్లపల్లె యున్న దని యంగీకరించినచో ప్రత్యక్షవిరోధము కనుక గంగ యను పదంబునకర్థమైన ప్రవాహమును సర్వాత్మనా విడిచి యా గంగయొక్క గట్టునందు గొల్లపల్లె యున్నదని తాత్పర్యము జేసికొనవలయును ఇది జహల్లక్షణ ఇటువలె మహావాక్యమునందును జహ ల్లక్షణను జెప్పుదు మనిన గూడదు అది యెట్లనిన! త్వం పదార్థమైన కూటస్థ చైతన్య పర్యంతంబును విడిచి పెట్టినచో ముముక్షువుల యొక్క స్వరూపమే లేక పోవుచున్నది కావున ప్రత్యక్షవిరోధము గనుక యీ జహల్లక్షణ కూడదు ఏ లక్షణ చేత నీ వాక్యము బ్రహ్మజ్ఞానమును బోధించుచున్నదనిన! అన్నమయ కోశము మొదలుకొని ఆనందమయ కోశ పర్యన్తంబును, పరబ్రహ్మమని చెప్పెడి వాక్యమందు జడమైన కోశంబులు బ్రహ్మ మని చెప్పకూడదు కనుక వాటిని విడచి వాటికి నధిష్ఠాన భూతమైన చైతన్యంబునకే తాత్పర్యమును జెప్పవలెను ఇది యిప్పుడు జహల్లక్షణ

"అజహల్లక్షణ" అనగా "మంచాః క్రోశన్తి" అనువాక్యమందు మంచములు అరచుచు న్నవని చెప్పిన యెడల నది ప్రత్యక్ష విరోధము కనుక మంచములను విడువకయే మంచముమీద పురుషులు కూతలు పెట్టుచున్నారని "అజహల్లక్షణ" చేత తాత్పర్యము నిర్ణయింప దగినది అటువలనే వేదమందు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనెడి మహావాక్యంబునకు ఆ వాక్యమందానందమయకోశముతో గూడనుండు ఆత్మను జెప్పుచున్నారు కనుక సచ్చిదానందంబులను విడవకనే యానందమయకోశమును జెప్పుచున్నది ఈ యర్థము మహావాక్య మందంగీకరింతమనిన కించిజ్ఞత్వాది గుణము లతో గూడుకొనిన చైతన్యమే జీవుడు గనుక గుణవిశిష్టుడైన వాని కైక్యంబు చెప్పగూడదు కాబట్టి యిచ్చట "అజహల్లక్షణ" కూడదు

జహదజహల్లక్షణ యనగా''సోఽయం దేవదత్తః'' అనెడి వాక్యంబున గంగాతీరమందు నైదవయేట బ్రహ్మచారిగా నుండెడు దేవదత్తుని జూచితిమి ఆ దేవదత్తుని రామేశ్వరమందు ఏబదవయేట సన్న్యాసాశ్రమమును గ్రహించిన వానినిగా జూచితిమనే వ్యవహారమందు, ఆదేశము, కాలము ఆశ్రమము, వాటితో కూడిన పురుషుడు ఈ దేశము, కాలము ఆశ్రమంబులు వీటితోగూడుకొనిన పురుషుడేనని వాక్యార్థము నంగీకరించితివేని బహువిరోధమున్నది అదియెటులనగా గంగాతీరము రామేశ్వరము గాదు రామేశ్వరము గంగాతీరము కాదు ఆకాల మీ కాలముకాదు ఈ కాల మాకాలము కాదు ఆ వయస్సు ఈ వయస్సు కాదు ఈ వయస్సు ఆ వయస్సు గాదు ఈ అశ్రమమా యాశ్రమము గాదు కాబట్టి ప్రమాణాంతరమైన ప్రత్యక్షమునకు విరుద్ధమై యున్నది కనుక వాచ్యార్థమైన తద్దేశ, తత్కాల తదాశ్రమంబులను, ఏతద్దేశ ఏతత్కాల ఏతదాశ్రమంబులను, విడిచి లక్ష్యభూతుడైన దేవదత్తుడే వాచ్యార్థముగ నూహింపవలయును

మహావాక్యమందును తత్పదార్థంబగు వాచ్యార్థంబైన మాయా ప్రతిబింబ సర్వజ్ఞత్వాది గుణంబులకును, త్వం పదార్థమునకు వాచ్యార్థమైన యవిద్యా ప్రతిబింబ చిదాభాసునకును, వానియొక్క గుణంబులైన కించిత్ జ్ఞత్వాదులకును అన్యోన్యము ఐక్య మంగీకరించిన పక్షమందు ప్రత్యక్షవిరోధమైనను, మాయా సర్వజ్ఞత్వాది గుణంబు లను, అవిద్యాకించిజ్ఞ త్వాది గుణంబులను త్రోసివేసి లక్ష్యభూతమైన చైతన్యమాత్రమును బట్టి యా సచ్చిదానందబ్రహ్మమే నీవు నీవే యా సచ్చిదానంద బ్రహ్మము అని జహ దజహల్లక్షణచే మహావాక్యము బోధింపబడుచున్నది కనుక నీవే బ్రహ్మము సంశయంబు లేదు ఇది యారోహణ అవరోహణ లనంబడును ఉత్సవమునకు ధ్వజారోహణము గలిగియుండిన నుత్సవము జరుగుచున్నదని గ్రహింపవలయును అట్లే సాంఖ్య విచారణచే సాక్షిత్వము గలుగుటయు, యోగసమాధిచే తురీయత్వము సిద్ధించుటయు, బ్రహ్మవిషయోత్సవమున ధ్వజారోహణము మాత్రము గలిగినట్లు నిశ్చయించుకొన వలయును దీనికే యధ్యారోప మని పేరు ధ్వజావరోహణము గలుగునపుడే యుత్సవము పూర్తియైనట్లును, అవభృథ స్నానమును జేసినట్లును, తురీయాత్మయగు బ్రహ్మమందు నీ జగత్తు కల్పితమని తలంచి,

బ్రహ్మజ్ఞానాపారావారజ్ఞాన స్నానమాచరించి నపుడే బ్రహ్మ విషయోత్సవము పూర్తియై నట్లును, అవభృధ స్నానమును జేసినటులను గ్రహించవలయును అపుడే యీ జీవికి కృతకృత్యత్వము గలుగును అపుడు కృతార్థుడ గును ఆ కృతార్థత్వము గలుగువఱకు ధ్యాన మనన నిది ధ్యాసనముల జేయుచుండ వలయును

*క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే ।*
*సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః ॥*

క్షీరమందు క్షీరమును, తైలమందు తైలమును, జలమందు జలమును గలిసి యేకమగునట్లు ఆత్మవేత్తయగు యోగి యాత్మయందే విలీనమై యాత్మయే యగును

*సద్ఘనం చిద్ఘనం నిత్య మానందఘన మక్రియమ్ ।*
*ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన ॥*

ఆ యద్వితీయ బ్రహ్మస్వరూప మెట్టిదనగా సర్వదా సద్రూపము ఏకరస చైతన్య రూపము త్రికాలాబాధ్యమగు ఆనందస్వరూపము క్రియా రహితము అది తప్ప కొంచమైనను రెండవ వస్తువు లేదు

## సంశయత్రయ వివరణము

భారతీదేవీ! సంశయత్రయు వివరణము జెప్పెద దీనిని బాగుగా దెలిసికొనినచో నింక దృశ్యమును గుఱించిన భయము గాని, సందేహము గాని గలుగదు

1 సంశయము, 2 అసంభావన, 3 విపరీతభావన ఈ మూడును సంశయ త్రయ మనబడును సంశయమనగా ఒక వస్తువునందు విరుద్ధవస్తుద్వయ జ్ఞానము అనగా ఇది స్థాణువో లేక పురుషుడో యని తలంచెడి చిత్తవృత్తి సంశయము, 2 అసంభావన ఇచ్చట స్థాణు వుండవలసిన పని ఏమి? స్థాణు వుండనేరదే యని తలంచెడి చిత్తవృత్తి యసంభావన యనంబడును 3 విపరీత భావన ఒక వస్తువునందు గల నైజమును కాదని తలంచుట విపరీతమనంబడును

మఱియు నీ చెప్పబడిన సంశయ, అసంభావన, విపరీతము లొక్కొ కటి రెండేసి విధములుగా నున్నవి వానిని చక్కగా దెలిపెద సావధానచిత్తము గలిగి యేకాగ్రమగు మనస్సుతో వినవలయును ఇచ్చటనే ప్రకృతి జీవులను మోసము జేయుచుండును 1 ప్రమాణగత సంశయమనియు, 2 ప్రమేయగత సంశయమనియు, 3 ప్రమాణగత అసంభావనయనియు, 4 ప్రమేయగత అసంభావనయనియు, 5 ప్రమాణ గత విపరీతభావన యనియు, 6 ప్రమేయగత విపరీతభావన యనియు నొక్కొకటి రెండేసి విధములుగా జెప్పబడినది ప్రమాణగత సంశయమనగా వేదములు కర్మను ప్రతిపాదించుచున్నవా? లేక విశిష్టమైన ప్రత్య గ్బ్రహ్మమును ప్రతిపాదించుచున్నవా? అని వచ్చెడు సంశయము ప్రమేయగత సంశయమనగా జగత్కారణవస్తువు బ్రహ్మమా? లేక ప్రధానమా? అనగా ప్రకృతియా? అని వచ్చెడు సంశయము ప్రమాణగత అసంభావన యనగా బ్రహ్మము శుద్ధవస్తువు గనుక ప్రమాణాంతరముచేత పృధివ్యాదులవలె నెఱుగబడుచున్నది కాన శ్రుతులు ఆ శుద్ధ బ్రహ్మమును జగత్కారణ మని యెటుల ప్రతిపాదించును? ప్రతిపాదింపనేరవు అనెడి చిత్తవృత్తి ప్రమాణగత అసంభావన యగును ప్రమేయగత అసంభావనయనగా జగత్తుకంటె బ్రహ్మము విలక్షణమై యున్నది గాన జగత్కారణమని చెప్పగూడదు ప్రధానాదులే జగత్కారణమనెడి చిత్తవృత్తి ప్రమేయగత అసంభావన యనబడును ప్రమాణ గత విపరీత భావనయనగా। బ్రహ్మము శుద్ధవస్తువు గనుక శ్రుతులకు శుద్ధబ్రహ్మమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము ( అధికారము లేక ప్రామాణ్యము) లేదు శ్రుతులు శుద్ధబ్రహ్మను ప్రతి పాదించినట్లయితే పరమపురుషునికి వృత్తిని గానము కనుక ప్రయోజనము లేకపోవును లోకమందు ప్రవృత్తి పూర్వకముగానే పురుషార్థము కనబడును అనెడి చిత్తవృత్తి ప్రమాణగత విపరీత భావన యగును ప్రమేయగత విపరీతభావన యనగా। అశుద్ధ్యాది వికారములతో గూడుకొని యుండెడు జగత్తునకు కారణమైన బ్రహ్మంబు అశుద్ధ్యాదులతో గూడుకొని యుండవలెను కాని అటులుండ లేదు కావున ప్రధానాదులే జగత్తునకు కారణమని బుద్ధియందు దోచుటే ప్రమేయగత విపరీతభావన యనంబడును

# త్రి పు టి రా హి త్య ము

భారతీదేవీ! ఇక త్రిపుటిరాహిత్యరహస్యము దెలియవలయును బాలుడు రాత్రులలో దీపము దగ్గఱనుండు తన నీడను జూచి భేతాళమని భయపడుచందంబున, యాత్మవిచారణ లేని జీవులు ఆత్మకన్యముగ జగత్తు గలదను భ్రాంతిచే మీవలె సంకట పడుచుందురు వివేకముగలవాడు నీడ, తనకంటె భిన్నముగాదని తలంచునట్లు వివేకజ్ఞానముగలవాడు ఆత్మకన్యముగ (ఈశ్వరునకు) జగత్తు లేదని తలంచును ద్రష్ట, దర్శనము, దృశ్యము ఈమూడును కూడినదానికి త్రిపుటియని పేరు దీనియొక్క రాహిత్యమే మోక్షమని చెప్పినచో ద్రష్టయగు ప్రత్యగాత్మకూడ నశించిపోవలసియుండును ''ప్రజ్ఞానం బ్రహ్మ'' అను మహావాక్యమునకే హాని గలుగును అంతే గాక ముముక్షువుయొక్క స్వరూపజ్ఞానమే నశించును స్వరూపజ్ఞానమే లేనియెడల మఱల మోక్షప్రాప్తి యెవరికని ప్రశ్న గలుగును ఇచ్చట స్వరూప జ్ఞానమనగా నంతఃకరణ విశిష్టబ్రహ్మచైతన్యమని గ్రహించవలయును అంతఃకరణ మాలిన్యముతో గూడిన బ్రహ్మచైతన్య మశుద్ధ చైతన్యమనబడును అట్టి యశుద్ధ చైతన్యమును నిర్మూలింపవలయునని గ్రహించవలయును మఱియు దృశ్యమున్నపుడే దర్శనముండును ఈ రెండును లేనపుడు ద్రష్టకు దృశ్యదర్శనము లుండవు అపుడు ''ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన'' అను శ్రుతి బోధక తత్త్వ మవగాహనమగును అపుడు త్రిపుటి యను వ్యవహారమాత్మకు గలుగదు

త్రిపుటిని గుఱించి వేదాంత పరిభాషయందు నిరూపించి నది చూడుడు

బ్రహ్మ త్రిపుటి – ద్రష్ట– అంతఃకరణోపాధియైన జీవచైతన్యము

దృక్కు – త్వక్చక్షు శ్రోత్రజిహ్వాఘ్రాణంబులు

దృశ్యము – శబ్ద స్పర్శ రూపరస గంధములు

అంతర త్రిపుటి – ద్రష్ట– నిర్మలాంతఃకరణమైన మనస్సునందుండు శుద్ధ సత్త్వోపాధికుడైన జీవచైతన్యము

దృక్కు – సగుణ బ్రహ్మసాక్షాత్కారమునకు సాధకమైన శుద్ధ మనస్సునందు జన్మించిన బుద్ధివృత్తి యనెడు జ్ఞానము

దృశ్యము – ఉపాస్యుడైన సగుణ బ్రహ్మము

అంతరాంతర త్రిపుటి – ద్రష్ట– కేవలము నిరుపాధికుడై వ్యష్టిభావమును పొందిన శుద్ధ జీవాత్మ

దృక్కు – నిర్వృత్తికమైన స్వరూపోపాధి యగు ఆత్మజ్ఞానమునందు వ్యష్టి సమష్టి భావమును గలుగ జేసి బ్రహ్మస్వరూపమునకు, జీవాత్మకు సమష్టియైన భిన్నముగాని వ్యష్టి యైన పరమాత్మను ప్రత్యక్షముగ జేయునట్టి జ్ఞానము

దృశ్యము – బాహ్యోపాధి లేక కేవలము స్వరూపోపాధియు లేక కేవలము స్వరూపో పాధి చేత నిర్గుణ బ్రహ్మమునందే వ్యష్టిసమష్టి భావముదయమై తదుపరి సమష్టియైన శుద్ధ బ్రహ్మమునందే దార్ఢ్యము గలుగునట్టి స్థితి

## త్రి పు టి ర హ స్య ము

బాహ్య త్రిపుటియందు ద్రష్టృ దర్శన దృగ్విచారమును, ఆంతర త్రిపుటియందు వికల్పసమాధియును, అంతరాంతర త్రిపుటియందు నిర్వికల్ప సమాధియును గలుగుచున్నవి

మఱియొక విధము, బాహ్య త్రిపుటియందు ప్రపంచవిచారమును, ఆంతర త్రిపుటియందు సగుణబ్రహ్మవిచారమును, అంతరాంతర త్రిపుటియందు నిర్గుణ బ్రహ్మ విచారమును గలుగుచున్నవి

ద్రష్ట – త్వంపద లక్ష్యభూతుడైన ప్రత్యగాత్మ

దృశ్యము – తత్పద లక్ష్యభూతుడైన పరమాత్మ

దృక్కు – ప్రత్యగాత్మ పరమాత్మలనైక్యముజేయునట్టి జీవాత్మ

***జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదః పరే నాత్మని విద్యతే ।***
***చిదానందైక రూపత్వాద్దీప్యతే స్వయమేవ తత్ ॥***

జ్ఞానస్వరూపిగాను, ఆనంద స్వరూపిగాను, ఏకస్వరూపిగాను నుండుటవలన పరమాత్మయందు జ్ఞాతయొక్కయు, జ్ఞానముయొక్కయు, జ్ఞేయముయొక్కయు వ్యత్యాసము లేదు ఆ యాత్మ తనకుతానే ప్రకాశించుచున్నది ఇది యనుభవము గలుగుట కెట్లుండవలయునో యా విధానము జెప్పబడుచున్నది

*వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేంద్రియః ।*
*భావయే దేక మాత్మానం తమనంతమనన్యధీః ॥*

ఏకాంతప్రదేశమున సిద్ధాసనుడై సమస్త సంకల్పములను వర్జించి, యింద్రియ ములను, యింద్రియార్థ విషయములందు ప్రవేశింపకుండ నణచి, మనస్సును చలింపకుండ ఆత్మయందుంచి ఆ యాత్మ తానని చింతింపవలయును

*ఏవం నిరంతరం కృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।*
*హరత్యవిద్యా విక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥*

సర్వోత్తమమైన యౌషధమును సేవించుటవలన రోగములు నశించునటుల, ఎల్లపుడును తాను బ్రహ్మయే, కాని బ్రహ్మ వ్యతిరిక్తుడను కాను అని యభ్యాసమును జేయుటవలన కలిగిన సంస్కారరూపమైన సద్వాసన, ఆవరణ విక్షేపశక్త్యాత్మకమైన యవిద్యను బొత్తుగా పోగొట్టునని దృఢముగా నమ్మవలయును

*ఆత్మన్యేవాఖిలం దృశ్యం ప్రవిలాప్య ధియా సుధీః ।*
*భావయేదేక మాత్మానం నిర్మలాకాశవత్సదా ॥*

సమస్తమైన కనుపించెడి ప్రపంచమును పరిశుద్ధాంతఃకరణముగలవాడు కామక్రోధాది రహితమైన బుద్ధిచేత సత్యజ్ఞానానందస్వరూపమగు తన యాత్మయందు లయింపజేసి యొక్కటైన యాత్మను స్వచ్ఛమైన యాకాశమువలెనే యెల్లపుడును తానే యని ధ్యానించవలయును అని యాత్మ బోధయందు శ్రీశంకరు లుపదేశించి యున్నారు భారతీదేవీ! దృశ్యముచే గలిగిన భీతి యిపుడు తొలగినదని తలంచు చున్నాను మఱియు పూర్ణబ్రహ్మ సాక్షాత్కార స్థితి గలిగినట్లు తలంచుచున్నాను శత్రురాజ్యముచే గలిగిన భయము నశించినటువంటి యేకచ్ఛత్రాధిపతివలె నిర్భయత్వము సిద్ధించినట్లు నిశ్చయించుచున్నాను

శ్రుతియొక్క శిరస్సగు నుపనిషత్తు చెప్పిన ''ఏకమేవాద్వితీయం బ్రహ్మ'' అనెడి యవస్థను నిస్సంశయముగ బొందినట్లు నిశ్చయించుకొన్నాను దృశ్యరహితమగు బ్రహ్మాత్మాకార స్థితి గలిగి శోకరహితానంద ప్రాప్తిగలిగినట్లు దలంచుచున్నాను ఇక మీ కేమైన సందేహము గలదా? అని యడుగగా

భారతి – అజ్ఞానతిమిర భాస్కరండవగు నో పరమగురువరా! తమ దివ్య ప్రకాశోప దేశముచే సూర్యోదయమున చీకటియు, మంచును నశించునట్లు నా సందేహ వ్యాకులతా తిమిరపటలము లన్నియు నశించినవి తమ తేజోమయ బోధచే నా యజ్ఞానారణ్యమంతయు భస్మమైపోయినది కారణగురువరా! తమ యమోఘ బోధయగు ప్రచండవాయువుచే నాహృదయాకాశమున, కలకాలముండిన సందేహ మను నీలమేఘ మంతయు తొలగినది అని భక్తిపరవశురాలై, యానందభరితురాలై భారతీదేవి చెప్పిన వాక్యమును విని దేశికేంద్రుండగు గురువు– ''తల్లీ! వైద్యుడు రోగముతోనుండి యారోగ్య స్థితికి వచ్చినవారిని గురించి మీరోగములన్నియు నశించినవా? ఇక నేదైన బాధ గలదా? రోగముచే గలిగెడు దుఃఖములన్నియు శమించి యారోగ్యము గలిగి సుఖముగా నుంటున్నారా? అని యడుగునట్లు భవరోగవైద్యుడును అజ్ఞాన రోగనివృత్తు డగు ముక్తాత్ముని గురించి యడుగును శ్రీకృష్ణ భగవాను డీలాగున నర్జుననుద్దేశించి యడిగియున్నాడు

*ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా ।*
*విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥*

ఈ ప్రకారముగ గోప్యమునకంటె నతిగోప్యమగు ఆత్మజ్ఞానము నీకు నేను చెప్పితిని ఈ గీతా శాస్త్రమును సమస్తమును చక్కగా నాలోచించి, యే ప్రకారముగా నిశ్చయించుచున్నావో యాలాగున చేయుము ఇదే శాస్త్రపద్ధతియొక్క స్వరూపము కట్టకడకు శ్రీకృష్ణభగవానుడును ఫలాపేక్షనుద్దేశింపక ఉపదేశించిన సత్యము నిచట తెలుపడమైనది ఇది యథార్థమైన నిష్కామకర్మ యోగముయొక్క తత్త్వము

*కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా ।*
*కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ! ॥*

ఓ అర్జునుడా! నేను చెప్పిన దానిని ఏకాగ్రచిత్తముతో వింటివా? అజ్ఞానమువలన గలిగిన మోహము నశించెనా? అని శ్రీకృష్ణభగవానుం డడిగెను – దీనియందు ''ప్రణష్టస్తే'' పాఠాంతరమున ''వినష్టస్తే'' అని గలదు దానివలన నిశ్శేషముగ నజ్ఞానము నశించినదా? అని ద్యోతకమగుచున్నది ఇది యుత్తమోత్తముడైన గురువు చేయవలసిన ధర్మము

*నష్టో మోహస్స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత! ।*
*స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ ॥*

ఓ శ్రీకృష్ణా! నీ యనుగ్రహముచే యజ్ఞానమువలన గలిగిన భ్రాంతి నశించినది నాచేత ఆత్మతత్త్వ విషయమగు జ్ఞానము పొందబడినది నశించిన సందేహము గలవాడనై సుస్థిరముగా నున్నాను నీయొక్క వాక్యము ననుష్ఠించెదను

ఇచ్చట నిజమైన గురుభక్తిగల శిష్యునియొక్క లక్షణము నిరూపించడమైనది కనుకనే ''కరిష్యే వచనం తవ'' మీ యుత్తరువు ప్రకారము చేసెదనని చెప్పుటలో తాను జేయవలసిన దేమి లేదనియు, కృతకృత్యుడైనట్లును దెలియదగినది అయితే కృతార్థు డనైతిని ఇక నేను జేయవలసిన దేమియు లేదు వెళ్ళుచున్నానని కృతఘ్నతా వాక్యమును జెప్పక కృతజ్ఞతగలవాడై గురువరా! తామేమి యాజ్ఞాపింతురో నేనాలాగున చేయుదునని అతిపవిత్ర మగు విశ్వాసము చూపడమైనది యోగవాసిష్ఠమున శ్రీవసిష్ఠమునీంద్రుడు శ్రీరామ చంద్రునకు ఆత్మతత్త్వ జ్ఞానమును సంపూర్ణముగ నుపదేశించి అమనస్కస్థితిని గలుగజేసిన పిమ్మట నీ గీతయందు కృష్ణపరమాత్మ అర్జునునకు జెప్పిన రీతిగ కొన్ని శ్లోకముల జెప్పెను దానికి ప్రత్యుత్తరముగ నిచ్చట అర్జునుడు చెప్పిన రీతిగనే కొన్ని శ్లోకములను శ్రీరామ చంద్రుడు చెప్పెను దీనికిని దానికిని కొన్ని పదములలో మాత్రము కొంత మార్పు గలదేగాని భావములన్నియు నొకేవిధముగ నుంటున్నవి దీనివలన యోగవాసిష్ఠానంతర మీ గీతాశాస్త్ర ముపదేశింపబడినట్లు స్పష్టమగుచున్నది కావుననే వైరాగ్య ప్రకరణమున అంత అతీత వైరాగ్యమును దెలిపిన శ్రీరామచంద్రుడు గురుడగు శ్రీవసిష్ఠుని యాజ్ఞ నుల్లంఘింప జాలక గృహస్థాశ్రమమునం దుండెను నిమిత్తమాత్రమునకు రాజ్యమునం దుండినను,

గురువుయొక్క బోధను మరువక కర్తృత్వము లేక ధర్మకార్యములను విడువక రాజ్యమును పాలించెను అంత్యకాలమున అయోధ్యయందుండు జను లందఱితో గూడ తారకబ్రహ్మమూర్తియగు శ్రీరామచంద్రుడు సరయూ నదిలో మునిగి తన నిజధామ మగు శ్రీవైకుంఠమునకు వేంచేసెను ఈలాగున జనకుడు యాజ్ఞవల్క్యమహర్షి వలన నాత్మతత్త్వోపదేశమును బొంది గురుదక్షిణగా రాజ్యమును సమర్పింపగా యాజ్ఞ వల్క్యుడు ఇకమీద నీ మిథిలానగరము నీది కాదు ఇక మీద దీనిని గురువుయొక్క సొమ్ముగా భావించి గురువు బోధించిన లక్ష్యమునుండి మనస్సును చలింపనీయక ధర్మముగ రాజ్యమును పాలింపుమని వచించి తిరుగ రాజ్యము నిచ్చినట్లు బృహదారణ్యకోపనిషత్తునందు గలదు

ఇదే రీతిగ కలియుగమునందు గూడ శ్రీసమర్థరామదాసు శివాజీ చక్రవర్తికి బ్రహ్మజ్ఞానము నుపదేశింపగా ఆనందభరితుడై తనను తన దేహసంబంధులగు పుత్ర దారాదులను, తన రాజ్యమును గూడ వారి చరణములందు దానము జేసి జలము విడిచినట్లు దాసబోధ యందు గలదు అప్పుడు సమర్థ రామదాసుగారు గూడ యాజ్ఞ వల్క్యమునివలె నిక రాజ్యము నీది గాదు శ్రీగురువరుని రాజ్యముగా దలంచవలసినది కాని నేనేకాంతముగ నిరంతరము ధ్యానములో నుండువాడను ఈ రాజ్యమును పాలించుట కొఱకు మరియొకరు కావలయును ఇతరుల కిచ్చినచో దయా దాక్షిణ్యములు గలిగి పాలించరేమో? కావున నో శివాజీ! తామే యీ రాజ్యము నేలుచు ప్రజలను పీడింపక లక్ష్యము మరువకుండుమని యాశీర్వదించి మఱల రాజ్యమునిచ్చినట్లును తరువాత శివాజీ తన ధ్వజమును, కాషాయ వస్త్రముగా జేసినట్లును చరిత్ర గలదు కావుననే యిపుడుగూడ మహారాష్ట్రదేశీయులు శ్రీపండరీపుర భజన సంఘములో గూడ కాషాయరంగుగల జెండాలను పట్టుకొందురు

మఱియు శ్రీరామకృష్ణ పరమహంస శ్రీవివేకానందస్వామికి నిర్వికల్ప సమాధిస్థితిని గలుగ జేసిన తదుపరి, వివేకానందులు ఎల్లపుడు నిట్టి సమాధిలోనే తనకుండుటకు ప్రీతి గలుగుచున్నదనియు, కావున నేకాంతమునకు వెళ్ళతలంచు చున్నాననియు జెప్పగా శ్రీరామకృష్ణపరమహంసగా రిప్పటి నుండి యెల్లవుడును

సమాధిలో నుండినచో,ఏ ముక్తి గలుగునో, అది నేను జెప్పెడు లోకోద్ధారక కార్యముల జేయుచుండినప్పటికిని అంత్యకాలమున గలుగునని బోధించినట్లు చరిత్రయందు గలదు అందువలననే గురువాక్యమును శిరసావహించి శ్రీవివేకానందులు ఈ ప్రపంచ మందంత టను నాత్మతత్త్వ మును ప్రబోధించుచు అంత్యకాలమువఱకు నొక క్షణకాలమునైనను వ్యర్థ పుచ్చక గురుకార్యములో కాలము గడపిరి కావుననే వివేకానందస్వామి యంత్యకాలమున కేవలము ఆత్మబోధ గలవాడై యేలాటి బాధలు గలుగక నందఱును వినేలాగున సిద్ధాసనాసీనుడై యోంకారము నుచ్చరించి భౌతిక దేహమును విడిచి పర బ్రహ్మాకార స్థితిని పొందెను గురువాక్యములయందు గల విశ్వాసమీలాగున నుండును జనకున కమనస్కతత్త్వమును బోధించిన యష్టావక్రమునీంద్రుడును నీలాగున వచించియున్నాడు

*మోక్షో విషయ వైరస్యం బంధో వైషయికో రసః ।*
*ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥ (అష్టావక్రగీత)*

ఓ జనక మహారాజా! సమస్త విషయములనుండి విడుదల పొందుటయే మోక్షము విషయములందు గల యాసక్తియే బంధము ఇదియే నీవు శాస్త్రములచేతను మహాత్ముల చేతను, తీక్ష్ణమగు నిర్మలమైన బుద్ధిచేతను గ్రహింపదగినది అటుపైన నీ యిష్టమేలాగున యున్నదో, యాలాగునచేయుము కావుననే ''యథేచ్ఛసి తథాకురు'' అని చెప్పడమైనది ఇందువలనను యథార్థమగు నిష్కామముయొక్క స్వరూపము నష్టావక్ర మునీంద్రుడు చూపెను అట్లు గానిచో శిష్యుడు యోగ్యుడు కాకపోయినను, మోక్షప్రాప్తి నొందక పోయినను గురువునకు క్లేశము గలుగును దుష్టపుత్రుని వలన సంసారబద్ధులగు గృహస్థులు క్లేశమును బొందునట్లు గురువులు గూడ క్లేశమును పొందవలసియుందురు గీతలో కృష్ణభగవాను డర్జునునితో ''యథేచ్ఛసి తథా కురు'' అని వచించినను ''విమృశ్యైతదశేషేణ'' అను వాక్యములో గొప్పసార మిమిడియున్నది దానివలన తొందరపడకుము దీర్ఘముగ పలు సార్లాలోచించుకొని తరువాత ఇష్టమేలా గున నుండునో, ఆలాగున జేయుమనియెడి యగాధార్థమిమిడియున్నది చెప్పినవాడు

శ్రీ కృష్ణుడు వినినవాడు అర్జునుడు చెప్పినవాడు శ్రీ వసిష్ఠుడు వినినవాడు శ్రీ రామచంద్రుడు చెప్పినవాడు శ్రీసమర్థరామదాసు వినినవాడు శ్రీశివాజీచక్రవర్తి చెప్పినవా డష్టావక్రమునీంద్రుడు వినినవాడు జనకభూపాలుడు ఇందువలన పూర్వము బ్రహ్మవిద్యయొక్క గొప్పతనము ఎట్లుండి యుండెనో యాలోచించుకొనవలయును మరియు,

భారతీదేవీగారూ! ఇక నేదైన సంశయమున్నచో నడుగవచ్చును

భారతి – బాలుడు దీపకాంతిలో తన నీడను జూచి భేతాళమని భయపడును పెద్దవారెవరును నీడను జూచి భయపడరు ఆలాగున నెవరును ఆత్మబోధను గుఱించి బోధించువారు లేనందుచే తన కన్యముగ దృశ్యమొకటి గలదని తలంచి విచారణ లేనందుచే చాల భయమును పొందితిని తా మపార దయతో నిన్నిరోజులు సహన మొనర్చి బోధన జేసినందుచే నా యొక్క యబోధకమగు బాల్యము నశించి స్వబోధ మనెడి యౌవనము వచ్చినది ఇపు డాభయమంతయు తొలగినది

గురు – ఇట్టి యధ్యాత్మబోధమునకే వేదాంతములో అధ్యారోపాపవాదమని పేరు గలదు ఈ విషయమునే రజ్జుసర్పన్యాయమనియు, మరుమరీచికా న్యాయ మనియు, స్థాణుపురుష న్యాయమనియు జెప్పుదురు

*అజ్ఞానా ద్భాసతే సర్వం త్వయి రజ్జౌ భుజంగవత్ ।*
*ప్రజ్ఞానా ల్లీయతే సర్వం త్వయి రజ్జౌ భుజంగవత్ ॥*

యథార్థజ్ఞాన విచారణను జేయనందుచేత రజ్జువునందు సర్పప్రతీతి గలుగుచున్నది చక్కగా విచారణ జ్ఞానము గలిగినపుడు రజ్జువునందు సర్పము త్రికాలములయందును లేనట్లు బోధ గలుగుచున్నది ఇదే వేదాంతముయొక్క రహస్యము కారుచీకటిలో నుండువారికి త్రాడు కనుపించనందుచే సర్పభయము గలుగదు సూర్యుడుదయించి ప్రకాశము గలిగిన త్రాడును జూచి సర్పభయము గలుగదు అయితే యెప్పుడు గలుగును? మందప్రకాశకాలమగు నరుణోదయ మందును, సూర్యుండస్తమించి చీకటి దట్టముగ గలుగుటకు మధ్య

ప్రదోషసమయమునందును గలుగును ఆలాగున కేవల మజ్ఞానదశలో నుండువారికి భవదుఃఖము దెలియదు బాగుగ జ్ఞానోదయము గలిగిన వారికిని సంసార భయముండదు మధ్యస్థితిలో నుండు వారగు ముముక్షువులకును, జిజ్ఞాసులకును మాత్రమే భవభీతి గలుగును వీరు మధ్య స్థితిలో నుండువారు కాని యరుణోదయమందే భ్రాంతి యుండును ఆ యరుణోదయము కాగానే సూర్యోదయమగును ఆలాగున ముముక్షుత్వ దశలో గల సందేహములన్నియు ముక్తావస్థలో దొలగును ఇక ఎక్కువ కాలమా మంద ప్రకాశము నిలువదు కావున నిపు డుపదేశింప బడిన మహావాక్యములను, ఈ శ్రవణమాత్ర ముచే తృప్తి నొందక మనన నిదిధ్యాసనల కొంతకాలము ఏకాంతముగా నుండి చేయవలయును ఏలననగా? విషము, అగ్నియు, అవిద్యయు, ఋణము, వ్రణము ఈ యైదును కొంచమైనను శేషించి యుండరాదు విషము కొంచము శేషించియుండినను అపాయమును తప్పక గలుగ జేయును కావున,

*అహం బ్రహ్మాస్మి వాక్యోఽయం యావత్కాలం దృఢం భవేత్ ।*
*శమాదిసహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥*

ఎంత కాలమువఱకు ''అహం బ్రహ్మాస్మి'' యను మహావాక్య దృఢానుభవము గలుగ లేదో, అంతవఱకు శ్రవణ, మనన, నిదిధ్యాసనములను మఱల మఱల చేయవలయును

*తావదేవ నిరోధస్స్యాద్యావత్తత్త్వం న విందతి ।*
*విది తే తు పరే తత్త్వే ఏక మేవానుపశ్యతి ॥*

ఎంతవఱ కారూఢమగు తత్త్వబోధము గలుగలేదో, అంతవఱకు నింద్రియములు నరికట్టి విజన ప్రదేశములో మనన ధ్యాన నిష్ఠాపరులై యుండవలయును పరతత్త్వావబోధము గలిగినచో తానును, జగత్తును, ఈశ్వరుడు నొకే సద్వస్తువగు పరబ్రహ్మమయముగా గోచరించును అని శాస్త్ర ముద్ఘోషించుచున్నది

ఒక యరణ్య మార్గములో కొయ్యతో జేయబడిన యొక గజమును జూచిన

బాటసారి భయకంపితుడై వెనుకకు పారిపోయెను ఆ దారు గజమునకు మంచి నల్లని రంగు వేయబడి యుండెను అందుచే తప్పక అది సజీవ గజమని పాంథుడు నమ్మెను కాని ఆ యరణ్యములో నుండెడు ఒకరిని నీ యడవి యేనుగు ఇచ్చటనుండుటకు కారణమేమి యని యడుగగా నతడది కఱ్ఱతో జేసిన యేనుగుగాని నిజమైన యేనుగు కాదని చెప్పి భయపడినవాని చేయి పట్టుకొని దగ్గఱకు దీసికొని వెళ్లి తనచేతితో నేనుగును కొట్టిచూపగా ఓ ంరహితుడై తనయొక్క యనాలోచనాపరమగు బుద్ధిమాంద్యమును దెలిసికొని నిర్భయుడై యామార్గమున తాను వెళ్ళిపోయెను అట్లే అజ్ఞానారణ్యములో ననేక భయములకు కారణము గలదు అనుభవజ్ఞులగు మహనీయుల సహాయముచేత జ్ఞానోదయము గలుగవలసియుండును ఇదేరీతిగ సినిమాలో ఇంద్రజాలములో కనుపించెడు సింహవ్యాఘ్రాదులను జూచి భయ పడిన పిల్లలెందరో గలరు కావున ఆత్మకన్య మైన రెండవ వస్తువొక్కటి గూడ లేదు అనేకములుగా కనుపించునదంతయు మాయవల ననే గలుగుచున్నది విచారణ జ్ఞానమొకటి మాత్రము చాలదు దానికి దగిన ధ్యాన నిదిధ్యాసనలు గూడ నుండవలెను కావుననే శ్రవణమునకొకే ఫలమనియు, మననమునకు నూరు రెట్లధికమనియు, నిదిధ్యాసనములకు లక్ష రెట్లధికమనియు, సాక్షాత్కార మున కనంత ఫలమనియు జెప్పడమైనది వేదాంత వాక్యములను సంశయ, విపర్యయ, అసంభావనా దోషములు దొలగువఱకు నుపదేశించుట మాత్రమే గురుకార్యమనియు, మనన నిదిధ్యాసనములు శిష్యులయొక్క పనియనియు శాస్త్రము చెప్పెడు రహస్యము రోగమునకు సరియగు నౌషధమునిచ్చి పథ్యమును తెలుపుటయే వైద్యుని పని యని దెలియవలయును ఆ యౌషధమును విధిగా భుజించి లెస్సగా పథ్యముండుట రోగియొక్క కార్యము బ్రహ్మజ్ఞానోదయమున గూడ నీ విధముగ జెప్పడమైనది ఎంతమంచి యౌషధమైనను పథ్యము సరిగా లేని యెడల రోగము శాంతించనట్లు, యెంత గొప్పవారివల్ల నుపదేశమొందినను ఆచరణ సరిగా లేనిచో భవరోగ శమనము కానేరదు

*ప్రథమం శ్రవణం కృత్వా ద్వితీయే మననం తథా ।*
*నిదిధ్యాసనకం పశ్చాత్సాక్షాత్కారస్తదా భవేత్ ॥*

అని శాస్త్రముపదేశించియున్నది దీని యర్థము పూర్వము వ్రాయబడినది ఇకను నాలోచించుకొని యేదైన సంశయముండినచో నడుగవచ్చును

భారతి - కారణ గురువరుడవగు నో పరమాచార్యా! మీ యపారదయచే బహుకాలమునుండి గొప్ప భూతము పట్టి సదా బాధించుచుండినవారిని మహామంత్రవేత్త వచ్చి మంత్రించి గ్రహవిమోచనమును జేసినట్లు, నా సందేహమనెడి పెనుభూతము తమ దివ్య బోధనా రూపమగు మంత్రప్రభావముచే తొలంగినది బోనులో బడిన సింహమువలె సందేహమనెడి గూటిలోబడి చాలరోజులనుండి మిక్కిలి తపించిన నేను బోనునుండి విడువబడిన సింహమువలె నిర్భయత్వము నొందితిని ఇప్పుడు నా యాత్మకన్యముగా మఱియొకటి కనుపించుట లేదు ఇప్పు డీశ్వరున కన్యముగా వేఱొకటి గోచరించుట లేదు ఇప్పుడు బ్రహ్మమున కన్యముగా నింకొకటి కనుపించుట లేదు మఱియు,

*దంతి రూపంబుచే నొప్పు దారు వరయ దారువగుగాక పరికింప దంతి యగునె ?*
*విశ్వరూపంబుచే దోచు విష్ణుమూర్తి విష్ణుడగుగాక పరికింప విశ్వమగునె ?*

*ఆరోపిత భుజంగమమర గన్పట్టునే స్ఫురదధిష్ఠాన రజ్జువును గనిన*
*నారోపిత మనుష్యుడలర జూపట్టునే భువినధిష్ఠాన దారువును గనిన*
*నారోపితోదకం బరయంగ దోచునే కనదధిష్ఠానార్క కరము గనిన*
*నారోపితాచ్ఛరౌప్యము లక్ష్యమగునె యధిష్ఠానమైన శుక్తికను గనిన*

*దలపనారోపితాసి తత్త్వంబు మరల గాన నగునె యధిష్ఠానఖంబు గనిన*
*దెలియనారోపిత మనంబు దృశ్యమగునె తగ నధిష్ఠాన పూర్ణకత్వమును గనిన ?*

*చక్కెరయును లవణంబును గ్రక్కున నుదకములయందు గరిగిన రీతిన్,*
*మిక్కిలి తను గనుఘనమది చొక్కుచు నానందజలధి నుడిసి నశించున్.*

*ఇను డస్తమించుతరి నాతని కిరణము లతనితోడ దగజనురీతిన్,*
*బెనుమానసంబు పొలిసిన మునుకొని తద్గత వికారములు పొలియు గడున్.*

*ఘటశరావాది మృత్కార్య జాతంబుల నెంచి మృత్తికయుని కాంచు పగిది*
*నమలకుండలకిరీటాదిభూషణముల స్వర్ణంబని యెఱుంగు చందమునను*
*నసికుంత శూలచక్రాదికంబుల నెల్ల నినుమని యరసి కన్గొనిన భంగి*

*బొలుపారు ఫేనబుద్బుద తరంగంబుల మంచినీరని విలోకించు రీతి*
*దనరు బహువిధపటముల దంతువనుచు తెలియుకైవడి మొదలి సందియము విడిచి*
*భ్రాంతిని దొలంగి సర్వంబు బ్రహ్మమనుచు సుఖముగా సంతతంబును జూడుమనఘ*

పరమ గురువరా! ఈ పద్యముల నేను బాల్యకాలములో బాగుగ జదివినదాన్నై యుండియు, గురుకీలకము దెలియనందుచే సందేహము గలిగి యిదివఱ కెంతో దిగులు పడుచుంటిని ఒక శ్రీమంతుడు దయగలిగి యొక సాధుపురుషునకొక మంచి క్రొత్త మోటారు కారు నిచ్చెను అతడు తపమొనర్చి దేవతలను తృప్తి పఱచినందుచే నా దేవతలు సంతసమొంది యొక దివ్య విమానము నిచ్చిరి అయినను నతడు డ్రైవింగు పరీక్షయందు ప్యాసుగానందుచే మోటారు నడుపుట తెలియకపోవుటచే యా విలువగల కారేలాగున వ్యర్థముగా నుండెనో, ఆలాగుననే విమానమెక్కి సర్వలోకములయందు సంచరించుటకు వీలున్నప్పటికిని దానిని నడుప దెలియకపోవుటచే నది యెట్లు వ్యర్థమయ్యెనో, ఆలాగున ఆత్మతత్త్వబోధమై నిరతిశయానంద ప్రవాహరూపమగు నీ పద్యములను జదివి యుండియు, ఆత్మవేత్తయగు పరమగురుని వద్ద శిక్ష బొందనందుచే నీ జీవియొక్క జీవితమిదివఱలో వ్యర్థమైపోయెను అయినను మున్నొనర్చిన తపస్సువల్లను, దైవ భక్తివలనను, సర్వేశ్వరుని కరుణగలిగి సంసారసాగరమును దాటుటకు నావవలె నేర్పడి యుండు తమ చరణ సన్నిధి జేరితిని దానివలన తరించితిని. సందేహము లేదు ఇప్పుడు దత్తాత్రేయోపనిషత్తునందు జెప్పినట్లు నేను ధన్యురాలనైతిని

*దన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి ।*
*ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్ ॥*

సర్వదా నా యొక్క నిజరూపమగు దేశకాలాద్యనవచ్ఛిన్న ప్రత్యగాత్మను సాక్షాత్తుగా నెఱింగితిని అందువలన నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థురాలనైతిని మఱియు బ్రహ్మస్వరూపమగు నానందము నాకు స్పష్టముగా స్ఫురించుచున్నది అందు వలన నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థురాలనైతిని

*ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్ష్యేఽద్య ।*

*ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి ॥*

మఱియు నిపుడు దుఃఖస్వరూపమగు సంసారమును నేను జూచుచున్న దానను కాను అందుచే నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థురాలనైతిని నాయొక్క యనేక జన్మకర్మవాసనా సమూహము గల యజ్ఞానము ఎక్కడనో పారిపోయెను (నశించెను) అందుచే నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థురాలనైతిని

*ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్ ।*
*ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ ॥*

మఱియు నాకు జేయదగిన కర్తవ్యము కొంచెమైనను నిపుడు లేనందున నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థురాలనైతిని మఱియు పొందదగినదంతయు నిపుడు నాచే పొందబడినట్లాయెను కనుకనే నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థురాలనైతిని

*ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే ।*
*ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునఃపునర్ధన్యః ॥*

మఱియు నా యొక్క తృప్తికి (ఆనందమునకు) సమానమైన వస్తువెద్దియు లోకమందు లేదు అందువలన నేను ధన్యురాలనైతిని నేను ధన్యురాలనైతిని ఈ తృప్తి కంటె మఱియొకటి చెప్పదగినది కనబడనందుచేత నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థురాల నైతిని మాటిమాటికీ కృతార్థురాలనైతిని నేను కృతార్థురాలనైతిని నేను కృతార్థు రాలనైతిని

*అహో! పుణ్య మహో! పుణ్యం, ఫలితం ఫలితం దృఢమ్ ।*
*అస్య పుణ్యస్య సంపత్తే రహో! వయ మహో! వయమ్ ॥*

ఆహా! నా పుణ్యము దృఢముగా ఫలించెను అహో! నాయొక్క పుణ్యము దృఢ ముగా ఫలించెను ఈ పుణ్యసంపత్తువలన ఓహో! మేమే ధన్యులము! ఓహో! మేమే ధన్యులము

*అహో! శాస్త్ర మహో! శాస్త్రమహో! గురురహో! గురుః ।*
*అహో! జ్ఞాన మహో! జ్ఞానమహో! సుఖమహో! సుఖమ్ ॥*

వేదాంత శాస్త్రము ఓహో! యెంత మనోహరము! వేదాంతశాస్త్రము ఆహా! యెంత సారమైనది! అహో! వేదాంతగురువెంత గొప్పవాడు! ఓహో! మా గురువెంత గొప్ప వాడు! ఆహా! అద్వైతాత్మ తత్త్వజ్ఞాన మెంత మంచిది ఓహో! అద్వైతాత్మ తత్త్వ జ్ఞాన మెంత సారవంతమైనది! ఆహా మా యాత్మసుఖ మెంత గొప్పది అహో! మా యానంద మెటువంటిది! అహో! ఆశ్చర్యము ఆశ్చర్యము

గురుడు – తల్లీ! భారతీ! శుకబ్రహ్మర్షి కన్నియు ననుభవమునకు వచ్చినను సందేహ నివృత్తిమాత్రము జనకభూపాలునిచే గలిగినట్లు మీ పుణ్యవశముచే అన్ని సాధనలును మీకు సులభముగా సిద్ధించెను ఇది యీశ్వర కృపవల్లను జన్మాంతరమున జేసియుండు తపస్సు మొదలగు సాధనాబలము చేతను గలిగినది దృశ్య బంధసంశయ మొకటి మాత్రము మిగిలి యుండెను అదియు నిపుడీ సుకృత విశేషమువల్ల నివృత్తమైనది శ్రీశుకబ్రహ్మర్షి సర్వసందేహ నివృత్తియైన పిమ్మట నిర్వికల్పసమాధి నిమిత్తమును, బ్రహ్మాత్మైక్యస్థితి సుదృఢ ముగా గలుగుటకును, నేలాగున మేరు శిఖరమునకు వెళ్ళిరో, యాలాగున మీరును కొంతకాలము విజనస్థలములో నుండి నిదిధ్యాసనముల యొక్క దార్ఢ్యము కొఱకు నిష్ఠ చేయవలయును అప్పుడే పూర్వీక ఋషులవలె పునరావృత్తి గలుగని బ్రహ్మపదములో సదా నిలువ గలరు ఇకను నేదైన సంశయము గలిగి యుండినచో నడుగవచ్చును అపాత్రములో నమృతము పోయనట్లు యోగ్యత లేనివారికీ బ్రహ్మామృతము నుపదేశింప రాదు దీనియందు జాతి గాని, స్త్రీ పురుష లనెడి భేదము గాని, గృహస్థ సన్న్యాసు లనెడి విభేదము గాని, బ్రాహ్మణా బ్రాహ్మణులను భేదము గాని లేదు కాని యాచరణ యోగ్యత మాత్రము గలిగియుండిన చాలును ఏలననగా బ్రాహ్మణకులములో వసిష్ఠాదులును, క్షత్రియకులములో జన్మించిన విశ్వామిత్రాదులును, వైశ్యకులములో జన్మించిన తులాధారాదులును, శూద్రకుల మున జన్మించిన సూతాదులును, కిరాతకులమునందుండిన వాల్మీక్యాదులును, స్త్రీలలో నుద్భవించిన గార్గ్యాదులును ఈ బ్రహ్మజ్ఞానమును బొంది కృతార్థులైరి

ఆలాగున సన్న్యాసాశ్రమములో నుండిన సనకాదులును, వానప్రస్థాశ్రమములో నుండిన మన్వాదులును, గృహస్థాశ్రమములో నుండిన జనకాదులును, బ్రహ్మచర్యాశ్రమములో నుండిన శుకాదులును నీ బ్రహ్మవిద్యాప్రభావముచే జీవన్ముక్తులై పునరావృత్తి లేని నిరతిశయానంద సుఖమును బొందిరి ఆ రీతిగ అవధూతవృత్తి యందుండిన దత్తాత్రేయాదులును విదేహకైవల్యము నొంది శాశ్వత బ్రహ్మపదము నొందిరి ఆ విధముగ స్త్రీలలో గూడ సన్న్యాసాశ్రమములో నుండిన సులభా యోగినియు, వానప్రస్థాశ్రమ మందుండిన మైత్రేయియు, గృహస్థాశ్రమమందుండిన చూడాలయు, బ్రహ్మచర్యాశ్రమ మందుండిన గార్గియు, నీ బ్రహ్మవిద్యా మహిమవలన జీవన్ముక్తురాండ్రై బ్రహ్మపదము నొందిరి ఇట్టి బ్రహ్మజ్ఞానోపదేశమునకు ప్రతినిధిగ దక్షిణరూపముగ నిచ్చుటకు ముల్లోక మందేమియు లేనందున జనకమహారాజు తనను, తన పరివారములను, రాజ్యమును సహా యాజ్ఞవల్క్యమహర్షికి దత్తముగ జేసెను

ఆ విధముగ శివాజీ చక్రవర్తియు జనకభూపాలుడు చేసినట్లు సమస్తమును తన యాత్మ గురువగు శ్రీ సమర్థ రామదాసుగారికి దానమిచ్చెను అప్పుడు శ్రీ యాజ్ఞ వల్క్యమహర్షియు, శ్రీసమర్థరామదాసుగారును నిక మీ రాజ్యములను గురుసొత్తుగా నమ్మి సత్యధర్మములతో మీరే పాలించుకొనుడు మా రాజ్యపాలన మీలోకమున గాదు బ్రహ్మ ప్రాప్తి కొఱకు ముముక్షువుల యాత్మలోకమును పాలించుటయే యగున ని చెప్పి, వారుభయులు నేకాంత ప్రదేశమున కేగిరి ఆలాగున భారతీదేవిగారూ! మీరిచ్చటకు వచ్చి యిప్పటికి రెండు సంవత్సరములు కాబోవుచున్నది ఈ రెండు సంవత్సరములును అనేక సందేహములడిగి నివృత్తి జేసికొనుచు, ధ్యానాదుల నాచరించుచు మనన, నిదిధ్యాసనముల జేయుచు వచ్చితిరి మీరుండుటచే శ్రీతరిగొండ వెంక మాంబగారి తపోవనములో నుండెడు చెల్లాయమ్మగారు మొదలైనవారు కృతార్థులైరి ఔషధము పథ్యముతో నెంతకాలము సేవించెదరో, అందులో కొంతకాలమైనను పథ్యముండేలాగున మీరింకొక సంవత్సర మీ తరిగొండ వెంకమాంబగారుండిన తుంబురుకోన, సనకసనందన తీర్థము, కుమారధార మొదలగు పుణ్యతీర్థములలోను, గుహలలోను, విజనప్రదేశముల లోను, సమాధి నభ్యసించుచు నిది ధ్యాసనముల రూఢి గావించు

కొనవలయును మఱియు శ్రీ రామకృష్ణ తీర్థము, శ్రీ వైకుంఠతీర్థము, జాబాలతీర్థము మొదలగు పుణ్యతీర్థములందునుండి నిదిధ్యాసనముల జేయవల యును ఇది పూర్వీకఋషుల సంప్రదాయము వీటిలో తుంబురుతీర్థము, కుమార ధారాతీర్థము, సనకసనందన తీర్థము చాల ముఖ్యములు నేను గూడా ఆ తీర్థములలో కొంతకాల ముండి బ్రహ్మనిష్ఠ సలిపియున్నాను కుమ్మరి తన కుశలత్వముచే కుండల జేసి యెండబెట్టి యుంచినను, ఆమములో బాగుగా కాల్చనిచో నా ఘటశరావాదుల న్నియు నీళ్లలో తడిసినగాని, వర్షము కురిసినగాని కఱిగిపోవునట్లు ఇపుడు మీకు బోధించిన దృశ్యరహితమగు ఆత్మాకార స్వరూపమును మీరే స్వయముగ నారూఢస్థితి గలుగువఱకు నేకాంతమున నిదిధ్యాసముల జేసి యారూఢ సాక్షాత్కారమును పొంద నిచో, మీకు స్వయముగ దృశ్యవృత్తి గలుగక పోయినను, కర్మకాండుల (అద్వైత జ్ఞానేతరుల) ద్వైతాదివాదములచేతనైన దృశ్యప్రతీతిగాని, సందేహముగాని గలుగ వచ్చును

అగ్నిలో పక్వమైన ఘటమైనచో నెంతకాలము వర్షములో తడిసినను, లేక ఎంతకాలము నీటి యందుండినను, నేలాగున కఱగదో, ఆలాగున బ్రహ్మజ్ఞానాగ్నిలో, నింద్రియనిరోధ మనెడి ధ్యేయాకారరూప ఆమములో, మనస్సు కాలినచో మఱల ఎచ్చటను, నెవరిచేతనుగాని, దేనివలనగాని చలనము గలుగదు ఇదే పూర్వీక పరమఋషుల ధర్మము కనుకనే జనకునివల్ల సంశయనివృత్తి గలిగినను శుకుడు నిర్వికల్పసమాధి సిద్ధికై మేరుపర్వతమునకు వెళ్ళుటకు కారణమైనది ఇపుడుండెడు వారిలో ముఖ్యులేదో కొంత బ్రహ్మవిచారము, శ్రవణము, ధ్యానము జేసినను, కుమ్మరి వాడు కుండలను తయారు చేయునట్లు కొంత యనుభవము గలిగినను దానియొక్క యారూఢ జ్ఞానము దృఢముగా గలుగువఱకు నేకాంతమున బ్రహ్మనిష్ఠను జేయనందుచే కాలనికుండవలె మఱల విషయ సాన్నిధ్యములచేతను, కర్మకాండపరములగు ద్వైతవాక్యములచేతను వారికి చలనము గలుగుటకు కారణమగుచున్నది అట్టి ఋషుల యొక్క స్థితి గలిగిన మాత్రమే లోకములో ప్రవేశించి జ్ఞానోపదేశమును జేయుటకు శక్తి గలుగును అట్టియెడ లోకముచేత బంధము గలుగదు

శ్రీయేసుక్రీస్తు, శ్రీ మహమ్మదునబి, శ్రీబుద్ధదేవుడు, శ్రీశంకరుడు, శ్రీరామకృష్ణ పరమహంస మొదలగు ప్రవక్తలందఱాలాగుననే యుండిరి వారు కొద్దికాలము మాత్రము లోకములో బోధించినను వారి వాక్యము లమృతమయము లుగా నుండుటచే నతి త్వరలోనే లోకమంతయు వాటిని గ్రహించు శక్తి గలిగి యుండెను అట్టి యమృతత్వము పొందక రేయింబవళ్ళు నూఱుసంవత్సరము లెడతెగక బోధించు చుండినను మృత్యువుతో గూడిన దగుటచేతను, అమృతత్వము కొంచెమైనను లేనందు చేతను, వారి బోధలను వినువారుగాని ఆచరించువారుగాని లోకమందెవరు నుండరు ఎవరెవరెంతెంత యమృతత్త్వమును సంపాదించి యుందురో, వారికి దానికి తగినంత మంది భక్తులు లభింతురు కొద్దిమందికి వండిన భోజనపదార్థము బహుజనులకు ఆకలిగలవారికెట్లు పెట్టగలరు? దండిగ పంచభక్ష్యపరమాన్నాదులతో వచ్చినవారి కందఱికిని భోజనము పెట్టుచుండినచో ఎవనిగాని పిలువకుండినను ఆకలి గలవారందఱు వచ్చి భోజనము చేయుచుందురు అందువలననే దైవామృతత్త్వము బొందిన మహనీయుల దగ్గఱ ననేకభక్తు లానందభరితులై యుండుటకు కారణము పైజెప్పిన తీర్థములన్నియు పూర్వకాలమున ఋషులు తపంబొనర్చినవే అందుచేతనే యా ప్రదేశము లందంతటను గుహలు కనుపించుచున్నవి అట్లు తపమాచరించువారి సంస్కారము లన్నియు నగ్నిలో దహించిన విత్తనములవలె నగుట వలన మఱల ఆవిర్భవించవు ఇకనేదైన ప్రశ్నింపవలసియుండిన ప్రశ్నింపవచ్చునని యాచార్యుడు మిక్కిలి కరుణా వారాశియై చెప్పిన యమృత వాక్యములను విని,

భారతి – ఓమ్ పరమకారుణికుడవగు గురువరా! తమ యాజ్ఞ ప్రకారము ఋషులు తపమొనర్చిన తీర్థములలో నే తీర్థమునకు ముందుగా బోవలయును? ఎప్పుడు పోవలయును?

గురు – పైజెప్పిన తీర్థములన్నిటిలోను తుంబురు తీర్థమును, శ్రీ తరిగొండ వెంకమాంబగారు నివసించిన గుహయును మిక్కిలి శ్రేష్ఠములు మఱియు శ్రీతరిగొండ వెంకమాంబగారచ్చట దైవసాక్షాత్కార సిద్ధిని పొందిరి వారు స్త్రీలగుటచే మీరును స్త్రీలై యుండుట చేతను అది మీకు చాల యనుకూలముగ

నుండును నేను నచట బ్రహ్మనిష్ఠ యొనర్చెడి కాలముననే యిపుడు కనుపించెడు దైవానుగ్రహము గలిగినది మనస్సుయొక్క యుపరతియు, తురీయమందు నిలకడయు, జ్ఞేయమగు జ్ఞానోదయమును గలిగెను ఈ దినముతో సంవత్సరత్రయము అంత్యమగుటవలన రేపటి దినము బ్రహ్మమూర్తమున, శ్రీరత్నమాంబగారితో సహ వెళ్ళవచ్చును మీకు దైవకరుణవల్లను, మహర్షుల యనుగ్రహమువలనను, వేయించబడిన విత్తనమునుండి యంకురము పుట్ట నట్లు మఱల దృశ్యవృత్తి యావిర్భవింపకుండును గాత!

భారతి – ఈ వాక్యమును విని యానంద వారిని ధారధారగా కార్చుచు తడిసిన వస్త్రము గలవారై, గురువరా! ఈమూడు సంవత్సరములమధ్య తమరిని దర్శింపవలెనని కోరిక గలిగినచో రావచ్చునా? యని గద్గదస్వరముతో బలికెను

గురు – దేనికొఱకెవరు వెళ్ళెదరో దానిని పూర్తి జేసి తిరుగరావలయునేగాని యట్లు గానిచో ఈ ప్రాణము నచ్చుటనే దైవభావములో (ఆత్మభావములో) లయమొనర్చ వలయును శ్రీ బుద్ధదేవు డీవాక్యమును నుచ్చరించియే తన రాజభవనమునుండి వెడలి పోయెను ఇదియే ధీరులయొక్క ధర్మము భీరువులు లోకములోనేమియు జేయ జాలరు చేసినవారందఱును ధీరులే ఒక మనుజుడు వెళ్ళిపోవునపుడు వానియొక్క నీడ అతనిని విడువక నెచ్చటికేగినను నెట్లు వెళ్ళుచుండునో, ఆలాగున మనుజుడనుష్ఠించిన ధర్మము లన్నియు, పుష్పములతో గూడ గంధము విడువక వెళ్ళునట్లు వాని ననుసరించి వెళ్ళుచుండును లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు ఓం తత్ సత్

భారతీదేవిగారు గురువులవారి యాజ్ఞను బొంది యానందభరితులై యా దినము రాత్రి చెల్లాయమ్మగారు మొదలగు తపస్వినులతో గూడ తరిగొండ వెంకమాంబ గారి తపోవనములోనుండి మరురోజు బ్రహ్మముహూర్తమున నెవరితోను జెప్పక రత్నమాంబగారితో సహ పూర్వాశ్రమమున తన తపోవనమునుండి తీర్థయాత్రకు వెళ్ళినట్లు తుంబురు తీర్థము నుద్దేశించి యుత్తరాభిముఖముగా వెళ్ళిపోయిరి ఓమ్ తత్ సత్

క్రమముగ మధ్యాహ్న సమయమునకు తుంబురు తీర్థమున శ్రీతరిగొండ వెంకమాంబ గారు తప మొనర్చిన గుహలో ప్రవేశించి బ్రహ్మాకారదృష్టితో బ్రహ్మ భావనలోనుండిరి చలింపక నిదిధ్యాసనిష్ఠలో నుండిరి ''ఓం తత్ సత్'' వెంకమాంబగారి తపోవనమందుండిన చెల్లాయమ్మగారు మొదలైనవారు ప్రాతఃకాలమున భారతీదేవిగారు కనబడనందుచే తుంబురు తీర్థము వెళ్ళి యుందురని తలంచి వారేమియు దీసికొని వెళ్ళనందుచే వెంటనే యిరువుర చెంచువారిని, నచ్చట ఆశ్రమములో నుండెడి ఇరువురనారీమణులను సమకూర్చి కావలసిన భోజనపదార్థముల నిచ్చి పంపిరి భారతీదేవి తుంబురుకోన గుహలో ప్రవేశించినపుడు శ్రీరత్నమాంబగారితో నిట్లు చెప్పిరి ''అమ్మా! ఇయ్యది తపోభూమి దేహశుద్ధి, వాక్శుద్ధి, మనశ్శుద్ధి గలవారు మాత్రమే యిచట తపమొనర్ప గలరు ఇదివఱలో భుజించుచు వచ్చిన యాహారము లిచ్చటగల వాయు శీతోష్ణములకు సరిపడవు కాయసిద్ధి పొందిన ఋషుల శరీరమునకే యవి తగును అట్లు కానందుచేతనే వైరాగ్యమవలంబించి కొందరు తపోభూమిలో ప్రవేశించిన రోగములు గలుగుచుండును

కావున నిదివఱలో భుజించుచుండెడు సాత్త్విక భోజనము గూడ నిచ్చట పనికి రాదు అనగా నిదివఱలో వాడుచుండిన స్వల్పమగు ఉప్పు, పులుపు, కారమునుగూడ నిచ్చట ఉపయోగింపరాదు ఋషులు భుజించుచుండిన కంద, ఫల, క్షీరాదులుగాని, లేక ముద్గాన్నము గాని (పెసలు, బియ్యము, మిరియములు, జీలకఱ్ఱ, కొంచెము నెయ్యి వీటితో జేసినది) భుజించదగును దీనికి పులగమనియు, కొన్ని స్థలములలో పొంగలియనియు వ్యవహారము గలదు ముఖ్య వైష్ణవ దేవాలయములన్నిటిలోను నీ పొంగలినే దేవునికి నైవైద్యముగా జేయుచుందురు పూర్వకాలము ఋషులీలాగున భుజించినందువలననే యిపుడు నీలాగున జేయుచున్నారు అంత నిగ్రహింప సామర్థ్యము లేనియెడల స్వల్ప లవణమును జేర్చు కొనవచ్చును కాని మరేదియు దాని యందు కలియరాదు ''

ఇట్లు వచింపుచుండగా సంధ్యా కాలమగుచుండెను అప్పటికి తరిగొండ వెంకమాంబగారి తపోవనమందుండువారు తెచ్చిన సామగ్రిని జూచి భారతీ దేవి

సర్వేశ్వరుని కరుణ కెంతయో కృతజ్ఞతను దెలుపుచు ప్రార్థన జేసెను ముఖ్యముగా నీ ప్రదేశములో గల జల మతి శీతలమును, ఘనముగా నుండుటవలన బాగుగా కాచి త్రాగవలయుననిచెప్పిరి ఆలాగున కొన్ని రోజులు ధ్యానసమాధులు సలుపుచుండగా శ్రీ రత్నమాంబగారికి రక్తవిరేచనములును, జ్వరమును గలిగెను

అప్పుడు భారతీదేవి రత్నమాంబగారితో ''అమ్మా! మీ రిష్టముండినచో స్వగ్రామమునకు వెళ్ళవచ్చును ఇచ్చటనుండి మనదేశమెంతో దూరములో లేదు దగ్గరగానే యున్నది సాధనకాలములో శరీరేంద్రియములను వశపఱచుకొనక పోవుటచే నీ కొండలయందలి నీటిని, వాయువును సహింపజాలకపోతిరి ముఖ్యముగ నిటువంటి వాటికి ప్రాణాయామమును, బ్రహ్మచర్యమును తప్పక గలిగియుండవలయును మనము నేర్చుకొనిన సుకుమారమగు సత్త్వగుణమే యీలాగున మనలను బంధించును సుకుమారమగు జీవితము, సుందర మగు నాహారము, సౌమ్యమగు శయనము మొదలగునవి యన్నియు సత్త్వగుణముతో గూడినవి కావున విశుద్ధసత్త్వమగు తురీయ పదములోని కీసత్త్వగుణము పోనీయక నీ విధముగ రోగాదులచే నడ్డుపరచును వెళ్ళి పోవచ్చు''నని భారతీదేవి చెప్పిన వాక్యమును విని రత్నమాంబగారు కొంతసేపు మౌనము గానుండి కన్నీరు కార్చుచు ''మీరు గూడ వచ్చినచో వెళ్ళగల''ననెను అదివిని భారతీదేవి, ''తల్లీ! మనము పూర్వాశ్రమమునం దుండునపు డెన్నియో సారులు చెప్పితిని గదా! ఈ సుకుమారము తీవ్ర బ్రహ్మనిష్ఠలకు దగదు నేను మాత్రము రాను ఒకవేళ యీ యాత్మ త్రిగుణాత్మకమగు ప్రకృతితో యుద్ధము జేసి జయమును పొందవలయును లేక రణరంగములో ప్రాణములనైనను విడువవలయును క్షాత్ర తేజస్సుచే ప్రజ్వలించుచుండు క్షత్రియుడు రణరంగములో శత్రువునకు భయపడి వెన్నిచ్చి పారిపోడు గీతయందు గూడ శ్రీకృష్ణుడు క్షాత్రధర్మమును జెప్పునపుడు ''యుద్ధే చాప్యపలాయనమ్'' అని యుపదేశించియున్నాడు అట్టి వంశములో పుట్టినవారికి ధీరత్వ ముండవలయునేగాని భీరుత్వము పనికిరాదు

గౌతమబుద్ధుడు నీలాగున జెప్పియు యున్నాడు ''ఒకవేళ త్రిగుణాత్మకమగు మాయతో పోరి యుద్ధములో మరణించవలయును లేక

ప్రకృతిని జయించవలయును మరణించినచో యోగులు పొందుచుండు దానికన్న నే నొక యంతస్తు ఎక్కువ యగు స్వర్గమును పొంద వలయును లేక నిరతిశయానంద ఆత్మారామ పట్టాభిషిక్తుడనై యుండవచ్చును '' ''హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్'' అని గీతాబోధన ప్రారంభములోనే శ్రీ కృష్ణు డుపదేశించెను దేహాభిమాన భ్రాంతియగు పెనుభూతముచే పట్టుకొనబడి దీనభావము బొంది భయాక్రాంతుడై మూర్ఛితుడై రథముపైబడియుండు అర్జునుని నీ దివ్యమంత్రోపదేశము చేతనే మోహమనెడు దుష్టగ్రహ మున కుచ్చాటనము చేసి, పారద్రోలి స్వధర్మనిర్వహణమందు ధీరుని గావించి యస్త్ర శస్త్రముల ధరింపజేసి నిలువబెట్టెను ఇప్పుడు ఈ నిర్జనప్రదేశములో నెవరౌషధము నిచ్చెదరు ఎవరనుకూలమగు భోజనము పెట్టెద'' రని రత్నమాంబగారితో సంభాష ణము జరుగుచుండు సమయమునకు భారతీదేవి దర్శనమున కొకవైద్యుడును కొందఱు భక్తులును కొన్నిసా మానులను దీసికొని తుంబురుకోన తీర్థములో కొన్ని రోజులుండి ధ్యానము జేయుటకై వచ్చిరి కొన్ని మంచి యౌషధముల నా వైద్యుడు దీసికొని వచ్చియుండెను భారతీదేవిగా రచ్చటనుండుటచే కొన్నిరోజులు వారును ఆ సమయమున నచట ఉండుట కనుకూలమని తలంచి వచ్చిరి

ఇప్పుడు భారతీదేవి రత్నమాంబగారితో ''భయపడనక్కర లేదు పూర్వపుణ్యము ఆపత్సమయమున మిత్రునివలె సంరక్షించును పాపఫలము సమయము వచ్చినది కనిపెట్టి శత్రువు వలె శిక్షించును ఇదియే ధర్మముయొక్క రహస్యము'' అని చెప్పగా వెంటనే వైద్యుడు శ్రేష్ఠమగు ఔషధము నిచ్చి తనతో గూడ వచ్చినవారిచే ననుకూలాహారమును తయారు చేయించి యిచ్చిరి మూడురోజులకు ఆరోగ్యము గలిగి రత్న మాంబగారును మామూలుగా తపోధ్యానములను జేయుచుండిరి పుణ్యము యొక్కయు, పాపముయొక్కయు ఫలమీలాగున నుండునని భారతీదేవిగా రందఱికి జెప్పిరి అచ్చటనే చాలకాలముండి అచ్చటినుండి కుమార తీర్థమునకు వెళ్ళిరి అచ్చటను ధ్యానసమాధులను జరిపిరి దర్శనార్థము వచ్చెడువారితో నొకమాటగాని, రెండు మాటలుగాని మాట్లాడుచుండిరి ఒక్కొకపుడెవరితోను నేమియు మాట్లాడక కొన్నిరోజులవఱకు

మౌనముగా నుందురు ఎప్పుడైన నొక వాక్యమును చెప్పినచో నది సూత్రప్రాయముగా నుండును అది వటవృక్షము సూక్ష్మబీజములో నిమిడి యుండు నట్లనంతార్థము గలిగియుండును కనుకనే ''అల్పాక్షరమనంతార్థం వాక్యం రాహి మహామతే'' అన్నట్లు అల్పాక్షరములు గలిగి యనంతార్థము గల వా నే బ్రహ్మ ిష్యలు వచింతురు

కావుననే బ్రహ్మసూత్రములు, పాణినీయసూత్రములు, పాతంజలి యోగ సూత్రము లేర్పడుటకు కారణము అచ్చట కొంతకాలముండి సనకాదులు తప మొనర్చిన సనకసనంద తీర్థముల యందెక్కువ కాలముండి దృశ్యము స్ఫురింపని బ్రహ్మాకారధ్యాన సమాధిలో కాలము గడపిరి తక్కిన రామకృష్ణవైకుంఠాది తీర్థము లయందు కొద్దిరోజులుండునప్పటికి సంవత్సర వ్రతము పూర్తియగుటకు సమీపించెను ఈ కాలమధ్యమున గురువరుడు వారి క్షేమము నరయుచు కూర్మవృత్తితో ( తాబేలు గ్రుడ్లనుంచి దూరములోనుండి మనస్సున భావించుట వలన నివియన్నియు పిల్లలై తన దగ్గఱ జేరును ఇదియే కూర్మవృత్తి) వారియాత్మ నిరావరణముగ సదా ప్రకాశించు చుండునట్లు మనస్సున భావన జేయుచుండెను మూడు సంవత్సరములు పూర్తియగు సరికి గ్రహణ విముక్తుడగు సూర్యుని పగిది దృశ్యము కనుపించక సర్వము బ్రహ్మ మయము, ఈశ్వరమయము, విష్ణుమయముగ నుండునట్లు గోచరింపగా గురు సన్నిధి కేతెంచి నమస్కరించి యీ మూడు సంవత్సరములందు గలిగిన ధ్యేయైక్య స్థితియను త్రిపుటి రహితస్థితియును, నిరావరణాత్మ బోధైక స్థితియును సవిస్తరముగ తెలిపిరి

దీని నాకర్ణించి గురువరుడు మిక్కిలి సంతసించి ''తల్లీ! మీరిపుడు మూడు సంవత్సరములలోపొందిన స్థితిని నేను 12 సంవత్సరములకు పొందగలిగితిని మీరు జన్మాంతరమున చాల పరిపక్వస్థితికి వచ్చినవారగుటచే నింత త్వరలో రాగలిగితిరి మీరు మాఘశుద్ధ త్రయోదశీ దినమునకు పూర్వాశ్రమము విడుచుటయు మఱల నదే త్రయోదశికి నిచట కేతెంచుటయు జూడగా పూర్ణచంద్రుడగుట కేలాగున 12 రోజులు జరిగిపోయి యింక మూడురోజులు మాత్రము మిగిలియున్నట్లు గోచరించునో, అదే రీతిగ జన్మాంతరములో 12

పాళ్ళనుష్ఠించినవారలై, పూర్ణత్వము నొందుటకు మూడు పాళ్ళు మిగిలియుండెను దానినిపుడు పూర్తి చేసినట్లు దోచుచున్నది ఇక మీరు చేయ వలసిన దేమియు లేదు కృతకృత్యులైతిరి

*జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః ।*
*న చాస్తి కించి త్కర్తవ్య మస్తిచే న్న స తత్త్వవిత్ ॥*

బ్రహ్మసాక్షాత్కార జ్ఞానామృతముచే తృప్తి జెందినట్టి కృతకృత్యుడగు యోగికి జేయదగిన కార్యం బేమియు లేదు కర్మాసక్తి యొకవేళ గలిగిన యెడల వాడు తత్త్వవేత్త గాడు ''

అని యుత్తరగీతా వాక్యము నుపదేశించి ''యిక మీకేదైన సందేహములుండిన యడుగవచ్చును'' ని మహోదయతో వచించిన గురువాక్యమును విని,

భారతి – మహానుభావుడవగు పరమగురో! ఇక నడుగవలసినదిగాని, చేయ వలసినదిగాని, వినవలసినదిగాని యే సందేహమును లేదు ఆ విషయమై నాకిక నేమియు కొఱత లేదు అయినను కొందఱీ విధమున జెప్పుదురు

అదేమన? – 1 చైతన్యాతీతమే బ్రహ్మము, 2 ప్రకృతిద్వయాతీతమే బ్రహ్మము, 3 స్వానుభవాతీతమే బ్రహ్మము, 4 భావాతీతమే బ్రహ్మము వీటియొక్క రహస్య మేమియో వినవలయునని కోరిక గలుగుచున్నది

గురు – తల్లీ! భారతీదేవీ! మీరు వేసిన యీ ప్రశ్న వేదాంత శాస్త్రమునకు సంబంధించినది కాదు వేదములకు విరుద్ధములగు స్వకపోలకల్పితము లగు ననేక మతములు గలవు ఇవి మీబోటి వేదానుయాయినులకు సంబంధించినవి కావు ఉపనిషత్ప్రతిపాదితమగు వేదాంతము చైతన్యాతీతము బ్రహ్మమని యొక్కొక స్థలములో జెప్పియుండినను నచ్చట లక్షణావృత్తిచేత మలిన చైతన్యమును విడిచి శుద్ధ చైతన్యమును గ్రహించవలయునని యర్థము చెప్పబడినది చైతన్యాతీతమే బ్రహ్మమనిన చైతన్యము లేనిది బ్రహ్మమని యర్థమగును. అపుడు బ్రహ్మము జడమనవలయును ఏలననగా! పగలు కాని సమయ మనినచో రాత్రి కాలమనియే గ్రహించవలసియుండును ప్రకాశము కానిదని యనినచో చీకటితో గూడినదనియే

యర్థమగును అపుడు వారు చెప్పెడు బ్రహ్మ మంధకారమయమనియే చెప్పవలయును దీని నే ఆస్తికశాస్త్రమును నంగీక రించదు ''ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్'' అనియే శ్రుతి చెప్పుచున్నది బ్రహ్మము చీకటి కావల సూర్యునివలె ప్రకాశించుచున్నదని తాత్పర్యము సూర్య, చంద్ర, నక్షత్ర, అగ్ని, విద్యుత్‌మొదలగు వస్తువులన్నిటిని ప్రకాశింపజేయునదియును, పై సూర్యా దిప్రకాశములు బ్రహ్మమును ప్రకాశింప జేయజాలవనియు జెప్పుచుండగా చైతన్యా తీతము బ్రహ్మ పద్ధము, అని చెప్పెడివారి కంధకారము చేకూరును మఱియు చైతన్యముగల ప్రాణాపానాది పంచవాయువులకును, మనస్సు, బుద్ధ్యాద్యంతఃకర ణములకును, చైతన్యమునిచ్చి యీ పంచప్రాణాది పంచపంచకములకును అంటక యుండు బ్రహ్మమును గుఱించి శ్రుతి యుపదేశించుచున్నది అట్టి బ్రహ్మము చైతన్యాతీతమని యెట్లు చెప్పవచ్చును? దీనియొక్క సారమేమనగా పై జెప్పిన సూర్యాదులకు ప్రకాశమిచ్చునదియు, చేతనా స్వరూపములగు ప్రాణాదివాయువులకు చైతన్య మొసగునదనియు, బుద్ధ్యాది చైతన్యములకు చేతనత్వమును కల్పించునదనియు, నివియన్నియు నాపరమాత్మను ప్రకాశింపజేయజాలవనియు గ్రహించుకొనుటయే చైతన్యాతీతము బ్రహ్మమని చెప్పెడు రహస్యము దీనిని లక్షణావృత్తివలన గ్రహించు కొనవలయును 'న తత్ర సూర్యో భాతి'' అని కఠవల్లి శ్రుతి యిదివరలో వ్రాయబడి యున్నది

*నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్।*
*తమాత్మస్థం యే ఽనుపశ్యన్తి ధీరాస్తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషామ్ ॥*

ఆ పరమాత్మ యనేకులకు కర్మఫలరూపములగు కోరికలను నిచ్చుచున్నాడు ఒక్కడైన యే సర్వజ్ఞుడగు పరమాత్మ నశించువానిలో నశింపనివాడో, బ్రహ్మాది సర్వ జీవులకు జీవము గలుగ జేయువాడో, హృదయ గుహయందుండు నా పరమాత్మ నెవరు వశీకరింపబడిన యింద్రియములుగల వారలై ప్రత్యక్షముగ జూచుచున్నారో వారలకు నిత్యమైన ఉపరతి (శాంతి) గలుగును తదితరులకు గలుగదు

***తదేతదితి మన్యన్తే ఽనిర్దేశ్యం పరమం సుఖమ్ ।***
***కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా ॥***

ఇట్టిదని నిర్ణయింపశక్యముగాని శ్రేష్ఠమైన బ్రహ్మానంద సుఖమేదో యది యిది యని తలంచుచున్నారు ఆ యానందము నే ప్రకారము దెలిసికొందును? అది ప్రకాశస్వ రూపముగా నున్నదా? నాకు ప్రత్యక్షమగునటుల విశేషముగ ప్రకాశించుచున్నదా? అనగా ఆ ప్రకాశవస్తువే యాత్మగా నుంటున్నదని తాత్పర్యము

మఱియు సూర్యాదులును, ప్రాణాది వాయువులును, బుద్ధ్యా దీంద్రియము లును జడములతో గూడి యుండును బ్రహ్మమో యాలాగున జడముతో గూడినది కాదు మఱియు నివి యన్నియు పరబ్రహ్మముయొక్క జ్ఞానము వలననే జ్ఞానము గలవిగా నుండును ఇట్లుండియు నివియన్నియు బ్రహ్మముయొక్క జ్ఞానమును గ్రహించు కొనజాలకున్నవి అపుడా బ్రహ్మ యెంత జ్ఞాన మయమో, యెంత ప్రకాశవంతమో, యని గ్రహించుట కొఱకు చైతన్యాతీతము బ్రహ్మమనియు, పరిపూర్ణమనియు, పరమాత్మయనియు జెప్పడమైనది ఈ చైతన్యాతీతము బ్రహ్మమని చెప్పడ మెందుల కనగా, బ్రహ్మయొక్క మహిమాతిశయము దెలుపుట కొఱకే విశ్వరూపదర్శనమున గీత యేకాదశాధ్యాయమున దీని వర్ణన గలదు మఱియు నంతఃకరణమును, అంతఃకర ణోపహితచైతన్యమును, అవిద్యయు జేరి జీవు డనంబడును కావున నంతఃకరణము నకును, అంతఃకరణోపహితచైతన్యమునకును అతీతమైనది బ్రహ్మయని దెలుపుట కొఱకట్లు చెప్పడమైనది అది జీవచైతన్యము, అదియే తన స్వరూపము అదియే బ్రహ్మము అది విభుస్వరూపము అది కేవలము శుద్ధచైతన్యము అనగా జ్ఞానము అది శుద్ధమగు పంచదార వంటిది మధురమయమే తక్కిన సూర్యాదులును, అంతః కరణమును, ప్రాణాది పంచవాయువులును పంచదార గలిసిన పిండివంటల వంటివి వీటియందు తీపి లేని పిండిపదార్థములు గలవు కావున శుద్ధమధురములు గావు అందువలనే బ్రహ్మమున కానందమే స్వభావమని శ్రుతి చెప్పుచున్నది కావుననే చైతన్యాతీతమని చెప్పిరి సూర్య, అగ్ని , అంతఃకరణ, ప్రాణాదులలో

గల జడత్వమును తొలగించి శుద్ధచైతన్యమును గ్రహించుకొన వలయును. దీనినే లక్షణావృత్తి న్యాయ ముపదేశించుచున్నది ఏలయన! బ్రహ్మము సమస్త చరాచర వస్తువులలోను అనుస్యూత మైయున్నది బ్రహ్మము అణువు నందును, మహత్తునందును వ్యాపించియున్నది

కాబట్టి బ్రహ్మమును గ్రహించుటయు, జడమును త్యజించుటయు బుద్ధి మంతుల పనిగా నుండవలెను లేనిచో ఫలములోగల బెరడు మొదలైన వాటిని త్యజించ వలయునని చెప్పిన వాక్యముయొక్క యర్థమును గ్రహింపక పండులోగల గుజ్జును లేక రసమును గూడ త్యజించిన మూఢుని భంగినుండును ఇదియే శాస్త్రమందుగల రహస్యము కావున విచారణలోగల మహిమ యిదియై యున్నది ఆలాగున తిలాది బీజముల గానుగలో వేసి పిండిని త్యజించి అందుగల తైలమును గ్రహించునట్లిచట గూడ గ్రహించవలయును అట్లు జహదజహల్లక్షణను గ్రహింపకపోయినచో స్వరూప మునకే హాని గలుగును స్వరూప శూన్యమగు తన యాత్మను తానే వధించుకున్నట్లు ఆత్మఘాతకుని ఫలమే వీరికి గలుగును కనుకనే గీతలో నిట్లు చెప్పబడెను

*సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।*
*న హినస్త్యాత్మ నాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥*

ఏ కారణము వలన సకల ప్రాణులయందుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగా జూచుచున్నవాడై తనచేతనే తనను హింసించుకొనడో అందువలన నుత్తమమగు మోక్ష మును బొందుచున్నాడు మఱియు ఆత్మనుగూడ నుపేక్షించువానికి యాత్మహత్య జేసిన పాపము గలుగును కాని యాత్మజ్ఞానమును సంపాదించిన పుణ్యావిశేషమగు మోక్షము గలుగదు కాబట్టియే-

*సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।*
*వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥*

అని చెప్పబడినది దీని యర్థమిదివరలో వ్రాయబడినది ''యః పశ్యతి స పశ్యతి'' అట్టివాడే కన్నులు గలవాడు ఇతరుడు నేత్రములు గలిగి యుండినను

నంధుడే యని యర్థము ఈ పంచభూతాత్మక జగత్తు నవలోకించుటకే నీదృష్టికి శక్తి గలిగియుండును దీనినేది సృష్టించెనో దాని నిది చూడజాలదు దానివలన మాత్రమీదృష్టి చూడబడు చున్నది ఆ దృష్టిగలవాడే యథార్థమైన చూపుగలవాడు కనుకనే త్యాజ్యగ్రాహ్యముల దెలియక ప్రవర్తించువా డెట్టివాడో అట్టివాడే యాత్మను అనాత్మనుండి వివేచన జేసి తెలిసికొనక విడిచెడివాడును నగుచున్నాడు

*యద్భాసాద్ భాస్యతేఽర్కాది భాస్యైర్యత్తు న భాస్యతే ।*
*యేన సర్వ మిదం భాతి తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥*

ఏ బ్రహ్మ ప్రకాశముచేత సూర్యుడు మొదలగు ప్రకాశవస్తువులు ప్రకాశించునో, తనచే వెలిగింపదగిన సూర్యాది ప్రకాశవస్తువులచేత నెద్ది ప్రకాశింప జేయబడదో, ఏ యాత్మ ప్రకాశముచేత నీ సర్వప్రపంచము ప్రకాశించునో యట్టి దాత్మయని తెలియవలయును

*సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।*
*అజ్ఞానచక్షుర్నేక్షేత! భాస్వంతం భాను మంధవత్ ॥*

ఆత్మజ్ఞానమనెడి నేత్రముగలవాడు సమస్తమందు వ్యాపించియుండు సచ్చిదానంద స్వరూపాత్మను తననుగా చూచుచున్నాడు జ్ఞాననేత్రము లేనివాడు, ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాడు చూడ జాలని చందంబున నాత్మను చూడ జాలడు ఈ చైతన్యము సప్తవిధములుగ శాస్త్రమందు గలదు

*శుద్ధ మీశ్వరచైతన్యం జీవచైతన్య మేవ చ ।*
*ప్రమాతా చ ప్రమాణం చ ప్రమేయుంచ ఫలం తధా ॥*

*ఇతి సప్తవిధం ప్రోక్తం భిద్యతే వ్యవహారతః ।*
*మాయోపాధివినిర్ముక్తో శుద్ధ ఇత్యభిధీయతే ॥*

*మాయాసంవర్తిత శ్చేశో జీవోఽవిద్యావశస్తదా ।*
*అంతఃకరణ సంబంధః ప్రమాతేత్యభిధీయతే ।*
*తధా తద్వృత్తి సంబంధం ప్రమాణమితికీర్తితమ్ ॥*

*అజ్ఞాన మపి చైతన్యం ప్రమేయమితి కథ్యతే ।*
*తథా జ్ఞాతుశ్చ చైతన్యం ఫలమిత్యభిధీయతే ॥*

(1) శుద్ధచైతన్యమని (2) ఈశ్వరచైతన్యమనియు, (3) జీవచైతన్యమనియు, (4) ప్రమాతృచైతన్యమనియు, (5) ప్రమాణచైతన్యమనియు, (6) ప్రమేయచైతన్య మనియు, (7) ఫలచైతన్యమనియు వ్యవహారమం దొక్కచైతన్యమే యిటుల నేడు విధంబులుగా జెప్పంబడును ఆ యేడు విధములకును భేదమేమి యనగా? మాయోపాధిరహితమగు నది శుద్ధచైతన్యము మాయా సహితమైనది యీశ్వరచైతన్యము అవిద్యా విశిష్టము అంతకరణ ప్రతిబింబితము జీవచైతన్యము ప్రమాతయనగా సర్వము నెఱుంగు సాక్షిమాత్రుడు అట్టి సాక్షిచైతన్యము ప్రమాతృచైతన్యము ప్రత్యక్షాది జ్ఞాన కరణమగునది ప్రమాణచైతన్యము యధార్థముగ తెలియదగిన ప్రపంచాదుల 'అజ్ఞా నము' ప్రమేయ చైతన్యము యధార్థజ్ఞానము ప్రమా (ఫల) చైతన్యము ఒక పరి పూర్ణచైతన్యమే యిట్లుపాధి సంబంధమువలన సప్తవిధములుగా జెప్పబడుచున్నది ఉపాధినిరసనము వలన భేదము నశించి పరిపూర్ణ చైతన్యమొకటియే శేషించును అట్టి పరిపూర్ణచైతన్యరూపపరమాత్మయే తన యాత్మయని యెఱిగినవాడే ముక్తుడు

## ప్రకృతి ద్వయాతీతమే బ్రహ్మము

భారతి – ప్రకృతి ద్వయాతీతమే బ్రహ్మమని చెప్పుదానిలోగల సారము నిరూ పించి సందేహ నివృత్తిచేయ ప్రార్థన

గురుడు – ప్రకృతి ద్వయరహితమే బ్రహ్మమను వాక్యము సామాన్యముగ నెల్లరచేతను నంగీకరింపబడినదే ఇది పైన జెప్పిన చైతన్యాతీతమే బ్రహ్మయను వాక్యమువలె దుస్తరమైనది కాదు

*కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।*
*కార్యకారణతాం భిత్వా పూర్ణబోధో విశిష్యతే ॥*

కార్యోపాధి గలవాడు జీవుడనియు, కారణోపాధిగలవాడీశ్వరుడనియు, నీ యుపాధి ద్వయమును తొలగించిన పరిపూర్ణ బోధము శేషించును దానినే పరిపూర్ణమనియు, పర బ్రహ్మ మనియును జెప్పుదురు ఈ జీవచైతన్యములు పైన జెప్పిన సప్తవిధచైతన్యములలో నిరూపింపబడినవే ఇది వేదాంతశాస్త్రసమ్మతము మఱియు ''ప్రకృతి ద్వయాతీతమే బ్రహ్మ'' యను దానికి మఱియొక యర్థము గలదు ఈ సిద్ధాన్తము విశిష్టాద్వైత సమ్మతము అది చిత్, అచిత్, చిదచిత్ విశిష్టుడగు నీశ్వరుడు ఆ యీశ్వరుని విష్ణువనియు, శ్రీమన్నారాయణుడనియు, బ్రహ్మమనియు, పరబ్రహ్మ యనిగూడ జెప్పుదురు చిద్రూపుడగు జీవుడును, అచిద్రూపమగు జగత్తును నీరెండింటికి సాక్షియై సర్వాంతర్యామియై యీ రెండింటిని భరించునది యేదిగలదో యదే యీశ్వరుడు అనగా భగవంతుడు

కావున ప్రకృతిద్వయ రహితుడు సర్వేశ్వరుడు విష్ణు మూర్తియని వైష్ణవులును, దీనినే పాశపతి, పశుపతి, పరమేశ్వరుడు, శివుడని శైవులును వచింతురు పశు,(జీవుడు) (పాశమన మాయ) పతి, (అధిపతి) యనియు, పరమ శివుడనియు పేర్లు మాత్రమే భేదము గాని తాత్పర్య మిరువురకు నొకటియే ప్రపంచములో గల యాస్తికమతము లన్నియు నీలాగున తెలుపుచుండును కావున పరమేశ్వరోపాసనచే జీవులకు ప్రకృతి దోషము నశించవలసి యుండును అప్పుడే మాయ యను బంధమునుండి విమోచనము గలుగును దానికే మోక్షమని పేరు సర్వేశ్వరుని కరుణవలననే యవిద్య జీవులకు నశించవలసియుండును కనుక భగవద్భక్తి తప్ప ముక్తికి మార్గాంతరము లేదు అది శివభక్తియైనను లేక విష్ణుభక్తియైనను నుండవలయును శివభక్తిని శైవులును, విష్ణుభక్తిని వైష్ణవులును గలిగయుండవలయునని చెప్పుదురు తక్కిన భేదములు అతి స్వల్పములు

జీవు లీశ్వరాంశులని యుభయులు నంగీకరింతురు అయినప్పటికిని జీవులు బద్ధులు, ఏకదేశ మందుండువారు, అణుస్వరూపులు, కించిజ్ఞులు ఈశ్వరుడు ముక్తుడు, వ్యాపకుడు, విభుడు, సర్వజ్ఞుడు అట్టి యీశ్వరుని కరుణవలన జీవులు బంధవిముక్తులు కావలయును బంధమేమన? త్రిగుణములను మూడుపాశములు ఒక పశువును వెనుక రెండుకాళ్ళను, ముందు రెండుకాళ్ళను

శిరమునందుండు కొమ్ములను, మ్రానుకు కట్టివేసి యుండినచో నా పశు వేలాగున బంధనమందు చిక్కు కొని స్వాతంత్ర్యము లేక సంకటపడవలసి యుండునో, ఆలాగున సత్త్వ, రజ, తమస్సు లనెడు గుణములచే జీవులు సంసారమందు బద్ధులై జనన మరణ దుఃఖముల నను భవించుచుందురు బంధవిముక్తి గలిగిన పశు వేలాగున స్వాతంత్ర్యము గలిగి సుఖించునో, ఆ రీతిగ గుణత్రయవిముక్తిగల జీవుడును బంధవిముక్తి నొంది శాశ్వత సౌఖ్యమును పొందగలుగును ఈ త్రిగుణముల సామ్యావస్థకు మాయ యనియు, ప్రకృతి యనియు, అవిద్యయనియు పలు పేర్ల గలవు ఈ మాయతోగూడి యుండు వఱకు సుషుప్తిలో నుండువారివలె ''తామెవరు? ఎచ్చటనుంటున్నాము! దేని నిమిత్తమిచ్చటికి వచ్చితి '' అని తెలిసికొనజాలకుందురు ఆలాగున తనయొక్క యీశ్వరాంశస్వరూపమును మరుగుపడి యుండును జాగ్రదవస్థలోనికి వచ్చినవారు ''తామెవరు? ఎచ్చటనుంటున్నాము, దేనికొఱ కిచ్చటకు వచ్చితిమి? ఇక తమ కర్తవ్యమెద్ది? ఇచ్చటనుండి యెచ్చటికి వెళ్ళవలయును?'' ఈ విషయముల నన్నిటిని యెట్లు స్వయముగా తెలిసికొనగలరో, ఆలాగున నవిద్యావిమోచనము గల జీవులకు తమ స్వరూపజ్ఞానము గలుగును అప్పుడు తమయొక్కయు, నీశ్వరునియొక్క జ్ఞానము గలుగును ఇదియే వారియొక్క జ్ఞానమని తెలుపుదురు

నిద్రలో నుండువారు పండితులుగాని, పామరులుగాని, భూపాలురుగాని, గోపాలురుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, స్త్రీలుగాని, పురుషులు గాని, స్వరూపజ్ఞానరహితులై యెట్లు జాగ్రదవస్థయందున్న వారిచే మేల్కొలుపబడుదురో, అట్లే అవిద్యా విముక్త జీవులు పరమేశ్వరుని కరుణవలన మేల్కొలుపబడి స్వరూప జ్ఞానము గలవారై మోక్షము నొందుదురు ఆ మోక్షస్థానము వైష్ణవులకు వైకుంఠము గాను, శైవులకు కైలాసము గాను చెప్పబడియున్నది ఇది దీనియొక్క రహస్యము

## స్వానుభవాతీతమే బ్రహ్మము

భారతి – స్వానుభవాతీతమే బ్రహ్మమని చెప్పెడి దానియొక్క గూఢార్థము గూడ దెలిపిన యెడల మఱల నీ నాల్గు మహావాక్యములను గుఱించి యేలాటి

సందేహమున్ను గలుగదు

గురు – భారతీదేవీ! ఈవిషయము పైనచెప్పిన దానికన్న మరింత క్లిష్టమైనది ఇది వేదాంతశాస్త్రపరిచయమువలననే గోచరము గాగలుగును స్వానుభవాతీతమే బ్రహ్మమని చెప్పినచో ననుభవము లేనిదే బ్రహ్మజ్ఞానమని యంగీకరించవలసి యుండును అనుభవము గలదానికే జ్ఞానమని యర్థము అనుభవము లేనిదాని కజ్ఞానమే తాత్పర్యము ప్రపంచములో దేనిని గురించిగాని యెవరినైన దీనియందు మీ కనుభవము గలదా? యని యడుగగా ననుభవములేదని చెప్పినచో నావిషయమై యతనికి తెలియదనిగదా యర్థము ఈ విషయము నెట్టి పామరులైన నంగీకరించవలసినదే అట్లయినచో పరిపూర్ణముగా మాత్ర మొకటి గలదు అదియే యనుభవమని యెట్లు తెలుపగలరు? అట్లయినచో నదియును స్వానుభవరహిత మనియే చెప్పవలసి యుండును అప్పు డది నందియో, లేక పందియో, విషమో, యమృతమో, దయ్యమో, దైవమో, అంధకారమో, ప్రకాశమోయని యనుభవము లేని మతమొకటి ప్రపంచమున గలదా? ఏ మత మైనను దానికి నొక సిద్ధాంత ముండవలయును అది యా మతకర్తయొక్క యనుభవమై యుండును అనుభవము లేదని చెప్పెడి భాషణములు బాల భాషణమనియే విజ్ఞుల మతము లేక భ్రాంతి భాషణ మనియే శాస్త్రములో పేర్కొనియున్నారు

మఱియు మీకు మీ గురువులు అనుభవపూర్వకముగా జెప్పిరా? మీకుగూడ నట్టి యనుభవము గలిగినదా? యని యడిగినచో మా గురువుగారికిని అనుభవము లేదు నాకును అనుభవము సున్న అట్లయిన మీ శిష్యులకు మీ రేమి బోధించగలరు? ఇట్టి వ్యవహారము బధిరాంధన్యాయమని యిదివఱలో తెలుపబడియున్నది ఒక విషయమును ప్రతిపాదించు నపుడు ఆది, మధ్య, అంతము లుండవలయును ఆదియు లేదు అంతము లేదని చెప్పినచో, మధ్యగూడ లేదనియే దాని యర్థము వేదాంత వాక్యములయొక్క ఉపక్రమోపసంహారముల యొక్క యిట్టి ధర్మము తెలియకపోవుట ఇట్టి వాక్యములు ప్రబలుటకు కారణము అనగా ఆదినుండియు నంతమువఱకు దానియొక్క వివరము దెలియకపోవుటయే యిట్టి వాక్యములు గలుగుటకు కారణమగుచున్నది అయితే ఉపనిషత్తులయందు బ్రహ్మమును

గుఱించి వచించినపుడు ఆదిమధ్యాంతరహితమని చెప్పు వాక్యములు గలవు దాని యర్థము ఆదియును, అంతమును దెలిసికొనుటకు సామాన్యజనులకు సాధ్యముగాదనియే విశేషజ్ఞులు ఆదియును, నంతమును, మధ్యమును, ఆ పరబ్రహ్మము సత్ స్వరూపమని వచించిరి కావుననే ''సద్ఘనం చిద్ఘనం ఆనందఘనమద్వయం'' అని చెప్పుటకు కారణము దీనికే పరిపూర్ణమని గూడ వాక్యాంతరము గలదు మఱియు దేనిని దెలిసి కొంటినని చెప్పుదురో, అపుడు తెలివి, తెలిసికొనుట, తెలియందగినదియని త్రిపుటి యుండును త్రిపుటి రహితమే బ్రహ్మము, పరిపూర్ణము ఇచ్చట త్రిపుటి వ్యవహారమే కాని, పారమార్థికము కాదు ఈ వ్యవహారము లేనిచో గురు శిష్యసంప్రదాయమే యుండదు అట్లయినచో ప్రతియొకరును పరిపూర్ణమును బొంది వారితోగూడ నది నశించిపోవలసి యుండును అప్పుడు శిష్యపరంపరగాని, శాస్త్రమర్యాద గాని యుండదు అట్లయిన బ్రహ్మమును గుఱించి ప్రతిపాదించెడు వేదాంతశాస్త్రమే యుండి యుండరాదు కావున నీలాటి స్థలములో బోధకులు జాగరూకత వహించి తెలుప వలసియుండును

మఱియు దేనికి ఆదియును, అంతమును నుండునో అది దేశమునకును, కాలమునకును లోబడిపోవునదగుటచే దానికి నాశమును తప్పక గలుగును నాశము గలదాని నాశ్రయించువారికి గూడ నాశము సిద్ధము మఱియు దేశకాలములకు లోబడి యుండు దానికి వ్యాపకత్వముండదు దేనికి వ్యాపకత్వము లేదో దానికి సర్వజ్ఞత్వము గలుగదు ఈలాటి దోషము లనేకములు గలుగునని తలంచుటే యాది మధ్యాంత రహితమని బ్రహ్మమును చెప్పుటకు కారణముగాని స్వానుభవ రహితమగుటవలన కాదు మఱియు అనుభవమని చెప్పినచో దేనివల్ల ననుభవించినారని ప్రశ్న గలుగును అప్పుడు బుద్ధివలనగాని, మనస్సువలనగాని, చక్షురాదీంద్రియముల వలనగాని యనుభవించితిమని చెప్పవలసియుండును అట్లయినచో జడములైన యింద్రియములచే చైతన్యమగు నాత్మను తెలిసికొన సాధ్యము కాదని చెప్పెడి శ్రుతులకు విరోధము గలుగును తైత్తిరీయ శ్రుతియందు ''యతో వాచో నివర్తంతే'' అని కలదు ఇచ్చటనే దీనియొక్క కీలకము గలదు

మనస్సు-బుద్ధి మొదలగు వాని నాత్మ తెలిసికొనుచుండును ఆత్మబోధమును జూడుడు

*ఆత్మాఽవభాసయ త్యేకో బుద్ధ్యాదీనీంద్రియాణ్యపి ।*
*దీపో ఘటాదివత్స్వాత్మా జడైస్తైర్నావభాస్యతే ॥*

అంధకారమందుండెడు కుండ మొదలగునవి దీపముచేత తెలియజేయ బడినను, ఆ దీపము ఆ కుండ మొదలైనవాటిచేత తెలియజేయబడనట్లు, ఆత్మ అహంకారము మొదలైన వాటినన్నిటిని తోపింపజేసినప్పటికిని నీ బుద్ధ్యాద్యహంకారము లాయాత్మను దెలియజేయనేరవని ముముక్షువులు తెలిసికొనవలయును

మఱియు నిచ్చట తప్తాయః పిండన్యాయ మొకటి గలదు తప్తాయస్సనగా కొలిమిలో నుండు ఇనుము అగ్నివలె దహన ప్రకాశములు గలిగియుండును ఇచ్చట నినుము కాలుచున్నదని వ్యవహారము గలదు కాని కాలెడు స్వభావము అగ్నిదేకాని యినుముది కాదని వివేకు లెట్లు తెలిసికొనుచున్నారో, ఆలాగున బుద్ధ్యాదీంద్రియములద్వారా నాత్మయే అన్నిటిని తెలిసికొనుచున్నను మనస్సు తెలిసికొనుచున్నదను వ్యవహారము గలిగియున్నది ఆలాగున దుర్భిణీ యంత్రసహాయముచే మిక్కిలి దూరస్థ వస్తువులను తెలిసికొనుచున్నారు కాని యంత్ర సహాయముచే మనుజుడు తెలిసికొనుచున్నాడనే వ్యవహార మెటువంటిదో ఇదియును నటువంటిదే వస్తువులను ప్రతిఫలింపజేయు శక్తి యంత్రమందు గలదు కాని యది ఫలానివస్తువని తెలిసికొను జ్ఞానము మనుజుని యందే గలదు ఆలాగుననే రేడియో వార్తగాని, తంతివార్త గాని వచ్చినను ఆ శబ్దమును గలుగజేయు సామర్థ్యము యంత్రమందున్నదేగాని యది ఫలాని విషయమని యంత్రమునకు దెలియదు ఆలాగున మూడు శరీరములకును విషయములను తెలిపెడి శక్తి గలదుగాని, విషయము ఫలానిదని వాటికి దెలియదు అది యాత్మకు మాత్రము దెలియును కావుననే యాత్మ జ్ఞానస్వరూపమని శ్రుతి శాసించుచున్నది మనుజుడు తన నితరులను తెలిసికొనునట్లు ఆత్మ తన యొక్క జ్ఞానావస్థను, పరవస్తువులను తెలిసికొను చుండును బాహ్యవృత్తులను విడిచి తనయొక్క స్వమహిమయందు

నిలుచునపుడు తాననంతస్వరూపుడనని యనుభవము గలుగును కావుననే కఠోప నిషత్తునందు

*పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాజ్ పశ్యతి నాన్తరాత్మన్।*
*కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ ॥*

బ్రహ్మ సర్వేంద్రియములను ఆత్మభిన్నములగు శబ్దాది విషయములను గుఱించి ప్రకాశించు వానినిగా సృజించినాడు కాన నవి విషయములను గుఱించియే ప్రకా శించును గాని, యాత్మస్వరూపమును జూడలేవు అయినను ఒకానొకడు బ్రహ్మ చర్యాది సాధనలచే ధీరుడై మోక్షమును గోరువాడై యింద్రియములను బాహ్యవిషయ ముల నుండి మరలించి యాత్మస్వరూపమును గాంచుచున్నాడని చెప్పబడినది

దర్పణము దృశ్యమువైపు త్రిప్పియుంచినచో దానియందు తన శరీరము కనుపించదు దృశ్యము మాత్రము దానియందు ఫలించును ఆ యద్దమును తనవైపు త్రిప్పినపుడు దృశ్యము కనుపించక తన దేహమెటుల ప్రతిఫలించునో, యాలాగున నంత ర్ముఖ దృష్టి గలుగువఱకు నాత్మదర్శనము గలుగదు మనస్సు అంతర్ముఖముగా తిరుగవలసియుండినచో, నిర్విషయత్వమును, నేకాగ్రతయు, హృదయ శుద్ధియును గలుగవలయును యోగ, ధ్యాన, తపో, వ్రతాదులన్నియు నుపాసనయును దీనికొఱకేర్పడినవి మఱియు ప్రపంచములో నేపని నెవరు చేయుదురో దానివలన నేదో యొక ప్రయోజన ముండవలయును ''ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే'' ఎంత మందుడైనను ప్రయోజన శూన్య మగు పనిని జేయడు అట్లుండగా విశేష పుణ్యమహిమచే బ్రహ్మజిజ్ఞాస గలిగియుండు విజ్ఞానవంతుడు బ్రహ్మోపలబ్ధికొఱకు గదా వేదాంతవిచారణను జేయును! దాని ఫలము స్వానుభవ రహితమని యెట్లు చెప్పదగును? దానివలన సంపూర్ణ శాంతియు, నిరతిశయ సుఖానుభూతియు గలుగుచున్నదని శాస్త్ర ముపదేశించుచుండగా, ననుభవరహితమే, శూన్యమే ఫలమని చెప్పిన వాక్యమున కర్థమేమైన గలదా? ఇపుడు మీరు చెప్పిన నాలుగు వాక్యములకును నర్థమొకటియే

# భా వా తీ త మే బ్ర హ్మ ము

భారతి – భావాతీతమే బ్రహ్మమని కొందఱు చెప్పుచుందురు పైనుండి చెప్పుచు వచ్చిన యీ నాలుగును మహావాక్యములని వారు చెప్పెదరు

గురుడు – ఈ వాక్యములు వేదాంతశాస్త్రములో గల నాలుగు మహావాక్యములు కావు ఇదివఱలో మీరడిగిన దానికి సమాధానము చెప్పడమైనదని గ్రహించుకొన వలయును వేదాంతమహావాక్యముల నుదాహరించెదను (1) ప్రజ్ఞానం బ్రహ్మ (2) అహం బ్రహ్మాస్మి (3) తత్త్వమసి (4) అయమాత్మా బ్రహ్మ, దీనియొక్క వివర మంతయు నిదివఱలోనే తెలుపబడినది మీకు జెప్పినవారు గూడ కర్మ ప్రతిపాదకములగు వేదములనే శోధించిరి గాని వేదాంతమును పరిశోధించి యుండలేదు వారు వేదము నంగీకరించినందుచే నాస్తికత్వము నొందకపోయిరి ఇది సుకృత విశేషమనియే చెప్పవచ్చును కావుననే పరిపూర్ణ బ్రహ్మము నంగీకరించిరి ఇక నీలాటి ప్రశ్నలనడుగ వలసియుండినచో ప్రశ్నింపవచ్చును కాని శాస్త్రముయొక్క పూర్వోత్తర విచారణ చేయనందుచే అనేకులు దీనియొక్క తత్త్వసారము దెలియక బ్రహ్మానంద సుఖమును పొందకపోవచ్చునని తలచి వీటికి సమాధానము చెప్పుట కిష్టము లేకున్నను దీనిలోగల నిగూఢార్థమును వచించెద పై ప్రశ్నలను చేయు వారు గూడ వేదాంతము నంగీకరించి యుండినందుచేతను తెలుపుట కిచ్ఛ గలుగుచున్నది పరిపూర్ణమనియు, పరబ్రహ్మమనియు, పరమాత్మ యనియు, భూమ యనియు నీ బ్రహ్మముయొక్క పర్యాయనామములే ఎట్లన తీర్థమనియు, ఉదకమనియు, జలమనియు, నీరనియు నెట్లు వ్యవహరింతురో ఇదియును నటువంటిదే కావున నింతవఱకైనను తెలుపడమైనది ఇప్పుడు భావాతీతముయొక్క రహస్యము తెలిపెద

*అదృశ్యే భావనా నాస్తి దృశ్య మేత ద్వినశ్యతి ।*
*అవర్ణమస్వరం బ్రహ్మ కథం ధ్యాయంతి యోగినః ॥*

కనబడిన దానియందు భావన లేదు కనబడుచున్న యీ ప్రపంచము నశించు చున్నది రూపము లేనిదియును, శబ్దాదులకు గోచరము కానిదియు అగు

బ్రహ్మమును యోగులెట్లు ధ్యానము చేయుచున్నారు? ఇచ్చటనే భావాతీతము యొక్క రహస్యము గలదు అయినను గురుధ్యానములో ''భావాతీతం త్రిగుణరహితం తత్త్వమస్యాది లక్ష్యం'' అని యుండుటచే తత్త్వమస్యాది మహావాక్య మేబ్రహ్మము నుపదేశించుచున్నదో ఆ ప్రజ్ఞానము బ్రహ్మమను స్వరూపస్థితిలో నుండువారికి దానికన్యముగ భావించుటకు మఱియొకటి లేనందుచేత భావాతీతమని చెప్పబడును ఇంద్రియములు జడములగుటచే చైతన్యాత్మను భావనను జేయుటకు వాటికి శక్తి లేనందుచేతను భావాతీతమనంబడును కనుకనే ''అదృశ్యే భావనా నాస్తి దృశ్య మేతద్వినశ్యతి'' అని నిరూపించుటకు కారణము అదృశ్య వస్తువునందు భావనయే గలుగదు దృశ్య వస్తువునందు భావన కలుగును గాని ''యద్దృశ్యం తన్నశ్యతి'' అని ప్రమాణముండుటచే భావనకు లోబడినది తప్పక నశించునదే కావున నీ రెండు ధర్మములలో యోగులు ఆత్మ నెట్లు ధ్యానము జేయగలరని ప్రశ్న గలిగినది ఇదియే దీనిలోగల సారము

*ఆత్మాఽఽవ భాసయత్యేకో బుద్ధ్యాదీనీంద్రియాణ్యపి ।*
*దీపో ఘటాదివత్స్వాత్మా జడైస్తైర్నావభాస్యతే ॥*

అంధకారమందుండెడు కుండ మొదలైనవి దీపముచేత తెలియజేయబడి నప్పటికిని దీపము ఆ కుండ మొదలైనవాటిచేత తెలియజేయబడనట్లు, ఆత్మ బుద్ధ్యాది అహంకారము మొదలైనవాటినన్నిటిని తోపింప జేసినప్పటికిని ఈ బుద్ధ్యాద్యహంకారము మొదలైనవి ఆ యాత్మను తెలియజేయనేరవని ముముక్షువు తెలిసికోవలసినదనుట ఈ తత్త్వము కేవల మహావాక్యానుభవమందు నిలకడ గలవారికి మాత్రము గోచరించును

*ఆత్మమంత్రస్య హంసస్య పరస్పరసమన్వయాత్ ।*
*యోగేన గతకామానాం భావనా బ్రహ్మ చక్షతే ॥*

ఆత్మమంత్రమునకును, బ్రహ్మప్రతిపాదకమైన జీవునకును అన్యోన్య ప్రతిపాద్య ప్రతిపాదక భావసంబంధ ముండుటవలన చిత్తవృత్తి నిరోధరూపమైన యోగధ్యానము చేత సంకల్పములు లేనివారియొక్క భావనాధ్యానము బ్రహ్మమని

చెప్పుచున్నారు అంతః కరణ వృత్తులు నశించినవారి బ్రహ్మభావన యేది గలదో అదియే భావాతీతము

*ప్రాప్తే జ్ఞానేన విజ్ఞానే జ్ఞేయే చ హృది సంస్థితే ।*
*లబ్ధశాంతిపదే దేహే న యోగో నైవ ధారణా ॥*

అమానిత్వాది జ్ఞానముచేత పరమాత్మజ్ఞానము పొందబడిన దగుచుండగను, జ్ఞేయము హృదయమునందు ప్రకాశించుచుండగను, జీవుడు పరమ శాంతిపదము పొందుచుండగను, మఱల యోగము లేదు, ధారణయును లేదు అనగా నద్వయపదమగు పరమ శాంతిపదమును బొందుచుండగా రెండవ వస్తువు లేనందుచే నెవడు దేనిని భావించును? భావనచేయుటకు మఱియొకటి లేనందుచేత భావాతీత మనంబడును

*తిలమధ్యే యధా తైలం క్షీరమధ్యే యధాఘృతమ్*
*పుష్పమధ్యే యధా గంధః ఫలమధ్యే యధా రసః ।*
*కాష్ఠాగ్ని వత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్ ॥*

నూవులయందు నూనెవలెను, పాలయందు నేయివలెను, పువ్వులయందు పరిమళమువలెను, ఫలములయందు రసమువలెను, కట్టెలయం దగ్నివలెను, ఆకాశమందు వాయువువలెను అది చరించును పై జెప్పిన వాటివలె దేహమందు దేహియగు దైవము వెలుగుచున్నది తిలాది పూర్వోక్త వస్తువుల యందలి సారమును, వాటికి జేయవలసిన క్రియలచేత నే లాగున జనులు గ్రహించు చుందురో, ఆలాగున ధ్యాన జ్ఞానాది యోగములచే తన యాత్మను గూడ కనుగొన వలసియుండును అట్టి ఆత్మ దైవమయమై తానై నిలుచుటయే భావాతీత మనంబడును

*స్వబోధే నాన్యబోధేచ్ఛా బోధరూపతయాఽఽత్మనః ।*
*న దీపస్యాన్యదీపేచ్ఛా యధా స్వాత్మ ప్రకాశనే ॥*

ఏ తీరున దీపమునకు తనయొక్క స్వరూపమును తెలియ జేయుటందు మరియొక దీప ప్రకాశము కావలయు ననెడి యవసరము లేదో, ఆతీరున ఆత్మ,

జ్ఞానస్వరూప మగుటచేత ఆత్మకు తనయొక్క స్వరూపమును తెలిసికొనుట యందు మరియొక జ్ఞానము కావలయు ననెడి కోరిక యక్కర లేదు ఆత్మ స్వప్రకాశమ గుట చేత పరప్రకాశమాత్మను తెలిసికొనుట కవసరము లేదు ఇదియే భావాతీతము యొక్క రహస్యము

*ఆత్మన్యేవాఖిలం దృశ్యం ప్రవిలాప్య ధియా సుధీః ।*
*భావయేదేకమాత్మానం నిర్మలాకాశవత్సదా ॥*

దృశ్యమగు సమస్తమైన ప్రపంచమును పరిశుద్ధాంతఃకరణము గలవాడు కామక్రోధాది విషయరహితమైన బుద్ధిచేత సత్యజ్ఞానానంద స్వరూపమగు ఆత్మయందు లయింపజేసి యొకటైన యాత్మను స్వచ్ఛమైన యాకాశమువలెనే చూచుచు నెల్లపుడు నా ఆత్మ తానే అని భావన జేయవలయును ఇదియే భావాతీతము ఇచట భావన జేయవలయునని యర్థము గ్రాహ్యార్థము కొరకు జెప్పడమైనదేకాని యిచ్చట భావము, భావ్యము, భావన యను త్రిపుటి లేదు

*ఏవ మాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే ।*
*ఉదితాऽవగతి జ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥*

పైన జెప్పిన ప్రకారముగ అంతఃకరణ మనెడి అరణియందు ధ్యాన మనెడి మథన మెల్లపుడును జేయబడుచుండగా నుదయించిన జ్ఞానమనెడు అగ్నిజ్వాల సమస్తమైన మూలాజ్ఞానమనెడి కట్టెలను బొత్తుగ కాల్చి నశింపజేయును

*జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదః పరే నాత్మని విద్యతే ।*
*చిదానందైకరూపత్వా ద్దీవ్యతే స్వయమేవ తత్ ॥*

జ్ఞానస్వరూపిగాను, ఆనందస్వరూపిగాను, కేవల మేకస్వరూపిగా నుండుటవల్ల పరమాత్మయందు, చూచువానియొక్కయు, తెలివియొక్కయు, జూడదగిన విషయము యొక్కయు భేదము లేదు ఆ యాత్మ తనకు తానే ప్రకాశించుచున్నది. ఇదే నిజమైన భావాతీతము దీనికన్న నీ విషయమై చెప్పదగినది లేదు ఓమ్

# అ తీ త మా ర్గ ము

భారతి – అతీతమార్గమని దేనిని చెప్పెదరు?

గురు – అతీతమార్గము నవీనము కాదు శ్రుతిస్మృతులయం దనాదిగా నీ విషయమును ప్రతిపాదించియున్నారు దీనిని సామాన్యముగ ప్రపంచాతీత మనియు, మాయాతీత మనియు జెప్పుదురు మరియు దేహేంద్రియముల కతీమనియు, ప్రకృతి కతీతమనియు పేర్లు గలవు ప్రపంచాతీతులని వైరాగ్యముగల వారిని గుఱించియు, ప్రపంచాతీత జ్ఞానవముగలవారిని గుఱించియు, ప్రపంచాతీతబుద్ధి గలవారిని గుఱించియు నా లాగున జెప్పుదురు ఏ విధముగ ప్రపంచాతీతత్వము గలవారని యా వాక్యమున కర్థమును గ్రహించవలయు ననిన, ప్రకృతిగుణములు, ప్రకృతివృత్తులు, ప్రకృతి స్వభావములు లేని వారని గ్రహించవలెను ఈ యతీతవాక్యమును గుఱించి గీత 15 అధ్యాయమున కనందగును

*ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।*
*క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥*

లోకమునందు క్షరుడును నక్షరుడును నను నిద్దఱు పురుషులు గలరు నశ్వరము లగు బ్రహ్మాది స్థావరాంతముగల సకల శరీరములు క్షరములని చెప్పబడుచున్నవి కూటమువలె నుండువాడు జీవుడు లేక అక్షరుడుగా జెప్పబడుచున్నాడు

*ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।*
*యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥*

నిత్యుడును, సర్వజ్ఞుడును, క్షరాక్షరములకంటె నితరుడును, ఉత్తముడును నగు నేపురుషుడు భూలోకము, భువర్లోకము, సువర్లోకములనబడు మూడు లోకములను స్వకీయమగు దైవశక్తిచే బ్రవేశించి ధరించుచున్నాడో, ఆ పురుషుడు పరమాత్మయని వేదములచే జెప్పబడుచున్నాడు

***యస్మాత్ క్షరమతీతోఽహమక్షరా దపి చోత్తమః ।***
***అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥***

ఎందువలన పరమేశ్వరుడనగు నేను క్షరము నతిక్రమించినవాడనో, మాయతో గూడిన చేతనులగు జీవులకంటెను నుత్కృష్టతముడనో, అందువలన లోకమునందును, వేదమునందును పురుషోత్తముడనని ప్రసిద్ధుడనగుచున్నాను

''యస్మాత్ క్షర మతీతోఽహ'' మను శ్లోకములో నతీతశబ్ద ప్రయోగము గలదు ఇచ్చట క్షరమగు దేహేంద్రియ పంచభూత సంఘమునకంటెను, పురుషుడగు జీవునికన్న నతీతుడగు పరమపురుషుడు పురుషోత్తముడనియు అతడే పరమ పురుషుడనియు, పరమాత్మయనియు దెలుపుటకొఱకే యతీతశబ్దము ప్రయోగించబడినది ఇచట జీవునకును, నీశ్వరునకును అతీతమే పరమాత్మ యనునది నిర్ణయింపలేదని సందేహపడనక్కర లేదు జీవునియొక్క యుపాధియు, నీశ్వరునియొక్క యుపాధియు అనగా కార్యోపాధియగు నవిద్యయు, కారణోపాధియగు మాయయు నిరసింపబడు నపుడు వస్త్వైకత్వము సిద్ధించును పాత్రయును, పాత్రయందుగల జలమును దూరీకరించినపుడు సూర్యప్రతిబింబము చిన్న పాత్రలోను, పెద్దపాత్రలోను నేకత్వము నొందు నట్లు, ఉపాధిద్వయమును తిరస్కరించినపు డేకత్వము సిద్ధించును కావుననే ''వస్త్వైక త్వపరిజ్ఞానా త్కోన ముచ్యేత బంధనాత్'' అని యుపదేశించుటకు కారణము కావున దోషము లేదు మఱియు మూడవ అధ్యాయమునందు గూడ నతీతార్థము గలదు ఇంకను అనుభూతిప్రకాశిక యందు పంచభూతాత్మకమగు జగత్తు క్షరమనియు, మాయావృత బ్రహ్మచైత న్యమే కూటస్థుడనియు నిర్ణయింపబడినది కావున జడమును, జీవోపాధి యును తొలగు నపుడే బ్రహ్మచైతన్యము మిగులుచుండునో, అదియే పురుషోత్తమ శబ్దమున కర్థముగాను, అతీతశబ్ద తాత్పర్యముగాను తెలుపబడియున్నది అట్టి ప్రకృతి ద్వయ దోషరహితము గలుగునపుడు ఆత్మ యుత్తమ పురుషు డనంబడును పురమందుండుటచేత పురుషుడనియు, పూర్ణుడగుటవలన పురుషుడనియు అర్థము తెలియదగును పురమునకు వివేకచూడామణియం దీలాగున వివరణ గలదు

*వాగాదిపంచ శ్రవణాదిపంచ ప్రాణాదిపంచాఽభ్రముఖాని పంచ ।*
*బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః ॥*

వాగాది కర్మపంచకవము, శ్రవణాది జ్ఞానపంచకవము, ప్రాణాది వాయుపంచకము, ఆకాశాది భూతవంచకము, అంతఃకరణ చతుష్టయము, అవిద్య, కామము, కర్మముననునీ యెనిమిదియు గూడి పుర్యష్టక మనంబడును ఇదియే సూక్ష్మశరీరము దీని యందుండు ఆత్మచైతన్యము పురుషుడు మఱియు అతీత శబ్దమునకు ప్రకృతి ద్వయా తీతమగు బ్రహ్మమని అర్థము తెలువడమైనది ఆ వాక్యము సంక్షేవముగా జెప్పెద *''అసతో మా సద్గమయ'' ''తమసో మా జ్యోతిర్గమయ'' ''మృత్యోర్మా అమృతం గమయ''*

ఓ వరబ్రహ్మమా! అసత్తునుండి నన్ను సత్తులోనికి జేర్చుము తమస్సునుండి నన్ను జ్యోతిలోనికి జేర్చుము మృత్యువునుండి నన్ను అమృతత్త్వమును బొందింవుము ఇదియే యధార్థమగు అతీతమార్గము ఈ యర్థమును గీత మూడవ అధ్యాయాంతమున శ్రీ కృష్ణభగవాను డుపదేశించియున్నాడు

*ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః ।*
*మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥*

జ్ఞానులు, లోకాదులకన్న దేహాదులు శ్రేష్ఠములు ( సూక్ష్మములు ) అట్టి దేహాదుల కన్న కరణము మొదలైన యింద్రియవములు శ్రేష్ఠములైనవి ఆ ప్రకారముగానే మనస్సు ఇంద్రియములకంటె నుత్కృష్టమైనది (పైభాగ మందుండునది) మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠమై నది ( సూక్ష్మమైనది పైభాగమున నుండునది ) ఏ యాత్మయైతే బుద్ధికంటె శ్రేష్ఠమైనదో (పై భాగమున నుంటున్నదో) ఆ యాత్మ యన్నిటికంటె శ్రేష్ఠమైనది ( పై భాగమున నుండునది ) అని చెప్పుచున్నారు

*ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాఽఽత్మానమాత్మనా ।*
*జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥*

ఓ యర్జునా! యీా విధముగ బుద్ధికంటె వ్యతిరిక్తుడైన పరమాత్మను

దెలిసికొని (సాక్షాత్కారము జేసికొని) పరిశుద్ధమైన యాత్మచేత నన్నిటిని గ్రహించి ప్రయాసచేత పొందదగినదియును, కామరూపమైనదియు, నగు మూలావిద్యను త్యజింపుము అట్టి స్థితిని పొందుటయే యతీతమార్గము నవలంబించుట యని భావము గీతయొక్క ప్రాణమంతయు నిచ్చటనే యున్నది ఇచ్చట దృశ్యమున కన్న నతీతము దేహము దేహమునకన్న నతీతములు కర్మేంద్రియములు కర్మేంద్రియములకన్న నతీతములు జ్ఞానేంద్రియములు జ్ఞానేంద్రియములకన్న నంతఃకరణములు అతీతములు అంతఃకరణములలో నతీతము బుద్ధి బుద్ధికన్న నతీతమాత్మ ఆత్మయందుగల మూలా విద్యను తొలగించినచో శుద్ధాత్మ జ్ఞానాత్మ యగుచుండును అది యన్నిటికంటె నతీతము అపుడది శుద్ధబ్రహ్మమగు చుండును దానికంటె నతీతమేమని ప్రశ్న గలుగదు అట్లు గలిగినచో దానికన్న నతీతము, దానికంటె నతీతము అని చెప్పుచు పోవుచుండిన యనవస్థా దోషము తటస్థించును లేనిచో నతీతము గలుగదు అందువలననే దాని ననవస్థా దోషమని శాస్త్రము నిర్ణయించినది అట్లుగానిచో పతిని నిరూపించుటకు సాధ్యముగాని వేశ్యా స్త్రీయొక్క ధర్మమే గలుగును ఇది కుల స్త్రీకి సంబంధించినది కాదు కులహీన స్త్రీకి సంబంధించినదే యగును ఈ యర్థము కఠవల్లి శ్రుతియందును దెలుపబడినది

*ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।*
*మనసశ్చ పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్ పరః ॥*

ఓ నచికేతుడా! స్థూలస్వరూపమగునింద్రియాత్మకంటె విషయాత్మయును, విషయాత్మకంటె మానసికాత్మయును, మానసికాత్మకంటె బుద్ధ్యాత్మయును, బుద్ధ్యాత్మకంటె నాత్మయును, ఈ ప్రకారమొకదానికంటె నొకటి యతీతమై కేవలాత్మ ర్వోత్కృష్టమై యున్నది అట్టి యాత్మను దెలిసికొనవలయును

*మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః ।*
*పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరాగతిః*

ఓ నచికేతుడా! సర్వజగదంకుర ప్రాయమగు మహత్తత్త్వముకంటె నవ్యక్తమును,

సర్వజగదంకురమునకు బీజభూతమైన యవ్యక్తముకంటె పురుషుండును నొకదానికంటె నొకటి యంతరమైనది (అతీతమైనది లేక శ్రేష్ఠమైనది లేక సూక్ష్మమైనది ) సర్వమునకు అంతరమై, పరిపూర్ణమైనది యాత్మ అట్టి యాత్మయే సర్వావసానమైనది అదియే ముఖ్యముగా పొందదగినదని యముడు బలికెను ''పురుషాన్నపరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః'' అట్టి పరిపూర్ణమగు పరబ్రహ్మముకన్న నన్యము కొంచెమైనను లేదు ''సా కాష్ఠా'' అదియే నిష్ఠయొక్క పర్యవసానము

''సా పరా గతిః'' అదియే సర్వోత్కృష్టమైన గమ్యస్థానము, అనగా సర్వమునకన్న అతీతము అదియే పరమగతి దానికావల మఱియొకటి లేదు అతీతశబ్దముయొక్క నిజమైన యర్థమిదియే స్మృతియగు గీతయును శ్రుతియగు కఠోపనిషత్తును దీనినే అంత్యముగా నుపదేశించెను ఇంకొక యతీతము గలదని చెప్పిన యెడల నది శూన్యము అనగా లేనిది శ్రుతిస్మృతులను విశ్వసింపనివారు నాస్తికులని యంత్యమున శ్రుతులు పదేశించినవి అదెట్లన! సరోవరములకు, కాలువలకు నదులాధారములు నదులకన్నిటికిని సముద్రమాధారము సముద్రమున కాధారమేమని యడుగుట ఎంత యసంగతమో యిదియును నటువంటిదే కావుననే ''సా కాష్ఠా సా పరాగతిః'' అదియన్నిటికన్న నతీతమనియు అన్నిటియొక్క యంత్య మనియు శ్రుతిస్మృతులు దెలుపుచున్నవి

## సచ్చిదానందరహితము

భారతి – అతీతముయొక్క యర్థము స్పష్టముగా తెలియడమైనది ఇక సచ్చిదానంద రహితమే మోక్షమని చెప్పుటలో గల రహస్యము తెలియుట లేదు ఇదియును గొప్ప సందేహమగుటవలన తమరి నడుగడమైనది

గురు – **అసంశయవతాం ముక్తిః సంశయావిష్టచేతసామ్ ।**
**న ముక్తిర్జన్మ జన్మాంతే తస్మాద్విశ్వాసమాప్నుయాత్.॥**

శాస్త్రమునందు గురువాక్యమునందు దృఢవిశ్వాసము గల వానికి ముక్తి సులభము కాని యది యగునా? లేదా? యని సంశయము గలవారికెన్ని జన్మముల

కైనను ముక్తి గలుగదు కావున వివేకి యగువాడు ఈశ్వరుని యందును, శాస్త్రము నందును, గురువాక్యము నందును విశ్వాసము గలిగి యుండవలెను అని యోగవా సిష్ఠము నందు గలదు కావున సంశయములుండు వఱకు ముక్తి లేదు కనుక నిస్సంశ యస్థితి కలిగేలాగున జేసికొన వలయును

ఓ భారతీదేవిగారూ! మీ ప్రశ్నలను జూడగా గార్గి యాజ్ఞవల్క్యునితోను, ఆలాగుననే మైత్రేయి యాజ్ఞ వల్క్యమునితోను, సులభాయోగిని విదేహుడగు జనకునితోను ప్రశ్నలను చేసినట్లున్నది వ్యాపారస్థులకు సామానులు కొనేవారు వచ్చి దానివెల యెంత? దీని వెల యెంత? దానినెంతకిచ్చెదరు? దీనినెట్లమ్మెదరు? అని యడుగు చుండిన చెప్పిన వెలకు సామానులు కొనుచుండినచో వారి కెంత సంతోషమో ఆలాగున సంశయముల నడిగి గ్రహించి యాచరించువారికి జెప్పుటకును బ్రహ్మనిష్ఠులకు మిక్కిలి సంతోషము గలిగియుండును అయితే కొందఱు దాని వెల యేమి? దీని వెల యేమి? యని యడుగుచు అది యేమి? ఇది యేమి? అని యొక్కొక్క సామాను గొప్ప గొప్ప వెలగల దానినెత్తి చూపగా దాని జెప్పునపుడు కట్టకడకేమియు కొనకనే వెళ్ళి పోవువారివలె చేయరాదు అది మాత్రము చాలజాగరూకతతో జ్ఞాపకముంచుకొనవలయును ఏలయన! బ్రహ్మనిష్ఠులు మితభాషణము గలవారు వ్యర్థముగా నొక వాక్యమునైన నుచ్చరింపరు వారి సమయము చాల విలువ గలది వ్యాపారనిపుణత్వము గలవారు పృచ్ఛకుని స్థితి గ్రహించుకొనియే మాట్లాడుదురు ఆలాగున సంశయములు ప్రశ్న చేయువారిని జూచియే సంభాషింతురు మఱియు విద్యార్థులలో బాగుగ చదువుచున్న వారుగా నుండిన ఉపాధ్యాయులకు జెప్పుటకెంత ప్రీతియో ఆలాగున ఆచరించువారి ప్రశ్నలకు సమాధానమిచ్చుటకును బోధకులకంత ప్రీతి గలిగియుండును చెప్పిన పాఠమునే సరిగా చదువని సోమరులడిగినను నుపాధ్యాయు లకు జెప్పుట కేలాగున ఇష్టముండదో ఇచట గూడ నాలాగున గ్రహించుకొనవలయును కావున మీరు చక్కగా గ్రహించువారును, ఆచరించువారును, నితరులకు బోధించువారునునై నందుచే నెన్ని ప్రశ్నలు వేసిననంత సంతోషమే కాని కొంచమైనను విసుగులేదు

ఈ సచ్చిదానంద వాక్యములలో మూడు పదములు గలవు (1) సత్, (2) చిత్, (3) ఆనందము ఈ మూడింటియొక్క యర్ధమును చక్కగా గ్రహించినచో సచ్చిదానంద రహితమే పరిపూర్ణము లేక బ్రహ్మమని చెప్పరు ఏలయనగా నట్లు చెప్పినచో భస్మాసురుని తపోమహిమ తననే నశింపజేసినట్లగును ఏలయన? ''సత్'' అను శబ్దమునకు త్రికాలాబాధ్యమని యర్థము అది త్రిగుణములకును, దేహత్రయమునకును, సృష్టిస్థితి లయములగు త్రికాలములకును అతీతము అదియే బ్రహ్మము అట్లుగాక ''సత్'' కాదని చెప్పినచో వారు చెప్పునది అసత్తే కావలసియుండును కావున వారు చెప్పు మోక్షము నాశరహితము గాదు నశించునదే యగును

అదేరీతిగ ''చిత్'' అను పదమునకు జ్ఞానమని యర్ధము అట్లు కానిది యజ్ఞానమని గ్రహించుకొనవలయును అట్లుచెప్పువారిది జ్ఞానము కాదనియు అజ్ఞానమనియు వారే యంగీకరించవలసియుండును ఇచ్చట జ్ఞానశబ్దమునకే జ్ఞేయ మనియు, ధ్యేయమనియు అర్థమును గ్రహించుకొనవలయును కనుకనే ''జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం'' అని గీతలో జ్ఞేయమును గురించి చెప్పుటకు కారణము అమానిత్వాది జ్ఞానమువలననే జ్ఞేయమగు బ్రహ్మము పొంద సాధ్యమగునని గ్రహించదగినది

ఇక ''ఆనందము'' – ఆనందము కానిది దుఃఖము అపుడు వారు చెప్పెడి మోక్షము దుఃఖమగునే గాని నిరతిశయానందప్రదము కాదని గూడ వారు ఒప్పుకొన వలసియుండును ఈలాగున పదవిభాగములజేసి నిజార్థమును గ్రహించుకొనక పోవుటచేతనే దైవదూషణము, బ్రహ్మజ్ఞాననింద, బ్రహ్మనిష్ఠులపై పరిహాసము, బ్రహ్మజ్ఞుల నవమానించుట, బ్రహ్మనిష్ఠానుష్ఠానముల దూషించుట మొదలగుననర్థములు లోకములో గలుగుచున్నవి దీనికి కారణము ఆ యా మతబోధకులు తగినవారిని తగనివారిని పరిశీలించుకొనక యుపదేశించుటయే యగును అది యధికారి, యనధికారులను శోధించి యుద్యోగమివ్వనిచో లోకములో నెంత యన్యాయము జరుగునో యీలాగుననే సంభవించును ఇట్లు చెప్పుటచేత నుద్యోగులందఱు దేశద్రోహులైనచో ప్రజలందఱును ప్రభుత్వముపై

తిరుగుబాటు జేసి ప్రభుత్వమునే యంతమొందింతురు ఆలాగున యుపదేష్ట లధికారియనధికారులను పరిశీలింపక యుపదేశము జేసినచో విజ్ఞు లందఱు చేరి యా మతము నంతమొందించెదరు ఏ మతమైన నను నశించిపోయి యుండినచో నా మతమందుగల అయోగ్యుల ప్రవర్తన దానిని నశింప జేసి యుండును ఆలాగున యే మతముగాని, సంఘముగాని, సమాజముగాని చెడకుండ నున్నచో లేక అభివృద్ధికి వచ్చుచున్నచో దాని కామతములో నా సంఘములో నా సమాజములో గల పవిత్రవర్తనయే కారణమని మరువరాదు ఇదియే మతములోగల మర్మము

## ప రి పూ ర్ణ ము

భారతి – పరిపూర్ణమనియు, బయలనియు జెప్పెడి దానియొక్క నిజార్థ మేమియో విశదముగ దెలుపకోరుచున్నాను

దీనిని వినునప్పుడే విద్యావిహీనులకు గూడ విరుద్ధముగ కనుపించుచున్నది

గురుడు – ఈ వాక్యమున పూర్వోత్తర విరుద్ధత్వము గలదు ఏలయన, పరి పూర్ణమ చెప్పి మఱల యేమియు లేదని పై వాక్యముల కర్థమును జెప్పుదురు ఒకరొక ఘటమును తెచ్చి యిది పరిపూర్ణమని వచించిరి దేనివల్ల పరిపూర్ణమని విజ్ఞాలు ప్రశ్నింపగా వట్టిది యేమియు లేదని చెప్పెడువాక్య మెట్లుండునో దీనియొక్క విధానమును నాలాగుననే యుంటున్నది అటులగాక దేనివలన పరిపూర్ణమని యడిగి నప్పుడు తేనెవలనగాని, నేతివలనగాని, పాలవలనగాని, జలమువలనగాని లేక దాని యందేది గలదో దానివలననైన పరిపూర్ణమని చెప్పవలసియుండును అయితే ఈ వాక్యము మైత్రేయి ఉపనిషత్తునందు గలదు

*అంతఃపూర్ణో బహిః పూర్ణః పూర్ణ కుంభ ఇవార్ణవే ।*
*అంతఃశూన్యో బహిః శూన్యః శూన్యకుంభ ఇవాంబరే ॥*

ఈ యాత్మ ఎక్కడుండును? ఆత్మస్వరూప మెటువంటిది? అనిన చెప్పెద ఆత్మ సముద్రములో నుంచబడిన నిండుకుండవలె బాహ్యమందును, అభ్యంతరముననను పూర్ణముగ నుండును మఱియు నాకసంబునందుంచబడిన యుత్త కుండవలె లోపలను, బయటను సర్వాసంగస్వరూపముగా గలిగినది అనగా

చైతన్యాత్మ భావములో నంతట నిండినదియు, దృశ్యమేమియు లేనిదియు నని యర్థము

ఇదే కఠోపనిషత్తు నందు 'మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః' అని చెప్పుటకు కారణము ప్రకృతికి పరమై ప్రకృతిలేనిదై యుండుస్థితియే పరిపూర్ణపరబ్రహ్మ మనంబడును అచ్చట మూలప్రకృతి లేనందుచేతనే శూన్యమని చెప్పుటకు కారణమైనది సూర్యుడు ప్రకాశముతో నిండినవాడును, చీకటిచ్చట శూన్యమనియు జెప్పు వాక్యమెటువంటిదో, ఇదియును నటువంటిదని గ్రహించవలయును ఇచ్చట తాత్పర్యమును జేయువారు భాగత్యాగ లక్షణావృత్తి వలన దీనికి సమాధానమీయవలసి యుండును లేనియెడల విషయము చెడిపోవును భాగత్యాగమనగా నిదివఱలో వ్రాయ బడియున్నది ఒకదానినుండి గ్రహించదగిన దానిని గ్రహించుటయు, త్యజింపందగిన దానిని త్యజించుటయు నగును ఇచ్చటిదివఱలో తెలిపియుండు జహల్లక్షణయును, అజహల్లక్షణయును గ్రహించవలయును అపుడు పూర్వోత్తర విరోధముండదు జలముచే నిండిన ఘటము సముద్రమధ్యమున నుంచినచో క్రిందను, పైనను, చుట్టు ప్రక్క లను, లోపలను, బయటను నేలాగున జలముచే నిండియుండునో, ఆలాగున పరి పూర్ణపరబ్రహ్మము బాహ్యమందును, అంతరమందును నిండియుంటున్నదని పరిపూర్ణ శబ్దమున కర్థము శూన్యమనగా బయలని యర్థము ఏమియు లేని స్థలమునకుగానీ, ఏమియులేని ఘటాది పాత్రలకుగాని, యేమియు లేని గృహాది భవనములకుగాని, లోపలను, బయటను నెవరు నేమియును లేదని చెప్పునప్పుడే శూన్యఘటమనియు, శూన్యగృహమనియు, శూన్యస్థలమనియు జెప్పుదురు అప్పుడిచ్చట బ్రహ్మముచే పూర్ణమనియు, బ్రహ్మేతర పదార్థము మరియొకటి లేదనియు శ్రుతిస్మృతులు చెప్పినవి

మఱియు పరిశుద్ధ బ్రహ్మనిష్ఠుని హృదయమున బ్రహ్మభావనము మాత్రమే యుండును కాని ప్రాపంచిక విషయములు గాని, వృత్తులుగాని, సంకల్పములు గాని, వాసనలు గాని, కర్మ శేషముగాని, జన్మజన్మాంతర సంస్కారముగాని యుండదను నర్థమును శ్రుతిమాత యుపదేశించుచున్నది కాబట్టి,

*యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః ।*
*అథ మర్త్యోఽమృతో భవత్యేతావదను శాసనమ్ ॥*

ఎపుడు బుద్ధియొక్క సమస్తమైన యజ్ఞానబంధములు జీవించియుండగానే భేదింప బడుచున్నవో, నశింపబడినవో అపుడే మనుజుడు మరణములేని వాడగుచున్నాడు ఇది బ్రహ్మముయొక్క శాసనము ఇదియే నిజమైన యుపదేశమని తాత్పర్యము

రాత్రికాలమున నొక ఘటములో దీపము నుంచినచో నేలాగున ప్రకాశముచే పూర్ణముగాను, అంధకారముచే శూన్యముగా నుండునో పరిపూర్ణబ్రహ్మ భావము గూడ నాలాగున నుండును బ్రహ్మదృష్టిలో లోపల ఏలాగున బ్రహ్మేతర పదార్థము కనుపించదో ఆలాగున బాహ్యమందు బ్రహ్మేతర వస్తువు కనుపించరాదు అపుడు యథార్థముగ బాహ్యాభ్యంతర శుద్ధి గలిగినవారగుదురు కావుననే,

**అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశపంచకమ్ ।**
**ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం ద్వితీయకమ్॥**

అస్తి, భాతి, ప్రియం ( సత్, చిత్, ఆనందము ) నామము, రూపము అని యైదు వస్తువులే ఏడు లోకములలోను గలవు మొదటి మూడును బ్రహ్మరూపములు తక్కిన రెండును జగద్రూపములు అనగా మాయా రూపములు

ఎట్లన! పంచలోహ విగ్రహములు యథార్థముగా ననేక ప్రకారములుగ నుండినను ఒకే పంచలోహముగానే యుండును ఆదియందును, మధ్యమునను, అంతమునను పంచలోహమయముగానే యుంటున్నవి శిల్పియొక్క పనివలన ననేక నామరూపములుగా కనుపించుచుండును వాస్తవముగ నవి లోహరూపముగా నుంటున్నవి దీనికి దగిన ప్రమాణములన్నియు నిదివఱలోనే నిరూపింపబడి యున్నవి లోహదృష్టితో జూచిన యెడల విగ్రహములు కనబడవు విగ్రహదృష్టితో జూచిన లోహము కనుపించదు ఇదియే మాయయొక్క మహిమ ఈలాగున నన్నిటిని గ్రహింపవలయును మాయ మాయికుడగు నైంద్రజాలకుని

ఇంద్రజాలము వంటిది అనేకములగు చిత్ర విచిత్రములను ఇంద్రజాలికుడు సృష్టించినను కట్టకడకు విచారించినచో నేమియునుండదు ఈ జగత్తుయొక్క స్వరూపము గూడ నటువంటిదని గ్రహించు కొనవలయును అయితే కనబడుచుండు ఈ జగత్తు లేదని యభిప్రాయమా? యని కొందఱడుగుదురు ప్రత్యక్షముగ గోచరించెడి వస్తువెట్లు లేదని చెప్పవచ్చుననియు వచింతురు ప్రమాణ షట్కములో మొదటిది ప్రత్యక్ష ప్రమాణముగాను, ముఖ్య ప్రమాణముగాను నుండగా, నాస్తికులు గూడ ప్రత్యక్షప్రమాణము నంగీకరించి యుండగా షడ్విధప్రమాణముల నంగీకరించు సనాతను లెట్లు ప్రత్యక్షముగ కనుపించెడు దానిని లేదని చెప్పెదరు? ఇచ్చట ప్రత్యక్షము గూడ ప్రమాదరహితమైన దానినే అంగీకరించవలయునని శాస్త్రనియమము కాని ప్రమాదసహితమైనదాని నంగీకరింప గూడదు

నేత్రవ్యాధి గలవానికి సమస్త వస్తుజాలము పీతవర్ణముగా కనుపించును రోగా దులచే జిహ్వాయందు నరుచిగలవానికి రుచి పదార్థములుగూడ నరుచిగానే యుండును చిత్తభ్రాంతి గలవాడే మేమియో చెప్పును ఇవియన్నియు ప్రమాదసహిత వాక్యములగుటచే నంగీకార్యములు గావు ఆలాగున విజ్ఞాననేత్రము లేనివారియొక్కయు, అజ్ఞాన విషయదోషము గలవారి యొక్కయు, మాయా భ్రాంతిచెందిన వారియొక్కయు వాక్యము లంగీకరించదగినవి కావు మాయకాధారము నామరూపములు తప్ప మఱి యొకటి లేదు నామరూపములే నానావిధ విగ్రహముల కాధారములు నామరూపములు పొందిన సువర్ణమే అనేక విగ్రహములు, లేక ఆభరణములుగా నుంటున్నది నామ రూపములు పోయిన సువర్ణమే మిగిలియుండును ఆలాగున ననేక రకములగు ఇంజనులు, కత్తులును లోహమయములే ఇంజనుల పేర్లను రూపములను జూచునపు డినుము కనుపించదు ఇనుము దృష్టితో జూచిన ఆ పేర్లును ఆకారములును నుండవు ఇది వస్త్రములకును, తంతువులకును, పాత్రలకును మృత్తికకును గూడ నన్వయించుకొనవలయును మృత్తికయు, దూదియు నినుమును నీశ్వరనిర్మితములు ఈశ్వర సృష్టిలో భేదము లేదు-పనివారిదృష్టిలో భేదము గలదు

బ్రహ్మజ్ఞాని యీశ్వర దృష్టి గలిగియుండును జ్ఞానవిహీనులు ప్రకృతిదృష్టి గలవారు ఇదే రీతిగ నినుమును, దారువును బొమ్మలను గ్రహించుకొనవలయును జ్ఞాని జగత్తును, తనను దైవభావ ముతో జూచుచుండును కావున నతనికి లోపలను బయటను నొకే దృష్టిచే బ్రహ్మముగాను మరియొక దృష్టితో బ్రహ్మేతర వస్తువులుగాను కనుపించకపోవుటచే శూన్యముగా జెప్పడమైనది

ఈ వాక్యమును తెలిసికొని యాత్మ సాక్షి, యింద్రియములు, దృశ్యములు, ఆభావవములు ప్రకృతికి సాక్షియగు తనకంటవని చెప్పెడువాక్యములు నిరాధారములని గ్రహించుకొన వలయును వేదాంతశాస్త్రములో కనుపించు ఈ జగత్తు లేదని చెప్పి యుండ లేదు దైవమయముగానుండు నీ జగత్తునందు మాయాదృష్టివలన నానాత్వము కల్పితమని మాత్రమే యుపదేశించుచున్నది అది విచారణ జేయనందుచే నేర్పడిన దోషమే యగును కనుకనే యధిష్ఠానమును దెలిసికొనిన దానియందుగల నధ్యేయ వస్తుభ్రాంతి నశించునని చెప్పుటకు కారణము దీనికే రజ్జుసర్పన్యాయము మొదలగునవి యన్నియు నిరూపించుటకు కారణమైనది ప్రకృతిగుణములుగాని, స్వభావములు గాని, ప్రాకృతవిషయములు గాని, జ్ఞానియందుండరాదు అట్లుండినచో రోగశేషము కలవాడు మఱల అనుకూలప్రదేశమున నుండి యౌషధపథ్య సేవనల జేయునట్లు తగిన పుణ్యప్రదేశమున నిర్జనప్రదేశముననుండి మనన నిదిధ్యాసనములను అజ్ఞానము నశించువఱకు జేయవలయునని శాస్త్రము విధించుచున్నది

*వస్త్వైకత్వం మహావాక్యాదేవ జానంతి యే జనాః ।*
*తే ముచ్యంతే హి సంసారాద్యథాస్వప్నప్రబోధవత్ ॥*

దీని యర్థము పైన జెప్పినదే

*అయమాత్మా స్వయంజ్యోతిర్మహానందమయశ్శివః ।*
*అయోగినః పరోక్షస్స్యాదపరోక్షశ్చ యోగినః ॥*

ఈ యాత్మ స్వయం జ్యోతియైనది మహానందమైనది, శివమైనది అయినను అయోగికి పరోక్షముగాను, సుయోగికి అపరోక్షముగా నుండును

*దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్ ।*
*సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః ॥*

దృశ్యము లేదనెడి బోధనచే నెవరికి మనస్సులోనుండి దృశ్యము తుడిచివేయబడునో అట్టి విజ్ఞాన సంపత్తి యుత్పన్నమైనచో అదియే శ్రేష్ఠమగు నిర్వాణమనియు, నిర్వృతి యనియు గ్రహించుకొనవలెను

అని శ్రుతివాక్యమును విచారణ జేయనందుచేతనే పూర్వీకులగు ఋషుల, సిద్ధపురుషుల, యోగులస్థితి యిప్పుడుండువారికి గలుగక పోవుచున్నది కావుననే వృత్తి రహితమగువఱకు, బ్రహ్మసాక్షాత్కారము గలుగువఱకు, అనుష్ఠానమును జేయవలయునని శ్రుతిమాత దెలుపుచున్నది మఱియు తైలముండువఱకే దీపము వెలుగును కట్టెలుండువఱకే హోమాగ్ని ప్రజ్వలించును ఆలాగుననే మాయ, అవిద్య, అజ్ఞాన ముండువఱకే వృత్తియు సత్త్వాదిగుణములు, సంస్కారవాసన లుండును

*యథా నిరింధనో వహ్నిస్స్వయమేవోపశామ్యతి ।*
*తథా వృత్తిక్షయా చ్చిత్తం స్వయమేవోపశామ్యతి ॥*

కట్టెలు లేని యెడల నిప్పు స్వయముగా చల్లారునట్లు వృత్తులు లేనియెడల మనస్సున్ను స్వయముగానే శాంతి నొందును కావున బ్రహ్మవస్తువు శూన్యము కాదు జ్ఞానోదయము గలుగువఱకు శ్రవణమనన నిదిధ్యాసనముల జేయవలయును మఱల సన్మాత్రమే కనుపించును

*నావిరతో దుశ్చరితా న్నాశాన్తో నాసమాహితః ।*
*నాశాన్తమానసోవాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ ॥*

ఈ యతీతమార్గము బొందుటకు దగినవానియొక్క యోగ్యత యీ శ్లోకమందు వివరింపబడినది దీని యర్థ మిదివఱలో వ్రాయబడినది

*అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాఽకృతాత్ ।*
*అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ య త్తత్పశ్యసి తద్వద ॥*

ఓ యముడా! ధర్మముకంటె నితరమైనదియు, అధర్మముకన్న నన్యమైనది యును, కార్యకారణములకు విలక్షణమైన భూత, భవిష్య ద్వర్తమాన కాలత్రయముల కతీతమగునట్టి బ్రహ్మస్వరూప మెద్దియో దానిని నీవు దెలిసికొనియున్నావు కాబట్టి దానిని నాకు జెప్పుమని తాత్పర్యము ఇదియే యతీతమార్గము దీనియొక్క సత్యము నెఱుంగక ధర్మాధర్మములు బ్రహ్మజ్ఞానులకు లేవని సామాన్య జనులుగూడ జెప్ప నారంభించిరి ఇచ్చట ధర్మశబ్దమున కర్థ మేమి యనగా! నిత్యనైమిత్తిక ఇష్టాపూర్త వర్ణాశ్రమ ధర్మము లనెడి యర్థమును గ్రహింప వలయును ఇది ప్రకృతియొక్క శుద్ధభాగము ఈ ధర్మమున కన్యమైన పాపకృత్య మధర్మ మనంబడును శుద్ధాశుద్ధ ప్రకృతుల కతీతమైనది పరబ్రహ్మము పరిపూర్ణము అది కేవలము జ్ఞేయస్వరూపము, దేహేంద్రియ మనోబుద్ధుల కతీతము అయితే అటువంటి స్థితిని బొంద వలసి యుండినచో నది దీనికి పైన జెప్పిన శ్రుతి వాక్యప్రకార మనుష్ఠించువారికి మాత్రమే సాధ్యపడును ''నావిరతో దుశ్చరితాత్'' చెడునడతలను చాలించనివాడు ఈ యాత్మను పొందడు విషయసుఖమువలన శాంతి పొందనివాడును నీ యతీతమగు నాత్మను పొంద నేరడు మనస్సుయొక్క చలనముడు గనివాడును ఈ యాత్మను పొందజాలడు అనేక విషయములతో నిలకడలేక సంచరించెడు మనస్సు గలవాడును నీ పరిపూర్ణమును బొందడు ప్రజ్ఞానముచేతనే యీ బ్రహ్మమును పొందును

*అశరీరం శరీరేష్వనవస్థితేష్వవస్థితమ్ ।*
*మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥*

ఓ నచికేతుడా! బ్రహ్మచర్యాద్యనుష్ఠాన నిష్ఠగల ధీరుడు అనిత్యములైన దేహములయందు నిత్యమై యున్నటువంటిదై శరీరము లేక అశరీరియై గొప్పదగు వ్యాపించియున్న యాత్మను తెలిసికొని దుఃఖింపడు ఇదియే యతీత మార్గముయొక్క స్వరూపము ఇట్టి స్థితిని పొందినవాడు శరీరముతో గూడియున్నవాడైనను, అశరీరియనబడును జనకుడు దేహముతో గూడియుండియు విదేహుడనియే విధముగ పిలువబడెనో, అయినను ధర్మవ్యతిరిక్తుడుగాక ఎట్లుండెనో అట్లుండవలయునను అది కాలము

దినరాత్రులకు, శుక్లపక్ష కృష్ణపక్షములకు, ఉత్తరాయణ దక్షిణాయనములకు, ప్రకాశాంధకారవములకు అతీతమై యుంటున్నట్లు ధర్మాధర్మవములకు, పుణ్యపాపవములకు జ్ఞానాజ్ఞానవముల కతీతమై పరమాత్మ యుండునని తెలుపడమైనది అయినను ధర్మముచేతను, జ్ఞానముచేతను, పుణ్యముచేతను మాత్రమే తెలిసికొనుటకు సాధ్యమగునని శ్రుతిమాత యుపదేశించినది

## అ జ ప ము

భారతి – అజపమనగా ఏమి?

గురు – అజపమనగా జపముచేయకనే జపము జరుగుచున్నదని అర్థము ఈ ''సోఽహం'' మనెడి అజపా గాయత్రిని ఈశ్వరనామము వలె జపించుట, ఆత్మశుద్ధికి హేతువు బహుకాలమువఱకును జపము జేసినయెడల, వృత్తి యంతర్ముఖమగును అప్పుడు శ్వాసము బయలు వెడలునపుడు హకారమును, (హం అనుదానిని) శ్వాసము లోపల ప్రవేశించు నపుడు సకారమును (సో అనుదానిని) ధ్యానింపవలయును దీనిని

''హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః ।
హంస హంసేత్యముం మన్త్రం జీవో జపతి సర్వదా ॥
గురువాక్యాత్సుషుమ్నాయాం విపరీతో భవే జ్జపః ।
సోఽహం సోఽహ మితి ప్రాప్తో మన్త్ర యోగః స ఉచ్యతే ॥
సకారః ఖేచరీ ప్రోక్తో త్వం పదంచేతి నిశ్చితమ్ ।
హకారః పరమేశస్స్యాత్తత్పదం చేతినిశ్చితమ్ ॥
సకారం ధ్యాయతే జన్తుర్హకారో హి భవేద్ధ్రువమ్ ॥

శ్వాస హకారముచేత బయటకు పోయి సకారమువలన మఱలి లోపలికి పోవుచున్నది హంసం హంసం అనెడి యీ మంత్రమును జీవుడు సదా జపించుచున్నాడు గురువాక్యమువలన (ఈ మంత్రజపము సుషుమ్నయందు విపరీతముగా కల్గుచున్నది అది సోఽహం సోఽహం అని పొందబడినదై మంత్రయోగ మనబడుచున్నది సకారము ఖేచరి యనియు, త్వం పదమనియు

నిశ్చయింప బడియున్నది హకారము పరమేశ్వరుడనియు, తత్పద మనియు, నిశ్చయింప బడియున్నది సకారము ధ్యానించు జీవుడు నిశ్చయముగా హకారమే యగుచున్నాడు అని యోగబీజము ఇది అజపా గాయత్రి యనబడును

దీనికి ముఖ్యముగా విషయనివృత్తిగల పురుషుడు అధికారి యగును ఇది సోపాధిక ధ్యానము వీనిలోని సకార, హకారము లనెడి హల్లులను విసర్జించి (52 అక్షరములలో అకారమునుండి 16 అక్షరములు అచ్చులనియు, కకా రమునుండి క్ష వఱకు 36 అక్షరములు హల్లులనియు చెప్పబడును కావున, స, హ, ఇవి రెండును హల్లులు ) మిగిలియుండు, ''ఓం'' అను అక్షరమును ధ్యానించుట నిరుపాధిక ధ్యానము 'ఓం', 'సోऽహం' అను నీ రెండు శబ్దములును ప్రత్యగాత్మతో నభిన్నమైన బ్రహ్మమనెడి ఒకే యర్థము గల్గి శుద్ధముగా నుండుటవలన నిరుపాధికమైనను 'ఓం' అనెడి అక్షరమునందు సకారము హకారము అను ఉపాధులను జేర్చుటవలన 'సోऽహం' అనెడి శబ్దము గలుగుచున్నది కనుక అది సోపాధిక మనబడుచున్నది

*సకారస్యతు ఓ కారః హ కారస్య తు బిందుయుక్ ।*
*ప్రణవో జాయతే విప్ర తేన గాయత్రి నామికా ॥*

ఈ శ్లోకమున, సోऽహంయొక్క రహస్యమును, ఓంకారముయొక్క రహస్యమును తెలుపబడుచున్నది అక్షరములలో మొదట ''క్'' ''ఖ్'' అనియే యుండును, ''క్'' అను దానికి, అ, చేరునపుడు 'క' అగుచున్నది ఈలాగున 'క' కారమునకు 'ఇ' వచ్చునపుడు 'కి' అనియు ఈ, వచ్చునపుడు 'కీ' అనియు ఈలాగున ఇతర శబ్దములు గూడ, ఉకారము మొదలైనవి వచ్చునపుడు కుకారాదులన్నియు నేర్పడు చుండును, అందువలన సకారమునకు ఓ కారము చేరునపుడు 'సో', అనియు హకారము చేరునపుడు 'సోహ' మనియు నేర్పడును 'సోऽహం' యొక్క సకారమున్ను, హకారమున్ను తీసివేయునపుడు 'ఓం' కారమగు చుండును సకారవాచ్యుడీశ్వరుడనియు, హకారవాచ్యుడు జీవుడనియు జెప్పబడును ఈ జీవేశ్వరుల నిద్దఱిని ఓంకార వాచ్యుడగు బ్రహ్మము తనలో నైక్యపఱచుచుండును హంసాక్షర ద్వయములో ఓంకారమేలాగున నవ్యక్తమై

యుండునో, ఆలాగున జీవేశ్వరులిద్దఱిలోను బ్రహ్మము వ్యాపించియున్నది మాయోపాధిగల బ్రహ్మము సర్వజ్ఞత్వముగల యీశ్వర రూపముగాను, అవిద్యోపాధిగతమగు బ్రహ్మచైతన్యము కించిజ్ఞత్వము గల జీవుడుగాను వ్యవహరింపబడును కావుననే లక్షణావృత్తిచే నీశ్వరుని యొక్క మాయోపాధియు, జీవుని యొక్క అవిద్యోపాధియు తొలగించిన శుద్ధపరబ్రహ్మము మిగులుచున్నదని వేదాంత శాస్త్రముల యొక్క నిర్ణయము కావున ఓంకారము పరబ్రహ్మమని చెప్పుటకు కారణమైనది

## జ ప ము

భారతి – అజపము జపము చేయకనే జపము జరుగుచున్నది కదా? అట్లయిన జపము నేల చేయవలయును?

గురు – భూమ్యంతర్భాగములో జలధార గలదని చెప్పిన బావి త్రవ్వకనే నీళ్లు పానమున కెట్లుదొఱకవో, విద్యుచ్ఛక్తి సముద్రములో గలదని చెప్పినచో యంత్రసహాయముచే దానిని తీసి బల్బులో నమర్చనిచో ఎట్లు ప్రకాశించదో, ఆలాగున జపముచే ననుభవములోనికి తీసికొని రాకపోయిన, దానిచే గలిగెడు అమృతత్త్వమున్ను, దివ్యజ్ఞాన ప్రకాశమున్ను గలుగదు

## య తే ర్భం గ క రా ణి ష ట్

భారతి – ''యతేర్భంగకరాణిషట్'' అను దీనిసారము తెలుపవలయును

గురువు – ఇది నారదపరివ్రాజకోపనిషత్తునందు గురువు గ్రహించ దగినది

*ఆసనం పాత్రలోపశ్చ సంచయ శ్శిష్యసంగ్రహః ।*
*దివాస్వాపో వృథాలాపో యతేర్భంగ కరాణిషట్ ॥*

తాను జేయవలసిన దేమి లేదనియు, కృతకృత్యుడైనట్లును దెలియదగినది అయితే కృతార్థు డనైతిని ఇక నేను జేయవలసిన దేమియు లేదు వెళ్ళుచున్నానని కృతఘ్నుతా

నీ యారును బ్రహ్మనిష్ఠులకు బంధకరములు ఈ చెప్పిన యాఱు దోషములయొక్క స్వభావములు నా ఋషిచేతనే వివరింపబడినవి

*1. ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే ।*
*వర్షాభ్యోఽన్యత్ర యత్స్థానమాసనం తత్ప్రకీర్తితమ్ ॥*

సంచారము చేయు బోధకుడు గ్రామములో నొక దినముకంటెను, పట్టణములో నైదు దినములకంటె నధిక కాలము నిలుచుట, చాతుర్మాస్యవ్రతము గల వర్షాకాలము నాలుగు మాసములు తప్ప ఇతర కాలముల యందొకచోట పై జెప్పిన విధమున నిలుచుటయు ఆసనమనబడును

*2. ఉక్తాలాబ్వాది పాత్రాణామేకస్యాపి న సంగ్రహః ।*
*భిక్షోర్భైక్ష్యభుజశ్చాపి పాత్రలోప స్స ఉచ్యతే ॥*

బ్రహ్మనిష్ఠుడగువాడు భిక్షాన్నమును భుజించుచున్నప్పటికిని శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ మొదలైన పాత్రలలో నొక దానినైన గ్రహించకపోవుట పాత్ర లోపమని చెప్పబడును

*3. గృహీతస్య తు దండాదేర్ద్వితీయస్య పరిగ్రహః ।*
*కాలాన్తరోప భోగార్థం సంచయః పరికీర్తితః ॥*

అవసరములగు వాటికన్న నధికముగా పూర్వమున్నవి ఖిలమైన తరువాత తిరిగి ధరించుటకుగాను వస్త్రాదులను సంపాదించి పెట్టకొనుట సంచయ మనబడును

*4. శుశ్రూషాలాభపూజార్థం యశోర్థం వా పరిగ్రహః ।*
*శిష్యాణాం న తు కారుణ్యాత్స జ్ఞేయ శ్శిష్య సంగ్రహః ॥*

శుశ్రూష, లాభము, పూజ, కీర్తి వీటి నపేక్షించి శిష్యులను చేర్చుకొనుట శిష్య సంగ్రహమనబడును కేవల దయచేత విరక్తులగు శిష్యులను కృతార్థులను జేయవలయు ననెడి యిచ్ఛచేత చేర్చుకొనుట శిష్యసంగ్రహమని చెప్పబడదు

*5. విద్యా దినం ప్రకాశత్వా దవిద్యా రాత్రి రుచ్యతే ।*

*విద్యాభ్యాసే ప్రమాదో యస్స దివాస్వాప ఉచ్యతే ॥*

బ్రహ్మజ్ఞానము ప్రకాశస్వరూపమైనందున అది దివా (పగలు) అని చెప్పబడును అజ్ఞానము అప్రకాశమైనందున రాత్రి యనబడును జ్ఞానమనెడి పగటియందు ప్రమాదము గలిగి యుండుటయే దివాస్వాపమనబడును

అనగా జ్ఞానార్జన పరమగు బ్రహ్మవిద్యను అభ్యసించుటలో గల అలసత, పగటి నిద్ర యనబడును అది యుండకూడదు

*6. అధ్యాత్మికీం కథాంముక్త్వా భైక్ష్యచర్యాం గురుస్తుతిమ్ ।*
*అనుగ్రహోత్పృథి ప్రశ్నో వృథాలాపస్స ఉచ్యతే ॥*

అధ్యాత్మ విషయమైన కథలను దేహధారణార్థమైన భిక్షాచరణమును పరమేశ్వర స్తవ మును వీటిని మాత్రము బ్రహ్మనిష్ఠుడు చేయవలయును వీటికంటే ఇతరములైన దారిలోని సమాచారముల నడిగిననునవి వృథాలాపములని చెప్పబడును ఈ ఆరింటికి క్రింది అర్థములు గూడ గలవు ఆసనము, వ్యర్థముగా భోజన నిమిత్తము ఒకరి యింటిలో కూర్చుండుట 2 పాత్రలోభము, యోగ్యతలేక వర్తించుట 3 సంచయము, సొంతసౌఖ్యము కొఱకు ధనాదులను మూటగట్టి యుంచుట 4 శిష్యసంగ్రహము, లాభమునుద్దేశించి మూర్ఖశిష్యులను సంపాదించుట 5 దివాస్వాపము, పగలు నిద్రపోవుట 6 వృథాలాపము, వ్యర్థవిషయములను మాట్లాడి కాలమును గడుపుట, ఇవి ఆరున్ను బ్రహ్మనిష్ఠకు విఘ్నములు

*బిక్షాటనం తపశ్శౌచం స్నానం ధ్యానం సురార్చనమ్ ।*
*కర్తవ్యాని షడేతాని సర్వదా నృపదండవత్ ॥*

(1) భిక్షాన్నము (2) తపస్సు (3) బాహ్యాభ్యంతర శుచిత్వము (4) స్నానము (5) ధ్యానము (6) దేవపూజ (దైవజ్ఞానమును లోకములో బోధించుట) అను నీ యారింటిని రాజాజ్ఞవలె భిక్షువు తప్పక చేయవలయునని యర్థము

*అలాబుదారుపాత్రం వా, మృణ్మయం వైణవం తథా ।*
*ఏతాని యతిపాత్రాణి మనుస్స్వాయంభువోఽబ్రవీత్ ॥*

(1)సొరకాయ బుఱ్ఱ (2)కొయ్యతో జేయబడిన పాత్రము (3) మట్టి పాత్రము (4)వెదురుగొట్టము అను నీ నాలుగు విధములగు పాత్రలే సన్న్యాసి గ్రహించవలయునని స్వాయంభువమనువుచే జెప్పబడినది సొరకాయ బుఱ్ఱయని చెప్పుటచే కమండలము, టెంకాయ చిప్ప మొదలైనవి కూడ వీటిలో నంతర్భూతములు

## భి క్షు ల క్ష ణ ము

భారతి – ఇకను పైన జెప్పిన రీతిగ నాచరింపదగిన వేవైన గలవా?

గురు – ఈలాటి దింకొక విషయముగూడ ఆ యుపనిషత్తునందే గలదు పై దానికన్న చాల యెక్కువైనది

*అజిహ్వాషండకః పంగు రంధో బధిర ఏవచ ।*
*ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుష్షడ్భిరేతైర్న సంశయః ॥*

బ్రహ్మనిష్ఠుడు నాలుక లేనివాడుగ, పుంస్త్వము లేనివాడుగ, కాళ్ళు లేనివాడుగ, కండ్లులేనివాడుగ, చెవులు లేనివాడుగా, మనస్సు లేనివాడుగా నుండెనా? అతడీ యారు ధర్మములచేత ముక్తి నొందును ఇందుకు సంశయము లేదు

(1) అజిహ్వుడనగా! నాలుక ఉండియు లేనివాడైయుండుటయు, (అనగా మితభాషణమున్ను రుచులను కోరనివాడుగను నుండుట) (2) షండుడనగా పురుషత్వము గలిగియు, లేక స్త్రీయైన స్త్రీస్వభావముండియు, నపుంసకత్వము గలిగి యుండుటయు, (3) పంగు అనగా కాళ్ళుండియు వ్యర్థముగా నచటచట తిరుగక నొకేస్థలమున నుండి ధ్యానము చేయుటయు (4)అంధుడనగా నేత్రములుండియు నామరూపములలో రమింపక, అంతరాత్మయగు పరమాత్మను దర్శించటయు (5) బధిరుడనగా చెవులుండియు దూషణభూషణములను విని సహించువాడుగను (6)ముగ్ధుడనగా మనస్సు గలిగియు సంకల్పము లేక ధ్యానమందు లయమునొంది యమనస్కమును బొందినవాడుగను లేక జడునివలె చేష్టలుడిగియుండుటయు అను నీ యారు గుణములుగలవాడు జీవన్ముక్తుడు

ఇక నీ యొక్కొక్క గుణమున కొక్కొక్క శ్లోకము గలదు అవి క్రింద వ్రాయబడుచున్నవి

*1. ఇదమిష్టమిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతే ।*
*హితం సత్యం మితం వక్తి తమజిహ్వం ప్రచక్షతే ॥*

భుజించునపు డిది రుచిగా నున్నది, ఇది రుచిగా లేదని యెవడు రుచులలో సక్తుడు గాడో, భూతములకు హితమై యధార్ధమైన వాక్యమును సంక్షిప్తముగా జెప్పునో, ఆ బ్రహ్మ నిష్ఠ డజిహ్వుడని చెప్పబడును

2. అద్య జాతాం యధా నారీం తధా షోడశవార్షికీమ్ ।
శతవర్షాం చ యోదృష్ట్వా నిర్వికారస్స షండకః ॥

ఎవ్వడీ దినమందు బుట్టిన స్త్రీ వ్యక్తిని, నూఱు సంవత్సరములు గల స్త్రీ వ్యక్తిని జూచినపు డేప్రకారముగా చిత్తవికారము లేనివాడై యుండునో యా ప్రకారమే పదునారు వత్సరములు వయస్సుగల స్త్రీ వ్యక్తిని చూచినను నిర్వికారుడై యుండునో అతడు షండుడని చెప్పబడును పురుషున కేలాగున చెప్పబడినదో అట్లే ఆ దినము బుట్టిన మగ శిశువును, నూఱు సంవత్సరములు వయస్సు గలిగిన వృద్ధుని జూచినచో నే వికారమును గలుగకయు మంచి యౌవనపురుషుని రూపవంతుని చూచినను వికారము చెందనట్టి యువతియు జీవన్ముక్తురాలే

*3. భిక్షార్థమటనం యస్య విణ్మూత్ర కరణాయ చ ।*
*యోజనాన్న పరం యాతి సర్వధా పంగురేవ సః ॥*

ఎవ్వడు భిక్షకొఱకు మాత్రము నడచుచుండునో, మూత్రపురీషోత్సర్గములకు బాహ్య ప్రదేశమునకు నడచుచుండునో, ధర్మబోధార్ధము వెళ్ళవలసియుండినా యోజన దూరమునకు పైగా నడువడో, తక్కిన కాలమందంతయు ధ్యాన నిష్ఠలో నుండునో అతడు పంగువని చెప్పబడును

*4. తిష్ఠతో వ్రజతో వాపి యస్య చక్షుర్న దూరగమ్ ।*
*చతుర్యుగాం భువం ముక్త్వా పరివ్రాట్ సోఽంధ ఉచ్యతే ॥*

నిలిచినపుడుగాని పోవునపుడుగాని, ముందుండు నాలుగు బారల పొడవుగల భూమిని విడిచి పైగా నెవని యొక్క నేత్రములు ప్రసరించవో మఱియు ఆత్మదృష్టి గలిగి యుండునో ఆ బ్రహ్మనిష్ఠుడంధుడనబడును

5\. హితం మితం మనోరామం వచశ్శోకాపహం చ యత్ ।
శ్రుత్వా యోన శృణోతీవ బధిరస్స ప్రకీర్తితః ॥

ఉత్తరకాలమందు శుభమును గలుగజేయునదియు, తత్కాలమందుండు శోకమును నివర్తింపజేయునట్టిదియు నగు వాక్యములను వినికూడ నెవ్వడు విననివానివలె నుండునో అనగా స్తుతినిందలను విని హర్ష శోకముల నొందనివాడు బధిరుడనబడును

*6. సాన్నిధ్యే విషయాణాం చ సమర్థోఽవికలేంద్రియః ।*
*సుప్తవద్వర్తతే నిత్యం భిక్షుర్ముగ్ధ స్స కీర్తితః ॥*

ఇంద్రియాది విషయములన్నియు సన్నిధానము నందున్నప్పటికిన్ని, సర్వేంద్రియ సమృద్ధి గలిగియున్న ప్పటికిన్ని, యెవడు విషయములచే వికారము నొందక నిద్రించువానివలె నుండునో, అతడు ముగ్ధుడని అనగా అమనస్కుడని చెప్పబడును

*తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ ।*
*అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి ॥*

ధీరుడు జ్ఞానయోగముచేత నతి రహస్యమై యజ్ఞానముచే కప్పబడినదై బుద్ధి గుహయందుంచబడిన పరమాత్మ స్వరూపమును తెలిసికొని యిష్టానిష్ట, లాభాలాభము లచే గలుగు సంతోష దుఃఖములను విడుచుచున్నాడు ఇదియే హర్ష శోకములనుండి విడివడు నుపాయము ఇచ్చుటనే భిక్షువుయొక్క త్యాగరూపమగు నిర్మలబుద్ధి గనందగును

*అణో రణీయాన్ మహతో మహీయా*
*నాత్మాఽస్య జంతోర్నిహితో గుహాయామ్ ।*
*తమక్రతుః పశ్యతి వీతశోకో*

*ధాతుప్రసాదాన్మహిమానమాత్మనః ॥*

సూక్ష్మముకంటె నతిసూక్ష్మమైన, స్థూలముకంటె మిక్కిలి స్థూలమైన యాత్మ యీ సమస్త జంతు సముదాయము యొక్క హృదయగుహాయందుంచబడి నది కామ్య కర్మ రహితుడగు జనుడు ( కుటిలత లేనివాడు) లేక యజ్ఞాది సమస్త బాహ్య కర్మల బరిత్యజించిన వాడు, పరమాత్మ నిష్ఠమాత్రము గలవాడు, పరమేశ్వరుని యనుగ్రహమువలన నాత్మయొుక్క మహిమాతిశయము నెఱుంగుచున్నాడు అందుచే సమస్త దుఃఖోపశమనమును, నిరతిశయానంద ప్రాప్తిని బడయుచున్నాడు అట్టి నిష్ఠలేనివాడై కర్మకాండలో మాత్రము ప్రవర్తించువాడెట్టి వాడనగా?

*ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా*
*అష్టాదశోక్త మవరం యేషు కర్మ ।*
*ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా*
*జరామృత్యుం తే పునరేవాపి యంతి ॥*

అస్థిరములయినటువంటి యజ్ఞమును నిర్వర్తించువట్టి యీ యష్టాదశ సంఖ్య గల ఋత్విగాదులు నశించువారలు గదా! పదునెనిమిది యందు జెప్పబడిన కర్మ శ్రేష్ఠమైనది గాదు ఏ మూఢులీ శ్రౌత, స్మార్తకర్మయే మోక్షకార ణమని సంతసించుచు న్నారో, ఆ యజ్ఞానులు జరామరణములను తిరిగి పొందుచున్నారు అనగా కర్మకాండ పరులు రంధ్రము పడిన పడవలోనుండి సముద్రమును దాట చూచుచున్నారు

## ఎఱుక యొుక్క రహస్యము

భారతి – బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడవగు నో యాచార్యా! అధ్యాత్మజ్ఞానమునకు సంబంధించిన విషయములన్నియు తెలియుడమైనది కొందఱెఱుకను విడువవలయు ననియు, అట్టి యెఱుక చండాలమనియు, చండాలముతో సంబంధము తగదనియు పలుకుదురు దీనియొుక్క సారము దెలియగోరు చున్నాను అయితే తాముపదేశించిన యమృతమయమగు భావములో నీ చిన్న

ప్రశ్నకు తావు లేదని తెలిసినను లోకములో కొందఱిట్లు చెప్పుచుండుట వలన నడుగుచున్నాను

గురుడు – భారతీ! తల్లీ! యిదివఱలో మీతోనే సందేహముండినను నిర్భీతిగ ప్రశ్నింప వచ్చునని చెప్పియుంటిని గదా! యోగవాసిష్ఠాది మహాగ్రంథములలో నెఱుకను మూడు విధములుగ విభాగము చేసియున్నారు దానింగాంచినచో వసిష్ఠ మునీంద్రుడు జనకుని కేమి యుపదేశించినది మీకే గోచరించును భారతమందు పంచశిఖుడను పేరుగల పరమ మునీంద్రుండు జనకమహారాజునకు సాంఖ్యమును బోధించియున్నారు అచ్చటను జూడుడు మఱియు బృహదారణ్యకోపనిషత్తు నందు యాజ్ఞవల్క్య మునీంద్రుడు జనకమహీపాలునకు నుపదేశించిన బ్రహ్మతత్త్వమెటువంటిదో చూడుడు జనకరాజర్షియొక్క జీవిత మంతయు యోగవాసిష్ఠమున నున్నట్లు మఱి యే గ్రంథము నందును లేదు దానిని గ్రహించినచో రాజయోగముయొక్క తత్త్వము బోధపడగలదు ఇంకను 'అష్టావక్రగీత' యను నదొకటి గలదు అది జనకుని కొఱకష్టావక్ర ముని వరుడుపదేశించినది ఎఱుకను గుఱించి యుపనిషత్తునందిట్లు గలదు మలిన యెఱుక యనియు, శుద్ధయెఱుక యనియు, విశుద్ధ యెఱుకయనియు దానికి మూడు పేర్లు

*మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ ।*
*అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్ ॥*

అశుద్ధ మనస్సనియు, శుద్ధమనస్సనియు మనస్సు రెండువిధములు వానిలో కామసంల్పముతో గూడినది యశుద్ధమగుటచే జీవుని సంసారమందు బంధించును శుద్ధమనస్సు కామాది దోషములు లేనిదగుటచే మోక్షమార్గములో సహాయపడును విశుద్ధ బ్రహ్మసాక్షాత్కారమగును

కాబట్టి దుష్టచిత్తమును చండాలమని చెప్పుటయే ఎఱుక యనుదానికి నిజమైన యర్థమగును శుద్ధమైన యెఱుక లేనిచో బ్రహ్మవిచార మెట్లు చేయగలుగును? ఎఱుక యనునది దేశీయపదము సామాన్యముగ తెలివియని గూడనర్థము గలదు సంస్కృత ములో స్మృతియనియు, జ్ఞానమనియు నర్థములుంటున్నవి తెలివిగాని, జ్ఞానముగాని లేని మనుజుడు బ్రహ్మవిద్య నెట్లు

గ్రహించ గలుగును? తెలివి లేనివానిని లోకములో మూఢుడనిగాని, మూర్ఖుడనిగాని పిలుతురు అంతేగాదు గురు శిష్యులు బ్రహ్మ విషయమై సంభాషించునపు డెఱుక లేనిచో అనగా తెలివి లేనిచో ఆ విషయ మేలాగున నెఱుగ గలరు? లేక తెలిసికొనగలరు మఱియు శిష్యులు గ్రహించిన దానిని మఱల తన శిష్యపరంపరల కెట్లుపదేశించ గలుగును? అశుద్ధస్వభావము నశింప జేయువారికి శుద్ధ స్వభావము గలిగియుండి చిత్తము శుద్ధమై విశుద్ధ స్వభావము గలిగియుండవలయునని తాత్పర్యము ఎఱుకలేమిచే నతడు జడుడగును ఈ విషయమై ఋభుగీతలో నిట్లు తెలుపడ మైనది

*ప్రజ్ఞాయాం కల్పితాం ప్రజ్ఞాం ప్రజ్ఞయైవ విహాయ యః ।*
*ప్రజ్ఞామాత్రేణ సంతిష్ఠేత్స ప్రజ్ఞావా నితీర్యతే ॥*

కూటస్థ స్వరూపక ప్రజ్ఞయందు కల్పించబడిన జీవరూపక బహిః ప్రజ్ఞను (విషయ బుద్ధిని) కూటస్థచైతన్య శుద్ధ ప్రజ్ఞచేతనే విడిచి కూటస్థస్వరూపక శుద్ధ ప్రజ్ఞామాత్రముగ నెవడుండునో వాడే ప్రజ్ఞావంతుడని చెప్పబడును

*బహిః ప్రజ్ఞాం సదోత్సృజ్యాప్యంతః ప్రజ్ఞాం చ యో బుధః ।*
*కయాపి ప్రజ్ఞయోపేతః ప్రజ్ఞావానితి కథ్యతే ॥*

ఏ విద్వాంసుడు సర్వదా బహిః ప్రజ్ఞనున్నూ, అంతః ప్రజ్ఞనున్నూ విడచి యొకానొక జ్ఞానప్రజ్ఞతో గూడియుండునో వాడు ప్రజ్ఞావంతుడని చెప్పబడును అనగా జ్ఞాన వంతుడని తాత్పర్యము అంతఃప్రజ్ఞ యనగా నంతఃకరణవృత్తి యని గ్రహించదగినది ఇది లింగదేహముతో గూడినది ఈ యంతఃప్రజ్ఞ, బహిః ప్రజ్ఞల విషయము మాండూక్య కారిక లందు కనందగును

*ప్రజ్ఞైవ యస్య నేత్రం స్యాత్ ప్రజ్ఞైవ శ్రోత్రమింద్రియమ్ ।*
*అన్యచ్చ సర్వం ప్రజ్ఞైవ స ప్రాజ్ఞః పురుషోత్తమః ॥*

ఏ విద్వాంసునకు ప్రజ్ఞయే నేత్రమగునో, ప్రజ్ఞయే శ్రోత్రేంద్రియమగునో, ఇట్లన్యంబంతయు ప్రజ్ఞ యగునో యా విద్వాంసుడు పురుషోత్తముడనంబడును అనగా భగవత్స్వరూపుడని యర్థము

*ప్రజ్ఞాహీనమసత్సర్వం ప్రజ్ఞాహీనం జడం ఖలు ।*
*ప్రజ్ఞాహీనం సదా దుఃఖం తస్మా త్ప్రజ్ఞాం సమాశ్రయ ॥*

ప్రజ్ఞాహీన పదార్థము లేనిదే యగును ప్రజ్ఞాహీన పదార్థము జడరూపము గదా! ప్రజ్ఞాహీనము సర్వదా దుఃఖంబు కనుక ప్రజ్ఞ నాశ్రయింపుము, జ్ఞానవంతుడవు కమ్ము అని భావము ఎఱుకను గుఱించి చెప్పువారికీ ఋభుగీతయే ముఖ్యప్రమాణము దీనిని బాగుగ ననుభవజ్ఞుడగు గురువు దగ్గఱ శ్రవణము చేసినచో నిజమెఱుంగక యెఱుక లేని స్థితిని వారు పొందియుండరు మఱియు నెఱుకను గుఱించి మైత్రేయ్యుపనిషత్తు నందు జెప్పినది జూడుడు

*చిత్త మేవ హి సంసార స్తత్ప్రయత్నేన శోధయేత్ ।*
*యచ్చిత్త స్తన్మయో భవతి గుహ్య మేతత్సనాతనమ్ ॥*

మలినచిత్తమే సంసారము అట్టి మలినచిత్తమును ప్రయత్నముచే శుద్ధపఱచ వలెను ఏ దేహి ఏ విషయములతో గూడిన చిత్తము గలవాడగునో యా దేహి యా చిత్తవృత్తి విషయరూపుడే యగును ఈ యర్థం బనాదిసిద్ధమైనట్టి యతి రహస్యమగును మలినచిత్త సంబంధముచే ప్రాప్తించిన సంసారత్వమును, శుద్ధచిత్తముచే నివర్తించవలయును చిత్తము దేనిని చింతించునో ఆ యా రూపముగ మారును ఇచట నీ చిత్తమునే యెఱుక యని గ్రహించుకొనవలయును ఈ చిత్తముయొక్క శుద్ధియే యోగవాసిష్ఠమున 32000 శ్లోకములచే శ్రీవసిష్ఠుడు రామచంద్రున కుపదేశించెను

*సమాసక్తం యథా చిత్తం జంతో ర్విషయ గోచరమ్ ।*
*యద్యేవం బ్రహ్మణి స్యా త్తత్కో న ముచ్యేత బంధనాత్ ॥*

పామరుల చిత్తము విషయమందాసక్తి గలిగి యుండినట్లు వివేకము గలవాని చిత్తము ప్రత్యగభిన్న పరబ్రహ్మమునం దాసక్తి గలుగునేని ముక్తి సులభము గాకుండునా? ముక్తి తప్పక గలుగునని భావము

*చిత్తస్య హి ప్రసాదేన హంతి కర్మ శుభాశుభమ్ ।*

*ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖమవ్యయమశ్నుతే ॥*

చిత్తనైర్మల్యముచేత పుణ్య, పాపరాశియంతయు నశించుచున్నది నిర్మల చిత్తము గలవాడు స్వస్వరూప సాక్షాత్కారము నొంది నాశరహితమగు నానందస్వరూపుడగుచున్నాడు అయితే చిత్తమెట్లు శుద్ధమగుననినచో ఉపదేశింపబడుచున్నది

*తపసా ప్రాప్యతే సత్త్వం సత్త్వా త్సంప్రాప్యతే మనః ।*
*మనసా ప్రాప్యతే హ్యాత్మా హ్యాత్మాపత్త్యా నివర్తతే ॥*

ఆత్మధ్యానపరమగు తపస్సువలన నంతఃకరణములో గల రజస్తమోగుణములు నశించి సత్త్వగుణమభివృద్ధి నొందును సత్వగుణాధిక్యము వలన మనస్సు శుద్ధమగును రాగద్వేషవిహీనమగు శుద్ధమనస్సువలన విశుద్ధస్థితి గలుగునపుడు ఆత్మ సిద్ధించును ఆత్మ స్ఫూర్తివలన సంసారదుఃఖము తొలగును అపుడు జీవుడు ముక్తుడగును దీని వలన నెఱుకయొక్క రహస్యము దెలిసికొనవచ్చును జనకుడును వారి కుపదేశించిన వసిష్ఠుడును ఆ విధముగానే యుండిరి

## భా వా భా వా తీ త ము

భారతి – భావాభావాతీతమే బ్రహ్మమనియు, పరపూర్ణమనియు నుండగా తాము బ్రహ్మభావము గలిగి యుండవలయునని చెప్పున దెట్లంగీకరింపదగును?

గురుడు – తల్లీ! వ్యావహారికదశలో బ్రహ్మభావము గలిగి యుండవలయునని చెప్పనిచో ఆ గురుశిష్యుల బోధ బధిరాంధ న్యాయమువంటి దగును అది యెట్లన! ఒక గురువుండెను పాప మతడు జాత్యంధుడు అతని కొక శిష్యుడు దొఱికెను అతడు బధిరుడు నేత్రములు గలవు కాని మాట వినబడదు గురువు నేత్రములు లేనివాడైనను కర్ణస్ఫుటత్వము గలవాడగుటచే వినవచ్చును శిష్య వాత్సల్యముతో గురుడు మంచి మంచి వేదాంతవాక్యములను పద్యములను శిష్యునకుపదేశించినను పాపమెంతో ప్రీతితోను, శ్రద్ధతోను జెప్పుచుండినను శిష్యుడు చెవుడు గలవాడగుటచే తన కేమియు తెలియుట లేదని

చేతులతో నేమేమియో సంజ్ఞల జూపుచున్నాడు చెవుడుతో పాటు మూకత్వము గూడ గలదు పాపము గురువు నేత్రములు లేనివాడగుటచే నతనికి శిష్యుడు చూపెడు సంజ్ఞలేమియు దెలియుట లేదు వీరియొక్క సంభాషణ సారమెట్లుండెనో ఎఱుక లేని గురు శిష్యులయొక్క గురుబోధయు నాలాగున నుండును

భావాతీత మనగా నుపనిషత్తులలో జెప్పినట్లు 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అనగా వాక్కుతో జెప్పుటకుగాని, మనస్సుతో దెలిసికొనుటకుగాని, చిత్తముతో చింతించుటకుగాని, బుద్ధితో నిశ్చయించుటకు గాని బ్రహ్మము సాధ్యము కాదని యర్థము మఱియొక యర్థముగూడ గలదు మలిన మనస్సుతోగాని, మలిన చిత్తముతోగాని, మలిన బుద్ధితోగాని పరబ్రహ్మము తెలియ సాధ్యము గాదనియు, అందుచే వాక్కు వచింపజాలదనియు తాత్పర్యము శుద్ధమనస్సుతోను, శుద్ధ చిత్తముతోను, శుద్ధబుద్ధితోను మాత్రమే తెలిసికొనుటకు సాధ్యమగునని తాత్పర్యము అట్లు గానిచో బ్రహ్మమును గురించి బ్రహ్మాది ఋషు లెట్లు గురుశిష్య పరంపరగా బోధింప గలిగిరి? కనుకనే గీతయందు ''బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్'' అని చెప్పెడు రహస్యము దేహభావము మలినమనియు, జీవభావము శుద్ధమనియు, బ్రహ్మభావము విశుద్ధమనియు శాస్త్ర సమ్మతము కావున శుద్ధాశుద్ధముల రెండింటికన్న బ్రహ్మభావము గొప్పదని యర్థము అట్లు బ్రహ్మభావన గూడ లేనిచో ముక్తిసుఖమగు మోక్షము నెవరు పొందగలరు? అచ్చట అఖండశుద్ధసత్తా మాత్ర బ్రహ్మమయమై యుండవలయునని గ్రహించదగినది అచ్చట భావించువాడును, భావనయును, భావ్యమనునవి మూడునులేవు అందుచేత భావాతీతమని చెప్పడమైనదే కాని ఏ భావమును లేక జడమయమై యుండవలెననెడి యర్థము కాదు

మఱియు మనన నిదిధ్యాసల కొఱకు శిష్యునుద్దేశించి బ్రహ్మభావము గలిగియుండుట కొఱకు గురువాక్య మాలాగుననుంటున్నది కావున త్రిపుటి రహితమని చెప్పడమైనది విషయవాసన చండాలమే, విషయబుద్ధి నీచమే, కావున దానిని విడిచి పెట్టుడు అది యెటువంటిదనగా పొలములోగల కలుపు తీసివేయుటకు యజమానుడు పనివారి నాజ్ఞాపించెను వారు కలుపు దీయుచు

పైరును గూడ తీసివేసిన ఎట్లుండునో ఎఱుక యొక్క రహస్యమును నా రీతగ నుండును ఒక గృహస్థుడు రజకునితో వస్త్రములో గల మురికిని ఉతికి శుభ్రపఱచుమని చెప్పెను చాకలివాడు గుడ్డను ఉడకబెట్టునప్పుడు వస్త్రమునుగూడ కాల్చివేసెను మఱియు వైద్యుడు శరీరములోగల వ్యాధిని నివర్తింపజేయుట కౌషధసేవను జేసి రోగమును రహితమొనర్చుకొనునట్లు రోగికి బోధించెను రోగియైనవాడు దారుణమగు నా యౌషధము నధికముగా సేవించి దేహమును గూడ నశింపజేసికొనెను మఱియు సువర్ణములోగల మాలిన్యమును పోగొట్టుటకు మూలికలతో సహ స్వల్పమగు నవాసారమును జేర్చి స్ఫుటము జేయమని చెప్పగా నట్లుగాక నవాసారమెక్కువజేసి ఆభరణకారుడు సువర్ణమును గూడ రహితమొనర్చెను కాన నటులగాక నీచమైన విషయబుద్ధిని రహితమొనర్చి నిర్విషయమగు జ్ఞానము గలిగియుండవలయు ననియే శాస్త్రము చెప్పుచుండును

మఱల విచారణజేసి యనాత్మభావముల నన్నిటిని తొలగించి శుద్ధమగు ఆత్మభావములో నిలకడ కలిగి యనగా యాత్మమాత్రమై నిలువవలయునని తాత్పర్యము దీనినే భావాతీతమనియు, పరబ్రహ్మభావమనియు, పరిపూర్ణభావమనియు గ్రహించదగినది అట్లు గానిచో నది బ్రహ్మమనియు, పరిపూర్ణమనియు ఎట్లు దెలియ గలుగును? తెలిసికొన సాధ్యము గానిచో అది నందియో, పందియో, దైవమో, దయ్యమో, అమృతమో, విషమో యెట్లు తెలియగలదు? మఱియు గురు పరంపరగా నెట్లు సంప్రదాయ సిద్ధమగును? అంతేగాక పరంపరగా నెట్లుపదేశింపబడుచువచ్చినది? అట్టి శాస్త్ర మేలాగున ఏర్పడ గలుగును? అదియునుగాక అది స్వప్రకాశ స్థితిలో నుండువానిని కారు చీకటిలోనికి తీసికొని వచ్చేలాగున నుండును అమృతమును భుజించినవానిని విషమును దినిపించులాగున నుండును శుద్ధస్మృతి గలవానిని స్మరణజ్ఞానము లేని వానినిగా జేసినట్లుండును కనుకనే యష్టావక్రమునివరు డిట్లు జనకున కుపదేశించెను

*ముక్తిమిచ్ఛసి చేత్తాత! విషయా న్విషవత్త్యజ ।*
*క్షమార్జవం దయాతోషం సత్యం పీయూషవద్భజ ॥*

ఓ నాయనా! నీవు ముక్తిని బొందగోరుదువేని విషయములను విషమువలె త్యజింపుము ఓరిమి, ఋజుత్వము, భూతదయ, మనఃప్రసన్నత, సత్యము వీటి నమృత మువలె భజింపుము అని చెప్పుటకు కారణము మఱియు గీతలో స్థితప్రజ్ఞుని లక్షణము జెప్పునపుడు,

*ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్ ।*
*ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥*

ఓ యర్జునుడా! ఎప్పుడు మనస్సునందలి వైషయికము లగు కోరికల నన్నిటిని వదలుకొని యాత్మచేతనే యాత్మయందే సంతోషించుచున్నాడో, అనగా ఆత్మారాము డగుచున్నాడో అపుడు స్థితప్రజ్ఞుడు ఆరూఢజ్ఞానవముగల వాడనంబడుచున్నాడు అని తెలుపడమైనది దీనినే జహల్లక్షణయు, అజహల్లక్షణయు, జహ దజహల్లక్షణయును తెలుపుచుండును లేనిచో స్వరూపజ్ఞానము నశించును అట్లయిన యంధకారమయమే శుద్ధమై వెలుగునని చెప్పినట్లుండును అప్పుడు వారి పరిపూర్ణమునకును, అచలమునకును సమూలముగ నాశనము గలుగును పరిపూర్ణ శబ్దమున కంతట నిండి నిబిడ మైయుండునదని యర్థము అచలమనగా చలనరహితమగు వస్తువని యర్థము

అపుడంతట నిండి నిబిడమైయుండెడు పరిపూర్ణవస్తువేది? చలనరహితమైన వస్తువేది? యను వాక్యముల కర్థమే లేక పోయెడిని అవి యస్తిత్వమును బోధించెడు శబ్దములే కాని నాస్తికత్వమును బోధించెడు పదములు కావు

భారతి – అట్లయినచో బయలు, బట్టబయలు అని యెట్లు చెప్పుదురు?

గురుడు – దానియొక్క వాచ్యార్థ, లక్ష్యార్థములను గ్రహించినచో సందేహము గలుగదు బయలు ప్రదేశము అనగా నచ్చుట గృహములుగాని, పశువులుగాని, మనుజులుగాని యెవరు నేమియు లేవని యర్థము అది యాకాశమువలె నుండు ప్రదేశమని సారము అలాగున బ్రహ్మాత్మైకస్థితిలో వృత్తులుగాని, ప్రాకృత గుణములుగాని, సంకల్పములుగాని, జన్మజన్మాంతర సంస్కారములుగాని, లోకవాసన, శాస్త్రవాసన, దేహ వాసన యనెడు

వాసనాత్రయముగాని లేని స్థలమని యర్థము పరిపూర్ణమని చెప్పి, ఏమియు లేదని చెప్పినచో పూర్వోత్తర విరోధమగును ఈ విషయ మిదివఱలో తెలుప బడియున్నది అచ్చట దృశ్యవృత్తి లేమియు లేక పరబ్రహ్మమయముగా నుంటున్నదని గ్రహించుకొనవలయును

పాపకార్యస్వభావ మంతరించి పుణ్యకార్యముచే స్వర్గలోక ప్రాప్తి గలుగుననెడి తలంపు గూడ లేనిదై శుద్ధబ్రహ్మభావము గలిగియుండునని తెలిసికొనవలయును అట్టి జీవన్ముక్తుడు పుణ్యకర్మలను జేయవలయునని విధి లేనందుచే శుభాశుభ కర్మలనుండి విముక్తుడని తాత్పర్యము కాని ఫలాపేక్షారహితుడై పుణ్య కర్మలను విధికర్మలను జేయుచునే యుండును అట్లు కానిచో జనకుని విదేహముక్తుడని శాస్త్రము చెప్పియుండదు గీతా శాస్త్రముయొక్క సారమంతయు దీనియందిమిడి యున్నది ఈలాగున శాస్త్రసారమును గ్రహించకపోయిన పెరుగునుండి వెన్న తీయు పద్ధతి తెలియక పెరుగును గూడ పార వేసినట్లును, చెఱకునుండి రసము దీయుట తెలియక చెరుకుగడను పార వేసినట్లును, సువర్ణశిలనుండి బంగారమును తీసెడి తంత్రము నెఱుంగక బంగారురాతిని పారవేసి నట్లును, నూవులనుండి చమురును తీయు విధము దెలియక నూవులను వెదజల్లినట్లును, జ్ఞానమునుగూడ త్యజించ వలసినదని చెప్పెడి జ్ఞానముగూడ నజ్ఞానమే యగును ఇచ్చట జ్ఞానాజ్ఞానములను, పుణ్యపాపములను, విద్యావిద్యలను దెలిసికొనెడి యే నిజజ్ఞానముగలదో అదియే ''ప్రజ్ఞానం బ్రహ్మ'' అని చెప్పెడు మహావాక్యము యొక్క యర్థము దధినుండి నవనీతమును గ్రహించునట్లు, సువర్ణశిలనుండి బంగారము గ్రహించునటులను, నూవుల నుండి నూనెను తీయునట్లును సారమును గ్రహించి నిస్సారమును త్యజింపవలయునని శాస్త్రనిర్ణయము ఆలాగున ననాత్మను పరిత్యజించి యాత్మను గ్రహించవలయునని శాస్త్రము చెప్పుచున్నది

కావుననే మహావాక్యములలో ''యేనేక్షతే శృణోతీదం'' అని బ్రహ్మమును నిరూపించుటకు కారణము ఈ నాలుగు మహావాక్యములు శుకబ్రహ్మోపనిషత్తు నందు గలవు ఆ శ్లోకములను దెలిసికొనినచో మఱల సందేహముండదు పంచదశి

5-వ ప్రకరణమునం దీవిషయము స్పష్టముగ విద్యారణ్యస్వాములవారు దెలిపియున్నారు ఇట్టి బ్రహ్మజ్ఞాన విషయమై తేజోబిందూపనిషత్తులో ననేక దృష్టాంతములతో ప్రతిజ్ఞాపూర్వకముగ వచించినది చూడుడు ఈలాంటి యుపనిషత్తులను బ్రహ్మనిష్ఠులగు గురువు దగ్గఱ మననమును జేయకపోవుటచే ననేక అంధవిశ్వాసముల కాస్పదులగు చుందురు ముఖ్యముగ శిష్యులయొక్క పుణ్యము మంచిది కానందుచేతనే యుత్తమాచర ణానుష్ఠానము గలిగిన గురువు దొరకక పోవుచుండును పుణ్యజీవులై యీశ్వర కృపకు పాత్రులైనవారగుచో హీనాచారము లేక పుణ్యస్వభావము గల గురువులే దొరుకుదురు మఱియు నుపనిషత్ప్రతిపాదిత మగు యథార్థమగు సత్యమును దెలిసికొనుటకు చాల పుణ్యవిశేషమేగాక తపస్సుగూడ గలిగి యుండవలయును దానితో గూడ మంచి వైరాగ్యమును, సత్యవ్రతనిష్ఠయు, భూతదయయు గలిగియుండవలయును ఇట్టి వైరా గ్యాది గుణములులేక పుణ్యగుణముల మాత్రము గలిగి యుండిన మఱల పుణ్య విషయములో మనస్సు ప్రవేశించునే గాని నిర్విషయ బ్రహ్మచింతన మందు ప్రవేశిపందు

## తే జో బిం దూ ప ని ష త్

*నిత్యానందమయం బ్రహ్మ కేవలం సర్వదా స్వయమ్ ।*
*అనంతమవ్యయం శాంతమేకరూప మనామయమ్ ॥* 72

ఈ శ్లోకములో బ్రహ్మస్వరూపము నిర్ణయింపబడుచున్నది బ్రహ్మము నిత్యమై, ఆనందమయమై, ఎప్పుడు నేకమై స్వయముగా నున్నది అట్టి బ్రహ్మ మింకను నపరిచ్ఛిన్నము, అవినాశి, శాన్తము, అవికారి, అనామయమై యున్నది

*మత్తోఽన్యద స్తి చేన్మిథ్యా యథా మరుమరీచికా ।*
*వంధ్యాకుమారవచనే భీతిశ్చేదస్తి కించన ॥* 73

సత్తైనది బ్రహ్మయే అట్టి బ్రహ్మముకన్న వేఱు పదార్థము మరియొకటి లేదు ఇచ్చట కనబఱచిన యుదాహరణములచేత జగత్తను పదార్థమే లేదనియు, నున్నచో నది బ్రహ్మముకన్న భిన్నము కాదనియు, వేఱగుచో అది మిథ్య ( అసత్యము) అని

దెలియదగినది బ్రహ్మముకన్న వేఱగు జగత్తుండిన యెండమావులవలె మిథ్య, లోకములో వంధ్యా పుత్రుడే యసంభవము వానివలన భయ మెటుల గల్గును? అటులనే జగత్తే సంభవించదనిన దానివలన నెటుల భీతి గలుగును?

*శశశృంగేణ నాగేంద్రో మృత శ్చేజ్జగదస్తి తత్ ।*
*మృగతృష్ణాజలం పీత్వా తృప్తశ్చేదస్త్విదం జగత్ ॥* 74

*నరశృంగేణ నష్టశ్చేత్ కశ్చిదస్త్విదమేవ హి ।*
*గంధర్వనగరే సత్యే జగద్భవతి సర్వదా ॥* 75

కుందేటికొమ్ముచే గజశ్రేష్ఠము చంపబడెను ఎండమావులను ద్రావి జనులు తృప్తులగుచున్నారు మనుష్యుని కొమ్ముచే నొకానొకడు చంపబడియె ఈ వార్తలు నిజములగుచో జగత్తునునది సత్యము చూచుచుండగనే నశించునట్టి ఆకాశపు మేడలు సత్యములైనచో అప్పుడు జగత్తు సత్యమును గాంచును

*గగనే నీలిమాసత్యే జగత్సత్యం భవిష్యతి ।*
*శుక్తికారజతం సత్యం భూషణం చేజ్జగద్భవేత్ ॥* 76

*రజ్జుసర్పేణ దష్టశ్చేన్నరో భవతు సంసృతిః ।*
*జాతరూపేణ బాణేన జ్వాలాగ్నౌ నాశితే జగత్ ॥* 77

*వింధ్యాటవ్యాం పాయసాన్న మస్తిచే జ్జగదుద్భవః ।*
*రంభా స్తంభేన కాష్ఠేన పాకసిద్ధౌ జగద్భవేత్ ॥* 78

*సద్యః కుమారికారూపైః పాకే సిద్ధే జగద్భవేత్ ।*
*చిత్రస్థదీపై స్తమసో నాశశ్చేద స్త్విదం జగత్ ॥* 79

ఆకాశములో నీలవర్ణము, ముత్యపు చిప్పపై కల్పింపబడిన వెండి భూషణమగుట, త్రాటియందు కల్పితమగు సర్పముచే మనుష్యుడు కఱువబడుట, స్వర్ణరూపమగు బాణముచే ప్రజ్వలాగ్ని నశింపచేయబడుట, నీరము లేని వింధ్యారణ్యములో పాయ సాన్నము లభించుట, పచ్చియరటి కంబములగు కట్టెలచే పాకము సిద్ధ మగుట, అప్పుడే జనించిన కన్యకలచే పాకము చేయబడుట నివన్నియు

సత్యములగుచో అప్పుడు జగత్తు సత్యమే చిత్తరువులోని దీపముచే చీకటి దూరముగా పారిపోయెననున దెటుల సత్యము గాదో అటులనే జగత్తు సత్యము గాదు

*మాసాత్పూర్వం మృత మర్త్యో హ్యాగతశ్చేజ్జగద్భవేత్ ।*
*తక్రం క్షీరస్వరూపం చేత్స్యచిన్నిత్యం జగద్భవేత్ ॥* 80

*గో స్తనాదుద్భవం క్షీరం పునరారోపణే జగత్।*
*ధూరజోఽబ్ధౌ సముత్పన్నే జగద్భవతు సర్వదా ॥* 81

*కూర్మరోమ్నా గజే బద్ధే జగదస్తు తదోత్కటే ।*
*నాళస్థతన్తునా మేరుశ్చాలిత శ్చేజ్జగద్భవేత్ ॥* 82

*తరఙ్గమాలయా సిన్ధుర్బద్ధశ్చేదస్తి దం జగత్ ।*
*అగ్నే రధశ్చేజ్జ్వలనం జగద్భవతు సర్వదా ॥* 83

*జ్వాలావహ్ని శ్శీతలశ్చేద స్తి రూపమిదం జగత్ ।*
*జ్వాలాగ్ని మణ్డలే పద్మవృద్ధిశ్చే జ్జగదస్త్విదమ్ ॥* 84

మాసమునకు పూర్వము మృతుడైన మనుష్యుడు తిఱుగ వచ్చెను మజ్జిగ క్షీర రూపమును దాల్చెను గోస్తనమునుండి వచ్చిన క్షీరము మఱల గోస్తనమునకే యెక్కింపబడెను ధూళిచే సముద్ర ముత్పన్నమాయెను తాబేటి వెంట్రుకచే గజము బంధింపబడెను తామరతూండునందలి దారముచే మేరుపర్వతమే కట్టి యీడ్వబడియె అలలచే సముద్రముపై సేతుబంధనము గావింపబడెను అగ్నికి క్రిందికి మండుట స్వభావము మండుచున్న యగ్ని చల్లనయినది ప్రజ్వలించుచున్న వహ్నిమండలములో పద్మములు వృద్ధిని పొందుచున్నవి ఇవి యన్నియు సంభవించినచో అప్పుడు జగత్తుకు సత్యత్వము సంభవించును

*మహచ్చేలేంద్రనీలం వా సంభవేచ్చేదిదం జగత్ ।*
*మేరురాగత్య పద్మాక్షే! స్థితశ్చేదస్త్విదం జగత్ ॥* 85

*నిగిరేచ్చేద్భృంగసూనుర్మేరుం చలవదస్త్విదమ్ ।*

*మశకేన హతే సింహే జగత్సత్యం తదా ఉస్తుతే ॥* 86

*అణుకోటర విస్తీర్ణే త్రైలోక్యం చే జ్జగద్ధ్రువేత్ ।*
*తృణానలశ్చ నిత్యశ్చేత్ క్షణికం తజ్జగద్ధ్రువేత్ ॥* 87

*స్వప్న దృష్టం చ యద్వస్తు జాగరే చే జగద్ధ్రువః ।*
*నదీవేగో నిశ్చల శ్చేత్కేనాపీదం భవేజ్జగత్ ॥* 88

*క్షుధితస్యాగ్నిర్భోజ్య శ్చే న్నిమిషం కల్పితం భవేత్ ।*
*జాత్యంధై రత్న విషయః సుజ్ఞాత శ్చేజ్జగత్సదా ॥* 89

*నపుంసక కుమారస్య స్త్రీసుఖం చేద్భవేజ్జగత్ ।*
*నిర్మితశ్శశశృఙ్గేణ రథ శ్చేజ్జగదస్తి తత్ ॥* 90

*సద్యోజాతా తు యా కన్యా భోగయోగ్యా భవేజ్జగత్ ।*
*వన్ధ్యా గర్భాప్తతత్సౌఖ్యం జ్ఞాతా చేదస్త్విదం జగత్ ॥* 91

స్వర్ణపర్వతము నీలమగును తామరవిత్తులో మేరు పర్వతము గలదు భ్రమర శిశువు మేరుపర్వతమును మ్రింగెను దోమ సింహమును చంపెను పరమాణు రంధ్రములో త్రిలోకములున్నవి పచ్చికనుండి పుట్టిన యగ్ని ప్రజ్వలించుచున్నది స్వప్నములో గాంచ బడిన వస్తువులు జాగ్రద్దశలో గనబడుచున్నవి నదీ ప్రవాహము చలించనేలేదు క్షుధార్తునకు అగ్నియే భోజ్యపదార్థము పుట్టంధులచే రత్నములు పరీక్షింప బడుచున్నవి నపుంసకుని పుత్రుడు విషయసుఖముల ననుభవించుచున్నాడు ప్రభువు కుందేటికొమ్ముచే నిర్మింపబడిన రథముమీద పోవుచున్నాడు అప్పుడే పుట్టిన కన్యక విషయభోగయోగ్యమైనది వన్ధ్యా స్త్రీ గర్భసుఖము ననుభవించుచున్నది ఇవన్నియు నొకప్పుడు సత్యము లైనచో జగత్తును సత్యమగును

*కాకో వా హంస వచ్ఛేజ్జగద్ధ్రువతు నిశ్చలమ్ ।*
*మహాఖరో వా సింహేన యుద్ధ్యతేచే జ్జగత్స్థితిః ॥* 92

*మహాఖరో గజగతిం గత శ్చేజ్జగదస్తు తత్ ।*

*సంపూర్ణ చన్ద్రసూర్యశ్చే జ్జగద్భాతు స్వయం జడమ్ ॥* 93

*చన్ద్రసూర్యాదికౌ త్యక్త్వా రాహు శ్చేద్దృశ్యతే జగత్ ।*
*భ్రష్టబీజసముత్పన్న వృద్ధి శ్చేజ్జగదస్తుసత్॥* 94

*దరిద్రో ధనికానాఞ్చ సుఖం భుంక్తే తదా జగత్ ।*
*శునా వీర్యేణ సింహస్తు జితో యది జగత్తదా ॥* 95

*జ్ఞానినో హృదయం మూఢైః జ్ఞాతం చేత్కల్పనం తదా ।*
*శ్వానేన సాగరే పీతే నిశ్శేషేణ మనో భవేత్ ॥* 96

కాకి హంసమువలెనే వేగముగా పోవుచున్నది గాడిద సింహమును యుద్ధములో జయించెను ఖరము గజమువంటి గమనము గలది సంపూర్ణ చంద్రుడు సూర్యునివలె అత్యుష్ణముగా ప్రకాశించుచున్నాడు చన్ద్రసూర్యులు మొదలగు వారు లేకనే ఆకాశములో రాహువు గాంచబడుచున్నాడు అగ్నితప్తములైన బీజములచే చేయబడినకృషి విశేషముగా ఫలించినది పుట్టుదరిద్రుడు మహాశ్రీమంతునివలె సౌఖ్యము ననుభవించుచున్నాడు శునకము తన బలపరాక్రమముచే సింహము నోడించెను జ్ఞానులహృదయము నజ్ఞానులు గనుగొనిరి శునకము సముద్ర జలమునంతయు పానమును జేసెను ఈ మిథ్యాప్రగల్భ ప్రతాపములు సత్యము లగుచో అప్పుడు జగత్తుపై సత్యబుద్ధి గల్గును

*శుద్ధాకాశో మనుష్యేషు పతిత శ్చేత్తదా జగత్ ।*
*భూమౌ వా పతితం వ్యోమ వ్యోమపుష్పం సుగన్ధకమ్ ॥* 97

*శుద్ధాకాశే వనే జాతే చలితే తు తదా జగత్ ।*
*కేవలే దర్పణే నాస్తి ప్రతిబింబం తదా జగత్ ॥* 98

*అజకుక్షౌ జగన్నా స్తిహ్యాత్మకుక్షౌ జగన్నహి ।*
*సర్వథా భేదకలనం ద్వైతాద్వైతం న విద్యతే ॥* 99

*మాయాకార్యమిదం భేదమస్తిచే ద్బ్రహ్మ భావనమ్ ।*
*దేహోऽహమితిదుఃఖం చేద్బ్రహ్మాహ మితి నిశ్చయః ॥* 100

శుద్ధాకాశము పటపటమని విరిగి మనుష్యులమీద పడెను నిర్మలాకాశము పెళ పెళ మని ధ్వనించుచు భూమిమీద గూలెను గగనకుసుమము పరిమళము గలది శుభ్రాకాశము వనములో పుట్టి చలించుచున్నది శుద్ధమైన అద్దమునందు ప్రతిబిమ్బము గానబడదు అనున వెటుల నసంభావితములో అటులనే జగత్తు గూడ సర్వదా యసంభావితము జగత్తు బ్రహ్మహృదయమునందు లేదు ఆత్మలో లేదు సర్వప్రకారవముల భేదమును గలుగజేయు ద్వైతాద్వైతము లేదు భేదాత్మకమగు జగత్తను నది మాయాకార్యము అట్టి జగద్భావనను బ్రహ్మభావనచే నివర్తింప జేయవలయు, అదేలన! దేహమే నేనను భావన దుఃఖమును గలుగ జేయును బ్రహ్మమే నేననెడి భావన నిరతిశయ సుఖము ననుభవింపజేయును ఇందు సందియము లేదు

## అనంతోపనిషత్

భారతి – అనంతోపనిషత్తులో నెఱుకను రహితమొనర్చవలయు ననియు, ఎఱుక లేనిదే మోక్షమనియు నను నుపదేశమున్నది దాని తాత్పర్యమేమి?

గురు – ఈ విషయమై యిదివఱలో తెలుపబడియుండెను ఎఱుక లేనిదే మోక్షమైనచో నట్టి విముక్తి సుషుప్తిలోను, మూర్ఛలోను గల మోక్షమే యగును ఏ యెఱుక కూడదు? ఏ యెఱుక యుండవలయును అనునది తెలిపియుంటిని విషయ మనస్సుకూడదనియు, అది నీచమనియు, జననమరణంబులకు హేతువనియు నరకమునకు కారణమనియు, శుద్ధమగు నెఱుక గలిగి దానివల్ల విజ్ఞానమును పొందవలయుననియు, నది ముక్తిని గలుగ జేయుననియు, దెలిపితిని గదా! అనంతోపనిషత్తును జూడడమైనది ఇది యెవరో కల్పించినది వారి పేరుగూడ దానియందు గలదు వేదములయొక్క సారమగు నుపనిష త్తులకే వేదాంతమని పేరు వేద మమానుషేయ మనియు, ఈశ్వర సంకల్పితమనియు ఆస్తికు లందఱు నొకేవిధముగ జెప్పుచున్నారు ఇక దైవమునకు సమానముగ సృష్టిస్థితి లయములను చేయువారొకరు రెండవదైవముగా నేర్పడినగదా ఉపనిషత్తులను సృష్టించవలయును! శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులుగూడ నుపనిషత్తులను వ్రాయలేదు సర్వశాస్త్రము లను ఆమూలాగ్రముగ పరిశోధించిన

ఆర్య సమాజమును స్థాపించిన దయానంద సరస్వతీ స్వామిగారు గూడ నుపనిషత్తను గ్రంథమును వ్రాసియుండలేదు వారుగూడ వేదమును అమాను షేయమనియే చెప్పియున్నారు శంకరాచార్య ప్రభృతులును నుపనిషత్తులకు భాష్యముల రచించిరేగాని మఱేమియు చేయలేదు అట్లుండగా కలియుగమున సామాన్య మనుజుడు ఉపనిషత్తులను వ్రాసినాడని చెప్పుటకన్న వింత మఱేమి గలదు ఈలాగున నొక్కొక్కరును నొక్కొక్క యుపనిషత్తును వ్రాయబూనిన ఇక వేదప్రామాణ్యము దేనికి జెప్పవలసి యుండునో తెలియజాలకున్నది అయితే యీశ్వరజ్ఞానముకన్న నెక్కువ జ్ఞానముగల మనుజుడు కలియుగమున నొకడు పుట్టియుండినచో నట్టి జ్ఞానము నేల యంగీకరించ గూడదని యడుగవచ్చును అట్టివారీశ్వరసృష్టియగు పిపీలికాది బ్రహ్మపర్యంతము గల జీవుల నిపుడుండు రీతిగాక దీనికన్న నెక్కువ యోగ్యత గలుగునట్లు క్రొత్తసృష్టిని జేయవలయును

అంతేగాక బ్రహ్మసృష్టిలోగల దోషములను గూడ నిరూపించి తాను నవీనముగా సృష్టించిన దానిలో ఆ దోషము లేదని నిరూపించవలయును అతివృష్టి, అనావృష్టి, భూకంపము, తుపాను, జనులలో పరస్పరము వైషమ్యము అందువలన యుద్ధములు, అంతేగాక మంచి సుందరమైన దేహముగల వారికిగూడ వ్యాధులు, దానివలన మరణములు గలుగుట మొదలైనవి బ్రహ్మసృష్టిలో గలవు తాను నూతనముగ సృష్టించిన దానియందీలాటి దోషము లేవియు లేవని నిరూపించవలయును సూర్యాదిగ్రహములను, వాటి సంచారములను గూడ నవీన సృష్టిలో జూపవలయును ఈశ్వర సృష్టికన్న నవనాగరికమగు మానవసృష్టియే మంచిదని మానవులు చెప్పవలయును రసాయన శాస్త్రజ్ఞులును, విజ్ఞానశాస్త్రజ్ఞులును నేటివఱకీశ్వరసృష్టికి సమానముగ సజీవమగు నొక క్రిమినిగాని, యొక తృణమునుగాని సృష్టింప గలిగియుండ లేదు అట్లుండగా నొక సామాన్య మనుజుడు ఉపనిషత్తును సృష్టించెననెడి వాక్యమును విని జనులెట్లూరకుండిరో యచ్చెరువగుచున్నది ఉపనిషత్సారమనిగాని, ఉపనిషత్సారార్థ మనిగాని అనేక ఉపనిషత్తులనుండి సంగ్రహించి వ్రాయవచ్చును దానికి విరోధము లేదు అట్టివారుగూడ ఫలాని ఉపనిషత్తుల సారమనిగాని లేక

ఫలాని ఉపనిషత్తుల తాత్పర్యమనిగాని యీ గ్రంథములో దెలుపుదురు ఉపనిషత్తులు 108 మాత్రమే యని శాస్త్రకర్తలు నిశ్చయించియున్నారు దీనికే ''అష్టోత్తర శతోపనిషదః'' అని పేరు వీని ప్రమాణశ్లోకములు గూడ అష్టోత్తర శతోపనిషత్తులందు తెలుపబడియున్నవి నాగరలిపి గ్రంథము బొంబాయి ''నిర్ణయసాగర'' ప్రెస్సులో దొరుకును దీనియందు నూట యెనిమిది యుపనిషత్తుల పేర్లు గలవు శ్రీరామ చంద్రుడీయష్టోత్తర శతోప నిషత్తులనే హను మంతున కుపదేశించెను ఈ విషయము ముక్తికోపనిషత్తునందు జూడ నగును దానియందీ ''అనంతోపనిషత్తు'' గలదా లేదా యని గూడ విచారించువారు లేని దుస్థితికి దేశము వచ్చినది అంత అంధకారావృతమై పోయినది గదా! ఆశ్చర్యము ఇప్పుడు వావిళ్ళవారష్టోత్తర శతోపనిషత్తులను మూలము మాత్రము తెనుగు లిపిలో ముద్రించియున్నారు కావున దాన్నైనను తెప్పించుకొని చూడవచ్చుగదా! అప్పుడు దానియొక్క సత్యాసత్యములు తెలియదగును ఇది ప్రమాణశ్లోకములతో గూడి యున్నది వట్టి యుపనిషత్తుల పేర్లు మాత్రము గాదు

భారతి – అనంతోపనిషత్తులో షోడశాక్షరి, పంచదశాక్షరి, ద్వాదశాక్షరి మొదలగు మంత్రములుగూడ గలవుగదా! ఆ మంత్రములు మంత్రార్థములు వారికి ముఖ్యములని చెప్పుచున్నారే

గురు – ఆ మంత్రములను గూడ నెప్పుడో యొకప్పుడు చూచినట్లు గూడ జ్ఞాపకము గలదు అవి సంస్కృతములోను, తెనుగులోను వ్రాయబడియున్నవి అవి యన్నియు శూన్యమునే తెలుపుచుండును అవి నాస్తికమంత్రములు ఈ మంత్రములు గూడ వేదమంత్రములు కావు

ఏలననగా! మంత్రములన్నిటికిని కల్పశాస్త్రము మూలము నాలుగు వేద ములలోగాని, 108 ఉపనిషత్తులందుగాని యీ మంత్రములు లేవు ఒకవేళ మనుజులను సన్మార్గములో ప్రవర్తింప చేయుటకును, ధర్మమార్గములో నడిపించుటకు దైవభక్తిగాని, దైవజ్ఞానమునుగాని కలుగ జేయుటకొఱకుగాని, పుణ్యకార్యములలో ప్రవర్తింప జేయుటకుగాని యొకవేళ జేసియుండినను జేయుదురుగాక! అట్లుగాక సన్మార్గాసన్మార్గములు లేవనియు, ధర్మాధర్మములు

హుళక్కియనియు, దయ్యమును, దైవమును సమానమనియు, జ్ఞానాజ్ఞానములు మిధ్యయనియు, పుణ్యపాపములు కల్ల యనియు దెలిపెడి భావమే దానియందు గలదు జీవ, జగత్, ఈశ్వరు లొకేస్వరూపమే కాని అట్టి పరబ్రహ్మమున కన్యమైనది పరమాణువుగూడ లేదని బ్రహ్మదృష్టి గలిగి యవధూతవృత్తిలో నుండువారికి జెప్పెడు అతీతావస్థ సామాన్యజనులతో జెప్పిన లోక మేలాగున నగునో యని యోచింపక పోవుట కడుంగడు శోచనీయము అవధూతమార్గము నుపదేశించిన శ్రీదత్తాత్రేయ మహాముని తనచే నిర్మింపబడిన యవధూత గీతాంతమున ద్వాదశాధ్యాయమున వైరాగ్యమును గుఱించియు, గురు శిష్యులను గుఱించియు నేమి యుపదేశించియున్నారో చూడవచ్చును నాస్తికసంప్రదాయు లని కొందఱిచే జెప్పబడిన శ్రీకపిలుడు (సాంఖ్యమత ప్రవక్త) శ్రీజైనుడు, శ్రీబుద్ధుడు మొదలగువా రెంత దయాస్వరూపులు? ఎంత సత్యమూర్తులు? ఎంతటి తపోనిధులు? ఈ విషయము వారి జీవిత చరిత్రమువలన తెలియదగును

శ్రీకృష్ణభగవానుడు గీతలో ''ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే'' యని సెలవిచ్చియున్నారు అట్లుండగా ధర్మ ధ్వంసమును జేయుట యేమియో యోచించుకొను వారు లేరైరి ఓహో! కలియుగమెట్టి దారుణమైనదో యోచించుకొనుడు మఱియు నా యనంతోపనిషత్తులో పీఠిక వ్రాయునపుడు శ్రీదక్షిణామూర్తి ధ్యానపూర్వకముగ మంగళాచరణము జేసియున్నారు శ్రీదక్షిణామూర్తి సనకాదుల కాస్తిక్యమును బోధించెనో నాస్తికతను బోధించెనో చరిత్రకారు లెఱుగుదురు శాస్త్రములో ప్రణవార్థ మగు పరబ్రహ్మతత్త్వమునే సనకాదుల కుపదేశించియున్నారు ద్వాదశాక్షరిమంత్రము, 'అయం వ్యర్థః బాహ్యః కోపిన భవతి' ॥ 12 అక్షరములుండుచేత దీనికి ద్వాదశాక్షరియని పేరు గలిగినది దీని యర్థమేమనగా నీ ప్రపంచము, నిరర్థకము, బట్టబయలు ఏమియును లేదు అది తెనుగులో నిటుల వ్రాయబడుచున్నది అంతా బట్టబయలు ఏమియు లేదు '' ఇక షోడశాక్షరి మంత్రము నవలోకించుడు ''మూలాఉభావ మిదం జ్ఞాతం శరీరం కిము నాస్తి హి'' అర్థము జ్ఞాతకును, శరీరాదు లకును, కారణమగు మాయలేనిదే ఈగుర్తెఱుంగు నెఱుకయును, నశించునట్టి శరీరమును నెపుడును లేదు గదా! అనగా నేమియును లేదు దాని యొక్క తెనుగు మంత్రము ''మూలము లేని

గుర్తెఱిగే శరీరం ఏమీ లేదు '' ఇక పంచదశాక్షరీ మంత్రము ''స్వప్నే ప్రతీయమానాని రూపాణి యధా తధా'' 15 అక్షరములు గలవు ''స్వప్నమందు తోచునట్టి రూపము లేలాగో యాలాగే తెనుగు మంత్రము ''కలలో తోచిన శరీర మేలాగో యాలాగే'' ఈ మంత్రము లిచ్చట వ్రాయుటకు కారణమేమనగా యధార్థము నెఱుగుటకే

ఒక మతమును గాని, సంఘమునుగాని, నిందించుట నా యభిప్రాయము కాదు కాని లోకమును పాపమార్గములోనికి తీసికొని పోవుట జూచి సహింపలేక నింతవఱకు వ్రాయుడవైనది ధర్మాధర్మములకు, సత్యాసత్యములకు, జ్ఞానాజ్ఞానముల కతీతమే పరబ్రహ్మయని యుపనిషత్తులందు కొన్నివాక్యములు గలవు వాటియర్థ మిదివఱలోనే విశదీకరించితిమి అచ్చట నిత్యనైమిత్తిక కర్మలకే ధర్మమనియు, దానికి భిన్నమగు ధర్మహీనత కధర్మమనియు, ఆలాగున సత్యమగు జీవునకన్నను, అసత్తగు జగత్తుకన్నను పరబ్రహ్మ మతీతమని యర్థము అదేరీతిగ నమానిత్వాది జ్ఞానమునకంటె నన్యమగు పరమాత్మ యతీతమని భావము అంతేగాని, బ్రహ్మవేత్తలు మఱియొక శూన్యమును గాని పాపమునుగాని చెప్పియుండలేదు అనంతోపనిషత్తులో గూడ కొన్నిశ్లోకములను, కొన్ని యుపనిషద్వాక్యములను జేర్చియున్నారు వాటిలో యొకట్కటైనను గ్రంధకర్తృకృతము కాదు ఓభారతీదేవీ! ఇది యొకరిపై ద్వేషముతో జెప్పలేదు మీ ప్రశ్న వచ్చుటచే జెప్పబడినది ఇక 108 ఉపనిషత్తుల శాస్త్రప్రమాణమును, దానియొక్క పదవిభాగమును నీ క్రింద తెలుపబడుచున్నది అష్టోత్తరశతోపనిషత్తుల మూలము తెప్పించుకొని మీరందఱును జూడవచ్చును

*అన్యధాసంత మాత్మానం యోఽన్యధా ప్రతిపద్యతే ।*
*కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా ॥*

సత్పురుషులు ఆత్మస్వరూపమును యధార్థముగ జెప్పునపు డా సత్పురుషుల వాక్యములను వేదవాక్యములను కప్పి పుచ్చి మఱియొక విధముగ జెప్పువాడుక గలవాడే పాపకార్య ముల జేసినవాడు కాడు? అనగా సమస్తపాపముల జేసినవాడగునని తాత్పర్యము అని శాస్త్ర ముద్ఘోషించుచున్నది

*వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।*
*మలినా జన్మహేతుస్స్యాచ్ఛుద్ధా జన్మవినాశినీ ॥*

అని వసిష్ఠుడు వచించిన తీరున శుద్ధవాసనయనియు, మలినవాసనయనియు వాసన రెండువిధములు వీటికే శుద్ధ ఎఱుకయనియు, అశుద్ధ ఎఱుకయనియు నామ ములు అశుద్ధమగు విషయముతో గూడిన యెఱుక జన్మకారణమగును శుద్ధమగు జ్ఞానముతో గూడిన యెఱుక మోక్షకారణమగును ఇప్పుడు అష్టోత్తరశతోపనిషత్తులు ఉపనిషత్ప్రమాణ ముగ వ్రాయబడుచున్నవి వీటిలో నీ యనంతోపనిషత్తు కలదా! లేదా యని వివేకవంతులు చూచి తెలిసికొొందురుగాక! అప్పుడు సత్యాసత్యములు మీకే తెలియును

## అ ష్టో త్త ర శ తో ప ని ష దః

1 ఈశకేనకరప్రశ్న ముణ్డమాణ్డూక్య తిత్తిరిః ।
ఐతరేయఞ్చ ఛాన్దోగ్యం బృహదారణ్యకం తథా ॥

(1)ఈశ (2)కేన (3) కఠ (4) ప్రశ్న (5) ముణ్డక (6)మాణ్డూక్య (7) తైత్తిరీయ (8) ఐతరేయ (9)ఛాన్దోగ్య (10) బృహదారణ్యకములు ఇవి దశోపనిషత్తులు

*2. బ్రహ్మ కైవల్య జాబాలౌ శ్వేతాశ్వో హంస అరుణిః ।*
*గర్భో నారాయణో హంసో (బ్రహ్మ) బిన్దు నాద శిరఃశిఖా ॥*

*3. మైత్రాయణీ కౌషీతకీ బృహజ్జాబాల తాపినీ ।*
*కాలాగ్ని రుద్రమైత్రేయీ సుబాల క్షురిమన్త్రికా ॥*

(11)బ్రహ్మ (12) కైవల్య (13) జాబాల (14) శ్వేతాశ్వతర (15) హంస (16) ఆరుణిక (17)గర్భ (18) నారాయణ (19) పరమహంస (20) బ్రహ్మబిన్దు (21) అమృతనాదం (22) అథర్వశిరః (23) అథర్వశిఖ (24) మైత్రాయణి (25) కాషీతకి (26) బృహజ్జాబాల (27) నృసింహతాపినీ (28) కాలాగ్నిరుద్ర (29) మైత్రేయీ (30)సుబాల (31)క్షురిక (32)మన్త్రిక

4. సర్వసారం నిరాలమ్బం రహస్యం వజ్రసూచికమ్ ।
తేజోనాదధ్యాన విద్యాయోగ తత్త్వాత్మ బోధకమ్ ॥

5. పరివ్రాట్ త్రిశిఖీ సీతా చూడా నిర్వాణమండలమ్ ।
దక్షిణాశరభం స్కన్ధం మహానారాయణాద్వయమ్ ॥

(33) సర్వసార (34) నిరాలమ్బ (35) శుకరహస్య (36) వజ్రసూచిక (37) తేజోబిన్దు (38) నాదబిన్దు (39) ధ్యానబిన్దు (40) బ్రహ్మవిద్య (41) యోగతత్త్వ (42) ఆత్మబోధ (43) నారద పరివ్రాజక (44) త్రిశిఖి బ్రాహ్మణ (45) సీత (46) యోగచూడామణి (47) నిర్వాణ (48) మండల బ్రాహ్మణ (49) దక్షిణామూర్తి (50) శరభ (51) స్కన్ద (52) మహానారాయణ (53) అద్వయతారక

6. రహస్యం రామతపనం వాసుదేవంచ ముద్గలమ్ ।
శాణ్డిల్యం పైఙ్గలం భిక్షుం మహచ్ఛారీరకం శిఖా ॥

7 తుర్యాతీతం చ సంన్యాసం పరివ్రాజాక్షమాలికా ।
అవ్యక్తైకాక్షరం పూర్ణాసూర్యాక్ష్యధ్యాత్మ కుండికా ॥

(54) రామరహస్య (55) రామతపన (56) వాసుదేవ (57) ముద్గల (58) శాణ్డిల్య (59) పైఙ్గల (60) భిక్షుక (61) మహత్ (62) శారీరక (63) యోగశిఖా (64) తురీయాతీత (65) సన్న్యాస (66) పరమహంస పరివ్రాజక (67) అక్షమాల (68) అవ్యక్త (69) ఏకాక్షర (70) అన్నపూర్ణ (71) సూర్య (72) అక్షి (73) అధ్యాత్మక (74) కుండిక

8. సావిత్ర్యాత్మా పాశుపతం పరబ్రహ్మావధూతకమ్ ।
త్రిపురాతపనం దేవీ త్రిపురాకరభావనా ॥

9. హృదయం కుణ్డలీ భస్మరుద్రాక్ష గణదర్శనమ్ ।
తారసార మహావాక్య పఞ్చ బ్రహ్మాగ్ని హోత్రకమ్ ॥

10. గోపాలతపనం కృష్ణం యాజ్ఞ వల్క్యం వరాహకమ్ ।

*శాట్యాయనీ హయగ్రీవం దత్తాత్రేయం చ గారుడమ్ ॥*
*కలి జాబాలి సౌభాగ్య రహస్య ఋచముక్తికా ॥॥*

(75) సావిత్రీ (76) ఆత్మ (77) పాశుపతబ్రహ్మ (78) పరబ్రహ్మ (79) అవధూత (80) త్రిపురతాపిని (81) దేవి (82) త్రిపుర (83) కఠరుద్ర (84) భావన (85) రుద్ర హృదయ (86) యోగకుండలి (87) భస్మజాబాల (88) రుద్రాక్షజాబాల (89) గణపతి (90) జాబాలదర్శన (91) తారసార (92) మహావాక్య (93) పంచబ్రహ్మ (94) ప్రాణాగ్నిహోత్ర (95) గోపాలతపన (96) కృష్ణ (97) యాజ్ఞవల్క్య (98) వరాహ (99) శాట్యాయన (100) హయగ్రీవ (101) దత్తాత్రేయ (102) గారుడ (103) కలిసంతరణ (104) జాబాలి (105) సౌభాగ్యలక్ష్మి (106) సరస్వతీరహస్య (107) బహ్వృచ (108) ముక్తిక ఈ నూట యెనిమిదియును అష్టోత్తర శతోపనిషత్తు లనబడును

భారతి – పరమగురో! గ్రహించదగినవన్నియు గ్రహించితిని సంశయము లన్నియు నశించినవి కాని గీత తృతీయాధ్యాయమందొక సందేహము గలదు

*సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి ।*
*ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥*

జ్ఞానవంతుడైనను జన్మాంతర సంస్కారము ననుసరించియే ప్రవర్తించును ఆవిషయములో నిగ్రహముగాని, లేక దైవాజ్ఞగాని, గురువు నాజ్ఞగాని యేమి జేయగలుగును? ఈ శ్లోకము నాధారముగ జేసికొని ప్రకృతిగుణములు స్వభావములనియు, వాటి నిగ్రహము సాధ్యము గాదనియు, భగవంతుడు గూడ నా విషయమై యేమియు జేయశక్తుడు గాడని చెప్పుచుందురు కావున నీ సంశయమును తొలగించవలయును

గురు – ఈ విషయము నాతోగూడ ననేకు లడిగియున్నారు ఇది సాక్షాదనుభవ జ్ఞానము గలవారికి మాత్రమే దెలియును ''జ్ఞానవానపి '' యని యుండుటచే అనగా జ్ఞానము గలవాడైనను నని ప్రయోగించి యుండుటవలన గొప్ప సంశయమునకు కారణమగుచున్నది ఇక జ్ఞానవంతునికే యింద్రియ

నిగ్రహము తరముగానిచో నిక నజ్ఞాన స్థితియందుండువారిని గుఱించి చెప్పవలయునా? యని ప్రశ్నించువారియొక్క యాశయము ఇది చాల జాగరూకతతో వినదగినది సామాన్యముగ జెప్పునపుడు జ్ఞానమునకు బ్రహ్మజ్ఞాన మనియే తాత్పర్యము

కాని వేదాంత శాస్త్రములో జ్ఞానమనియు, విజ్ఞానమనియు నిరుతెగలు గలవు లేక జ్ఞానమనియు, జ్ఞేయమనియు రెండుపేర్లు గలవు దీనిరహస్యము దెలియనిచో దీనియందపాయము గలుగును కనుకనే వేదాంతశాస్త్ర మనుభవజ్ఞులవల్ల గ్రహించవలయునని చెప్పెడు రహస్యము ఇచ్చట నిత్యానిత్య వివేకజ్ఞానమునకే జ్ఞానమని గ్రహణము ఇది సాధన చతుష్టయ సంపత్తిలో మొదటిది ఇహాముత్ర ఫలభోగ విరాగము రెండవది శమాదిషట్క సంపత్తి మూడవది ముముక్షుత్వము నాల్గవది కావున ఆ జ్ఞానస్థితిలో నుండువాడు ఇంకను మూడంతస్తులను దాటవలసియుండును మఱియు గీత 13– వ అధ్యాయమున జ్ఞానము యొక్కయు, జ్ఞేయముయొక్కయు భేదములను, రెండుభాగములుగ జేసి శ్రీకృష్ణభగవానుడే చెప్పియున్నాడు అచట జ్ఞానికుండవలసిన అమానిత్వాది గుణములనే జ్ఞానమని తెలుపడమైనది 8 వ శ్లోకమునుండి 12 వశ్లోకమువఱకు 5 శ్లోకములచే 20 గుణములను జ్ఞానమును గుఱించి చెప్పియున్నాడు అట్టి జ్ఞానముచేత పొందదగిన విజ్ఞానమునే జ్ఞేయమని తెలుపడమైనది కావుననే యర్జునుని ప్రశ్నయందే ''జ్ఞానం జ్ఞేయంచ కేశవ!'' యని యుండుటకు కారణము మఱియు భగవానుడు

*ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।*
*మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥*

ఈ క్షేత్రమును, క్షేత్రజ్ఞుని, జ్ఞానమును, జ్ఞేయమును సంక్షేపముగ దెలిపితిని నా భక్తులు దీనిని దెలిసికొనియే నాయొక్క సామ్యావస్థను పొందుచున్నారు భగవత్స్వరూపస్థితి గల వారగుచున్నారు అని తెలిపియుండుటచే భగవత్ప్రాప్తి గలుగ వలసియుండిన యెడల జ్ఞేయముగూడ గలిగియుండవలయునని స్పష్టముగా తెలియుచున్నది మఱియు శాస్త్రజ్ఞానమే జ్ఞానమనియు, అనుభవజ్ఞానమే

విజ్ఞానమనియు గ్రహించదగినది ఇచ్చట ''జ్ఞానవానపి'' అని ప్రయోగించుటచే శాస్త్ర జ్ఞానము మాత్రము చాలదనియు, అనుభవ జ్ఞానముగూడ పొందవలయుననియు నూహనీయము మఱియు శాస్త్రజ్ఞానము గలవాడు గూడ నంతఃకరణములో గల జన్మాంతర వాసన ననుసరించియే ప్రవర్తించునపుడు అట్టి శాస్త్రజ్ఞానమైనను లేని వానిని గురించి మఱల చెప్పవలయునా! యని గూడ గ్రహించుకొనవలయునని తాత్పర్యము ఈ యర్థములో ప్రమాదము గలుగునని తలంచి వెంటనే దాని క్రింద నీ శ్లోకమును జెప్పు టకు కారణమైనది లేనిచో ముందు చెప్పిన దానికి విరుద్ధముగ మఱల చెప్పరాదు

*ఇన్ద్రియస్యేన్ద్రి యస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।*
*తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥*

ఇష్టవస్తువునందు ప్రీతియు, అనిష్టవస్తువునందు ద్వేషమును ప్రతిఇంద్రియమున్ను శబ్దాదివిషయములందు గలిగియున్నది ఏ కారణముచే నారాగద్వేషములు ముముక్షువగు పురుషునకు శత్రువులో, ఆకారణమున నారాగద్వేషముల కధీనత్వమును పొందకూడదని స్పష్టముగ దెలుపడమైనది కావుననే సప్తమాధ్యాయమున,

*జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।*
*యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్యమవశిష్యతే ॥*

ఏ జ్ఞానము నెఱింగి యీ మోక్షమార్గమునందు తెలియదగినది మఱియొకటి యేదియు మిగిలియుండదో, యట్టి యనుభవజన్య విజ్ఞానమును సాకల్యముగ నీకు నేను జెప్పెదను ఈ జ్ఞానమును, విజ్ఞానమును గ్రహించినచో మఱల నీలోకములో గ్రహించదగినది మఱియొకటి లేదని భగవంతుడే యుపదేశించెను కావున శాస్త్ర జ్ఞానము మాత్రము గలిగినను ననుభవజ్ఞానము మిగిలియుండునని భావము కావున రెంటిని గలిగియుండవలయును మఱియు పరోక్షజ్ఞానమునకే జ్ఞానమనియు, అపరోక్ష జ్ఞానమునకే విజ్ఞానమని వ్యవహారమని గూడ కొందఱి మతము మఱియు ఆరవ అధ్యాయమున ''జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా'' అని

యుండుటచే విజ్ఞానము లేని జ్ఞానము మాత్రము గల వానికి సంస్కారములు నశింపవు అందుచే నతనికి మనోనిగ్రహము దుస్తరము అభ్యాసికి నిగ్రహము కష్టతరమనియు, ఆరూఢునికి సులభమనియు దీనియొక్క సారము దీనియందు ''జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా'' యని యుండుటచే మొదట ఆచరణ జ్ఞానము, రెండవది యనుభవజ్ఞానము గలిగిన పిమ్మట అతిహర్షము అనగా నిరతి శయానందము గలుగునని భగవంతుడు మూడు మెట్లులుగా జెప్పెను దీనివలన జ్ఞానముతో తృప్తినొందక విజ్ఞానమును సంపాదించవలయుననియు, అప్పుడును నిరతి శయానందము గలుగువఱకు ధ్యానజ్ఞానముల ననుష్ఠించవలయు ననియు తాత్పర్యము

కనుకనే యా శ్లోకమున ''యుక్త ఇత్యుచ్యతే యోగీ'' అని యుండుటవలన అట్లు తృప్తాత్ముడైనప్పుడే యోగి కాగలడని చెప్పబడెను లేనిచో అయోగియో, కుయోగియో, వియోగియో గాగలుగునని తాత్పర్యము అందువలననే ఈ శ్లోకమును బోధించిన మూడవ అధ్యాయమున కొసలో నింద్రియ పరవశత్వముచే గలిగెడు దోష మును గుఱించి యంత కఠినముగా జెప్పుటకు కారణము ఈ మూడవ అధ్యాయమున 37 మొదలు 43 వఱకు గల శ్లోకములను బాగుగా చదువవలయును ఈ 7 శ్లోకములు ముఖ్యప్రాణముల వంటివి మఱియు రెండవ అధ్యాయమునగల స్థితప్రజ్ఞుని లక్షణమంతయు నీ ఇంద్రియ నిగ్రహమును గుఱించియే చెప్పడమైనది అట్లుగానిచో విధి నిషేధములను గుఱించి బోధించెడు శాస్త్రమే నిష్ప్రయోజనమగును దానితోగూడ నాచార్యోపదేశమును వ్యర్థమై పోవును అంతేగాక ఇక మీదట నెవరు నింద్రియ నిగ్రహము కొఱకు ప్రయత్నింపరు జ్ఞానులకే సాధ్యము కానపుడు మనబోటి యజ్ఞానుల కథను జెప్పవలయునా! అని వచింప నారంభింతురు మఱియు సాక్షాత్కారజ్ఞానము యొక్క ప్రయాసమును గుఱించియు తెలిపి యుండవచ్చును తల్లీ! భారతీదేవీ! సర్వేశ్వరుని కృపచేతను, మహర్షుల కరుణచేతను, మీయొక్క పుణ్యవిశేషముచేతను, మీరడిగిన ప్రశ్నలన్నిటికిని తగిన సమాధానమును జెప్పినట్లును, మీ సంశయ, అసంభా వన, విపర్యయ దోషము లన్నిటి నివృత్తియైనట్లును తలంచుచున్నాను ఇక నీ విషయ

మును పూర్తిజేయవలసియుండును కావున నిక విశేషముగ జెప్పదలంచుట లేదు కావున నీ దైవప్రాప్తికరమగు దీనిని పూర్తిజేయ దలంచుచున్నాను ఇక ముఖ్యమైన విషయ ముండినచో సంక్షేపముగ నడుగవచ్చును సంగ్రహముగ మాత్రమే సమాధానము జెప్ప బడును భారతీదేవి –

*అత్రినేత్రః శివస్సాక్షాత్ ద్విబాహుశ్చ హరిస్స్మృతః ।*
*యోऽచతుర్వదనో బ్రహ్మ శ్రీగురుః కథితః ప్రియే ॥*

పరమశివుడు పార్వతీదేవి కుపదేశించినట్లు త్రినేత్రము లేక ద్వినేత్రములు గల శివుడును, చతుర్భుజములు లేక ద్విభుజములుగల విష్ణువును, చతుర్వదనములు లేక యేకవదనముగల బ్రహ్మయును శ్రీగురుదేవుడని మనంబున నమ్ముచున్నాను

*సంసారసాగర సముద్ధరణైక మంత్రం*
*బ్రహ్మాదిదేవ మునిపూజిత సిద్ధమంత్రమ్ ।*
*దారిద్ర్య దుఃఖభవరోగ వినాశమంత్రం*
*వందే మహాభయహరం గురురాజమంత్రమ్ ॥*

సంసారసాగరము నుద్ధరించుటకు నైకైక మంత్రమైనదిన్నీ, బ్రహ్మాదిదేవముని పూజిత సిద్ధమంత్రమైనదియు, దారిద్ర్య దుఃఖభవరోగ వినాశకరమగు మంత్రమైట్టియు, జననమరణ భవ భయమును హరించెడు మంత్రమైనట్టిదగు, గురు రాజమంత్ర మును ''వందే'' నమస్కరించుచున్నాను అని ప్రార్థించి పరమగురో! ఈ జీవి జీవత్వము నుండి విడివడి శివత్వమును పొందినది సర్వసందేహములు నశించినవి సంశయ విపర్య యములు విలీనములైనవి జీవితము ధన్యమైనది ఇట్టి మహోపకార మొనర్చిన తమకు నేను జేయవలసిన దేమియు కనుపించుట లేదని భక్తి పరవశురాలై తన్మయస్థితి యందుండి భారతీదేవి వచించెను ఆ వాక్యములను విని,

గురు – అవమ్మా! బ్రహ్మవిద్య నుపదేశించిన గురువరునకు ప్రత్యుపకారముగా నిచ్చుటకు ముల్లోకములందు నేమియు లేదు కనుకనే జనకమహారాజు తన రాజ్యమును, తనను, తనకు సంబంధించిన వన్నియు

యాజ్ఞవల్క్యునకు ధారాదత్తముగ జేసినప్పుడు ఇది గురుదక్షిణ కాదు ఉన్నదింతే భూలోకమున ప్రకాశించెడు సూర్యున కొక చిన్నదీపమును దక్షిణగా నొసంగిన నెట్లుండునో, ప్రపంచమునకు ప్రాణవాయువు నిచ్చు వాయుదేవున కొక తాటిమట్టచే చేయబడిన విసనకఱ్ఱను ప్రత్యుపకారముగ సమర్పించుట యెటువంటిదో, లోకమంతయు జలమునిచ్చి సంరక్షించెడు పర్జన్యునకు (మేఘమునకు) ఒక దోసెడు నీరర్ఘ్యముగా నిడిన ఎంత ప్రతిఫలమగునో, ఆలాగున బ్రహ్మ సాక్షాత్కారము గలుగ జేసిన గురువరునకు మూడులోకములును ఆ లోకములలో గల సంపత్తులతోగూడ నర్పించినను నట్లే యుండును అదేరీతిగ శ్రీ శివాజీ చక్రవర్తియు తన యాత్మ గురుడగు సమర్ధ రామదాసుస్వామిగారికిని తన రాజ్యమును, తనను, తన దేహసంబంధములగు వాటి నన్నిటిని గురు పాదారవిందము లకు ధారా దత్తముగ జేసినట్లును వినుచున్నాము ఈవిషయమై కైవల్య నవనీతములో గల గురు శిష్య సంవాదము నిచట దెలిపెద శిష్యుడు –

*నిరతిశయానుభూతి సుఖనీరధి బూర్ణముగా మునింగి ప్రా*
*క్కరణ తనూముఖాఖిల వికారము లెల్ల నడంగ జిత్సుఖో*
*త్కరహృదఖండమైన తనుగన్గొన దత్పరిపూర్ణ దేశికుం*
*డురుతరబోధసుప్తి గనె నూర్జిత భావముతోడ నిమ్మలః.*

నేతి, నేతి అనెడి మహావాక్యముచేత నిదిబ్రహ్మముకాదు, ఇది బ్రహ్మము కాదని యన్నిటిని త్రోయగా కడపట నిలిచిన బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మానుభవ రూపమైన నిరతి శయా నంద సముద్రమందు లెస్సగా మునింగి విజ్ఞానమువలన గలిగిన యానందముతో గూడిన యంతఃకరణము పరబ్రహ్మాకారమై పరిణమింపగా, అఖండపరిపూర్ణమైన తనను సచ్చిదానంద స్వరూపుడైన యాచార్యుండు కుతూహలముతో జూడగా నిర్వికల్ప నిష్ఠాభావ మందుండి యిట్లు వచించెను

*పరిపాకస్థితినుండి కొంతతడవా పంథానురక్తిః లఘు*
*స్ఫురణన్మేల్కని తన్మనంబుగని యుద్బోధ ప్రమోదాశ్రు యు*

*గ్వర వక్త్రం బిలసోక మ్రొక్కి కరయుగ్మంబెత్తి వేచేర్చి మూ*
*ర్ధ్ని రహిః ధ్యాన మొనర్చి పల్కదొడరెః ధీరస్థిత ప్రజ్ఞుడై*

పరిపక్వజ్ఞానముగల గురుడు చెప్పిన యోగమార్గము చేత కొంతసేపు బ్రహ్మనిష్ఠ యందుండి సర్వవికారములను విడిచి బ్రహ్మాకారమై యున్న తన మనస్సును చూచి సంతోషించి యానంద బాష్పములచేత ముఖమును నేల మీద మోపి గురువులకు నమ స్కరించి, లేచి చేతులు మోడ్చి మనస్సున నాచార్యునితో తన యనుభవమును తెలుప ప్రారంభించెను

*అయ్యా! దేశిక యంతరాత్ముడవు నీవై మద్భవానంతమం*
*దయ్యా పొందుచుబ్రోచుచుః పిదప మర్త్యాకారమున్ బూని నా*
*కుయ్యాలించి కృతార్థు జేసితివి చేకూరం బరార్థంబు మీ*
*కియ్యః వేఱొకటేది గాన నిక నెందే లెంకనై కొల్చెదః.*

ఓ యాచార్యా! సర్వజీవాంతర్యామివైన నీవు నా యంతరంగమందు నివసించి, యెన్నరాని జన్మములను నేను పొందునపుడు సన్మార్గమున ప్రవర్తించువానిగ జేసి పిదప కర్మ, భక్తి, వైరాగ్య యోగములలో నా బుద్ధిని ప్రవేశింప జేసి శుద్ధపఱచి నీవు మానుషవేష మున బ్రత్యక్షమై నా మొఱ నాలకించి యపరోక్ష బ్రహ్మసాక్షాత్కారమైన యభేదజ్ఞాన మునుపదేశించితివి ప్రత్యుపకార మేమియును జేయ గాన్పించుట లేదు

*అంతేవాసి నుతింప నిక్కరణి నయ్యాచార్యు డీక్షించి వే*
*చెంతం జేరగ జీరి శిష్యుని సుఖాసీనుం దగం జేసి వి*
*శ్రాంతిం బాపుట కంతరాయములు పుత్రా మూడు భాసిల్లు సు*
*స్వాంతం బొప్ప హరింప వాని నదె సత్సర్వోపకారం బగుః.*

శిష్యు డీవిధమున గురువును కొనియాడగా నాచార్యుడు పరమకరుణతో దగ్గరకు రమ్మని పిలిచి కూర్చుండ నునుచియో పుత్రుడా! స్వరూప సాక్షాత్కార జ్ఞానమును భంగ పఱచెడు మల, విక్షేప, ఆవరణలు లేక సంశయ, అసంభావన, విపర్య యము లనెడు మూడు దోషములను నేకాలమునందును ఆత్మలో జేరనీయక

నీయొక్క సాక్షాత్స్వరూప జ్ఞాన నిష్ఠయందుండుట యేది గలదో యదే నీవు చేయవలిసిన ప్రత్యుపకారము అని చెప్పె మాంత్రికుడు దయ్యము పట్టినవాని నుండి దుష్టగ్రహమును మంత్రముచే నుచ్చాటన జేసినను మఱల యేకాలమందైన ప్రవేశించునేమో యని తలంచి యొక రక్షారేకును (యంత్రమును) కట్టును అది యుండువఱకెచ్చటను, నేకాల మునను గ్రహము ప్రవేశింపజాలదు అదే రీతిగ గురుడవిద్యాగ్రహగ్రస్త శిష్యునకు దివ్య మంత్రాత్మోపదేశమును జేసి యవిద్యను తొలగించును మఱల యుక్తాహార, వివిక్తవాస, బ్రహ్మ చింతనములనెడు మూడు బీజాక్షరములతోగూడి యాచరణను బోధించును వీటిని నెంతకాలము గురువాక్యముపై విశ్వాసము గలిగి, యనుష్ఠించునో అంతకాల మువఱకు మాయా మోహగ్రహము దరిజేరజాలదు యంత్రము పోయిన వెంటనే దుష్ట గ్రహమావేశించునట్లు ఆచరణత్రయమును రక్షారేకు ఎపుడు పడిపోవునో, మాయామోహ భ్రమగ్రహము వెంటనే ప్రవేశించునని మరువకుడు

గురు – భారతీదేవీ! ఇక నేదైన నేను జెప్పవలసియున్నదా? యని గురువరుడు పరమకరుణతో వీక్షించి వచించిన వాక్యము నాలకించి యిట్లనియె

భారతి. –

*కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీచరణోదకమ్ ।*
*గురుర్విశ్వేశ్వర స్సాక్షాత్ తారకబ్రహ్మ నిశ్చయః ॥*

పరమగురో! గురువు నివాసస్థలము కాశీక్షేత్రమనియు, చరణోదకము జాహ్నవీ తీర్థమనియు, సాక్షాద్విశ్వేశ్వరుండే గురురూపముగ నావిర్భవించెననియు, గురు వాక్యము తారక బ్రహ్మమంత్రమనియు నీ జీవియొక్క నిశ్చయము

*శోషణం పాపపంకస్య దీపనం జ్ఞానచేతసః ।*
*గురోః పాదోదకం సమ్యక్ సంసారార్ణవతారకమ్ ॥*

పాపపంకమును నెండింప జేయునదియును, జ్ఞానతేజస్సును ప్రజ్వలింప జేయునదియును, సంసారార్ణవమునుండి తరింప జేయునదియు నగునది గురుపాద మని తలంచుచున్నాను

ఆచార్యోత్తమా! నేను గ్రహించ వలసినవాటి నన్నిటిని సంపూర్ణముగా గ్రహించి తిని ఇంకొక మనవి గలదు తమయొక్క గురుసంప్రదాయము నిదివరలో నెవరును లెస్సగా దెలిపియుండ లేదు అనేక భక్తులడుగుటకు భయపడుచున్నారు వారందఱును దానిని తెలిసికొనవలయునని నిండు ఆసక్తి గలిగియున్నారు నాకును తెలిసికొనవలయునని కోరిక గలదు నన్ను గూడ నెవ్వరైన ''మీ గురుసంప్రదాయ మేది'' యని యడిగినచో ధైర్యముగ జెప్పుటకనుకూలముగ నుండును గోవును దానము చేయు వారికి దానియొక్క తలుగు నిచ్చుటకు ప్రయాసముండదు గదా!

గురు – భారతీదేవీ! తల్లీ! యిది వఱలోను, దీనిని గొందఱడుగుచుండిరి అదంతయు లోక విషయమే గాని యనుష్ఠానపరమగు జ్ఞానమే ముఖ్యముగ కావలసి యుండును అంతేగాదు తురీయాశ్రమమును స్వీకరించు వారికే యది యవసరము గాని తక్కినవారి కందఱికిని గురువులయొక్క యాశ్రమము పేరుగాని, లేక గురువు యొక్క పేరుగాని యుండిన చాలును పతివ్రతయగు నారీమణి తన భర్తయొక్క పేరు నేలాగున అనవసర కార్యము లన్నిటిలోను జెప్పక యత్యవసర కార్యమువచ్చినపుడే యెవరి చేతనైన చెప్పించుటగాని, వ్రాసిచూపించుటగాని చేయునో, యాలాగున నుత్తమ శిష్యు డుండవలయును

అనేకులు గురువాక్యమును విక్రయించి జీవించువారు గలరు దానికన్న కన్నతల్లిని పరపురుషుల కిచ్చి జీవించుట మేలు మఱియు గురువంతటి పవిత్రత, ఆచరణ, ఆత్మనిష్ఠ, జ్ఞానముగలవాడు మాత్రమే గురువుయొక్క నామధేయమును జెప్పవలయును తక్కిన వారంతటిస్థితి గలుగువఱకు గోప్యముగా నుంచుటయే మంచిది ఏలయనగా! తనయం దేదైన లోపము గలిగిన పరమపావనుండగు నా గురుమూర్తికిని, అతి నిర్మలమగు వారి యొక్క సంఘమునకును లోపము గలుగ జేసిన వారగుదురు గురువుయొక్క పవిత్రత, శాంతము, కరుణ, జ్ఞానము, సత్యము, వ్రతనిష్ఠ మొదలగునవి యన్నియు తానాచరించి లోకములో ప్రచారమగునట్లు ప్రయత్నించువాడే యథార్థమగు శిష్యుడగును అయితే యాలాగున లోకములో ధర్మవ్యాప్తి గలుగవలసి యుండిన, తన యనుష్ఠానము ఒకదాని వలన మాత్రము జరుగును అట్లు గాక యెంత ప్రజ్ఞతో,

శాస్త్రజ్ఞానముతో, గ్రంధ రచనలతో, ఉపన్యాసధోరణితో, పత్రికాప్రచురణతో, ప్రారంభించినను అవియన్నియు లోపల గింజలేని విత్తనము విత్తిన వ్యవసాయము వలె వ్యర్థమైపోవును పై జెప్పిన శక్తు లేమియు లేనప్పటికిని నిర్మల వైరాగ్యముతో గూడిన యనుష్ఠానముండిన చాలును అది సుగంధ పుష్పములనుండి గంధమును తీసికొని వాయువు లోకములో వ్యాపింపజేయునట్లు, ఆ సత్యానుష్ఠానము లోకములో ప్రకాశింపజేయును మీ రడిగి నందుచే మన సంప్రదాయమును జెప్పెద

## అ ధా మ్నా య స్తో త్ర ప్రా ర ం భః

*చతుర్దిక్షు ప్రసిద్ధాసు ప్రసిద్ధ్యర్థం స్వనామతః ।*
*చతురోఽథ మఠా౯ కృత్వా శిష్యాన్సంస్థాపయద్విభుః ॥* 1

*చకార సంజ్ఞామాచార్యశ్చతుర్ణాం నామభేదతః ।*
*క్షేత్రం చ దేవతాం చైవ శక్తిం తీర్థం పృధక్పృధక్ ॥* 2

*సంప్రదాయం తధామ్నాయభేదం చ బ్రహ్మచారిణామ్ ।*
*ఏవం ప్రకల్పయామాస లోకోపకరణాయ వై ॥* 3

*దిగ్భాగే పశ్చిమే క్షేత్రం ద్వారకా శారదా మఠః ।*
*కీటవాళ స్సంప్రదాయ స్తీర్థాశ్రమపదే ఉభే ॥* 4

*దేవ స్సిద్ధేశ్వర శ్శక్తి ర్భద్రకాళీతి విశ్రుతా ।*
*స్వరూప బ్రహ్మచార్యాఖ్య ఆచార్యః పద్మపాదకః ॥* 5

*విఖ్యాతం గోమతీ తీర్థం సామవేదశ్చ తద్గతమ్ ।*
*జీవాత్మ పరమాత్మైక్యబోధో యత్ర భవిష్యతి ॥* 6

*విఖ్యాతం తన్మహావాక్యం వాక్యం తత్త్వమసీతి చ ।*
*ద్వితీయః పూర్వదిగ్భాగే గోవర్ధనమఠ స్స్మృతః ॥* 7

*భోగవాళస్సంప్రదాయ స్తత్రారణ్యవనే పదే ।*
*తస్మి౯ దేవో జగన్నాధః పురుషోత్తమసంజ్ఞితః ॥* 8

క్షేత్రం చ వృషలా దేవీ సర్వలోకేషు విశ్రుతా ।
ప్రకాశ బ్రహ్మచారీతి హస్తామలక సంజ్ఞితః ॥ 9

ఆచార్యః కథిత స్తత్ర నామ్నా లోకేషు విశ్రుతః ।
ఖ్యాతం మహోదధి స్తీర్థం ఋగ్వేద స్సముదాహృతః ॥ 10

మహావాక్యం చ తత్రోక్తం ప్రజ్ఞానం బ్రహ్మ చోచ్యతే ।
ఉత్తరస్యాం శ్రీమరస్యాత్ క్షేత్రం బదరికాశ్రమమ్ ॥ 11

దేవో నారాయణో నామ శక్తిః పూర్ణగిరీతి చ ।
సంప్రదాయో నందవాళ స్తీర్థం చాలకనందికా ॥ 12

ఆనందబ్రహ్మచారీతి గిరిపర్వత సాగరాః ।
నామాని తోటకాచార్యో వేదోఽథర్వణ సంజ్ఞికః ॥ 13

మహావాక్యం చ తత్రాయమాత్మా బ్రహ్మేతి కీర్త్యతే ।
తురీయో దక్షిణస్యాం చ శృంగేర్యాం శారదామరః ॥ 14

మలహానికరం లింగం విభాండక సుపూజితమ్ ।
యత్రాస్తే ఋష్యశృంగస్య మహర్షేరాశ్రమో మహాన్ ॥ 15

వరాహో దేవతా తత్ర రామక్షేత్ర ముదాహృతమ్ ।
తీర్థం చ తుంగభద్రాఖ్యం శక్తి శ్రీశ్శారదేతి చ ॥ 16

ఆచార్యస్తత్ర చైతన్య బ్రహ్మచారీతి విశ్రుతః ।
వార్తికాది బ్రహ్మవిద్యా కర్తా యో మునిపూజితః ॥ 17

సురేశ్వరాచార్య ఇతి సాక్షాద్బ్రహ్మావతారకః ।
సరస్వతీపురీ చేతి భారత్యారణ్యతీర్థకౌ ॥ 18

గిర్యాశ్రమ ముఖాని స్యుస్సర్వనామాని సర్వదా ।
సంప్రదాయో భూరివాళో యజుర్వేద ఉదాహృతః ॥ 19

అహం బ్రహ్మాఽస్మీతి తత్ర మహావాక్య ముదీరితమ్ ।

*చతుర్ణాం దేవతాశక్తిః క్షేత్రనామాన్యనుక్రమాత్ ॥* 20

*మహావాక్యాని వేదాంశ్చ సర్వముక్తం వ్యవస్థయా ।*
*ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజక భూపతేః ॥* 21

*ఆమ్నాయస్తోత్ర పఠనా దిహాముత్ర చ సద్గతిమ్ ।*
*ప్రాప్యాన్తే మోక్షమాప్నోతి దేహాంతే నాత్ర సంశయః ॥* 22

*ఇత్యామ్నాయస్తోత్రం సంపూర్ణమ్*

భారతీదేవీ! దీనియొక్క యర్థమును మాత్రము ప్రశ్నింపకుము సన్న్యాసముయొక్క ప్రాణము (మర్మము) దీనియందు గలదు ఇది సాక్షాద్గురు ముఖతః ఆశ్రమస్వీకార సమయమున వినదగినది అపుడ గూడ ప్రతిజ్ఞాపూర్వకముగ నిది యుపదేశింపబడును విధిప్రకారము సన్న్యాస సంస్కారము శమదమాది గుణములు గల యంతేవాసికి మాత్రమే ఇది యుపదేశింప తగును ఇంత భద్రముగా నుండినను నిది మోక్షసాధనము కాదు ఇది యొక ప్రాపంచిక పవిత్రమగు ధర్మము బ్రాహ్మణేతరులలో కొందరు గోత్రము, సూత్రము, వేదము, శాఖ వీటిని తెలిసికొని బ్రాహ్మణ సమారాధనలలో పోవుట కవకాశము గలిగినను ప్రవరమాత్రమేలాగున తెలియ సాధ్యము గాదో, అది ఏలాగున బ్రాహ్మణులకు ఉపనయన సంస్కారస మయములో పురోహితునిచే నుపదేశింపబడునో ఆలాగుననే యీ యామ్నాయ పద్ధతియు నుండును విధిప్రకారము సంస్కారము చెందని వారుకూడ గిరి, పురి, సరస్వతి, మఠము, మఠి మొదలైన వాటిని కొన్నింటిని దెలిసికొని యున్నను, 'ప్రేష' మంత్రమును, నీ యామ్నాయమును తురీయాశ్రమ స్వీకారము విధిప్రకారమిచ్చు నపుడు గురువీ పరమరహస్యము నుపదేశించును ఇంత రహస్యముగ దీనినుంచుటకు కారణమేమనగా! వైహాగ్యోపరతులు, శమదమాది గుణములు లేనివారు గూడ స్వయముగ కాషాయదండాదులను ధరించినచో పరమపావనమగు యత్యాశ్రమమునకు లోపము గలుగునేమోయని తలంచియే అట్లు గోప్యముగా నుంచడమైనది ఉత్తరదేశములో సన్న్యాసుల మఠమునకు వెళ్ళువారికి యామ్నాయము దెలిసియుండవలయును అచ్చట వారు మఠములోనికి గాని, యతుల భోజనపంక్తి లోనికిగాని వచ్చువారిని నడుగుట

కొకరిని నియమించుదురు ఇక దశనామ సంప్రదాయములలో నొక్కొక్క సంప్రదాయము వారనుష్ఠించ వలసిన ముఖ్యవిషయ మీ క్రింద వివరించ బడుచున్నది ఇది పై జెప్పిన యామ్నాయ మంత రహస్యముగ నుంచ నక్కర లేదు

*తీర్థాశ్రమ వనారణ్య గిరిపర్వత సాగరాః ।*
*సరస్వతీ భారతీ చ పురీతి దశనామకాః ॥*

దశవిధసాంప్రదాయముల పేర్లు 1 తీర్థము, 2 ఆశ్రమము, 3 వనము, 4 అరణ్యము, 5 గిరి, 6 పర్వతము, 7 సాగరము, 8 సరస్వతీ, 9 భారతీ 10 పురి, ఇక నొక్కొక్కదాని ముఖ్యాచరణ వ్రాయబడుచున్నది

*1 తీర్థనామ –*

*త్రివేణీ సంగమే తీర్థే తత్త్వమస్యాదిలక్షణే ।*
*స్నాయాత్తత్త్వార్థ భావేన తీర్థనామా స ఉచ్యతే ॥*

*2 ఆశ్రమనామ –*

*ఆశ్రమగ్రహణే ప్రౌఢ ఆశాపాశవివర్జితః ।*
*యాతాయాతవినిర్ముక్త ఏష ఆశ్రమ ఉచ్యతే ॥*

*3 వననామ –*

*సురమ్యే నిర్ఝరస్థానే వనే వాసం కరోతి యః ।*
*ఆశాబంధవినిర్ముక్తో వననామా స ఉచ్యతే ॥*

*4 అరణ్యనామ –*

*అరణ్యే సంస్థితో నిత్య మానందే నందనే వనే ।*
*త్యక్త్వా సర్వ మిదం విశ్వ మరణ్యః పరికీర్త్యతే ॥*

*5 గిరినామ –*

*వాసో గిరివరే నిత్యం గీతాధ్యయన తత్పరః ।*
*గంభీరాచలబుద్ధిశ్చ గిరినామా స ఉచ్యతే ॥*

6 పర్వతనామ –

*వస న్పర్వతమూలేషు ప్రౌఢం జ్ఞానం బిభర్తి యః ।*
*సారాసారౌ విజానాతి పర్వతః పరికీర్త్యతే ॥*

7 సాగరనామ –

*తత్త్వసాగరగంభీరో జ్ఞానరత్న పరిగ్రహః ।*
*మర్యాదాం నైవ లంఘేత సాగరః పరికీర్త్యతే ।*

8 సరస్వతీనామ –

*సర్వజ్ఞానరతో నిత్యం సర్వవాదీ కవీశ్వరః ।*
*సంసారసాగరాసార హన్తాసౌ హి సరస్వతీ ॥*

9 భారతీనామ –

*విద్యాభారేణ సంపూర్ణః సర్వభారం పరిత్యజన్ ।*
*దుఃఖభారం ప్రజానాతి భారతీ పరికీర్త్యతే ॥*

10 పురీనామ –

*జ్ఞానతత్త్వేన సంపూర్ణః పూర్ణతత్త్వపదే స్థితః ।*
*పరబ్రహ్మరతో నిత్యం పురీనామాస ఉచ్యతే॥*

## మఠామ్నాయ విధానము సంపూర్ణము

భారతీదేవిగారూ! దీనియొక్క అర్థమును జెప్పుట లేదు ఏలననగా! ఇది యంతయు కేవలము ఆత్మ తత్త్వవేత్తలగు గురువుల దగ్గఱ శ్రవణమును జేయవలెను ఈ దినము చాల పవిత్రమైనది తురీయాశ్రమస్వీకరణమునకు, తపస్సులో ప్రవేశించుటకును ఉత్తరాయణము మాఘమాసము శుక్లపక్షము పావనమని మహాఋషులు వచింతురు కావున తురీయాశ్రమ సంస్కారమునకు కావలసిన యేర్పాటులన్నియు, చేసుకొనదగునని చెప్పి ఆశ్రమములో నుండు సాధువులతోను, శ్రీభారతీదేవిగారితోను, నితరులతోను వచించిరి మఱియు

నిదివరలో శ్రీ బదరికాశ్రమమునందు, ఆత్మ పిండతర్పణము చేసియుండుట చేతను, స్త్రీ యగుటచేతను, పురుషులకు జరుగవలసిన సన్న్యాస సంస్కార మక్కర లేదు ఈయత్యాశ్రమ సంస్కార కర్మ గూడ కర్మకాండ సంబంధమేగాని, మనస్సే ప్రధానము అయినను పూర్వీక ఋషులేర్పరచిన ప్రకారము సంస్కారక్రియలు చేసిన మాత్రమే, మనస్సునకు ధైర్యమును, విశ్వాసమును, పవిత్రతయును గలుగుటయేగాక, యెచ్చటనైన ఎవ్వరైన నడిగినచో, సమాధానము చెప్పుటకును, సంస్కృతులగు సాధువుల సంఘములలో వెళ్ళుటకును, సంశయము గలుగదు కావున నీ దిన ముపవసించి పితృదేవతలకు చేయవలసిన పిండప్రదానము లన్నియు, విధప్రకారము పౌరోహితులచే చేయించవలయును ఆత్మపిండ తర్పణముగూడ నీ దినమే చేయవలసియుండును

తరువాత సన్న్యాస విధి ననుసరించి విరజాహోమ మొనర్పవలయును ఇది యతీశ్వరులే చేయించవలయును కాని యితరులు చేయించరాదు బ్రహ్మముహూర్తమున నేదైన నొక పుణ్యతీర్థములోనుండి ప్రేషమంత్రము నుపదేశించవలసి యుండును ఈ మంత్రమే సన్న్యాసముయొక్క ప్రాణము మఱియునపుడే యిదివరలో నుపాసన చేసియుండు దైవమందు జీవేశ్వరుల ఐక్యమును బోధించి ప్రణవముయొక్క అకారమును ఉకారమందును, ఉకారమును మకారమందును, మకారమును అర్ధమాత్ర యందును ఐక్యపరచవలయును అత్తరి కంఠబంధనముగాని, కటిబంధనముగాని యుండిన ఛేదించవలయును పురుషుడైనచో శిఖాయజ్ఞోపవీతములను మంత్రపూర్వ కముగా తీసి, మంత్రముతో సహోజలములో నుంచవలయును ఇచట నారద పరివ్రాజ కోపనిషత్తు చెప్పిన ప్రకారము, శిఖ యొక్కయు, యజ్ఞోపవీతముయొక్కయు, అంతరార్థము నుపదేశించి, స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరముల నొక్కొక్క దాని నొక్కొక్క దానిలో లయమొనర్చుచు అదేప్రకారము, విశ్వ, తైజస, ప్రాజ్ఞప్రత్యగాత్మ లలో నైక్యపరచుచు విరాట్, హిరణ్యగర్భ, అంతర్యామి, పరమాత్మల జీవునైక్య మొనర్చుచు ప్రణవముయొక్క నాల్గవ పాదమును, జీవునియొక్క ప్రత్యగాత్మను, పరమేశ్వరుని యొక్క పరబ్రహ్మమును, నీ నాలుగును నాలుగింటిలో నేకమొనర్చి

సాక్షాద్బ్రహ్మమై యుండేలాగున బోధించవలయును ఈ సమయమున తీర్థములో కంఠము వఱకు ఉత్తరముఖముగాను, తూర్పుముఖముగా నుండ వలయును

ఈ విధికి తూర్పుముఖమే శ్రేష్ఠము స్త్రీయైనచో నితర సంస్కారము ఇదివరలో సంస్కారము పొందియుండు సాధు స్త్రీలచే చుట్టును వస్త్రములచే ఆవరణము చేయించుకొనవలయును శరీరముపై వస్త్రము తగులరాదు ఇంతటితో సన్న్యాస కర్మము సంక్షిప్తముగ పూర్తియగును అపుడే ఆత్మోత్తేజకమగు నూతననామమును పెట్టవలయును తరువాత కౌపీనకాషయవస్త్రములను మంత్రపూర్వకముగ ధరించ వలయును స్త్రీయైనచో నారవస్త్రముండిన చాలును శిరోజములుండినను, స్త్రీలకు విరోధము లేదు లింగసన్న్యాసమనియు, అలింగసన్న్యాసమనియు సన్న్యాసము రెండువిధములు స్త్రీలకు అలింగసన్న్యాసమే విధింపబడినది లింగసన్న్యాసమునకు దండకమండలాదులు గలవు అవి లేని అలింగసన్న్యాస మనంబడును ఈ విషయము ఆత్మపురాణ మున సప్తమాధ్యాయమున శంకరాచార్యమునివరుడుపదేశించియున్నాడు అపుడు ఆమ్నాయ పద్ధతి ననుసరించి ఆచార సంప్రదాయ పద్ధతుల నుపదేశించవలయును ఇది పరమరహస్యమనియు, అనధికారులకు చెప్పకూడదనియు, ప్రతిజ్ఞ చేయించవలయును ఈ సన్న్యాసాశ్రమ స్వీకారము దేనికొరకనిన తాను తరించుటకును, నితరుల తరింపజేయుటకు నిరాటంక ముగ యత్నించుటకనియు పరమార్థము నుపదేశించి, సమస్త కర్మలను ఆత్మయందైక్యపరచి, అపుడీ సన్న్యాస కర్మమునకు సంబంధించినది, అచటనుండువారును, ఉపదేష్టయగు నాచార్యుడును, మరియొకసారి విరజా హోమము నొనర్చి భిక్షాన్నమునకు పంపవలెను భైక్షమునకు వెళ్ళునపుడొక యింటిలో భిక్షపెట్టుట కాలస్యమైనచో, గోవుయొక్క స్తనము లలో నొక స్తనము నుండి పాలు పితుకు సమయ మెంతయో అంతవరకుండి మరియొక యింటికి వెళ్ళవలయును వెళ్ళిన తర్వాత మొదటి యింటివారు భిక్షాన్నము తెచ్చినను, పిలిచినను మరల కూడదు వెనకకు తిరగ కూడదు భిక్షకు వెళ్ళునపుడింటికి బయటగానే యుండి వారివారి పరంపరా సంప్రదాయము ననుసరించి ''నారాయణహరి'' అని యొకసారి యుచ్చరించి దైవభావములో మౌనముద్రలో సర్వేంద్రియ నిశ్చలత్వముతో నిలువ వలయును

మూడుగాని, ఐదుగాని, ఏడుగాని యిండ్లలో మాత్రమే భిక్షాన్నమును స్వీకరించవలయును యతి ధర్మము సన్న్యాసులలోను, గృహస్థధర్మము సంసారులలోను తగ్గిపోవుటచే, శుద్ధమగు శుద్ధాహారము వండువారి యింటికి మాత్రము భైక్షముకొరకు వెళ్ళుటయే మంచిది

భిక్షాన్నము తెచ్చి పాదప్రక్షాళనాదులు సలిపి ముందుగ గురుదేవునికి పెట్టవల యును అత్తరి యర్హులగు నితరులుండిన వారికిగూడ పెట్టవచ్చును తర్వాత తాను భుజించవలయును ప్రతిదినమును భిక్షాన్నమునకు వెళ్ళక పోయినను సన్న్యసించిన దినము మాత్ర మెట్టివారైనను భిక్షముకొరకు వెళ్ళియే తీరవలయును మఠామ్నాయ మీ గ్రంథములో మరియొక స్థలమున వ్రాయబడినది అచట కనదగును రాజభటు లేలాగున ఎరుపు వర్ణముగల చిహ్నములను ధరించుచు జనులను రాజధర్మముల నాచరించే లాగున చేయుచుందురో, ఆలాగున నీ కాషాయ దండకమండలవులు గూడ స్వాత్మరాజ్యమునకు జనులను చక్కపరచుకొర కేర్పడిన యొక లాంఛనమే గాని వేరు మహిమ దీనియందు గలదని భ్రమనొందకూడదు ఏలాగున రాజలాంఛనముండినచో, నితడు పోలీస్ డిపార్టుమెంటులో లేక సేనలో చేరినవానినిగా జనులు తెలుసుకొనగలుగుదురో ఆలాగున యతివేషము చూచిన యితడు సర్వసంగ పరిత్యాగియనియుం ధర్మబోధార్థము సంచరించువాడనియు తెలుసుకొని భిక్షాన్నా దులచే ఆదరింతురు అందుకొరకే యీ వేషము నేర్పాటు చేయుడమైనది గొప్ప తపస్సును, మహాపాండిత్యమును లేనివాడైనను బ్రహ్మసూత్రములు, దశోపనిషత్తులు, భగవద్గీత అనంబడు ప్రస్థానత్రయమునైన తప్పక వరన చేసి యుండవలయును వ్రతాది నియమములును, శమదమసత్య శౌచాది గుణములును తప్పక గలిగియుండ వలయును కట్టకడకు కఠోపనిషత్తును, పాతంజలి యోగదర్శనమును, భగవద్గీతయును వరనమొనర్చి యెచటడిగినను చెప్పేలాగున యుండవలయును మంచి వ్రతనిష్ఠయు, ఆహారనియమము గలిగి యుండినవారికి సన్న్యాస మివ్వవచ్చును

అపుడే దీనియొక్క పవిత్రాశయము బోధపడగలుగును ఈ దినము మాఘ

శుక్లదశమి ఆదివారమగుట చేతను, ఆమ్నాయతత్త్వమీదినమే మీకు శ్రవణము చేయించి నందుచేతను, నేను తురీయాశ్రమస్వీకార సంస్కారము మాఘశుద్ధ దశమి పుణ్యదినమున పొందియుండుట చేతను మీకున్ను, శాస్త్రోక్తముగ నీ దినము సన్న్యసాశ్రమ పద్ధతులన్నియు జేయించెదను అని గురువరుండు చెప్పి బ్రహ్మనిష్ఠులగు కొందరు పెద్దలను, కొందరు యతీశ్వరులను, కొందరు తపస్వినులగు నారీమణులను, కొందరు సాధుస్త్రీలను రప్పించి, శ్రీ భారతీదేవికి తురీయాశ్రమము నివ్వడమైనది ఇక మీకు పూర్వాశ్రమములోగల భారతీదేవి యను నామధేయమును దీసివేసి యీ దినమునుండి 'శ్రీబాలయోగిని' అను ఆశ్రమ స్వీకారనామకరణ మొనర్చడమైనది ఇక మీదట ఈ నామమునే చెప్పుచుండవలయును ఓమ్ తరువాత ఆచార్యునికి నమస్కారమొనర్చి పవిత్రాసనమున కూర్చుండబెట్టి కర్పూర హారతిని జేయించవలయును తరువాత శ్రీవ్యాసమహర్షికిన్ని, శ్రీశంకరాచార్య భగవత్పాదులకున్ను పుష్పములను వేసి నమస్కార మొనర్చవలయును దీనితో సన్న్యసస్వీకరణము పూర్తి యగును

ఇప్పుడు చెప్పబోవు విషయము మిక్కిలి పావనమైనది అదేమన! ముందుబెట్టిన పాదమును వెనుకకు బెట్టకుము అయితే బాగుగ యోచించుకొని ముందు బెట్టుము వెనుకకు బెట్టవలసివచ్చునేమోనని దీర్ఘముగ నాలోచించియే ముందుకు పాదమును బెట్టవలసి యుండును సుమీ! ఆలాగున నొకరి చేతిక్రిందకు మీచేతిని పోనీకుము క్రిందకు పోయిన, చెయ్యిగల వాడెల్లపుడును క్రిందికే పోవుచుండును ఇదియే నిజమైన గురుకీలకము అనగా నపరిగ్రహవ్రతము దృఢముగ జేసికొనుము మఱియు నెవనియొక్క యింద్రియములు ఇంద్రియార్థములలో జాగ్రదవస్థ గలిగియుండునో వాని యాత్మ సుషుప్త్యవస్థలో నుండును ఎవని యొక్క యింద్రియములు తత్తద్విషయములలో సుషుప్త్యవస్థను పొందియుండునో వానియొక్క ఆత్మ జాగ్రదవస్థ గలిగియుండును ఎవనియొక్క యింద్రియములు మరణించినవో వాని యాత్మ బ్రతికియుండును ఎవనియొక్క యింద్రియములు బ్రతికియుండునో వానియాత్మ మరణించియుండును ఈ పరమ రహస్యము దెలిసికొనిన జీవన్ముక్తిగాని, విదేహ ముక్తి గాని గలిగినదా! లేదా! యని తనను, ఇతరులను జూచి గ్రహించుకొన వచ్చును

*పృధివ్యాం యాన్తి భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్ ।*
*జిహ్వోపస్థపరిత్యాగే పృధివ్యా కిం ప్రయోజనమ్ ॥*

(పాఠాంతరమున ''కోనముచ్యేత బంధనాత్'' అని కలదు )

భూమియందు భూతము లేవిగలవో ఆ భూత సముదాయము జిహ్వోపస్థలు నిమిత్తముగా గలవి జిహ్వోపస్థలయొక్క పరిత్యాగము గలుగుచుండగా మఱల వారికి భూమిచేత ప్రయోజనమేమి? అనగా ప్రయోజనము లేదని భావము ఇట్టి యవస్థగల వాడెవడు ముక్తుడు గాడు? అనగా నిట్టి యవస్థగలవాడు తప్పక ముక్తుడగునని భావము తల్లీ! యీ రెండుద్వారము లెంతవఱ కెవరికి తెరవబడియుండునో అంతవఱకు వారికి మోక్షద్వారము మూయబడియుండును ఎప్పుడీ రెండుద్వారము లెవరికి మూయబడునో అప్పుడు వారికి మోక్షద్వారము తెరవబడియుండునని గ్రహించుకొనుము మఱియు నీ బాహ్యసన్న్యాస మొకదానిచే కృతార్థత బొందినట్లు తలంపకుము మూడు విధములగు సన్న్యాసములు గలవు వాటిలో నీ బాహ్యసన్న్యాసము స్థూలమే యగును ఇక సూక్ష్మ, కారణములనెడు రెండు సన్న్యాసములు గూడ గలుగవలయును బాహ్యమున సన్న్యసించినను మనస్సులో దృశ్యవృత్తి గలిగియుండిన నది సూక్ష్మసన్న్యాసము కాలేదు ఆసంస్కారవాసనలు నశించినను పరమాత్మ కన్యముగ జీవాత్మ భావము గలిగియుండిన మూలావిద్యయగు కారణసన్న్యాసము గలిగియుండలేదని జ్ఞాపకముంచుకొనుము

*అంతస్సంగం బహిస్సంగమాత్మసంగం పరిత్యజేత్ ।*
*సర్వసంగనివృత్తాత్మా పశ్యేదాత్మానమాత్మని ॥*

లోపలి సంబంధమును, బాహ్య సంబంధమును, మనస్సంబంధమును వదలి వేయవలయును సకలవిధబంధములను వదలినవాడై తన యందాత్మను జూడవలయును

*విషయాసక్తచిత్తానా మంధస్యేందూదయం యథా ।*
*గీతాసారమిదం శాస్త్ర ముక్తం మోక్షార్థసిద్ధయే ॥*

గ్రుడ్డివారలకు చంద్రోదయము లాభకారి యెటుల కాదో అట్లే స్రక్చందన వనితాది విషయాసక్తి గలవారలకు నీ వేదాంత శాస్త్రము ప్రయోజనకారి గాదు ఈ శాస్త్రము విషయవిరక్తులై మోక్షమందు తీవ్రాభిలాషగలవారి నిమిత్తము చెప్పబడినది

పూర్వీక ఋషులకాలములో గార్గి, సులభ మొదలగు యోగినులు తపస్వినులేలాగున లోకములో భక్తి, జ్ఞాన, వైరాగ్యములను బోధించి దేశమును పవిత్రమొన ర్చిరో, యాలాగున మీరును జనుల యొక్క పరిపక్వస్థితిని గనుగొని (1) నిష్కామకర్మ యోగము, (2) భక్తియోగము, (3) ధ్యానయోగము, (4) జ్ఞానయోగములను బోధించి జీవకోట్లను తరింపజేయవలయును

*ఓం బ్రహ్మణే మూర్తిమతే శ్రుతానాం శుద్ధిహేతవే ।*
*నారాయణ యతీంద్రాయ తస్మై శ్రీగురవే నమః ॥*

*ఓం హరలీలావతారాయ శంకరాయ పరౌజసే ।*
*కైవల్య కలనాకల్పతరవే గురవే నమః ॥*

*ఓం కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహి తే రతమ్ ।*
*వేదాబ్జభాస్కరం వందే శమాదినిలయం మునిమ్ ॥*

ఆత్మసోదరివగు అమ్మా! బాలయోగినిగారూ! ఆశ్రమస్వీకరణానంతర మాచ రించవలసిన కొన్ని ధర్మములు గలవు అవి చాల ముఖ్యములు ఇదివఱలో నాచరించిన యనుష్ఠానము గొప్పది కాదు ఏలయన! అది మీకొక్కరికి మాత్రము సంబంధించిన వ్యక్తిగతమగు ననుష్ఠానమే ఒక బాలిక వివాహమునకు పూర్వమెట్లుండినను దానివలన గలిగెడు యోగ్యతాఽయోగ్యతలు తన కుటుంబమునకే చెందును లేక నది బాల్య కాలమగుటచే లోకము ముఖ్యముగ గమనించదు వివాహానంతరము గలుగు మంచి చెడుగులు దైవస్వరూపముగ దలంచిన తన భర్త కుటుంబమునకే చెందును అలాగున నాశ్రమ స్వీకరణా నంతరకార్యము లన్నియు పరమఋషుల సంఘమునకే చెందును కావున ప్రాణమును త్యజించియైనను ఆ పరమ మునీంద్రులయొక్కయు, శ్రీశంకరులు

మొదలగు యతీంద్రులయొక్కయు యశస్సును, పవిత్రతను సంరక్షించు కొనవలయును దానికి మించిన గురుసేవ మఱి యొకటి లేదు మఱియు తన కుపదేశించిన గురువులవారియొక్కయు, వారి సంప్రదాయము యొక్కయు పవిత్రతను ఆచర ణలోనుంచి నడుచుకొనుటయే నిజమగు గురుసేవ యగును గురువులయొక్క నడత ననుసరించి నడచుటయే (ఆచరించుటయే) నిజమైన గురుపాదసేవ యగును ఆలాగున గురువు లేయానందానుభవము ననుభవించిరో, ఏదైవామృతమును పానమును జేసిరో, అది గురు ముఖతః విని యాచరించి యనుష్ఠించుటయే నిజమైన గురుప్రసాద స్వీకరణమగును అట్టివారే గురుపాదసేవయు, గురుపాదతీర్థము ననుభవించిన పుణ్యాత్ములు తక్కినవారు కేవలము వేషధారులుగాను, నామధారులుగాను నుందురు ఈ సత్యమెల్లపుడును మరువకూడదు నిజముగా జెప్పిన తండ్రియొక్క ధనమంతయు పుత్రులదిగా నెటులున్నదో, ఆలాగున గురువుయొక్క జ్ఞానధనమంతయు శిష్యులదే యను విశ్వాసము గలిగి యుండవలయును అట్టివారి కది తప్పక గలుగును ''యతోధర్మస్తతో జయః''

*ఆజీవితం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః ।*
*పూర్వం జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వనివృత్తయే ॥*

ఈ బొందిలో జీవుడుండువఱకు నెంత జ్ఞానియైనను నీ మూడు విషయముల నాచరింపవలయును అవి వేదాంతశాస్త్ర విచారణయును, గురుభక్తియు, నీశ్వరభక్తి యనంబడును పూర్వము జ్ఞానప్రాప్తి గలుగుటకును, తరువాత కృతఘ్నత్వదోషము గలుగ కుండుట కొఱకును పైన జెప్పిన మూడింటిని విడువకుండ నుండవలయునని తాత్పర్యము

*నాశ్రమం కారణం ముక్తేర్దర్శనాని న కారణమ్।*
*తథైవ సర్వకర్మాణి జ్ఞానమేవ హి కారణమ్ ॥*

ముక్తికొఱకు తురీయాశ్రమ స్వీకరణము కారణము గాదు ఆలాగున సర్వ శాస్త్రముల జదువుటయును కారణము గాదు ఆలాగున బాహ్యములగు కర్మల నన్ని టిని జేయుటయు కారణము గాదు బ్రహ్మాత్మైక్యజ్ఞానమే కారణమగును

## ఎఱుక

ఎఱుకను గుఱించి యింకను కొంత తెలిపెద ఏలన, ఎఱుక పరిపూర్ణము కాదనియు, ఎఱుకను విడువవలయుననియు, ఎఱుక జనన మరణములను గలుగ జేయునదేగాని, జననమరణములను రహితమొనర్చునది కాదనియు చెప్పుటచే నీ విషయములో చాలామంది సందేహము గలిగియున్నారు ఇచ్చట 'ఎఱుక' శబ్దమునకు జ్ఞానమనియు, తెలివియనియు, అది లేకుండపోయినదే మోక్షమనియు వారి మతము ఈ విషయమై ఋభుగీతనే వారు ప్రమాణముగా జెప్పెదరు ఈ ఋభుగీత నాలుగు అధ్యాయములతో గూడినది మొదట రెండధ్యాయములలో శూన్యమును గుఱించి కొంత చెప్పడమైనది దీనికి పీఠిక వ్రాసినవారగు బ్రహ్మశ్రీ మంత్రి లక్ష్మీనారాయణ శాస్త్రిగారే యా పీఠికయందు శివశబ్దమునకు ప్రకృతి శూన్యమని యర్థమేకాని వస్తు స్వరూపమగు పరబ్రహ్మము కాదని విశదీకరించియున్నారు అంతేగాక శూన్యము పూర్వపక్షముగాను, పరబ్రహ్మమే సిద్ధాంతమని దెలిపి యున్నారు పూర్వోత్తరములను జూడకపోవుట దీనియందు గలుగు ప్రమాదములకు కారణము ఆ సిద్ధాంతమును వినుడి

*జ్ఞప్తిస్సా సాక్షిణీ నిత్యా తుర్యా సర్వశ్రుతీరితా ।*
*విషయజ్ఞప్తిసంత్యాగాత్ జ్ఞాయతే విబుధైస్స్వతః ॥*

ఆ జ్ఞప్తి నిత్యంబును, సాక్షిణియు, తుర్యరూపిణియు, సర్వశ్రుతి ప్రోక్తమైనదియు నగును విషయజ్ఞప్తిని విడుచుటవలన నది విద్వాంసులచే స్వయముగ తెలియబడుచున్నది

*జ్ఞప్తిరేవ పరం బ్రహ్మ జ్ఞప్తిరేవ పరం పదమ్ ।*
*జ్ఞప్తిరేవ పరో మోక్షో జ్ఞప్తిరేవ పరం సుఖమ్ ॥*

ఆ జ్ఞప్తియే పరబ్రహ్మము, జ్ఞప్తియే పరమపదము, జ్ఞప్తియే నిరతిశయ మోక్ష స్థానము, జ్ఞప్తియే పరమానందము

*జ్ఞప్తిరేవ పరాచార్యో జ్ఞప్తిరేవ పరామృతమ్ ।*
*జ్ఞప్తిరేవ పరాతృప్తిః జ్ఞప్తిరేవ పరాగతిః ॥*

ఆ జ్ఞప్తియే పరమగురూపదేశమగును జ్ఞప్తియే పరమామృతము, జ్ఞప్తియే పరమ తృప్తి, జ్ఞప్తియే పరమగతి

*తస్మాత్ జ్ఞప్తిం సమాశ్రిత్య విజ్ఞప్తి ధిషణాం త్యజ ।*
*అజ్ఞప్తేర్దుఃఖహేతుత్వాత్ సుఖార్థీ జ్ఞప్తిమాశ్రయ ॥*

అందువలన నీవు జ్ఞప్తి నాశ్రయించి విషయజ్ఞప్తి బుద్ధిని విడువుము అజ్ఞప్తికి (జడపదార్థమునకు) దుఃఖహేతుత్వంబు గలిగియుండుట బట్టి యాత్మ సుఖార్థివగు నీవు సుజ్ఞప్తి నాశ్రయింపుము

*స ఆత్మా స చ విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః ।*
*తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్కదాచన ॥*

అది యాత్మ అదియే సమస్త ముముక్షువులచే దెలియదగిన స్థానము తుర్యాత్మ జ్ఞానము లేనివారి కెప్పటికిని ముక్తి సిద్ధింపదు

*నివృత్తేస్సర్వదుఃఖానాం ఈశానః ప్రభురవ్యయః ।*
*అద్వైతస్సర్వభావానాం దేవస్తుర్యో విభుస్స్మృతః ॥*

ఇట్టి జ్ఞానముచేతనే సర్వదుఃఖములు నశించుటవలన తుర్యాత్మ ఈశానుడనియు, ప్రభువనియు, అవ్యయుడనియు, సర్వప్రపంచమునకు అద్వైతరూపుడనియు, దేవుడనియు, విభువనియు జెప్పబడెను

*ప్రపంచో యది విద్యేత నివర్తేత న సంశయః ।*
*మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః ॥*

అయితే తుర్యాత్మ జ్ఞానోదయముచే దేహేంద్రియాది ప్రపంచ మున్నదంటివేని అది తప్పక నివర్తించును సంశయము లేదు ఈ ద్వైతము మాయా స్వరూపము పరమార్థమున నద్వైతము సత్యము ఇక నీ తుర్యాత్మజ్ఞానమే సత్యమను విషయమును గుఱించి యెన్నియో శ్లోకము లీఋభుగీతయందు గలువు ఇవి యన్నియు వ్రాయ బూనిన గ్రంథ విస్తారమగును చూడదలంచినవారు ఋభుగీత 3,4 అధ్యాయముల జూచి గ్రహించుకొన వచ్చును. ఇట్టి

పరమసత్యమును తెలియనీయక సామాన్యజనులకు పరమాద్వైతమున నసూయ గలుగులాగున సచ్చిదానందము చండాలమనియు, అది జననమరణముల గలుగ జేయునదనియు, అదే యెఱుక యనియు, దానిని విడుచుటయే పరిపూర్ణమనియు, చెప్పి యొకరికొకరిని విరోధమును గల్పించుచు దయ, ప్రేమ, అనువాటిని మనుష్యహృదయములో బొత్తిగ లేకుండ జేయు టెంత యధర్మమో బుద్ధిమంతులు తెలిసికొందురు గాక! ఇక బ్రహ్మవిద్యయొక్క మహిమను సంక్షేపముగ తెలిపెద

*స్నాతం తేన సమస్త తీర్థనిచయే సర్వాఽపి దత్తాఽవనిః*
*యజ్ఞానాం చసహస్రనిష్ఠ మఖిలా దేవాశ్చ సంతర్పితాః ।*

*సంసారాచ్చ సముద్ధృతాస్స్వపితరః త్రైలోక్యపూజ్యోఽప్యయం*
*యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్ ॥*

ప్రపంచములో గల సమస్త పుణ్యతీర్థములలో విధిప్రకారము స్నానమాచరించిన ఫలమేదిగలదో, సమస్త భూమండలమును పుణ్యకాలమున కాశియందు బ్రహ్మనిష్ఠులకు దానమొనర్చిన ఎంత ఫలమో, వేలకొలది యజ్ఞాదిక్రతువుల నొనర్చిన ఎంతఫలమో, శివకేశవాది దేవతల నందఱిని నారాధించిన ఎంతఫలమో, గయా శ్రాద్ధముచే తన పితరులను ప్రేతలోకమునుండి నివృత్తిచేసి పుణ్యలోకమునకు బంపిన ఎంతఫలమో, యా ఫలితమంతయు నొక క్షణకాలము బ్రహ్మనిష్ఠతో మనస్సు నిలచిన గలుగును అంతే గాదు మూడు లోకములందు ఆ పుణ్యాత్ముడు పూజ్యుడగును

*ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన ।*
*ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్బ్రహ్మణః సుతః ॥*

బ్రహ్మనిష్ఠయందు ప్రమాదము నెన్నడును గలుగనీయకూడదు అట్టి ప్రమాదము (ఏమరుపాటు) మృత్యువగునని భగవంతుడగు సనత్కుమారుడు చెప్పెను తల్లీ! బ్రహ్మనిష్ఠామార్గముల నన్నిటిని కొఱతలేక బోధించితిని పూర్ణత్వము నొందిన వారికి జేయవలసిన దేమియు మిగిలియుండదు కాని మహేశ్వరుడు సూతసంహిత యందీ లాగున నుపదేశించెను ఇది బ్రహ్మ సాక్షాత్కారము గలిగిన సనకాదుల నుద్దేశించి వచించినది

*స్థాపయధ్వ మిమం మార్గం ప్రయత్నేనాపి హేద్విజాః ।*
*స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్ ॥*

సనకాదులగు మహర్షులారా! ప్రయత్నపూర్వకముగ నీ బ్రహ్మజ్ఞాన మార్గమును ప్రపంచములో స్థాపించుడు ఈ వేదసారమగు జ్ఞాన మార్గమును ప్రపంచములో స్థాపించి రేని సకల ధర్మములును సుస్థిరములై యుండును

*యో హి స్థాపయితుం శక్తో నకుర్యాన్మోహితో నరః ।*
*తస్య హన్తా చ పాపీ స్యాదితి వేదాంతనిశ్చయః ॥*

ఎవడీ బ్రహ్మమార్గమును స్థాపించుటకు శక్తి గలిగియుండి, యితర కార్యములచే మోహితుడై యుండునో, ఆనరుడు బ్రహ్మమార్గమును నశింపజేసిన వాడగును అది పాపహేతువు ఇది వేదాంత నిశ్చయము

*యః స్థాపయితు ముద్యుక్తః శ్రద్ధయైషమోఽపి సన్ ।*
*సర్వపాప వినిర్ముక్తః సాక్షాద్జ్ఞాన మవాప్నుయాత్ ॥*

ఎవడీవేదాంతమార్గమును భూమిలో నిలబెట్టుటకు ప్రయత్నము గలవాడో, శ్రద్ధగలవాడో, సమర్థింప శక్తి లేనివాడైనప్పటికిని, వాడు సకల పాపములనుండి విడివడిన వాడై సాక్షాత్ దైవజ్ఞానమును పొందును

*యశ్చ విద్యాభిమానేన వేదమార్గ ప్రవర్తకమ్ ।*
*ఛలజాత్యాదిభి ర్జియా త్స మహాపాతకీ భవేత్ ॥*

ఎవడు విద్యాది శక్తిలేనివాడయ్యు, వేదమార్గమును స్థాపించుటలో నిచ్ఛగలిగి యుండునో, అట్టివానిని విద్యాధిక్యతాభిమానము గలిగి, లేక జాత్యభిమానము గలిగి, యేదైన మోసకృత్యములను జేసి జయింప జూచువాడు మహాపాతకి యగునని గురువరుండుపదేశించి, ఇక మీరు పూర్వస్థలమునకు వెళ్ళవచ్చును మీ తల్లిదండ్రులును, పూర్వాశ్రమములో నుండు భక్తురాండ్రును శ్రీరామాగమనమునకు భరతుండు నిరీక్షించుచున్నట్లు మీరాకకు ఆసక్తి గలిగియుంటున్నారు కావునవెళ్ళి, వారి సంతాపమును చల్లార్చి, అచట నుండువారి మనః పరిపక్వత ననుసరించి నిష్కామ కర్మయోగము, భక్తి యోగము,

